# ప్రపంచ ప్రజల చరిత్ర




క్రిస్ హర్మాన్

720

ప్రజాశక్తి బుక్‌హౌస్

ఎమ్‌హెచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర

హైదరాబాద్-20. ఫోన్ : 27660013

అనువాదం : సఫ్దర్ అహ్మద్

ప్రచురణ సంఖ్య : 973

ప్రచురణ కాలం : జూలై, 2006
నాల్గవ ముద్రణ : డిసెంబరు, 2009

వెల : రు. 175/-

టైటిల్ డిజైన్ : యం. గణేష్

ప్రతులకు
ప్రజాశక్తి బుక్‌హౌస్
1-1-187/1/2, చిక్కడపల్లి
హైదరాబాద్-20. ఫోన్ : 27608107

బ్రాంచీలు
హైదరాబాద్, విజయవాడ,
విశాఖపట్నం, తిరుపతి, ఖమ్మం,
హన్మకొండ, నల్గొండ, గుంటూరు

ముద్రణ
ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, హైదరాబాద్

# ప్రచురణకర్తల మాట

ఇది రాజులు, రాజ్యాల చరిత్రకాదు. తేదీల కూర్పు అంతకన్నా కాదు. ఇది ప్రజల చరిత్ర. చారిత్రక క్రమంలో కీలకమైన సంఘటనలు, పరిణామాలు, వాటికి కారణాలు, వాటివెనక ఉన్న శక్తులు, వాటిలో పాలు పంచుకున్న ప్రజల పాత్ర గురించి స్థూలంగా వివరిస్తుంది ఈ పుస్తకం. మానవ జాతి చరిత్రలో ఆదిమ సమాజం నుండి రోమన్ మహా సామ్రాజ్యం వరకు, మధ్య యుగాల నుండి పునర్వికాసం, పారిశ్రామిక విప్లవం, దాని తర్వాత బూర్జువా విప్లవాల వరకు, కార్మిక వర్గ పోరాటాల నుండి చరిత్రలో తొలి కార్మిక వర్గ విప్లవమైన పారిస్ కమ్యూన్ వరకు పరిణామ క్రమాన్ని ఈ పుస్తకం విశ్లేషిస్తుంది. సాంకేతిక మార్పులు, వాటి కనుగుణంగా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, సమాజంలో వివిధ వర్గాలు, శక్తుల పొందికపై వాటి ప్రభావం, ఆ శక్తుల మధ్య సంఘర్షణలు, ఆ సంఘర్షణల నుండి నూతన సమాజాల ఆవిర్భావం గురించి ఈ పుస్తకం తెలియ చేస్తుంది. సమాజం ఎలా మార్పు చెందింది, అభివృద్ధి చెందింది, అది మరింత తీవ్రమైన ప్రజానుకూల మార్పుల వైపుకు దారితీసే అవకాశాలు ఏమిటి అని తెలుసుకోగోరే ప్రతి ఒక్కరు తప్పక చదవాల్సిన పుస్తకం ఇది.

బ్రిటన్‌కు చెందిన క్రిస్ హార్మన్ రచించిన పుస్తకం ఇది. సాధారణంగా ఐరోపా రచయితలు ప్రపంచ చరిత్రను పాశ్చాత్య ప్రపంచం చుట్టూనే కేంద్రీకరిస్తారు. కాని ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలకు కూడ ఈ పుస్తకంలో హార్మన్ సముచిత స్థానం కల్పించారు. అందుచేత ఈ పుస్తకం ప్రపంచ చారిత్రక పరిణామం గురించి ప్రజల దృష్టితో ఒక సమగ్రమైన స్థూల అవగాహనను అందిస్తుందని చెప్పవచ్చు. సుప్రసిద్ధమైన 'అమెరికా ప్రజా చరిత్ర' గ్రంథం రచయిత హోవార్డ్ జిన్ అమెరికా చరిత్రకు సంబంధించి తన పుస్తకం నిర్వహించిన కర్తవ్యాన్ని, ప్రపంచ చరిత్రకు సంబంధించి క్రిస్ హార్మన్ రచించిన ఈ గ్రంథం నెరవేరుస్తుందని ప్రశంసించారంటే దీని ప్రాధాన్యత అర్థమవుతుంది.

తెలుగులో ఇలాంటి పుస్తకాలు చాల అరుదు. అలాంటి 'ప్రపంచ ప్రజల చరిత్ర' ను తెలుగు పాఠకులకు ప్రజాశక్తి బుక్ హౌస్ సగర్వంగా అందిస్తున్నది. ఇప్పటి వరకు చరిత్రపై మేము ప్రచురించిన ప్రామాణిక పుస్తకాల మాదిరిగానే దీనికి కూడ విశేష ఆదరణ లభిస్తుందని ఆశిస్తున్నాం.

ప్రజాశక్తి బుక్‌హౌస్
హైదరాబాదు.

# ప్రపంచ ప్రజల చరిత్ర

**రచయిత గురించి...**

క్రిస్ హర్మాన్ 'సోషలిస్టు వర్కర్' సంపాదకుడు, బ్రిటన్ సోషలిస్టు వర్కర్స్ పార్టీ క్రియాశీల సభ్యుడు. ఆయన ఎన్నో వ్యాసాలు, కరపత్రాలు, పుస్తకాలను రచించారు. వాటిలో ముఖ్యమైనవి తూర్పు ఐరోపాలో వర్గ పోరాటాలు; సంక్షోభ వివరణ; మార్క్సిజం ఎలా పని చేస్తుంది; చేజారిన విప్లవం : జర్మనీ 1918-23.

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

ఏడు మహాద్వారాల థేబ్స్ నగరాన్ని ఎవరు నిర్మించారు?
గ్రంథాల్లో మాత్రం మీకు చక్రవర్తుల పేర్లు లభిస్తాయి.
రాజులు బండరాళ్లను మోసారా?
బాబిలాన్ అనేకసార్లు ధ్వంసమైంది
అన్నిసార్లు దానిని పునర్నిర్మించిందెవరు?
పసిడి కాంతులతో ధగధగలాడే లీమాలో కార్మికులు ఎలాంటి గృహాల్లో నివసించారు?
చైనా మహాప్రాకారం నిర్మాణం తర్వాత మేస్త్రీలు ఎక్కడికి వెళ్లారు?
రోమ్ మహానగరం అంతా విశాలమైన ఆర్చీలతో నిండి ఉంది
వాటిని నిలబెట్టిందెవరు?
సీజర్లు విజయం సాధించింది ఎవరి మీద ?
కవిత్వంలో కొనియాడబడే బైజాంటియమ్‌లో ప్రజలందరికీ భవంతులే ఉండేవా?
అంతరించిపోయిన అట్లాంటిస్‌లో కూడా ఆ రాత్రి దాన్ని సముద్రం ముంచివేసినపుడు
బానిసలను ఇంకా మింగివేయాలని అలలు నోరు తెరిచాయి.

యువకుడైన అలెగ్జాండర్ భారత్‌ను ఆక్రమించాడు
దండ యాత్రలో అతడొక్కడే ఉన్నాడా?
సీజర్ ఫ్రెంచి సైన్యాలను తుదముట్టించాడు
అతడి వెంట ఒక్క వంటవాడు కూడా లేడా?
తన సైన్యం పతనం కావడంతో స్పెయిన్ రాజు ఫిలిప్ భోరున విలపించాడు
దుఃఖ సాగరంలో మునిగితేలింది అతడొక్కడేనా?
ఏడేళ్ల యుద్ధాన్ని ద్వితీయ ఫ్రెడెరిక్ గెలిచాడు
ఆ గెలుపును సాధించి పెట్టిందెవరు?
ప్రతి పుటకు ఒక విజయం
విజేతలకు విందును వండి పెట్టిందెవరు?
ప్రతి పదేళ్లకో మహానుభావుడు
అతడిని భరించిందెవరు?

ఎన్నో కథనాలు.
మరెన్నో ప్రశ్నలు.

## 'పఠించే కార్మికుడి నుండి ప్రశ్నలు'- బెర్టాల్ట్ బ్రెక్ట్

బ్రెక్ట్ కావ్యంలో లేవనెత్తిన ప్రశ్నలు సమాధానాల కోసం నిరీక్షిస్తున్నాయి. వాటిని అందజేయడం చరిత్ర బాధ్యత కావాలి. చరిత్ర నిపుణుల చిన్న బృందానికే పరిమితం కాకూడదు. లేదా దానిని ఆస్వాదించే ధనికులకే సొంతం కాకూడదు. మోటారు వాహనాల ఉత్పత్తిలో అగ్రగణ్యుడైన హెన్రీ ఫోర్డ్ పేర్కొన్నట్లు చరిత్ర వ్యర్థమేమీ కాదు. ఫోర్డ్ కార్మిక ఉద్యమ వ్యతిరేకి, హిట్లర్ తొలి అభిమాని.

చరిత్ర పరిణామాల క్రమం. ఆ పరిణామాలు నేడు మనం గడుపుతున్న జీవితాలకు బాటలు వేశాయి. మనం ఎలా అవతరించామో తెలిపే కథ అది. చరిత్రను అర్థం చేసుకోవడం కీలకం. తద్వారా మన ప్రపంచాన్ని ఎలా మార్చగలమో (ఒకవేళ మార్చదలచుకుంటే) తెలుసుకోవచ్చు. జార్జ్ ఆర్వెల్ నవల '1984' లోని ప్రధాన పాత్రల నినాదం: "గతాన్ని ఎవరైతే నియంత్రించగలరో వారు భవిష్యత్‌ను కూడా నియంత్రించగలరు." బ్రెక్ట్ ప్రశ్నల్లో వివరించబడినట్లు భవంతుల్లో విందును ఆరగిస్తూ గడిపేవారు ఈ నినాదాన్ని ఎప్పుడూ తీవ్రంగా పరిగణిస్తారు.

వర్తమానాన్ని విమర్శించడానికి గతాన్ని తవ్వేవారికి మరణశిక్ష విధిస్తూ 22 శతాబ్దాల క్రితం ఒక చైనా చక్రవర్తి శాసనాన్ని జారీ చేశాడు. పూర్వ రాజ్యాల చరిత్రను రూపు మాపడానికి అజ్టెక్‌లు ప్రయత్నించారు. 15వ శతాబ్దంలో మెక్సికో లోయను ఆక్రమించినపుడు వారలా చేశారు. అలాగే స్పెయిన్ ఆక్రమణదారులు 1620లో అజ్టెక్‌ల చరిత్రను రూపుమాపడానికి ప్రయత్నించారు.

గత శతాబ్దంలో కూడా పరిస్థితులు ఇందుకు భిన్నంగా లేవు. హిట్లర్ లేదా మరో నియంతకు చెందిన అధికారిక చరిత్రకారులను సవాలు చేయడమంటే కారాగారమో, అజ్ఞాతవాసమో, మృత్యువో తథ్యం. అంతదూరం ఎందుకు! ముప్పై ఏళ్ల క్రితం కూడా బాస్క్ నగరమైన గెర్నికాపై బాంబు దాడిని పరిశోధించడానికి స్పెయిన్ చరిత్రకారులను అక్కడి ప్రభుత్వం అనుమతించలేదు. 1956 ఘటనలను పరిశోధించడానికి హంగేరి చరిత్రకారులకు అనుమతి లభించలేదు. ఇటీవలే నా మిత్రులు కొందరు గ్రీసులో విచారణను ఎదుర్కొన్నారు. వారు చేసిన నేరం తొలి ప్రపంచ యుద్ధానికి ముందు మాసిడోనియాలోని చాలా భూభాగాన్ని గ్రీసు ఎలా హస్తగతం చేసుకుందన్న విషయమై ప్రభుత్వం చేసిన వాదనను ప్రశ్నించడమే.

పశ్చిమ పారిశ్రామిక దేశాలలో బహిర్గత రాజ్యహింస అనూహ్యంగా కనిపించవచ్చు. కాని నియంత్రణకు సుతిమెత్తని మార్గాలు ఎల్లప్పుడూ ఉంటాయి. ఈ పుస్తకాన్ని రాస్తున్న దశలో నవీన లేబర్ ప్రభుత్వం బ్రిటీషు చరిత్రపైన, బ్రిటీషు విజయాలపై పాఠశాలలు ఎక్కువ దృష్టి సారించాలని, విద్యార్థులు మహనీయుల పేర్లను, చారిత్రక ఘటనల తేదీలను నేర్చు కోవాలని సూచిస్తోంది. ఉన్నత విద్యారంగంలో అయితే దొరల అభిప్రాయాలకు అనుగుణంగా చరిత్రను అన్వయించి రచనలు చేసే చరిత్రకారులకే సాదర సన్మానాలు లభిస్తున్నాయి. అలాంటి అభిప్రాయాలను ప్రశ్నించే వారిని విశ్వ విద్యాలయాల్లో కీలక బాధ్యతలకు దూరంగా ఉంచుతున్నారు. రాజీపడటమే పదోన్నతికి మార్గమైపోయింది.

తొలి ఫారోల కాలం నుండి (5,000 సంవత్సరాల క్రితం) పాలకులు చరిత్రను విజయాల గాధగా తమకు తాము అంకితం ఇచ్చుకున్నారు. స్వంత విజయాలతోపాటు వారి తాతముత్తాతలు సాధించిన విజయాలను పొందుపరిచారు. అలాంటి మహానుభావులు నగరాలను, కట్టడాలను నిర్మించినట్లు చెబుతారు. వారు సిరిసంపదలను, భోగభాగ్యాలను ప్రజల ముంగిటకు తెచ్చారని, గొప్ప పనులకు లేదా సైనిక విజయాలకు వారే బాధ్యులని చెబుతారు. మరో వైపు దుర్జనులు ప్రపంచంలో ఉన్న చెడు అంతటికీ కారణమని పేర్కొనబడింది. చరిత్ర తొలి రచనలు చక్రవర్తులు, రాజవంశాల జాబితాలుగా ఉన్నాయి. అలాంటి జాబితాలను కంఠస్తం చేసుకోవడం చరిత్ర అభ్యాసంలో ప్రధాన భాగంగా 40 ఏళ్ల క్రితం వరకు ఉండేది. నవీన లేబర్‌తోపాటు విపక్ష టోరీలు ఆ సంప్రదాయాన్ని పునరుద్ధరించడానికి కంకణం కట్టుకున్నట్లు బోధపడుతోంది.

ఈ తరహా చరిత్రలో పరిజ్ఞానం కేవలం రాజులు, రాజవంశాలు జాబితాను నెమరు వేసుకోవడం వరకే పరిమితమవుతుంది. జ్ఞాపకశక్తి గలవాడిగా, లేదా మాస్టర్ మైండ్ పోటీదారునిగా విద్యార్ధి మారిపోతాడు. ఇలాంటి అర్ధరహిత చరిత్ర అభ్యాస్యం గతాన్ని కాని, వర్తమానాన్ని కాని అర్ధం చేసుకోవడానికి ఏ విధంగానూ తోడ్పడదు.

చరిత్రను పరిశీలించడానికి మరో మార్గం ఉంది. 'మహనీయుల' పంథాకు వ్యతిరేకంగా చరిత్రను అధ్యయనం చేయవచ్చు. కొన్ని ప్రత్యేక ఘటనలను తీసుకొని వాటి కథను అది మనకు చెబుతుంది. కొన్ని సార్లు సాధారణ ప్రజల కోణం నుండి చారిత్రక ఘటనలను వివరిస్తుంది. ఇది ప్రజలను ఆకట్టుకోగలదు. ఇలాంటి కథా వస్తువుతో నిర్మించే టెలివిజన్ కార్యక్రమాలకు విశేష ఆదరణ ఉంటుంది. వాటిని విద్యార్థులకు ప్రదర్శించినపుడు వారు ఎంతో ఆసక్తిని ప్రదర్శించారు. 'రాజులు, తేదీలు, ఘటనలు' అనే పద్ధతికి వారు అంతగా స్పందించకపోయి ఉండవచ్చు.

కాని క్షేత్రస్థాయి చరిత్ర ఎంతో ప్రాముఖ్యం కలిగిన సంఘటనలను, వాటి పరస్పర సంబంధాన్ని విస్మరించవచ్చు.

కేవలం ఒక సంఘటనతో ముడిపడిన ప్రజలతో సంఘీభావం వ్యక్తం చేసినంత మాత్రాన వారి జీవితాలను, మన జీవితాలను తీర్చిదిద్దే విశాల శక్తులను అర్ధం చేసుకోవడం సాధ్యం కాదు. ఉదాహరణకు రోమ్ సామ్రాజ్య ఉత్థానపతనాలను అర్ధం చేసుకోకుండానే క్రైస్తవ మత వ్యాప్తిని అర్ధం చేసుకోవడం కష్టం. ఐరోపా భూస్వామ్య సంక్షోభాలను తెలుసుకోకుండా పునర్వికాస కాలంలో కళల అభివృద్ధిని అర్ధం చేసుకోవడం కష్టం. ఈ ప్రక్రియకు మరో సంబంధం కూడా ఉంది. ఐరోపా దాటి ఇతర ఖండాలలో కూడా నాగరికత పుంజుకోవడం పునర్వికాసాన్ని ప్రభావితం చేసింది. 19వ శతాబ్దపు కార్మిక ఉద్యమాలను అర్ధం చేసుకోవాలంటే పారిశ్రామిక విప్లవాన్ని అధ్యయనం చేయడం తప్పనిసరి. మానవాళి వర్తమాన దశకు ఎలా చేరుకుందో రేఖామాత్రంగానైనా తెలుసుకోవాలంటే పై ప్రక్రియల పరస్పర సంబంధాన్ని, అలాగే ఇతర ఘటనల క్రమాన్ని అర్ధం చేసుకోవడం చాలా అవసరం.

అలాంటి స్థూలవీక్షణం అందించడమే ఈ పుస్తక లక్ష్యం.

మానవజాతి చరిత్రను సంపూర్ణంగా అందిస్తున్నానని నేను వాదించను. ముఖ్యమైన వ్యక్తిత్వాలు, ఎన్నో ఘటనలు తప్పిపోయాయి. ఏ యుగ చరిత్రనైనా సంపూర్ణంగా తెలుసుకోవాలంటే ఘటనా క్రమం నిర్దిష్టంగా ఉండాలి. కాని మానవాళి గతానికి సంబంధించిన ప్రతి విషయాన్ని

తెలుసుకోవలసిన అవసరం లేదు. వర్తమానానికి దారి తీసిన చరిత్రకు సంబంధించిన సాధారణ ఘటనలను అర్థం చేసుకుంటే చాలు.

ఈ సాధారణ ఘటనాక్రమంపై వెలుగు చూపింది మాత్రం కారల్‌మార్క్స్. జీవనోపాధిని సాధించడానికి పరస్పరం సహకరించుకోవడం వల్లే మానవాళి భూమిపై మనుగడ సాగించ గలిగిందని మార్క్స్ గుర్తు చేశారు. జీవనోపాధిని సంపాదించడానికి చేసిన ప్రతి కొత్త ప్రయత్నం విశాల సంబంధాల్లో మార్పులు తీసుకొచ్చిందని ఆయన విశ్లేషించారు. ఉత్పత్తి శక్తుల్లో మార్పులు ఉత్పాదక సంబంధాల్లో మార్పులతో ముడిపడి ఉంటాయి. అవి క్రమంగా సమాజం మొత్తంలో విశాల సంబంధాలను తీర్చిదిద్దుతాయి.

అయితే అలాంటి మార్పులు యాంత్రికంగా చోటు చేసుకోవు. ప్రతి దశలోనూ మానవులు ఏదో ఒక పథాన్ని ఎంచుకొని సామాజిక సంఘర్షణలో తాను ఎంచుకున్న మార్గం సార్థకమైనదో కాదో తేల్చుకుంటాడు. చరిత్రలో ఒక దశకు మించి ప్రజలు ఎంచుకునే మార్గాలు వారి వర్గహోదాతో ముడిపడి ఉంటాయి. బానిస తన యజమానికి భిన్నంగా మార్గాన్ని ఎంచుకునే అవకాశం ఎక్కువ. అలాగే చేతి వృత్తిదారుడు తన భూస్వామికి భిన్నంగా జీవనోపాధి మార్గాన్ని ఎంచుకుంటాడు. మానవాళి భవితపై సాగిన మహాపోరాటాల్లో వర్గపోరు ఒక అంతర్భాగంగా కనిపిస్తుంది. ఈ పోరాటాల క్రమం చరిత్రకు మూలాధారమవుతుంది.

ఈ చారిత్రక వైఖరి వ్యక్తుల పాత్రను కాని, వారు ప్రతిపాదించిన ఆలోచనలను కాని తక్కువ చేసి చూపదు. దాని ఉద్దేశ్యమేమిటంటే వ్యక్తి కాని, ఆలోచన కాని కేవలం ఒక పరిమిత పాత్రను మాత్రమే పోషించగలదని చెప్పడం. అంతకు ముందు సమాజం సాధించిన భౌతిక ప్రగతి, ప్రజలు తమ జీవనోపాధిని సాధించిన తీరు, వర్గాలు, రాజ్యాల స్వరూపం వల్ల వ్యక్తులకు, వ్యక్తిగత సిద్ధాంతాలకు అంత ప్రాముఖ్యం ఉండదు. అస్థిపంజరం జీవకాయం ఒక్కటే ఎలా అవుతాయి? కాని అస్థిపజరం లేకుండానే దేహానికి పటుత్వం రాదు, అది మనుగడ సాగించలేదు. చరిత్ర భౌతిక ఆధారాన్ని అర్థం చేసుకోవడం చాలా అవసరమే అయినా అదే సరిపోదు.

కనుక, ఈ పుస్తకం ప్రపంచ చరిత్రకు పరిచయ రేఖను అందించడానికి ప్రయత్నిస్తుంది తప్ప అంత కంటే ఎక్కువ శ్రమ తీసుకోదు. కాని ఈ స్థూల విశ్లేషణ గతం, వర్తమానాలను అధ్యయనం చేసేవారికి తోడ్పడగలదని నేను ఆశిస్తున్నాను.

పుస్తకాన్ని రచించే సమయంలో రెండు సమస్యలు ఎదుర్కొక తప్పదని నాకు బాగా తెలుసు. మారని మానవ నైజం. ఆయా సమాజాలు, మానవచరిత్ర ప్రధాన లక్షణంగా ఉండొచ్చన్నది ఒక ఆలోచన. ఈ ఆలోచన రచనల్లో, పత్రికల్లో, ప్రజాసంస్కృతిలో ఎక్కువగా కనిపిస్తుంది. మానవులు ఎప్పుడూ స్వార్థంతో, పోటీతత్వంతో, ఘర్షణాత్మక వైఖరితో వ్యవహరిస్తారని మనకు చెప్పారు. అందువల్లే యుద్ధం, దోపిడీ, బానిసత్వం, మహిళల అణచివేత లాంటి ఘోరాలు చోటు చేసుకున్నాయని వాదించారు. ఈ రాతి మనిషి స్వభావం పశ్చిమ సరిహద్దుపై రక్తపాతాన్ని, మరోవైపు యూదులు నరమేధాన్ని వివరిస్తుంది. నేను చాలా భిన్నంగా వాదించ దలిచాను. నేడు మనకు తెలిసిన మానవ నైజం మన చరిత్ర సృష్టే కాని దాని కారణం కాదు. మన చరిత్ర వేర్వేరు మానవ స్వభావాలతో కూడుకున్నది. ఆర్థిక, రాజకీయ, సైద్ధాంతిక పోరాటాల తర్వాత ఒక నైజాన్ని మరో నైజం తప్పించింది.

రెండవ సమస్య ఏమిటంటే మానవ సమాజం గతంలో మారినప్పటికీ ఇప్పుడది ఏ

మాత్రం మారబోదు అని సూత్రీకరించడమే.

అమెరికా విదేశాంగ శాఖ సలహాదారు ఫ్రాన్సిస్ ఫుకయామా 1990లో తన సందేశాన్ని వినిపించడం ద్వారా అంతర్జాతీయంగా మన్ననలు పొందారు. తన వ్యాసంలో ఫుకయామా చరిత్ర ముగింపు దశకు వచ్చిందని ప్రకటించారు. ఆ వ్యాసం అనేక భాషల్లో ప్రచురితమైంది. సామాజిక సంఘర్షణలు, సైద్ధాంతిక పోరాటాలు గతానికే పరిమితం అన్నారు. ఈ వాదనతో వెయ్యిన్నొక్క మంది సంపాదకులు, టెలివిజన్ వ్యాఖ్యాతలు ఏకీభవించారు.

లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ సంచాలకుడు, లేబర్ ప్రధాన మంత్రి ఆస్థాన సామాజిక నిపుణుడు ఆంథోని గిడ్డెన్స్ అదే సందేశాన్ని 1998లో 'మూడవ మార్గం' అనే గ్రంథంలో వల్లెవేశాడు. క్యాపిటలిజానికి ప్రత్యామ్నాయాలు లేని ప్రపంచంలో మనం జీవిస్తున్నామని అతడు రాశాడు. సర్వవ్యాపితంగా ఉన్న భావనను అతడు అంగీకరించడమే కాకుండా దానిని పునరుద్ఘాటించారు. కాని ఆ భావన ఎక్కువ కాలం మనగలగలేదు.

ఒక దేశంలో స్థూల ఉత్పత్తిని నిర్వహించే మార్గంగా క్యాపిటలిజానికి మూడు లేదా నాలుగు శతాబ్దాల చరిత్ర ఉంది. ప్రపంచ స్థూల ఉత్పత్తిని నిర్వహించే మార్గంగా దానికి 150 ఏళ్ల చరిత్ర మాత్రమే ఉంది. తీవ్ర వైరుధ్యాలున్న పారిశ్రామిక క్యాపిటలిజం గత 50 ఏళ్ల కాలంలో భూమండలంలోని చాలా భాగాల్లో వేగంగా విస్తరించింది. సర్వవ్యాపిత విద్యాభ్యాసం, మార్కెట్లపై ఎక్కువగా ఆధారపడటం వల్ల అది సాధ్యమైంది. అయినా ఏదో ఒక రకం మానవులు గత పదిలక్షల సంవత్సరాల నుండి ఈ భూమిపై పుడుతూనే ఉన్నారు. ఆధునిక మానవులైతే గత 1,00,000 ఏళ్లుగా జన్మిస్తూనే ఉన్నారు. మానవజాతి మనుగడ కాలంలో 0.5 శాతం కంటే తక్కువ కాలం ప్రభావితం చేసిన ప్రక్రియ (క్యాపిటలిజం) ఇక ఎల్లకాలం కొనసాగుతుందని చెప్పడం అద్వితీయ పరిణామమే అవుతుంది. బహుశా మానవ జీవితకాలం మరీ తక్కువైతే కాని ఇది సాధ్యం కాదు. ఫుకయామా, గిడ్డెన్స్ రచనలన్నీ చేసేదేమిటంటే కారల్ మార్క్స్ సూత్రీకరణను నిర్ధారించడమే. "బూర్జువాలకు ఒక చరిత్ర ఉండేది. అది ఇప్పుడు ఏ మాత్రం లేదు" అని మార్క్స్ సరిగ్గా నిర్ధారించారు.

మానవజాతి సమీప గతం సుస్థిరమైన ప్రగతిపథాన్ని చవి చూడలేదు. ఎన్నో వైరుధ్యాలు, ఘోరమైన యుద్ధాలు, రక్తసిక్తమైన అంతర్యుద్ధాలు, హింసాత్మకమైన విప్లవాలు, ప్రతీఘాత విప్లవాలతో ఈ కాలం గడిచింది. మానవాళి ఇక ప్రగతి సాధించగలదని భావించిన సమయం కూడా చేజారిపోయి దుర్భరమైన పేదరికం, ఘోరమైన వినాశనం సంభవించాయి.

ఈ ఘోరాలు ఎన్ని ఉన్నా ప్రకృతి శక్తులను నియంత్రించే సామర్థ్యం మానవుల్లో పెరిగిందనడం వాస్తవం. వెయ్యేళ్ల క్రితం ప్రకృతిని శాసించే సామర్థ్యం మానవుల్లో బాగా పెరిగింది. ప్రకృతి శక్తులు మానవులను ఆకలికి లేదా చావుకు గురి చేసే స్థితిలో లేని ప్రపంచంలో నేడు మనం జీవిస్తున్నాము. ఒకపుడు లక్షలాది మందిని ఏకంగా పొట్టన పెట్టుకునే వ్యాధులు నేడు పూర్తిగా నిర్మూలించబడ్డాయి.

కాని ఆకలి, పౌష్టికాహారలోపం, యుద్ధాల వల్ల లక్షలాది మంది తరచూ చనిపోతూనే ఉన్నారు. 20వ శతాబ్దపు చరిత్రను పరిశీలిస్తే అది స్పష్టమవుతుంది. ఈ కాలంలోనే పారిశ్రామిక క్యాపిటలిజం మొత్తం ప్రపంచాన్ని తన కబంధహస్తాల్లోకి తీసుకుంది. నేడు పరిస్థితి ఎలా ఉందంటే మారుమూల ప్రాంతాల్లో నివసించే రైతు, పశువుల కాపరిసైతం కొంత వరకు మార్కెట్‌పై ఆధారపడక తప్పడం లేదు. యుద్ధం, నరమేధం, దోపిడి, పాశవికత గతానికి తీసిపోని విధంగా ఈ శతాబ్దంలోనూ

కనిపిస్తాయి. ఇసాయా బెర్లిన్ అనే తత్త్వవేత్త ఈ శతాబ్దాన్ని "పాశ్చాత్య చరిత్రలో ఘోరమైన శతాబ్ది"గా వర్ణించాడు. 20వ శతాబ్ది చివరి దశకాల్లో మానవాళిని ప్రగతి పథం వైపు నడిపిన సంఘటనలు, ప్రక్రియలంటూ ఏవీలేవు. తూర్పు దేశాల్లో పేదరికం తాండవమాడింది. ఆఫ్రికాలో వరుస కరువులు, ఎడతెగని అంతర్యుద్ధాలు సంభవించాయి. లాటిన్ అమెరికా ప్రజలు సగానికి సగం మంది పేదరికానికి దిగువున జీవించారు. ఇరాన్, ఇరాక్‌ల మధ్య ఎనిమిదేళ్ల పాటు యుద్ధం సాగింది. ప్రపంచంలోని శక్తి వంతమైన దేశాల సంకీర్ణ సైన్యాలు ఇరాక్, సెర్బియాపై దాడులు నిర్వహించాయి.

చరిత్ర ముగియలేదు. దాని ముఖ్య లక్షణాలను తెలుసుకోవలసిన అవసరం గతం కంటే ఇప్పుడు ఎక్కువగా ఉంది. చరిత్రను అవగాహన చేసుకోవడంలో ప్రజలకు ఈ పుస్తకం సహకరించగలదన్న నమ్మకంతోనే నేను రచించాను.

రచనలో నేను గత చారిత్రక గ్రంథాలపై చాలా వరకు ఆధారపడ్డాను. ఉదాహరణకు, వర్గ సమాజ ఆవిర్భావంపై ఉన్న అధ్యాయం ప్రఖ్యాత పురావస్తు శాస్త్రవేత్త వి. గార్డన్ చైల్డ్ రచనలు లేకుండా సాధ్యమయ్యేది కాదు. అతడు రచించిన మరో పుస్తకం "చరిత్రలో ఏమి జరిగింది" ఎప్పటికీ చదవాలనిపిస్తుంది. అలాగే మధ్యయుగ ప్రపంచంపై ఉన్న అధ్యాయం మార్క్‌బ్లాక్, ఫ్రెంచ్ అన్నెల్స్ చరిత్రకారుల రచనలతో స్ఫూర్తి పొందింది. ఆయా రచయితల వ్యాఖ్యానాలను సందర్భోచితంగా పొందుపరిచాము. ఇతరులు కూడా ఉన్నారు. వారి పేర్లను ప్రస్తావించక పోయినా వారిచ్చిన స్ఫూర్తి ఎనలేనిది. క్రిస్టోఫర్ హిల్, జఫ్రీ డస్టేక్రొయిక్స్, గయ్ బోయిస్, అల్బర్ట్ సొబోల్, ఎడ్వార్డ్ థాంప్సన్, జేమ్స్ మెక్‌ఫర్సన్, డిడి కొసాంబీ లాంటి పేర్లు మదిలో మెదలుతాయి. నా పుస్తకం వారి రచనలను చదివేందుకు పాఠకులను ప్రోత్సహించగలదని ఆశిస్తున్నాను.

తేదీలే చరిత్ర సర్వస్వం కాదు. కాని పరిణామాల క్రమం కొన్ని సందర్భాల్లో చాలా ముఖ్యం. కొన్నిసార్లు పాఠకులకు అది కష్టం కలిగించవచ్చు (రచయితలకు కూడా!). ఈ కారణంగానే ప్రధాన ఘటనల క్రమాన్ని సంక్షిప్తంగా ప్రతి అధ్యాయం మొదట్లో పొందుపరిచాను. అదే కారణం వల్ల పేర్లు, స్థలాలు, అపరిచిత అంశాల వివరణ జాబితాను పుస్తకం చివరిలో అందిస్తున్నాము. ఇవి సమగ్రమైనవి కావు. కాని పాఠకులకు ఆయా అధ్యాయాలను తిరగ వేస్తున్నపుడు సంక్షిప్త వివరణ ఎంతో సహాయపడగలదు. చివరిగా, ఈ పుస్తకాన్ని ప్రచురించడంలో నాకు పూర్తి సహాయ సహకారాలు అందించిన అందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ముఖ్యంగా ఇయాన్ బిర్చల్, క్రిస్ బాంబేరి, అలెక్స్ కాల్లినికోస్, చార్లీఓర్, చార్లీ కింబర్, లిండ్సేజర్మన్, తలత్ అహ్మద్, హసన్ మహమ్మదల్లీ, సేథ్‌హర్మాన్, పాల్‌మెక్‌గార్, మైక్‌హేన్స్, తిథి భట్టాచార్య, బారీ పావియర్, జాన్ మాలిన్యూక్స్, జాన్‌రీవ్స్, కెవిన్ ఓవెన్, సామ్ అష్మన్ నా రాతప్రతిని చదివి, లోపాలను సవరించారు. నేను రాసింది మరలా పునరాలోచించి సరిదిద్దాలని కొన్నిసార్లు ఒత్తిడి తెచ్చారు. వివిధ సందర్భాల్లో నేను చేసిన చారిత్రక విశ్లేషణలకు వారు ఏ మాత్రం బాధ్యులు కారని ఇక్కడ చెప్పాలి. లోపాలు ఏవైనా ఉంటే వాటికి పూర్తి బాధ్యత నాదే. నా రాతప్రతిని సంకలించినందుకు ఇయాన్ టేలర్‌కు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

# పరిణామక్రమం

***40 లక్షల సంవత్సరాల క్రితం***

తొలి చింపాంజీలు రెండు కాళ్లపై నడవడం ప్రారంభించాయి - అస్ట్రలోపెథికస్

***15-5 లక్షల సంవత్సరాల క్రితం***

మానవజాతి ఆవిర్భావం (హోమో ఎరక్టస్), రాతి పరికరాలు, కలప, ఎముకల వినియోగం.

తొలి పాత రాతియుగం.

***4 లక్షల సంవత్సరాల నుండి 30,000 ఏళ్లక్రితం***

ఐరోపా, మధ్యాసియాలో నియాన్‌డెర్థల్ మానవులు, సాంస్కృతిక అవశేషాలు, బహుశా భాష వినియోగం.

***1,50,000 సంవత్సరాల క్రితం***

ఆధునిక మానవులు (హోమో సాపియన్స్) బహుశా ఆఫ్రికాలో ఆవిర్భవించారు వేట, ఆహారసేకరణ ద్వారా మనుగడ, మధ్య పాతరాతియుగం.

***80,000-14,000 సంవత్సరాల క్రితం***

మధ్యాసియాకు ఆధునిక మానవుల రాక (80,000 ఏళ్ళ క్రితం), ఆస్ట్రేలియాకు వలస (40,000 ఏళ్ల క్రితం), ఐరోపా ప్రవేశం (30,000 ఏళ్ల క్రితం), అమెరికాల ఏర్పాటు (14,000 ఏళ్ల క్రితం) చివరి పాతరాతియుగం.

***13,000 సంవత్సరాల క్రితం***

వేట, ఆహార సేకరణ ద్వారా మనుగడ సాగింపు. వాతావరణం అనుకూలించడంతో గ్రామాల్లో సామూహిక జీవనం. మధ్యరాతియుగం.

***10,000 సంవత్సరాల క్రితం***

తొలి వ్యవసాయ విప్లవం, మొక్కలు, పశువుల పెంపకం. కొత్తరాతియుగం. మేలైన

పరికరాలు, మట్టి పాత్రల వినియోగం. గ్రామవాసం విస్తరణ. సమూహాల మధ్య తొలి పోరాటాలు. వర్గాలు, రాజ్యాలు అప్పటికీ ఆవిర్భవించలేదు.

***7,000 సంవత్సరాల క్రితం :***

యురేసియా, ఆఫ్రికాలలో నాగలి వినియోగం, పశ్చిమోత్తర ఐరోపాకు వ్యవసాయ విస్తరణ. కొన్ని సమూహాల్లో పెద్దల ఆవిర్భావం, కాని వర్గాలు, రాజ్యాలు ఏర్పడలేదు.

***6,000-5,000 సంవత్సరాల క్రితం :***

పశ్చిమాసియా, నైలు లోయలో పట్టణీకరణ విప్లవం. పరిమితంగా ఇత్తడి వినియోగం.

***5,000 సంవత్సర్సాల క్రితం (క్రీస్తు పూర్వం 3000) :***

మెసపటోమియా, ఈజిప్టు (పాతరాజ్యం)లలో రాజ్యాల ఆవిర్భావం. తొలి అక్షరాలు. కాంస్య ఆవిష్కరణ, సామాజిక వర్గాల ఏర్పాటు, మత వర్గాలు, ప్రార్థనా మందిరాలు. తొలి పిరమిడ్‌లు. కాంస్యయుగం. మహిళలు పురుషులకు లోకువ అన్న భావన.

***క్రీపూ.2500-2000 సంవత్సరాలు :***

సింధూలోయలో నగర రాజ్యాల విస్తరణ. పశ్చిమాసియా ఏకీకరణకు సామ్రాజ్యాన్ని నెలకొల్పిన సార్గాన్. పశ్చిమ ఐరోపాలో రాతిగోడల నిర్మాణం. ఈజిప్ట్‌కు దక్షిణం వైపు నూబియాన్ నాగరికత.

***క్రీపూ. 2000 సంవత్సరాల క్రితం :***

చీకటి యుగం - ఈజిప్టు పాత రాజ్యం, మెసపటోమియా సామ్రాజ్యాల పతనం. ఆసియా మైనర్‌లో లోహ ఉత్పత్తి

***క్రీపూ.2000-1600 వరకు :***

క్రేట్‌లో మినోవాన్ నాగరికత విస్తరణ. ఈజిప్టు రాజ్య పునరుద్ధరణ. మధ్య రాజ్యం ఏర్పాటు. హమ్మురాబి నేతృత్వంలో మెసపటోమియా సామ్రాజ్య పునరుద్ధరణ. ఉత్తర చైనాలో పట్టణాల విస్తరణ. గ్రీసులో మైసీనియన్ నాగరికత.

***క్రీపూ.1600 సంవత్సరాల క్రితం :***

ఈజిప్టులో మధ్య రాజ్యం పతనంతో సంక్షోభం. క్రేట్, సింధూ, మైసినియన్ నాగరికతలు అంతరించడంతో మళ్లీ చీకటి యుగం. ఈ ప్రాంతాలలో అక్షరాస్యత మాయం. ఉత్తర చైనాలో షాంగ్ సామ్రాజ్యం, కాంస్యయుగం.

***క్రీపూ.1000 సంవత్సరాల క్రితం :***

ఇథోపియాలో అక్సుమ్ నాగరికత. మధ్యధరా ప్రాంతంలో ఫోనీషియన్ నగర రాజ్యాలు. మెసో-అమెరికాలో పట్టణీకరణ విప్లవం, ఆల్మెక్ సంస్కృతి, ఆండియన్ ప్రాంతంలో [illegible] ...ృతి.

***క్రీ.పూ. 800-500 సంవత్సరాల క్రితం :***

భారత్, ఇటలీ,గ్రీసు దేశాలలో కొత్త నాగరికతల ఆవిర్భావం. నూబియాలో మెరో నాగరికత.

***క్రీ.పూ.400-1 సంవత్సరాల క్రితం :***

మెసో-అమెరికాలోని ఆల్మెక్ నాగరికత తన స్వంత లిపిని కనుగొంది.

***క్రీ.శ. తొలి శతాబ్దం (2,000 సంవత్సరాల క్రితం)***

మెక్సికో లోయలో తియోతిహువాకాన్ నగర ఆవిర్భావం (ప్రపంచంలోనే అతి పెద్ద నగరమై ఉండవచ్చు) ఇక్కడ పంచలోహాల వినియోగం లేకుండా అభివృద్ధిని సాధించారు. 400 ఏళ్ల తర్వాత నగరాన్ని విడిచి వెళ్లారు. దక్షిణ మెక్సికోలో మోంటే అల్బన్, గౌటిమాలాలో మాయా నాగరికతలు.

ముందుమాట

# వర్గానికి పూర్వం

21వ శతాబ్దంలో అడుగిడిన నేటి ప్రపంచం స్వార్థం, పేద-ధనిక వర్గాల మధ్య పూడ్చలేని అంతరాలు, వర్ణ వివక్ష, జాత్యహంకారం, ఘోరకృత్యాలు, యుద్ధాలతో సతమతమవుతోంది. పరిస్థితులు ఎప్పుడూ ఇలాగే ఉండేవని నమ్మడం చాలా తేలిక. అందుకే పరిస్థితుల్లో మార్పు ఉండదని భావిస్తాము. చాలా మంది రచయితలు, తత్త్వవేత్తలు, రాజకీయ వేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, పాత్రికేయులు, మనశ్శాస్త్ర నిపుణులు ఈ భావననే వ్యక్తం చేశారు. వర్గస్థాయి, శక్తిమంతులపట్ల గౌరవభావం, స్వార్థం, దుర్మార్గ ప్రవర్తన ప్రధాన లక్షణాలుగా వీరు అభివర్ణిస్తారు. జంతువుల రాజ్యంలో ఈ లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. జన్యుపరమైన కారణాలవల్ల ఈ లక్షణాలు మానవుల్లో కూడా కనిపిస్తాయని కొందరు వాదిస్తారు. ఈ అభిప్రాయాన్ని కొన్ని జనాంతిక కథనాలు, శాస్త్రీయ పరిశోధనా పత్రాలు కూడా సమర్థిస్తాయి. డెస్మండ్ మొర్రిస్ ప్రకారం మానవులు తమ పూర్వీకుల (ఆదిమ వానరజాతి) సజీవ స్వరూపాలు.[2] వారికి వేట స్వభావం ఉంటుందని రాబర్ట్ ఆర్డ్రే చెప్పారు.[3] జంతు లక్షణాలను హుందాగా ప్రదర్శించే మానవులు స్వార్థమనే జన్యువు ప్రకారం నడుచుకుంటారని రిచర్డ్ డాకిన్స్ అన్నారు.[4] అలిఖిత చరిత్ర కాలంలో మన పూర్వీకులు తరతరాలుగా ఎలా జీవించారో నేడు మనకు కొంత అవగాహన ఉంది. ఆ అవగాహన మానవనైజాన్ని మూస పద్ధతుల్లో వర్ణించడానికి సరిపోదు. శాస్త్రీయమైన సాక్ష్యాధారాల ద్వారా మనకు తెలిసేదేమిటంటే అప్పటి సమాజాలు పోటీతత్వం, అసమానత, దౌర్జన్యానికి దూరంగా ఉండేవి. ఈ లక్షణాలు చరిత్ర మిగిల్చిన (ఇటీవలి చరిత్ర) సాంప్రదాయాలు. 5,000 సంవత్సరాల క్రితం వరకు మానవ ప్రవర్తన ఏ విధంగా ఉండేదో తెలుసుకునేందుకు జరిపిన పురావస్తు పరిశోధనలు, తవ్వకాలు, మానవ శాస్త్ర అధ్యాయనాలు తగిన సాక్ష్యాలు అందజేస్తాయి. కొన్ని సమాజాలు 19, 20వ శతాబ్దాల వరకు కూడా ఇలాగే కొనసాగాయని పరిశోధనలు చెబుతున్నాయి.

మానవ శాస్త్రవేత్త రిచర్డ్ లీ పరిశోధన ఫలితాల సారాంశాన్ని వివరించారు :

"రాజ్యాలు ఆవిర్భవించకముందు, సామాజిక అసమానత నెలకొనకముందు ప్రజలు వెయ్యేళ్ల వరకు చిన్న చిన్న సామాజిక బృందాలుగా జీవనం సాగించారు. ఆర్థిక జీవనం ఉమ్మడి యాజమాన్యంపై ఆధారపడి ఉండేది. భూమిని, వనరులను ఉమ్మడిగా అనుభవించేవారు. ఆహార పంపిణీ సమానంగా జరిగేది. సమసమాజ రాజకీయ సంబంధాలు ప్రబలంగా ఉండేవి."[5]

మరోమాటలో చెప్పాలంటే ప్రజలు ఆహారాన్ని పంచుకునేవారు, ఒకరికొకరు సహాయపడే వారు. పాలకులు, పౌరులంటూ ఉండేవారు కాదు. పేద, ధనిక అనే తేడాలు ఉండేవి కావు. ఈ పరిస్థితులను వివరించడానికి 1880లో ఫ్రెడరిక్ ఎంగెల్స్ చేసిన వ్యాఖ్యను లీ పునరుద్ఘాటించారు. అప్పటి సమాజాన్ని ఎంగెల్స్ 'ఆదిమ కమ్యూనిజం'గా అభివర్ణించారు. ఈ అంశానికి ఎనలేని ప్రాధాన్యత ఉంది. మానవజాతి (ఆధునిక మానవులు)కి లక్ష సంవత్సరాల చరిత్ర ఉంది. ఇందులో 95 శాతం కాలం ఇప్పటి మానవ ప్రవర్తనా లక్షణాలకు దూరంగా ఉండేది. మానవ శరీర నిర్మాణంలో ఈ లక్షణాలు ప్రత్యేకంగా ఏమి చొప్పించబడలేదు. ప్రస్తుత సమాజాలు అలా ప్రవర్తించడానికి శరీర నిర్మాణాన్ని తప్పుపట్టలేము.

మానవజాతి పుట్టుపూర్వోత్తరాలు లక్ష సంవత్సరాల కంటే చాలా పైబడి ఉన్నాయి. ఆఫ్రికాలో 40 నుండి 50 లక్షల సంవత్సరాల క్రితం జీవించిన ఒక వానర జాతి నుండి మన దూరపు పూర్వీకులు ఆవిర్భవించారు. ఈ జాతి సభ్యులు చెట్లపై జీవించడం మానేశారు. అందుకు కారణాలు తెలియదు. చింపాంజీ, బొనోబో (పిగ్మీ చింపాంజీలు) రెండు కాళ్లపై నడవడం మొదలుపెట్టాయి. జంతువులలో ఎన్నడూ లేని విధంగా అవి పరస్పరం సహరించుకుంటూ మనుగడ సాగించాయి. వేర్లు తవ్వడానికి, పండ్లను తుంచడానికి, కీటకాలు, చిన్నచిన్న జంతువులను చంపడానికి, క్రూర మృగాలను తరిమివేయడానికి అవి పరికరాలను తయారు చేసుకున్నాయి. పోటీ కంటే సహకారంపైనే అవి ఎక్కువ ఆధారపడేవి. సహకార శ్రమ నిబంధనలను భరించలేని కొందరు సభ్యులు ఆకలిచావులకు గురయ్యారు. ఉమ్మడి సహకారం, ఉమ్మడి శ్రమను ఆమోదించిన వారు మనుగడ సాగించారు, పునరుత్పత్తిని సాధించారు.

ఇలా వేలాది సంవత్సరాలు ఉమ్మడి జీవనానికి అలవాటుపడిన ఈ జాతి సభ్యులు ఇతర జంతువులకు భిన్నంగా శరీర ఆకారాన్ని సంతరించుకున్నారు. ఆత్మరక్షణకు అవసరమైన కోరలు, గోర్లు, చలిని తట్టుకోవడానికి దట్టమైన జుట్టు, పారిపోవడానికి ఉపయోగపడే పొడవాటి కాళ్లు వారికి లోపించాయి. అయితే ఆదిమ మానవులకు తమ చుట్టూ ఉన్న ప్రపంచానికి అట్టే స్పందించే గుణం అలవడింది. వస్తువులను పట్టుకోవడానికి వాటికి ఆకారం ఇవ్వడానికి చేతులు ఉపయోగపడ్డాయి. పరస్పరం సంభాషించడానికి తమ స్వరాన్ని వినియోగించుకున్నారు. పరిశోధన, అధ్యయనం ద్వారా పరిసరాల పరిజ్ఞానాన్ని పెంచుకున్నారు. పిల్లలను పెంచే అనుభవం ఉండడంతో తాము నేర్చుకున్న విద్యలను తర్వాతి తరానికి అందజేశారు. పెద్ద మెదడుల అభివృద్ధి, సాంఘిక జీవనం గడపాలన్న కోరిక, అందుకు తగిన సామర్థ్యంకలిగి ఉండడం వల్లే ఇది సాధ్యమైంది. కాలక్రమంలో భాషనుకూడా అభివృద్ధి పరిచారు. ఆలోచనా శక్తి పెరగడంతో ప్రాపంచిక చైతన్యాన్ని అలవర్చుకున్నారు. తమ చుట్టూ ప్రపంచం అంటూ ఒకటుందని, అందులో తాము ఒక భాగమున్న భావన వారిలో ఏర్పడింది[6] సుమారు 1,50,000 సంవత్సరాల క్రితం ఆఫ్రికాలో ఆధునిక మానవుల ఆవిర్భావం ఈ ప్రక్రియ ఫలితమే.[7]

తర్వాతి 90,000 సంవత్సరాల వరకు మన పూర్వీకులు భూమండలమంతా విస్తరించారు. ఈ ప్రక్రియలో నియాన్‌డెర్థాల్ లాంటి ఇతర మానవజాతి సభ్యులు గల్లంతయ్యారు.[8] సుమారు 60,000 ఏళ్ల క్రితం మానవులు పశ్చిమాసియాకు చేరుకున్నారు. అలాగే 40,000 ఏళ్ల క్రితం ఐరోపాకు చేరుకున్నారు. ఆగ్నేయా ఆసియా ద్వీపాలను ఎలాగోలా దాటుకొని ఆస్ట్రేలియాకు చేరుకోగలిగారు. సుమారు 12,000 ఏళ్ల క్రితం బేరింగ్ జలసంధిని దాటుకొ[illegible]

చెందాయి. ఒక్కో సముదాయానికి ప్రత్యేకమైన పరిజ్ఞానం, సామాజిక సంఘటనం, సంస్కృతి ఏర్పడ్డాయి. కొన్ని వారసత్వ లక్షణాలు ప్రబలమయ్యాయి. ముఖ్యంగా కళ్ల రంగు, వెంట్రుకలు, శరీర ఛాయవేర్వేరుగా అభివృద్ధి చెందాయి. అయితే వివిధ సమూహాల జన్యు వారసత్వం ఒకేలా ఉండేది. సమూహాల మధ్యకంటే సమూహంలోనే చాలా వైరుధ్యాలు ఉండేవి. ఇతరుల భాషను నేర్చుకునే సామర్థ్యం అందరికీ ఉండేది. అన్ని సమూహాల మేధో చింతన ఒకేలా ఉండేది. మానవవాళి విభిన్న వర్గాలుగా చీలిపోయినప్పటికీ ఒకే జాతిగా ఉండిపోయింది. జన్యు నిర్మాణం మానవుల ప్రగతిని శాసించలేదు. ప్రకృతిని కొల్లగొట్టే శక్తి, సహకార స్వరూపాలు మానవ మనుగడను నిర్దేశించాయి. ఈ సహకార స్వరూపం (జీవనోపాధి విషయంలో) ఆయాసమాజాల ఆవిర్భావాన్ని, వాటి ప్రవర్తనను, ఆచార వ్యవహారాలను సూచిస్తుంది.

సుమారు 10,000 సంవత్సరాల వరకు ఆయా సమాజాలు కొన్ని సాధారణ, మౌలిక లక్షణాలను సమానంగా కలిగి ఉండేవి. వేట, ఆహారసేకరణ ద్వారా మనుగడ సాగించడం వల్లే ఈ లక్షణాలు అన్ని సమాజాల్లో కనిపించేవి. ఈ సమాజాలన్నీ దాదాపు "వేట-సేకరణ" సమాజాలే. పండ్లు, వేర్లు, జంతువులు, చేపలను పట్టుకొని వాటి శుద్ధి చేసి ఉపయోగించేవి.[9]

కొన్ని వందల ఏళ్ల వరకు కూడా భూమండలంలోని అన్ని భాగాల్లో మానవ సమాజాలు మనుగడ సాగించగలిగాయి. నేటికి కూడా కొన్ని సమాజాల ఉనికి అలాగే కొనసాగుతోంది. ఈ సమాజాలను అధ్యయనం చేసిన తర్వాత రిచర్డ్ లీ లాంటి మానవ శాస్త్రవేత్తలు మానవాళి చరిత్రలో 90 శాతం వరకు మానవ జీవితం ఎలా ఉండేదో నిర్ధారించగలిగారు.

అనాగరిక ప్రజలు కుసంస్కారులని, పాశవికులని, ప్రకృతితో కలిసి దయనీయమైన జీవితం గడుపుతున్నారని పశ్చిమ దేశాల్లో ఉన్న భావన వాస్తవ విరుద్ధమైనది.[10] మనుగడ సాగించేందుకు అలాంటి ప్రజలు ప్రతి ఒక్కరితో పోరాడుతూ తమ జీవితాలను దుర్భరం చేసుకోవడం లేదు. అలాగే వారి జీవిత కాలం కూడా స్వల్పమేమీ కాదు.[11]

సుమారు 30 నుండి 40 మంది సభ్యులు గల చిన్న బృందాలుగా ప్రజలు జీవించేవారు. కొన్ని సందర్భాల్లో ఈ సంఖ్య 200 వరకు కూడా పెరిగేది. ఈ చిన్న సముదాయాల్లో జీవనం నాగరిక ప్రపంచంలో పేదలు అనుభవిస్తున్న జీవితం కంటే దుర్భరంగా మాత్రం ఉండేది కాదు. ఒక ప్రముఖ మానవ శాస్త్ర నిపుణుడు వారిని 'అసలైన ధనిక సమాజం' అని కూడా పేర్కొన్నారు.[12]

ఈ సమాజాల్లో పాలకులు కాని, యజమానులుకాని, వర్గ విభజనలు కాని ఉండేవి కావు. కాంగో ముబూతి మరుగుజ్జుల గురించి టర్న్‌బుల్ ఇలా రాశారు : "వారిలో నాయకులు లేరు, వ్యవస్థాగత మండళ్లు కూడా లేవు. అన్ని రంగాల్లో ఒకరో ఇద్దరో (మహిళలు, మగవారు) ఇతరుల కంటే ఎక్కువ ప్రాముఖ్యత కలిగి ఉండేవారు. అది కూడా ఉమ్మడి ప్రయోజనాల కోసమే. చట్టాల నిర్వహణ ఉమ్మడి వ్యవహారంగా ఉండేది."[13] జీవనోపాధి మార్గాలను అన్వేషించడానికి ప్రజలు పరస్పరం సహకరించుకునే వారు. నాయకత్వ పాలన లేకుండా, నిరంతర ఫలితాలను ఉటంకిస్తూ ఎర్నెస్టైన్ ఫ్రెడెల్ ఇలా రాశారు : "ప్రతి దినాన్ని ఎలా గడపాలో నిర్ణయించే అధికారం మహిళలు, మగవారికి సమానంగా ఉండేది. వేటకు వెళ్లాలో, ఆహార సేకరణకు వెళ్లాలో, ఎవరితో వెళ్లాలో వారే నిర్ణయించేవారు."[14] తన అధ్యయనాల గురించి ఎలియనార్ లీకాక్ ఇలా వ్యాఖ్యానించారు : "వ్యక్తిగత భూ యాజమాన్యం ఉండేది కాదు. లైంగిక విభజన తప్ప శ్రమ విభజన అంటూ లేదు. తమ వ్యాపకాలను ప్రజలే నిర్ణయించేవారు, వాటికి బాధ్యత వహించేవారు. ఉమ్మడి కార్యకలాపాలు చేపట్టడానికి ఏకాభిప్రాయం సాధించేవారు."[15]

స్వార్థం కంటే దయాగుణం ఆధారంగానే మానవ ప్రవర్తన ఉండేది. వ్యక్తులు ఒకరికొకరు సహాయపడేవారు. వేటకు వెళ్లి సేకరించిన ఆహారాన్ని ఆరగించే ముందు ఇతర సముదాయ సభ్యులకు పంచేవారు. లీ ఇలా వ్యాఖ్యానించారు. "ఒక కుటుంబం ఎన్నడూ ఒంటరిగా ఆహారాన్ని తీసుకోలేదు. తమ సమూహం లేదా సముదాయంలోని ఇతర సభ్యులతో పంచుకున్న తర్వాతే అది మిగిలిన ఆహారాన్ని తినేది. పరస్పర సహకారం అన్న సూత్రం ప్రతి ఖండంలో, ప్రతి వాతావరణంలో జీవితం గడిపిన మానవ సమాజాల్లో కూడా ఉన్నట్లు బోధపడుతోంది."[16] తాను అధ్యయనం చేసిన కలహారి కుంగ్ ప్రజలు సమసమాజ గట్టి మద్దతుదారులని లీ తెలిపారు. "సమానత్వాన్ని పరిరక్షించేందుకు వారు కొన్ని సాంస్కృతిక ఆచారాలను అభివృద్ధి పరిచారు. తలబిరుసుతనం, పొగరుగా వ్యవహరించే వారిని పక్కకు తప్పించేవారు. వేటలో విఫలమైన వారికి సహాయం అందించేవారు. తదుపరి వేటకు వారిని సిద్ధం చేసేవారు."[18] కెనడాకు చెందిన మోంటాగ్నాయిల గురించి ఒక జెస్యూట్ మిషనరీ (తొలితరం) ఇలా రాశాడు : "మన ఐరోపావాసులకు నరకాన్ని చూపిస్తూ వారిని చిత్రవధ చేస్తున్న ఇద్దరు నియంతలు ఈ ప్రజలు నివసిస్తున్న కారడవిలో పాలించడం లేదు. నా ఉద్దేశ్యం ఇక్కడ రాజకీయ కాంక్ష, ఆధిపత్యం అంటూ ఏదీ లేదు. ఇక్కడి ప్రజల్లో ఒక్కరు కూడా సైతాను ప్రలోభంలో పడి సంపదను కూడబెట్టడం లేదు."[19]

> ఫ్రైడల్ పేర్కొన్నట్లు యుద్ధతంత్రం అంటూ చాలా తక్కువగా ఉండేది. "పొరుగు సముదాయాల మధ్య ప్రాంతీయాధిపత్యం కోసం పోరాటాలు ఎన్నడూ జరగలేదు. కాని మొత్తమ్మీద, యుద్ధ విద్యలను నేర్చుకోవడానికి, దండయాత్రలకు వెచ్చించే సమయం అంత ఎక్కువగా ఉండేది కాదు. సముదాయాల్లో స్పర్థలను వివాదానికి కారణమైన ఇరుపక్షాల్లో ఒకరిని బహిష్కరించడం ద్వారా పరిష్కరించేవారు."[20]

ఇలాటి సాక్ష్యాలు ఆర్డ్రే లాంటి నిపుణుల వాదనలను పటాపంచలు చేస్తాయి. ఆదిమ మానవుల నుండి నేటి మానవుల వరకు చరిత్ర అంతా రక్తసిక్తమేనని అతడు రాశాడు. ఆఫ్రికా మండే ఎండలో అట్టే మాయమయ్యే నీటి ఆధారాలపై పట్టుకోసం వేట సముదాయాలు ఎప్పుడూ కలహించుకునేవారని ఆర్డ్రే పేర్కొన్నాడు. మనమంతా కెయిన్ వారసులమని, మానవ చరిత్ర అణ్వాయుధాలకు తెర తీసిందని, నాగరికత అనే సన్నటి ముసుగు మానవుని పాశవిక గుణాన్ని, నరమేధాన్ని, బానిసత్వాన్ని దూషణను కప్పి పెడుతోందని అతడు వ్యాఖ్యానించాడు.[21]

మానవ స్వభావంపై ఉన్న వాదోపవాదాలకు ఈ వ్యాఖ్య ఎంతో ముఖ్యమైనది. ఎందుకంటే మానవునికి అలాంటి స్వభావమే కనుక ఉన్నట్లయితే వేట, సేకరణ సాగిన సుదీర్ఘ కాలంలో పరిస్థితులకు అనుగుణంగా అలవడి ఉంటుంది.

రిచర్డ్ లీ మానవ స్వభావాన్ని సరిగ్గా అంచనా వేశారు :

> "సమసమాజ భావనతో పరస్పర సహకారం, తత్సంబంధిత సుదీర్ఘ అనుభవం మన గతాన్ని మలిచాయి. వర్గ సమాజాల్లో జీవితానికి మనం అలవాటుపడినా, ప్రపంచంలోని చాలా దేశాలలో మానవ హక్కుల పరిరక్షణ దారుణంగా ఉన్నా మానవాళిలో ఇంకా సమసమాజ

భావన బలంగా ఉందన్న సూచనలు మనకు కనిపిస్తూ ఉంటాయి. పరస్పర సహకారం, సముదాయ భావన ప్రబలంగా ఉన్నాయి."[22]

మార్గరేట్ థాచర్ అభిమాన ఆర్థికవేత్త ఫ్రెడరిక్ వాన్ హయేక్ మరో కోణం నుండి మానవ స్వభావాన్ని విశ్లేషిస్తూ ఇలా ఫిర్యాదు చేశారు : "మానవులకు సుదీర్ఘ కాలం నుండి కొన్ని భావాలు, సామూహిక సంబంధాలు ఉన్నాయి. ఇలాంటి భావాలు ఒక చిన్న సమూహం లేదా సముదాయానికే మేలు చేకూరుస్తాయి. మనకు తెలిసిన వాళ్లకే మేలు చేయాలనే తాపత్రయం వారిలో ఎక్కువగా కనబడుతుంది."[23]

వాస్తవంగా అయితే మానవ స్వభావానికి నిలకడలేదు. ప్రస్తుత సమాజంలో కొద్ది మంది ప్రజలకైనా ఆ స్వభావం స్వార్దం, పోటీకి ప్రేరేపిస్తుంది. దీనినే హయేక్ తప్పు పట్టారు. వర్గ సమాజాల్లో ఇలాంటి స్వభావం ఘోరమైన కృత్యాలకు - చిత్రహింస, సామూహిక అత్యాచారం, సజీవ దహనం, అర్థంలేని నరమేధం - తెరతీస్తుంది. జీవనోపాధి అవసరాల దృష్ట్యా వేట, సేకరణపై ఆధారపడ్డ మానవుల్లో ప్రవర్తన వేరుగా ఉండేది. జీవనోపాధి పొందే మార్గాలను అన్వేషించడంలో సమసమాజ భావన, అందరికీ మేలు జరగాలన్న తలంపు కీలకంగా ఉండేవి.

వేట, సేకరణ సమాజ సభ్యులు ఒకరిపై ఒకరు ఎక్కువగా ఆధారపడేవారు. సేకరణ దారులు సాధారణంగా ఆహారాన్ని నిరంతరంగా సరఫరా చేసేవారు. వేటకు వెళ్లేవారు విలువైన ఆహారాన్ని తీసుకొచ్చేవారు. వేటలో ప్రావీణ్యం ఉన్న వారు తమ రోజువారీ ఆహారం కోసం సేకరణదారులపై, వారి దాతృత్వంపై ఆధారపడేవారు. అలాగే సేకరణలో అనుభవమున్న వారు - వేటలో విఫలమైన వారు కూడా ఇందులో ఉండవచ్చు - పౌష్టికాహారం కోసం జంతువులను వధించే వారిపై ఆధారపడే వారు. వేట అన్నది ఒక పురుషుడిపైనే ఆధారపడి సాగేది కాదు. వేటకు ఒక బృందంగా వెళ్లేవారు. బృందంలో కొన్నిసార్లు మహిళలు, పిల్లలను కూడా తీసుకెళ్లేవారు. అందరూ కలిసికట్టుగా జంతువులను వెంబడించి, కాపు కాసి పట్టుకునేవారు లేదా చంపేవారు. వేట ప్రతిదశలోనూ పరస్పర సహకారం, ఉమ్మడి విలువలకే ప్రాధాన్యత నిచ్చేవారు. అవి లేకుండా ఏ సముదాయమూ కొద్ది రోజుల కంటే ఎక్కువగా మనుగడ సాగించడం సాధమయ్యేది కాదు.

ఉమ్మడి సహకారం సూత్రానికి తోడు మహిళలపై పురుషుల ఆధిపత్యం లేకపోవడం ఆయా సముదాయాలకు ఎంతో లాభదాయకంగా ఉండేది. స్త్రీ పురుషుల మధ్య ఎప్పుడూ శ్రమ విభజన స్పష్టంగా ఉండేది. మగవారంతా వేటకు వెళితే మహిళలు ఆహారసేకరణ చేపట్టేవారు. ఎందుకంటే గర్భవతులు లేదా చిన్న పిల్లలు ఉన్న మహిళలు వేటలో పాల్గొని ఆపదను కొనితెచ్చుకొనే అవకాశాలే ఎక్కువగా ఉండేవి. అలాగే ఆ సముదాయ పునరుత్పత్తి కూడా నశించిపోయే ప్రమాదముండేది. అయితే ఈ పని విభజన పురుషాధిపత్యానికి మాత్రం దారి తీయలేదు. కీలకనిర్ణయాలు తీసుకోవడంలో స్త్రీ పురుషులు సమానంగా పాలుపంచు కునేవారు. ఉదాహరణకు స్థావరాన్ని ఎప్పుడు మార్చాలి లేదా ఒక బృందాన్ని వదలి మరో బృందంతో జతకట్టాలా వద్దా అనే నిర్ణయాలను ఉమ్మడిగా తీసుకునేవారు. దాంపత్య బంధం కూడా నిర్దిష్టంగా ఉండేది కాదు. భార్యాభర్తల్లో ఎవరైనా హఠాత్తుగా విడిపోవచ్చు. అయితే తమ జీవనోపాధి లేదా పిల్లల మనుగడకు ముప్పు రాకుండా జాగ్రత్త పడేవారు. మానవ నైజం అంటూ చెబుతూ వచ్చిన పురుషాధిపత్యం ఇక్కడ మచ్చుకైనా కనిపించేది కాదు.[24]

చివరగా, వ్యక్తిగత ఆస్తులపై ప్రజలకు అంత ఆసక్తి ఉండేది కాదు. నేడు ఈ స్వార్థస్వభావం సర్వవ్యాపితంగా ఉంది. స్థావరం ఏర్పాటు చేసుకున్న ప్రాంతంలో ప్రతి రోజు సరిపడా ఆహారాన్ని సేకరించడానికి అవసరమయ్యే సభ్యుల వరకే ఒక బృందం పరిమితమయ్యేది. అలాంటి ప్రాంతంలో వ్యక్తిగత సభ్యులు ఒక ఆధారం నుండి మరో ఆహారపంట ఆధారం వరకు నిరంతరంగా తిరుగుతూ ఉండేవారు లేదా జంతువులను వేటాడుతూ ఉండేవారు. మరోవైపు ఆ ప్రాంతంలో ఆహార సరఫరాలన్నీ అంతరిస్తే బృందం మొత్తం తరలిపోయేది. అలా తరచూ ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి మకాం మారుస్తూ ఉండేవారు. దీనివల్ల సంపదను పోగు చేసే అవకాశమే తలెత్తేదికాదు. ఒక వేళ సంపదను కూడబెట్టినా దానిని నిరంతరం మోసుకెళ్లడం సాధ్యమయ్యే పనికాదు. కాదూకూడదు అంటే వ్యక్తిగత పరికరాలు (విల్లు, ఈటె, బాణాలు) ఒక సంచి, కొన్ని చిన్న చిన్న వస్తువులు మాత్రమే బృందం సభ్యుల వద్ద ఉండేవి. వ్యక్తిగత సంపద అనే సిద్ధాంతం ఏ మాత్రం అమలులో ఉండేది కాదు. అప్పటి మానవులు జీవించిన భౌతిక పరిస్థితులు పూర్తిగా భిన్నమైన సమాజాలను, భిన్నమైన సిద్ధాంతాలను మలిచాయి.

గత కొద్ది వేల సంవత్సరాల మానవ చరిత్ర మొత్తమ్మీద విభిన్న సమాజాలు, విభిన్న సిద్ధాంతాలు ఎలా అభివృద్ధి చెందాయో సూచించే చరిత్ర. ఆ చరిత్ర అసంఖ్యాకమైన స్త్రీ పురుషుల చర్యలతో అల్లబడింది. ప్రతివ్యక్తి తన జీవితాన్ని మెరుగు పరుచుకునేందుకు, తన సహచరుల, అభిమానుల జీవితాలను తీర్చిదిద్దేందుకు, ప్రపంచంతో సర్దుకుపోయేందుకు కృషి చేసేవాడు. కొన్నిసార్లు ప్రపంచాన్ని మార్చేందుకు తీవ్రంగా ప్రయత్నించి అప్పుడప్పుడు విజయం సాధించే వారు. అయినా ఈ అంతులేని, పరస్పరం ముడిపడి ఉన్న కథల్లో రెండు విషయాలు స్పష్టంగా వెల్లడవుతాయి. ఒకవైపు ప్రకృతి నుండి జీవనోపాధిని మలచడంలో మానవుల సామర్థ్యంలో గణనీయమైన ప్రగతి కనిపించగా మరోవైపు సమాజ సంఘటన స్వరూపాలు వరుసగా అభివృద్ధి చెందాయి. తొలిదశలో ఆదిమ కమ్యూనిజాన్ని సూచించే భౌతిక పరిస్థితులను మానవులు అధిగమించారు. తర్వాత దశలో దోపిడీ, దౌర్జన్యాలతో కూడిన సమాజాన్ని నిర్మించారు. ఇలాంటి సమాజంలో మెజారిటీ ప్రజలు స్వల్ప సంఖ్యలో ఉన్న బలవంతుల చేతిలో దోపిడీకి గురవుతారు.

సమాంతరంగా సంభవించిన ఈ మార్పులను అధ్యయనం చేస్తే 21వ శతాబ్దంలో అడుగిడిన నేటి ప్రపంచం ఎలా ఉద్భవించిందో అర్థమవుతుంది. మన ముత్తాతలు కూడా ఊహించని విధంగా నేటి ప్రపంచం భారీ ఎత్తున సంపదను సృష్టించగలుగుతోంది. అయితే వర్గపాలనా వ్యవస్థలు, దౌర్జన్యం, హింస నేటి ప్రపంచంలో ఎప్పటిలాగే గట్టిగా పాతకుపోయాయి. వందలకోట్ల మంది దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. ఇంకా వందల కోట్ల మంది అభద్రత, యుద్ధాలు, అంతర్యుద్ధాలతో సతమతమవుతున్నారు. పట్టపగ్గాల్లేని సాంకేతిక అభివృద్ధివల్ల మానవ జీవన ప్రధాన ఆధారాలే ముప్పును ఎదుర్కొంటున్నాయి. ఇప్పుడు మన ముందు ఉన్న ప్రధాన ప్రశ్న ఒక్కటే : "మానవుని మౌలిక అవసరాలను తీర్చడానికి అందుబాటులో ఉన్న సంపదను వినియోగించడం సాధ్యమేనా? దోపిడీ వ్యవస్థలను రూపుమాపి, సమాజాన్ని ఆదిమ కమ్యూనిజం విలువల ఆధారంగా తీర్చిదిద్దగలమా?" అయితే ముందుగా మనం వర్గపాలన, రాజ్యవ్యవస్థ ఎలా అవతరించాయో తెలుసుకోవడం చాలా అవసరం.

ఒకటవ అధ్యాయం

# నవీన రాతి యుగ విప్లవం

ప్రజల జీవితాల్లో తొలిసారిగా భారీ మార్పులు చోటు చేసుకుంది 10,000 సంవత్సరాల క్రితమే. ప్రపంచంలోని కొన్ని ప్రాంతాల్లో, ముఖ్యంగా పశ్చిమాసియాలోని సారవంతమైన చంద్రవంక ప్రాంతంలో, ప్రజలు జీవనోపాధికి కొత్త మార్గాలను ఎంచుకున్నారు.[25] ప్రకృతిపై ఆధారపడడం మాని పంటలను సాగుచేయడం నేర్చుకున్నారు. పశువులను వేటాడడంమాని వాటిని పోషించడం మొదలుపెట్టారు. ఈ వినూత్నమైన పోకడ ప్రజల జీవన విధానాన్ని పూర్తిగా మార్చివేసింది.

అయితే ఈ మార్పు ప్రజల జీవితాలను వారి పూర్వీకుల కంటే సౌకర్యవంతంగా మాత్రం తీర్చిదిద్దలేదు. కాని వాతావరణ మార్పులు ప్రజలకు పరిమితమైన ప్రత్యామ్నాయాలనే కల్పించాయి.[26] వేట, సేకరణ ద్వారా ఆహారాన్ని సమకూర్చుకోవడం వారికి రెండు నుండి మూడు వేల సంవత్సరాలకు పైబడి అలవాటుపడిపోయింది. ఉదాహరణకు ఆగ్నేయ టర్కీలోని ఒక సంచారజాతి (కుటుంబాల సమూహం) ఎక్కువగా కష్టపడకుండానే సంవత్సరమంతా జీవితం గడిపేది. ప్రకృతిలో సహజంగా పెరిగే మొక్కల ద్వారా లభించే ధాన్యాలను మూడు వారాల పాటు సేకరించి మిగతా సంవత్సరమంతా వాటిపై ఆధారపడి గడిపేవారు.[27] ఇతర ప్రజల మాదిరిగా సంవత్సరం పొడవునా ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వలస వెళ్ళాల్సిన అవసరం వారికి ఏర్పడేది కాదు. ఒకే ప్రాంతంలో వారు సంవత్సరాల తరబడి నివసించేవారు. తమ గుడారాలను శాశ్వత కట్టడాలుగా తీర్చిదిద్దుకున్నారు. చిన్న సమూహాల స్థానంలో వందల మంది ఈ గ్రామాల్లో నివసించడం మొదలుపెట్టారు. ఆహార పదార్థాలు, తిండి గింజలను రాతి, మట్టి కుండల్లో భద్రపరచడం నేర్చుకున్నారు. ఆధునిక రాతి పరికరాలను తయారు చేసుకున్నారు. ప్రాచీన రోమను సామ్రాజ్యం నుండి నేటి వరకు గడిచిన సమయం కంటే ఎక్కువగా ప్రజలు ఈ

విధమైన జీవితాన్ని గడిపారు. తక్కువ శ్రమ (వేట సముదాయాలవలే), శాశ్వత గ్రామీణ జీవనం కలబోసిన జీవన విధానం అమల్లో ఉండేది.

కాని వాతావరణ మార్పులు ఇలాంటి జీవన విధానం ద్వారా సరైన మనుగడ సాగించడానికి ప్రజలను అనుమతించలేదు. సారవంతమైన చంద్రవంక ప్రాంతంలో వాతావరణం పొడిగా, శీతలంగా మారడంతో సహజంగా లభించే ధాన్యాలు కూడా అంతరించిపోయాయి. జింక జాతి పశువులు కూడా తగ్గిపోయాయి. గ్రామాలు సంక్షోభంలో పడ్డాయి. ప్రజలు ఎప్పటిలాగే జీవితాన్ని గడపలేకపోయారు. ఆకలితో చావకుండా ఉండాలంటే వారు చిన్న బృందాలుగా విడిపోవాల్సి వచ్చింది (సంచార జీవితం) లేదా తమ స్వంత కష్టం ద్వారా ప్రకృతి సృష్టించిన లోపాలను పూడ్చుకోవలసి వచ్చింది.

ఈ మార్గం వ్యవసాయానికి దారి తీసింది. అరణ్య జీవితంలో కొన్ని వేల సంవత్సరాలు గడిపిన అనుభవం ఉండడంతో మానవులకు మొక్కల జీవితంపై చాలా పరిజ్ఞానం సమకూరింది. కొన్ని సముదాయాలు ఈ పరిజ్ఞానాన్ని ఆహార సరఫరాలు నిరంతరంగా పొందడానికి ఆచరణలో పెట్టాయి. అడవి మొక్కల విత్తనాలను భూమిలో పాతడం మొదలుపెట్టాయి. నిరంతర పరిశీలన ద్వారా కొన్ని మొక్కల విత్తనాలు ఇతర విత్తనాల కంటే ఎక్కువ ఫలాలను అందిస్తాయని గ్రహించాయి. అలాంటి విత్తనాలను ఎంచుకోవడం ద్వారా వారు కొత్త వంగడాలను సాగు చేయడం ప్రారంభించారు. అడవి మొక్కల కంటే ఈ కొత్త వంగడాలు వారికెంతో ఉపయోగకరంగా మారాయి. వరుసగా అందిన పంటలవల్ల వారు పశువులను కూడా పెద్ద సంఖ్యలో పోషించడం మొదలుపెట్టారు. అడవి మేకలు, గొర్రెలు, సాధు జంతువులు, గాడిదలు, పోషించడానికి వీలుపడే ఇతర పశువులను కూడా వారి ఇంటి ఆవరణలో పెంచడం ప్రారంభించారు.

వ్యవసాయం తొలి స్వరూపం (పండ్ల తోటల తరహాలో) లో చెట్లు, పుట్లను గొడ్డళ్ల సహాయంతో తొలగించి భూమిని సాగుకు సిద్ధం చేయడం, విత్తనాలను నాటడం చేసేవారు. విత్తనాలను నాటడానికి వీలుగా భూమిని కర్రల సహాయంతో దున్నేవారు. కొన్నేళ్లకు ఆ భూమి ఎలాగూ పనికి రాకుండా పోతుంది. దానిని ప్రకృతికి వదిలేసి కొత్త ప్రదేశాన్ని వ్యవసాయానికి సిద్ధం చేసేవారు.

ఈ పద్ధతిలో జీవనోపాధిని అర్జించడం వల్ల శ్రమ, సామూహిక జీవనంలో విప్లవాత్మకమైన మార్పులు చోటు చేసుకున్నాయి. గతం కంటే ఎక్కువగా ప్రజలు తమ గ్రామాల్లోనే పాతుకుపోయారు. విత్తడం మొదలుకొని కోత వరకు పంటను జాగ్రత్తగా కాపాడుకోవలసి రావడంతో నెలల తరబడి సంచరించే అవకాశం లేకుండా పోయింది. భూములను వ్యవసాయానికి సిద్ధం చేయడానికి, పంట రక్షణకు (కలుపు నివారణ, నీటి సరఫరా మొదలైనవి)

పంట దిగుబడిని భద్రపరచడానికి, నిల్వలను పంచుకోవడానికి,పిల్లల సంరక్షణకు అనేక మార్గాల్లో ఉమ్మడి సహకారాన్ని నిర్దేశించేవారు. సామాజిక జీవితంలో కొత్త పోకడలు అభివృద్ధి చెందాయి. వాటితోపాటు ప్రపంచం పట్ల విభిన్న వైఖరులు ఏర్పడ్డాయి. ఆచార వ్యవహారాలు, శుభకార్యాలు, వివిధ విశ్వాసాల్లో అవి ప్రస్ఫుటమయ్యాయి.

ఈ మార్పును సాధారణంగా నవీన రాతియుగ విప్లవమని పరిగణిస్తారు.[28] ఈ విప్లవానికి అధునాతన రాతి పరికరాల అభివృద్ధే ఆధారం. ప్రజల జీవన విధానం, పని సంస్కృతిలో పూర్తిగా మార్పులు చోటు చేసుకున్నాయి. కాని ఈ ప్రక్రియ సుదీర్ఘకాలంపాటు కొనసాగింది.

సారవంతమైన చంద్రవంక ప్రాంతంలో జరిపిన పురావస్తు తవ్వకాల్లో లభించిన సాక్ష్యాధారాల ప్రకారం ప్రజలు చిన్నచిన్న గ్రామాల్లో వేర్వేరు నివాసాల్లో గడిపేవారు. అయితే ఈ నివాసాల్లో కుటుంబ స్వరూపం ఎలా ఉండేదో మనకు తెలియదు. ఉదాహరణకు కుటుంబం భార్యాభర్తలు, వారి పిల్లలతో కూడి ఉండేదా లేదా తల్లి, ఆమె కూతురు, వారి భర్తలతో కలిపి ఉండేదా లేదా తండ్రి, అతడి కొడుకులు, వారి భార్యలతో కూడి ఉండేదా అన్న విషయం పూర్తిగా తెలియరాలేదు.[29] అప్పటికి కూడా వర్గాన్ని పోలి ఉండే వ్యవస్థ కాని రాజ్య వ్యవస్థ కాని ఏర్పడలేదు. వ్యవసాయం చేపట్టిన తర్వాత వేల సంవత్సరాల వరకు ఈ వ్యవస్థలు ఆవిర్భవించలేదు. క్రీస్తు పూర్వం 4000 సంవత్సరాల వరకు ఉన్న చివరి ఉర్బాయిడ్ కాలంలో సంపదలో అసమానతలు అంత స్పష్టంగా వ్యక్తమయ్యేవి కావు. అలిఖిత చరిత్ర కాలంలో కూడా (క్రీ.పూ.3000 వరకు) సామాజిక వర్గీకరణ ప్రక్రియలు చోటు చేసుకున్నట్లు ఆధారాలేవీ లేవు.[30] అలాగే పురుషాధిక్య సమాజ ఛాయలు కూడా లేవు. కొందరు పురాతత్వశాస్త్రవేత్తలు మహిళల మట్టి లేదా రాతి విగ్రహాలను కనుగొన్నారు. దీనిని బట్టి సమాజంలో మహిళలకు అత్యున్నత స్థానం ఉండేదని, పురుషులు వారిని ఆరాధించేవారని బోధపడుతుంది.[31] అయితే ఒక్క పరిణామం మాత్రం స్పష్టంగా విదితమవుతుంది : ఈ కాలంలో యుద్ధతంత్రానికి ఆయుధాలు, అలాగే వేటకు ఉపయోగించే సాధనాలు చాలా వరకు అభివృద్ధి చెందాయి.

వ్యవసాయ – ఆధారిత సమాజాల్లో ఇదే వ్యవస్థ ఇటీవలి కాలం వరకు కొనసాగింది. 20వ శతాబ్దంలో కూడా ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో ఇలాంటి సామాజిక వ్యవస్థ కొనసాగింది. ఈ సమాజాలు చాలా వరకు భిన్నంగా ఉన్నా కొన్ని మౌలిక లక్షణాలను కలిగి ఉండేవి.[32]

కుటుంబాలు కొన్ని ప్రత్యేక భూభాగాలను సాగు చేసేవి. కాని భూమిపై వ్యక్తిగత యాజమాన్యం ఉండేది కాదు. వ్యక్తులు కాని, కుటుంబాలు కాని పెద్ద ఎత్తున ధాన్యాన్ని నిల్వ చేసిన సందర్భాలు కూడా ఎదురుకాలేదు. అందుకు భిన్నంగా కుటుంబాలు సామాజిక బృందాలుగా అనుసంధానమై ఉండేవి. వంశం ఆధారంగా కుటుంబాలు సమీకృతమయ్యేవి.

ఈ సామాజిక బృందాలు, వంశాలు వ్యక్తులకు, కుటుంబాలకు కొన్ని స్పష్టమైన హక్కులను, విధులను నిర్ధారించాయి. వియ్యం, స్నేహ సంబంధాల ఆధారంగా ఆయా కుటుంబాలు ఇతరులపట్ల బాధ్యతలు కలిగి ఉండేవి. సమ వయస్కుల బృందాలు కూడా ఉండేవి. ఒక్కో బృందం ఇతర బృందాలతో ఆహారాన్ని పంచుకునేది. అలా ఏ కుటుంబమూ పంట వైఫల్యంవల్ల నష్టపోకుండా ఆదుకునేవారు. ఎక్కువ సంతానం ఉన్న కుటుంబం కూడా ఆహార కొరతను ఎదుర్కొనేది కాదు. వ్యక్తిగత వినియోగం ద్వారా ప్రతిష్ట రావడం కంటే ఇతరులకు సహాయం చేసే సామర్థ్యంపైనే ప్రతి కుటుంబం హోదా నిర్ధారణ అయ్యేది.

వేట–సేకరణ సమాజాల మౌలిక విలువలు ఎన్నో ఈ సమాజాలను కూడా శాసించేవి. వర్గ సమాజాల విలువలను మనం ఎలాంటి సంకోచం లేకుండా స్వీకరిస్తాము. కాని ఈ కాలపు సమాజాలు అలాంటి విలువలకు దూరంగా ఉండేవి. ఐరోకోయిస్ వ్యవసాయ సమాజాలను అధ్యయనం చేసిన 18వ శతాబ్దపు పరిశీలకుడు ఒకరు ఇలా వ్యాఖ్యానించారు: "ఆకలితో అలమటించే ఒక ఐరోకోయిల బృందం ఆహార నిల్వలు ఓ మోస్తరు కలిగి ఉన్న బృందాలను ఆశ్రయిస్తే ఎలాంటి అభ్యర్థన లేకుండానే అవి కొత్తవారికి ఆహారాన్ని సమకూర్చేవి. తమ సహాయం కోరి వచ్చిన వారికి ఆహారం అందిస్తే భవిష్యత్‌లో తాము కూడా వారితోపాటు ఆకలికి గురి కావలసి వస్తుందన్న ఆందోళన ఐరోకోయి బృందాల్లో లేశమాత్రంగా కూడా ఉండేది కాదు."[33] న్యూయెర్ సమాజాన్ని అధ్యయనం చేసిన ఒక నిపుణుడు ఇలా రాశాడు : "ఒక్క విషయం స్పష్టంగా చెప్పగలము. అందరూ ఆకలితో అలమటిస్తుంటే తప్ప న్యూయెర్ గ్రామాల్లో ఒక్కరు కూడా ఆకలి దప్పులతో బాధపడేవారు కాదు."[34]

అందరికీ మేలు చేయాలన్న ఇలాంటి భావనకు జీవనోపాధిని సంపాదించే అవసరాలే నేపథ్యం. ఉదాహరణకు శ్రమ చేయడానికి చాలా చేతులు, పోషించడానికి తక్కువ నోర్లు ఉన్న కుటుంబాలు శ్రమశక్తి లేని (సాధారణంగా చిన్న పిల్లలు ఎక్కువ ఉన్న) కుటుంబాలను పోషించడం ఒక ఆచారంగా కొనసాగేది.[35] గ్రామం మొత్తంలో పిల్లలు భవిష్యత్తు కార్మికులుగా పరిగణించబడేవారు. భవిష్యత్‌లో మనుగడ సాగించాలంటే పిల్లలను సంరక్షించడం కీలకమని భావించేవారు. ఆ విధంగా ఆహార సరఫరాలను పునఃపంపిణీ చేసేవారు.

వేట, సేకరణ పద్ధతిలో మహిళలు ఆహార సేకరణకు పిల్లలను కూడా వెంట పెట్టుకొని వెళ్లాల్సి ఉంటుంది కాబట్టి సంతానోత్పత్తి చాలా తక్కువగా ఉండేది. తరచూ స్థావరాలు మారడం వల్ల కూడా జనాభా పెరుగుదల అంతంత మాత్రంగానే ఉండేది. మహిళలు ఒక్క సంతానం కంటే ఎక్కువగా భరించే స్థితిలో ఉండేవారు కాదు. అందుకే గర్భధారణను ప్రతి మూడేళ్లకో, నాలుగేళ్లకో నిర్ధారించేవారు. దాంపత్యజీవితం నుండి దూరంగా ఉండడం లేదా గర్భస్రావం ద్వారా ఈ పద్ధతిని అమలు చేసేవారు. గ్రామంలో వ్యవసాయాధార జీవితం ప్రబలడం, తరచూ మకాం మార్చాల్సిన అవసరం తలెత్తకపోవడంతో పిల్లలను ఎల్లప్పుడూ మోసుకెళ్లాల్సిన

బాధ తప్పింది. ఎంత ఎక్కువ మంది పిల్లలుంటే భవిష్యత్తులో అంత ఎక్కువగా భూమిని సాగు చేసే అవకాశం ఉండేది. కనుక పెద్ద కుటుంబాలకు ప్రాధాన్యతనిచ్చేవారు. ఉత్పత్తి మార్గాల్లో మార్పులు రావడంతో పునరుత్పత్తిపై చాలా ప్రభావం పడింది. జనాభా విస్తరించడం మొదలుపెట్టింది. ప్రస్తుత అభివృద్ధి రేటు కంటే (0.1 శాతం/ సంవత్సరానికి) తక్కువే అయినా రెండు వేల సంవత్సరాల్లో ప్రపంచ జనాభా నాలుగు రెట్లు పెరిగింది.[36] నవీన రాతియుగ విప్లవం సమయానికి కోటి వరకు ఉన్న జనాభా క్యాపిటిలిజం ఆవిర్భవించే సమయానికి 20 కోట్లకు చేరుకుంది.

వేట–సేకరణ సమాజాల కంటే వ్యవసాయ–ఆధారిత సమాజాల్లో ఇతర మార్పులు కూడా పెద్ద ఎత్తున చోటు చేసుకున్నాయి. వేట సమాజాల్లో పెద్ద సమస్య తలెత్తితే వివాదానికి కారణమైన పక్షాలలో ఒకదానిని బహిష్కరించడం ద్వారా పరిష్కరించేవారు. లేదా సంబంధిత వ్యక్తులు సముదాయం వదలి వెళ్లేవారు. వ్యవసాయదారులకు ఈ అవకాశం చాలా తక్కువగా ఉండేది. భూమిని వ్యవసాయానికి సిద్ధం చేసి నారు పోసిన తర్వాత ఎవ్వరినీ గ్రామం నుండి వెలివేసే సమస్య తలెత్తేదికాదు. గ్రామం విస్తారంగా ఉండేది. ప్రజల మధ్య అనేక రకాల సంబంధాలుండేవి. అయితే ఈ గ్రామాలకు ఎవ్వరికీ ఎదురు కాని సమస్య ఒకటి ఉండేది. నిల్వ చేసిన ధాన్యాలను, హస్తకళాకృతులను బయటివారు దాడి చేసి దోచుకునే అవకాశం ఎక్కువగా ఉండేది. ఫలితంగా సామాజిక నియంత్రణ కొరకు నిర్ణయ–నిర్ధారణ ఏర్పాట్లు అవసరమయ్యాయి. పెద్ద మనుషులతో కూడిన మండళ్లు అలా ఆవిర్భవించాయి. ఒక్కో వంశం నుండి ఒక్కో ప్రతినిధికి మండలిలో అవకాశం కల్పించేవారు.

ప్రపంచంలోని చాలా ప్రాంతాలలో ప్రజలు వేట, సేకరణ పద్ధతులను వదలి వ్యవసాయం చేసుకుంటూ గ్రామాల్లో స్థిరపడ్డారు. ఈ ప్రక్రియ పది వేల సంవత్సరాల వరకు కొనసాగింది. గ్రామాలు సర్వస్వతంత్రంగా వ్యవహరించేవి. అలా మెసో–అమెరికా (నేటి మెక్సికో, గౌటిమాలా), దక్షిణ అమెరికాలోని ఆండియన్ ప్రాంతం, ఆఫ్రికాలోని మూడు వేర్వేరు ప్రాంతాల్లో, ఇండోచైనా, చైనా, పపువా న్యూగినియాలోని లోయల్లో గ్రామాలు విస్తరించాయి.[37] మెసపటోమియా తరహాలో ప్రతి ప్రాంతంలోనూ మార్పులు చోటు చేసుకున్నాయి. అందుబాటులో ఉన్న మొక్కలు, పశువులు ఈ మార్పుల తీవ్రతను నిర్దేశించాయి. ఒక జాతి లేదా సంస్కృతికి ప్రత్యేక హోదా ఉండేదని, అలాంటి జాతే మానవాళిని ముందుకు నడిపిందన్న వాదనను ఈ సాక్ష్యాధారాలు తిప్పికొడతాయి. వాతావరణం, పరిసరాల్లో మార్పులు రావడం వల్లే ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో నివసించే వివిధ మానవ సముదాయాలు మనుగడ కోసం కొత్త కొత్త పద్ధతులను, మార్గాలను అన్వేషించాల్సి వచ్చింది. ఊహించని విధంగా తమ జీవన విధానాన్ని మార్చుకోవలసి వచ్చింది. ప్రతి సముదాయం విషయంలో ప్రజలు సంచార జీవితాన్ని వదలి

వ్యవసాయ-ఆధారిత గ్రామీణ జీవితానికి అలవాటు పడాల్సి వచ్చింది. వంశాలు, సామాజిక ప్రవర్తన నియమాలు, మతపరమైన ఆచార వ్యవహారాలతో వారి జీవితాన్ని తీర్చిదిద్దుకున్నారు.[38]

పపువా న్యూగినియా ఎగువ ప్రాంతాల్లో ఒక స్వతంత్రమైన వ్యవసాయ విధానం అభివృద్ధి చెందింది. క్రీస్తు పూర్వం 7000 నాటికి ఇక్కడి ప్రజలు వివిధ రకాల పంటలను సాగు చేయడం మొదలుపెట్టారు. చెరుకు, వివిధ రకాల అరటిపండ్లు, పౌష్టికమైన గడ్డలు, వేర్లు, పచ్చటి కూరగాయలు, ఇతర వంగడాలను పండించేవారు. వ్యవసాయంవల్ల వారు స్థిరమైన గ్రామీణ జీవితానికి అలవాటుపడ్డారు. బంధువర్గం ఆధారంగా సామాజిక వ్యవస్థ ఉండేది. సమసమాజ భావనతో అన్ని కుటుంబాలు వ్యవహరించేవి. భూములపై వ్యక్తిగత యాజమాన్యం అంటూ ఉండేది కాదు. తీరానికి చాలా దూరంగా దట్టమైన లోయల్లో ప్రజలు ఈ విధంగా జీవించేవారు. 1930 తొలి నాళ్లలో పశ్చిమ దేశాల వ్యాపారులు ఈ భూభాగంపై అడుగుపెట్టేవరకు వారు బయటి ప్రభావాలు, పరిణామాలకు దూరంగా ఉండేవారు.

తొలి సమాజాలు చాలా మటుకు వ్యవసాయాన్ని చేపట్టలేదు. అనవసరమైన శ్రమ ఎందుకన్న ధోరణితో మార్పును చాలా కాలం వరకు అడ్డుకున్నాయి. వేట, సేకరణ ద్వారా జీవితాన్ని సునాయసంగా గడపవచ్చన్న భావన ఆయా సమాజాల్లో ఉండేది. కొందరు కాలిఫోర్నియా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా లాంటి ఎడారి ప్రాంతాల్లో గడిపారు. అక్కడ సాగు చేయడానికి మొక్కలు కాని, పోషించడానికి పశువులు కాని లభించేవికావు.[39] ఈ ప్రాంతాల్లో నివసించిన మానవులు వేలాది సంవత్సరాల వరకు వేటాడుతూ, ఆహారాన్ని సేకరిస్తూనే జీవితాన్ని గడిపారు. బయటి వారితో సంబంధాలేర్పడి వ్యవసాయం, పశుపోషణ పరిజ్ఞానం లభించే వరకు వారు అలాగే కాలం గడిపారు.[40]

అయితే ప్రపంచంలోని ఒక ప్రాంతంలో ఎక్కడైనా వ్యవసాయం మొదలైతే ఇతర ప్రాంతాలకు కూడా విస్తరించేది. వ్యవసాయంలో ఆశించిన ఫలితాలు సాధించిన సముదాయాలు ఇతరులను వ్యవసాయం చేపట్టమని ప్రోత్సహించేవి. సారవంతమైన చంద్రవంక ప్రాంతం నుండి వచ్చిన వంగడాలు నైలు లోయలో వ్యవసాయ విస్తరణకు ఊతమిచ్చాయి. అలాగే సింధూలోయ, పశ్చిమ ఐరోపాలో కూడా వ్యవసాయం పెద్ద ఎత్తున విస్తరించింది. వ్యవసాయం చేస్తూ సముదాయాలు కొత్త ప్రాంతాలకు వలసపోవడంవల్ల కూడా కొన్ని సందర్భాల్లో వ్యవసాయం విస్తరించింది. ఈ ప్రజలు గ్రామాల నుండి విడిపోయిన తర్వాత సాగుకు అనువైన భూములను అన్వేషిస్తూ కొత్త ప్రాంతాలకు తరలి వెళ్ళారు. ఈ విధంగానే పశ్చిమాఫ్రికాకు చెందిన బంటూ ప్రజలు మధ్య ఆఫ్రికా, అటు తర్వాత ఆఫ్రికా ఖండంలోని దక్షిణ భాగానికి విస్తరించారు. అలాగే ఆగ్నేయ ఆసియాకు చెందిన పాలినేషియన్లు సముద్రాలు దాటి ఆఫ్రికా తీరానికి దగ్గర ఉన్న మడగాస్కర్‌కు, దక్షిణ అమెరికా తీరానికి, 1,500 మైళ్ల దూరంలో వున్న ఈస్టర్ దీవికి, తర్వాత న్యూజీలాండ్‌కు విస్తరించారు.

వ్యవసాయాధారిత సమాజం వేటకారులు, సేకరణదారుల సముదాయాల జీవన విధానాన్ని చాలా వరకు మార్చివేసింది. తమ ఉత్పత్తులను వ్యవసాయదారులతో మార్చుకుంటే తమ జీవితాలు గణనీయంగా మారిపోగలవని ఆదిమ సముదాయాలు గుర్తించాయి. ముఖ్యంగా చేపలు, జంతువుల మాంసం, తోలు అందించి తిండి గింజలు, అల్లిన వస్త్రాలు, మద్యాన్ని పొందేవారు. ఈ ప్రభావం వల్ల కొందరు వ్యవసాయానికి అనుబంధమైన పశుపోషణ వృత్తిని చేపట్టారు. పంటలను సాగు చేయాల్సిన అవసరం లేకుండా వారు పశుపోషణ కార్యక్రమాలను నిర్వహించారు. ఇలాంటి ప్రజలు అనతి కాలంలోనే యురేషియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలోని దక్షిణ ఆండీస్ ప్రాంతంలో ప్రత్యక్షమయ్యారు. తమ నివాస ప్రాంతాలు, వ్యవసాయ గ్రామాల మధ్య తిరుగుతూ మనుగడ సాగించేవారు. కొన్నిసార్లు గ్రామాలపై దాడులు నిర్వహించేవారు. అయితే చాలా వరకు గ్రామాలతో వ్యాపార లావాదేవీలు కలిగి ఉండేవారు. తమదైన సామాజిక జీవనశైలిని వారు అలవర్చుకున్నారు.

వ్యవసాయ విస్తరణ, పశుపోషణ అభివృద్ధి సామాజిక జీవితంలో ఒక ముఖ్యమైన మార్పునకు నాంది పలికింది - సమాజం తొలిసారి శ్రేణులుగా చీలిపోయింది. మానవ శాస్త్రవేత్తలు పేర్కొన్నట్లు తొలిసారిగా తెగనాయకత్వాలు లేదా పెద్ద మనుషులు ఆవిర్భవించారు. కొందరు వ్యక్తులు లేదా వంశాలు ఇతరుల కంటే ఎక్కువ హోదాను సంతరించుకున్నారు. ఈ వ్యవస్థ చివరకు అనువంశిక నాయకత్వాలు లేదా ఉన్నత సముదాయాల ఏర్పాటుకు దారి తీసింది. అయినా కూడా ఈ వ్యవస్థలు వర్గ విభజన లాంటి పరిణామాలకు ఊతమివ్వలేదు. అలాగే సమాజంలోని ఒక వర్గమే భౌతిక సంపదను ఎక్కువగా వినియోగించడం కాని మెజారిటీ ప్రజలు ఉత్పత్తి కోసం నిరంతరం శ్రమించడం కాని జరగలేదు. సమానత్వ భావన, పంచుకునే తత్వం సర్వవ్యాపితంగా ఉండేది. సమాజంలో ఎక్కువ హోదా గల వారు సముదాయంలోని ఇతరులకు సేవ చేయాలే తప్ప వారిపై ఆధారపడి జీవించకూడదు. రిచర్డ్ లీ పేర్కొన్నట్లు ఆదిమ సమాజాల్లో మాదిరిగా ఈ సమాజాల్లో కూడా సముదాయ లేదా ఉమ్మడి ఆస్తి సూత్రాలు (విలువలు) బలంగా ఉండేవి. "కప్పం రూపంలో తెగ నాయకులు పొందే ధాన్యాన్ని, పశువులను సముదాయంలోని తక్కువ శ్రేణి ప్రజలకు పునఃపంపిణీ చేసేవారు. ప్రజాభిప్రాయం,సముదాయ సంస్థల ఆధారంగా నాయకుని అధికారాలపై నియంత్రణ, అదుపు ఉండేవి."[41]

ఆ విధంగా దక్షిణ అమెరికాలోని నంబీక్వారా సమాజంలో దయాగుణమే అధికార లక్షణంగా ఉండేది. నాయకుడు తన ఆధీనంలోని ఆహారం, పరికరాలు, ఆయుధాలు, నగల అదనపు నిల్వలను వ్యక్తిగత, కుటుంబ లేదా సముదాయ అభ్యర్థన మేరకు పునఃపంపిణీ చేయడానికి సిద్ధంగా ఉండాలి. తన కింది స్థాయి వారి కంటే ఎక్కువ కష్టాలను అనుభవించినా సరే నాయకుడు ప్రజల అవసరాలను తీర్చడానికి ఎల్లప్పుడూ ముందుండాలి.[42] ఉదాహరణకు, న్యూగినియాకు చెందిన బుసామా ప్రజల్లో సముదాయ నాయకుడు ఇతరులకంటే ఎక్కువ

కష్టపడి తన ఆహార నిల్వలను సమకూర్చుకునే వాడు. అతడు వేకువజాము నుండి పొద్దుగడిచే వరకు కష్టపడాలి. "భూమి నుండి అతడి చేతులు ఎప్పుడూ వేరుపడేవి కావు. అతడి నుదురు చెమటతో ఎప్పుడూ తడిగా ఉండేది," అని నిర్ధారించబడింది.[43]

నవీన రాతి యుగం వ్యవసాయం వైపు మొగ్గు చూపడంతో ప్రజల జీవితాలు మారిపోయాయి. గ్రామీణ జీవనంతోపాటు యుద్ధతంత్రం కూడా విస్తరించింది. దీని వరకైతే అది నిజంగానే విప్లవం అని భావించాలి. కాని సమాజం ఇంకా కొన్ని లక్షణాలకు దూరంగా ఉండేది. వర్గ విభజన, శాశ్వత రాజ్య వ్యవస్థలు (అధికారులు, సైనికులతోకూడిన) మహిళల అణచివేత లాంటివి అప్పటికీ అభివృద్ధి చెందలేదు. జీవనోపాధిని సాధించే మార్గాల్లో రెండవ దశ మార్పులు వచ్చేంత వరకు ఆధునిక సమాజ లక్షణాలను మానవాళి పుణికి పుచ్చుకోలేదు. నవీన రాతియుగ విప్లవాన్ని పట్టణీకరణ విప్లవం కూలదోసే వరకు ఇలాంటి సమాజమే కొనసాగిందని గార్డన్ చైల్డ్ పేర్కొన్నారు.

## రెండవ అధ్యాయం

# తొలి నాగరికతలు

నేడు మనకు అవగాహన ఉన్న నాగరికత కేవలం 5,000 సంవత్సరాల క్రితం ఉద్భవించినదే. ఈజిప్టు పిరమిడ్‌లు, మధ్య అమెరికా పిరమిడ్‌లు, మెసపటోమియా ధ్వజస్తంభాలు, ప్రార్థనాలయాలు, క్రేట్‌లోని నాస్సోస్ రాజభవనం, గ్రీసు ప్రధాన భూభాగంపై వెలసిన మైసీనే కోట, సింధూ నది తీరాన ప్రణాళికాబద్ధంగా నిర్మించబడిన నగరాలు లాంటి భారీ నిర్మాణాలు నాగరికతకు తొలి ఆనవాళ్లు. ఈ కారణంగానే పురాతత్వ (పురావస్తు) శాస్త్రవేత్త గార్డన్ చైల్డ్ ఈ మార్పును 'పట్టణీకరణ విప్లవం' అని పిలిచారు.[44] ఈ అవశేషాలు స్వాభావికంగానే అత్యద్భుతమైనవి. అన్నింటికంటే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ నిర్మాణాలను గతంలో గ్రామీణ జీవనం తప్ప మరొకటి ఎరుగని ప్రజలు చేపట్టడం. ప్రాథమిక వ్యవసాయ పద్ధతులను అనుసరించిన వారు ఇప్పుడు సమగ్రమైన నిర్మాణ నైపుణ్యాన్ని సంతరించుకున్నారు. తవ్వకం, రవాణా, నిర్మాణం, రాతిని ఒలచడం, అద్భుతమైన శిల్పాలను, నక్కాషిని చెక్కడంలో అనూహ్యంగా సామర్థ్యాన్ని పెంచుకున్నారు. మెసపటోమియా, ఈజిప్టు, ఇథోపియా, చైనా, మెసో-అమెరికా విషయంలోనైతే లిపిని అభివృద్ధి పరచి తాము ఎలా ప్రవర్తించామో, ఎలాంటి భావనలకు లోనయ్యామో వివరించగలిగారు. యురేషియా, ఆఫ్రికాలలో వారు ఈ దశలో రాతి మిశ్రమాల నుండి రాగిని, ఇతర లోహాలను పొందగలిగారు. కొంత కాలం తర్వాత వాటిని కాంస్యంతోపాటు కరిగించి నగలు, ఆయుధాలను తయారు చేశారు. కనుక ఈ కాలాన్ని రాగి-కాంస్య యుగాలుగా అభివర్ణిస్తారు.

ప్రజల జీవనోపాధిలో మార్పు రాకుండానే ఈ పరిణామం సంభవించి ఉండదు. వ్యవసాయాధార సమాజంలోనే ఈ మార్పు తొలుత సంభవించి ఉండాలి. ప్రాథమిక పద్ధతులు, సహజంగా లభించే మొక్కలతో ప్రారంభమైన వ్యవసాయం తర్వాతి తరాల్లో నెమ్మదిగా ఉత్పాదకతలో అభివృద్ధిని సాధించి ఉండవచ్చు. తద్వారా కొందరు ఒక మోస్తరు జీవనోపాధిని పొంది ఉండవచ్చు. అలాగే జీవితాన్ని చాలా వరకు హాయిగా గడిపి ఉండవచ్చు.[45] అయితే పరిస్థితులు కొందరు సూచించినట్లు అంత సాధారణంగా, ఉదాత్తంగా ఉండేవి కావు. పెరుగుతున్న జనాభాకు సరిపడే విధంగా మాత్రమే వ్యవసాయోత్పత్తి పెరిగిన సందర్భాలు అనేకం ఉన్నాయి. ప్రకృతి వైపరీత్యాలవల్ల సంభవించే కరవులు, వరదలు, ఈదురుగాలులు, మంచు, గాలివానలతో ప్రజలు తీవ్రంగా నష్టపోయారు.[46] ఉదాహరణకు అమెరికా (మెసో)కు చెందిన పూర్వ హిస్పానిక్ ప్రజలు కరువు కాటకాలవల్ల కొన్ని సంవత్సరాలపాటు తమను తాము పోషించుకోలేకపోయారు.[47]

సుస్థిరమైన జీవితాన్ని కొనసాగించడానికి ప్రజలకు రెండే మార్గాలుండేవి. ఒకటి, ఆహారం కోసం ఇతర వ్యవసాయ సముదాయాలపై దాడి చేయడం. ఈ విధంగా యుద్ధాలు ఆయా సమాజాల్లో

ప్రధాన లక్షణంగా మారిపోయాయి. రాతితో మలచిన గొడ్డళ్లు, గడ్డపారలు సర్వసాధారణమయ్యాయి. ముఖ్యంగా ఐరోపాలో నవీన రాతియుగ విప్లవ చివరి దశలో ఈ పరిణామం చోటు చేసుకుంది. రెండో మార్గం, అధిక ఫలసాయాన్ని అందించే క్రియాశీల వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడం. ఈ ప్రక్రియలో సాంకేతిక పరిజ్ఞానానికి అధిక ప్రాధాన్యత ఇచ్చేవారు.

అలాంటి వ్యవసాయాన్ని చేపట్టిన సముదాయ ప్రజలు కరవు సంభవించినా తట్టుకొని నిలబడగలిగేవారు. అలా చేయని వారు అంతరించిపోయారు లేదా కృశించిపోయారు. పరిజ్ఞానమంటే పంట వంగడాలను అభివృద్ధి పరచడం లేదా పశువుల కాయాన్ని పెంచడమనే అర్థాన్ని స్ఫురింపచేస్తుంది. అయితే సాంకేతిక ప్రగతి అధికోత్పత్తి లేదా విప్లవాత్మకమైన మార్పులను కూడా సూచిస్తుంది. అందులో ముఖ్యమైనది యురేషియా, ఆఫ్రికాలలో కనుగొన్న నూతన వ్యవసాయ పద్ధతి. అక్కడ పశువుల (తొలుత ఎద్దులు, తర్వాత దశలో గుర్రాలు) సహాయంతో భూమిని దున్నే పద్ధతిని అభివృద్ధి పరిచారు. సాధారణంగా కలపతోనే నాగలిని తయారు చేసేవారు. చేతి పరికరం కంటే పశువుల సహాయంతో భూమిని దున్నితే ఎక్కువ ఫలితాలను సాధించవచ్చన్న స్పృహ అక్కడి ప్రజల్లో బయల్దేరింది. మరో ముఖ్యమైన పరిణామం నీటి వనరుల నిర్మాణం. నీటి వనరులను (డ్యాంలు) నిర్మించడంతోపాటు చుట్టూ గోతులను తవ్వడం ద్వారా పంట మునిగిపోకుండా జాగ్రత్త పడ్డారు. అలాగే పంటకు నీటి ఆధారం నుండి క్రమబద్ధంగా నీటిని సరఫరా చేశారు. మెట్ట భూములను నీటితో తడపడం ద్వారా అవి బీడుగా మారకుండా కాపాడగలిగారు. అనంతరం పశువుల పేడను సహజ ఎరువులుగా వినియోగించి భూసారాన్ని పరిరక్షించగలిగారు. తద్వారా సాగుకు తరచుగా కొత్త ప్రాంతాన్ని అభివృద్ధి పరచాల్సిన అవసరం తలెత్తకుండా నివారించారు. తేమ ప్రాంతాలను ఆరేలా చేయడం, బావుల తవ్వకం, కొండ ప్రాంతాల్లో చుట్టూ కట్టలను నిర్మించడం, అధిక శ్రమతో కూడిన వ్యవసాయం, వరినాట్లు (దక్షిణ చైనా) లాంటి కొత్త పద్ధతులను ప్రపంచంలోని ఆయా ప్రాంతాల్లో అభివృద్ధి పరిచారు.

మానవశ్రమలాగా ఈ కొత్త పద్ధతులకు రెండు పార్శ్వాలు ఉండేవి. ఒకటి అవి ప్రజలకు జీవనోపాధి పొందడానికి అదనపు మార్గాలను కల్పించాయి. మనుగడకు సరిపడా వ్యవసాయోత్పత్తినే సాధించగలిగిన సముదాయాలు ఈ పద్ధతులను అనుసరించి అదనపు ఉత్పత్తిని సాధించి ఆహార నిల్వలను పెంచుకోగలిగాయి. మరోవైపు ప్రజల సామాజిక సంబంధాలలో కూడా మార్పులు వచ్చాయి.

కొత్త పద్ధతులు ఆయా ప్రజల మధ్య సహకార స్వరూపాలపై ఆధారపడి ఉండేవి. ఉదాహరణకు నాగలి వినియోగం స్త్రీ పురుషుల మధ్య పని విభజనను తీవ్రతరం చేసింది. గర్భవతులు లేదా చిన్న పిల్లలున్న స్త్రీలు భూమిని దున్నడం లాంటి కఠిన శ్రమను చేయలేరు కనుక పని విభజన నిర్దిష్టంగా జరిగింది. వ్యవసాయ కాలువల నిర్మాణం, నిర్వహణకు పదులు లేదా వందల సంఖ్యలో కుటుంబాలు సహకరించాల్సిన అవసరముండేది. అలా పనులను పర్యవేక్షించేవారు. శ్రమపడే వారి మధ్య విభజన ఏర్పడింది. ఆహార ధాన్యాల నిల్వ వల్ల గిడ్డంగుల పర్యవేక్షణ, నిర్వహణకు కొన్ని వర్గాలు అవతరించాయి. తొలిసారిగా అదనపు నిల్వలను సాధించడం వల్లప్రజలకు నిరంతరం వ్యవసాయ కార్యకలాపాల్లో మునిగితేలే అవసరం లేకుండా పోయింది. ఖాళీ సమయాన్ని చేతివృత్తులపై వెచ్చించడానికి అవకాశం లభించింది. అలాగే యుద్ధ తంత్రం, ఇతర సముదాయాలతో వ్యాపారం నిర్వహించడానికి ఆస్కారం ఏర్పడింది.

సుమారు 5,000 నుండి 6,000 సంవత్సరాల క్రితం మెసొపొటామియాలో సంభవించిన ఈ మార్పును టైగ్రిస్, యూఫ్రేట్స్ నదీ పరివాహక ప్రాంతాల్లో ప్రజలు స్థిరపడటంగా గార్డన్ చైల్డ్ అభివర్ణించారు. అక్కడి ప్రజలు సారవంతమైన నేలలను అన్వేషించగలిగారు. కాని వాటిని సాగు చేయడానికి నీటి పారుదల సౌకర్యాలను అభివృద్ధి పరచాల్సి వచ్చింది. వ్యవసాయ కాలువల నిర్మాణానికి ఉమ్మడి

శ్రమ అవసరమైంది.[48] ఉమ్మడి సహకారంతోనే వారు కాలువలను నిర్మించగలిగారు. నదుల ఆనకట్టల్లో మార్గాలను తవ్వడం ద్వారా భూములను పెద్ద ఎత్తున సాగు చేయవచ్చన్న విషయాన్ని అక్కడి ప్రజలు గ్రహించారని, తద్వారా వ్యవసాయోత్పత్తిని గణనీయంగా పెంచారని ఇటీవలే మైసేల్స్ సూచించారు. కాని అదనపు దిగుబడిని వారు వెంటనే వినియోగించలేకపోయారు. అందుకే పంట విఫలమైనప్పుడు వినియోగించడానికి వీలుగా కొంత ధాన్యాన్ని నిల్వ చేయడం మొదలుపెట్టారు.[49]

ధాన్యాన్ని పెద్ద గిడ్డంగుల్లో భద్రపరిచేవారు. ఈ గిడ్డంగులు సామాజిక జీవితానికి చిహ్నాలుగా ఉండేవి. ధాన్యాగారాలను కొందరు మాత్రమే పర్యవేక్షించేవారు. సమాజంలో ప్రతిష్టాకరమైన వర్గంగా వారు ఎదిగారు. ఆయా ప్రాంతాల ప్రజల జీవితాన్ని శాసించడం మొదలు పెట్టారు. జనాభా పెరిగే కొద్దీ వారి ప్రభావం కూడా విస్తరించింది. అదనపు నిల్వలను వారు కొత్తగా చేరిన ప్రజలకు పంపిణీ చేసేవారు. సమాజాన్ని నియంత్రించే శక్తులుగా ధాన్యాగారాలు, వాటిపర్యవేక్షకులు అవతరించారు. సమాజ మనుగడకు వారు కీలకంగా మారారు. ఈ వ్యవస్థలకు ప్రజల మన్నన, విధేయత అవసరమయ్యాయి. అనతి కాలంలోనే వారు అతీంద్రియ శక్తులుగా ఎదిగారు. ధాన్యాగారాలు తొలి ప్రార్ధనా మందిరాలయ్యాయి. వాటి పర్యవేక్షకులు తొలి పూజారులయ్యారు.[50] ఇతర సామాజిక వర్గాలు ఈ మందిరాల చుట్టూ స్థిరపడ్డాయి. భవన నిర్మాణం, చేతివృత్తులు, వంట, వస్త్రాల అల్లిక, ఆహార ధాన్యాల రవాణా, సుదూర ప్రాంతాల్లో వ్యాపారం (వస్తు మార్పిడి) తదితర పనులను చేపట్టడం మొదలుపెట్టారు. శతాబ్దాల అనంతరం వ్యవసాయాధార గ్రామాలు పట్టణాలుగా, పట్టణాలు నగరాలుగా రూపాంతరం చెందాయి. అలా ఏర్పడిన తొలి నగరాలలో ఉరుక్, లగాష్, నిప్పూర్, కిష్, ఉర్ (ఈ నగరం నుండే అబ్రహాము వచ్చాడని బైబిల్ చెబుతోంది) ప్రధానమైనవి.

ఇలాంటి ప్రక్రియే సుమారు 2,500 సంవత్సరాల తర్వాత మెసో-అమెరికాలో సంభవించింది. తొలుత నీటి పారుదల అంత ప్రముఖమైన పాత్రను పోషించినట్లు అవగతం కాదు. ఎందుకంటే మొక్కజొన్న విస్తారంగా పండేది. సాధారణ సమయాల్లో కూడా అదనపు నిల్వలు అందుబాటులో ఉండేవి.[51] కాని వరుసగా కరువు సంభవించే అవకాశం ఎక్కువగా ఉండడంతో అదనపు ఉత్పత్తిని నిల్వ చేయడం ప్రారంభించారు. విభిన్న వాతావరణ పరిస్థితులు కలిగిన ప్రాంతాల మధ్య ఏదో ఒక రూపంలో సమన్వయం ఉండేది. నైపుణ్యం కలిగిన ఒక సముదాయం ఉత్పత్తిని పర్యవేక్షించి, వాతావరణాన్ని సూచిస్తూ ధాన్యాగారాల నిర్వహణను కనుక చేపడితే జనాభా మొత్తానికి చాలా ప్రయోజనకరంగా ఉండేది. ఇక్కడ కూడా ధాన్యగారాలు కాలక్రమంలో ప్రార్ధనా మందిరాలుగా, వాటి పర్యవేక్షకులు పురోహితులుగా మారారు. ఫలితంగా ఓల్మెక్, తియోతి హువాకన్, జపోటెక్స్, మాయా నాగరికతలు ఆవిర్భవించాయి. ఎత్తయిన శిల్పాలు, భారీ పిరమిడ్‌లు, ఆలయాలు, ఇటుకతో నిర్మించిన విశాలమైన ఆస్థానాలు, ప్రణాళికాబద్ధంగా నిర్మించిన నగరాలు ఈ నాగరికతలకు ఆనవాళ్లు. (క్రీస్తు శకం తొలి శతాబ్దాల్లో తియోతిహువాకన్ నగర జనాభా సుమారు లక్ష వరకు ఉండేదని అంచనా).

పశ్చిమాసియా, మెసో-అమెరికా రెండు ప్రాంతాల్లో కూడా చారిత్రక ప్రాముఖ్యత కలిగి ప్రక్రియ ఏదో సంభవించింది. ధాన్యాగారాలను పర్యవేక్షిస్తూ అదనపు నిల్వలను ప్రజలకు పంపిణీ చేసే పురోహితుల సముదాయాలు నిల్వల స్థాయిని రాతి లేదా మట్టి నిర్మాణాలపై నమోదు చేయడం ప్రారంభించారు. కాలక్రమంలో కొన్ని వస్తువులను సూచించే బొమ్మల చిత్రీకరణలు నిర్దిష్ట స్వరూపాన్ని సంతరించుకున్నాయి. కొన్నిసార్లు వస్తువుల పేర్లను శబ్ద రూపంలో సూచించే చిత్రీకరణలు కూడా అమల్లోకి వచ్చాయి. ప్రజల ఆలోచనలు, వ్యాఖ్యలను ప్రతిబింబించే శాశ్వత దృశ్యమాలికలు వెలువడే వరకు ఈ పరిస్థితి కొనసాగింది. ఈ విధంగా లిపిని కనుగొన్నారు. ఆలయ సంరక్షకులకు తీరిక ఉండడంతో

రాత్రిళ్లు ఆకాశాన్ని అధ్యయనం చేసి సమగ్రమైన వివరణలు నమోదు చేసేవారు. ముఖ్యంగా చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాల కదలికను సూర్యుని భ్రమణంతో పోల్చేవారు. భవిష్యత్ పరిణామాలను, కదలికలను అంచనా వేసే సామర్థ్యం (సూర్య, చంద్రగ్రహణాలు మొదలైనవి) ఉండడంతో పురోహితులకు దాదాపు దైవహోదా ఏర్పడింది. కాని అదే సమయంలో వారు సూర్యచంద్రుల కదలికల ఆధారంగా తిథులు, తేదీలను రూపొందించడం నేర్చుకున్నారు. ఫలితంగా ప్రజలకు పంటల సాగుకు సంవత్సరంలో అనువైన కాలాన్ని ఎంచుకోవడానికి అవకాశం కలిగింది. ఇలాంటి ప్రయత్నాలు గణితం, ఖగోళశాస్త్రానికి దారి తీశాయి. ఆలయాల్లో ప్రాణం పోసుకున్న ఈ శాస్త్రాలు చాలా వరకు జ్యోతిష్యశాస్త్ర స్వరూపాన్ని పోలి ఉండేవి. గార్డన్ చైల్డ్ పేర్కొన్నట్లు "ఆలయ ధాన్యాగారాల్లో గణనీయమైన సామాజిక ఉత్పత్తి నిల్వ కావడం సాంస్కృతిక ప్రగతికి బాటలు వేసింది. ఈ ప్రక్రియనే మనం నాగరికతకు కొలబద్దగా పరిగణిస్తాము."[52]

మెసొపొటామియా, మెసో-అమెరికాలలో తొలి నాగరికతలు ఒక్కసారి లిపిని అభివృద్ధి పరచగానే వారి సాంగత్యంలోకి వచ్చిన వారు కూడా తమ భాషకు అనుగుణంగా లిపిని తమదైన శైలిలో రూపొందించుకున్నారు. సుమారు 5,000 సంవత్సరాల క్రితం పశ్చిమాసియా ప్రాంతమంతటా లిపి వ్యాపించింది. తర్వాత మధ్య, దక్షిణ, ఆగ్నేయ ఆసియా, నైరుతి ఆఫ్రికా, మధ్యధర ఐరోపాకు విస్తరించింది. ఓల్మెక్‌లు మొదలుకొని మెసో-అమెరికా నాగరికతలన్నీ లిపిని వినియోగించాయి. అయితే ఎలాంటి లిపి లేకుండా పురోగతి సాధించిన కొన్ని నాగరికతలు కూడా ఉన్నాయి. ముఖ్యంగా దక్షిణ అమెరికాలోని నాగరిక సమాజాలు సంకేతాలను జ్ఞాపకసూచికలుగా వినియోగించాయి. సంభాషణలను లిప్యాంతీకరణ చేయాల్సిన అవసరం లేకుండానే అవి నెట్టుకొచ్చాయి.

శ్రమించే వ్యవసాయం నుండి పట్టణ జీవితానికి మానవాళి సాధించిన ప్రగతిని కొన్ని ఉదాహరణలతో సరిపెట్టడానికే ఇక్కడ ఆస్కారం ఉంది. ఈ పరిణామం ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో సంభవించింది. ప్రజలు జీవనోపాధికి కొత్త మార్గాలను అన్వేషించడంతోనే ఈ ప్రక్రియ ప్రారంభమైంది. వ్యవసాయ సమాజాలు ఈ దిశలో పయనించిన సందర్భాలు కూడా ఉన్నాయి. చివరికి భారీ కట్టడాలను (రాతి కట్టడాలు) నిర్మించే స్థాయికి చేరుకున్నాయి. అందుకు ప్రజలను భారీ ఎత్తున సమీకరించగలిగాయి. మాల్టాలో క్రీస్తు పూర్వం నాలుగు నుండి మూడు వేల సంవత్సరాల మధ్య నిర్మితమైన రాతి ఆలయాలు, పశ్చిమ ఐరోపాలోని రాతి వలయాలు (ఇందులో స్టోన్‌హెంజ్ ప్రఖ్యాతిగాంచింది) ఈస్టర్ దీవిలోని భారీ విగ్రహాలు, తహీతిలోని ఎత్తైన వేదికలు అందుకు ఉదాహరణలు.[53] నాగరికతవైపు ప్రస్థానం కొన్నిసార్లు ఇతర ప్రాంతాల్లో చోటు చేసుకున్న పరిణామాల వల్ల ప్రభావితమైంది.[54] కాని ఈ ప్రక్రియలు పట్టణ, నగరాల నిర్మాణానికి దారి తీశాయన్న వాస్తవాన్ని మాత్రం వక్రీకరించలేము. నగరాల అభివృద్ధి లిపిని కనుగొనడానికి ప్రజలకు స్ఫూర్తినిచ్చింది. వ్యవసాయం ఎప్పుడైతే పరిమిత స్థాయి కంటే ఎక్కువగా అభివృద్ధి సాధించిందో సమాజంలో అంతర్గత చలనం వచ్చింది. ఆ మేరకు లిపి ఆయా ప్రాంతాల్లో స్వతంత్రంగా అభివృద్ధి చెందింది. ప్రపంచ ప్రజలలో ఒక వర్గం ఇతరుల కంటే ఉన్నతమైనదన్న (నాగరికతను తొలిగా సాధించడంవల్ల) వాదనను ఈ పరిణామం అర్థరహితమైనదిగా నిరూపిస్తుంది.

## మూడవ అధ్యాయం

# తొలి వర్గ విభజనలు

నాగరికత అభివృద్ధికి మానవాళి మూల్యం చెల్లించుకోవలసి వచ్చింది. నగర సమాజాభివృద్ధిపై తాను రాసిన పరిశోధనా గ్రంథంలో ఆడమ్స్ ఇలా పేర్కొన్నారు. "అలిఖిత చరిత్ర కాలం చిట్టచివరి దశలో 'బానిస బాలిక'ను సూచించే ముద్రికలు కనిపిస్తాయి." క్రీస్తు పూర్వం 3000 సంవత్సరాల క్రితమే బానిసత్వం మొదలైందని మనం అర్థం చేసుకోవలసి ఉంటుంది. తర్వాతి కొద్ది కాలానికి 'మగబానిస'ను సూచిస్తూ ముద్రికలు వెలువడ్డాయి. దీని తర్వాత పౌరుల హోదాను సూచించే పదాలు తొలిసారిగా కనిపిస్తాయి. పౌరులను పూర్తిస్థాయి స్వేచ్ఛా పౌరునిగా, సాధారణ లేదా తక్కువ స్థాయి హోదా కలిగిన పౌరునిగా వర్గీకరించారు.[55] ఈ కాలం నాటికి వర్గ విభజన ఉన్నట్లు స్పష్టమైన సాక్ష్యాధారాలున్నాయి. ప్రాచీన ఎష్నున్నాలో ప్రధాన రహదారుల వెంట ఉన్న నివాస గృహాలు చాలా వరకు 200 చదరపు మీటర్ల వైశాల్యం కలిగి ఉండేవి. మరోవైపు అధిక సంఖ్యలో ఉన్న గృహాలు చాలా పరిమితమైన వైశాల్యం కలిగి ఉండేవి. ఇరుకైన సందులు, అస్తవ్యస్థమైన వీధి రహదారుల ద్వారా ఈ గృహాలు ప్రధాన రహదారితో అనుసంధానమయ్యేవి. చాలా గృహాల వైశాల్యం 150 చదరపు మీటర్లకు మించి ఉండేది కాదు.[56]

**ఆడమ్స్ ప్రకారం :**

> "సామాజిక వర్గీకరణలో అట్టడుగున బానిసలు ఉండేవారు. ఈ వ్యక్తులను కొనుగోలు చేయవచ్చు. అవసరమైతే అమ్ముకోవచ్చు. కేవలం ఒక్క ముద్రికలోనే 205 మంది బానిస బాలికలు, బాలలను నమోదు చేశారు. బహుశా వారు నేత కర్మాగారంలో ఉపాధి పొంది ఉంటారు. ఇతర మహిళలు వంట, మద్యం తయారీ, ధాన్యాల శుద్ధిలో నిమగ్నమై ఉంటారు. మగ బానిసలను సాధారణంగా 'అంధులు'గా పిలిచేవారు. వీరిని తోట పనుల్లో నియమించి ఉంటారు."[57]

సాధారణంగా అయితే నాగరికత ఆవిర్భావాన్ని మానవ చరిత్రలో ఒక గొప్ప ముందడుగుగా పరిగణిస్తారు. ఈ ముందడుగు చరిత్రను ఆదిమ చరిత్ర నుండి వేరు చేస్తుంది.

కాని ఈ ప్రక్రియ ప్రతికూల మార్పులతో కూడుకున్నది. ఎందుకంటే మానవాళి చరిత్రలో తొలిసారిగా వర్గ విభజనలు చోటు చేసుకున్నాయి. స్వల్ప సంఖ్యలో ఉన్న ఉన్నత వర్గం మెజారిటీ వర్గాల శ్రమశక్తిపై జీవించడం మొదలుపెట్టింది. సాయుధ దళాలు, సైనికులు, రహస్య పోలీసు యంత్రాంగాన్ని – ఒక్క మాటలో చెప్పాలంటే రాజ్య వ్యవస్థను- ఏర్పాటు చేసి మిగతా సమాజంపై మైనారిటీ పాలనకు శ్రీకారం చుట్టింది. బానిసత్వం ప్రబలి ఉండడం ఈ విపరీత పరిణామాన్ని సూచిస్తుంది. మెసొపొటామియాలోనే కాకుండా ఇతర తొలి నాగరికతల్లో కూడా బానిస వ్యవస్థ ఉండేది. సామాజిక విభజన ఎంత తీవ్రంగా ఉండేదో దీనిని బట్టి అర్థమవుతుంది. ఉమ్మడి సహకారంపై ఆధారపడ్డ ఆదిమ, గ్రామీణ సమాజాల స్థానంలో వ్యక్తులను భౌతికంగా ఆధీనంలో ఉంచుకునే వ్యవస్థ ప్రబలింది. అయితే మెసొపొటామియా తొలి పాలకవర్గానికి బానిసత్వం అంత ప్రాముఖ్యత కలిగిన అంశంగా ఉండేది కాదు. రైతులు, ఇతర శ్రామికులను దోచుకోవడానికి వారుప్రాధాన్యత ఇచ్చేవారు. ప్రార్థనా మందిరాలు, ఉన్నత వర్గాలకు సేవలందించాల్సిందిగా కార్మికులను, కర్షకులను బలవంతం చేసేవారు. తక్కువ హోదా, స్వేచ్ఛ కలిగిన ఘుబ్-లుగాళ్లు లాంటి కార్మిక వర్గాలు బావ్ ఆలయం లేదా ఎస్టేట్‌లో గొడ్డు చాకిరి చేసేవని చెప్పడానికి చారిత్రక ఆధారాలున్నాయి. ఈ వర్గాలు ఓడలను లాగడం, వ్యవసాయ కాలువలను తవ్వడం, నగర సాయుధ దళాల్లో సైనికులుగా సేవలందించడం లాంటి పనులు చేసేవి. సేవలకు ప్రతిఫలంగా సంవత్సరంలో నాలుగు నెలలపాటు వారికి ఆహార ధాన్యాలు అందించేవారు. ఆలయం లేదా ఎస్టేట్ భూముల్లో కొంత భాగాన్ని వారికి కేటాయించేవారు. ఇలాంటి వర్గాలు గతంలో స్వతంత్ర రైతు కుటుంబాలుగా ఉండేవి. కాని వాటిని శక్తివంతమైన సముదాయాలపై ముఖ్యంగా ఆలయంపై ఆధారపడేలా కృంగదీశారు.

క్రీస్తు పూర్వం 2500 సంవత్సరాల మధ్యకాలంలో వెలసిన లగాష్ నగరంలో లభించిన శిలాశాసనం పురోహితులు ప్రజలను ఎలా దోచుకున్నది, ఉమ్మడి సంపదను తమ స్వంత ఆస్తిగా ఎలా పరిగణించింది, ప్రజలను బానిసలుగా ఎలా మార్చింది వివరిస్తుంది. ఈ శిలాశాసనాన్ని విశదీకరిస్తూ గార్డన్ చైల్డ్ ఇలా రాశారు : "ప్రధాన పురోహితుడు పేదల ఉద్యానవనంలో ప్రవేశించి వారి కలపను స్వాధీనం చేసుకున్నాడు. ఒక పెద్ద మనిషి నివాసం పక్కన సాధారణ పౌరుని నివాసం ఉన్నట్లయితే దానిని అతడు ఎలాంటి పరిహారం చెల్లించకుండా హస్తగతం చేసుకుంటాడు. ఈ శిలాశాసనం వర్గపోరును కళ్లకు కట్టినట్లుగా వివరిస్తుంది. కొత్త ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తి చేసే అదనపు సంపదను పరిమిత సంఖ్యలో ఉన్న ఉన్నత వర్గం తన చేతుల్లో కేంద్రీకరించుకుంది."[59]

దోపిడీ స్థాయి మోతాదు మించే వరకు పెరిగింది. క్రీస్తు పూర్వం 2100 సంవత్సర కాలంలో లగాష్ అనే నగర రాజ్యంలో 12 లేదా అంత కంటే ఎక్కువ సంఖ్యలో ఉన్న ఆలయాలు సాగుభూమి అంతటికి బాధ్యత వహించేవని టిబి జోన్స్ చెబుతారు. దిగుబడిలో

సగభాగం ఉత్పత్తి వ్యయం (కార్మికులకు వేతనాలు, పశువుల మేత తదితర వాటికి) కింద పోగా నాలుగో వంతు రాచరిక పన్నుగా రాజుకు దక్కేది. మిగతా భాగం (25 శాతం) పురోహితులకు వెళ్లేది.[60]

సుమేరియా మహాకావ్యమైన గిల్గామేష్‌లో కథానాయకుడు తాను తాజాగా నిర్మించిన ఉరుక్ ప్రాకారాన్ని చూస్తూ నదిలో తేలియాడుతూ వచ్చిన శవాలను పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లు వివరించబడింది. నిరు పేద పౌరుల జీవితం అలాగే ముగిసి ఉండొచ్చని సిజె గాడ్ పేర్కొన్నారు.[61]

మెసో- అమెరికాలో పరిస్థితి దాదాపు ఇలాగే ఉండేది. తొలి నాగరికత అయిన ఓల్మేక్‌లో కూడా సామాజిక వర్గీకరణ స్పష్టంగా ఉండేదని కాట్జ్ చెప్పారు. "అత్యంత ఖరీదైన కానుకలతో అలంకరించబడ్డ సమాధులు.... ఖరీదైన వస్త్రాలు ధరించిన పెద్ద మనిషి ఎదుట వంగి నమస్కరిస్తున్న వ్యక్తి.... ఇవి పాలకుడిని, అతడి సేవకుడిని సూచిస్తాయి."[62] మాయా నాగరికతలో బయల్పడిన రాజప్రసాదాలు సమాజంలోని అసమానతలను, ఉన్నత వర్గాలు, సాధారణ ప్రజల మధ్య వర్గీకరణను ప్రతిబింబిస్తాయి.[63]

గతంలో దోపిడీ, అణచివేతకు పాల్పడని ప్రజలు ఉన్నట్లుండి అలా ఎందుకు చేయడం మొదలుపెట్టారు? కొత్తగా పుట్టుకొచ్చిన దోపిడీ, అణచివేతలను మిగతా సమాజం ఎందుకు సహించింది? వేట- సేకరణ సమాజాలు, తొలి వ్యవసాయాధార సమాజాల వేలాది సంవత్సరాల చరిత్రను విశ్లేషిస్తే మానవ స్వభావం ఇలాంటి ప్రవర్తనకు దారి తీయదని బోధపడుతుంది.[64]

1840-50 మధ్య కార్ల్ మార్క్స్, ఆ తర్వాత ఫ్రెడరిక్ ఏంగెల్స్ ప్రబోధించిన 'మార్క్స్' మేరకే మానవ చరిత్రను అన్వయించడం సాధ్యమవుతుంది. ఉత్పత్తి సంబంధాల, ఉత్పత్తి శక్తుల అభివృద్ధి మధ్య పరస్పర కలయికపై మార్క్స్ ఎక్కువగా దృష్టి సారించారు. మనుగడ అవసరాలను తీర్చుకోవడానికి మానవులు ఉత్పత్తికి కొత్త మార్గాలను అన్వేషిస్తారు. భౌతిక సమస్యలను తగ్గించుకునేందుకు ఈ మార్గాలు ఉపయోగపడతాయి. కాని ఉత్పత్తికి సంబంధించిన ఈ కొత్త మార్గాలు సముదాయ సభ్యుల మధ్య కొత్త సంబంధాలను సృష్టిస్తాయి. ఒకానొక దశలో తమ మధ్య సంబంధాలను నెలకొల్పే కొత్త పద్ధతులను మానవులు ఆమోదించాల్సి రావచ్చు. లేదా ఉత్పత్తి మార్గాలను (కొత్తవి) తిరస్కరించాల్సి రావచ్చు.

జీవనోపాధి మార్గాలలో మార్పుల వల్ల వర్గాలు ఆవిర్భవించడం మొదలు పెట్టాయి. మనుగడకు అవసరమైన ధాన్యాల కంటే ఎక్కువ ఉత్పత్తిని సాధించి అదనపు నిల్వలను భద్రపరచగలిగే సామర్థ్యమున్న సముదాయాలకు ఉత్పాదనా పద్ధతులు అందుబాటులో ఉండేవి. కాని ఈ కొత్త పద్ధతులకు నిపుణుల అవసరం ఏర్పడింది. సముదాయ కార్యకలాపాలను సమన్వయం చేయగల వ్యక్తులు అవసరమయ్యారు. అదనపు ఉత్పాదన వెంటనే వినియోగం కాకుండా చూడటంతోపాటు భవిష్యత్ అవసరాల కోసం ధాన్యాన్ని గిడ్డంగుల్లో భద్రపరిచే బాధ్యత ఆ వ్యక్తులపై ఉండేది. అలాంటి వ్యక్తులు పొలంలో శ్రమ పడాల్సిన అవసరం ఉండేది కాదు.

ఉత్పత్తి స్థితిగతులు అప్పటికే అంతంత మాత్రంగానే ఉండేవి. ప్రకృతి వైపరీత్యాలు పంటను నాశనం చేసే అవకాశముండేది. ఆ విధంగా అదనపు నిల్వలు తరిగిపోయి ఆకలి ప్రబలడానికి, మిగులు ధాన్యాన్ని సత్వరమే వినియోగించాలన్న భావన ఏర్పడడానికి ఆస్కారముండేది. అలాంటి పరిస్థితుల్లో ఉత్పత్తి పర్యవేక్షకుల (ధాన్యాగార సంరక్షకులు) కు దౌర్జన్యం తప్ప మరో మార్గం ఉండదు. అదనపు నిల్వలను భవిష్యత్ ఉత్పత్తి అవసరాలకు వినియోగించాలంటే వాటిని భద్రపరచడం తప్పనిసరి. ఈ కారణంగా ఇతరులతో పని చేయించడం (అలసిపోయి కడుపు మాడుతున్నప్పుడు), ఆహారకొరతను ఎదుర్కొంటున్నప్పుడు వారితో ధాన్యాలను నిల్వ చేయించడం పర్యవేక్షకులకు అలవాటైపోయింది. ఈ నాయకులు పాలకులుగా అవతారం ఎత్తడం ప్రారంభించారు. సమాజ ప్రయోజనాలను స్థూలంగా పరిరక్షించాలంటే వనరులపై తమ నియంత్రణ తప్పని సరిగా ఉండాలన్న భావన ఈ పాలకుల్లో నాటుకుపోయింది. ఇతరులు ఆకలితో అలమటిస్తున్నా ధాన్యాగారాలపై తమ నియంత్రణను వారు గట్టిగా సమర్థించుకునేవారు. తాముపుష్టిగా, ఆరోగ్యంగా ఉంటేనే సామాజిక ప్రగతి సాధ్యపడుతుందని వారు వాదించడం మొదలుపెట్టారు. కరువు, పేదరికం ఇతరుల జీవితాలను కృంగదీస్తున్నా తాము మాత్రం వాటి ప్రభావానికి చాలా దూరంగా ఉండిపోయారు. క్లుప్తంగా చెప్పాలంటే విశాల సమాజ ప్రయోజనాలను కాపాడడం కంటే తమ స్వంత వర్గ ప్రయోజనాలను పరిరక్షించే దిశగా వారు పయనించారు. తమ అభ్యున్నతే సమాజ అభ్యున్నతి అన్న వాదనకు దిగారు. వేరే విధంగా చెప్పాలంటే సామాజిక ప్రగతి తొలిసారిగా ఇతరుల దోపిడీ, అణచివేత ప్రక్రియల అభివృద్ధిని ప్రోత్సహించింది.

అదనపు నిల్వలను సృష్టించిన ఉత్పత్తి పద్ధతులు నాణేనికి ఒక వైపు కాగా వర్గ విభజనలు నాణేనికి మరో వైపుగా నిలిచాయి. తొలి వ్యవసాయ సమాజాలు వర్గ విభజనలు లేకుండానే ఆయా ప్రాంతాల్లో ఏర్పాటయ్యాయి. ముఖ్యంగా సారవంతమైన భూములు గల ప్రాంతంలో అవి ఆవిర్భవించాయి. కాని అవి విస్తరించే కొద్దీ ప్రజల మనుగడ మరింత ప్రతికూలమైన పరిస్థితులను ఎదుర్కోవడంపైనే ఆధారపడింది. అందుకు సామాజిక సంబంధాల ప్రక్షాళన అవసరమైంది.[65]

వర్గరహిత సమాజాల్లో పలుకుబడి కల వర్గాలు (సముదాయాలు) వ్యవసాయోత్పత్తిని విస్తరించడానికి కార్మికులను పర్యవేక్షించడం మొదలుపెట్టాయి. నీటిపారుదల పనులు, కొత్త ప్రాంతంలో భూమిని శుభ్రం చేసే పనికి కార్మికులను సమీకరించసాగాయి. అదనపు నిల్వలపై తమ నియంత్రణ (కష్టసమయాల్లో ధాన్యాగారం నుండి తిండి గింజలను వినియోగించే అధికారం) అందరి ప్రయోజనాలను పరిరక్షించడానికికేనని వారు విశ్వసించారు. సామాజిక వినియోగానికి అన్నిరకాల ఉత్పత్తులను వ్యాపారం ద్వారా సేకరించిన వర్గాలు కూడా అదే భావనతో వ్యవహరించడం మొదలుపెట్టాయి. వీరికి తోడు ఇతర సముదాయాలను యుద్ధంలో ఓడించి వారి సంపదను కొల్లగొట్టే వర్గం కూడా మిగులు ఉత్పత్తిపై నియంత్రణ సాధించింది.

ప్రకృతి వైపరీత్యాలు, భూసారం కోల్పోయిన భూములు, యుద్ధాలు వర్గరహిత వ్యవసాయ సమాజాల్లో తీవ్ర సంక్షోభాన్ని సృష్టించేవి. పాత వ్యవస్థ కొనసాగడం ప్రశ్నార్థకంగా మారేది. ఫలితంగా ఉత్పాదనకు కొత్త పద్ధతులపై ఆధారపడేవారు. కాని ధనిక కుటుంబాలు లేదా వంశాలు తమ పాత విలువలను (సామాజిక బాధ్యతలు) పూర్తిగా విసర్జించనిదే కొత్త పద్ధతులకు సర్వవ్యాపిత ఆమోదం లభించేది కాదు. ప్రతిష్ట, గౌరవ మర్యాదలకు ప్రతిఫలంగా ప్రజలకు పంపిణీ చేయాల్సిన సంపద, ఇతరులు కష్టపడుతూ ఉంటే ఉన్నత వర్గాలే వినియోగించే సంపదగా మారిపోయింది. "పరిణతి చెందిన తెగనాయకత్వ స్వరూపాల్లో పెద్ద మనిషి తన ఉత్పత్తిని ఇతరుల వినియోగానికి అందుబాటులో ఉంచే సాంప్రదాయం పోయి ఇతరులే నాయకునికి ప్రయోజనం కలిగించే విధంగా తమ ఉత్పత్తిని ధారదత్తం చేసే పరిస్థితి కొంత వరకు నెలకొంది".[66]

అదే సమయంలో యుద్ధం వల్ల కొందరు వ్యక్తులు, సముదాయాలు సమాజంలో తమ ప్రతిష్టను మరింత పెంచుకున్నారు. ఇతర సముదాయాల నుండి కొల్లగొట్టిన సంపద, కప్పం అంతా వారి నియంత్రణలోనే ఉండడంతో ఈ పరిస్థితి తలెత్తింది. వర్గస్థాయి లేదా సామాజిక స్థాయి మరింత విస్పష్టమైంది. ఇతరులకు సాయం చేయగల సామర్థ్యంపైనే స్థాయి నిర్ధారణయ్యేది.[67] ఈ ప్రక్రియకు ఎలాంటి సహజ స్వభావం ఉండేది కాదు. ప్రపంచంలోని చాలా ప్రాంతాల్లో సమాజాలు ఆధునిక యుగాల వరకు అభ్యున్నతిని సాధించాయి. ఈ సమాజాలు భారీ నాగళ్లు, విస్తారమైన నీటి పారుదల వ్యవస్థలను వినియోగించకుండానే (ఎక్కువ పరిశ్రమ చేయకుండానే) అభివృద్ధి చెందాయి. పపువా న్యూగినియాలో ఆదిమ సమాజాలు అని తప్పుగా సంబోధించబడిన జాతులు నేటి వరకు కూడా ఎలా మనుగడ సాగించ గలిగాయో పై పరిణామాన్ని బట్టి అర్థమవుతుంది. వీరితో పాటు పసిఫిక్ దీవులు, ఆఫ్రికా, అమెరికాలు, ఆగ్నేయ ఆసియాలలోని కొన్ని భాగాల్లో పలు సమాజాల ఉనికి పదిలంగా ఉంది. కాని వేరే పరిస్థితులలో మనుగడ కొత్త ఉత్పాదనా పద్ధతులపై ఆధారపడి ఉండేది. అలాంటి కార్యక్రమాలను నిర్వహించడంతోనే పాలక వర్గాలు తెరపైకి వచ్చాయి. వాటితోపాటు పట్టణాలు, రాజ్యాలు, అలాగే నాగరికతలు ఆవిర్భవించాయి. ఈ దశ నుండి సమాజ చరిత్రంతా నిస్సందేహంగా వర్గపోరాట చరిత్రే. ప్రకృతిపై తన నియంత్రణను మానవాళి మరింత పెంచుకుంది. కాని స్వల్ప సంఖ్యలో ఉన్న ఉన్నతవర్గాల చేతిలో అత్యధిక శాతం మంది ప్రజలు దోపిడీకి గురి కావడం, వారి నియంత్రణకు లోబడి ఉండడం అప్పటి నుండే మొదలైంది.

రాజ్యవ్యవస్థను ఏర్పర్చడం ద్వారా పాలక వర్గాలు సమాజంపై పూర్తి పట్టును సాధించాయి. అత్యధిక సంఖ్యలో ప్రజలు కష్టాలు అనుభవిస్తున్నా, ఆకలితో అలమటిస్తున్నా ఉన్నత వర్గాలు మాత్రం అదనపు నిల్వలను తమ గుప్పిట్లోనే ఉంచుకున్నాయి. మిగులు ధాన్యంపై నియంత్రణ ఉండడం వల్లే పాలకవర్గాలు ప్రజలను శాసించగలిగాయి. అందుకు సాయుధ బలగాలను వినియోగించుకున్నాయి. లోహ పరిశ్రమలపై భారీగా వెచ్చించి అధునాతన

ఆయుధాలను మలిచాయి. దానితో వ్యతిరేకులను చంపే మార్గాలు మరింత సరళంగా, సమర్థవంతంగా మారాయి.

చట్టాలు, సిద్ధాంతాల సహకారముంటే సాయుధ శక్తి మరింత పటిష్టంగా, ప్రభావంతంగా పని చేస్తుంది. ఈ చట్టాలు, సిద్ధాంతాలు పాలకవర్గాలే ప్రజలకు జీవనాధారాలనే భావనను సృష్టిస్తాయి. ఉదాహరణకు మెసొపొటామియాలో తొలి పాలకులు తమ ఆర్థిక కార్యకలాపాలపై డాంబికాలు పలికేవారు. కాలువల తవ్వకం, ఆలయాల నిర్మాణం, సిరియా నుండి కలపను దిగుమతిచేసుకోవడం, ఓమన్ నుండి రాగి, గ్రానైట్ తెప్పించడం తమ ఘన కార్యాలుగా చెప్పుకునేవారు. తమ గొప్పతనాన్ని ఆయా కట్టడాలపై చిత్రీకరించుకునేవారు. మేస్త్రీలు లేదా వాస్తుశాస్త్ర నిపుణులు ఆలయ నిర్మాణ ప్రణాళికను దేవతల నుండి స్వీకరిస్తున్నట్లు శిల్పాలు చెక్కించేవారు'.[68]

సమాజ అత్యున్నత విలువలకు తాము ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు పాలకులు భావించేవారు. కొన్ని సందార్భల్లో ఆ విలువలకు తాము కూడా ప్రతినిధులమని పాలకుల చేతిలో దోపిడీకి గురయ్యే ప్రజలు ప్రకటించేవారు. సమాజ అదనపు ఉత్పత్తిని తమ చేతుల్లో కేంద్రీకరించుకొని, భవిష్యత్ ఉత్పత్తిపై కూడా నియంత్రణ తెచ్చుకోవడం ద్వారా పాలకవర్గాలు తమ కింది స్థాయి వారికి అధికారులుగా సమాజంలో ఉన్నత హోదాను పొందారు. దైవ సంభూతులుగా, సమాజం, దేవతల మధ్య వారధులుగా పరిగణించబడ్డారు. ఆ విధంగానే ఈజిప్టు ఫారోలు, మెసొపొటామియా, మెసో- అమెరికాను పాలించిన తొలి పాలకవర్గాలు దైవాంశ సంభూతులుగా కీర్తించబడ్డారు.

వర్గ రహిత సమాజాల్లో కూడా మతపరమైన భావనలు, సిద్ధాంతాలు ఉండేవి. కొన్ని అతీంద్రియ శక్తులు తమను, ప్రకృతిని శాసిస్తున్నాయనే నమ్మకం ఆదిమ సమాజాల్లో ఉండేది. కొన్ని మొక్కలే పూలు పూయడం, సంవత్సరంలో ఒక ప్రత్యేక సమయంలోనే మొక్కలు పెరగడం, కొన్ని సందర్భాల్లో ఆహారం పుష్టిగా లభిస్తే కొన్ని సందర్భాలో ఏళ్ల తరబడి ఆకలికి గురికావడం, ఊహించని విధంగా ఉన్నట్లుండి చావు సంభవించడం లాంటి ప్రక్రియలను ఏవో దైవశక్తులు నడిపిస్తున్నాయనే భావన వారిలో ఉండేది, వర్గాలు, రాజ్యాలు అవతరించడంతో ప్రజలు తమ నియంత్రణకు అతీతమైన సామాజిక శక్తులతో కూడా వేగాల్సి వచ్చింది. ఈ దశలోనే వ్యవస్థాగతమైన మత సంస్థలు ఆవిర్భవించాయి. దేవతలను పూజించడం సామాజిక ఆచారమైపోయింది. సమాజం తన శక్తిని తానే కొలవడం మొదలు పెట్టింది. తమ స్వంత విజయాల ఘనతను ఉనికిలో లేని శక్తులకు అంటగట్టింది. దీనివల్ల ఆయా విజయాలకు తామే బాధ్యులమని చెప్పుకునేవారు ( పాలక వర్గాలు) తమ నియంత్రణను మరింత విస్తరించుకున్నారు. ఉత్పత్తిదారులను ఆదేశిస్తూ మిగులు ఉత్పత్తిని తమ చేతుల్లో తీసుకుని, తమ వాదనలను సవాలు చేసే వారికి వ్యతిరేకంగా సాయుధ బలాన్ని వినియోగించే పాలకులు ప్రజల కష్టాన్ని తమ స్వంత విజయాలుగా ప్రకటించుకున్నారు.

అలాంటి రాజ్యవ్యవస్థలు, సిద్ధాంతాలు ఒక్కసారి ఉద్భవించాక పాలకవర్గాలకు అదనపు ఉత్పత్తిపై నియంత్రణను కట్టబెడతాయి. ఉత్పత్తిని పెంచే లక్ష్యం నెరవేరకున్నా పాలకవర్గాలకు సమాజ సంపదపై పట్టు ఉండాలని రాజ్యం, మత సిద్ధాంతాలు ఘోషిస్తాయి. ఉత్పత్తిని పెంచడానికి ఆవిర్భవించే వర్గం తర్వాత ఆ అవసరం లేకున్నా అలాగే కొనసాగుతుంది.

## తొలి వర్గ సమాజాల లక్షణం

సాధారణంగా మనం వర్గ సమాజాలను వ్యక్తిగత ఆస్తిపై ఆధారపడ్డవిగా పరిగణిస్తాము. కాని వర్గాలుగా చీలి పోయిన అన్ని సమాజాలలో వ్యక్తిగత ఆస్తి ఒక లక్షణం కాదు. వ్యక్తిగత ఆస్తి ప్రస్తావనే లేని ఒక ఆసియా వర్గ సమాజం గురించి కారల్ మార్క్స్ వివరించారు. అందుకు భిన్నంగా పాలకులు ప్రభుత్వ యంత్రాంగంపై తమకున్న ఉమ్మడి నియంత్రణ ద్వారా వ్యక్తిగత యాజమాన్యమంటూ లేకుండా భూమిని ఉమ్మడిగా సాగు చేస్తున్న రైతులను దోచుకున్నారని మార్క్స్ వాదించారు. ఈ స్వరూపం 18వ శతాబ్ద భారత సమాజాన్ని ప్రతిబింబిస్తుందని ఆయన నమ్మారు. అప్పటికే భారతదేశం ఆంగ్లేయుల నియంత్రణలోకి వచ్చింది. కాని ఆధునిక అధ్యయనాలు సూచిస్తున్నదేమిటంటే భారత సమాజాన్ని విశ్లేషించడంలో మార్క్స్ కనీసం ఎక్కడో ఒక చోట పొరపడ్డారని.[69] అయితే మెసాపొటామియా, ఈజిప్టు, చైనా, భారత్, మెసో-అమెరికా, దక్షిణ అమెరికా నాగరికతల తొలి చరిత్ర మార్క్స్ విశ్లేషణతో సరితూగుతుంది.

ఆలయాలను నిర్వహించే పురోహితుల నియంత్రణలో సామాజిక అదనపు సంపద ఉండేది. లేదంటే రాజభవనాల నుండి పరిపాలన సాగించే రాజులు అదనపు నిల్వలపై ఆధిపత్యం కలిగి ఉండేవారు. నీటిపారుదల, వరదనీటి కాలువల నిర్మాణం, వ్యాపారం, ఆలయాలు, రాజభవనాలపై ఆధారపడి జీవించే కర్షకుల శ్రమ ఆధారంగా వారు అలాంటి నియంత్రణను తెచ్చుకోగలిగారు. కాని పురోహితులు లేదా పాలకులు వ్యక్తిగత నియంత్రణ లేదా యాజమాన్యాన్ని ప్రదర్శించేవారు కాదు. ఉమ్మడి పాలకవర్గంలో భాగస్వాములైనంత వరకు వారు వర్గ దోపిడీ ద్వారానే ప్రయోజనం పొందేవారు.

సమాజానికి అట్టడుగున ఉండే రైతుల ఉత్పాదన కూడా భూమిపై వ్యక్తిగత యాజమాన్యం మీద ఆధారపడి ఉండేదికాదు. వర్గరహిత వ్యవసాయ సమాజాల్లో కనిపించే ఆర్థిక జీవన స్వరూపాలు (సముదాయపరమైన) అప్పటికి కూడా కొనసాగుతూ ఉండేవి. కాని వాటిలో కొంత వైరుధ్యం ఉండేది. ఎందుకంటే సమాజ సంపదపై నియంత్రణ ప్రజల చేతుల నుండి పాలకవర్గాలు చేతుల్లోకి మారింది. పరస్పర సహకార సూత్రం ఆధారంగానే ప్రజలు శ్రమపడ్డారు. ఆదిమ సంబంధాలు ప్రబలంగానే ఉండేవి. ఆ విధంగా మెసాపొటామియాకు చెందిన పితృస్వామ్య సముదాయాలు (అనుభవమున్న పెద్దమనిషి శాసించే వర్గాలు) ఆలయాల ఆధీనంలో లేని భూములన్నింటిపై నియంత్రణ కలిగి ఉండేవి. అజ్టెక్ కాలం (15వ శతాబ్దం)

వరకు కూడా మెక్సికోకు చెందిన రైతులు సముదాయ వర్గాల ఆధారంగా సమీకృతమయ్యేవారు.[70] ఈ వర్గాలు అంతర్గతంగా విభజించబడి వుండేవి.[71] పురాతత్వ శాస్త్రవేత్తలు, మానవ శాస్త్ర నిపుణులు ఈ వర్గాలను త్రికోణాకార వర్గాలుగా అభివర్ణించారు. అజ్టెక్‌లలో కాల్‌పుల్లి అనే సముదాయాలుండగా ఇంకాలలో అయ్‌లుల్లీ అనే సముదాయాలు ఉండేవి. వర్గరహిత సమాజంలో ఉన్న స్వరూపంతోనే ఈ వర్గాలు కొనసాగాయి. ఆయా వర్గాలకు ఒక ఉమ్మడి పూర్వీకుడు ఉండేవాడు. ఆ పూర్వీకుడి ఆధారంగా వారి సంబంధాలు కొనసాగేవి. కాని మారిన పరిస్థితుల్లో సముదాయాలు పాలకవర్గాల పక్షాన కార్మికులను, కర్షకులను దోచుకునేవి. ఉత్పత్తి కేంద్రాలుగా, నియంత్రణా వ్యవస్థలుగా ఈ సముదాయాలు ద్విపాత్రాభినయం చేశాయి. యురేషియా, ఆఫ్రికాలలోని చాలా ప్రాంతాల్లో పాలకవర్గాలు, రైతాంగం రెండింటిలోనూ వ్యక్తిగత ఆస్తి అభివృద్ధి చెందింది.[72] కాని ఈ ప్రక్రియ శతాబ్దాల తరబడి కొనసాగింది. ఆ కాలంలో పాలకవర్గాల మధ్య తీవ్రమైన చీలికలు వచ్చాయి. రక్తసిక్తమైన యుద్ధాలు, తీవ్రమైన ఘర్షణలు (పాలకవర్గాలు, అణగారిన వర్గాల మధ్య) చోటు చేసుకున్నాయి.

# మహిళల అణచివేత

సమాజం వర్గాలుగా చీలిపోవడం, రాజ్య వ్యవస్థ ఏర్పాటు కావడంతోపాటు మహిళలు ప్రతి రంగంలోనూ వెనుకబడిపోయారు. వారి హోదాలో మార్పు వచ్చింది. ఒక శతాబ్దం క్రితం ఫ్రెడరిక్ ఎంగెల్స్ వర్ణించినట్లు 'ప్రపంచ మహిళలు చారిత్రక ఓటమికి గురయ్యారు. పురుషులతో సమానంగా నిర్ణయాల్లో పాలుపంచుకున్న మహిళలు ఇతరులపై ఆధారపడే అధమ స్థితికి చేరుకున్నారు. వారి అధమస్థాయి నిర్దిష్ట స్వభావం ఒక వర్గ సమాజం నుండి మరో వర్గ సమాజానికి వేరుగా ఉండేది. అయితే వర్గం ఉన్న అన్ని సమాజాల్లోనూ మహిళలు తమ హోదాను కోల్పోయారు. నేటికి కూడా ఆ పరిణామాన్ని మానవ స్వభావ దుర్గుణ ఫలంగా పరిగణిస్తారు. మహిళల హోదా నేడు సర్వజనీనమైంది.

అదనపు ఉత్పత్తి సాధించే ప్రక్రియలో ప్రజల మధ్య ఏర్పడిన కొత్త సంబంధాల్లోనే ఈ మార్పునకు బీజం పడింది. కొత్త ఉత్పాదనా పద్ధతులు పురుషులు శ్రమకు ప్రాధాన్యతనిచ్చాయి. తొలిసారిగా పురుషులే వ్యవసాయ పనులను ఒంటరిగా చేపట్టారు. అధిక పరిశ్రమ అవసరమన్న కారణంగా మహిళలను ఉత్పత్తి రంగం నుండి క్రమంగా తప్పించారు. ఆదిమ సమాజాల్లో ప్రధాన లక్షణంగా కనిపించే ఆహారసేకరణ, పిల్లల పెంపకం, తల్లి పాలను ఇవ్వడానికి అనువుగా ఉండేది. అలాగే ప్రాచీన వ్యవసాయం, దాని పద్ధతులు మహిళల శ్రమకు అనుకూలంగా ఉండేవి. కాని భారీ నాగలి సేద్యం, పశువులు, గుర్రాల పోషణ వారి సామర్థ్యానికి దూరంగా ఉండేవి. మహిళల శ్రమను వినియోగించుకున్న సమాజాల్లో జనాభా పెరుగుదల కుంచించుకుపోయింది. మహిళలను శ్రమపూర్వక పనుల నుండి మినహాయించిన సమాజాలు వేగంగా విస్తరించి ఇతర సమాజాల కంటే ఎక్కువగా అభ్యున్నతిని సాధించాయి. "వ్యవసాయాధార సమాజాల్లో మహిళలు సాధారణంగా నేలను

చదును చేస్తే మగవారు అరక దున్నేవారు.ప్రాచీన సుమేరియన్, ఈజిప్టు పత్రాల్లో కూడా నాగలి దున్నే వారంతా పురుషులే,"[73] అని గార్డన్ చైల్డ్ చాలా కాలం క్రితమే చెప్పారు.

"నాగలి... మహిళలను అధిక శ్రమ నుండి మినహాయించింది. కాని పప్పు ధాన్యాల సాగుపై వారికున్న గుత్తాధిపత్యం, తద్వారా కలిగిన సామాజిక హోదా నశించిపోయాయి,"[74] అని గార్డన్ సూచించారు. కుటుంబ భవిష్యత్‌పై తీసుకునే కీలక నిర్ణయాలు పురుషుల నిర్ణయాలుగా మారిపోయాయి.[75] నిర్ణయాలను అమలు చేయాల్సింది పురుషులే కనుక కుటుంబంపై వారికి పూర్తి నియంత్రణ ఏర్పడింది. అదనపు ఉత్పాదనవల్ల సంభవించిన మార్పులు కూడా మహిళల సామాజిక హోదాపై ప్రతికూల ప్రభావం చూపాయి. స్థానిక వ్యాపారంలో పాలుపంచుకునే వెసులుబాటు మహిళలకు ఉండేది. వారు యుద్ధాల్లో పాలుపంచుకున్న సందర్భాలు కూడా చాలానే ఉన్నాయి. అయితే సుదూర ప్రాంతాల్లో వ్యాపార నిర్వహణ, క్రమబద్ధ సైనికత్వంపై పురుషులకు గుత్తాధిపత్యం ఉండేది. పోరాటవీరులు, వ్యాపారులు దాదాపు అందరూ పురుషులే. అదనపు నిల్వలపై నియంత్రణ పెరిగే కొద్దీ యాజమాన్యం, అధికారం అంతా పురుషుల చేతుల్లోనే కేంద్రీకృతమైంది. ఆదిమ సంబంధాలు విచ్ఛిన్నం కావడంతో మహిళల అణచివేత మరింత ఊపందుకుంది. సంబంధబాంధవ్యాల్లో అప్పటి వరకు కీలకపాత్ర పోషించిన మహిళ (యుక్తవయస్సు దాటిన వారు) వాటికి దూరమైపోయింది. ఉత్పత్తి మార్గాలపై సలహాలిచ్చే స్వేచ్ఛ, అనుచిత ప్రవర్తన నుండి రక్షణ లేకుండాపోయాయి. గతానికి భిన్నంగా మహిళ కేవలం గృహిణిగానే మిగిలిపోయింది. కొత్త కుటుంబంలో అధమస్థాయిని అందుకోవలసి వచ్చింది. పాలకవర్గాలకు చెందిన మహిళలు కూడా పురుషుల ఆధీనంలో ఉన్న అదనపు సంపదలో ఒక భాగంగా మారిపోయారు. ఒక భోగ వస్తువుగా, రతి మాధుర్యాన్ని అందించే ఆధారంగా, వారసులను అందించే సాధనంగా వారు మిగిలిపోయారు. వారికి కష్టాలు, బహిర్గత ముప్పుల నుండి సంరక్షణ ఉన్నా విశాల సమాజం, బయటి ప్రపంచంతో సంబంధాలను కోల్పోయారు. వ్యవసాయ, చేతివృత్తిదారుల కుటుంబాల్లో మహిళల జీవితం వేరుగా ఉండేది. వ్యవసాయ, చేతివృత్తిదారుల కుటుంబాల్లో గతంలో వలే ఉత్పత్తిలో వారి పాత్ర కొనసాగింది. వారు శ్రమపడుతూనే వచ్చారు. అయినప్పటికీ వారి భర్తలే కుటుంబం, సమాజం మధ్య సంబంధాలను నిర్వహించేవారు. కుటుంబ మనుగడకు సంబంధించిన నిర్ణయాలను

మహిళలు, పిల్లలపై రుద్దేవారు. (భార్యకు వరుస గర్భధారణలను కూడా నిర్ధారించేవారు).[76] పాలక, పీడిత వర్గాలు రెండింటిలోనూ పితృస్వామ్య వ్యవస్థ ఉండేది. ఈ వ్యవస్థకు మూలాలు అన్ని సిద్ధాంతాల్లోనూ, మతాల్లోనూ కనిపిస్తాయి. దేవతలు, మహిళా అర్చకులు తమ ప్రాధాన్యతను కోల్పోయారు. మాతృమూర్తులుగానో, అందాలరాశులుగానో ఉండిపోయారు. ప్రపంచ వ్యవహారాల్లో క్రియాశీల పాత్రను పోషించలేకపోయారు.

అన్ని వర్గాలు, సమాజాల్లో మహిళల పాత్రలు క్రమబద్ధంగా, ఎలాంటి మార్పులు లేకుండా ఉండేవికావు. రైతాంగంలో మహిళల అణచివేత కొత్త స్వరూపాన్ని సంతరించుకుంది. పాలకవర్గాలకు భిన్నంగా ఆ స్వరూపం ఉండేది. అలాగే బానిసల్లో కూడా అణచివేత వేరే రూపంలో ఉండేది. మగ బానిసను కాని, బానిస మహిళను కాని వారి స్వంత కుటుంబాలతో ఉండడానికి అనుమతించే వారు కాదు. విధవలు అన్ని సమాజాల్లోనూ ఎక్కువగా కనిపించేవారు. యువకులలో మరణశాతం ఎక్కువగా ఉండడంవల్లే మహిళలు త్వరగా వైధవ్యం పొందేవారు. వీరురైతాంగంలో కుటుంబ పెద్దలుగా, పాలకవర్గాల్లో రాజ్య నిర్వాహకురాళ్లుగా (రాణులుగా) వ్యవహరించేవారు. కొన్నిసమాజాల్లో మహిళలకు పౌరహక్కులన్నింటినీ నిరాకరించేవారు. మరికొన్ని సమాజాల్లో వారికి ఆస్తిహక్కులు, భర్త నుండి విడాకులు పొందే స్వేచ్ఛను కల్పించేవారు. అన్ని చోట్లా మహిళలు అణచివేతకు గురయ్యారన్నది వాస్తవం. కాని అణచివేత అన్ని చోట్లా ఒకేలా ఉండేదని భావించలేము. 1980 దశకంలో స్త్రీవాద రచయితలు పేర్కొన్నట్లు పితృస్వామ్య సిద్ధాంతాల ఆధారంగా అణచివేత సమాన స్థాయిలో ఉండేది కాదు. అయితే మహిళ హోదా ఆదిమ కమ్యూనిజం నాటి కంటే చాలా తగ్గిపోయిందని మాత్రం చెప్పగలము.

తొలి దోపిడీ వర్గాలు బలోపేతం కావడంతో సమాజాభివృద్ధి స్థూలంగా ప్రభావితమైంది. దోపిడీ వర్గాలు తమ పాలనను విస్తరించడానికి ఉపయోగించిన పద్ధతులు, సాధనాలు సమాజ వనరులను పెద్ద మొత్తంలో మింగేశాయి. సేవకులు, అంతర్గత భద్రత, సాయుధ దళాలు, భారీ ఆలయాల నిర్మాణం, తమ అధికారానికి చిహ్నాలైన రాజభవనాలు, సమాధులు తదితర వాటిపై వనరులను భారీగా వ్యయం చేయడంవల్ల దోపిడీ, అణచివేతల స్థాయి కూడా పెరిగింది. సమాజాన్ని ముందుకు నడపాలంటే దోపిడీ, అణచివేత చర్యలు తప్పవన్న వాదనను పాలకవర్గాలు తెరపైకి తెచ్చాయి. ఇతర సమాజాల వనరులను దోచుకోవడానికి

యుద్ధాలను ఒక సాధనంగా ఎంచుకున్నాయి. కాని నిరంతర యుద్ధాలు ప్రజలకు మరిన్ని కష్టాలను తెచ్చిపెట్టాయి. పొరుగు సమాజాల్లో కూడా వర్గాలు, రాజ్యాలు ఏర్పడడానికి యుద్ధాలే కారణమయ్యాయి. సమాజ సంపద బహుకొద్ది మంది చేతుల్లో కేంద్రీకృతమైతే తప్ప ప్రజలను యుద్ధాల నుండి (దురాక్రమణ) రక్షించలేమన్న సిద్ధాంతాన్ని పొరుగు సమాజాలు కూడా నమ్మడం మొదలుపెట్టాయి.[77] అయితే మొత్తం మీద సమాజానికి రక్షణ అవసరమున్నా లేకున్నా పాలకవర్గాలు ఆవిర్భవించాయి. ఒక దశలో పాలకవర్గాలు సమా ానికి భారంగా మారాయి. పశ్చిమాసియా, సింధూలోయ, ఈశాన్య మధ్యధర ప్రాంతంలో తొలి నాగరికతలు ఏర్పడిన తర్వాత 1000 నుండి 1500 సంవత్సరాల మధ్య నాటకీయంగా చోటు చేసుకున్న పరిణామాలు ఈ పరిస్థితికి అద్దం పడతాయి.

## ఐదవ అధ్యాయం

# తొలి 'చీకటి యుగాలు'

తొలి నాగరికతలకు చిహ్నాలైన పిరమిడ్‌లు, ఆలయాలు, రాజభవనాలు, భారీ ధ్వజస్తంభాలు, సమాధులను చూసిన వారెవరైనా అనుభూతికి లోనుకాకుండా ఉండలేరు. ఈ కట్టడాలు వైభవోపేతమైనవే కాకుండా మనోహరమైనవి కూడా. అలాగే గాలి, వానల నుండి ప్రజలను కాపాడే రాతి గృహాలు కూడా ఆశ్చర్యాన్ని గొలిపిస్తాయి. కొన్నిచోట్ల ఈ గృహాలకు నీటి సరఫరా, మురికి కాలువల వ్యవస్థ కూడా ఉండేది. అన్నింటికంటే గొప్ప విషయమేమిటంటే కార్మికులకు గట్టి లోహాల పరిజ్ఞానం లేకపోయినా రాతి, కలప పరికరాలతోనే భారీ కట్టడాలను నిర్మించడం. కొన్ని చోట్ల కార్మికులు రాగి, కాంస్యంతో చేసిన నిర్మాణ పరికరాలను వినియోగించారు.

ఈ నగరాల చుట్టుపక్కల నివసించిన ప్రజలపై వాటి ప్రభావం మరింత ప్రబలంగా ఉండి ఉండొచ్చు. గిజా లేదా తియోతి హువాకన్‌కు చెందిన పిరమిడ్‌లు, ఉర్ లేదా ఉరుక్‌లో నిర్మించిన మహాప్రాకారాలు నేటి ఎంపైర్‌స్టేట్ బిల్డింగ్ లేదా ఈఫిల్ టవర్‌ను తలదన్నేవిగా ఉండేవి. పాలకవర్గాల ఆధిపత్యానికి అవి చిహ్నాలుగా ఉండేవి. రాజ్య సుస్థిరత, దాని శాశ్వత స్వభావాన్ని ప్రతిబింబించేలా భారీ కట్టడాలను నిర్మించి ఉంటారు. ఈ కట్టడాలు పాలకులకు ఎనలేని స్ఫూర్తిని, తమ అధికారం శాశ్వతమన్న భావనను కలిగించాయి. సూర్యచంద్రుల భ్రమణం ఎలా శాశ్వతమో తమ అధికారం కూడా శాశ్వతమని, దానిని ఎవరూ ప్రశ్నించజాలరన్న ధీమా వారిలో పెరిగింది. అదే సమయంలో సమాజంలోని మిగతా వర్గాలలో అధికారలేమి, ప్రాధాన్యతలేమి భావనలను ఈ కట్టడాలు బాగా చొప్పించాయి.

పిరమిడ్‌లు, విగ్రహాలు, భవనాలు వైభవంగా నిలిచినా వాటిని నిర్మించిన సమాజాలు వెంటనో, ఆలస్యంగానో తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొన్నాయి. మెసొపొటామియాకు చెందిన నగర రాజ్యాలు క్రీస్తు పూర్వం 2300 నాటికి అంతరించిపోయే వరకు నిరంతరంగా ఘర్షణపడ్డాయి. ఉత్తర భాగం నుండి వచ్చిన సార్గన్ వాటిని స్వాధీనం చేసుకున్నాడు. అతడు సారవంతమైన చంద్రవంక లోయ ప్రాంతాన్నంతా కలిపి ఒక మహా సామ్రాజ్యాన్ని నెలకొల్పాడు. అతడి మరణం తర్వాత ఆ సామ్రాజ్యం కూడా ముక్కలైపోయింది. దాదాపు ఒకటిన్నర శతాబ్దాల [illegible], సామాజిక విచ్ఛిన్నం కారణంగా ఈజిప్టు పాత రాజ్యం (గిజా, సక్కారా

పిరమిడ్‌లుగల) పతనమైంది.[78] (ఈ కాలాన్ని తొలి అంతరాల కాలం అంటారు. ఇది క్రీ.పూ.2180-2040 మధ్య కొనసాగింది) సింధూ నగరాలైన హరప్పా, మొహెంజోదారోలను వెయ్యేళ్ల తర్వాత (క్రీ.పూ. 1500 మధ్యకాలంలో) ప్రజలు విడిచిపెట్టి వెళ్లారు. తర్వాతి వందేళ్లకు క్రేట్ నాగరికత అంతరించింది. దాని తర్వాత గ్రీస్ ప్రధాన భూభాగంపై వెలసిల్లిన మైసీనియన్ నాగరికత పతనమైంది. మెసో-అమెరికాలో నాగరికత ఆవిర్భవించిన అనతి కాలంలోనే అకస్మాత్తుగా కూలిపోయింది. తియోతిహువాకన్, మోంటే ఆల్బన్, దక్షిణ మాయా కేంద్రాలను ప్రజలు వంతులవారీగా విడిచిపెట్టి వెళ్లారు. నగరాలన్నీ నిర్మానుష్యమయ్యాయి. ఈ ప్రాంతానికి చేరుకున్న అజ్టెక్‌లు, ఆ తర్వాత స్పెయిన్ ఆక్రమణదారులు ఖాళీ అయిన నగరాలను, బోసిపోతున్న కట్టడాలను చూసి ఆశ్చర్యపోయారు. వాస్తవంగా ఇది పాఠకులకు కూడా ఆశ్చర్యం గొలిపే పరిణామమే.

తొలి నాగరికతల్లో సంక్షోభం తలెత్తడానికి కారణాలేమిటన్న విషయంపై చారిత్రక ఊహాగానాలు ఎన్నో ఉన్నాయి. కాని వివరణ ఇవ్వడానికి జరిగిన ప్రయత్నాల్లో కొన్ని అంశాలు నిర్దిష్టంగా ముందుకు వస్తాయి. మొదటిది, పాలకవర్గాలు తమ స్వంత పోషణకు, భారీ కట్టడాల నిర్మాణానికి పెద్ద మొత్తంలో వనరులను వెచ్చించాయనడానికి తగిన ఆధారాలున్నాయి. శతాబ్దాలు గడిచేకొద్దీ ఆలయాలు, రాజభవనాలు, స్మారక చిహ్నాల పరిమాణం మరింత పెరుగుతూ వచ్చింది. పాలకవర్గాల జీవితం మరింత విలాసవంతంగా మారింది. రైతుల నుండి సంపదను కూడగట్టే ప్రయత్నాలు మరింత తీవ్రమయ్యాయి. వ్యాపారులు సుదూర ప్రాంతాల నుండి అరుదైన వస్తువులను తీసుకురావడం మొదలుపెట్టారు.

ఈజిప్టులో రాజ్య యంత్రాంగం తన పరిధిలోని కేంద్రాలకు ధాన్యాలను, ఇతర వస్తువులను రవాణా చేయడానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేదని చారిత్రక ఆధారాలు (గ్రంథాలు) చెబుతున్నాయి. వ్యవసాయ రంగాన్ని వ్యవస్థీకరించడం కంటే నిర్మాణ కార్యక్రమాలను పర్యవేక్షించడానికే పాలకవర్గాలు పరిమితమయ్యాయి. ఫలితంగా అదనపు ఉత్పాదనపై తీవ్రమైన ఒత్తిళ్లు పెరిగాయి.[79] మెసొపొటామియాలో కూడా ఇదే పరిస్థితి ఏర్పడి ఉండొచ్చు. దానికి తోడు తరచూ యుద్ధాలు సంభవించేవి. నగర రాజ్యాలు తమలో తాము కలహించుకోవడమే కాక గ్రామీణ ప్రాంత ప్రజలతో కూడా ఘర్షణ పడేవి.

పాలకవర్గాల సంపద, అధికారం పెరగడంతో ప్రజల జీవన ప్రమాణాలు గణనీయంగా పడిపోయాయి. మనుగడకు తగిన వనరులను సమకూర్చుకోవడం వరకే వారి శ్రమ పరిమితమై పోయింది. కొన్ని సందర్భాల్లో పూట గడవడం కూడా కష్టంగా ఉండేది. రాజభవనాలు లేదా ఆలయాల్లో పని చేసే చేతివృత్తిదారులు తమ నైపుణ్యాన్ని పెంచుకున్నా వారు సృష్టించే రాగి, కాంస్య పరికరాలు, వస్తువులను కొనలేని పరిస్థితుల్లో రైతులు ఉండిపోయారు. రైతుల పంటను పాలకవర్గాలు అంతగా సేకరించేవి. ఆచరణలోనైతే ఈజిప్టుకు చెందిన రైతులు, కార్మికులు రాతియుగం నాటి పరికరాలనే వినియోగించేవారు. వేసవిలో కూడా ఉన్నిని ఒడికేవారు. ఉన్ని దుస్తులను నేసే పరిస్థితి ఉండేది కాదు.[80] సింధూలోయ నగరాల్లో కూడా రాతితో మలచిన కత్తులనే వినియోగించేవారు. దీనిని బట్టి సాధారణ ప్రజలకు లోహ పరికరాల

కొరత ఎంత తీవ్రంగా ఉండేదో తెలుస్తుంది. వనరులను పాలకవర్గాలు పెద్ద మొత్తంలో వినియోగించే కొద్దీ ప్రకృతిని అర్థం చేసుకొని దానిని నియంత్రించే సామర్థ్యాన్ని మానవాళి పెంచుకోలేకపోయింది. ప్రజల ఆలోచనా శక్తి క్షీణిస్తూ వచ్చింది. పట్టణీకరణ విప్లవానికి ముందు వెనుకబడిన సమాజాలు శీఘ్రగతిన అభివృద్ధి సాధించడాన్ని గార్డన్ చైల్డ్ ఎత్తి చూపారు.

> "క్రీస్తు పూర్వం 3000 సంవత్సరానికి ముందు గడిచిన రెండు వేల సంవత్సరాలలో మానవాళి అనువర్తిత శాస్త్రాలలో ఎంతో ప్రగతిని సాధించింది. ఫలితంగా కోట్లాది మంది ప్రయోజనం పొందారు. మానవజాతి ఆరోగ్య సంక్షేమాన్ని సాధించింది. మానవ నిర్మిత వ్యవసాయ కాలువలు, గోతులు ఏర్పడ్డాయి. నాగలి కనుగొనబడింది. పశుపోషణ పద్ధతులు అభివృద్ధి చెందాయి. నావను ఆవిష్కరించారు. చక్రాల బండ్లు వచ్చాయి. తోటలు ఏర్పాటయ్యాయి. మద్యాన్ని తయారుచేశారు. రాగిని వెలికి తీశారు. వాటి పరికరాలు తయారయ్యాయి. ఇటుకలను మలిచారు. ఆర్చీలు, అద్దాలు అమర్చిన కిటికీలు, ముద్రలు, కాలసూచిక, లిపి, సంఖ్యా గణనం, కాంస్యం.... అన్ని ఆవిర్భవించాయి. పట్టణీకరణ విప్లవం తర్వాతి రెండు వేల సంవత్సరాలలో మానవాళి ప్రగతికి దోహదపడే ఆవిష్కరణలు చాలా తక్కువ వచ్చాయి. అవి అంత ప్రాముఖ్యం కలిగినవి కూడా కావు."[81]

లోహం, నీటి చక్రాలు, లిపి, గణితం తదితర వాటిలో ప్రగతి గొప్ప నాగరికతల్లో సంభవించలేదు. అందుకు భిన్నంగా నగరాలకు దూరంగా ఉండే 'అనాగరిక' సమాజాల్లో ఈ ప్రగతి చోటు చేసుకుంది.[82]

క్రీస్తు పూర్వం 3000-2800 మధ్య ఈజిప్టు తొలి పాలకవంశ కాలంలో సృజనాత్మకత, ఆవిష్కరణ పర్వం వెల్లివిరిసింది. కాని సాయుధ బలగాలు, అధికారులతో కూడిన రాజ్య వ్యవస్థలో ప్రజలు నూతన ఉత్పాదనా పద్ధతులను ఆవిష్కరించలేకపోయారు. ఫలితంగా అభివృద్ధి స్తంభించిపోయిందని బ్రూస్ ట్రిగ్గర్ విశ్లేషించారు. వ్యవసాయ సమాజాలకు, నాగరిక సమాజాలకు మధ్య మౌలికమైన తేడా సృతనాత్మకత విషయంలోనే బహిర్గతమవుతుంది. దోపిడీ స్థాయి తీవ్రంగా ఉండేది. పాలకవర్గాలు, రాజ్య వ్యవస్థ చిహ్నాలు విస్తరించే కొద్దీ ప్రజల దోపిడీ కూడా ఎక్కువైంది. ఫలితంగా సమాజం మొత్తానికి జీవనోపాధిని కల్పించే మార్గాలు, సాధనాలు కుదించుకుపోయాయి.[83]

వ్యవసాయ శ్రమ నుండి విముక్తి పొందిన వర్గం ప్రకృతిపై మానవుని నియంత్రణను పెంచే విషయాన్ని పూర్తిగా విస్మరించింది. "అభివృద్ధి ప్రక్రియలో తీసుకున్న విప్లవాత్మకమైన చర్యలు చాలా వరకు శ్రమను తగ్గించే ఏర్పాట్లుగా తొలుత కనిపించినా ఆచరణలో అందుకు భిన్నంగా జరిగింది. పశుపోషణ, నౌకాయానం, లోహ పరికరాలు... ఇవి శ్రమను తగ్గించే సాధనాలు. కాని కొత్త పాలకులు వీటికి ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వకుండా భారీ స్థాయిలో శ్రామిక శక్తిని (కార్మికులు) కూడగట్టడంపైనే దృష్టి సారించారు. మూఢ నమ్మకాలను సృష్టించి ప్రజలపై తమ ప్రాబల్యాన్ని మరింత పెంచుకున్న పాలకులు సమాజంలోని విద్యావంతులైన

పురోహితులు, అధికారులలో శాస్త్రీయ దృక్పథాన్ని అలవర్చుడంపై ఎలాంటి శ్రద్ధ చూపలేదు.[85] సుమేరియా పాలకులు, ఈజిప్టు ఫారోలు తమను తాము దైవాంశ సంభూతులుగా ప్రకటించుకున్నారు. పట్టణీకరణ విప్లవం తొలి దశలో జరిగిన శాస్త్ర, సాంకేతికాభివృద్ధి అంతటితోనే ఆగిపోయింది. ఆ పరిజ్ఞానాన్ని దాదాపు భక్తి భావంతో కొలిచేవారు. రచనల ద్వారా అప్పటికే సార్థకమైన ఆలోచనలను వ్యాపింపచేసేవారు. కాని అదే సమయంలో నూతన పరిజ్ఞానాన్ని ఆర్జించడానికి కొత్తగా ఎలాంటి ప్రయత్నాలూ చేయలేదు. అధ్యయనం, అన్వేషణ పద్ధతులను అభివృద్ధి పరచలేదు. చరిత్రలో అనేకసార్లు ఏర్పడిన విజ్ఞాన స్తబ్దత ఈ దశలో కూడా వచ్చింది. విజ్ఞాన శాస్త్రం దైవశాస్త్రంగా, దైవశాస్త్రం మంత్రవిద్యగా కాలక్రమంలో దిగజారింది. విద్యావంతులు క్రియాశీలంగా వ్యవహరించలేకపోయారు.[85] ప్రకృతిపై మానవుని నియంత్రణను విస్తరించడం పోయి సామాజిక పరిస్థితులకు బెదిరి మిన్నకుండిపోయారు. మానవుల ఉత్పాదనా సామర్థ్యం వల్ల ఆవిర్భవించిన పాలకవర్గం ఇపుడు ఆ సామర్థ్యం పెరగకుండా నిరోధించింది. కాని అలాంటి ప్రగతి లేకుండా పాలకవర్గం తన వినియోగ దాహంవల్ల సమాజ వనరులను క్షీణింపజేసే ప్రమాదం నెలకొంది. సమాజంలోని జనబాహుళ్యానికి జీవనోపాధి సాధనాల కొరత ఏర్పడే వరకు దాని దోపిడీ కొనసాగింది. ఆ దశలో వాతావరణంలో కొద్దిపాటు మార్పు వస్తే చాలు, ప్రజలు ఆకలి దప్పులతో అల్లాడిపోయేవారు. సమాజ పునాదులు కదిలిపోయేవి. పాత రాజ్యం చివరి దశలో ఈజిప్టులో ఇలాగే జరిగింది. అప్పుడు నైలునదిలో వరదల స్థాయి పడిపోవడంతో సాగునీటి కొరత ఏర్పడి వ్యవసాయం సంక్షోభంలో పడింది. పాలకవర్గాల విపరీతమైన దోపిడీవల్ల 1,200 సంవత్సరాల క్రితం మెసో-అమెరికాలోని మాయా నాగరిక పతనమైందని విల్లీ, షిమ్కిన్‌లు సూచించారు :

> "సేవకులు, కార్మికులు, అప్పుడే పైకి వస్తున్న మధ్యతరగతి తదితర వర్గాల తోడ్పాటు కలిగిన పాలకవర్గం సమాజం మొత్తంపై ఆర్థిక ఒత్తిడిని విపరీతంగా పెంచి ఉంటుంది. సాధారణ ప్రజానీకంలో పౌష్టికాహారలేమి, వ్యాధులు ఎక్కువై వారిలో పని చేసే సామర్థ్యం తగ్గిపోయింది. ఇలాంటి అంతర్గత ఒత్తిళ్లు ఎన్ని ఉన్నా పతనం అంచున ఉన్న మాయ నాగరికత విజ్ఞానపరమైన లేదా శాస్త్రీయమైనప్రగతిని సాధించలేకపోయింది. సమాజ మనుగడకు తగిన మార్గాలను అన్వేషించలేకపోయింది. నిర్దిష్టంగా విశ్లేషిస్తే, మాయ పాలకవర్గం తన సాంప్రదాయ పంథాలో వినాశనం వైపు పయనించింది."[86]

## తొలి నాగరికతల్లో వర్గపోరాటాలు

సమాజంలోని ఇతర వర్గాలన్నింటిని పోషించే బాధ్యతగల పీడిత వర్గాల పేదరికం వివిధ వర్గాల మధ్య ప్రయోజనాల సంఘర్షణకు దారి తీసింది.

వర్గ విభజన మౌలికంగా స్వల్ప సంఖ్యలో ఉన్న పాలకవర్గం, దానిపై ఆధారప [illegible] రైతాంగం మధ్య ఉండేది. పాలకవర్గాల అపరిమిత [illegible]

ఘర్షణకు తెర తీసి ఉంటుంది. అయితే ఈ ఘర్షణల గురించి మనకు తెలిసింది చాలా తక్కువని నిజాయితీగా ఒప్పుకోవాలి. స్మారక చిహ్నాలపై గీసిన చిత్రాలు, ఆలయాలపై చెక్కిన శిలాశాసనాల విషయానికి వస్తే సాధారణ ప్రజలను పాలితులుగా, ఉన్నత వర్గాలకు లోబడి ఉన్నట్లుగా చిత్రీకరిస్తాయి. ఇలాంటి వర్ణనలు, చిత్రీకరణలు ఎలాంటి ఆశ్చర్యాన్ని కలిగించవు. ఎందుకంటే పాలక వర్గాల కోసం జనబాహుళ్యాన్ని అలాగే చిత్రీకరించేవారు. ఇందుకు చరిత్రే సాక్ష్యం. ఏది ఏమైనా, అనేక మంది చరిత్రకారులు, పురావస్తు శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం సామాజిక విప్లవం వల్లే ఈజిప్టు పాత రాజ్యం పతనమైంది. "ఐపూవర్ నిందాపర్వం" ప్రకారం బానిస బాలికలు తాము పని చేస్తున్న అంతఃపుర వాసాలను స్వాధీనం చేసుకునే పరిస్థితులు ఉండేవని, అధికారులు పీడిత ప్రజల పక్షాన పోరాడే సందర్భాలుండేవని, రాకుమారుల పిల్లలను గోడకేసి బాది చంపే అరాచక పరిస్థితి ఉండేదని ఊహించారు.[87] తియోతిహువాకన్, మోంటే అల్బన్, దక్షిణ మాయాలకు చెందిన మెసో-అమెరికా నాగరికతలు రైతాంగ విప్లవాల కారణంగా పతనమయ్యాయి.[88]

అయితే పాలకులు, పీడిత రైతుల మధ్యే ఉద్రిక్తతలు ఉండేవి కావు. తొలి సమాజాల నుండి సేకరించిన సాక్ష్యాధారం ప్రకారం పాలకవర్గంలోనే అంతర్గత వైరుధ్యాలు, వైషమ్యాలు పెరిగి పెద్దవయ్యాయి.

మెసొపొటామియా, మెసో- అమెరికాలలో తొలి పాలకవర్గాలు బహుశా ఆలయ పురోహితులుగా ఉండి ఉండొచ్చు. కాని మెసొపొటామియాలో పురోహితులతోపాటు రాజులు(పాలకులు) కూడా సమానంగా ఎదిగారు. లౌకికవాద అధికార యంత్రాంగం ఏర్పడి యుద్ధతంత్రం రాజ్యవ్యవస్థ ప్రధాన లక్షణంగా మారింది. పురోహితులు కాని ధనికులు తమ స్వంత వ్యవసాయ క్షేత్రాలను (రైతులు వీటిపై ఆధారపడేవారు)విస్తరించుకుంటూ ఆలయాలు, రాజభవనాలకు అవతల అభివృద్ధి చెందారు. అలాగే మెసో-అమెరికాలో యుద్ధతెగలు తమ అధికారాన్ని గణనీయంగా పెంచుకున్నాయి.[89]

ఈజిప్టులో పాలకులు ప్రాంతీయ పురోహితులు, గవర్నర్‌లపై ఆధారపడి 500మైళ్ల వైశాల్యం గల నైలు లోయను పాలించేవారు. ఆహార సరఫరా, వస్తూ సామాగ్రి, కార్మికులు రాచరిక రాజధానికి నిత్యం అందేలా ఏర్పాట్లు చేసుకున్నారు. పాలకులు తమకు ప్రదానం చేసిన జాగీర్లను పురోహితులు, గవర్నర్‌లు కాలక్రమంలో విస్తరించుకొని సామాజిక సంపదపై తమ పట్టును పదిలం చేసుకున్నారు. శతాబ్దాలు గడిచే కొద్దీ కేంద్ర పాలకుడితో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా వ్యవహరించడం మొదలు పెట్టారు. ఈ పరిణామానికి ఆయా పురోహితులు, స్థానిక అధికారులు నిర్మించిన భారీ స్మారక చిహ్నాలే సాక్షిభూతాలు.

పాత పాలకవర్గాలకు తోడు కొత్త దోపిడీవర్గాలు ఆవిర్భవించడంతో సమాజంపై అదనపు భారం పడింది. ఒకవైపు అదనపు ఉత్పత్తిని వినియోగించే ప్రజల సంఖ్య పెరగడంతో వ్యవసాయదారులపై ఒత్తిడి తీవ్రమైంది. మరోవైపు పాలక వర్గాల ఆధిపత్యానికి కొత్త దోపిడీవర్గాల నుండి సవాళ్లు ఎదురయ్యాయి. ఈ వర్గాలకు వనరులపై నియంత్రణ, సాయుధబలం, ఆలోచనలను వ్యాప్తి చేయగల సామర్థ్యం ఉండేవి. కేంద్ర పాలకుడి ప్రయోజనాలను

పరిరక్షించడానికి బదులు పురోహితులు, స్థానిక అధికారులు (ప్రాంతీయ గవర్నర్లు) తమ స్వంత ప్రయోజనాలకే ప్రాధాన్యం ఇవ్వడంతో అంతర్యుద్ధం చెలరేగి ఈజిప్టు పాత రాజ్యం పతనమైందని మనం విశ్లేషించాల్సి ఉంటుంది. కెంప్ అనే చరిత్రకారుడి ప్రకారం సాంప్రదాయ స్వభావం కలిగిన ఆకాంక్షలను నెరవేర్చుకునే దిశలో ఆయా దోపిడీ వర్గాల మధ్య ఘర్షణలు మొదలై అంతర్యుద్ధంగా రూపాంతరం చెందాయి.[90]

పాలకవర్గంలో చీలికలతోపాటు కొత్త అధికార వర్గాలు కూడా ఎదిగాయి. వడ్రంగులు, రాతి పని చేసేవారు, చర్మకారులు, నేతపనివారు, కంసాలి తదితర నైపుణ్యం కలిగిన చేతివృత్తిదారుల సముదాయాలు అభ్యున్నతిని సాధించాయి. వ్యవసాయ ఉత్పాదకత గణనీయంగా పెరగడంతో ఈ వర్గాలకు చేతివృత్తులపై అధిక సమయం వెచ్చించే అవకాశం లభించింది. కొందరు వ్యవసాయ పనుల నుండి పూర్తిగా విముక్తి పొందారు. అదనపు ఉత్పత్తి పాలకవర్గాల ఆధీనంలో ఉండడంతో ఈ వర్గాలలో ప్రతికూల వైఖరి మరింత బలపడింది. విలాస వస్తువులను మరింత ఎక్కువగా సరఫరా చేయాలని వారిపై పాలకులు, పురోహితుల ఒత్తిడి పెరిగింది. అదే సమయంలో ఆలయాలు, స్మారకచిహ్నాలు, రాజభవనాల నిర్మాణానికి కార్మిక శక్తిని గణనీయంగా అందించాలని రైతులపై కూడా ఒత్తిడి తెచ్చారు. దీనర్థం నైపుణ్యం కలిగిన కార్మికశక్తి అంతా ఆలయాలు, స్మారక చిహ్నాలు, రాజభవనాల చుట్టూ కేంద్రీకృతమైంది. ఆ విధంగా ఏర్పడిన కొత్త నగరాల జనాభాలో చేతివృత్తిదారుల సముదాయం ప్రధాన భాగంగా అవతరించింది.

ఇలాంటి సముదాయమే గిజా పిరమిడ్‌లను, ఈజిప్టు లోయలో రాజుల స్మారక చిహ్నాలను నిర్మించింది. సాధారణంగా అయితే, ఈ కట్టడాలను బానిసలు నిర్మించారని దాచిపెట్టిన బంగారు నిక్షేపాల ఆచూకీ పొక్కకుండా ఉండేందుకు పాలకులు వారిని హతమార్చారనే అభిప్రాయం ఉంది.[91] కాని అందులో ఎలాంటి వాస్తవం లేదు. భారీ పరిమాణంలో ఉన్న రాళ్లను తరలించడానికి రైతులను కార్మికులుగా బలవంతంగా వినియోగించి ఉండొచ్చు. అయితే క్రీస్తు పూర్వం 2000 సంవత్సరాల మధ్యకాలంలో థేబ్స్ (ఆధునిక లుక్సార్)లో వెలువడిన రచనలు నైపుణ్యంగల చేతివృత్తిదారుల పనితీరును వివరిస్తాయి. రాళ్ల తవ్వకం, శిల్పకళ, చెక్కపని అంతా వారే చేపట్టారని చెబుతాయి. రాతిగృహాలతో కూడిన ప్రత్యేక గ్రామాల్లో వారు నివసించేవారు. తిండి గింజలు, నూనె, చేపల రూపంలో వారికి వేతనాలు లభించేవి. ప్రతి కుటుంబంలో పది మంది వరకు సభ్యులు ఉండేవారు. సగటు వ్యవసాయదార కుటుంబం కంటే చేతివృత్తిదారుల కుటుంబం మూడు రెట్లు ఎక్కువ ఆదాయం పొందేది. ఎనిమిది గంటల పని దినం అమల్లో ఉండడంవల్ల వారికి తమ నైపుణ్యాన్ని పెంచుకునేందుకు చాలా సమయం లభించేది. అలాగే అదనంగా పని చేయడంవల్ల తమ జీవన ప్రమాణాలను పెంచుకునేవారు. చేతివృత్తిదారుల్లో కొందరు విద్యావంతులు కూడా ఉండేవారు. అయితే వీరికి స్వేచ్ఛ ఉండేది కాదు. రహస్య పోలీసులు, ముఠామేస్త్రీలు వారిపై కఠినమైన ఆంక్షలు విధించేవారు. కనీసం ఒక సందర్భంలోనైనా ఫారో వజీరు వద్ద ఉన్న అదనపు కార్మికులను నిర్మాణ పనులకు బలవంతంగా వినియోగించుకునేవారు.[92] కాని క్రీస్తు పూర్వం 1170లో కార్మికులు తమ భార్యల మద్దతుతో చరిత్రలో తొలిసారిగా నమోదైన

సమ్మెల్లో పాల్గొన్నారు. శ్రమకు ప్రతిఫలంగా అందించే ఆహార ధాన్యాలు, తదితర వినియోగవస్తువులు సకాలంలో అందకపోవడం, తమ కుటుంబాలు ఆకలితో అలమటిస్తుండడంతో కార్మికులు సమ్మెకు దిగారు.[93]

ఆధునిక పరిభాషలో చెప్పాలంటే వీరు వేతన కార్మికులు కారు. ఎవరి కోసం పని చేయాలో నిర్ణయించే స్వేచ్ఛ లేకపోవడం, శ్రమకు బదులు వస్తు రూపంలో వేతనాలు లభించడం, జీవనోపాధి కోసం రాజ్య వ్యవస్థ నియంత్రణలోని కేంద్రీకృత పంపిణీలపై ఆధారపడడంవల్ల వారిని వేతనకార్మికులుగా పరిగణించలేము. ఈ కారణంగా రాజ్యానికి స్వతంత్రంగా వ్యవహరించే సామర్థ్యం కార్మికుల్లో కొరవడింది. రాజ్య వ్యవస్థను సవాలు చేసే ఆలోచనలను కూడా రూపొందించలేకపోయారు. విశేషమేమిటంటే వీరు పాలకవర్గాల దేవతలను ఆరాధించేవారు. పాలకులను భక్తి భావంతో గౌరవించేవారు. అదే సమయంలో తమకు ఇష్టమైన ఆరాధ్యదైవాలను కూడా కొలిచేవారు.

అయినప్పటికీ భౌగోళిక కేంద్రీకరణ, విద్యాభ్యాసం పీడిత వర్గాల్లో విశ్వాసాన్ని కలిగించాయి. సుమారు 1500 సంవత్సరాలకు పైబడి తమను దోచుకుంటున్న పాలకులను సవాలు చేసే ధైర్యాన్ని ప్రజలు ప్రదర్శించగలిగారు. భవిష్యత్ పరిమాణాలకు వారి వైఖరి సూచికగా ఉండేది. తమ వర్గం కోట్లాది ప్రజలతో ప్రబలంగా ఎదగగలదనే నమ్మకం వారిలో ఉండేది.

చేతివృత్తిదారుల వర్గంతో సమాంతరంగా వ్యాపారుల వర్గం కూడా అభివృద్ధి చెందింది. తొలి నాగరికతల్లో చాలా వరకు ఈ పరిణామం కనిపించింది. వర్గరహిత సమాజాల్లో ముందుగానే వ్యాపారం అభివృద్ధి చెందింది. ఉదాహరణకు ఒక ప్రాంతంలో తయారు చేసిన పరికరాలు వందలాది మైళ్ల దూరంలో కూడా ఉపయోగంలో ఉండేవి. కాని వర్గ సమాజాల్లో వ్యాపారులకు ఎనలేని ప్రాముఖ్యత ఏర్పడింది. పాలకులు విలాస వస్తువులు, ముడిసరుకులు, నిర్మాణ సామాగ్రి (భవనాలు, ఆలయాల నిర్మాణానికి) కోసం వ్యాపారులపై ఎక్కువగా ఆధారపడేవారు. వ్యక్తులు లేదా సముదాయాలు ప్రమాదంతో కూడుకున్న దుర్భరమైన సుదూరప్రయాణం చేయడానికి అంగీకరిస్తే తప్ప పై వస్తువులను సమకూర్చుకోవడం సాధ్యమయ్యేది కాదు. ఇలాంటి ప్రజలు పాలకవర్గాల నుండే రావడం దాదాపు మృగ్యమనే భావించాలి. వ్యాపారులు పీడిత రైతాంగానికి చెందిన వారు లేదా గ్రామీణ సమాజం నుండి వచ్చేవారు. వ్యాపారానికి ప్రాముఖ్యత పెరగడంతో వ్యాపారుల ప్రాబల్యం కూడా పెరిగింది. పాలకవర్గంపై స్వంతంగా ఒత్తిడిని తెచ్చే స్థాయిలో వారు సంపదను కూడబెట్టారు. ఒక దశలో వ్యాపార వర్గాల ప్రాబల్యం ఉన్న పట్టణాలు, నగరాలు ఆవిర్భవించడం మొదలుపెట్టాయి. ఫర్టైల్ క్రిసెంట్ లోయలోని సిప్పార్ నగరం ఇందుకో చక్కటి ఉదాహరణ.

అయితే వ్యాపార వర్గం చాలా వరకు విశాల సమాజానికి దూరంగా ఉండేది. కాలక్రమంలో ఆ సరిహద్దు విస్తరించింది. చేతివృత్తిదారులు లాగా సమాజాన్ని ఎలా నియంత్రించాలన్న ఆలోచన వ్యాపారుల్లో కూడా ఉన్నట్లు ఎలాంటి సూచనలు కనిపించవు.

చేతివృత్తి, వ్యాపార వర్గాలు ఆశించిన స్థాయిలో అభివృద్ధి సాధించకపోవడం

మూలంగా సమాజంలో తీవ్ర సంక్షోభాలు తలెత్తినపుడు దానిని పునర్వ్యవస్థీకరించే అధికారం గల సామాజిక వర్గం ఏదీ లేకుండా పోయింది. ప్రకృతిపై మానవుని నియంత్రణను పెంచే సామర్థ్యం పాలకవర్గాల్లో క్షీణించిపోయింది. ఫలితంగా సమాజంలో పేదరికం, ఆకలి సర్వవ్యాపిత మయ్యాయి. అదేసమయంలో సమాజాన్ని అభివృద్ధి వైపు నడిపే సామర్థ్యం ఇతర వర్గాల్లో కూడా ఉండేది కాదు. తమను దోచుకుంటున్న పాలకులకు వ్యతిరేకంగా నిలబడే ధైర్యం రైతులకు వచ్చింది. కాని ఆకలికి స్పందనగా మొత్తం దిగుబడిని వారు వినియోగించారు. నాగరికత వ్యవస్థల మనుగడకు ఏమీ మిగల్చలేదు. ఫలితంగా పట్టణాలు, విద్యావంతుల వర్గం, కాలువలు, జలాశయాలను పర్యవేక్షించే వర్గాలు తీవ్ర సంక్షోభంలో పడిపోయాయి.

పతనమైన క్రేట్, మైసీనియా, హరప్పా, మొహంజొదారో, తియోతిహువాకన్, మోంటే ఆల్బన్, మాయ నాగరికతల్లో ఈ ఫలితాలు స్పష్టంగా కనబడతాయి. నగరాలు నిర్మానుష్య మయ్యాయి. వికసిస్తున్న సంస్కృతులు పెరిగిపోయాయి. అత్యధిక శాతం మంది ప్రజలు స్వచ్ఛమైన వ్యవసాయ జీవితానికి తిరిగి వెళ్లారు. ఐదు వందల సంవత్సరాలు లేదా అంతకంటే ముందు వరకు వారి పూర్వీకులు గడిపిన గ్రామీణ జీవితానికి మళ్లీ ప్రాణం పోశారు.

పైన చర్చించబడిన నాగరికతల గురించి ఏమీ తెలియని సమయంలో కారల్ మార్క్స్ "రాజకీయ అర్థిక శాస్త్రం – విమర్శ" అనే గ్రంథంలో ముందుమాటను రాస్తూ ఇలా వ్యాఖ్యానించారు :

> "ప్రజలు తమ సామాజిక ఉత్పాదనా జీవితంలో తమ సమ్మతితో నిమిత్తం లేని నిర్దిష్టమైన సంబంధాలను ఏర్పరచుకుంటారు. ఈ ఉత్పత్తి సంబంధాలు వారి భౌతిక ఉత్పత్తి శక్తులలో ఒక నిర్దిష్టమైన ప్రగతిని సూచిస్తాయి. ఉత్పత్తి సంబంధాలు మొత్తంగా సమాజంలోని ఆర్థిక వ్యవస్థను నిర్మిస్తాయి. దాని పునాదులపై చట్టపరమైన, రాజకీయపరమైన ఉపరి నిర్మాణం ఏర్పడుతుంది. ఈ వ్యవస్థకు సామాజిక అవగాహనకు సంబంధించిన వివిధ రూపాలు నిర్దిష్టంగా ఉంటాయి. తమ ప్రగతిలో ఒక దశలో సమాజ భౌతిక ఉత్పత్తి శక్తులు అప్పటికే అమల్లో ఉన్న ఉత్పత్తి సంబంధాలతో ఘర్షణ పడతాయి. వేరే మాటల్లో చెప్పాలంటే ఆస్తి సంబంధాలతో అవి ఘర్షణ పడతాయి. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి స్వరూపాలకు ఈ సంబంధాలు వైరుధ్యాలుగా మారతాయి. అప్పుడు సామాజిక విప్లవ యుగం మొదలవుతుంది." [94]

అయితే అలాంటి యుగానికి ఒకటికి మించిన పరిణామం ఉంటుంది. కమ్యూనిస్టు ప్రణాళికలో మార్క్స్ పేర్కొన్నట్లు వర్గ పోరాటాలు చారిత్రకంగా సమాజం మొత్తాన్ని విప్లవాత్మకమైన రీతిలో పునర్వ్యవస్థీకరిస్తాయి. లేదా ఘర్షణ పడుతున్న వర్గాలు ఉమ్మడిగా నశించిపోతాయి.[95]

పై పరిణామాలు మార్క్స్ విశ్లేషణను సార్థకం చేస్తాయి. ఒకప్పుడు ఉత్పత్తి శక్తులను అభివృద్ధి పరచడంలో కీలక పాత్ర పోషించిన పాలకవర్గం వాటి అభివృద్ధి తర్వాత తిరోగమన శక్తిగా మారి సమాజం మొత్తాన్ని ఘర్షణ వైపు నడిపించింది. కాని అధునాతన ఉత్పాదనా మార్గాలతో

మమేకమైన కొత్త వర్గం ఆవిర్భవించకపోవడం, పాత పాలకవర్గాలను కూలదోసి సమాజం మొత్తంపై తన ప్రాబల్యాన్ని చాటుకునే సామర్థ్యం లేకపోవడంతో సంక్షోభం తలెత్తినా అది ఉత్పత్తి శక్తులను మరింత అభివృద్ధి వైపు నడిపించలేకపోయింది. అందుకు భిన్నంగా, పోటీ వర్గాలు నశించిపోయాయి. పట్టణాలు, అక్షరాభ్యాసం, అధునాతన ఉత్పత్తి పద్ధతులు లేని పాశవికత వైపు సమాజాలు వెనుకడుగు వేశాయి.

## ఆక్రమణ - మార్పు

మార్పు విశ్లేషణతో ఈజిప్టు, మెసొపొటామియా చరిత్రలు సరితూగవు. ఈ ఉదంతాల్లో వ్యవస్థ పునఃనిర్మాణం పాత సామాజిక జీవన విధానాలు, శతాబ్దాల తరబడి అరాచకం, అంతర్యుద్ధం, కరవుల తర్వాతే సాధ్యమైంది. పాలకవర్గంలోనే అధికార మార్పిడి (మెసొపొటామియాలో పురోహితుల నుండి పోరాట వీరులకు, ఈజిప్టు విషయంలో మేంఫిస్ నుండి థేబ్స్‌కు)తో పాటు మెసొపొటామియా విషయంలో ఆక్రమణదారులు తెచ్చిన ధనరాశులు, ఈజిప్టు నైలు విస్తీర్ణం పెరగడం లాంటి పరిణామాలు ఆర్థిక సంక్షోభాన్ని నివారించగలిగాయి. అలాగే కొన్ని వందల సంవత్సరాలపాటు సమాజం పాత విలువల ఆధారంగా మనగలిగే అవకాశం కలిగింది. కాని సంక్షోభానికి మూలమైన మౌలిక కారణాలను ఈ పరిణామాలు తొలగించలేకపోయాయి. పట్టణీకరణ విప్లవం తొలి దశలో కనిపించిన విజ్ఞాన ప్రగతిని సమాజాలు సాధించలేకపోయాయి. జీవనోపాధిని కల్పించే కొత్త మార్గాలను అన్వేషించలేక పోయాయి. తీవ్రమైన సంక్షోభాలు తలెత్తే అవకాశాలు ఎల్లప్పుడూ ఉండేవి.

మెసొపొటామియాలో ఆక్రమణదారులు కేంద్రీకృతమైన మహా సామ్రాజ్యాలను స్థాపించారు. ఒక పట్టణ కేంద్రం నుండి మరో పట్టణ కేంద్రంవైపు భారీ సైన్యాలతో కదులుతూ ప్రతిఘటనను అణచివేశారు. సామ్రాజ్యాలను కట్టుదిట్టంగా పాలించారు. (ఆక్రమణదారులు అప్పటికే ఉన్న నగరాల నుండి లేదా గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చి ఉంటారు) కాని ఈ ప్రక్రియ అంతంత మాత్రంగా ఉన్న వనరులను మరింత క్షీణింపచేసింది. రాచరిక ఖజానాలు ఖాళీ అయ్యాయి. కేంద్ర పాలకుడు ప్రాంతీయ పెత్తందార్లకు వారి ప్రాబల్యం ఉన్న ప్రాంతాలపై అధికారాన్ని చట్టబద్ధం చేసే వరకు సామ్రాజ్యం ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంది. ప్రాంతీయ అధికార కేంద్రాలు వ్యవస్థాగతమైన తర్వాతే కేంద్ర పాలకుడు తన సామ్రాజ్యంలోని అదనపు సంపదను సమకూర్చుకోగలిగాడు. పర్యవసానంగా సామ్రాజ్య సంరక్షణ బలహీనమైంది. సామ్రాజ్యంలోని తిరుగుబాటు సైనికాధికారి కాని బయటి ఆక్రమణదారుడు కాని అధికారాన్ని హస్తగతం చేసుకొనే అవకాశాలు ఎక్కువయ్యాయి.

సారవంతమైన చంద్రవంక చరిత్రలో ఆక్రమణదారుల వారసత్వాన్ని పాత నిబంధనంలో విపులంగా వివరించారు. ఆమోరైట్లు, కాసైట్లు, అస్సీరియన్లు, హిట్టైట్లు, మేడీలు, పర్షియన్లు... ఈ లోయను వరుసగా పాలించారు.

కొన్ని వందల ఏళ్ల వరకు ఎడారులు ఈజిప్టును సైనిక దురాక్రమణల నుండి రక్షించగలిగాయి. కాని మరో 'పెద్ద సంక్షోభాన్ని' ఈ పరిస్థితి నివారించలేకపోయింది. క్రీస్తు పూర్వం 1700-1600 మధ్య 'రెండవ అంతరాల' కాలం ఏర్పడింది. అప్పుడు విదేశీ ప్రభావా...

ప్రతీకారేచ్ఛతో ప్రబలిపోయాయి. ఉత్తర భాగంలో హిక్సోస్ ప్రజలు (వీరు ఖచ్చితంగా పాలస్తీనాకు చెందిన వారు) ఫారోలుగా తమను తాము ప్రకటించుకున్నారు. దక్షిణ భాగంలో కుష్‌కు చెందిన నూబియన్ రాజ్యం తన ప్రాబల్యాన్ని చాటుకుంది. ఒకవైపు ఈజిప్టు నశించిపోతుంటే మరోవైపు పాలస్తీనా, నూబియాలు వేగంగా అభివృద్ధి చెందుతున్న సమాజాలకు కేంద్రాలుగా అవతరించాయి. గతంలో ఎన్నడూ లేని విధంగా పాలస్తీనా ప్రజలు శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని పెద్ద ఎత్తున వినియోగించుకున్నారు. ముఖ్యంగా చక్రాన్ని చాలా అభివృద్ధి పరిచారు.

క్రీస్తు పూర్వం 1582లో పాలస్తీనా పాలకులను తరిమివేసి "కొత్త రాజ్యాన్ని" ఏర్పాటు చేసిన ఈజిప్టు పాలకులు సాంకేతికాభివృద్ధి కారణంగానే విజయం సాధించగలిగారు. చేతివృత్తి దారులు, వ్యాపార వర్గాల అభ్యున్నతికి పూర్తి అవకాశం కల్పించడం ద్వారా కొత్త పాలకులు గణనీయమైన ప్రగతిని సాధించినట్లు బోధపడుతోంది.

పునరుద్ధరణకు గురైన మెసొపొటామియా, ఈజిప్టు నాగరికతలు రెండూ తమ పూర్వ స్వరూపాలకు పూర్తి భిన్నంగా రూపాంతరం చెందాయి. సమాజంలో మధ్య తరగతికి ఎన్నడూ లేని ప్రాముఖ్యత ఏర్పడింది. ఈ వర్గంలో వ్యాపారులు, వృత్తిపరమైన సైనికులు, కింది స్థాయి అధికారులు, పురోహితులు, నైపుణ్యం కలిగిన కళాకారులు సమీకృతమయ్యారు. వీరు పెద్ద కుటుంబాలపై ఆధారపడడం మానేశారు. ఉన్నత వర్గాలతో స్వతంత్రంగా సహజీవనం చేశారు.[96]

పాత రాజ్యం చివరి దశ, మధ్య రాజ్యం అంతటా నెలకొన్న స్తబ్ధతకు, కొత్త రాజ్యం తొలి శతాబ్దాలలో కనిపించిన క్రియాశీలతకు మధ్య తీవ్రమైన వైరుధ్యం కనిపిస్తుంది. ఈ కాలంలో ఫారోలు పాలస్తీనా, సిరియా, దక్షిణాన ఆఫ్రికాలపై దండయాత్రలు నిర్వహించారు. ఆక్రమణలవల్ల కొత్త ముడి సరుకులు, విలాస వస్తువులు కొత్త రాజ్యంలో వెల్లువలా వచ్చి పడ్డాయి. అదే సమయంలో దేశీయ ఉత్పత్తి నుండి అదనపు నిల్వలు భారీగా సమకూరడంతో వైభవోపేతమైన స్మారక చిహ్నాలు, విలాసవంతమైన రాజప్రసాదాలు నిర్మించడానికి వీలుపడింది. ఫారోలే కాక ప్రధాన పురోహితులు, ప్రాంతీయ అధికారులు కూడా భారీ కట్టడాలను నిర్మించారు. ఉత్పాదకత గణనీయంగా పెరిగిందని దీనిని బట్టి అర్ధమవుతుంది.[97]

గట్టి లోహమైన కాంస్యం రాగి స్థానాన్ని ఆక్రమించింది. కాంస్యాన్ని మలచడం తేలిక కనుక పరికరాలన్ని ఆ లోహంతోనే తయారయ్యాయి. యుద్ధ తంత్రంలో గుర్రపు బండ్లను ఎక్కువగా వినియోగించారు. అంతర్గత సమాచార వ్యవస్థను పటిష్టం చేశారు. రైతులకు నీటి పారుదల సౌకర్యం మెరుగుపడింది. బావుల నుండి, చెరువుల నుండి నీళ్లను తోడడానికి వెదురుబొంగు, బకెట్‌లను వాడారు. ఈజిప్టు సామాజిక వ్యవస్థ విదేశీ ఆక్రమణతో క్రియాశీలమైంది. సుమారు వెయ్యేళ్లపాటు కొనసాగిన స్తబ్ధత తొలిగిపోయి జీవనోపాధి మార్గాలు మెరుగయ్యాయి. కొన్ని సందర్భాల్లో కొత్త ఉత్పత్తి సంబంధాలపై ఆధారపడి ఆవిర్భవించిన సామాజిక వర్గం బలంగా లేకపోయినా విదేశీ శక్తి తాత్కాలికంగానైనా పాత రాజ్య వ్యవస్థ సృష్టించిన ప్రతిబంధకాలను సామాజిక జీవనం నుండి తొలగించేదని ఈ పరిణామం రుజువు చేస్తుంది.

# పరిణామ క్రమం

***క్రీ.పూ.1000-500***

లోహ పరిశ్రమల విస్తరణ. ఆసియా, ఐరోపా, పశ్చిమ-మధ్య ఆఫ్రికాలలో ఆయుధాలు, పరికరాల తయారీ ముమ్మరం. పశ్చిమాసియా, దక్షిణాసియా, మధ్యధరా ప్రాంతాలలో శబ్ద ఆధారిత లిపి అభివృద్ధి.

భారతదేశంలోని గంగాలోయలో వ్యవసాయ విస్తరణ. కొత్త నాగరికత ఆవిర్భావం. నాలుగు కులాల (వర్ణ) వ్యవస్థ ఏర్పాటు. వైదిక మతం ఆవిర్భావం.

ఫొనేషియా, గ్రీసు, ఇటలీలలో నగర రాజ్యాలు. పశ్చిమాసియా ఏకీకరణ. మెసొపొటామియా లేదా నైలు ఆధారంగా వైరి సామ్రాజ్యాలు. చైనాలో చిన్న చిన్న యుద్ధ రాజ్యాలు.

***క్రీ.పూ.600-300***

ప్రఖ్యాత నాగరికతల విస్తరణ. చైనాలో కన్‌ఫూషియస్, మెన్షియస్. భారత్‌లో బుద్ధుడు. గ్రీసులో అషిలస్, ప్లాటో, అరిస్టాటిల్, డెమోక్రటస్. గ్రీసులో వర్గపోరాటాలు.

అలెగ్జాండర్ నేతృత్వంలోని మెసిడోనియా సైన్యాలచే పశ్చిమాసియా ఆక్రమణ. దక్షిణాసియాను శాసించిన అశోకుని మౌర్య సామ్రాజ్యం.

రోములో కార్మికులు, ఉన్నత వర్గాల మధ్య ఘర్షణలు. ఇటలీనంతా ఆక్రమించిన రోము నగరం.

***క్రీ.పూ.300-1***

భారత్‌లో మౌర్య సామ్రాజ్య విచ్ఛిన్నం. అయితే నిరంతరంగా ప్రగతిని సాధించిన వాణిజ్యం, చేతివృత్తులు. గోవధను వ్యతిరేకించిన హిందూ బ్రాహ్మణులు.

ఉత్తర చైనాను ఏకం చేసిన తొలి చిన్ చక్రవర్తి. గణనీయమైన ప్రగతిని సాధించిన లోహ హస్తకళాకృతుల పరిశ్రమలు. వ్యాపార, వాణిజ్య విస్తరణ. మహా ప్రాకార నిర్మాణం. కాలువలు, రహదారుల వ్యవస్థల ఏర్పాటు. హన్ వంశాన్ని అధికారంలోకి తెచ్చిన రైతాంగ విప్లవం. మధ్యధర ప్రాంతాన్నంతటిని ఆక్రమించిన రోము. రైన్ నది దక్షిణాన ఉన్న ఐరోపాను

హస్తగతం చేసుకున్న రోమను సామ్రాజ్యం. ఇటలీలో పెరిగిన రైతుల పేదరికం, బానిసత్వం. క్రీ.పూ.133, 121 సంవత్సరాలలో హత్యకు గురైన గ్రాఘస్ సోదరులను సమర్థించిన రైతులు. 130 దశకంలో సిసిలీలో బానిస విప్లవాలు. 70 దశకంలో స్పార్టకస్ నేతృత్వంలో ఇటలీలో చెలరేగిన బానిస విప్లవాలు. అంతర్యుద్ధాలు. 45లో అధికారం చేపట్టిన జూలియస్ సీజర్. 27లో చక్రవర్తిగా మారిన అగస్టస్.

***క్రీ.శ.1-200***

శిఖర స్థాయికి చేరిన రోమను సామ్రాజ్యం. పాలస్తీనాలో తిరుగుబాటు అణచివేత (క్రీ.శ.70). యూదు మతం నుండి చీలిపోయిన క్రైస్తవుల కొత్త తెగకు నాయకత్వం వహించిన పౌల్ (టార్సస్)

చైనాలో స్టీలు తయారీ. కొరియా, మధ్య ఆసియా, దక్షిణ చైనా, ఇండోచైనాకు విస్తరించిన హన్ సామ్రాజ్యం. రాజ్య సిద్ధాంతంగా మారిన కన్‌ఫ్యూషియనిజం.

దక్షిణ భారతం, ఆ తర్వాత మలయ, కంబోడియాలకు విస్తరించిన రైతాంగ వ్యవసాయం, హిందూ మతం. మహా బౌద్ధ విహారాలకు నిధులు సమకూర్చిన భారత వ్యాపారులు. టిబెట్, సిలోన్‌కు విస్తరించిన బౌద్ధ మతం.

***క్రీ.శ.200-500***

పతనమైన చైనా హన్ సామ్రాజ్యం. నిర్వీర్యమైన పట్టణ ఆర్థిక వ్యవస్థ. భూస్వామ్య జాగీర్లుగా మారిన గ్రామీణ ప్రాంతాలు. ప్రాచీన సాహిత్యంలో ఆసక్తిని కోల్పోయిన ప్రజలు. కొన్ని వర్గాలలో విస్తరించిన బౌద్ధం.

ఐదవ శతాబ్దంలో భారతదేశాన్ని చాలా వరకు ఏకం చేసిన గుప్త సామ్రాజ్యం. కళలు, శాస్త్రాలు అభివృద్ధి.

రోమను సామ్రాజ్యాన్ని కుదిపేసిన సంక్షోభాలు. స్తంభించిన ఆర్థిక, సాంకేతిక అభివృద్ధి. తగ్గుముఖం పట్టిన వాణిజ్యం. బానిసత్వం స్థానంలో రైతుల నుండి కౌలు, పన్నుల సేకరణ. ఫ్రాన్స్, స్పెయిన్‌లలో రైతుల తిరుగుబాటు. సామ్రాజ్య సరిహద్దు సంరక్షణలో తీవ్ర రూపం దాల్చిన సమస్యలు. ఒసిరిస్, మిథారిజం, క్రైస్తవ మతంలో వివిధ తెగల ఆవిర్భావం.

రాజధానిని గ్రీకు నగరమైన బైజాంటియమ్‌కు తరలించిన కాన్‌స్టంటైన్ (330 ఎడి) సామ్రాజ్య అధికార మతంగా క్రైస్తవం. క్రైస్తవేతర మతాలు, మత నమ్మకాలు, యూదుల అణచివేత. మత సంస్థల విస్తరణ. సామ్రాజ్యవిభజన. సామ్రాజ్య వశమైన ఇంగ్లాండ్ (407). రోమ్‌ను ధ్వంసం చేసిన అలారిక్ గోథ్‌లు (410)

***క్రీ.శ.500 - ఆ తర్వాత***

పశ్చిమ ఐరోపాలో 'చీకటి యుగాలు'. సగానికి సగం తగ్గిపోయిన జనాభా. క్షీణించిన వాణిజ్యం, పట్టణ జీవనం, విద్య.

మనుగడ సాగించిన ఈశాన్య సామ్రాజ్యం. 530-550 మధ్య జస్టీనియస్ నేతృత్వంలో పతాక స్థాయికి చేరుకుని ఆ తర్వాత విచ్ఛిన్నమైన ఈశాన్య సామ్రాజ్యం. సెయింట్ సోఫియా కాథిడ్రల్ నిర్మాణం.

భారతదేశంలో పతమైన గుప్త సామ్రాజ్యం. క్షీణించిన వాణిజ్యం, పట్టణాలు, బౌద్ధం, ధన వినియోగం. ఫ్యూడల్ ప్రభువుల సేవలో చేరిన వ్యవసాయదారులు, హస్తకళాకారులు. స్వయం సమృద్ధి గ్రామాలలో జీవనం. బ్రాహ్మణ పురోహితుల సిద్ధాంతపరమైన ఆధిపత్యం. సంపూర్ణంగా ఏర్పాటైన కుల వ్యవస్థ. క్షీణించిన సాహిత్యం, శాస్త్రం, కళలు.

581లో సుయ్ వంశం ఆవిర్భవించే వరకు విచ్ఛిన్న దశలో పయనించిన చైనా. 618లో అధికారంలోకి వచ్చిన త'ఆంగ్ వంశ పాలనలో మళ్లీ పుంజుకున్న వాణిజ్యం, ఆర్థిక వ్యవస్థ.

ఒకటవ అధ్యాయం

# లోహం - సామ్రాజ్యాలు

నాగరిక చరిత్రలో రెండవ గొప్ప దశ మహా సామ్రాజ్యాల చుట్టూ గ్రామీణ ప్రాంతాలలో జీవించిన రైతులు, వ్యాపారులలో ప్రారంభమైంది. ఫారోలు, పురోహితుల ఆధిపత్యమున్న రాజ్యాలలో చలనం అంతగా కనిపించలేదు. పట్టణీకరణ విప్లవ విజయాల నుండి చాలా నేర్చుకున్న ప్రజల తదుపరి ప్రయత్నాలపైనే ఈ రెండవ దశ ఆధారపడి ఉండేది. దోపిడీకి, సాంప్రదాయ విలువలకు దూరంగా ఉంటూ రాగి, కాంస్యాన్ని వినియోగిస్తూ, చక్రాన్ని మరింత సమర్ధవంతంగా ఉపయోగంలోకి పెడుతూ, చివరికి విదేశీ లిపిని తమ స్వంత భాషలను రాయడానికి వాడుతూ అభ్యున్నతి సాధించిన ప్రజలే ఈ దశను ముందుకు తీసుకెళ్లారు.

పట్టణీకరణ విప్లవం సాధించిన సాంకేతిక ప్రగతిని వినియోగించడం మొదలు పెట్టిన సమాజాలు యురేషియా, ఆఫ్రికా అంతటా విస్తరించి ఉండేవి. మహా సామ్రాజ్యాల చిన్నస్థాయి అనుకరణలుగా కొన్ని సమాజాలు అభివృద్ధి చెందాయి. పాత నిబంధనలలో వివరించబడిన సొలొమన్ సామ్రాజ్యం (పాలస్తీనా) ఈ కోవకే చెందుతుంది. తొలుత కొన్ని సమాజాలకు ఎలాంటి బరువు బాధ్యతలు ఉండేవి కావు. విశాలమైన, ఖరీదైన, ఆశ్చర్యం గొలిపే మహా కట్టడాలు లేకుండానే అవి మనుగడ సాగించాయి. కొత్త ఆవిష్కరణలను చేపట్టడానికి ప్రజలకు పూర్తి స్వేచ్ఛ ఉండేది. అలా చేయడానికి వారికి ప్రోత్సాహకాలు కూడా లభించేవి.

ఆధునిక శాస్త్రీయ, సాంకేతిక పద్ధతుల ఆమోదంతోపాటు మరో పరిణామం కూడా సంభవించింది. పాత వ్యవస్థలవలే సమాజ అదనపు సంపద పాలకవర్గాల చేతుల్లో కేంద్రీకృతమైంది. అయితే ఈ కొత్త పాలకవర్గాల స్వభావం వేరుగా ఉండేది. తొలినాగరికతలలో అందుబాటులో ఉన్న భూముల కంటే ఇప్పటి భూములు అంతసారవంతమైనవి కాకపోవడంతో పాలకవర్గాలు అధునాతన వ్యవసాయ పద్ధతులను ప్రోత్సహించక తప్పలేదు. అలా ప్రోత్సహించకపోతే అదనపు నిల్వలను సమకూర్చుకోవడం వారికి సాధ్యమయ్యేదికాదు. పాత నాగరికతల స్థాయిలో ధాన్యాల నిల్వలను పొందలేకపోయారు.

కాలక్రమంలో వారు ప్రాచీన నాగరికతల్లో నెలకొన్న తీవ్ర సంక్షోభాలను తమకు అనుకూలంగా మలచుకున్నారు. మహా సామ్రాజ్యాలు ఒకవైపు అంతర్గతంగా బలహీనమవుతుంటే

మరోవైపు కొత్త పాలకవర్గాలు బయటి నుండి వారిని ధ్వంసం చేస్తూ వచ్చాయి. అప్పటికే క్షీణిస్తున్న సింధూ నాగరికతపై కాస్పియన్ ప్రాంతానికి చెందిన 'ఆర్యులు' దాడి చేశారు. నైరుతి ఐరోపా నుండి ఇండో–ఐరోపా భాషను మాట్లాడే ప్రజలు మైసీనియా నాగరికతను ధ్వంసం చేశారు. అనామక సముద్ర జాతి ప్రజలు ఈజిప్టుపై దాడి చేశారు. హిట్టైట్‌లు మెసొపొటామియాను స్వాధీనం చేసుకున్నారు. కొత్తగా ఆవిర్భవించిన షావ్ వంశం చైనాలో షాంగ్ వంశాన్ని తుడిచిపెట్టింది.

మెసొపొటామియా, ఈజిప్టు, చైనాలలో నాగరికత మౌలికంగా ఎలాంటి మార్పులకు లోనుకాలేదు. అనతి కాలంలోనే సామ్రాజ్యాలు పునరుత్థానమయ్యాయి. కొత్త ఉత్పత్తి పద్ధతుల ఆధారంగా అవి మళ్లీ ప్రాణం పోసుకున్నాయి. సింధూ, మైసీనియా నాగరికతలు ఆక్రమణకు గురికావడంతో పట్టణ జీవనం, విద్యాభ్యాసం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. అయినా ఈ ఉదంతాల్లో విదేశీ దురాక్రమణ పూర్తిగా ప్రతికూల ఫలితాలకు దారి తీయలేదు. విదేశీ దండయాత్ర అందుకు భిన్నమైన పాత్రను పోషించింది.

ఒక వైపు ఆక్రమణదారులు పాత ఉత్పత్తి వ్యవస్థను పాక్షికంగా నాశనం చేశారు. ఉదాహరణకు సింధూ నగరాలను పోషించిన నీటిపారుదల పనులు. మరోవైపు తమతోపాటు అధునాతన ఉత్పత్తి పద్ధతులను తీసుకొచ్చారు. ఉదాహరణకు కాడెద్దులు సహాయంతో భూమిని దున్నే నాగలి. దీనివల్ల ఉత్తర భారత మైదానప్రాంతాలలో గట్టి నేలలను దున్నడం సాధ్యమైంది. రైతాంగ ఉత్పత్తి పెరిగింది. చివరికి ఆ ప్రాంతంలో గతం కంటే చాలా ఎక్కువ మోతాదులో ధాన్యాలు నిల్వ అయ్యాయి.

క్రీస్తు పూర్వం 2000 మధ్యకాలంలో తొలుత ఆర్మేనియా పర్వతాల్లో, కొన్ని శతాబ్దాల తర్వాత పశ్చిమ ఆఫ్రికాలో ఒక ముఖ్యమైన అధునాతన పద్ధతి ఆవిర్భవించింది. ఇనుమును శుద్ధి చేయడమే ఆ కొత్త పద్ధతి. ఇనుము పరిశ్రమ క్రమంగా విస్తరించడంతో ఉత్పత్తి, యుద్ధతంత్రాల స్వరూపం పూర్తిగా మారిపోయింది.

రాగి, దాని మిశ్రమ లోహమైన కాంస్యం ఎప్పటి నుండో వినియోగంలో ఉండేవి. అయితే వాటి ఉత్పత్తి ఖరీదైనది కావడంతో ఆయా సమాజాలు వాటిని చాలా తక్కువ మోతాదులో వినియోగించాయి. అధిక శ్రమ, దూరప్రాంతాల నుండి ముడి లోహాలను తెప్పించాల్సి రావడం ఈ లోహాల ఉత్పత్తికి ప్రతిబంధంగా మారాయి. అన్నింటి కంటే మించి వాటి కొనలు త్వరగా మొద్దుబారేవి. ఫలితంగా పాలకవర్గాలే వాటిని ఆయుధాలు, నగల కోసం వినియోగించేవారు. అదే సమయంతో విశాల ప్రజానీకానికి ఉత్పత్తి సాధనాలుగా అవి నిరుపయోగంగా ఉండేవి. పట్టణీకరణ విప్లవం తర్వాత 1500 సంవత్సరాల వరకు పిరమిడ్‌లు, స్మారక చిహ్నాలు, ఆలయాల నిర్మాణంలో కూడా కార్మికులు రాతి పరికరాలనే వినియోగించారు. రాగి, కాంస్యంతో చేసిన పరికరాలను వ్యవసాయదారులు చాలా తక్కువ స్థాయిలో వినియోగించినట్లు తెలుస్తోంది.

రాగి కంటే ముడి ఇనుము ఎక్కువ మోతాదులో లభించేది. దాన్ని లోహంగా తీర్చడానికి సుదీర్ఘ ప్రక్రియ అవసరమయ్యేది. అయితే కంసాలులు ఒక్కసారి తగిన పరిజ్ఞానాన్ని సమకూర్చుకున్న తర్వాత కత్తులు, గొడ్డళ్లు, బాణం కొనలు, నాగళ్లు, ప్రజావసరాలకు మేకులను

విరివిగా ఉత్పత్తి చేయడం ప్రారంభించారు. వ్యవసాయంపై ఈ అభివృద్ధి ప్రభావం చాలా విస్తారంగా ఉండేది. ఇనుప గొడ్డళ్ల సహాయంతో రైతులు దట్టమైన అడవులను సైతం వ్యవసాయం కోసం సిద్ధం చేసేవారు. గట్టి నేలలను సైతం ఇనుముతో తయారు చేసిన నాగళ్లు దున్నేవి. ఇనుముతో తయారు చేసిన ఈటె, ఖడ్గం ప్రజలకు చాలా చవకగా లభించడంతో సమాజంపై సైనిక వర్గాల పట్టు సడలిపోయింది. కాంస్య రక్షణ కవచాలు ధరించే రాచరిక దళాలను సాయుధ రైతు దళాలు చీల్చి చెండాడడానికి అవకాశం ఏర్పడింది.

క్రీ.పూ. ఏడవ శతాబ్దం నాటికల్లా నూతన ఉత్పత్తి మార్గాలపై ఆధారపడ్డ కొత్త నాగరికతలు విస్తరించాయి. అస్సీరియా సామ్రాజ్యం నైలునది నుండి మెసొపొటామియా వరకు విస్తరించి విభిన్న సాంప్రదాయాలు గల సమాజాలను ఒకే నాగరికత కిందికి చేర్చింది. వేర్వేరు భాషలకు ఒకే లిపిని అభివృద్ధి పరచింది. ఉత్తర భారతంలో ఒక కొత్త నాగరికత అభివృద్ధి చెందడం ప్రారంభించింది. వాణిజ్యం, నగరాల నిర్మాణం వెయ్యేళ్ల విరామం తర్వాత మళ్లీ పుంజుకున్నాయి. ఉత్తర చైనాలో అనేక రాజ్యాలు ఏర్పడ్డాయి. క్రీ.శ. 170లో వైరి రాజ్యాల మధ్య రక్తసిక్తమైన సంఘర్షణ తర్వాత ఈ రాజ్యాలు కొత్తగా ఆవిర్భవించాయి. మధ్యధర ప్రాంతంలో ముఖ్యంగా పాలస్తీనా, లెబనాన్, ఆసియా మైనర్, గ్రీసు, ఇటలీ, ఉత్తర ఆఫ్రికాలో నగర రాజ్యాలు ఎలాంటి తీవ్రమైన రాజకీయ, సైద్ధాంతిక వైరుధ్యాలు లేకుండా అభివృద్ధి చెందాయి. కేంద్రీకృతమైన పాత మెసొపొటామియా, ఈజిప్టు సామ్రాజ్యాల స్థానంలో స్వేచ్ఛాయుతమైన ఈ రాజ్యాలు అవతరించాయి.

కొత్త ఉత్పాదన పద్ధతులకు సాంకేతికాభివృద్ధి, సైద్ధాంతిక భావాలు సహాయకారిగా ఉండేవి. శాస్త్రీయ విద్య, ముఖ్యంగా గణితం, ఖగోళశాస్త్రంలోని కొన్ని భాగాల్లో ప్రగతి సాధ్యమైంది. కాంస్యయుగ మెసొపొటామియా, ఈజిప్టులలో ఈ ప్రక్రియ ప్రబలంగా కనిపించింది. అయితే ఈ పురోగతి పురోహితుల ఒత్తిడి మేరకే జరిగింది. వీరు రెండు వేల సంవత్సరాల వరకు భౌతిక జీవనం నుండి పూర్తిగా తెగతెంపులు చేసుకొని ఉండేవారు. వారి అధ్యయన ఫలితాలన్నీ సంక్లిష్టమైన, వివేచనా రహితమైన మత వ్యవస్థల్లో పాతుకుపోయి ఉండేవి. మరలా ప్రగతి సాధించాలంటే పురోహితులు ఇలాంటి వ్యవస్థల నుండి బయటికి రావడం అనివార్యమైంది. పాత నాగరిక కేంద్రాలలో ఈ మార్పు రాలేదు కాని ఉత్తర భారతం, ఉత్తర చైనా, మధ్యధరా తీరం వెంబడి వెలసిన కొత్త నగరాల్లో ప్రగతి ప్రక్రియ ఊపందుకుంది. (మెసొపొటామియా నగరాలైన అషుర్, బాబిలోన్, ఈజిప్టు నగరాలైన మేంఫిస్ లేదా థేబ్స్ గతంలో నాగరిక కేంద్రాలుగా వెలసిల్లాయి).

కొత్త, పునరుత్థానం పొందిన నాగరికతలకు కొన్ని మౌలికమైన లక్షణాలు సమానంగా ఉండేవి. ఇనుము వాడకం అన్ని సమాజాల్లో సాధారణ లక్షణంగా ఉండేది. కొత్త నాగరికతల్లో నూతన చేతివృత్తులు ఎన్నో అభివృద్ధి చెందాయి. సుదూర ప్రాంతాల వాణిజ్యం వేగంగా విస్తరించింది. వ్యాపారులు ఒక సామాజిక వర్గంగా అభివృద్ధి చెందారు. నాణేలు చెలామణిలోకి రావడంతో కింది స్థాయి రైతులు, చేతివృత్తిదారులు కూడా వ్యాపారం చేపట్టడం సులభమైంది. చైనా మినహా మిగతా అన్ని సమాజాల్లో శబ్ద ఆధారిత అక్షరాలు ప్రజలు పెద్ద సంఖ్యలో

విద్యనభ్యసించడానికి దోహదపడ్డాయి. విశ్వజనీన మతాలు ఆవిర్భవించాయి. ప్రధాన దైవం, మత సూత్రాలు, నైతిక ప్రవర్తనా నియమావళి ఆధారంగా ప్రజలు నడుచుకోవడం మొదలుపెట్టారు. చివరగా పాత నాగరికతల వలె కొత్త సమాజాలు కూడా వర్గ విభజనల ఆధారంగా వ్యవస్థీకరించబడ్డాయి. తరచూ ఆకలికి గురయ్యే కర్షకుల నుండి అదనపు నిల్వలను సమకూర్చుకోవడానికి మరో మార్గమంటూ ఉండేది కాదు. అయితే ఆయా నాగరికతల మధ్య నిర్దిష్టమైన తేడాలు ఉండేవి. భౌతికాంశాలు – పర్యావరణం, వాతావరణం, మొక్కల వంగడాలు, భౌగోళిక ప్రాంతం – ప్రజల జీవనోపాధి మార్గాలను నిర్దేశించేవి. అలాగే పాలకులు అదనపు ఉత్పత్తిని ఎలా నియంత్రించాలో కూడా నిర్ధారించేవి. ప్రతి పరిణామాన్ని ఈ ప్రక్రియలు ప్రభావితం చేసేవి.

## రెండవ అధ్యాయం

# ప్రాచీన భారతం

క్రీ.పూ. 1500 ప్రాంతంలో సింధూ నాగరికతను ధ్వంసం చేసిన ఆర్యులు వాస్తవంగా సంచార జాతి పశు కాపరులు. పాలు, మాంసంపై ఆధారపడి జీవించేవారు. యుద్ధవీరులు వీరికి నాయకత్వం వహించేవారు. ప్రాచీన నగరాలతో వారికి ఎలాంటి ఉపయోగం ఉండేది కాదు. తొలుత నగరాలను ధ్వంసం చేసిన తర్వాత వాటిని విడిచిపెట్టి వెళ్లారు. అలాగే రాతపూర్వక పదంతో వారికి పని ఉండేది కాదు. ఫలితంగా పాత నాగరికతలు ఉపయోగించిన లిపి అంతరించిపోయింది.

ఈ దశలో ఆర్యులు వైదిక ధర్మాన్ని ఆచరించారు. ఆ ధర్మం వారి జీవన విధానాన్ని ప్రతిబింబించేది. మతాచారాలు జంతుబలిపై ఆధారపడి ఉండేవి. పశువులను కూడా బలి ఇచ్చేవారు. యుద్ధ దేవతల సాహసాలను పురాణ గాధలుగా బ్రాహ్మణ పురోహితులు పఠనం చేసేవారు. పురాణాలు పాలకులు, పురోహితులు ప్రత్యేక హక్కులను సమర్థించే సిద్ధాంత దీపికలుగా ఉండేవి. సామాన్య ప్రజానీకం కంటే ఈ వర్గాలు ఉన్నతమైనవని కనక అదనపు ఉత్పత్తిపై వారికే నియంత్రణ ఉండాలన్న వాదనను ప్రచారంలోకి పెట్టాయి. ప్రజల జీవనోపాధి మార్గాలలో మార్పు వచ్చేంతవరకు చతుర్వర్ణ వ్యవస్థ ఆధారిత ప్రాచీన హిందూ మతం ఆవిర్భవించలేదు. మార్పురావడంతో వైదిక ధర్మం కూడా వివిధ ఆచారాలు, విశ్వాసాల సూత్రావళిగా రూపాంతరం చెందింది.

క్రీ.పూ.1000 నుండి మెల్లగా విస్తరించిన ఇనుము పరిజ్ఞానం ప్రజల జీవన విధానంలో మార్పునకు బాటలు వేసింది. ఇనుప గొడ్డలి సహాయంతో దట్టమైన అడవులతో నిండిన గంగాలోయ ప్రాంతాన్ని వ్యవసాయం కోసం సిద్ధం చేయగలిగారు. ఫలితంగా యుద్ధవీరులు, పురోహితులకు అదనపు నిల్వలు భారీగా సమకూరాయి. ఈ వర్గాలు వ్యవసాయ విస్తరణను ప్రోత్సహించాయి. అయితే రైతులు తమ దిగుబడిలో కొంత భాగాన్ని తమకు చెల్లించాలని కూడా వారు ఒత్తిడి చేశారు. బహుశా గ్రామ ఉత్పత్తిలో మూడో వంతు లేదా సగభాగాన్ని పన్నుగా వసూలు చేసేవారు. బలప్రయోగం ద్వారా తమ ఆదేశాలను అమలు చేసేవారు. సాధారణ ఆర్యులను వైశ్యులుగా (కర్షకులు), పరాధీనమైన ప్రజలను శూద్రులుగా (కార్మికులు) వర్గీకరించడానికి మత సూత్రాలను అన్వయించారు. గ్రామాలలో వర్గాల ఉత్పత్తి నిర్వహణ ఆధారంగా కులాలు ఆవిర్భవించాయే కాని వ్యక్తిగత ఆస్తుల ఆధారంగా కాదు. వెయ్యేళ్ల వరకు ఈ వ్యవస్థ అలాగే కొనసాగింది.

అయితే గ్రామీణ ప్రాంతంలో వర్గ విభజన మానవాళిని నాలుగు కులాలుగా వర్గీకరించిందన్న సూత్రీకరణ బలపడినా ప్రజల జీవనోపాధి మార్గాలలో మరిన్ని మార్పులు రావడంతో ఈ వైరుధ్యం మరింత జటిలమైంది. పాలకులకు భారీ స్థాయిలో అదనపు నిల్వలను మిగిల్చిన కొత్త వ్యవసాయ పద్ధతులు కూడా గ్రామాలపై ఆధారపడని సామాజిక వర్గాల ఎదుగుదలకు తోడ్పడ్డాయి. పాలకులు కొత్త విలాస వస్తువులను, నగలను కోరుకున్నారు. అందుకోసం వడ్రంగి పని, లోహశుద్ధి, నేత, వస్త్రాల తయారీని ప్రోత్సహించారు. ఉపఖండమంతటా, బయట వాణిజ్యం విస్తరించింది. తొలి పట్టణీకరణ విప్లవాల వలె ఇపుడు కూడా చేతివృత్తిదారులు, వ్యాపారులు దేవాలయాలు, సైనిక స్థావరాలు, వ్యాపార మార్గాల వెంబడి స్థిరపడ్డారు. ఆ విధంగా గ్రామాలు పట్టణాలుగా, పట్టణాలు నగరాలుగా రూపాంతరం చెందాయి. కొంతమంది యుద్ధవీరులు తమ స్వంత రాజ్యాలను ఏర్పాటు చేసుకోగలిగారు. క్రీ.పూ ఆరవ శతాబ్దం నాటికల్లా ఉత్తర భారతంలో 16 ప్రధాన రాజ్యాలు అవతరించాయి.[2] క్రీ.పూ 321 నాటికి మగధ సామ్రాజ్యం ఈ రాజ్యాలన్నింటిని స్వాధీనం చేసుకొంది. సింధూ నదికి తూర్పున ఉన్న ఉత్తర భారత ప్రాంతమంతా మగధ సామ్రాజ్య కిందికి వచ్చింది. (సింధూ నది పశ్చిమాన అలెగ్జాండర్ నెలకొల్పిన గ్రీకు సామ్రాజ్య సరిహద్దు ఉండేది.)

ఉత్తర భారతంలో మౌర్య సామ్రాజ్య ఆవిర్భవించడంతో పట్టణాభివృద్ధి పుంజుకుంది. ఒక వైపు మెసొపొటామియా, ఇరాన్, మరోవైపు ఉత్తర చైనాకు వ్యాపార మార్గాలను (భూమార్గాలు) మౌర్య సామ్రాజ్యం నెలకొల్పింది. అలాగే సముద్ర మార్గాన అరేబియా, ఈజిప్టు, తూర్పుఆఫ్రికా, ఆగ్నేయ ఆసియాతో వ్యాపార సంబంధాలను పెంచుకుంది. ప్రాచీన ప్రపంచ వ్యాపార వ్యవస్థలో ఈ సముద్ర మార్గం కీలకంగా ఉండేది. మగధ రాజధాని పాటలీపుత్రను సందర్శించిన గ్రీకు దౌత్యవేత్త ఒకరు ఈ నగరాన్ని అప్పటికి తెలిసిన ప్రపంచంలో అత్యంత వైభోవోపేతమైనదిగా అభివర్ణించారు. మగధ సైన్యంలో 6,000 గజదళం, 80,000 అశ్వికదళం, 2,00,000 పదాతిదళం ఉన్నట్లు ఆయన అంచనా వేశారు.[3] ఈ గణాంకాలు ఖచ్చితంగా అతిశయమే అయినా మగధ సామ్రాజ్య ప్రాభవం, స్థాయి గణనీయంగా ఉండేదన్న విషయం వాస్తవమేనని బోధపడుతుంది.

మౌర్య రాజవంశం పాలనా నిర్వహణకు అవసరమైన వ్యయాన్ని (అదనపు నిల్వలు) వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యంపై రాజ్య నియంత్రణ ద్వారా సమకూర్చుకుంది. రాజ్యం తన ఆర్థిక కార్యకలాపాలను గణనీయంగా విస్తరించింది. గనులు, ఉప్పు, మద్యం, ఖనిజ వ్యాపారంలో గుత్తాధిపత్యం ద్వారా అదనపు ఆదాయాన్ని సమకూర్చుకుంది. సైనికులకు ఇనుముతో తయారు చేసిన ఆయుధాలను సమకూర్చే స్థితికి చేరుకుంది. వ్యవసాయం, పరిశ్రమలకు కూడా పనిముట్లను పంపిణీ చేసింది. పన్నుల ద్వారా సైన్యాన్ని, అధికార యంత్రాంగాన్ని పోషించింది. అధికార యంత్రాంగం గ్రామ స్థాయి వరకు విస్తరించి ఉండేది. కొన్ని గ్రామాలకు కలిపి ఒక జమాబంది అధికారి ఉండేవాడు. గ్రామాల సరిహద్దులను, భూముల నమోదును, జనాభా గణనను, పశుసంపద నివేదికలను ఈ అధికారులు నిర్వహించేవారు. పన్నులు వసూలు చేయడానికి వేర్వేరు అధికారులు ఉండేవారు. రాజ్య వ్యవస్థకు మద్దతుగా సమగ్రమైన గూఢచారుల బృందం ఒకటి ఉండేది.[4]

తొలినాళ్లలో మౌర్య సామ్రాజ్యం పూర్తిగా ప్రజాసంపదపైనే ఆధారపడలేదు. సమాజం మొత్తానికి మేలు చేకూర్చే చర్యలెన్నింటినో తీసుకుంది. భారీ స్థాయిలో ఉన్న ధాన్యనిల్వలలో కొంత భాగాన్ని గ్రామీణ ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడానికి వినియోగించింది. అందులో భాగంగా కొత్త నివాస ప్రాంతాలను స్థిరపరిచింది. ప్రభుత్వం భూముల్లో శూద్రులు రైతులుగా స్థిరపడడానికి చర్యలు తీసుకుంది.[5] నీటిపారుదల పథకాల నిర్వహణ, నీటి సరఫరా నియంత్రణను చేపట్టింది. భూముల్లో వ్యక్తిగత ఆస్తులను, భూముల అమ్మకాన్ని నిషేధించింది. ఆ విధంగా భూస్వాములు స్థానిక దిగుబడిని స్వాహా చేయకుండా నివారించింది.

స్థిరమైన వ్యవసాయం విస్తరించడం, వాణిజ్యం, నగరాలు అభివృద్ధి చెందడం, బలమైన రాజ్యాల ఆవిర్భావం ప్రజల జీవితాల్లో గణనీయమైన మార్పులు తీసుకొచ్చాయి. వారి అవసరాలు, ప్రాపంచిక దృక్పథంలో కూడా మార్పులు వచ్చాయి.

పశుపోషణ, యుద్ధతంత్రాలను ఆధ్యాత్మికపరమైన ఉన్నత విలువలుగా ప్రాచీన దైవాలు ప్రకటించాయి. అయితే వ్యవసాయ ఔన్నత్యాన్ని కీర్తించే కొత్త వర్గాలు ఇప్పుడు ఆవిర్భవించాయి. పాత, కొత్త జీవన విధానాల్లో ఉపాధిని సమానంగా కల్పించిన పశుపోషణ పట్ల కూడా ప్రజల వైఖరి మారింది.

తొలి సంవత్సరాలలో ప్రజలు పశువులను మాంసానికి ప్రధాన ఆధారంగా పరిగణించేవారు. అయితే మారిన పరిస్థితులలో అరక దున్నడానికి పశుశక్తిని వినియోగించాల్సి రావడంతో వాటిని సంరక్షించడం అనివార్యమైంది. ఒక రైతు కుటుంబం ఆకలితో అలమటిస్తున్నా తరువాతి పంటను సాగు చేయడానికి ప్రధాన చోదకమైన పశుశక్తిని చంపకుండా అడ్డుకునేవారు. అలాగే యుద్ధవీరులు, పురోహితులకు తగిన ఆదాయాన్ని సమకూర్చడానికి పశు సంపద ప్రధాన ఆధారంగా ఉండేది. సామాజిక అవసరాల దృష్ట్యా, కొంత కాలం మతపరమైన సంఘర్షణ జరిగిన తర్వాత, ఆవును కొలిచే అనాలోచిత, తర్కరహితమైన సాంప్రదాయం వచ్చి పడింది. గోవధను నిషేధించారు. ఆధునిక హిందూ మతాచారాల్లో గోసంరక్షణ ప్రధాన లక్షణంగా మారింది.

పట్టణ జీవనం విస్తరించడంతో మతపరమైన భావన కూడా పెరిగింది. చేతివృత్తి దారులు, వ్యాపారులు చాలా వరకు వంశ పారంపర్యంగా తమ వృత్తులను కొనసాగిస్తూ వచ్చారు. యుక్తవయస్సు నుండే కుటుంబంలో వృత్తికి సంబంధించిన క్లిష్టమైన పద్ధతులు, నైపుణ్యాన్ని అలవర్చుకునేవారు. ప్రతి వృత్తికి లేదా ప్రతి వ్యాపారానికి ఒక ప్రత్యేకమైన వారసత్వ కథనం, ప్రత్యేక ఆచారాలు, ప్రత్యేక దైవాలు ఉండేవి. ఈ దైవాలకు చోటు కల్పిస్తేనే బ్రాహ్మణుల మతానికి అన్ని వర్ణాలపై ఆధిపత్యం లభించేది. కొత్త ఉత్పాదనా పద్ధతులు, నైపుణ్యాలున్న వర్గాలను వర్ణ వ్యవస్థతో కట్టి వేయడానికి బ్రాహ్మణులు అన్ని ప్రయత్నాలు చేసేవారు. అలా క్షత్రియులు, పురోహితులు, వ్యవసాయదారులు, శ్రామికులు ఈ చతుర్వర్ణ వ్యవస్థలో వారసత్వంగా కొనసాగుతూ వచ్చారు.

సామాజిక ప్రవర్తనలో విప్లవానికి మత సిద్ధాంతాలు, ఆచారాల్లో నిర్దిష్టమైన మార్పులు తీసుకురావడం తప్పనిసరి అయ్యింది. వివిధ సామాజిక వర్గాలు పాత, కొత్త ఆచారాల్లో ఉన్న వైరుధ్యాలతో రాజీపడాల్సి రావడంతో అవి విభిన్న మార్గాలను ఎంచుకున్నాయి. ఫలితంగా

ఉత్తర భారతంలో ఆరవ శతాబ్దం సందర్భంగా అసంఖ్యాకమైన తెగలు (మతపరమైన) పుట్టుకొచ్చాయి. సాంప్రదాయపరమైన నమ్మకాలను తమ స్వయం శైలికి అనుగుణంగా ప్రతి తెగ పునర్వ్యవస్థీకరించింది. ఈ తెగలు పరస్పరం కలహించుకోవడంతోపాటు బలంగా స్థిరపడిపోయిన బ్రాహ్మణ పురోహితులతో కూడా ఘర్షణ పడేవి.

ఈ తెగలలో ప్రముఖులు మహావీర అనుచరులైన జైనులు, గౌతముని అనుచరులైన బౌద్ధులు. వీరిలో కొన్ని సాధారణ లక్షణాలు ఉండేవి. జంతువులు, గోవధను వీరు వ్యతిరేకించారు. యుద్ధం స్థానంలో అహింసకు ప్రాధాన్యతనిచ్చారు. కుల వివక్షను తిరస్కరించారు. ఈ రెండు మత వర్గాల వ్యవస్థాపకులు బ్రాహ్మణులు కారు, కనుక వర్ణ వ్యవస్థను వ్యతిరేకించారు. ఘటనలు, ప్రక్రియలను తార్కికంగా అర్థం చేసుకోవలసిన అవసరాన్ని వారు నొక్కి చెప్పారు. కొన్ని సందర్భాల్లో పురాణ గాథలను కూడా పక్కన పెట్టి భౌతికవాద, నాస్తికవాద అంచుల వరకు తమ వర్గాలను తీసుకెళ్లారు.

అప్పుడే ఆవిర్భవిస్తున్న సమాజానికి అలాంటి మత సిద్ధాంతాలు సరితూగాయి. పాడి గేదెల సరఫరాను (సమాజానికి) ఆ సిద్ధాంతాలు పరిరక్షించాయి. వినాశకరమైన యుద్ధాన్ని వ్యతిరేకించే రైతులు, వ్యాపారులు, కార్మికుల మనోభావాలను అవి ప్రతిబింబించాయి. ఆర్థికంగా ఎదుగుతున్న ఈ వర్గాలపట్ల ఉన్నత వర్గాలు (పాలకులు, పురోహితులు) చూపుతున్న వివక్షను అవి ఎండగట్టాయి. బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని వారి వర్ణ సూత్రాలను వ్యతిరేకించాయి. ఈ సిద్ధాంతాలు కొందరు పాలకులను సైతం ఆకర్షించాయి. క్రీ.పూ. 264-277 మధ్య కాలంలో పాలించిన అశోక చక్రవర్తి స్వయంగా బౌద్ధమతం స్వీకరించాడు. తాను సాధించిన గొప్ప సైనిక విజయం తర్వాత పశ్చాత్తాపభారంతో అశోకుడు శాంతిని బోధించే బౌద్ధమతాన్ని అనుసరించాడు. వర్ణ వ్యవస్థను నిషేధించడం ద్వారా కొందరుపాలకులు స్థానిక భూస్వాముల దోపిడీని, ఆధిపత్యాన్ని నిర్వీర్యం చేశారు. ఫలితంగా సామ్రాజ్యంవైపు పట్టణ ప్రాంత సామాజిక వర్గాలు (ప్రగతి పథంలో ఉన్న కొత్త వర్గాలు) మొగ్గు చూపాయి. ఇప్పటికే దండయాత్రలో సఫలమైన పాలకునికి కూడా అహింసా సిద్ధాంతం ఒక ఆయుధంగా పనికి వచ్చేది. అంతర్గత భద్రతను పరిరక్షించడానికి, వ్యతిరేకులను అణచివేయడానికి ఆక్రమణదారులు ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టేవారు. మత విశ్వాసాల ప్రాధాన్యత సామ్రాజ్యాధిపతి అవసరాలకు సరిపోయేది.

అశోకుని మరణం తర్వాత మౌర్య సామ్రాజ్యం పతనమైంది. విశాలమైన సైన్యం, అధికార యంత్రాంగం సామ్రాజ్య వనరులపై విపరీతమైన ఒత్తిడిని పెంచాయి. స్థానిక భూస్వాముల ప్రాబల్యాన్ని శాశ్వతంగా గండికొట్టడానికి తగిన సమాచార వ్యవస్థ ఏ చక్రవర్తికి ఉండేది కాదు. కాని ఈసారి సామ్రాజ్యం విచ్ఛిన్నమైనా నాగరికత అంతరించలేదు. వ్యవసాయం, వాణిజ్యం నిరంతరంగా విస్తరించాయి. దక్షిణ భారతంలో రోమన్ నాణేలు చెలామణీ అయ్యాయి. రోమను సామ్రాజ్యం, ఇథోపియా, మలయా, ఆగ్నేయ ఆసియా, తదితరప్రాంతాలు, భారత దేశం మధ్య వాణిజ్య ఓడలు రాకపోకలు సాగించాయి. గ్రీకు-రోమను ప్రపంచం నుండి ఖరీదైన ఆహారాన్ని సరఫరాచేసే పారిశ్రామికవేత్తలుగా భారతీయ వ్యాపారులు ఎదిగారు.[6]

హస్తకళలు గణనీయమైన అభివృద్ధిని సాధించాయి. వస్త్రాల తయారీ, పట్టునేత, ఆయుధాలు, విలాస వస్తువుల ఉత్పత్తి పుంజుకున్నట్లు బోధపడుతుంది. పట్టణాలు, శివారు ప్రాంతాల్లో నివసించే ప్రజల జీవితాలలో గతంలో ఎన్నడూలేని విధంగా ద్రవ్య మారక ఆర్థిక

వ్యవస్థ బలంగా పాతుకుపోయింది.[7] అలాంటి ఆర్థిక ప్రగతి పరిమితమైన కేంద్రీకరణ కలిగిన మరో సామ్రాజ్యానికి బాటలు వేసింది. మౌర్య సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత సుమారు 500 సంవత్సరాలకు గుప్తుల సామ్రాజ్యం ఆవిర్భవించింది.

కళాసాహిత్యాలను రాచరిక కుటుంబాలే కాక వ్యాపారులు, వ్యాపార మండళ్లు కూడా పోషించేవి. వ్యాపారులు అందించిన భూరి విరాళాలతో వైభవోపేతమైన ఆలయాలు, బౌద్ధ విహారాలు, గుహ శిల్పాలను నిర్మించారు. సరుకుల మార్పిడితోపాటు గ్రీకు రోమను ప్రపంచంతో ఆలోచనలు, సిద్ధాంతాలను కూడా పంచుకున్నారు. గంగా లోయకు చెందిన తత్త్వవేత్తలకు ఏథెన్స్, అలెగ్జాండ్రియాలలో జరిగే చర్చల గురించి తెలిసేది. అలాగే భారతీయ విద్వాంసుల ఆలోచనలను పశ్చిమ దేశాల తత్త్వవేత్తలు తెలుసుకునే వారు. తొలి దశలో క్రైస్తవ మతంపై బౌద్ధమత సూత్రాల ప్రభావం ఎక్కువగా ఉండేదని అనేక మంది వ్యాఖ్యాతలు గ్రహించారు. క్రైస్తవ మతంలోని ఒకవర్గం భారత తీర పట్టణాలలో కొందరిని ప్రభావితం చేయగలిగింది.

మతపరమైన నమ్మకాలతోపాటు శాస్త్రీయ అన్వేషణ కూడా విస్తరించింది. ఉపఖండం సాధించిన గొప్ప శాస్త్రీయ విజయాల్లో గణితం ముఖ్యమైనది.[8] క్రీ.పూ.200 నాటికిరేఖా గణితం సమగ్రంగా అభివృద్ధి చెందింది. దక్షిణ భారతంలో రోమను-గ్రీకు శాస్త్ర విజ్ఞాన ప్రభావం ఉండేది. కాని టోలెమీ సిద్ధాంతాల కంటే ఎంతో ఎక్కువగా గణిత శాస్త్రం అభివృద్ధి చెందింది. త్రికోణమితి అధ్యయనం వికసించింది.[9] ఆ తర్వాత సంఖ్యా వ్యవస్థ ఒక నిర్దిష్ట స్వరూపాన్ని సంతరించుకుంది. అనిర్ధారిత సమీకరణలకు పరిష్కారం సాధ్యమైంది. ఆర్యభట్ట π (Pie) విలువను ఖచ్చితంగా లెక్క వేయగలిగాడు. క్రీ.శ.7వ శతాబ్దం నాటికి గ్రీకులు, రోమన్లకు కూడా తెలియని శూన్య సంఖ్యను వినియోగించడం మొదలుపెట్టారు.

వాణిజ్యంలో ప్రపంచ వ్యవస్థ ఎలా ఆవిర్భవించడం మొదలుపెట్టిందో అలాగే ఆలోచనల్లో కూడా ప్రపంచ వ్యవస్థ మొదలైంది. అడవుల నరికివేతతో హిందూ మతం దక్షిణ భారతానికి విస్తరించింది. అటు నుండి మలయ ద్వీప కల్పానికి, కంబోడియాకు హిందూ ధర్మం ప్రయాణించింది. వ్యాపారులు తమ బౌద్ధ మతాన్ని సిలోన్ ద్వీపానికి, హిమాలయాల మార్గం ద్వారా టిబెట్‌కు, వ్యాపార మార్గాల ద్వారా చైనాకు, చివరిగా కొరియా, జపాన్‌లకు తీసుకెళ్లారు. ఈలోపు భారతదేశంలో అభివృద్ధి చెందిన గణితశాస్త్రం అరబ్ విద్యకు పునాదిగా మారింది. ఈ ప్రక్రియ వెయ్యేళ్ల తర్వాత ఐరోపా పునర్విచారణకు కీలకంగా మారింది.

అయితే భారతదేశంలో మాత్రం 6వ శతాబ్దం మొదలుకొని సాంస్కృతిక ప్రగతి కుంటుపడింది. ఉపఖండం యుద్ధ రాజ్యాలుగా చీలిపోయింది. పశ్చిమోత్తర ప్రాంతంలో వరుస దండయాత్రలు విధ్వంసాన్ని సృష్టించాయి. సమాజ భౌతిక ఆధారాన్ని తగిన స్థాయిలో విస్తరించకపోవడంతో విశాలమైన, భారీ వ్యయంతో కూడుకున్న సామ్రాజ్యవాద వ్యవస్థలు మనుగడ సాగించలేకపోయాయి. చక్రవర్తులకు తమ సామ్రాజ్య సరిహద్దులను, అంతర్గత భద్రతను సంరక్షించడం కష్టతరంగా మారింది. రహదారుల నిర్వహణను, వ్యాపారులకు భద్రతను సరిగ్గా చేపట్టలేకపోయారు. వాణిజ్య కార్యకలాపాలు క్షీణించాయి. వ్యాపారుల సంపద తరిగిపోయింది. బౌద్ధమత ప్రభావం కుదించుకుపోయింది. కొన్ని మహా విహారాలు స్థిరపడినా విశాల సమాజంతో వాటి సంబంధాలు చాలా వరకు దెబ్బతిన్నాయి. భారతీయ రాజ్యాల

కంటే సుదూర ప్రాంతమైన చైనాలోనే వాటి ప్రభావం ఎక్కువగా ఉండేది. ఆ స్థాయిలో ఇక్కడ బౌద్ధమతం తన ప్రాభవాన్ని కోల్పోయింది.

సమాజం భూస్వామ్య వ్యవస్థ స్వరూపాన్ని సంతరించుకుంది. చెందింది. స్వయం సమృద్ధిగల గ్రామాలుగా సమాజం విడిపోయింది. అధికారులకు వేతనాలు చెల్లించడానికి స్థానిక రైతుల నుండి అదనపు ఉత్పత్తిని సేకరించడం తప్ప పాలకులకు మరో మార్గం లేనప్పుడు ఈ ప్రక్రియ సంభవించింది. సాధారణంగా, పాలకులు బ్రాహ్మణులకు అడవి ప్రాంతాలను కట్టబెట్టి వ్యవసాయాన్ని ప్రోత్సహించేవారు. అయినా ఫలితం లేకుండా పోయింది. తమ నైపుణ్యాలను గ్రామాలలో ఆచరిస్తే తప్ప తమకు జీవనోపాధి లభించదన్న నిర్ణయానికి చాలా మంది హస్తకళాకారులు వచ్చారు. స్థానిక ఉత్పత్తిలో భాగం పంచుకోవాలంటే తమ ఉత్పత్తులను స్థానికంగానే తయారు చేసి మార్చుకోవాలని వారు నిర్ణయించుకున్నారు. మార్కెట్ కోసం ఉత్పత్తి చేయడం బదులు స్థానిక వినియోగానికే ఉత్పత్తి చేసే ప్రక్రియ ఊపందుకుంది.

వ్యవసాయం కొత్త ప్రాంతాలకు విస్తరించడంతో అదనపు ఆహార నిల్వలు దక్కేవి. వ్యవసాయ పద్ధతుల్లో నెమ్మదిగానే అయినా కొంత ప్రగతి సాధ్యమైంది. కాని ఈ ప్రక్రియ బ్రాహ్మణులు రూపొందించిన ప్రాథమిక చట్టాల స్వరూపం ఆధారంగానే జరిగింది. ఎందుకంటే గ్రామస్థాయి వరకు విస్తరించిన అధికార యంత్రాంగం వారి గుప్పిట్లోనే ఉండేది. సామాజిక సంస్కృతంతా బ్రాహ్మణుల సంస్కృతే అయ్యింది. రోమిలా థాపర్ పేర్కొన్నట్లు ఈ ప్రక్రియ 'మేథోపరమైన క్షీణత'కు దారి తీసింది. సాధారణ విద్య పూర్తిగా వైదిక విద్యగా మారింది.[10]

బౌద్ధ మతం నుండి కొన్ని సూత్రాలను బ్రాహ్మణులు అరువు తెచ్చుకున్నారు. ముఖ్యంగా, సాత్విక భోజనానికి వారు అలవాటు పడ్డారు. తమ పవిత్రతను నిరూపించుకునేందుకు శాఖాహార భోజనాన్ని స్వీకరించారు. అలాగే ఆవు మాంసం ఆరగించడాన్ని పూర్తిగా నిషేధించారు. అదే సమయంలో వర్ణ వ్యవస్థను బలోపేతం చేశారు. సామాజిక వర్గీకరణలో మౌలికంగా ఎలాంటి మార్పులకు ఆస్కారమివ్వకుండా ఆయా వృత్తి, తెగ సముదాయాలను వాటి 'అర్హత'ను బట్టి ఆయా వర్ణాలుగా నిర్దిష్టమైన హోదాను కల్పించారు.

వ్యవసాయ సముదాయాల్లో బయటి నుండి వచ్చిన గిరిజనులు 'అస్పృశ్యులు'గా మారారు. గ్రామ శివార్లలో వారు దుర్భరమైన జీవితాన్ని గడపాల్సిన పరిస్థితులను కల్పించారు. అధమస్థాయి పనులు, మురికి పనులు చేసుకుంటూ వారు మనుగడ సాగించాల్సి వచ్చింది. వీరిని తాకితే ఉన్నత వర్గాల జీవితం కలుషితమైపోతుందన్న భావనను బ్రాహ్మణులు సృష్టించారు.

శతాబ్దాల తరబడి శీఘ్ర ప్రగతి, మేధోపరమైన వికాసాన్ని చవి చూసిన ప్రాంతం వెయ్యేళ్ల వరకు పరిమిత దృక్పథం గల గ్రామాలుగా రూపాంతరం చెందింది. మతపరమైన మూఢ నమ్మకాలు విలయతాండవం చేశాయి. రాజ్యాలు చీలిపోయి పరస్పరం కలహించుకున్నాయి. ప్రజలను అవి మరింత పీడించాయి. వెయ్యేళ్ల తర్వాత దేశంపై దండయాత్ర చేసిన ముస్లిం, ఐరోపా ఆక్రమణదారులకు ఎదురైన వింత అనుభవం ఏమిటంటే భారత సమాజంలో కుల వ్యవస్థ సమగ్ర రూపందాల్చి ఉండటమే.

మూడవ అధ్యాయం

# తొలి చైనా సామ్రాజ్యాలు

ప్రపంచ చరిత్ర ప్రస్థానం పశ్చిమాసియాతో మొదలై గ్రీసు, రోము తదుపరి పశ్చిమ ఐరోపాకు సాగిందని చాలా మంది ఐరోపా చరిత్రకారులు భావిస్తూ వచ్చారు. అయితే ఐరోపా సమాజానికి ఎందులోనూ తీసిపోని నాగరికత ఒకటి ఉత్తర చైనాలో ఆవిర్భవించి రెండు వేల సంవత్సరాలపాటు ఏదో ఒక రూపంలో మనుగడ సాగించింది. మానవాళి సాధించిన ముఖ్యమైన సాంకేతిక ముందడుగులకు కారణమైంది.

క్రీ.పూ.221లో స్థాపించబడిన చి'ఇన్ సామ్రాజ్యం రోమన్ల కంటే ఎక్కువ మంది ప్రజలపై పాలన సాగించింది. ఆ సామ్రాజ్యంలో సుమారు 6,800 కిలోమీటర్ల పొడవుగల రహదారులు ఉండేవి (రోమన్ సామ్రాజ్యంలో కేవలం 5,984 కిలోమీటర్ల మేరకే రహదారులను నిర్మించారు) రహదారులన్నీ ఒకే ఆకారంలో నిర్మించబడ్డాయి. గుర్రపు బండ్లు, ఎద్దులబండ్లు రాకపోకలు సాగించడానికి అవి ఎంతో అనువుగా ఉండేవి. తొలి మహాప్రాకారాన్ని (గ్రేట్‌వాల్) 3,000 కిలోమీటర్ల వరకు నిర్మించేందుకు చి'ఇన్ సామ్రాజ్యం 3,00,000 కార్మికులను సమీకరించగలిగింది. అలాగే తొలి చక్రవర్తి స్మారక చిహ్నాన్ని నిర్మించేందుకు 7,00,000 వరకు కార్మికులను వినియోగించింది. ఈ స్మారక చిహ్నంలో టెర్రకోట (ఎర్రమట్టి)తో మలచిన సైనిక దళం (మానవ ఆకారంలో మలచబడిన సైనికులు) ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది. మహానదులతో అనుసంధానం చేయబడిన వ్యవసాయ కాలువలు ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా అంతర్గత నౌకా రవాణా వ్యవస్థను సృష్టించాయి.

శతాబ్దాల తరబడి సాగిన ఆర్థిక, సామాజికాభివృద్ధి ఫలితమే చి'ఇన్ సామ్రాజ్యం. మెసొపొటామియాలో వ్యవసాయం మొదలైన సమయంలోనే కొందరు చైనీయులు వ్యవసాయాన్ని చేపట్టారు. ఉత్తర చైనాలో తృణధాన్యాలను పండిస్తూ పందులు, కుక్కలను ఇళ్లలో పోషించడం మొదలుపెట్టారు. దక్షిణ చైనాలో వరిసాగుకు అవసరమైన వేర్వేరు పద్ధతులను నేర్చుకుంటూ గేదెలను పెంచడం మొదలుపెట్టారు. ముఖ్యంగా, ఈ ప్రక్రియ యాంక్షీ లోయ ప్రాంతంలో సంభవించింది. క్రీ.పూ.2000 తర్వాత ప్రజలు కొత్త రాతియుగ పరికరాలతో నిర్మించిన

నగరాలు, ఆ తర్వాత రాజ్యాలు అవతరించాయి. క్రీ.పూ. 17వ శతాబ్దం నాటికి లోహ కార్మికులు వివిధ లోహాలను కరిగించి కాంస్యాన్ని ఉత్పత్తి చేయడం నేర్చుకున్నారు. ఉన్నత వర్గాల యుద్ధ వీరులు కాంస్యంతో తయారైన ఆయుధాలను వినియోగిస్తూ ఉత్తరచైనాలోని ఎల్లో నదిపై షాంగ్ వంశం కోసం ఒక రాజ్యాన్ని ఏర్పాటు చేశారు. పురోహితులు, సైనికులు, అధికారులతో కూడిన ఉన్నత వర్గం ఈ రాజ్యాన్ని పాలించినట్లు తెలుస్తోంది. రాజ్యం ఒక వర్గ సమాజంగా ఉండేది. రాచరిక దహన సంస్కారాల సమయంలో సేవకులను బలి ఇచ్చేవారు. అయితే ఆ దశలోనూ వ్యక్తిగత ఆస్తి అంటూ ఉండేది కాదు. క్రీ.పూ. 11వ శతాబ్దం నుండి చావ్ వంశ పాలకులు 100 లేదా అంతకంటే ఎక్కువ సంఖ్యలో ఉన్న స్థానిక పాలకులకు అధికారాలను కట్టబెట్టారు. మధ్యయుగాల ఐరోపాలో వెలసిల్లిన భూస్వామ్య వ్యవస్థను ఈ పాలనా వ్యవస్థ పోలి ఉండేది. అయితే కొందరు చరిత్రకారులు చైనాలో భూస్వామ్య వ్యవస్థ ఆవిర్భవించలేదని, ఆ వ్యవస్థ మార్క్స్ ప్రతిపాదించిన 'ఆసియా సమాజాన్ని' పోలి ఉండేదని వాదిస్తారు. వ్యవసాయ నిర్వహణ వ్యక్తిగత భూముల ఆధారంగా జరగలేదనడానికి అప్పటి రాజశాసనాలే తార్కాణమని వారు చెబుతున్నారు. అందుకు భిన్నంగా పాలనా యంత్రాంగ విధివిధానాలు సాధారణ ప్రజల రోజువారీ జీవితాన్ని నియంత్రించేవి. కేవలం వ్యవసాయ పనుల్లోనే కాకుండా రైతు కుటుంబాల్లో వివాహాలు, పండుగలు, సముదాయ సమావేశాలను కూడా పాలనా వ్యవస్థ నియంత్రించేది. సంవత్సరంలో ఏ పంటను సాగు చేయాలి, ఎప్పుడు విత్తనాలు నాటాలి, ఎప్పుడు కోత ప్రారంభించాలి అనే విషయాలను రైతులకు అధికారులు సూచించేవారు. శీతాకాలంలో ఇళ్లు వదలి పొలాలకు వెళ్లాలని లేదా పొలాలు వదలి ఇంటికే పరిమితం కావాలని ఆజ్ఞాపించేవారు. ఏది ఏమైనా, చావ్ వంశ చరిత్రంతా ప్రత్యర్థుల మధ్య నిరంతర సంఘర్షణతో నిండి ఉంది.

శతాబ్దాలు గడిచే కొద్దీ అనేక చిన్న రాజ్యాలు పెద్ద రాజ్యాలుగా (పరిమిత సంఖ్యలో) ఆవిర్భవించాయి. సాంకేతిక ప్రగతి కారణంగా యుద్ధాన్ని మరింత సమర్థవంతంగా నిర్వహించడం సాధ్యం కావడంతో పెద్ద రాజ్యాలు ఏర్పడ్డాయి. రథాల సంఖ్య పెరిగింది. ముట్టడి యుద్ధతంత్రంలో కొత్త పద్ధతులు అభివృద్ధి చెందాయి. ఖడ్గం, విల్లు అందుబాటులోకి రావడంతో రైతాంగ పదాతి దళాలు ఆశ్వికదళాలను ఎదురొడ్డి పోరాటం చేయగల స్థాయికి తొలిసారిగా చేరుకున్నాయి. మరోవైపు ఇలాంటి యుద్ధతంత్రం కొత్త సైనిక వ్యూహాలను అభివృద్ధి పరిచేలా పాలకులను ప్రోత్సహించింది. క్రీ.పూ. నాలుగు, మూడవ శతాబ్దాల సందర్భంగా (ఈ కాలాన్ని 'యుద్ధ రాజ్యాల యుగం'గా పిలిచేవారు) ఈ పాలకులు ఉత్తర మైదాన ప్రాంతాలు, నదిలోయలను వ్యవసాయం కోసం సిద్ధం చేసే ప్రక్రియను ప్రారంభించారు. తడి నేలలను ఎండబెట్టి పంటలు సాగుచేశారు. నీటి పారుదల వ్యవస్థను గణనీయంగా విస్తరించారు. ఇనుము పరిశ్రమ కూడా అభివృద్ధి చెందింది. ఆ కాలంలో ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా లోహ పరిశ్రమను భారీ స్థాయిలో నిర్వహించారు. ఇనుము ధాతువును శుభ్రపరిచే ప్రక్రియ ఊపందుకుంది. ఇనుము పరికరాలు, ఆయుధాల (కేవలం కత్తులు, ఖడ్గాలే కాకుండా గడ్డపార, నాగలి, కొడవళ్లి, గొడ్డలి, వడ్రంగి పరికరాలు) ఉత్పత్తి భారీ స్థాయిలో ఉండేది.

నూతన వ్యవసాయ పద్ధతులు దిగుబడిని పెంచాయి. ఎద్దుల సహాయంతో భూములను లోతుగా దున్నడం, పశువులు, మానవుల మలాన్ని ఎరువులుగా వినియోగించడం, తృణధాన్యాల తోపాటు గోధుమ, సోయా చిక్కుడును సాగు చేయడం, భూసారాన్ని పరిరక్షించడానికి నత్రజనిని పీల్చే మొక్కలను నాటడం, వ్యవసాయ కాలంపై అవగాహన పెరగడంతో దిగుబడి గణనీయంగా పెరిగింది. అదనపు నిల్వలు కూడా పెద్ద ఎత్తున సమకూరాయి.

జాక్స్ జెర్నెట్ ప్రకారం, "యుద్ధ రాజ్యాల యుగం మానవాళి చరిత్రలో సాంకేతిక ఆవిష్కరణలకు ప్రసిద్ధి గాంచినది. సాధారణ వినియోగదార వస్తువుల (వస్త్రాలు, పప్పు ధాన్యాలు,ఉప్పు) వ్యాపారం భారీగా విస్తరించింది. లోహాలు, కలప, చర్మం, తదితర వస్తువుల వ్యాపారం కూడా పుంజుకుంది. ధనిక వ్యాపారులు అలాంటి వాణిజ్యాన్ని భారీ పరిశ్రమలతో అనుసంధానం చేశారు. కార్మికులను పెద్ద సంఖ్యలో నియమించారు. వ్యాపారంలో దళారుల వ్యవస్థను ఏర్పాటు చేశారు. రవాణా బండ్లు, నావలను పెద్ద సంఖ్యలో సమకూర్చుకున్నారు. ధనిక వ్యాపారులు, పారిశ్రామికవేత్తల సామాజిక సముదాయం రాజ్య పురోగతికి ఎక్కువగా తోడ్పడింది. రాజ్యాల రాజధానులు వాణిజ్య, పారిశ్రామిక కేంద్రాలుగా ఆవిర్భవించడం మొదలు పెట్టాయి. మూడవ శతాబ్దంలో సంభవించిన యుద్ధాల లక్ష్యం ఇలాంటి పెద్ద వాణిజ్య కేంద్రాలను స్వాధీనం చేసుకోవడమే.

పాత పాలకవర్గాల ఆధిపత్యాన్ని సవాలు చేసే కొత్త ఉత్పాదనా పద్ధతులను పాలకులు చాలా త్వరగా ఆమోదించేవారు. వాటితో విజయం సాధించేవారు. వ్యవసాయంలో సాంకేతిక ప్రగతికి సమాంతరంగా సామాజిక-ఆర్థిక మార్పులు కూడా చోటు చేసుకున్నాయి. అలాగే చాలా రాజ్యాలలో రాజకీయ సంస్కరణలు వచ్చాయి.

కాలక్రమంలో చి'ఇన్ సామ్రాజ్యం ఇతర రాజ్యాలను స్వాధీనం చేసుకోగలిగింది. పై మార్పులను కట్టుదిట్టంగా అమలు చేయడంవల్ల సామ్రాజ్య విస్తరణ సాధ్యమైంది. సైనికులు, అధికారులతో కూడిన కేంద్రీకృత అధికార వర్గంపై (నవీన పాలక వర్గం) సామ్రాజ్యం ఆధారపడేది. ఈ వర్గం సహాయంతో పాత పాలకవర్గాన్ని అణచివేసేది. వ్యవసాయంలో వ్యక్తిగత రైతు కుటుంబాలు కీలక స్థానాన్ని ఆక్రమించాయి. భూమిపై వారికి యాజమాన్య హక్కులు ఏర్పడ్డాయి. పన్నులు, శ్రమదానం ద్వారా రైతులు రాజ్యానికి సేవ చేసేవారు. సన్నకారు రైతుల ఈ కొత్త ఉత్పత్తి శక్తి కొత్త సామ్రాజ్యానికి అండగా నిలిచింది.

పైస్థాయి నుండి ఒక దోపిడీ వర్గాన్ని మరో దోపిడీ వర్గం స్థానంలో తీసుకొచ్చిన సామాజిక విప్లవం ఇది. ఈ విప్లవాన్ని సైన్యాలు తీసుకొచ్చాయి. ఈ ప్రక్రియలో భారీ నష్టం సంభవించింది. ఒక చారిత్రక కథనం ప్రకారం క్రీ.పూ. 364 నుండి 234 వరకు సంభవించిన యుద్ధాల్లో సుమారు 1,489,000 మంది మృత్యువాతపడ్డారు. అయితే ఈ సంఖ్య చాలా వరకు అతిశయమని బోధపడుతుంది. చైనా సామ్రాజ్యం ఏర్పడక పూర్వం కొన్ని సంవత్సరాలపాటు సైనిక దాడులు, సైనిక విజయాల పరంపర కొనసాగి సుమారు లక్ష

మంది హత్యకు గురయ్యారు. సామ్రాజ్య స్థాపనతోపాటు సుమారు 1,20,000 ధనిక, ఉన్నత వర్గాల కుటుంబాలు బహిష్కరణకు గురయ్యాయి. ఎవరో కొద్ది మంది పాలకులు చొరవ తీసుకొని భారీ సైన్యాలను మోహరించడం కారణంగానే ఈ పరిణామం సంభవించలేదు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం వ్యవసాయ పద్ధతుల్లో మార్పులు రావడంతో కొత్త శక్తులు ఆవిర్భవించాయి. వాటిని పాలకులు నియంత్రించలేకపోయారు. కొత్త శక్తులను నియంత్రించాలని పాలకులు కూడా భావించలేదు.

రైతుల దిగుబడి పెరగడంతోనే పాలకుల వినియోగదాహం కూడా ఎక్కువైంది. పాత, కొత్త పాలక వర్గాలు విలాస వస్తువులు, ఇనుముతో తయారు చేసిన ఆయుధాలు, గుర్రాలు, రథాలు, విల్లులు, సైనిక కవచాలను భారీ స్థాయిలో కోరుకున్నాయి. రైతుకు పరికరాల నిరంతర సరఫరా అవసరమైంది. వివిధ రకాల వస్తువులను సరఫరా చేసేందుకు చేతివృత్తిదారులు కూడా ఎక్కువ సంఖ్యలో అవసరమయ్యారు. వృత్తిదారులు కొత్త ఉత్పాదనా పద్ధతులను, నైపుణ్యాన్ని స్వంతంగా అభివృద్ధి పరచుకున్నారు. ఆయా రాజ్యాల మధ్య, రాజ్యాలలో అంతర్గతంగా వ్యాపారం చేసే ధనిక వ్యాపారుల వర్గం కూడా విస్తరించింది. నిర్దిష్టమైన కొలతలు, బరువుల వ్యవస్థ ఏర్పడింది. నాణేలు చెలామణి అయ్యాయి. ఫలితంగా, ప్రజలు వ్యాపారం పట్ల మరింత ఆకర్షితులయ్యారు.

రాజ్య వ్యవస్థలో ధనిక వ్యాపారుల ప్రాబల్యం పెరిగింది. క్రీ.పూ. 250లో ఒక సంపన్న కుటుంబానికి చెందిన వ్యాపారి రాజ్యాధినేతగా, భవిష్యత్ చక్రవర్తిగా ఎదగడం అందుకో ఉదాహరణ. అతడికి లక్ష కుటుంబాలు నివసించే ప్రాంతాన్ని జాగీరుగా కట్టబెట్టారు. అతడి చుట్టూ ఎప్పుడూ 3,000 మంది విద్వాంసులుగల బృందం ఉండేది.

అప్పటి పరిస్థితిని వివరిస్తూ చో-యున్ సూ ఇలా వ్యాఖ్యానించారు : "క్రీ.పూ. ఐదు నుండి మూడవ శతాబ్దం వరకు సాగిన ఘర్షణ నుండి గ్రామీణ ఆధారిత వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ కంటే పట్టణ-కేంద్రీకృత సామాజిక జీవనమే ఎక్కువగా ఆవిర్భవించే అవకాశాలుండేవి. సంపన్నమైన మార్కెట్ కేంద్రాలు వెలసిల్లాయి. లాభార్జన అనే పట్టణ మానసిక లక్షణం ప్రబలంగా ఉండేది."

జర్మనీ-అమెరికా సంతతికి చెందిన చైనా చరిత్రకారుడు కారల్ విట్‌ఫోజెల్ ప్రకారం ఈ కాలం చైనా పరిస్థితులు ఐరోపాలో 2000 సంవత్సరాల తర్వాత ఏర్పడిన పరిస్థితుల (భూస్వామ్య వ్యవస్థ చివరి దశ) మధ్య చాలా పోలికలుండేవి. వ్యాపారుల బూర్జువా వర్గం చైనాను కొత్త సమాజంగా తీర్చిదిద్ది ఉండొచ్చు. మార్కెట్ కోసం వేతన కార్మికులు సరుకులను ఉత్పత్తి చేసే అవకాశముండేది. కాని చైనా రాజ్య వ్యవస్థ అధికార యంత్రాంగం చెప్పుచేతల్లోకి వెళ్లింది. అధికారస్వామ్యం అదనపు సంపదను ధనిక వ్యాపారులు,పాత పాలకవర్గాల చేతికి దక్కకుండా చేయడమే కాకుండా దానిని తన నియంత్రణలోకి తెచ్చుకుంది. పాలకవర్గాలకు

వ్యతిరేకంగా రాజ్యం చేపట్టిన పోరాటానికి వ్యాపారులు మద్దతునిచ్చారు. అయితే వారి విజయ ఫలాలను రాజ్య అధికారగణం దోచుకుంది.

చి'ఇన్ వంశంతోపాటు దాని వారసత్వ వంశమైన హన్ పాలనలో కూడా వ్యాపారులపై రాజ్య వ్యవస్థ నిరంతరంగా దాడి చేసిందని ఖచ్చితంగా చెప్పవచ్చు. (హన్ వంశం క్రీ.పూ. 206 నుండి క్రీ.శ.220 వరకు చైనాను పాలించింది) ఉదాహరణకు, తొలి హన్ చక్రవర్తి వ్యాపారులు పట్టువస్త్రాలు ధరించకుండా, గుర్రపు బండ్లపై స్వారీ చేయకుండా నిషేధాజ్ఞలు జారీ చేశాడు. వ్యాపారులు కాని, వారి సంతానం కాని లేదా వారసులు కాని ప్రభుత్వ సేవలో చేరకుండా నిషేధించారు. ఒక హన్ రాజశాసనం ప్రకారం రాజ్యం ప్రధాన పరిశ్రమల్లో ముఖ్యమైన రెండింటిని (ఉప్పు, ఇనుము) తన నియంత్రణలోకి తెచ్చుకుంది. ఈ పరిశ్రమల ద్వారా సమకూరే ఆదాయంపై రాచరిక గుత్తాధిపత్యాన్ని స్థాపించడంతో పాటు ధనిక వ్యాపారులు, ధనిక వాణిజ్యవేత్తలను అణచివేయాలని రాజ్యం సంకల్పించింది. వ్యాపార లాభాలపై పన్నును భారీగా పెంచారు. వ్యవసాయ దిగుబడిపై వ్యాపార లాభమనే పన్ను ఉండేది. పన్ను ఎగవేసే ధనిక వ్యాపారుల సంపదను జప్తు చేసేవారు. క్రీ.పూ. 141-87 మధ్య 54 ఏళ్లపాటు పాలించిన చక్రవర్తి వూ తన సామ్రాజ్య శక్తిని (అధికారాన్ని) వినియోగించి వ్యాపారుల ఆస్తులను బలవంతంగా జప్తు చేశాడు. మనుగడ సాగించడానికి వ్యాపారులు తరచూ అధికారులు లేదా రాచరిక ఆస్థానంతో సంబంధాలు పెట్టుకునేవారు. రైతాంగాన్ని పరిరక్షించే పేరుతో వ్యాపారులపై దాడులు జరిగేవి. ఆ కాలంలో వెలువడిన చాలా అధికారిక పత్రాలు పరిశ్రమ, వాణిజ్యం రైతాంగాన్ని నాశనం చేస్తున్నాయని, ఫలితంగా గ్రామీణ ప్రాంతాల్లో కల్లోలం బయల్దేరిందని, కరువు సంభవించిందని ఫిర్యాదు చేశాయి. అదే సమయంలో రాజ్యాన్ని సవాలు చేసే మార్గాలను వ్యాపారులకు సూచించాయి. దీని కారణంగా అణగారిన వర్గాల నుండి రాజ్యానికి ముప్పు ఏర్పడింది. క్రీ.శ. 9వ శతాబ్దంలో పాలించిన చక్రవర్తి వాంగ్ ఫూంగ్ ప్రకారం : "అహంకారులైన ధనిక వ్యాపారులు కిరాతకంగా ప్రవర్తించారు. దారిద్ర్యంలో కూరుకుపోయిన పేదలు మోసపూరితంగా వ్యవహరించారు."

ప్రాబల్యం కోసం శతాబ్దాల తరబడి ఆయా దోపిడీవర్గాల మధ్య జరిగిన సంఘర్షణతో సమాంతరంగా మేధోపరమైన ప్రగతి సంభవించింది. వివిధ వర్గాలకు చెందిన ప్రజలు ప్రపంచాన్ని వేర్వేరు దృష్టితో చూసేవారు. వివిధ తాత్విక, మతపరమైన సంస్థలు ప్రత్యర్థులుగా ఎదిగాయి. అదేసమయంలో తమ చుట్టూ సంభవిస్తున్న మార్పులతో సహజీవనం చేయడానికి ఆయా సామాజిక వర్గాలు ప్రయత్నించాయి.

క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో జన్మించిన కన్‌ఫూషియస్, అతడి అనుచరుడైన మెన్షియస్ (క్రీ.పూ. 4వ శతాబ్దం) నిజాయితీ, స్వీయ నియంత్రణతో సాంప్రదాయాన్ని, ఆచారాన్ని గౌరవించాలని ప్రజలకు ప్రబోధించారు. తదుపరి శతాబ్దాల్లో ఈ ప్రబోధనలు సాంప్రదాయ భావజాలంగా రూపాంతరం చెందాయి. తాము చైతన్యవంతులమని ప్రకటించుకున్న

పాలకవర్గాలు సమాజాన్ని సాంప్రదాయ విలువల ఆధారంగా పాలిస్తూ తాము మాత్రం విలాసవంతమైన జీవితాన్ని గడిపాయి. మెన్షియస్‌కాలంలో సాగిన ప్రబోధనలు అత్యాశపరులైన రాజకుమారుల ప్రవర్తనను తీవ్రంగా విమర్శించాయి. కన్‌ఫూషియస్ మరణం తర్వాత 60 ఏళ్ల పాటు జీవించిన మోత్జు రాచరిక కుటుంబ సభ్యులను మరింత తీవ్రంగా విమర్శించారు. సమసమాజ స్థాపనకు అతడు ఒక కొత్త వర్గాన్ని ఏర్పాటు చేశాడు. పరస్పర సహకారం ఆధారంగా నడిచే సమాజాన్ని నియంతృత్వ పద్ధతుల్లో స్థాపించి స్వార్థం, విలాస జీవితం, యుద్ధాన్ని పారద్రోయాలని అతడు భావించాడు. అందుకు భిన్నంగా తర్వాతి కాలంలో వచ్చిన తావోయిజం ఉమ్మడి సహకారం బదులు వ్యక్తిగత సామర్థ్యంపైనే ఎక్కువ దృష్టిని సారించింది. వ్యక్తులు కొత్త పద్ధతులను నేర్చుకొని ప్రపంచాన్ని శాసించే స్థాయికి చేరుకోవాలని తావోయిజం పిలుపునిచ్చింది. ఈ ప్రక్రియలో వ్యక్తులు ప్రపంచంతో సంబంధాలను పూర్తిగా తెంచుకోవాలని ప్రబోధించింది. ప్రజల ఆలోచనా విధానాన్ని శాసించేందుకు కన్‌ఫూషియనిజం, తావోయిజం బౌద్ధ మత ప్రబోధనలతో పోటీ పడ్డాయి. ఈ పోటీ శతాబ్దాల తరబడి కొనసాగింది. పేదల ఆకాంక్షలను ప్రతిబింబించే సమసమాజ దృక్పథం గల వర్గాలు కూడా ఎన్నో అవతరించాయి.

అయితే క్రీ.పూ. చివరి శతాబ్దాల్లో జరిగిన సైద్ధాంతిక పోరాటాల్లో విజయం సాధించింది మాత్రం 'న్యాయవర్తనం' అనే పంథా. రాజ్య బలాన్ని అధికారస్వామ్య పాలనను అది గట్టిగా సమర్థించింది. వ్యక్తిగత నైతిక వర్తనం తదితర మత ప్రబోధనల జోలికి వెళ్ళకుండా రాజ్య చట్టాలను అమలు చేయడం వరకే అధికారులు పరిమితం కావాలని ఈ పంథా ప్రబోధించింది.

ఉమ్మడి ప్రయోజనాలకు ప్రతీకగా అధికారుల పాత్రను సమర్థించడానికి న్యాయవర్తనం ప్రయత్నించింది. వ్యాపారుల సామాజిక దృక్పథాన్ని కూడా అది సమర్థించింది. రాజకీయ పరమైన ఏకపక్ష నిర్ణయాలు, అహేతుక పన్నులతో వ్యాపారులు కృంగిపోయేవారు. అందుకే తార్కిక నిర్ణయాలు (సమగ్రమైన చట్టాల ఆధారంగా) అమలు చేసే అధికారస్వామ్యం అవసరమని వారు భావించారు. ఆ విధంగా తమ లాభార్జన చేజారకుండా చూసుకోవాలని ప్రయత్నించారు. న్యాయవర్తన ప్రబోధాలు ప్రార్థనా గీతాలుగా ప్రజల నోళ్లలో నానాయి. సమాజం మొత్తానికి పాలకుడు, రాజ్యశాసనాలు రక్షణ కవచాలని ఆ గీతాలు ఉపదేశించాయి.

తమ ప్రాపంచిక దృష్టికి మద్దతు కూడగట్టడానికి పాలకులు కేవలం తమ మేధాసంపత్తిపైనే ఆధారపడలేదు. ప్రజలకు మరో ప్రత్యామ్నాయమంటూ లేకుండా చేయడానికి వారు అన్ని విధాలా ప్రయత్నించారు. పాత సాంప్రదాయాలను ప్రబోధించే గ్రంథాలన్నింటినీ తగులబెట్టాలని తొలి చక్రవర్తి ఆదేశాలు జారీ చేశారు."ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా వ్యవహరించని మేధావులు కొందరు ఉన్నారు. నేటి సమాజాన్ని విమర్శించేందుకు గతాన్ని తవ్వి తీస్తున్నారు. ప్రజలను గందరగోళానికి గురి చేసి వారిని రెచ్చగొడుతున్నారు. అందుకే పాత గ్రంథాలను నిషేధించాల్సిన అవసరం ఎంతైనా ఉంది." "నిషిద్ధ సాహిత్యాన్ని చర్చించేందుకు

సాహసించే ప్రజలు బహిరంగ మరణదండనకు గురవుతారు. వర్తమానాన్ని విమర్శించేందుకు గతాన్ని వాడుకునే వారు తమ బంధువులతో సహా మృత్యువాత పడతారు.”

తొలి దశలో రాజ్య అధికారాలు గణనీయంగా పెరిగినా వాణిజ్యం, హస్తకళాకృతుల ఉత్పత్తి ఏ మాత్రం కుంటుపడలేదు. నిజానికి ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాల వల్ల అవి ఎంతో లబ్ది పొందాయి. రహదారులు, నదీ జల మార్గాల నిర్మాణం, దక్షిణ చైనా, మధ్య ఆసియా, ఇండోచైనా, కొరియా ద్వీపకల్పానికి సామ్రాజ్య విస్తరణ వ్యాపారులకు, వృత్తిదారులకు ఎంతో అనుకూలించాయి. సాంకేతిక రంగంలో కూడా అనేక మార్పులు వచ్చాయి. క్రీ.శ. 2వ శతాబ్దం నాటికి స్టీలును ఉత్పత్తి చేయడం ప్రారంభించారు. (ఐరోపాలో 1500 సంవత్సరాల తర్వాతనే స్టీలును ఉత్పత్తి చేశారు) ప్రపంచంలోనే తొలిసారిగా నీటి చక్రాలు వినియోగంలోకి వచ్చాయి. మానవుని బరువు కంటే రెండింతల బరువును మోయగల తోపుడు బండ్లు వచ్చాయి. వెయ్యేళ్ల తర్వాతనే అవి పశ్చిమ ఐరోపాలో ప్రత్యక్షమయ్యాయి.

అయితే వ్యాపార సముదాయ స్వేచ్ఛను రాజ్యం కుదించివేసింది. తమకు ప్రాబల్యం ఉన్న కేంద్రాల్లో సైతం వారు తమ ఆధిపత్యాన్ని చాటుకోలేకపోయారు. అందుకు భిన్నంగా అధికార యంత్రాంగంపై ఎక్కువగా ఆధారపడటం ప్రారంభించారు. మధ్యయుగాల ఐరోపాలో వ్యాపారులు నగరాలను రాజకీయంగా సైతం శాసించేవారు. కాని ఆ దిశగా చైనా వ్యాపారులు ఈ కాలంలో పయనించలేకపోయారు.

రైతుల జీవితం ఎక్కడి వేసిన గొంగళి అక్కడే అన్నట్లు ఉండిపోయింది. వ్యాపారులకు వ్యతిరేకంగా రాజ్యం ఎన్ని చర్యలు తీసుకున్నా రైతుల జీవితం మాత్రం ప్రగతి బాటలో పయనించలేకపోయింది. రాజ్యానికి ధాన్యాలను పన్నుల రూపంలో చెల్లించాల్సి రావడంతో అదనంగా సంపదను కూడగట్టుకొనే అవకాశం రైతులకు లేకుండాపోయింది. దిగుబడి బాగా వచ్చినప్పుడు వారు ముప్పూటలా భోజనం చేసేవారు. పంట దిగుబడి తగ్గినా, కరువు సంభవించినా ఆకలితో అలమటించే వారు. వారి జీవితమంతా నిత్యం శ్రమతో గడిచిపోయేది. ఉత్తర చైనా మైదాన ప్రాంత భూముల్లో పంట సాగు శ్రమతో కూడుకున్నది. విత్తనాలు నాటినప్పటి నుండి పంట కోతకు వచ్చేంత వరకు రైతులు అన్ని జాగ్రత్తలు తీసుకోవలసి వచ్చేది. పంట ఎండిపోయే ప్రమాదంతోపాటు కీటకాల బెడద కూడా ఎక్కువగా ఉండేది. రైతుల దిగుబడిలో మూడోవంతు లేదా సగభాగం ఇతరుల చేతుల్లోకి వెళ్లేది.

సామ్రాజ్య అద్భుతాలు – మహాప్రాకారం, కాలువలు, చక్రవర్తుల స్మారక చిహ్నాలు, రాజభవనాలు – అన్ని కోట్లాది గంటల శ్రమతో నిర్మించినవని, సమాజం మొత్తానికి అవి ఎలాంటి ప్రయోజనం కలిగించలేకపోయాయన్న విషయాన్ని ఎప్పుడూ మరవకూడదు. ఈ కట్టడాల నిర్మాణం వల్ల సమాజం లబ్ది పొందకపోగా విలువైన శ్రమశక్తిని పోగొట్టుకుంది.

ఒక మంత్రగాడు తొలి చక్రవర్తికి మరణాన్ని జయించే ఉపాయాన్ని సూచించాడు. ఇతర పురుషులకు దూరంగా ఉంటే చక్రవర్తి శాశ్వతంగా జీవించగలడని అతడు వాదించాడు.

దాంతో ఎత్తయిన ప్రహరీగోడలతో, గంటలు, ఢంకాలతో, పైకప్పు కలిగిన రహదారులతో 270 రాజభవనాలను నిర్మించాలని చక్రవర్తి ఆదేశాలు జారీచేశాడు. స్త్రీ సాంగత్యం తప్ప ఇతర పురుషుల జాడలేకుండా కోటల్లో, రాజభవనాల్లో నివసించడం మొదలుపెట్టాడు. చక్రవర్తి జాడను ఇతరులకు తెలియజేసే వారికి మరణశిక్ష విధించేవారు. ఒక సందర్భంలో తన రాచరిక బృందంలో గూఢాచారి ఉన్నాడని నమ్మిన చక్రవర్తి 460 మంది పురుషులను హత్య చేయించాడు.

ఇలాంటి విచ్చలవిడి వ్యయానికి రైతుల శ్రమను దోపిడీ చేసేవారు. దిగుబడిలో రాజ్యానికి మరింత ఎక్కువ వాటాను చెల్లించాలని రైతులపై తీవ్రమైన ఒత్తిడి రావడంతో అనేక ప్రాంతాల్లో రైతాంగ తిరుగుబాట్లు సంభవించాయి. శ్రామికుల తిరుగుబాటు గురించిన వ్యాఖ్యలు ప్రాచీన మెసొపొటామియా, ఈజిప్టు, భారత్ లేదా రోమ్ సామ్రాజ్య శాసనాలలో (నివేదికలు) ఎక్కడా కనిపించకపోయినా చైనా విషయంలో మాత్రం అవి తరచూ పేర్కొనబడ్డాయి.

అలాంటి ఒక తిరుగుబాటు చి'ఇన్ వంశాన్ని పతనం చేసింది. ఒక చారిత్రక కథనం ప్రకారం ఆ తిరుగుబాటును షెన్‌షెంగ్ అనే మాజీ కార్మికుడు ప్రారంభించాడు. వాస్తవంగా అతడు 900 మంది ఖైదీలను ఒక చెరసాలకు తరలించాల్సి ఉండేది. కాని ఆలస్యమైతే మరణ శిక్ష తప్పదన్న భయంతో అతడు ఇలా తర్కించాడు : "పారిపోవడమంటే మృత్యువును కొని తెచ్చుకున్నట్లే అలాగే కుట్ర పన్నినా మరణశిక్ష తప్పదు. ప్రత్యేక రాజ్యాన్ని స్థాపించేందుకు ప్రయత్నం చేసిన నేరంపై మరణశిక్షను అనుభవించడమే మేలు." ఆ తిరుగుబాటు ఎన్నో ప్రాణాలను బలిగొంది. రాచరిక దర్బారులో ఆందోళన కమ్ముకుంది. చక్రవర్తి పూర్వపు ప్రధాన సలహాదారు హత్యకు గురయ్యాడు. చివరగా చక్రవర్తే హత్యకు గురయ్యాడు. నాలుగేళ్ల అంతర్యుద్ధం తర్వాత తిరుగుబాటు నాయకుల్లో ఒకరు రాజధానిపై దాడి చేసి సింహాసనాన్ని హస్తగతం చేసుకున్నారు. హన్ వంశాన్ని కొత్తగా స్థాపించాడు.

అలాంటి తిరుగుబాట్లు ఒక కొత్త ఒరవడిని సృష్టించాయి. కాలక్రమంలో తిరుగుబాట్లు సాధారణమయ్యాయి. రాచరిక పన్ను వ్యవస్థ దోపిడీ స్వభావం, భూస్వాముల పెత్తనం రైతాంగ తిరుగుబాట్లకు దారి తీసేవి.

రైతాంగ తిరుగుబాట్లు రాజ్యాలను వాటి రాజధానులతో సహా ఆక్రమించుకునేవి. కొన్ని సందర్భాల్లో సామ్రాజ్య రాజధానికి కూడా ముప్పుగా పరిణమించేవి. సామ్రాజ్య సైన్యం నుండి ఉన్నతాధికారులు, ఆస్థానానికి దూరమైన ప్రముఖులు, కొందరు భూస్వాములు తమతో జత కలిసే వరకు తిరుగుబాటు నాయకులు సామ్రాజ్యాధిపత్యానికి సవాలు విసిరే పరిస్థితిలో ఉండేవారు. అయినప్పటికీ విజయవంతమైన తిరుగుబాట్లు కొత్త చక్రవర్తులు లేదా కొత్త పాలక వంశాల సాప[illegible] [illegible]ారి తీసేవి. పాత పాలక వర్గం తరహాలోనే ఈ కొత్త పాలక వర్గాలు రైతాంగా[illegible] దోపిడీకి, అణచివేతకు గురి చేసేవి.

వ్యక్తిగత నాయకుల మధ్య సయోధ్య కుదరడమే ఇక్కడ సమస్య కాదు. అలాగని రైతులు ఒక శాశ్వతమైన కేంద్రీకృత సంఘటనాన్ని స్థాపించలేకపోయారు. ఫలితంగా తమ

ఆకాంక్షలను, లక్ష్యాలను సమాజంపై మోపే సామర్థ్యాన్ని కోల్పోయారు. వ్యక్తిగత ఆస్తిగా ఉన్న భూములను సాగు చేయడం ద్వారా రైతులు మనుగడ సాగించేవారు. ఈ కారణంగా భూములను స్వల్ప కాలం కూడా వదలి ఉండలేకపోయారు. భూములు వదలి వెళ్లిన వారు రైతు అనే ముద్రను పోగొట్టుకున్నారు. మనుగడ కోసం లంచాలు, దోపిడీలకు పాల్పడ్డారు. ధనాశ చూపితే ఏమి చేయడానికైనా సిద్ధపడే వారు. భూములను అంటిపెట్టుకున్న వారు మాత్రం మరో ప్రపంచం సాధ్యమని కలలు గన్నారు. శ్రమ, ఆకలి దప్పులు, కరువు లేని లోకాన్ని ఊహించారు. అయితే వారు రాజ్య పరిపాలకులపై ఆధారపడే వారు. ముఖ్యంగా నీటిపారుదల, వరదల నియంత్రణ, ఇనుము పరికరాలు, తాము ఉత్పత్తి చేయని ఇతర వస్తువుల విషయంలో రాజ్య పంపిణీ వ్యవస్థపై పూర్తిగా ఆధారపడేవారు. అధికార యంత్రాంగం క్రమశిక్షణాయుతంగా, బాధ్యతతో వ్యవహరించే, భూస్వామ్య దోపిడీలేని ప్రపంచాన్ని రైతులు కోరుకున్నారు. కాని తమ స్వంత నియంత్రణలో నడిచే సమాజాన్ని మాత్రం వారు ఎన్నడూ సూత్రీకరించలేకపోయారు.

అయితే తిరుగుబాట్లన్నీ హన్ సామ్రాజ్యాన్ని బలహీనపరచడంలో స్థూలంగా ప్రభావం చూపాయి. ఈ ప్రభావ కాలం పశ్చిమ ఐరోపాలో ఆధునిక యుగంతో సమానంగా ఉండేది. అయితే ప్రతి ప్రాంతంలో బడా భూస్వాములను ఈ ప్రభావం నియంత్రించలేక పోయింది. సామ్రాజ్య పాలనా వ్యవస్థకు వనరులను సేకరించే సామర్థ్యం క్షీణించిపోయింది. కనుక రాజ్యం రైతులను దోచుకుంటూ కాలాన్ని నెట్టుకొచ్చింది. తరచుగా తలెత్తుతున్న తిరుగుబాట్లను నివారించలేకపోయింది. క్రీ.శ. 184లో 'పచ్చ తలపాగాలు' అనే విముక్తి మత సంస్థ 3,60,000 మంది సాయుధ పోరాట వీరులను సమీకరించింది. ఆ సంస్థకు ఒక తావో తెగ నాయకుడు ఆధిపత్యం వహించేవాడు. తిరుగుబాటును అణచివేయడానికి బయల్దేరిన సామ్రాజ్య సైనికాధికారులు అనతి కాలంలోనే తమలో తాము కలహించుకోవడం మొదలుపెట్టారు. దాంతో అరాచకత్వం, విధ్వంసం మరింత ప్రబలిపోయాయి.

సామ్రాజ్య రాజధాని తగలబడడం, దేశంలోని అన్ని ప్రాంతాలు విధ్వంసానికి గురికావడం, వ్యాపార మార్గాలు విచ్ఛిన్నం కావడంతో నగర జీవనం అస్తవ్యస్థమైపోయింది. వీటి ప్రభావం గ్రామీణ ప్రాంతాలపై విపరీతంగా ఉండేది. ప్రత్యర్థి భూస్వామ్య వర్గాలు ప్రతి ప్రాంతంలోనూ పుట్టుకువచ్చాయి. జాగీర్లను నిర్వహిస్తూనే వారు రాజకీయ, ఆర్థిక ప్రాబల్యాన్ని విస్తరించుకున్నారు. వ్యవసాయ కాలువలు, జలాశయాలు, నీటి పారుదల పనుల నిర్వహణకు రైతాంగ కార్మికులను సమీకరించడం మొదలుపెట్టారు. గతంలో అంతరించిన స్థానిక పన్నులను పునరుద్ధరించారు. సిద్ధాంతపరంగా రాజ్య నిర్వహణ పేరుతోనే ఈ పన్నులను వసూలు చేసేవారు.

కొత్త ఆర్థిక ఏర్పాట్ల నియంత్రణలో రైతులు వ్యవసాయాన్ని కొనసాగించారు. చేతివృత్తులు, పరిశ్రమలు చాలా వరకు కొనసాగాయి. అయితే స్థానిక అవసరాలను తీర్చడానికి మాత్రమే అవి ఉత్పత్తిని చేపట్టాయి. ఫలితంగా అవి అభ్యున్నతిని సాధించలేకపోయాయి.

సాంకేతిక ప్రగతి స్తంభించిపోయింది. అలాగే తదుపరి మూడు శతాబ్దాల వరకు చైనా సామ్రాజ్యం కూడా బలహీనపడి కూలిపోయింది. సామ్రాజ్యం స్థానంలో ప్రత్యర్థి రాజ్యాలు ఆవిర్భవించాయి.

ఈ కాలానికి క్రీ.శ. ఐదవ శతాబ్దంలో భారతదేశం చవి చూసిన సంఘటనలతో కొన్ని పోలికలు ఉన్నాయి. అలాగే ఆ దశలో పతనమైన పశ్చిమ రోమను సామ్రాజ్యంతో దానికి సారూప్యం ఉంది. కాని ఒక ప్రధానమైన తేడా ఉండేది. చైనా నాగరికతకు ఎలాంటి ముప్పు వాటిల్లలేదు. ఆర్థిక వ్యవస్థ, నగర జీవన పునరుద్ధరణకు బాటలు పడ్డాయి. భారత్‌లో కాని, రోమ్‌లో కాని ఇలాంటి పునరుద్ధరణ ప్రక్రియ సంభవించలేదు.

ఏది ఏమైనప్పటికీ ఒకప్పుడు సాంకేతిక ప్రగతికి, ఆర్థిక విస్తరణకు ప్రోత్సాహమందించిన రాజకీయ స్వరూపాలు ఇప్పుడు అలాంటి చర్యలను చేపట్టలేకపోయాయి. ఫలితంగా పాత సమాజం పాక్షికంగా విచ్ఛిన్నమైంది. పాత అధికారస్వామ్య పాలకవర్గం సమాజాన్ని పాత సాంప్రదాయాల ఆధారంగా నియంత్రించలేకపోయింది. భూస్వామ్య వర్గం కూడా సమాజ విచ్ఛిన్నాన్ని చూస్తూ ఉండిపోయింది. వ్యాపారులు ఇతర పాలకవర్గాలతో సమన్వయం సాధించి సామాజిక స్వరూపాన్ని మార్చే కార్యక్రమాన్ని చేపట్టడానికి సిద్ధపడలేదు. కనుక తిరుగుబాటు పంథాలో పయనిస్తున్న రైతులను కొత్త సామాజిక వ్యవస్థ ఏర్పాటుకు సమీకరించలేకపోయారు. ఈ ప్రక్రియను చేపట్టడానికి బదులు వ్యాపారులు భారతదేశం ఆవిర్భవించిన బౌద్ధ మతాన్ని స్వీకరించారు. వైరి వర్గాలు ఇక్కడ ఉమ్మడిగా నశించిపోలేదు కాని ఉమ్మడిగా అచేతనమయ్యాయని మాత్రం ఖచ్చితంగా చెప్పగలము.

నాల్గవ అధ్యాయం

# గ్రీకు నగర రాజ్యాలు

సుమారు 2,500 సంవత్సరాల పూర్వం పరిఢవిల్లిన మూడవ అతి పెద్ద నాగరికత ప్రాచీన గ్రీకు నాగరికత. విశ్వవిజేత అలెగ్జాండర్ స్థాపించిన మహాసామ్రాజ్యం బాల్కన్స్ నుండి నైలులోయ వరకు, తదుపరి సిందూ లోయ వరకు విస్తరించి ఉండేది. క్రీ.పూ. నాల్గవ శతాబ్దం చివరలో భారత ఉపఖండంపై మగధ పాలకులకు ప్రాబల్యం ఉన్న సమయంలోనే గ్రీకు సామ్రాజ్య సరిహద్దులు సింధూ నది పశ్చిమ తీరం వరకు విస్తరించాయి. అదే సమయంలో చి'ఇన్ వంశం చైనాలో కొత్త సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేసింది. ఏథెన్స్‌లో ఆవిర్భవించి గ్రీకు అలెగ్జాంఢ్రియాలో అభివృద్ధి చెందిన సిద్ధాంతాలు మధ్యధరా, ఐరోపా నాగరికతల ఆలోచనలపై సుమారు రెండు వేల సంవత్సరాల పాటు ప్రభావం చూపాయి. ఇదే కాలంలో భారతదేశంలోని మగధలో, చైనాలో (కన్‌ఫూషియస్, మెన్షియస్) ఆలోచనా ప్రక్రియ స్వతంత్రంగా అభివృద్ధి చెందింది.

యురేషియా లేదా ఆఫ్రికా రైతుల జీవితాలు, క్రీ.పూ. తొమ్మిదవ శతాబ్దంలో గ్రీకు తీర ప్రాంతాలు, ద్వీపాల్లో నివసించిన ప్రజల జీవితాల మధ్య మౌలికంగా ఎలాంటి తేడాలు ఉండేవి కావు. మైసీనియా నాగరికత ఆనవాళ్లన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. పాత నాగరికత సాంప్రదాయాలను ప్రజలు పూర్తిగా మరచిపోయారు. కొన్ని పురాణ గాథలు మినహా గత సంస్కృతి అంతా అంతరించిపోయింది. చారిత్రక అవశేషాలుగా కొన్ని కోటలు, రాజభవనాలు మిగిలాయి. కాని వాటిని సంరక్షించకుండా శిధిలావస్థలో వదిలేశారు. గ్రామాల మధ్య సంబంధాలుండేవి కావు. ఆసియా, ఈజిప్టు నాగరికతలతో కూడా గ్రీకు ప్రజలకు సంబంధాలు తెగిపోయాయి. ప్రజలు ఎక్కువగా నిరక్షరాస్యులు. చేతివృత్తులు ప్రాథమికంగా ఉండేవి. కళలు దాదాపు లేవనే చెప్పాలి. జీవితం దుర్భరంగా ఉండేది. అందుకు తోడు కరువు తరచుగా సంభవించేది.

ఉత్తర భారతం, ఉత్తర చైనా తరహాలోనే ఇక్కడ కూడా కొత్త నాగరికతను మలచడానికి కొన్ని శక్తులు క్రియాశీలమయ్యాయి. ఇనుము పరిశ్రమ విజ్ఞానం ఆలస్యంగా విస్తరించినా వ్యవసాయంలో కొత్త పద్ధతులను కనిపెట్టారు. వాణిజ్యం విస్తరించి హస్తకళలు మళ్లీ ప్రాణం పోసుకున్నాయి. కొత్త హస్తకళారూపాలను కూడా కనుగొన్నారు. అక్షరలిపి సమగ్రంగా అభివృద్ధి

చెందింది. సమాజంలోని అన్ని వర్గాల ప్రజల జీవన ప్రమాణాలు కూడా పెరిగాయి. క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికి ఈ మార్పులు నగర రాజ్యాల ఆవిర్భావానికి దారితీశాయి. అక్రోపొలిస్, ఏథెన్స్‌లలో వైభవోపేతమైన కట్టడాలు నిర్మాణమయ్యాయి. ప్రజలు తమ ఉమ్మడి చర్యల ద్వారా పర్షియా సైన్యం చేసిన భారీ దురాక్రమణ ప్రయత్నాలను తిప్పికొట్టారు. అయితే ఆర్థిక, సామాజిక మార్పులు చోటు చేసుకున్న పరిస్థితులు చైనా సంస్కృతికి రెండు విధాల భిన్నంగా కనిపిస్తాయి. భారతదేశ పరిస్థితులకు అవి కొంత మేరకు భిన్నంగా ఉన్నాయి.

అనతి కాలంలోనే గ్రీకు తీర ప్రాంత గ్రామాలు ఇతర నాగరికతలతో ప్రత్యక్ష సంబంధాలను పెట్టుకున్నాయి. భారత్, చైనా నాగరికతల విషయంలో ఇలా జరగలేదు. మధ్యధరా తీర ప్రాంతం వెంబడి శతాబ్దాల తరబడి ఫోనేషియన్ నావికులు వ్యాపారం నిర్వహించారు. తమతోపాటు మెసొపొటామియా, ఈజిప్టు సామ్రాజ్యాల్లో సాధించిన సాంకేతిక ప్రగతి, పరిజ్ఞానాన్ని తీసుకొచ్చారు. అలాగే క్రీ.పూ. ఆరవ శతాబ్దం నుండి గ్రీకు నగరాలు పశ్చిమాసియా సామ్రాజ్యాల మధ్య వ్యాపారంలో ప్రత్యక్ష, శాశ్వత సంబంధాలు ఏర్పడ్డాయి. ఈ సామ్రాజ్య సైన్యాల్లో గ్రీకు కిరాయి మూకలకు ఉపాధి కల్పించారు. బహిష్కరణకు గురైన గ్రీకు ప్రజలకు సామ్రాజ్య నగరాలలో ఆశ్రయం ఇచ్చారు. ఇలాంటి సంబంధాలు గ్రీకు నాగరికత అభివృద్ధికి ప్రధాన చోదకంగా మారాయి. ఉదాహరణకు, గ్రీకు అక్షరాలు ఫోనేషియన్లు ఉపయోగించిన లిపి నుండే నేరుగా అభివృద్ధి చెందాయి.

సారవంతమైన నదీ లోయల్లో చైనా, భారతీయ నాగరికతలు వికసించాయి. ఆ తర్వాత మైదాన ప్రాంతాలకు విస్తరించాయి. మైదానప్రాంతాల్లో అడవులను నేలమట్టం చేసి వ్యవసాయాన్ని గణనీయంగా విస్తరించారు. అందుకు భిన్నంగా గ్రీకు వ్యవసాయ విస్తరణ పర్వత ప్రాంతాలవల్ల కుదించుకుపోయింది. క్రీ.పూ. ఎనిమిదవ శతాబ్దం నుండి కొత్త పద్ధతుల ద్వారా అదనపు సంపదను పోగు చేయడం మొదలుపెట్టారు. అయితే ఒక స్థాయి తర్వాత అదనపు నిల్వలు స్తంభించిపోయాయి. భారతదేశం, చైనాల నుండి కొత్త వ్యవసాయ పద్ధతులను దిగుమతి చేసుకోకుండా ఉన్నట్లయితే ధాన్య నిల్వలన్నీ ఖాళీ అయ్యేవి.

భూమి పరిమితంగా ఉండడంతో రైతులు సముద్ర జలాలపై కొత్త ప్రాంతాల అన్వేషణకు బయల్దేరారు. ఆ విధంగా సారవంతమైన తీర ప్రాంతాలలో వలస సముదాయాలను ఏర్పాటు చేశారు. మధ్యధరా తీరం వెంబడి ఉన్న ఏజియాన్, అయోనియన్ దీవులు, నల్ల సముద్రం, ఆసియా మైనర్ తీర ప్రాంతాలు, దక్షిణ ఇటలీ, సిసిలీ, స్పెయిన్, దక్షిణ ఫ్రాన్స్ తీర ప్రాంతాలను సైతం ఆక్రమించారు. ఈ వలసవాదంతోపాటు వ్యాపారం కూడా విస్తరించడంతో గ్రీసు ప్రధాన భూభాగంలో హస్తకళలు అభివృద్ధి చెందాయి. ఉదాహరణకు ఏథెన్స్‌లో తయారైన మట్టి, పింగాణీ పాత్రలు కొన్నేళ్లకే మధ్యధరా ప్రాంతమంతటిలో వినియోగంలోకి వచ్చాయి. వ్యక్తిగత రైతు, మత్స్యకార కుటుంబాల సముదాయాలతో ప్రారంభమైన నాగరికత క్రీ.పూ. ఆరవ శతాబ్దం నాటికి నగరరాజ్యాల వ్యవస్థగా అభివృద్ధి చెందింది. ఈ నగర రాజ్యాలు నిరంతరం ఘర్షణ పడేవి. కాని వ్యాపారం, ఉమ్మడి లిపి, ఉమ్మడి భాష, ఉమ్మడి మత [illegible], ఉమ్మడి పండుగలు – వీటిలో ముఖ్యమైనవి ఒలంపిక్ క్రీడలు – కారణంగా నగర రాజ్యా [illegible] గాఢమైన అనుబంధం [illegible].

భూమి అనుత్పాదకత వల్ల మరో ముఖ్యమైన ప్రతికూల ప్రభావం ఉండేది. రైతు కుటుంబాన్ని అతడి పిల్లలను పోషించిన తర్వాత సేకరించే అదనపు ఉత్పత్తి చాలా తక్కువగా ఉండేది. కాని ఉత్పాదకతను పిల్లలు లేని వయోజనుల శ్రమశక్తి ద్వారా గణనీయంగా పెంచేందుకు అవకాశముండేది. అందుకోసం భూమిని గరిష్టస్థాయిలో వినియోగించేవారు. ఆ తర్వాత గనుల తవ్వకాలను మొదలుపెట్టారు. హస్తకళల భారీ పరిశ్రమలను స్థాపించారు. యుద్ధ ఖైదీలను బానిసలుగా తీసుకోవడం ద్వారా కార్మికులను పెద్ద సంఖ్యలో సమకూర్చుకునే వారు. శ్రమదోపిడీకి బానిసత్వం సులువైన మార్గంగా ఉండేది. క్రీస్తుపూర్వం ఐదవ శతాబ్దం చివరలో ఏథెన్స్ నగరంలో ఒక బానిస ఖరీదు స్వేచ్ఛా జీవితాన్ని అనుభవించే వృత్తిదారుని వార్షిక వేతనంలో సగానికి కంటే తక్కువగా ఉండేది.

పాత నాగరికతల్లో కూడా సుదీర్ఘ కాలంపాటు బానిసత్వం కొనసాగింది. కాని అదనపు ఉత్పత్తిలో బానిసత్వానికి పరిమిత పాత్ర ఉండేది. పాలకులకు వ్యక్తిగత సేవలను అందించడానికే బానిసలను ఎక్కువగా వాడుకునే వారు. మరోవైపు వ్యవసాయం, చేతివృత్తులను పరిమిత స్వేచ్ఛ కలిగిన పౌరులకు వదిలేవారు. కాని ఈ కాలంలో గ్రీసు – అనతి కాలంలోనే రోములో కూడా భారీ స్థాయిలో – బానిసత్వం అదనపు ఉత్పత్తికి ప్రధాన ఆధారంగా మారింది.

విశేషమేమిటంటే, రైతాంగ దోపిడీపై ఆధారపడ్డ స్పార్టా నగర రాజ్యం సారవంతమైన ప్రధాన భూభాగంపై కేంద్రీకృతమై ఉండేది. పూర్తి స్వేచ్ఛ కలిగిన పాలక వర్గప్రజలు వ్యవసాయం లేదా చేతివృత్తుల్లో శ్రమ చేయకుండానే హెలాట్ రైతులు అందజేసే అదనపు ఉత్పత్తిపై ఆధారపడుతూ జీవించేవారు. ఇక్కడ కూడా పాలకవర్గం సమాజ ప్రయోజనాలు ఆశించే నైతిక వర్గంగా తనను తాను ప్రకటించుకునేది. తమది సాత్వికమైన జీవనశైలి అని ఘంటాపథంగా చెప్పేది. బహుశా అదనపు ఉత్పత్తిని సేకరించడంలో భవిష్యత్తులో ఆటంకాలు లేదా ప్రజా వ్యతిరేకత వచ్చే అవకాశముందని పాలకవర్గాలు గ్రహించి ఉంటాయి. అయితే ఇతర రాజ్యాలు స్పార్టా పాలకవర్గానికి భిన్నంగా వ్యవహరించాయి.

జనాభాలో బానిసలది పెద్ద వర్గం కాకపోవడంతో నగర రాజ్యాలకు బానిసత్వం కీలకం కాదన్న వాదనలు కూడా కొన్ని సందర్భాల్లో తలెత్తాయి. కాని జిఇఎం దస్టే క్రాయిక్స్ సూచించినట్లు జనాభాలో బానిసల శాతం, అలాగే స్థూల సామాజిక ఉత్పత్తిలో వారి శ్రమదానం ప్రాధాన్యతలేని అంశం. 'ప్రాచీన గ్రీకు ప్రపంచంలో వర్గపోరాటం' అనే అధ్యయన గ్రంథంలో క్రాయిక్స్ ఈ విషయమై సమగ్రమైన వివరణ ఇచ్చారు. అదనపు ఉత్పత్తిని మిగల్చడంలో బానిసల పాత్ర ఏమిటన్నదే ఇక్కడ ప్రధానం. అదనపు ఉత్పత్తి లేకుండానే పాలక వర్గాలకు సోమరిజీవితాన్ని అనుభవించడం సాధ్యమయ్యేది కాదు. అలాగే శారీరక శ్రమ నుండి రచయితలు, కవులను విముక్తి కల్పించడం వీలుపడేది కాదు. అన్నింటికంటే ముఖ్యంగా అక్రోపొలిస్‌లో అద్భుత కట్టడాలను నిర్మించడానికి వనరులు సమకూరేవి కావు. బానిసలే ప్రధానంగా సాగు చేసే భూమిపై నియంత్రణ కారణంగానే పాలకవర్గాలకు ఆ హోదా దక్కింది. ఈ ప్రక్రియ ఎంత దూరం వెళ్లిందంటే కొందరు ప్రాచీన గ్రీకు రచయితలు, తత్త్వవేత్తలు నాగరిక జీవనానికి బానిసల యాజమాన్యం కీలకమని ప్రబోధించారు. ఆ విధంగా అరిస్టాటిల్

యజమానిని, బానిసను కుటుంబంలోని కీలక వ్యక్తులుగా (భార్యాభర్త, తండ్రి, పిల్లలతోపాటు) పరిగణించాడు. మరో వైపు పాలిబస్ బానిసలు, పశువులను జీవితానికి అత్యవసరమైన సాధనాలుగా పేర్కొన్నాడు.

చైనా చరిత్రలో సంభవించినట్లుగా గ్రీసు చరిత్రలో బానిస తిరుగుబాట్లు ఎక్కువగా కనిపించవు. ఎందుకంటే గ్రీకు, తర్వాతి రోమను బానిసత్వ స్వరూపం దోపిడీదారులకు వ్యతిరేకంగా బానిసలు సమీకృతం కావడానికి ఎలాంటి ఆస్కారం ఇవ్వలేదు. బానిసలు ఎక్కువగా యుద్ధంలో బందీలుగా చిక్కిన వారే కావడం విశేషం. మధ్యధరా తీరం, బాల్కన్స్, ఆసియా మైనర్, దక్షిణ రష్యాలలో జరిగిన యుద్ధాలలో గ్రీకులు ఎంతో మందిని బానిసలుగా మార్చి స్వదేశానికి తీసుకొచ్చారు. వారిని ఉద్దేశ్యపూర్వకంగా బానిస మార్కెట్‌లో కలిపి వేశారు. విభిన్న జాతులు, సాంప్రదాయాలు, భాషలకు చెందిన ఈ బానిసలు కలిసి పని చేసినా పరస్పరం సంభాషించడం చాలా కష్టమయ్యేది. తమ యజమానుల భాష అయిన గ్రీకులో వారు ఎంతో అవస్థపడితే కాని కొద్దిపాటి సంభాషణ సాధ్యమయ్యేది కాదు. యజమానులు తమతోటి దేశస్థుల సహాయంతో తిరుగుబాటు వైఖరి కలిగిన బానిసలను, వేట నుండి తప్పించుకునే వారిని కఠినంగా శిక్షించేవారు. అందుకే మెస్సేనియాలో స్పార్టా రైతులు సమీకృతమై తిరుగుబాటు ద్వారా విముక్తులు కాగా ప్రధాన భూభాగంలో పని చేసే బానిసలు మాత్రం ఏమీ చేయలేకపోయారు. దోపిడీకి వ్యతిరేకంగా బానిసలు పరోక్షంగానే నిరసన తెలిపేవారు. చాలా కాలంపాటు ఇదే పరిస్థితి కొనసాగింది. కాని ఈ పరోక్ష నిరసనే గ్రీకు, ఆ తర్వాత రోము చరిత్రలో ప్రధానాంశంగా మారింది. దీనర్థం పంటను నేరుగా సాగుచేసేవారు (బానిసలు) తమ వ్యవసాయ పద్ధతులను లేదా దిగుబడి నాణ్యతను పెంచడానికి ఎలాంటి ఆసక్తి చూపలేదు. ఫలితంగా కార్మికుల ఉత్పాదకత ఏ మాత్రం మెరుగుపడలేదు. ఇంకా చెప్పాలంటే బానిసలను వారి స్థానంలో ఉంచడానికి రాజకీయ నాయకులు, పాలకులు ఎలాంటి ఇతర నిర్ణయాలనైనా తీసుకునే వారు. చారిత్రక ప్రక్రియలో తామే స్వయంగా జోక్యం చేసుకొనే స్థితిలో బానిసలు ఉండేవారు కాదు.

అయితే మరో తరహా వర్గపోరాటం ప్రాచీన గ్రీకు చరిత్రలో కీలకపాత్ర పోషించింది. ఈ పోరాటం భూస్వాములు,సన్నకారు రైతులు – చేతివృత్తిదారుల మధ్య జరిగింది. సాధారణ రైతులు, హస్తకళాకారులు ఒకటి అరా బానిసలను కలిగి ఉన్న వారితో కలిసే శ్రమ పడేవారు. మరోవైపు భూస్వాములు బానిసలను పెద్ద సంఖ్యలో కలిగి ఉండేవారు. వారితో తమ విశాలమైన భూములను సాగు చేయించేవారు.

గ్రీకు నగర రాజ్యాలు ఏర్పడిన తొలి దశలో ప్రాచీన సాంప్రద్యాయాలు కొన్నింటిని ప్రతిబింబించేవి. రాజులు సాంప్రదాయ తెగ నాయకుల నుండి వచ్చేవారు. సముదాయ సంబంధాలు ప్రజల బాధ్యతలు, ప్రవర్తనను నిర్ధారించడంలో కీలక పాత్ర పోషించేవి. హక్కులు, బాధ్యతలనే సిద్ధాంతం ఆధారంగానే సమాజాన్ని ఏకతాటిపై ఉంచేవారు. నిర్దిష్టమైన చట్టాలు లేదా శిక్షాస్మృతి అంటూ ఏదీ ఉండేది కాదు. వాణిజ్య విస్తరణ, బానిసత్వం అభివృద్ధి చెందడంతో సంపన్నులైన భూస్వాములు ప్రాచీన సాంప్రదాయాల ఆధారంగా నిర్ధారించబడిన నైతిక

విలువలను గట్టిగా సవాలు చేయడం మొదలుపెట్టారు. పాత పాలకవర్గాల అదనపు హక్కులను ఒకవైపు నిరసిస్తూనే మరోవైపు సాంప్రదాయబద్ధంగా పేదలపై మోపుతూ వచ్చిన బాధ్యతలను కూడా వ్యతిరేకించారు. ఉన్నత వర్గాల మధ్య తీవ్రమైన సంఘర్షణచోటు చేసుకున్న ప్రపంచమది. అవకాశం వచ్చినప్పుడల్లా ఆయా వర్గాలు తమ వ్యతిరేకతను వ్యక్తం చేసేవి. సరిహద్దులను వివాదాస్పదం చేసేవి. వారసత్వాన్ని సవాలు చేసేవి. దహన సంస్కారాల సమయంలో పోటీపడి ఊరేగింపులు జరిపేవి.

చాలా రాజ్యాల్లో ఈ సంఘర్షణ ఫలితంగా రాజులు పదవీచ్యుతులయ్యారు. ధనికవర్గం పాలించే గణరాజ్యాలు ఆవిర్భవించాయి. ఈ రాజ్యాల్లో నవీన ధనికులు తమ హోదాను పాత పాలకులను తప్పించడానికే కాకుండా తమ కింది స్థాయి పౌరుల నుండి సాధ్యమైనంత వరకు అదనపు ఉత్పత్తిని సమకూర్చుకోవడానికి ఉపయోగించారు. రాజ్య పాలనా వ్యయాన్ని సమకూర్చుకోవడానికి తక్కువ స్థాయిలో భూములు కలిగిన వారిపై పన్ను విధించేవారు. ఉదాహరణకు నావికాదళ నిర్వహణకు భారీగా వ్యయం అయ్యేది. ఈ పాలనా వ్యవస్థలు పాలకవర్గాల ప్రయోజనాలను పరిరక్షించడానికే ఏర్పాటయ్యాయి. పంట విఫలమైతే రైతులు రాజ్యానికి పన్ను చెల్లించి మనుగడ కోసం ధనికుల నుండి అప్పు తీసుకునేవారు. ఆ విధంగా సాధారణ ప్రజలు అప్పుల ఊబిలో కూరుకుపోయేవారు. అప్పు తీర్చలేదన్న కారణం చూపి ధనికులు, బడా భూస్వాములు రైతుల భూములను స్వాధీనం చేసుకునేవారు. కొన్నిసార్లు రైతులనే వెట్టి కార్మికులుగా మార్చేవారు. ధనిక వర్గాల అధీనంలోని ఆస్థానాలు పేదలకు వ్యతిరేకంగా తీర్పు ఇవ్వడంలోనే ఎక్కువ ఆనందం పొందేవి.

ఈ ధనిక గణరాజ్యాలు అనతి కాలంలోనే ప్రజల ఆగ్రహానికి గురయ్యాయి. ఇలాంటి చాలా రాజ్యాల్లో ఉన్నత వర్గాల నుండే వచ్చిన పదవీ కాంక్ష కలిగిన వ్యక్తులు ప్రజల ఆగ్రహాన్ని ఆసరాగా చేసుకొని రాజకీయాధికారాన్ని చేజిక్కించుకున్నారు. ఆ తర్వాత నియంతలుగా మారారు. సాధారణ, పేద ప్రజలకు మేలు కలిగించే ఆర్థిక సంస్కరణలు చేపట్టడం ద్వారా ధనిక వర్గాలను ఈ నియంతలు అసంతృప్తికి గురి చేసేవారు. అయితే సామాజిక అసమానతలు వర్గ స్వరూపం దాల్చకుండా అడ్డుకోలేకపోయారు.

కొన్ని రాజ్యాల్లో, ముఖ్యంగా ఏథెన్స్‌లో, ప్రజల ఒత్తిడి కారణంగా మరింత తీవ్రమైన మార్పులు చోటు చేసుకున్నాయి. బహుస్వామ్యం, నియంతృత్వం స్థానంలో 'ప్రజాస్వామ్యం' అవతరించింది. అప్పటి నేపథ్యంలో ప్రజాస్వామ్యం అనే పదానికి 'ప్రజల రాజ్యం' అనే అర్థముండేది. వాస్తవానికైతే అది ప్రజలందరికీ ఉద్దేశించబడినది కాదు. ఎందుకంటే దాని పరిధి నుండి బానిసలు, మహిళలు, విదేశాల నుండి వచ్చి స్థిరపడిన వారిని (వ్యాపారులు, హస్తకళాకారుల సముదాయమైన మెటిక్‌లు) మినహాయించారు. ధనికుల చేతుల్లో సంపద కేంద్రీకృతం కావడాన్ని, బానిసలు కలిగి ఉండడాన్ని కూడా ప్రజాస్వామ్యం సవాలు చేయలేదు. ఈ పరిణామం ఎలాంటి ఆశ్చర్యం కలిగించదు. ఎందుకంటే ప్రజాస్వామిక శక్తుల నాయకత్వమంతా అసమ్మతివాదులైన కొందరు సంపన్న భూస్వాముల చేతుల్లోనే ఉండేది. సాధారణ ప్రజల డిమాండ్లను చేపట్టడం ద్వారా వారు తమ స్వంత రాజకీయ హోదా,

పలుకుబడిని పెంచుకున్నారు. అయితే ప్రజాస్వామిక వ్యవస్థ సాధారణ పౌరులకు ధనిక వర్గాల దోపిడీ నుండి తమను తాము రక్షించుకునే అధికారాన్ని మాత్రం కట్టబెట్టింది. ఆ విధంగా ఏథెన్స్ నగర రాజ్యంలో సొలొన్ కాలం నుండి (క్రీ.పూ.594) వెట్టి చాకిరిని నిషేధించారు. పౌరులందరికీ ప్రాతినిధ్యం వహించే చట్టసభలో చర్చించిన మీదటే చట్టాలను ఆమోదించేవారు. ప్రజలే న్యాయమూర్తులను, ఇతర కిందిస్థాయి అధికారులను ఎన్నుకునేవారు.

తమ అధికారానికి ఇన్ని ప్రతిబంధకాలు, పరిమితులు ఏర్పడడంతో పాలకవర్గం తీవ్ర అసంతృప్తికి గురైంది. ఈ అసంతృప్తి కొన్ని సాహిత్య, తత్త్వవేత్తల మండళ్లలో వ్యక్తమయ్యేది. ప్రజాస్వామ్యం శ్రామికుల పాలన అని, అట్టడుగు వర్గాలకు హక్కులను ప్రసాదించిన ఉన్నత వర్గాల వారు పచ్చి అవకాశవాదులని వాదించబడింది. రాజ్య వ్యవస్థపై 'ప్రజా నియంత్రణ' సంకెళ్లు (ప్రజాస్వామ్యం ముసుగులో) ఏర్పడ్డాయని, వాటిని తెంచితేనే భవిష్యత్‌కు బాటలు వేయగలమని సాహిత్యకారులు, తత్త్వవేత్తలు నొక్కి చెప్పేవారు. అరిస్టోఫేన్ల నాటకాలు అలాంటి తీవ్ర భావాలను వ్యక్తం చేసేవి. అలాగే ప్లాటో రాజకీయ రచనలు, సొక్రటిస్, అతడి అనుచరుల వాదనలు కూడా ఈ తరహాలోనే ఉండేవి.

ఉన్నత వర్గాలు కేవలం మాటల ద్వారానే తమ నిరసనను వ్యక్తం చేయలేదు. అవకాశం వచ్చిన చోటల్లా సైనిక తిరుగుబాటు ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. పూర్తిస్థాయి ప్రతీఘాత విప్లవానికి నాయకత్వం వహించారు. తమకు అడ్డువచ్చిన వారిని హత్య కూడా చేశారు. తమ ధనబలం ఆధారంగా వారు సైన్యాన్ని లొంగదీసుకొని అధికారాన్ని కైవసం చేసుకోగలిగారు. ప్రజలకు అలాంటి ఆధారం ఉండేది కాదు. పదాతి దళానికి చెందిన హోప్‌లైట్ విభాగం సైన్యంలో కీలకశక్తిగా ఉండేది. ఇందులో మధ్యతరగతి రైతు కుటుంబానికి చెందిన వారే ఎక్కువగా ఉండేవారు. రక్షణ కవచాలు, ఆయుధాలకు సరిపడా సంపదను వారు సమకూర్చేవారు. కనుక గ్రీకు నగర రాజ్యాల చరిత్ర చాలా వరకు సంఘర్షణల చరిత్రే. ఈ సంఘర్షణల్లో చాలా వరకు బడా భూస్వాములు ప్రజాస్వామ్యంపై విజయం సాధించగలిగారు. ఏథెన్స్ ఒక్కటే అందుకు మినహాయింపు. అక్కడ ప్రజాస్వామ్యం సుమారు రెండు వందల సంవత్సరాల వరకు మనుగడ సాగించింది. వ్యాపారంపై ఆ రాజ్యం ఎక్కువగా ఆధారపడడంవల్ల నావికా దళానికి కీలకమైన పాత్ర ఉండేది. నావికాదళంలో పేదలే కీలక పాత్ర నిర్వహించేవారు. స్పార్టాతో జరిగిన పెలోపెనీసు యుద్ధంలో ఓటమి తర్వాత ఏథెన్స్‌లో ధనిక వర్గాలు తిరుగుబాటు తేవడానికి రెండుసార్లు విఫలయత్నం చేశాయి.

చాలా నగర రాజ్యాలలో ప్రజాస్వామ్యంపై అంతర్గతంగా చెలరేగిన వర్గపోరుతో ఈ 30 ఏళ్ల యుద్ధం (క్రీ.పూ. ఐదవ శతాబ్దం చివరలో) ముడిపడి ఉండేది. ఇతర రాజ్యాలపై ప్రాబల్యం పెంచుకోవడం కోసం స్పార్టా, ఏథెన్స్‌ల మధ్య నెలకొన్న పోటీ చివరికి పెలోపెనీస్ యుద్ధానికి దారి తీసింది. తన సరిహద్దులను సంరక్షించేందుకు, హెలాట్‌లను నియంత్రించేందుకు పెలోపేనీస్ (దక్షిణ గ్రీకు ప్రధాన భూభాగం) చుట్టూ ఉన్న రాజ్యాలతో స్పార్టా ఒకసైనిక కూటమిని ఏర్పాటు చేసింది. అయితే ఏథెన్స్ వాణిజ్య కార్యకలాపాల కోసం సముద్ర జలాలపై ఎక్కువగా ఆధారపడేది కనుక తీర ప్రాంత పట్టణాలు, దీవులతో ఒక వాణిజ్య

ఒప్పందాన్ని కుదుర్చుకుంది. సముద్ర జలాల - ఆధారిత ఈ వ్యాపార, సైనిక కూటమివల్ల ఏథెన్స్‌కు మిత్ర రాజ్యాల నుండి క్రమం తప్పకుండా కప్పం దక్కేది. అలా సమకూరిన సంపదను రాజ్య వ్యవహారాలపై, ముఖ్యంగా నావికా దళ నిర్వహణపై, వ్యయం చేసేది. ఈ రెండు కూటముల్లో ఏది పై చేయి సాధిస్తుందన్న అంశం వరకే ఈ యుద్ధం పరిమితం కాలేదు. సమాజాన్ని ఎలా వ్యవస్థీకరించాలి అనే అంశంపై ఉన్న పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాల ఘర్షణను కూడా ఈ యుద్ధం ప్రతిబింబించింది. ఏథెన్స్, దాని మిత్ర రాజ్యాలలో కొందరు ఉన్నత వర్గాలకు చెందిన వారుస్పార్టా విజయాన్ని కోరుకున్నారు. స్పార్టా విజయం సాధిస్తే ఏథెన్స్‌లో ఉన్న ప్రజాస్వామ్యాన్ని విచ్ఛిన్నం చేయవచ్చని భావించారు. కొందరికైతే స్పార్టా తమ ప్రతీఘాత విప్లవ ఆకాంక్షలకు ప్రతిబింబంగా మారింది. స్వల్ప సంఖ్యలో ఉండే పాలక వర్గాలు ప్రజల హక్కులను పూర్తిగా ఎలా నీరుగార్చవచ్చో నిరూపించడానికి స్పార్టా వ్యవస్థ మార్గదర్శిగా ఉండేది. 1930 దశకంలో ఐరోపాను తీవ్రంగా ప్రభావితం చేసిన ఫాసిస్టు ఇటలీ, నాజీ జర్మనీ పాలకవర్గాల ధోరణితో అప్పటి గ్రీకు పాలకవర్గాల ఆలోచనా సరళిని పోల్చవచ్చు.

ఈ రెండు లేదా మూడు శతాబ్దాలపాటు గ్రీకు నాగరికత అభ్యున్నతిని శాసించిన సామాజిక తిరుగుబాట్లు, వర్గ వైషమ్యాలు సాహిత్యం, విజ్ఞానశాస్త్రం, తత్త్వశాస్త్రంలో గ్రీకులు సాధించిన అత్యుత్తమ విజయాలకు నేపథ్యంగా ఉండేవి. ఈ కాలంలో ప్రజలు పాత సాంప్రదాయాలను, సిద్ధాంతాలను ప్రశ్నించే స్థాయికి నెట్టబడ్డారు. ప్రజల నిరంతర సంఘర్షణను ప్రతిబింబించడంవల్లే హోమర్ కవిత్వానికి అంత శక్తి చేకూరింది. (వాస్తవంగా అయితే హోమర్ రచనలకు క్రీ.పూ.700 మధ్యకాలంలో ఒక సమగ్ర రూపం వచ్చింది. అంతకు ముందు అతడి కాల్పనిక గాథలన్నీ మౌఖికంగానే ప్రచారం అయ్యేవి) పరస్పర విరుద్ధమైన నైతిక ప్రవర్తనా నియమావళుల మధ్య జరిగిన ఘర్షణ నుండే అషిలస్ నాటకాల్లోని ప్రధాన పాత్రలు పుట్టుకొచ్చాయి. ఆయా సామాజిక వర్గాల మధ్య పాత, కొత్త సాంప్రదాయాలను అనుసరించే విషయంలో ఎడతెగని రాజకీయ, సైద్ధాంతిక ఘర్షణ జరిగేది. సమాజాన్ని ఎలాంటి విలువల ఆధారంగా నిర్మించాలి అనేది ప్రధాన సమస్యగా ఉండేది. మానవ జీవిత లక్ష్యం, మానవ ప్రవర్తన నియమాలు, సత్యశోధన తదితర మౌలిక ఆలోచనలను సిద్ధాంతీకరించడానికి మేధావులు కృషి చేస్తుండగా భిన్నమైన తాత్విక అధ్యయన సంస్థలు ఆవిర్భవించాయి. ఆశావాదులు, నిరాశావాదులు చివరగా ఒక విశ్లేషణకు వచ్చారు. ఎలాంటి ఆలోచన అయినా, సిద్ధాంతమైనా, నిర్దిష్టమైన చర్చ ధాటికి నిలవడం అసాధ్యమని వారు నిర్ధారించారు. చర్చ అనంతరం విజయవంతంగా ఆవిర్భవించే సిద్ధాంతాన్ని మళ్లీ చర్చ ద్వారా ఓడించవచ్చని ప్లాటో వాదించాడు (ఈ ప్రక్రియనే గతితార్కికం అంటారు.) మానవుని ప్రత్యక్ష అనుభవానికి దూరంగా, కేవలం మేధావుల ఆలోచనకు అందుబాటులో ఉండే తర్కంపైనే సత్యం ఆధారపడి ఉంటుందని ప్లాటో వాదన నిర్ధారించింది. సమాజంలోని ఈ మేధావుల వర్గమే రాజ్యాన్ని నియంతృత్వ వ్యవస్థ ద్వారా పాలించాలని ప్లాటో సిద్ధాంతీకరించాడు. ప్లాటో ఆధ్వర్యంలో విద్యను అభ్యసించిన అరిస్టాటిల్ తదుపరి కాలంలో ప్లాటో సిద్ధాంతాన్ని సవాలు చేశాడు. భౌతిక, సామాజిక ప్రపంచ

అనుభవవాద పరిజ్ఞానం ఆధారంగానే విశ్లేషించాలని అతడు నొక్కి చెప్పాడు. విశ్వం నాలుగు మౌలిక వనరులపై – నీరు, అగ్ని, వాయువు, భూమి – ఆధారపడి ఉందని అతడు పేర్కొన్నాడు. క్రీ.పూ. ఐదవ శతాబ్దంలో డెమొక్రటస్, క్రీ.పూ. నాల్గవ శతాబ్దం చివరలో ఎపిక్యూరస్ భౌతికవాద ప్రాపంచిక దృష్టికోణాన్ని అభివృద్ధి పరిచారు. విశ్వం అవిభజిత అణువులతో నిర్మితమై ఉందని వారు వాదించారు.

మెసొపొటామియా, అస్సీరియా, పర్షియా సామ్రాజ్యాల తరహాలో భారీ అధికార యంత్రాంగం లేకపోవడం కారణంగా గ్రీకు నగరరాజ్యాలు క్రియాశీలంగా వ్యవహరించగలిగాయి. యుద్ధం విషయంలో ప్రజల మద్దతును సంపూర్ణంగా కూడగట్టగలిగాయి. ఈ ప్రత్యేకత వల్లే క్రీ.పూ. ఐదవ శతాబ్దం మొదట్లో గ్రీకు రాజ్యాల సంకీర్ణ సైన్యాలు దండయాత్రకు వచ్చిన మహాసామ్రాజ్యాల సైన్యాలను అడ్డగించగలిగాయి. అలా 150 ఏళ్ల తర్వాత గ్రీకు ఉత్తర భూభాగంలో మాసిడోనియా రాజ్యం భారీ సైన్యాన్ని నిర్మించగలిగింది. మాసిడోనియా ఇతర గ్రీకు రాజ్యాలపైనే కాకుండా చారిత్రక సామ్రాజ్యాలైన ఈజిప్టు, పశ్చిమాసియాలపై కూడా ప్రాబల్యం సంపాదించింది. ముఖ్యంగా అలెగ్జాండర్ మరణం తర్వాత అతడు నెలకొల్పిన మహాసామ్రాజ్యం కూడా విచ్ఛిన్నమైంది. కాని గ్రీకు భాష మాట్లాడే పాలక వంశాలు పశ్చిమాసియా, ఈజిప్టు సామ్రాజ్యాలపై తమ ఆధిపత్యాన్ని కొనసాగించాయి. ఈజిప్టు, పశ్చిమాసియా ప్రాంతాల్లోని పాత నాగరికతల అనుభవం నుండే గ్రీకు నాగరికత శాస్త్ర, సామాజిక రంగాల్లో ప్రగతిని సాధించింది. ఈ రెండు సామ్రాజ్యాలపై గ్రీకు పాలక వంశాలకు ఆధిపత్యం రావడంతో మరింత అభివృద్ధి సాధ్యమైంది. గ్రీకు – ఈజిప్టు నగరమైన అలెగ్జాండ్రియాలోనే గ్రీకు నాగరికత శాస్త్ర, గణిత, తత్త్వశాస్త్ర రంగాల్లో ఉన్నత శిఖరానికి చేరుకుంది.

సుమారు క్రీ.పూ. 300 సంవత్సర కాలంలో యూక్లిడ్ రేఖాగణిత మౌలిక సిద్ధాంతాలను రూపొందించాడు. కొంత కాలం తర్వాత ఎరాటోస్తీన్ భూమి వ్యాసాన్ని 24,000 మైళ్లుగా లెక్కించాడు. క్రీ.పూ. 150 మధ్యకాలంలో దూరాలను కొలవడానికి త్రికోణమితి పద్ధతులను హైపార్కస్ అభివృద్ధి పరచడం మొదలుపెట్టాడు. భూమి నుండి చంద్రమండలానికి మధ్య ఉన్న దూరాన్ని దాదాపు నిర్దిష్టంగా లెక్కవేయగలిగాడు. హైపార్కస్ సిద్ధాంతాలపై సుమారు 300 ఏళ్ల తర్వాత క్లాడియస్ టోలెమి పరిశోధన జరిపి గ్రహాలు, నక్షత్రాల గమనాన్ని కొలిచే సూత్రీకరణ అభివృద్ధి పరిచాడు. గ్రహాలు, నక్షత్రాలు భూమి చుట్టూ తిరుగుతున్నాయని టోలెమి పేర్కొన్నా వాటి గమన పథాన్ని నిర్దిష్టంగా కొలవగలిగాడు. మొత్తమ్మీద, అలెగ్జాండ్రియాలో అభివృద్ధి చెందిన శాస్త్రాలు భారత్, చైనా నాగరికతలకు ఎంతో ఉపకరించాయి. అలాగే క్రీ.శ. ఏడు నుండి పన్నెండవ శతాబ్దాల మధ్య అరబ్ ప్రపంచంలో శాస్త్ర సాంకేతిక రంగాల అభివృద్ధికి బాట వేశాయి. అయితే గ్రీకు శాస్త్ర పరిశోధనల గురించి సుమారు వెయ్యేళ్ల వరకు ఐరోపాలో ఎలాంటి చర్చ కాని, సమాచారం కాని లేదు.

ఈలోపు మధ్యధరా ప్రాంతంలో మిగిలిన అలెగ్జాండ్ సామ్రాజ్య అవశేషాలు రోము పాలకులు స్థాపించిన కొత్త సామ్రాజ్యంలో విలీనమయ్యాయి.

ఐదవ అధ్యాయం

# రోము సామ్రాజ్య ఉత్థాన పతనం

'రోము సామ్రాజ్య వైభవం'.... ఈ నానుడి ప్రపంచ చరిత్రపై పశ్చిమ దేశాలలో వెలువడిన ఇతివృత్తాల్లో సాధారణంగా ఘోషిస్తూ ఉంటుంది. ప్రాచీన నాగరికతల్లో రోము సామ్రాజ్య ఆవిర్భావాన్ని ఉన్నత దశగా అభివర్ణించారు. అలాగే దాని పతనాన్ని చారిత్రక దుర్ఘటనగా పేర్కొన్నారు. ఐరోపా చైతన్య ఉద్యమంలో ప్రధాన పాత్ర పోషించిన ఎడ్వర్డ్ గిబ్బన్స్ "రోము సామ్రాజ్య పతనం" అనే గ్రంథాన్ని రచించారు. "క్రీస్తుశకం రెండవ శతాబ్దంలో రోము సామ్రాజ్యం భూమండలంలోని సంపన్నమైన ప్రాంతంపై ఆధిపత్యం కలిగి ఉండేది. సంస్కారవంతమైన పద్ధతులు, చట్టాలు అన్ని రాష్ట్రాలపై తీవ్ర ప్రభావం చూపేవి. అంతిమంగా అవి సామ్రాజ్యంలోని ఆయా రాష్ట్రాల మధ్య బలమైన సంబంధాలను నెలకొల్పాయి. సామ్రాజ్యంలో శాంతియుతంగా జీవనం కొనసాగించిన ప్రజలు దాని సంపదను, వైభోగాన్ని దుర్వినియోగం చేశారు." ఈ వ్యాఖ్యలతో ఆ గ్రంథం మొదలవుతుంది.

ఒక కోణం నుండి చూస్తే రోము నాగరికత ఉజ్వలమైనది. ఇటలీలోని ఒక చిన్న పట్టణం క్రమంగా ఎదిగి మధ్యధరా ప్రాంతాన్నంతటిని శాసించింది. ఆస్వాన్‌కు ఉత్తరాన ఉన్న ఈజిప్టు, డాన్యూబ్,రైన్ నదులకు దక్షిణాన ఉన్న ఐరోపా, ఆసియా మైనర్, సిరియా, సహారా ఎడారికి ఉత్తరాన ఉన్న ఆఫ్రికా ప్రాంతమంతటిపై రోము సామ్రాజ్య ఆధిపత్యం ఉండేది. సామ్రాజ్యంలోని పశ్చిమ భాగం సుమారు 600 సంవత్సరాలపాటు కొనసాగింది. అయితే ఈశాన్య భాగం మాత్రం 1,600 సంవత్సరాలు మనగలిగింది. సామ్రాజ్య పాలకులు ప్రతి చోటా సార్వజనిక భవనాలు, ఆలయాలు, క్రీడావేదికలు, నీటి కాలువలు, సార్వజనిక స్నానఘట్టాలు, రహదారులు నిర్మించి వాటిని భావితరాలకు వారసత్వంగా అందించారు.

అయితే దురదృష్టవశాత్తు సామ్రాజ్య నాగరికత జీవనోపాధి మార్గాలను అన్వేషించే సామర్థ్యాన్ని మానవాళిలో పెంచలేకపోయింది. అలాగే శాస్త్రీయ పరిజ్ఞానం లేదా సాంస్కృతిక వారసత్వాన్ని విస్తరించలేకపోయింది.

మెసొపొటామియా, ఈజిప్టు లేదా ప్రాచీన గ్రీకు నాగరికతలలో, అలాగే క్రీస్తు పూర్వం చివరి ఐదు వందల సంవత్సరాలలో భారతదేశం, చైనాలలో కనిపించిన శాస్త్రీయ దృక్పథం రోము సామ్రాజ్యంలో నామమాత్రంగా ఉండేది. సాంకేతిక పరిజ్ఞానం విషయంలో ఏవో కొన్ని

అన్వేషణలు మినహా సామ్రాజ్యం సాధించిందంటూ ఏమీ లేదు. గ్రీకు నాగరికతతో పోలిస్తే రోము నాగరికత రెండు రంగాల్లోనే ముందంజలో ఉండేది. ఒకటి : పాలనా వ్యవస్థలో పటిష్టమైన నిర్మాణాలను ప్రవేశపెట్టి సామ్రాజ్యాన్ని సమైక్యంగా ఉంచగలిగింది. రెండు : పౌర చట్ట సిద్ధాంతంలో ఆస్తి, వారసత్వ అంశాలపై నిర్దిష్టమైన నిబంధనలను రూపొందించింది. (అయితే నేరచట్టాలు మాత్రం కఠినంగా, ఏకపక్షంగా ఉండేవి) ఈ రెండు అంశాలు కొంత అతిశయమేనని భావించవచ్చు. రోము నిర్మాణశైలి, నిర్మాణ ప్రక్రియ ఖచ్చితంగా బ్రహ్మాండమైనవే. ముఖ్యంగా నీటి కాలువలు, కళామందిరాలు, ఆలయాలు, రహదారులు చాలా వైభవంగా, విస్తారంగా ఉండేవి. ఈజిప్టు, గ్రీకు, మెసొపొటామియా నాగరికతలు గతంలో సాధించిన విజయాలను మధ్య, పశ్చిమ ఐరోపాలకు విస్తరించడం వరకే రోము సామ్రాజ్యం పరిమితమైంది. వాటికి అదనంగా చేసినకృషి ఏదీ లేదు. మరో విషయం ఏమిటంటే దేని ఆధారంగా సామ్రాజ్యాన్ని నిర్మించారో ఆ ఆధారంవల్లే అది పతనమైంది. పశ్చిమ ప్రపంచంలో పాత నాగరికతలు సాధించిన విజయాలు మినహా రోము సామ్రాజ్యం ఎలాంటి వారసత్వాన్ని, చిహ్నాలను మిగల్చలేదు.

రోము సామ్రాజ్య తొలి దశ పాత గ్రీకు నగర రాజ్యాల వ్యవస్థను చాలా వరకు పోలి ఉంటుంది. గ్రీకు భాష నుండే రోము అక్షర లిపి అభివృద్ధి చెందింది. బహుశా తొలుత రోము వ్యవసాయదార సమాజంగా ఉండి ఉండొచ్చు. రాజ్య వ్యవస్థ కంటే కులం, సముదాయ లేదా తెగ సంబంధాల ఆధారంగానే సమాజం ఒక నిర్దిష్ట స్వరూపాన్ని సంతరించుకుంది. ఈ వర్గాల నుండే పాలక వర్గం ఆవిర్భవించింది. మధ్యధరా సముద్రానికి దారి తీసే టైబర్ నదిపై నిర్మితమైన కారణంగా రోము సమాజం వ్యాపార మార్గాలపై వ్యూహాత్మకమైన పట్టును సాధించగలిగింది. ముఖ్యంగా ఉత్తర-దక్షిణ, పశ్చిమ-ఈశాన్య సముద్ర మార్గాలన్నీ రోము సామ్రాజ్యం గుండా వెళ్లేవి. వ్యవసాయ దిగుబడికి తోడు వ్యాపారం ద్వారా సమకూరే ఆదాయం సామ్రాజ్య నిర్వహణకుఎంతో ఉపయుక్తంగా ఉండేది. (వ్యాపార మార్గాలను వినియోగిస్తున్నందుకుగాను వ్యాపారుల నుండి కొంత రుసుమును వసూలు చేసి ఉండొచ్చు) పూరి గుడిసెల సమూహంగల ఒకగ్రామీణసమాజం అలా క్రమంగా సంపన్నమైన పట్టణంగా (క్రీ.పూ. ఆరవ శతాబ్దం చివరలో) ఎదిగింది. పట్టణంలో కలప, ఇటుకలతో నిర్మించిన భవనాలు, విశాలమైన ఆలయాలు, భూగర్భ డ్రైనేజి వ్యవస్థ, దిగుమతి చేయబడిన అమూల్యమై అట్టిక్‌కుండలు వెలిశాయి. కొంత కాలంపాటు రోము సామ్రాజ్య ఉత్తర భాగం ఎట్రూస్కాన్ రాజ్య ప్రాబల్యం కింద ఉండేది. ఈ విద్యావంతమైన సమాజంలో నల్లసముద్రం ఉత్తర భాగాన ఎక్కడో ఐరోపా-భారతీయ సంతతికి చెందని భాష అభివృద్ధి చెంది ఉండొచ్చు. క్రీస్తు పూర్వం ఆరవ శతాబ్దం చివరలో రోము ప్రజలు ఎట్రూస్కాన్లను తరిమికొట్టారు. రోమను సాంప్రదాయం ప్రకారం ఈ ఘటన క్రీ.పూ.509లో జరిగింది. ఎట్రూస్కాన్లను పదవీచ్యుతులను చేసిన తర్వాత రోమన్లు గణ రాజ్యాన్ని స్థాపించి సైనిక బలంపై సామ్రాజ్యాన్ని విస్తరించడం మొదలుపెట్టారు. తర్వాతి 400 సంవత్సరాల వరకు ఈ ప్రక్రియ అనేక దశల్లో కొనసాగింది. లాటిన్ భాష మాట్లాడే వివిధ నగరాలతో సమాఖ్య ఏర్పాటైంది. ఆ నగరాలు కాలక్రమంలో రోమును

గణరాజ్యంలో రాష్ట్రాలుగా స్థిరపడ్డాయి. మధ్యఇటలీ ఆక్రమణకు గురైంది. దక్షిణ ఇటలీ, ఉత్తర ఆఫ్రికాలోని పూర్వపు ఫోనేషియన్ వలస ప్రాంతాన్ని నియంత్రణలోకి తెచ్చుకునేందుకు అనేక యుద్ధాలు జరిగాయి. ఉత్తర ఇటలీ, గ్రీసు రోము సామ్రాజ్య వశమయ్యాయి. చివరగా రైన్, డాన్యూబ్ నదులకు ఉత్తరాన ఉన్న ఐరోపా అంతా సామ్రాజ్య నియంత్రణలోకి వచ్చింది. అలాగే పూర్వపు గ్రీకు సామ్రాజ్యాలైన ఆసియా మైనర్, సిరియా, ఈజిప్టు స్వాధీనమయ్యాయి.

ఈ విస్తరణ ప్రతి దశలోనూ స్వతంత్రులైన భూస్వామ్య వర్గాల నుండి వచ్చిన పదాతి సైనికులు కీలకపాత్రను పోషించారు. తొలుత రోము నగర సరిహద్దుల్లో వ్యవసాయం చేస్తున్న వారు, ఆ తర్వాత రోమను పౌరసత్వం పొందిన ఇతర ఇటలీ నగరాలకు చెందిన రైతులు సైన్యంలో పెద్ద సంఖ్యలో చేరారు. క్షేత్రస్థాయిలో యుద్ధం చేసి ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొన్న రైతాంగం సైన్యాన్ని మాత్రం నియంత్రించలేకపోయింది. అలాగే సైనిక విజయాల నుండి ఎలాంటి ప్రయోజనాలను పొందలేకపోయింది. ఏథెన్స్ లాగా రోము ఏ రంగంలోనూ ప్రజాస్వామిక లక్షణాలు కలిగి ఉండకపోవడమే రైతాంగానికి శాపంగా మారింది.

## గణరాజ్యం - వర్గ పోరాటాలు

తొలి గణరాజ్య స్థాపన పరిమిత సంఖ్యలో ఉన్న ఉన్నత వర్గాల కుటుంబాలకు అధికారంపై పూర్తి గుత్తాధిపత్యాన్ని కల్పించింది. రాజ్య విధానాలను అమలు చేయడానికి ప్రతి సంవత్సరం ఎన్నికయ్యే సెనేట్ సభ్యులు, మంత్రులు, అలాగే న్యాయమూర్తులు, అధికారులు, శాంతిభద్రతలను పర్యవేక్షించే వారు అందరూ ఉన్నత కుటుంబాలకు చెందిన వారే. జిల్లా అధికారులను నియమించేందుకు పరిమిత అధికారాలుగల ఒక శాసనమండలి ఉండేది. యుద్ధం, శాంతి ఒప్పందాలపై నిర్ణయం తీసుకునే అధికారం కూడా మండలి సభ్యులకు ఉండేది. అయితే మండలిలో 193 సభ్యుల్లో 98 మంది ఉన్నత వర్గానికి చెందిన వారే కావడంతో కార్మిక, రైతాంగ వర్గాల నుండి ఎన్నికైన సభ్యులకు నిర్ణయ నిర్ధారణ ప్రక్రియలో ఎలాంటి పాత్ర ఉండేది కాదు. ఉన్నత వర్గాల దృష్టిలో ఒక నిర్ణయం సమంజసమైనదని తోస్తే దానిని వ్యతిరేకించే శక్తి ఇతర వర్గాలకు ఉండేది కాదు. ఎలాంటి అస్తులు లేని రోమన్లకు (వీరినే కార్మికవర్గమని పిలిచేవారు) మొత్తంగా ఒకే ఒక ప్రతినిధి ఉండేవాడు.

పాలకవర్గాలు తమ రాజకీయ ప్రాబల్యాన్ని కేవలం భూములను స్వాధీనం చేసుకోవడానికే వినియోగించేవి. దీనివల్ల సాధారణరైతులు తీవ్రంగా నష్టపోయేవారు. కొందరు అప్పుల ఊబిలో కూరుకుపోయేవారు. ఉన్నత కుటుంబాలు రైతుల భూములను స్వాధీనం చేసుకునేవి. న్యాయమూర్తుల ద్వారా తమకు అనుకూలంగా తీర్పు చెప్పించుకునేవి. మరోవైపు సైనిక బలగాల ప్రధానాధికారులు కూడా ఉన్నత కుటుంబీకులే కావడంతో ప్రతి సైనిక విజయం తర్వాత స్వాధీనం చేసుకునే భూమిలో సింహభాగాన్ని తమ నియంత్రణలోనే ఉంచుకునేవారు. ఉన్నత వర్గాల ఈ దారుణమైన ప్రవర్తన కారణంగా బీజం వేసుకున్న వైషమ్యాలు వర్గపోరాటానికి దారి తీశాయి. వర్గ పోరాటం రెండు సందర్భాల్లో మహా ఉప్పెనలాగా ఎగిసి పడింది.

తొలి వర్గ పోరాటం గణరాజ్యం స్థాపించబడిన 15 సంవత్సరాలకే ప్రారంభమైంది. వర్గవైషమ్యాలు పీడిత వర్గాలను తిరుగుబాటుకు ప్రోత్సహించిన తీరును రోమను చరిత్రకారుడు సల్లూస్ట్ నిర్దిష్టంగా విశ్లేషించారు :

> "పాలకులు ప్రజలను బానిసలుగాచూసేవారు. రైతులను వారి స్వంత భూముల నుండి వెళ్లగొట్టేవారు. నిరసన తెలిపే వారిని హత్య చేయించేవారు. లేదా బహిరంగంగా ఉరి తీసేవారు. ఈ కిరాతక చర్యలతోపాటు రుణభారాన్ని మోయాల్సి రావడంతో సాధారణ ప్రజలు సాయుధులై మోన్స్ సాకర్, అవంటైన్‌లను స్వాధీనం చేసుకున్నారు. తమ కోసం ప్రత్యేక నిధులను, కొన్ని చట్టపరమైన హక్కులను సాధించుకున్నారు."

ఈ తిరుగుబాటు జరిగిన 400 ఏళ్ల తర్వాత సల్లూస్ట్ చరిత్ర గ్రంథాలను రచించడం మొదలుపెట్టారు. ఈ కారణంగానే కొందరు ఆధునిక చరిత్రకారులు అతడి రచనల విశ్వసనీయతను ప్రశ్నించారు. అయితే గణరాజ్యం ఏర్పడిన తర్వాత శతాబ్దంపాటు వర్గపోరాటాలు నిరంతరంగా కొనసాగాయని మాత్రం ఖచ్చితంగా చెప్పవచ్చు. ముఖ్యంగా ఉన్నత వర్గాలకు చెందిన అధికారులు తమ స్వంత ప్రయోజనాలను ఆశించి తీసుకున్న ఏకపక్ష నిర్ణయాలు కార్మికులు, రైతుల్లో విద్రోహజ్వాలలను రేపాయి. వేర్పాటు (సామూహిక ధర్నాకు పాల్పడి సైన్యంలో సేవ చేయడానికి నిరాకరించడం) ద్వారా పీడిత వర్గాలు తమ నిరసనను తెలిపేవారు. కార్మిక వర్గాలు తమ సంరక్షణ కోసం స్వంత ప్రతినిధులను ఎన్నుకునేవారు.

ఈ ప్రజా ప్రతినిధులు అధికారులు, వారి బాధితుల మధ్య బలమైన రక్షణ కవచంగా పని చేసేవారు. ప్రజల ఈ అధికారాన్ని సవాలు చేసే అధికారులు ఎంతటి ఉన్నత వర్గానికి చెందిన వారైనా వారికి బహిరంగంగా మరణదండన విధించే హక్కు సాధారణ పౌరులకు ఉండేది. కనీసం ఆ మేరకు వారు ఉమ్మడిగా ప్రకటించేవారు. రాజ్యం నియమించే అధికారిక మెజిస్ట్రేట్‌ల (జిల్లా అధికారులు) ముందు సాధారణ పౌరులు ఎదురొడ్డి నిలబడిన తీరును కంపెనీ డైరెక్టర్లకు వ్యతిరేకంగా దుకాణా యజమానులు సమీకృతమైన పరిస్థితితో స్టే క్రాయిక్స్ పోల్చారు. కాలక్రమంలో కార్మిక వర్గాలు రాజ్యాంగంలో అంతర్భాగమయ్యాయి. రాజ్య అధికారులను నిర్బంధించి శిక్షించే అధికారాలను హస్తగతం చేసుకున్నాయి. క్రీస్తుపూర్వం 287లో జరిగిన చివరి మహాపోరాటం ఉన్నత వర్గాల అధికారాలను పూర్తిగా హరించివేసింది. రాజ్య పదవులన్నింటికీ సాధారణ పౌరులు అర్హతను సాధించారు. జనాభాలో సగానికి సగం మంది ప్రజలు అప్పుల భారంతో కృంగిపోతున్న సమయంలో ఈ వర్గ పోరాటం చెలరేగింది.

తర్వాతి కాలంలో డయోనిసస్, హాలికార్నసస్ లాంటి రోమను చరిత్రకారులు కార్మిక, కర్షక వర్గాలు పాలక వర్గాలతో జరిగిన సంఘర్షణలలో చూపిన ఔదార్యాన్ని ప్రశంసించారు. గ్రీకు నగరాల్లో సంభవించిన హింసాత్మక తిరుగుబాట్లతో పోలిస్తే రోమను వర్గపోరాటాలు అనాలోచిత, అనవసర హింసకు తావివ్వలేదని వారు పేర్కొన్నారు. అయితే కొన్ని సందర్భాల్లో గ్రీకు పీడిత వర్గాలు సాధించిన విజయాల స్థాయిలో రోమను సాధారణ పౌరులు ఎలాంటి

అదనపు ప్రయోజనాలను సమకూర్చుకోలేకపోయాయి. అలాగే ఏథెన్స్ లాగా రోము ప్రజాస్వామిక నగర రాజ్యంగా రూపాంతరం చెందలేకపోయింది. బ్రంట్ విశ్లేషించినట్లు సాధారణ పౌరుల్లోని ఒక మోస్తరు సంపన్నమైన సముదాయమే వర్గ పోరాటాల ద్వారా నిర్దిష్టమైన ప్రయోజనాలను సాధించగలిగింది. రాజ్యపదవుల నిర్వహణలో వారిపై ఉన్న నిషేధాన్ని ఎత్తివేయడంతో ఒక చిన్న సముదాయమే అధికారిక పదవులను అనుభవించగలిగింది. జనబాహుళ్యానికి కల్పించిన 'ప్రజాస్వామిక నియంత్రణ' హక్కు కేవలం ఒక మిధ్య అని అనతి కాలంలోనే తేలిపోయింది.

> "సాధారణ పౌరులను పదవుల్లో నియమించారు. అయితే అధికారంపై తమ గుత్తాధిపత్యాన్ని వదులుకున్న పాలకవర్గాలు అధికారంలో సింహభాగాన్ని తమ కోసం సుస్థిరం చేసుకున్నాయి. ఈ ప్రక్రియలో ఒక కొత్త ఉన్నత వర్గం ఆవిర్భవించింది. అందులో కొందరు సాధారణ పౌరులను మాత్రమే అనుమతించారు. గత పాలక వర్గం వలే ఈ ఉన్నత వర్గం కూడా సంపూర్ణ అధికారాలను చేజిక్కించుకుంది. ఫలితంగా పాత వర్గ వైషమ్యాలు తరచూ రగలడం సాధారణమైపోయింది. అయితే ధనిక కార్మికుల రాజకీయ ఆకాంక్షలు నెరవేరడంతో కొత్త నాయకులను అన్వేషించడం పేద వర్గాలకు కష్టసాధ్యంగా మారింది."

వర్గ సంఘర్షణకు నాయకత్వం వహించే ధనికుల ప్రయోజనాలు వారి అనుచరుల ప్రయోజనాలకు పూర్తి భిన్నంగా ఉండడం చరిత్రలో ఇదే చివరిసారి కాదు. అయితే ఈ ఏర్పాటుతో పేదలు రాజీ పడటానికి ఒక ముఖ్య కారణం దండయాత్ర ద్వారా గణరాజ్యం స్వాధీనం చేసుకున్న కొత్త ప్రాంతాలే. కొందరు పేద రైతులను కొత్త ప్రాంతాలలో స్థిరపరచి వారి బాధలను తాత్కాలికంగా తీర్చారు. కాని యుద్ధాల పరంపర రైతుల పరిస్థితిని మరింత దిగజార్చింది. దండయాత్రల్లో దోచుకున్న సంపదంతా ధనిక వర్గాల చేతికే దక్కింది. "విదేశాల నుండి భారీ మొత్తంలో సంపద ఇటలీలోని ప్రైవేటు వ్యక్తుల చేతుల్లోకి ప్రవహించింది. అందులో ఎక్కువ భాగం ఉన్నత, మధ్య తరగతి వర్గాలకే దక్కింది." అలా సమకూరిన ధనాన్ని విలాస వస్తువుల వినియోగంపైనే ఎక్కువగా వెచ్చించారు. కాని, కొందరు పాలకవర్గ సభ్యులు తమ జాగీర్లను విస్తరించడానికి సంపదను వినియోగించారు. ఫలితంగా వ్యవసాయ భూముల ధర అమాంతంగా పెరిగిపోయింది. అదే అదనుగా భావించిన వడ్డీ వ్యాపారులు బకాయిలు తీర్చలేదన్న సాకు చూపి రైతులను వారి భూముల నుండి వెళ్లగొట్టారు. అదే సమయంలో అత్యధిక శాతం మంది రైతులు అప్పుల ఊబిలోకి నెట్టివేయబడ్డారు. ప్రభుత్వానికి భూమి శిస్తు, పన్నులు చెల్లించడానికి వారు భూములను సాగు చేయలేకపోయారు. జాగీర్లలో సుదీర్ఘ కాలంపాటు సాగిన సంఘర్షణలే అందుకు కారణం. వేరే ప్రత్యామ్నాయం లేక రైతులు ప్రతి సంవత్సరం వ్యాపారుల నుండి వడ్డీపై రుణాలను తీసుకున్నారు. అలా క్రమంగా అప్పులు చేయడంవల్ల రుణభారం పెరిగి ఆస్తులను కోల్పోయారు.

క్రీస్తుపూర్వం ఒకటవ శతాబ్దం తొలి దశకాల్లోని పరిస్థితిని వివరిస్తూ సల్లూస్ట్ ఈ విధంగా రాశారు :

"యుద్ధం, శాంతి సమయాలు రెండింటిలోనూ కొందరు వ్యక్తులే ప్రతిదీ నియంత్రించారు. ఖజానా, రాజ్యాలు, జిల్లాలు, గౌరవాలు, విజయాలు ... అన్నింటినీ ఖాళీ చేశారు. సైనిక బలగాలు, మనుగడ అవసరాలు ప్రజలను అణచివేశాయి. సైనికాధికారులు, మరికొందరు పాలకులకే యుద్ధ కానుకలు పరిమితమయ్యాయి. ఈలోపు సైనికుల తల్లితండ్రులు లేదా వారి చిన్న పిల్లలు దౌర్జ్యకారులైన పొరుగువారి కారణంగా స్వంత ఇళ్ల నుండి గెంటి వేయబడ్డారు."

ఈ పరిస్థితి అంతటితో ఆగలేదు. యుద్ధాల కారణంగా విశాలమైన శ్రామిక శక్తి ఆవిర్భవించింది. దానిని సంపన్న వర్గాలు దోచుకున్నాయి. శ్రామికులు బానిసలుగా మారారు. ఉదాహరణకు మూడవ మాసిడోనియా యుద్ధం తర్వాత 1,50,000 మంది యుద్ధ ఖైదీలను బానిస మార్కెట్లలో విక్రయించారు. బడా భూస్వాములు చవక ధరలకు బానిసలను కొనుగోలు చేసి వారిని తమ జాగీర్లలో వ్యవసాయ పనుల కోసం నియమించేవారు. ఆ విధంగా వ్యవసాయ పెట్టుబడిని గణనీయంగా తగ్గించుకున్నారు. ఈ పరిస్థితి ఏర్పడడంవల్ల కాటో నియంత్రణలోని బానిసలు సంవత్సరానికి ఒక కంబళిని, కొన్ని తిండి గింజలను మాత్రమే పొందేవారు. బానిసలకు మాంసాహారం ఎప్పుడూ దక్కేదికాదు. కుటుంబ పోషణ బాధ్యతలు కలిగిన రోమను రైతును పనిలోపెట్టుకోవడం ఖర్చుతో కూడుకున్న వ్యవహారంగా ఉండేది. అందుకే భూములు కోల్పోయిన వారికి ఉపాధి లభించడం చాలా కష్టంగా ఉండేది. తాత్కాలిక లేదా ఆయా మాసాల్లో లభించే పనులు మాత్రమే వారికి అందుబాటులో ఉండేవి.

బానిసల జనాభా గణనీయంగా పెరిగిపోయింది. క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దం నాటికీ వారి సంఖ్య 20 లక్షలకు చేరుకుంది. వారితో పోలిస్తే సాధారణ పౌరుల జనాభా 32.5 లక్షలే ఉండేది. ఈ పచ్చి గణాంకాలు ఆర్థిక వ్యవస్థలో బానిసత్వానికి ఉన్న ప్రాముఖ్యతను సూచిస్తాయి. ఒక వైపు బానిసల్లో ఎక్కువ శాతం మంది పయోజనులు కాగా మరో వైపు సాధారణ పౌరుల్లో బాల బాలికల సంఖ్య ఎక్కువగా ఉండేది. ఈ వైరుధ్యంవల్లే బానిస జనాభా ఆర్థిక వ్యవస్థకు కీలకంగా ఉండేది. మరో విషయం ఏమిటంటే ఏ దశలోనైనా ప్రతి ఎనిమిది మంది సాధారణ పౌరుల్లో ఒకరు సైనికబలగాల్లో ఉండేవారు.

గణరాజ్యంలో బానిసలే ప్రధాన శ్రామిక శక్తిగా ఉన్నా వారి ఉపస్థితివల్ల సాధారణ ప్రజలకు చేకూరిన ప్రయోజనం అంటూ ఏదీ లేదు. కట్టుబానిసత్వంవల్ల స్వతంత్రులైన కార్మికులు మరింత పేదరికాన్ని అనుభవించారు. ఒక వైపు రోము సామ్రాజ్యం తన బలాన్ని పెంచుకుంటూ పోతుంటే మరోవైపు సాధారణ పౌరుల జనాభా పెరుగుదల స్తంభించి పోయింది. వాస్తవంగా అయితే వారి జనాభా సంఖ్య పడిపోయింది. పేదలు వివాహాలు చేసుకోలేకపోయారు. ఒకవేళ చేసుకున్నా పిల్లలను పెంచే స్థోమతను కోల్పోయారని బ్రంట్ పేర్కొన్నారు. గర్భస్రావం లేదా భ్రూణహత్యల ద్వారా కుటుంబాన్ని నియంత్రించేవారు. అప్పట్లోగర్భనిరోధక సాధనాలు లేదా

పద్ధతులంటూ ఏవీ ఆచరణలో ఉండేవి కావు. పేద కుటుంబాలు వదలివేసిన పిల్లలు బానిస మార్కెట్లలో ప్రత్యక్షమయ్యేవారు. బానిసలను ఎక్కువ సంఖ్యలో దిగుమతి చేసుకోవడంవల్లే చాలా మంది ఇటాలియన్లు దుర్భర జీవితాన్ని గడపాల్సి వచ్చింది. ఎహెచ్ఎం జోన్స్ కూడా ఇలాంటి నిర్ధారణకే వచ్చారు : "బానిసల భారీ దిగుమతి ఇటలీ రైతాంగ దారిద్ర్యాన్ని మరింత పెంచింది. ఇలాంటి సామాజిక అసమానతలు అంతర్యుద్ధాలకు ఆజ్యం పోశాయి. గతంలో పాలకవర్గాలు కార్మిక వర్గాల మధ్య జరిగిన సంఘర్షణల కంటే ఈ అంతర్యుద్ధాలు చాలా హింసాత్మకంగా సంభవించాయి."

క్రీస్తు పూర్వం 133లో తైబేరియస్ గ్రాషూస్ సాధారణ పౌరుల ప్రతినిధిగా ఎన్నికయ్యాడు. పాలకవర్గానికి చెందిన వాడే అయినప్పటికీ రైతాంగంలో పెరిగిపోతున్న దారిద్ర్యం అతడిని ఆందోళనకు గురి చేసింది. అలాగే గణరాజ్య సైనిక భద్రత కూడా పాక్షికంగా అతడిపై ప్రభావం చూపింది. బానిసలు పెద్ద సంఖ్యలో చొచ్చుకురావడంతో సైన్యానికి వెన్నెముక అయిన రైతాంగ కుటుంబాలు నెమ్మదిగా ఎలా నాశనమవుతున్నాయో గ్రాషూస్ గ్రహించాడు. సిసిలీలో బానిస తిరుగుబాటు అలాంటి వ్యవసాయ నిర్వహణ వల్ల పొంచుకొచ్చే ముప్పును బహిర్గతం చేసింది. దేశం కోసం పోరాడిన పేదల బతుకులు ఛిద్రం కావడంపై అతడు ఎంతో ఉద్వేగభరితంగా మాట్లాడినా, వారి విషయంలో నిజాయితీతో వ్యవహరించినా అతడి ఆలోచన అంతా రాజ్య ప్రయోజనాలను పరిరక్షించడంపైనే ఉండేది. అందు కోసం అతడు తన స్వంత వర్గ ప్రయోజనాలను కూడా లెక్కచేయలేదు.

ఏదైనప్పటికీ గ్రాషూస్ కార్యాచరణ పేద రైతులను ఉత్తేజపరిచింది. అదే సమయంలో సంపన్నులైన సెనేట్ సభ్యుల్లో ఎక్కువ శాతం మందిని కోపోద్రిక్తులను చేసింది. బడా భూస్వాముల ఆధీనంలో ఉన్న ప్రభుత్వ భూమిని పేద రైతులకు పంపిణీ చేయడం అతడి ప్రణాళికలోని ప్రధాన అంశం. గ్రాషూస్ ప్రతిపాదనలకు మద్దతు పలికేందుకు గ్రామీణ ప్రాంత పేదలు రోము నగరానికి చేరుకున్నారు. నగర గోడలపై నినాదాలతో కూడిన పోస్టర్లు అంటించారు. గ్రాషూస్ ప్రతిపాదనలను శాసనమండలి ఆమోదించాలని పట్టుబట్టారు. ఈ ప్రదర్శనతో సెనేటర్లు బెంబేలెత్తిపోయారు. కోత పనుల కోసం రైతులు నగరాన్ని విడిచివెళ్లే వరకు వారు వేచి చూశారు. ఆ తర్వాత రంగంలోకి దిగారు. రాజ్యాంగాన్ని భ్రష్టు పట్టిస్తున్నాడన్న ఆరోపణపై కొందరు సెనేటర్లు గ్రాషూస్‌కు మరణదండన విధించారు. అతడి అనుచరులను ఊచకోత కోయించారు.

అయితే ఈ అణచివేత చర్యలు రైతుల ఆగ్రహాన్ని చల్లార్చలేకపోయాయి. పదేళ్ల తర్వాత చరిత్ర పునరావృతమైంది. గ్రాషూస్ సోదరుడు గాయూస్ జాగీర్దారునిగా ఎన్నికయ్యాడు. మూడేళ్లపాటు రోమను రాజకీయాల్లో క్రియాశీలపాత్రను పోషించాడు. రైతుల మద్దతుతో, కొందరు నయా ధనిక వర్గాల అండతో గాయూస్ రాజకీయాలను శాసించడం మొదలుపెట్టాడు. దీనిని జీర్ణించుకోలేని ప్రధాన మంత్రి ఆప్టిమస్ సెనేట్ మద్దతుదారులకు ఆయుధాలను సరఫరా చేశాడు. క్రేట్ నుండి మూడు వేల మంది సాయుధ కిరాయి మూకలను రప్పించి గాయూస్‌ను హత్య చేయించాడు. అలాగే గాయూస్ మద్దతుదారులో మూడు వేల మందిని కిరాతకంగా చంపించాడు. రోమను సెనేట్ 'నాగరిక' సాంప్రదాయాలు అంత ఘనంగా ఉండేవి.

రోమను పేదలు గ్రాషుస్ సోదరులను అమరవీరులుగా కొలిచేవారు. వారి సమాధుల వద్ద ప్రతి రోజూ పుష్పాంజలి ఘటించేవారు. గ్రాషుస్, గాయూస్ ఇద్దరూ ప్రజల బాధలపట్ల నిజాయితీతో స్పందించేవారని బోధపడుతోంది. కాని వారి ప్రణాళిక ముఖ్య ఉద్దేశం రోము రాజ్యాన్ని బలోపేతం చేయడమే. సామ్రాజ్యంలోని మిగతా ప్రాంతాన్ని రాజ్య అవసరాలకు సద్వినియోగం చేసుకునే సామర్థ్యాన్ని పెంచడమే. బడా భూస్వాములకు పెద్ద మొత్తంలో ఆదాయాన్ని సమకూరుస్తున్న బానిసత్వం మరోవైపు ఆర్థిక వ్యవస్థ పునాదులను బలహీనపరుస్తోందని విషయాన్ని వారు పాక్షికంగానైనా గ్రహించగలిగారు. అయితే వారి పరిష్కార మార్గం వేరుగా ఉండేది. బానిసలు తమను తాము విముక్తి చేసుకోవాలని వారు ఖచ్చితంగా పిలుపునివ్వలేదు. అలాగే పేద రైతుల పాత్రను కేవలం ఒత్తిడి వర్గంగానే కుదించివేశారు. అది కూడా రాజ్యాంగ వ్యవస్థ ప్రస్తుత స్వరూపంలోనే అన్ని మార్పులు జరగాలని ప్రతిపాదించారు. గ్రాషుస్ సోదరుల ప్రణాళికలో రోము నగర పేదల గురించి ఎలాంటి ప్రస్తావన లేదు. ఫలితంగా, సెనేట్ కేవలం సరైన సమయం కోసమే ఎదురు చూసి ఆ తర్వాత ఇద్దరు సోదరులను కిరాతకంగా హత్య చేయించే అవకాశం లభించింది.

గాయూస్ గ్రాషుస్ హత్య పేదలను కలచివేసింది. అయితే వారిలో బయల్దేరిన వర్గ వైషమ్యాలు మాత్రం అలాగే కొనసాగాయి. ఈ వర్గ వైషమ్యాలే క్రీ.పూ. ఒకటవ శతాబ్దపు చరిత్రలో కీలకపాత్రను పోషించాయి. చివరకు అవి రోమను గణరాజ్యాన్ని రోము సామ్రాజ్యంగా మార్చివేశాయి. రాజకీయ అధికారం కోసం ఈ కాలంలో పాలక వర్గాల మధ్యనే అంతర్గత కలహాలు చోటు చేసుకున్నాయి. రక్తపాతం సాధారణమైపోయింది. ఆక్రమణకు గురైన ప్రాంతాల సంపదను నియంత్రణలోకి తీసుకోవడానికి పాలక, ఉన్నత వర్గాలు తీవ్రంగా పోటీ పడ్డాయి. ఒకవైపు పేదల వ్యతిరేకత, మరోవైపు సెనేటర్ల వర్గ దోపిడీ అణచివేత కారణంగా పాలకవర్గాలకు ఆయుధాలు సమకూరాయి. పోటీ వర్గాలు ఒకరికి వ్యతిరేకంగా ఒకరు ఆయుధాలను చేపట్టి రక్తపాతం సృష్టించాయి. ఆ కాలంలో జీవించి సల్లూస్త్ అప్పటి పరిస్థితిని వివరిస్తూ ఇలా రాశారు : "తరచూ ఘర్షణలు చోటు చేసుకున్న సమయమది. పాలకవర్గాల మధ్య అంతః కలహాలు చివరికి అంతర్యుద్ధానికి దారి తీశాయి. ఈ కాలంలో కొందరు వ్యక్తులు ప్రజలు లేదా సెనేట్ పరిరక్షకులమనే ముసుగు ధరించి అధికారం చెలాయించడానికి ప్రయత్నించారు."

క్రీ.పూ. 108లో మారియస్ ప్రధానమంత్రి అయ్యాడు. నవీన ధనికుల (నయా సంపన్న వర్గాలు) మద్దతుతో అతడు రాజకీయ అధికారాన్ని చేపట్టాడు. సల్లూస్త్ ప్రకారం మారియస్ చేతివృత్తిదారులు, సాధారణ పౌరుల ప్రియతమ నాయకునిగా ఉండేవాడు. ఈ వర్గాలు సంపద కోసం తమ చేతిపనితనంపైనే ఆధారపడేవి. భూపంపిణీ చట్టాన్ని ఆమోదించడానికి జరిగిన ప్రయత్నం తీవ్రమైన సంఘర్షణకు దారి తీసింది. "హింస తారాస్థాయికి చేరుకుంది. సమాజంలోని గౌరవప్రదమైన వ్యక్తులందరూ తమ మద్దతుదారులతో కలిసి ఆయుధాలు చేపట్టారు. వీధి పోరాటాలకు దిగారు." మారియస్‌తో విభేదించిన సాటర్నినస్‌ను ఈ వ్యక్తులు బహిరంగంగా హత్య చేశారు. రెండు దశాబ్దాల తర్వాత మారియస్ మరో మిత్రుడైన సల్పికస్ వంతు వచ్చింది. అతడు రోము నగరాన్ని స్వల్పకాలంపాటు నియంత్రించాడు. ఉన్నత సెనేట్ కుటుంబాల

పక్షాన సల్లా నాయకత్వంలోని సైన్యం రోమును స్వాధీనం చేసుకుని సల్పికస్‌ను చంపివేసింది. సైన్యం తన స్థావరాలకు ఉపసంహరించుకోగానే మారియస్ మరో మిత్రుడైన సిన్నా రోము నగరాన్ని తిరిగి స్వాధీనం చేసుకొని ఇటలీని రెండేళ్లపాటు నియంత్రించాడు. సెనేట్‌ను తన నిర్ణయాలకు అనుగుణంగా నడిచేలా చేయడానికి సిన్నా అన్ని ప్రయత్నాలు చేశాడు. ఒక సందర్భంలో "(సెనేట్) ఆ వేదిక రక్తంతో నడుస్తోంది" అని సిన్నా వ్యాఖ్యానించాడు. అయితే అతడు ఎన్ని హామీలు ఇచ్చినా సార్వజనిక హక్కుల గురించి ఏ మాత్రం శ్రద్ధ తీసుకోలేదు. ఈలోపు భూస్వామ్య ఉన్నత వర్గాల మద్దతుతో సల్లా తిరిగి అధికారాన్ని చేజిక్కించుకున్నాడు. సిన్నాను అతడి స్వంత సైనికులే హత్య చేశారు. ప్రతిఘటించిన వారందరిపై తీవ్రమైన అణచివేత కొనసాగింది. ధనిక వర్గాల్లోని అసమ్మతివాదులు కూడా అనేక కష్టాలను ఎదుర్కొన్నారు. సల్లా అలాంటి అసమ్మతివాదుల తలకు వెలకట్టాడు. వీరిలో 40 మంది సెనేటర్లు, 1,600 మంది నయా సంపన్నులు ఉన్నారు. చివరకు క్రీ.పూ.64లో సల్లా పూర్వపు అనుచరుడైన కాటాలీన్ దివాళా తీసే దశలో తన అదృష్టాన్ని పునరుద్ధరించుకునేందుకు ప్రయత్నించాడు. ప్రజల తిరుగుబాటు స్థాయిని పెంచేందుకు కృషి చేశాడు. సల్లా మద్దతుదారులు, రైతులతో కలిసి అతడు జనంలో తిరిగేవాడు. ఈసారి ప్రధానమంత్రి (రచయిత) సిసేరో నిర్ణయాత్మకమైన, హింసాత్మకమైన చర్య తీసుకున్నాడు. వ్యవస్థను పరిరక్షించడానికి ధనిక వర్గాలకు చెందిన యువతను సమీకరించాడు. కాటాలీన్ ప్రధాన మద్దతుదారులను హత్య చేయించాడు.

కాటాలీన్ తిరుగుబాటు పేద రైతులకు సాయుధ పోరాటం చేపట్టమని చిట్టచివరిసారిగా పిలుపునిచ్చింది. కాని ధనికులకు వ్యతిరేకంగా ప్రజల ఆక్రోషం కొనసాగింది. నిజానికి ఆ వ్యతిరేకత నగర పేదలలో కూడా జీర్ణించుకుపోయింది. వారి జీవన స్థితిగతులు, జీవన ప్రమాణాలు చాలా దారుణంగా, అభద్రంగా ఉండేది. ఆధునిక పశ్చిమ నగరం కంటే ఏడు నుండి ఎనిమిది రెట్ల వైశాల్యం గల ప్రాంతంలో తీవ్రమైన జనసాంద్రత మధ్య ఇరుకైన నివాసాల్లో నగరపేదలు జీవించేవారు. ఒక్కో నివాస భవనం 60 నుండి 70 అడుగుల ఎత్తు ఉండేది. ఆ భవనాలు కూలిపోయే ప్రమాదం ఉండేది. అగ్ని ప్రమాదాలు కూడా తరచూ సంభవించేవి. ఈ నివాస ప్రాంతాలలో తాగునీటి సౌకర్యం కాని మురికి కాలువల వసతి కాని ఉండేది కాదు. నిర్ణీత కాలంలో లభించే తాత్కాలిక పనుల కోసం అనేక మంది అన్వేషించేవారు. వేసవి కాలంలో ఎక్కువ మంది కార్మికులు ఓడరేవుల్లో పని చేసేవారు. కాని శీతాకాలంలో దాదాపు పస్తులతో ఉండేవారు. దుర్భరమైన దారిద్ర్యం కారణంగానే గతంలో కార్మికులు రైతాంగ తిరుగుబాట్లలో పాలుపంచుకోలేకపోయారు. ధనిక సెనేటర్లు అందజేసే సొమ్ముపై ఎక్కువగా ఆధారపడేవారు. వారి పక్షాన హింసాత్మక ఘర్షణల్లో సెనేట్‌కు మద్దతుగా రక్తపాతం సృష్టించేవారు. అయితే ఇపుడు సబ్సిడీపై తిండిగింజలు ఇస్తామని హామీ ఇచ్చే సైనికాధికారిని కాని రాజకీయ నాయకుని కాని సమర్థించడం మొదలుపెట్టారు. కాటాలీన్ ఓటమి తర్వాత దశాబ్దంపాటు హింస నిత్యకృత్యంగా మారింది. సెనేట్ భవనాన్ని ప్రజలు తగులబెట్టారు. పేదలకు ఉచితంగా తిండి గింజలు పంపిణీ చేసిన క్లాడియస్ అనే రాజకీయ నాయకుడు క్రీ.పూ.52లో ఉన్నత వర్గాల చేతిలో హత్యకు గురైన తర్వాత ప్రజలు రెచ్చిపోయి వీధుల్లోకి వచ్చారు. ధనికులను బహిరంగంగా హత్య చేశారు.

ఈ అంతర్యుద్ధం నేపథ్యంలోనే జూలియస్ సీజర్ తన సైన్యాన్ని ఇటలీ సరిహద్దులు దాటించి క్రీ.పూ.49లో అధికారం చేపట్టాడు. సెనేట్ వర్గాలు సామ్రాజ్యాన్ని పాలించే సామర్థ్యాన్ని కోల్పోయాయి. అధికారాన్ని వారు పేదలకు కాకుండా ఒక సైనికాధికారికి సమర్పించుకున్నారు. ఉన్నత వర్గానికే చెందిన ఆ సైనికాధికారి ఫ్రాన్స్‌పై జరిపిన దండయాత్రలో సుమారు పది లక్షల మందిని ఊచకోత కోశాడు లేదా బానిసలుగా మార్చివేశాడు.

రోము పౌరుల మధ్య సాగిన మహా సామాజిక సంఘర్షణల కాలంలో ప్రాచీన ప్రపంచంలోనే అతిపెద్ద బానిసల తిరుగుబాటు సంభవించింది. ఆ తిరుగుబాటుకు స్పార్టకస్ నాయకత్వం వహించాడు.

గ్రీసు కంటే రోమను సామ్రాజ్యమే అనేక బానిస తిరుగుబాట్లను చవి చూసింది. బానిసలు ఇటలీలో పెద్ద సంఖ్యలో ఉండడమే అందుకు కారణం కావచ్చు. ఉదాహరణకు క్రీ.పూ.138–132 మధ్య సిసిలీలో బానిస తిరుగుబాటు కొనసాగింది. లక్షల సంఖ్యలో బానిసలు అందులో పాల్గొన్నారు. వీరిలో కొందరు పశువుల కాపర్లు అయితే మరికొందరు వ్యవసాయ కార్మికులుగా ఉండేవారు. అయితే ధనిక వర్గాలకు గుణపాఠం నేర్పాలన్న యోచనతో సాధారణ ప్రజలు కూడా బానిసలకు మద్దతు పలికారు. యదార్థమేమిటంటే భవిష్యత్తులో తాము స్వంతంగా సాగు చేసుకోదలచిన పొలాలపై బానిసలు గస్తీగా ఉంటే సాధారణ ప్రజలు మాత్రం బహిరంగ దోపిడులకు పాల్పడ్డారు. ఇదే పరిస్థితి క్రీ.పూ.104–101 మధ్య పునరావృతమైంది.

ఈ పరిణామాలన్నింటి కంటే స్పార్టకస్ తిరుగుబాటు తీవ్రస్థాయిలో ఉండేది. రోము సామ్రాజ్య ప్రధాన కేంద్రానికే అది ముప్పుగా పరిణమించింది. క్రీ.పూ.73లో సుమారు 74 మంది పోరాట వీరులు తప్పించుకోవడంతో ఈ తిరుగుబాటు ప్రారంభమైంది. ఈ పోరాట వీరులతో సుమారు 70,000 మంది బానిసలు జతకలిశారు. రోమను సైన్యాలను వరుసగా ఓడిస్తూ ఇటలీ ద్వీపకల్పంలోని ఒక భాగం నుండి మరో భాగానికి దూసుకుంటూ వెళ్లారు. ఒక దశలో వారు రోమను సామ్రాజ్యాన్నే తుదముట్టించే స్థాయికి చేరుకున్నారు. మంత్రుల ఆధ్వర్యంలోని సైన్యాలను ఓడించిన తర్వాత సామ్రాజ్య ప్రాబల్యానికి గండి కొట్టే అవకాశం ఉండేది. కాని రోము నగరాన్ని స్వాధీనం చేసుకునే బదులు స్పార్టకస్ తన సైన్యాన్ని ఇటలీ దక్షిణ ప్రాంత అంచుకు తీసుకెళ్లాడు. సిసిలీని చేరుకోవాలని అతడు సంకల్పించాడు. అయితే అతడి సైన్యాలను సముద్ర దొంగలు వంచించారు. సిసిలీని చేరుకోవడానికి ఓడలను సమకూరుస్తామని హామీ ఇచ్చిన సముద్ర దొంగలు బానిస సైన్యాలను రోమను సైన్యం చక్రవ్యూహంలో బంధించారు బానిసలు మరలా ఉత్తర దిశగా పయనించకుండా రోమను సైన్యం పటిష్టమైన వ్యూహం పన్నింది. బానిస సైన్యంలోని ఒక భాగం ఆ చక్రవ్యూహం నుండి బయటపడగలిగినా ఘోరమైన ఓటమిని చవి చూడాల్సి వచ్చింది. స్పార్టకస్ హత్యకు గురయ్యాడు. కాని అతడి మృతదేశం ఎక్కడా కనిపించలేదు. అలాగే స్పార్టకస్ అనుచరులైన 6,000 మంది బానిసలను బలిపీఠంపై ఎక్కించారు. తిరుగుబాటును అణచివేసే క్రమంలో సుమారు 1,00,000 బానిసలు హత్యకు గురై ఉంటారని కొందు రోమను చరిత్రకారుల వాదన.

ప్రాచీన రోములో సంభవించిన తిరుగుబాట్లు సుమారు రెండు వేల సంవత్సరాల వరకు పీడిత వర్గాలకు స్ఫూర్తినిచ్చాయి. 1789–94 మధ్య సంభవించిన ఫ్రెంచి విప్లవంలో

కరుడుగట్టిన వామపక్షవాదులు గ్రాఘస్ సోదరులను స్ఫూర్తిదాతలుగా కొనియాడారు. స్పార్టకస్ తన అభిమాన చారిత్రక పురుషుడని కారల్ మార్క్స్ పేర్కొన్నారు. రోజా లగ్జెంబర్గ్ నాయకత్వంలోని జర్మన్ తిరుగుబాటుదారులు 1919లో తమను తాము స్పార్టకస్‌దండుగా ప్రకటించుకున్నారు.

అయితే రైతాంగ తిరుగుబాట్లుకాని, బానిస తిరుగుబాట్లు కాని రోమను సామ్రాజ్యంపై బడా భూస్వాములకు ఉన్న పట్టును సడలించలేకపోయాయి. అందుకు గల కారణం తిరుగుబాటు వర్గాల స్వరూపంలోనే కనిపిస్తుంది.

ధనికుల దోపిడీకి వ్యతిరేకంగా రైతులు నిరసన తెలపగలిగారు. అవసరమయితే సాయుధ ప్రతిఘటనకు కూడా దిగారు. రాజ్యాన్ని సంస్కరించగల కార్యక్రమం ఉన్న ధనిక నాయకుల పక్షాన చేరారు. అయితే తమ స్వంత రాజకీయ కార్యాచరణ అంటూ ఏదీ రూపొందించలేకపోయారు. భూపంపిణీ, రుణాల రద్దు లాంటి మౌలిక అంశాలకు మించిన అలాంటి కార్యాచరణ సమాజాన్ని స్థూలంగా పునర్వ్యవస్థీకరించి ఉండేది. రోము లాంటి విశాల నాగరికతను నియంత్రించడానికి రైతులు, కార్మికులు ఉత్పత్తి చేసే అదనపు నిల్వలు ఏ మాత్రం సరిపోవు కనుకే వారు ఒక స్వతంత్ర రాజకీయ ప్రణాళికను రూపొందించడానికి సాహసించలేదు. అలాంటి అదనపు నిల్వలు బానిస వ్యవస్థ నుండైనా రావాలి లేదా సామ్రాజ్యాన్ని కొల్లగొట్టడం ద్వారానైనా సమకూర్చుకోవాలి. వ్యవసాయ – ఆధారిత జీవనానికి తిరిగి వెళ్లాలన్న ఆకాంక్ష బలంగా ఉండేది కాని అప్పటి పరిస్థితుల్లో అది సాధ్యం కాలేదు.

సమాజాన్ని విప్లవాత్మకమైన రీతిలో పునర్వ్యవస్థీకరించే స్థితిలో పట్టణ ప్రజలు కూడా ఉండేవారు కాదు. ఉత్పత్తిలో సన్నకారు రైతుల కంటే వారి పాత్ర చాలా తక్కువగా ఉండేది. సమాజానికి అట్టడుగున ఉన్న వారు సాధారణ కూలీ పనిపై ఆధారపడి మనుగడ సాగించేవారు. మిగతా వారు చేతివృత్తులను నిర్వహించేవారు. ధనిక వర్గాలకు విలాస వస్తువులను సరఫరా చేయడంపై జీవనోపాధి ఆధారపడి ఉండేది. రోము నగరంలోనే చాలా మంది బానిసలు ఉండేవారు. అయితే వ్యవసాయ కార్మికుల కంటే వారి పరిస్థితి కొంత మెరుగ్గా ఉండేది. యజమానులకు విధేయులుగా ఉంటే స్వేచ్ఛా జీవితాన్ని గడిపే అవకాశం చాలా మంది బానిసలకు ఉండేది.

స్థూలంగా చెప్పాలంటే ఉత్పత్తికి గ్రామీణ బానిసలు కీలకమైనప్పటికీ వీరోచిత తిరుగుబాటును అధిగమించి సమాజాన్ని పునర్వ్యవస్థీకరించే సిద్ధాంతాలను రూపొందించడం అసాధ్యమని వారు గ్రహించారు. మధ్యధరా ప్రాంతంలోని వివిధ రాజ్యాల నుండి వచ్చిన బానిసలు వేర్వేరు భాషలు మాట్లాడేవారు. కుటుంబాన్ని కలిగి ఉండడానికి వారికి అనుమతి లేకపోవడంతో ప్రతిఘటన సాంప్రదాయాలను ఒక తరం నుండి మరో తరానికి అందించలేక పోయారు. ఉత్పత్తిలో వారిని ఏకం చేసిన విధానం – బానిస సంకెళ్లతో యజమాని కొరడా కింద – సమాజాన్ని ఏ ఆధారంపై పునర్వ్యవస్థీకరించాలన్న ఆలోచనా రూపాన్ని అందించలేక పోయింది. అందుకు భిన్నంగా ప్రత్యేక రాజ్యాలను ఏర్పాటు చేసుకోవాలని లేదా స్పార్టకస్ లాగా రోమను సామ్రాజ్యం నుంచి తప్పించుకొని స్వేచ్ఛా ప్రపంచాన్ని మరో ప్రాంతంలో అనుభవించాలని కలలు కన్నారు. రోమును స్వాధీనం చేసుకునే సువర్ణావకాశాన్ని స్పార్టకస్ ఎందుకు చేజార్చుకున్నాడు అన్నది చరిత్రలో పెద్ద రహస్యంగా మిగిలిపోయింది. ఒక కథనం

ప్రకారం స్పార్టకస్ రోమను సమాజాన్ని ఎలా పునర్వ్యవస్థీకరించాలో తేల్చుకోలేకపోయాడు. కేవలం పాత వ్యవస్థను శాసించే పాలకునిగా మిగిలిపోవడం అతడికి అంతగా నచ్చి ఉండక పోవచ్చు.

## సామ్రాజ్యం : స్తబ్ధత, పతనం

ఘర్షణలు, తిరుగుబాట్లు, సాయుధ పోరాటాలు, అంతర్యుద్ధాలు సమాజం విప్లవాత్మకమైన రీతిలో పునర్వ్యవస్థీకరణ కావడానికి బాటలు వేయలేదు. అయితే రాజకీయ వ్యవస్థ (స్వరూపాల్లో)లో సమగ్రమైన మార్పులు చోటు చేసుకున్నాయి. ధనిక భూస్వాములు మిగతా సమాజంపై ఆధిపత్యం వహించే పరిస్థితులు నెలకొన్నాయి. పేదలను వారి స్థానంలో ఉంచడానికి సెనేట్ సైనికాధికారులను, వారి సైన్యాలను వినియోగించుకుంది. అయితే శక్తిమంతుడైన సైనికాధికారి సెనేట్‌పై ఆధిపత్యం వహించగలిగాడు. సామాజిక అంశాలపై మొదలైన అంతర్యుద్ధాలు సైనికాధికారులు మధ్య అంతః కలహాలుగానే ముగిశాయి. మారియస్, సిన్నాలు సల్లాకు వ్యతిరేకంగా, పాంప్లే సీజర్‌కు వ్యతిరేకంగా, సీజర్ మరణం తర్వాత బ్రూటస్, కాషియస్‌లు మార్క్ ఆంటోని-ఆక్టావియాన్‌లకు వ్యతిరేకంగా, చివరగా ఆక్టావియాన్ మార్క్ ఆంటోనికి వ్యతిరేకంగా పోరాడారు.

అంతర్యుద్ధాలతో అలసిపోయిన ఉన్నత వర్గాలు (ధనికులు) ఆక్టావియాన్ ద్వారా (ఇప్పుడు అతడు అగస్టస్ అనే పేరుతో పిలవబడ్డాడు) పాలక వంశాన్ని స్థాపించడమే రాజకీయ సుస్థిరత పునఃప్రతిష్టకు ఏకైక మార్గమని భావించాయి. దశాబ్దాలపాటు సాగిన సామాజిక సంఘర్షణ గుణపాఠాలను తన స్వంత ప్రయోజనాల కోసం అగస్టస్ వినియోగించుకోగలిగాడు. ఒక వైపు రోము నగర పేదల శ్రేయోభిలాషిగా నటిస్తూనే మరోవైపు ధనికులకు రక్షణ కల్పించాడు. స్వాధీన ప్రాంతాల నుండి సమకూరే భారీ నిధులలో కొంత భాగాన్ని పేదలకు ఉచితంగా తిరుగుబాటుకు ఆస్కారమివ్వరాదని భావించిన చక్రవర్తులు సెనేటర్ల వ్యక్తిగత లాభార్జనపై కఠినమైన ఆంక్షలు విధించారు. స్వతంత్రంగా వ్యవహరిస్తూ వచ్చిన పాత భూస్వామ్య కుటుంబాలను కూడా భయోత్పాతానికి గురి చేశారు. అదేసమయంలో తమ అనుంగు అనుచరులకు హోదా, అపారమైన ధనాన్ని కట్టబెట్టే వారు.

ఈ అణచివేతను సాంప్రదాయ విలువలపై అనాగరికమైన దాడిగా పాత పాలకవర్గా కుటుంబాలు అభివర్ణించాయి. నిరంతర అణచివేత, అనాలోచిత హింసకు ప్రతినిధులుగా నీరో, కాలిగ్యులా అప్పటి నుండి మిగిలిపోయారు. సీజర్, అగస్టస్ లాంటి చక్రవర్తులకు వ్యతిరేకంగా గళం విప్పిన సెనేటర్లను మానవాళి స్వేచ్ఛ పరిరక్షకులుగా పరిగణించే సాంప్రదాయం సుదీర్ఘ కాలం కొనసాగింది. ఫ్రెంచి విప్లవానికి చెందిన తొలితరం నాయకులు బ్రూటస్ వారసులమని చెప్పుకునేందుకు ప్రాచీన రోమను తరహా దుస్తులను ధరించేవారు. స్వాధీన ప్రాంతాల ప్రజానీకాన్ని, బానిసలను, రోమను సామ్రాజ్యంలోని అట్టడుగు వర్గాలను చిత్రహింసలకు గురి చేసే సాంప్రదాయాన్ని రోమను చక్రవర్తులు తమ వ్యతిరేకులైన ఉన్నత వర్గాలను అణచివేయడానికి వాడుకున్నారే తప్ప అంతకు మించి ఏమీ చేయలేకపోయారు.

సైమ్ పేర్కొన్నట్లు ఉన్నత వర్గాల స్వేచ్ఛావాదం కొందరు వ్యక్తుల ద్వారా అమల్లో ఉన్న వ్యవస్థను పరిరక్షించడానికి... సంపద, అధికారాన్ని అనుభవించడానికే పరిమితమైంది.

స్వేచ్ఛ కోసం పోరాడుతున్న యోధులుగా సెనేటర్లను పేదలు ఎన్నడూ పరిగణించలేదు. క్రీస్తు శకం ఒకటవ శతాబ్దంలో రచనలు చేసిన జోసెఫస్ ప్రకారం ధనికులు చక్రవర్తులను నియంతలని దూషిస్తే పేదలు మాత్రం ధనికులను సెనేట్ అత్యాచారాలను మన్నిస్తున్న వారిగా పరిగణించారు. బహుశా పేద వర్గాలు సీజర్ అందజేసిన ఉచిత తిండిగింజలు, రాజకీయ ప్రసంగాలవల్ల తప్పుదోవ పట్టి ఉండవచ్చు. అయితే సెనేటర్లను వ్యతిరేకించడానికి వారికి నిర్దిష్టమైన కారణాలు ఉండేవి. ఎందుకంటే కనీస హక్కుల కోసం ఉద్యమించే సాహసం చేసినందుకు సెనేటర్ల వర్గం ఎందరినో ఊచకోత కోయించింది. సెనేటర్ల వర్గ నాగరిక విలువలకు ప్రతినిధిగా పరిగణించబడే సిసేరో అలాంటి నరమేధాలు ఎన్నింటినో చేయించాడు. రోము పేదలను "మురికి, చెత్త పదార్థాలు"గా, "ఆకలితో అలమటిస్తున్న కటిక దరిద్రులు"గా, "నగర చీడపురుగులు"గా, పేదలు తిరుగుబాటు లక్షణాలను ప్రదర్శిస్తే వారిని "పాపులు"గా దూషించేవాడు.

'స్వేచ్ఛ'ను రాజకీయ అంశంగా మార్చిన ధనిక వర్గాలు సామ్రాజ్యాన్ని స్థిరంగా ఉంచేందుకు, పీడిత వర్గాలను నియంత్రణలో పెట్టేందుకు చక్రవర్తిపైనే ఆధారపడ్డారు. అగస్టస్ తర్వాత వ్యక్తిగతంగా చక్రవర్తిని పదవీచ్యుతడిని చేసేందుకు ధనిక వర్గాలు కొన్నిసార్లు కుట్రపన్నాయి. కాని వారి ప్రత్యామ్నాయం కొత్త గణరాజ్యాన్ని ఏర్పాటు చేయడానికి సంబంధించింది కాదు. చక్రవర్తి మార్పుతోనే వారు తృప్తిపడిపోయేవారు. చక్రవర్తులు పాలించిన తొలి రెండు శతాబ్దాల్లో ధనిక వర్గాలు మరింత సంపన్నమయ్యాయి. గతంలో ఎన్నడూలేని విధంగా వారు సంపదను కూడబెట్టారు. ఈ కాలంలో పట్టు, సుగంధ ద్రవ్యాలు, మసాలా దినుసులు, విలువైన వజ్రాలు లాంటి విలాసవస్తువులు రోము సామ్రాజ్యంలో వెల్లువలా వచ్చి పడ్డాయి. ఇటలీ అంతటా పెద్ద జాగీర్లు విస్తరించాయి. కొన్ని సందర్భాల్లో ఈ జాగీర్లు రాజ్య స్వరూపాన్ని కూడా సంతరించుకున్నాయి. సెనేట్ వర్గానికి భూమి కౌలు పెద్ద మొత్తంలో లభించేది.

రోము నగర ధనికులకే సంపద పరిమితం కాలేదు. ప్రాంతీయ కేంద్రాలలోని ధనికులకు కూడా అందులో పెద్ద వాటా ఉండేది. కాలక్రమంలో ఈ వర్గాలన్నీ కలిసి సమైక్య సామ్రాజ్యవాద పాలక వర్గంగా ఆవిర్భవించాయి. గణరాజ్య ప్రత్యక్ష పాలనలో ఉన్న సముదాయాల కంటే ప్రాంతీయ సముదాయాలు చాలా సంపన్నంగా ఉండేవి. విస్తరిస్తున్న సామ్రాజ్య సంపదల్లో రైతాంగానికి కూడా వాటా ఉండేదన్న విషయం అనుమానాస్పదమే. ఎందుకంటే రైతులు కూడా ధనిక భూస్వాములతో సమానంగా పన్ను రుసుమును చెల్లించేవారు. కొత్తగా వచ్చిపడిన భద్రత, ప్రాంతీయ భూస్వాముల పెరుగుతున్న సంపద కారణంగా సామ్రాజ్య వ్యాప్త సంస్కృతి అభివృద్ధి చెందింది. సమానమైన మతభావాలు (చక్రవర్తిని కొలిచే సంస్కృతితోపాటు) క్రీడలు, భాషలు (పశ్చిమంలో లాటిన్, ఈశాన్యంలో గ్రీకు), సాహిత్యం ఆధారంగా ఈ సార్వజనీక సంస్కృతి వికసించింది. ఈ కాలంలో నగరాలను భారీ స్థాయిలో పునఃనిర్మించారు. దేవతలను పూజించడానికి భారీ ఆలయాలు, విశాలమైన వేదికలు,

క్రీడామైదానాలు, కళామందిరాలు, శరీర దారుఢ్య నిర్మాణ కేంద్రాలు, స్నానఘట్టాలు, మార్కెట్లు, నీటి కాలువలు, నీటి అలంకారాలు, న్యాయస్థానాలు, శాసనమండలి భవనాలు, పాలనా కార్యాలయాలు తదితర నిర్మాణాలతో ఇటలీలోని నగరాలన్నీ వైభవంగా మెరిసిపోయేవి. నగరాలు తమ కట్టడాల గురించి ఎంతో గర్వించేవి. నిర్మాణ కళలో ఒకదానితో ఒకటి పోటీ పడేవి. సుందరంగా అలంకరించిన వీధులు, విజయస్థూపాలు, ఎత్తయిన ఆర్చీలతో మనోహరంగా దర్శనమిచ్చేవి. శతాబ్దాల అనంతరం ప్రజలు ఈ వైభవాన్ని సామ్రాజ్య స్వర్ణయుగంగా పరిగణించడం మొదలుపెట్టారు. గిబ్బన్ ఇంకా రాశారు :

> "మానవాళి చరిత్రలో అత్యంత సుఖదాయకమైన, సంపన్నమైన యుగాన్ని నిర్ధారించమని ఒక వ్యక్తిని సూచిస్తే అతడు ఎలాంటి సంకోచం లేకుండా "డొమీషియన్ మరణానంతరం నుండి కొమొడస్ పట్టాభిషేకం వరకు (క్రీ.శ.98-180) గల కాలమని" పేర్కొంటాడు."

పై నుండి బలవంతంగా ప్రజలపై రుద్దబడిన సుస్థిరత (గతంలోని గణరాజ్య యుగంలో కూడా) రైతుల దోపిడీ, బానిసల అణచివేతపైనే ఆధారపడి ఉండేది. ఇలాంటి ఆచారాలను (అత్యాచారాలు) సామ్రాజ్యం క్రమబద్ధీకరించి ఉంటుందే కాని వాటిని నిర్మూలించలేదు. సామ్రాజ్యంలో ప్రజా జీవితం ఎలా ఉండేదో వివరిస్తూ క్రీ.శ. రెండవ శతాబ్దంలో ఎపూలియూస్ 'ది గోల్డెన్ యాస్' అనే నవలను వ్యంగ్య శైలిలో రచించారు. గిబ్బన్ రచనలకు ఈ నవలకు ఎంతో భిన్నమైనది. ఒక రొట్టెల తయారీదారు కింద పని చేసే బానిసల స్థితిగతులను ఆ నవల సమగ్రంగా వివరిస్తుంది :

> "గాయాలు, కాట్లతో వారి చర్మమంతా నిండిపోయి నగ్నంగా దర్శనమిచ్చేది. మందబారిన వారి వీపులు అతుకుల బొంతలతో కప్పి ఉండటానికి బదులు మరింత కమిలిపోయే ఉండేవి. కొందరికైతే గోచీ తప్ప శరీరంపై మరో వస్త్రం అంటూ ఉండేది కాదు. కొందరు పై దుస్తులు ధరించినా అవి చాలా వరకు చిరిగిపోయి ఉండేవి. అందులో నుండి వారి శరీరం స్పష్టంగా కనిపించేది. వారి కనుబొమ్మలపై ముద్రలు వేసేవారు. వారి తలలు సగం ముండనమై ఉండేవి. కాళ్లకు సంకెళ్లు ఉండేవి. వారి ముఖాలు నీరసంగా, వికారంగా కనిపించేవి."

చట్టం ఎన్నడూ సంపద, అధికారంగల భూస్వామి జోలికి వెళ్లేది కాదు. భూస్వామి తన పొరుగులో నివసించే పేద రైతు పశువులను వధించినా, ఆవులను తస్కరించినా, అతడి దిగుబడిని నాశనం చేసినా, అనుచరుల సహాయంతో అతడిని వ్యవసాయ భూమి నుండి వెళ్లగొట్టినా చట్టం అతడిని బాధ్యుడిని చేసేది కాదని ఎపూలియూస్ వివరించారు.

ఎపూలియూస్ వ్యంగ్యశైలిలో వివరించిన ప్రపంచం సంపద, సుఖసంతోషాలతో నిండినది కాదు. అందుకు భిన్నంగా అభద్రత, అన్యాయం, అరాచకం, హింస, దోపిడీ, హత్యలతో దుర్భరంగా ఉండేది. రోములోని కొలేషియంలో రాక్షసక్రీడలు నిర్వహించి చక్రవర్తి తన ప్రాబల్యాన్ని చాటుకునే వాడు. సామ్రాజ్య నాగరికత ఎంత ఘనంగా ఉండేదంటే ఆ

రాక్షసక్రీడల్లో పోరాటవీరులు ఒకరినొకరు కిరాతకంగా నరికి చంపుకునేవారు. యుద్ధ ఖైదీలను క్రూర మృగాలు ముక్కలు ముక్కలుగా చీల్చి చెండాడేవి.

సామ్రాజ్యం సుస్థిరంగా ఉండి ఉండొచ్చు కాని సమాజంలోని అట్టడుగు స్థాయిలో ప్రధాన సమస్యలన్నీ అపరిష్కృతంగానే ఉండేవి. ఆర్థిక వ్యవస్థ అంతా గ్రామీణ ఉత్పత్తిపైనే ఆధారపడి ఉండేది. మరోవైపు పాలకవర్గం, దాని నాగరికత నగరాల్లో కేంద్రీకృతమై ఉండేవి. "వ్యాపారం, ఉత్పత్తి ఆర్థిక వ్యవస్థలో కేవలం పరిమితమైన పాత్రనే పోషించేవి. మౌలిక పరిశ్రమగా వ్యవసాయం కొనసాగేది. సామ్రాజ్యంలో అత్యధిక మంది ప్రజలు రైతులుగా జీవనం సాగించేవారు. ఉన్నత వర్గాల సంపదంతా ప్రధానంగా భూమి కౌలు నుండే వచ్చేది. పరిశ్రమ, వ్యాపార రంగాల కంటే వ్యవసాయ దిగుబడి 20 రెట్లు ఎక్కువగా ఆదాయాన్ని సమకూర్చిపెట్టేది."

వాణిజ్యం లేదా పారిశ్రామిక ఉత్పత్తి ప్రధాన పాత్ర పోషించిన కొన్ని నగరాలు ఉండేవి. అందుకు అలెగ్జాండ్రియా నగరం చక్కటి ఉదాహరణ. ఈ నగరం గుండా ఈజిప్టు ధాన్యం ఇటలీకి సరఫరా అయ్యేది. అరేబియా, భారతదేశం నుండి దిగుమతి అయ్యే విలాస వస్తువులు కూడా ఈ నగరం గుండా పంపిణీ అయ్యేవి. ఇక్కడ కొన్ని పరిశ్రమలు గణనీయంగా విస్తరించాయి. పేపరు తయారీ, గాజు పరిశ్రమ, నేత పరిశ్రమ అందులో ప్రధానమైనవి. కొందరు వ్యాపారులు అపారమైన సంపదను కూడబెట్టుకున్నారు. కాని నగరాలు చాలా వరకు పరిపాలనా కేంద్రాలుగా, పాలకవర్గాల వినియోగ కేంద్రాలుగా ఉండేవి. వాటిలో పరిశ్రమ, వాణిజ్య రంగాలకు ఎలాంటి ప్రాధాన్యత ఉండేది కాదు. సైనికావసరాల కోసం నిర్మించిన రహదారులు భారీ మోతాదులో సరుకులను రవాణా చేయడానికి అనువుగా ఉండేవి కావు. (అదే సమయంలో చైనాలో నిర్మించబడిన రహదారులు, జలమార్గాలు వ్యాపార, వాణిజ్య, ప్రజల రవాణాకు ఎంతో అనుకూలంగా ఉండేవి) ఈ కారణంగా భూమార్గాన సరుకులను రవాణా చేయడం ఖర్చుతో కూడుకున్న వ్యవహారంగా ఉండేది. అలాగే సరుకుల రవాణాకు చాలా కాలం పట్టేది. ఉదాహరణకు 300 మైళ్ల ప్రయాణం గోధుముల విలువను రెట్టింపు చేసేది. సుదూర ప్రయాణం కూడుకున్న వ్యాపారాన్ని కేవలం విలాస వస్తువులకే పరిమితం చేశారు. సామ్రాజ్యంలోని మైదాన, లోయ ప్రాంత నగరాలు నిత్యావసరాల కోసం చుట్టు పక్కల ఉన్న గ్రామీణ ప్రాంతాలపై ఆధారపడేవి. నగరాల్లోనే కొలువుదీరిన తమ స్వంత చేతివృత్తిదారులపై ఆధారపడి హస్తకళాకృతులను సమకూర్చుకునేవారు.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నగరాలు పరాన్నజీవులుగా పీల్చిపిప్పి చేసేవి. ఉత్పాదకతను పెంచే సృజనాత్మకతను ప్రోత్సహించే కేంద్రాలుగా అవి ప్రగతి సాధించలేకపోయాయి. నగరాల్లోనే జీవించే బడా భూస్వాములురైతులను దోచుకోవడం ద్వారా తమ ఆదాయాలను పెంచుకునేవారు. సంపదను పెంచుకునే దిశగా కొత్త ఉత్పత్తి సాధనాలు, సమర్థవంతమైన భూయాజమాన్యంపై ఎన్నడూ దృష్టి సారించలేదు. కొన్ని ప్రాంతాల్లో వ్యవసాయ భూములన్నింటిలో బానిస బృందాలే పంటలను సాగు చేసేవి. ముఖ్యంగా ఇటలీ ప్రధాన భూభాగంలో ఈ వ్యవస్థ ఉండేది. ఉత్పాతకతను పెంచే పద్ధతులను అభివృద్ధి పరిచేందుకు బానిస బృందాలకు ఎలాంటి ప్రోత్సాహకాలు ఉండేవి కావు. వారికి అలాంటి అవకాశం కూడా దక్కేది కాదు. కొత్తగా వచ్చి చేరిన బానిసలు మాత్రం అప్పుడప్పుడు తమ మాతృదేశంలో అమలవుతున్న అధునాతన వ్యవసాయ పద్ధతులను ఆచరణలో పెట్టేవారు. ఈ వ్యవసాయ పద్ధతుల బదిలీ కూడా సామ్రాజ్య పరిధిలోనే జరిగేది. స్వంత భూములున్న రైతులకు కూడా ఈ విషయంలో ఎలాంటి ప్రోత్సాహం

లభించేది కాదు. ఒక వేళ రైతులే స్వయంగా చొరవ తీసుకొని వ్యవసాయ దిగుబడిని పెంచినా అదనపు నిల్వలను భూస్వాములకు కౌలు రూపంలో కాని, ప్రభుత్వానికి పన్నుల రూపంలో కాని చెల్లించాల్సి వచ్చేది. ఈ కారణంగా రైతులెవరూ అధునాతన వ్యవసాయ పద్ధతులతో ప్రయోగం చేయడానికి ఉత్సాహం చూపేవారు కాదు. వ్యవసాయ ఉత్పత్తి పద్ధతుల్లో కొంత ప్రగతి వచ్చినా అది పరిమితంగానే ఉండేది. శారీరక శ్రమను తగ్గించే పద్ధతులను చాలా నెమ్మదిగా ప్రవేశపెట్టారు. క్రీ.పూ. 25లో తొలిసారిగా ప్రస్తావించబడిన నీటి చక్రాన్ని ఇటలీలో దాదాపు రెండు శతాబ్దాలపాటు చాలా అరుదుగా వినియోగించేవారు. మానవులు లేదా జంతువుల సహాయంతో నడిపే చక్రాలే ఎక్కువగా ఉండేవి. బానిస వ్యవస్థలో ఇలాంటి ఏర్పాటు చక్కగా ఇమిడిపోయేది.

అదే కాలంలో చైనాలో పరిస్థితులు వేరుగా ఉండేవి. అక్కడ నీటి చక్రాల వినియోగం తారాస్థాయిలో ఉండేది. సామ్రాజ్య తొలి దశలో ఆర్థిక వ్యవస్థకు చాలా కీలకమని భావించిన బానిస వ్యవస్థ పరిమాణం తదుపరి శతాబ్దాల్లో సామ్రాజ్య ఆర్థిక శక్తిని నిర్వీర్యం చేయడం ప్రారంభించింది. సామ్రాజ్య విస్తరణలో కీలకపాత్ర పోషించిన దండయాత్రలు సమసిపోవడంతో బానిసల చొరబాటు కూడా గణనీయంగా పడిపోయింది. ఫలితంగా బానిసల విలువ అమాంతంగా పెరిగిపోయింది. అప్పటికే బానిసలను కలిగి ఉన్న యాజమానులు వారి మనుగడ గురించి ఆందోళన చెందసాగారు. కొందరు కొత్తతరం బానిసలను సృష్టించడంలో నిమగ్నమయ్యారు. అయితే ఈ ప్రక్రియ కారణంగా పరిశ్రమకు పనికి రాని మహిళలు, చిన్న పిల్లలు సంఖ్య పెరిగి వారిని పోషించాల్సి వస్తుందన్న భయం కూడా భూస్వాముల్లో ఉండేది. ఉత్పత్తికి పనికిరాని మహిళలు, చిన్న పిల్లల సంఖ్య పెరిగితే అప్పటి వరకు చవకగా అందుబాటులో ఉన్న బానిసలు కూడా సాధారణ రైతాంగ కార్మికుల వలె భారంగా తయారయ్యే అవకాశం ఉండేది. విశాలంగా విస్తరించి ఉన్న తమ భూములను చిన్నచిన్న భాగాలుగా విడగొట్టి పేద రైతులకు ఎక్కువ కౌలుకు కట్టబెట్టడం లాభదాయకమని మరికొందరు భూస్వాములు గ్రహించారు. భూములను కౌలుదారులకు అప్పగిస్తే వారిని పర్యవేక్షించాల్సిన అవసరం ఉండదని, అలాగే రైతులు తమ కుటుంబాలను స్వయంగా పోషించుకుంటారని నిర్ధారించుకున్న బడా భూస్వాములు ఆ దిశగా చర్యలు తీసుకున్నారు. ఆ విధంగా బానిసత్వం తన ప్రాముఖ్యాన్ని క్రమంగా కోల్పోయింది.

బానిసత్వం క్షీణ దశలో పయనించడంతో (సామ్రాజ్య పాలనా వ్యవస్థ నిర్వహణా వ్యయం భారీగానే ఉండిపోయినా) గతంలో బానిసలు ఉత్పత్తి చేసిన అదనపు నిల్వలు (గణరాజ్య వ్యవస్థ కింద) పాలకవర్గానికి అందుబాటులో లేకుండా పోయాయి. గతంలో లాగే పాలక వర్గం మనుగడ సాగించగలిగింది. అయితే రైతులపై అదనపు నిల్వల కోసం సామ్రాజ్యం నుండి మరింత ఒత్తిడి పెరిగింది. సామ్రాజ్యమంతటా రైతులను తీవ్ర స్థాయిలో దోచుకోవడం మొదలుపెట్టారు. శతాబ్దాల తరబడి కొనసాగిన దోపిడీ కారణంగా అప్పటికే ఇటలీ రైతులు చాలా నష్టపోయి ఉన్నారు. గణరాజ్యం కింద రైతు సాధించే దిగుబడిలో పదిశాతంగా ఉన్న ప్రభుత్వ పన్ను క్రీ.శ. ఆరవ శతాబ్దం నాటికి మూడో వంతుగా మారింది. దీనికి తోడు రైతులు భూస్వామికి కౌలు కూడా చెల్లించాల్సి ఉండేది.

క్రీ.శ. రెండవ శతాబ్దం చివరి దశకాల నుండి లభించిన వివిధ నివేదికలు సామ్రాజ్యంలోని వివిధ రాష్ట్రాల్లో పూర్తిస్థాయి రైతాంగ తిరుగుబాట్లు, సైన్యాన్ని విడిచి పారిపోయిన

వారి దోపిడీ, దమనకాండ, సర్వస్వం కోల్పోయిన రైతులు, తప్పించుకున్న బానిసల గురించి ప్రస్తావించాయని స్టే క్రాయిక్స్ పేర్కొన్నారు. క్రీ.శ.284 నుండి ఐదవ శతాబ్ది మధ్యకాలం వరకు ఫ్రాన్స్, స్పెయిన్‌లలో కౌలు రైతులు తిరుగుబాటు చేసిన దాఖలాలను సామ్రాజ్య నివేదికలు తరచూ ప్రస్తావించాయి.

అలాంటి రైతాంగ తిరుగుబాట్లకు ఎంతటి ప్రాధాన్యత ఉండేదో తెలుసుకోవడానికి మన వద్ద ఎలాంటి మార్గం లేదు. అయితే ఒక విషయం మాత్రం సుస్పష్టం. ఈ తిరుగుబాట్లు పెరిగిపోతున్న పేదరికం, అసంతృప్తి, అభద్రత (ముఖ్యంగా సామ్రాజ్య సరిహద్దు ప్రాంతాలలో)లను ప్రతిబింబించాయి. ప్రభుత్వానికి పన్ను, భూస్వామికి కౌలు చెల్లించిన తర్వాత తమకు మిగిలేది శూన్యమని అనుభవపూర్వకంగా తెలుసుకున్న రైతులు భూములను వదలి వెళ్లిన సంఘటనలు సరిహద్దు ప్రాంతాల్లో పెద్ద ఎత్తున చోటు చేసుకున్నాయి. రైతులను భూములకు కట్టి పడేయడానికి లేదా భూస్వాముల నియంత్రణలోకి తేవడానికి రాజ్యం చట్టాలను కఠినతరం చేసింది. ఆ విధంగా సెర్ఫ్ వ్యవస్థ పునాదులు వేసుకుంది. సెర్ఫ్ (రైతు)లకు పాక్షికంగానే స్వేచ్ఛ ఉండేది. కౌలు భూములపై నిరంతరం వ్యవసాయం చేస్తూ భూస్వామికి, ప్రభుత్వానికి దిగుబడిలో వీరు వాటా చెల్లించాలి. ఖాళీ సమయాల్లో ఉచితంగా శ్రమ చేయాలి లేదా భూస్వామికి నగదురూపంలో ధనాన్ని చెల్లించాలి. ఎట్టిపరిస్థితుల్లోనూ వారు భూములను విడిచి వెళ్లడానికి అనుమతించేవారు కాదు. అయితే అలాంటి చట్టబద్ధమైన దోపిడీ, అణచివేత కారణంగా రైతుల్లో సామ్రాజ్య వ్యవస్థపై విశ్వాసం సన్నగిల్లింది. అనాగరికుల దండయాత్రలకు వ్యతిరేకంగా సామ్రాజ్యాన్ని సమర్థించాల్సిన అవసరం వారికి కనిపించలేదు.

అనాగరికుల దండయాత్రలు ఎక్కువయ్యాయి. వాటిని ఎదుర్కోవడం భారీ వ్యయంతో కూడుకున్న వ్యవహారంగా మారింది. చక్రవర్తులు భారీ, ఖరీదైన కిరాయి సైన్యాలపై ఎక్కువగా ఆధారపడసాగారు. క్రీ.శ. నాల్గవ శతాబ్దం నాటికి సైన్యాల బలం 6,50,000 కు చేరుకుంది. యుద్ధ వ్యయం రైతులపై మరింత భారం మోపింది. ఫలితంగా రైతుల్లో అసంతృప్తి తీవ్ర స్థాయిలో చెలరేగింది. చాలా మంది భూములను విడిచివెళ్లారు. అదే సమయంలో విజయవంతమైన సైనికాధికారులు తమ జాగీర్లను సింహాసనాన్ని హస్తగతం చేసుకోవడానికి వీలుగా తీర్చిదిద్దడం మొదలుపెట్టారు. అంతర్యుద్ధాలు సామ్రాజ్యాన్ని బలహీనపరచగా తిరుగుబాటు జాగీర్దార్లు సాక్షాత్తు రోము నగరాన్నే దోచుకున్నారు.

పశ్చిమ ప్రాంతంలో రోమను సామ్రాజ్యం పతనం వైపు పయనించడం మొదలు పెట్టింది. సైనిక తిరుగుబాట్ల ద్వారా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం సర్వసాధారణమై పోయింది. అనాగరికులు చొరబాట్లు తీవ్రరూపం దాల్చాయి. క్రీ.శ.330లో సామ్రాజ్య కేంద్రం ఇటలీ నుండి గ్రీకు మాట్లాడే నగరమైన బైజాంటియంకు తరలిపోయింది. అక్కడి నుండి పశ్చిమ ప్రాంతాన్ని నియంత్రించడం పాలకులకు కష్టసాధ్యంగా మారింది. అనతి కాలంలోనే రెండు ప్రాంతాల్లో ప్రత్యర్థి సామ్రాజ్యాలు ఆవిర్భవించాయి. ఈలోపు సామ్రాజ్య సరిహద్దు ప్రాంతాలైన బ్రిటన్, తదితర దేశాలు రోమను నియంత్రణ నుండి విముక్తి పొందాయి. మిగిలిన ప్రాంతాలను దక్కించుకోవడానికి చక్రవర్తులు జర్మానిక్ ప్రజల (ఆటవికులు)కు ధనధాన్యాలను కట్టబెట్టారు. ఆయా తెగల ప్రజలు సామ్రాజ్య సరిహద్దుల లోపలే స్థిరపడ్డారు. రోమనీకరణ చెందిన ఆటవిక నాయకులు రోమను పాలకుల స్థాయిలో అధికారాన్ని ఆకాంక్షించారు. అందుకోసం రోమను సాంప్రదాయమైన 'ఆక్రమణ'ను వారు సాధనంగా ఎంచుకున్నారు.

అలారిక్ అనే గోథ్ నాయకుడు తన సాయుధ శక్తుల సహాయంతో రోము నగరాన్ని దోచుకున్నాడు. ఫ్రాంక్ క్లోవిస్ ఫ్రాన్స్ ప్రాంతాన్ని తన నియంత్రణలోకి తీసుకున్నాడు. ఆస్ట్రోగోథ్ అయిన థియోడెరిక్ తనను తాను రోము చక్రవర్తిగా నియమించుకున్నాడు. విసిగోథ్‌లు స్పెయిన్‌లో రోము తరహా రాజ్యాన్ని స్థాపించారు.

విషపూరితమైన పతన చక్రం జీవనోపాధి ఆధారాలనే నిర్వీర్యం చేసింది. యుద్ధాలు, అంతర్యుద్ధాలు వ్యవసాయాన్ని కోలుకోని విధంగా దెబ్బతీశాయి. నగరాలను దాటి వెళ్లడానికి వ్యాపారులు సాహసించకపోవడంతో వాణిజ్యం క్షీణించింది. నగదురూపంలో కంటే వస్తు రూపంలో పన్నులను వసూలు చేయసాగారు. రాజ్య అవసరాలు, అధికార యంత్రాంగ అవసరాలు తీర్చడానికి పాలకులు ఉత్పత్తిదారులపై ప్రత్యక్ష పన్నులను విధించారు. దీని ఫలితంగా వాణిజ్యం మరింత క్షీణించింది. వ్యాపార, చేతివృత్తిదారి వర్గాల ఆర్థిక స్థాయి కుదించుకు పోయింది. నిత్యావసర వస్తువులను సమకూర్చుకోవడంలో నగరాలు కష్టాలను ఎదుర్కోవడం ప్రారంభించాయి. మరోవైపు పట్టణాలు, గ్రామాలు తమ స్వంత వనరులపైనే ఆధారపడి మనుగడ సాగించాయి. శక్తిమంతులైన భూస్వాముల నుండి రైతులకు రక్షణ లేకుండా పోయింది. సామ్రాజ్య కేంద్రం బలహీనం కావడంతో భూస్వాములే తమకు ప్రాబల్యం ఉన్న ప్రాంతాలపై రాజకీయ, సైనిక అధికారాన్ని ప్రత్యక్షంగా చెలాయించడం మొదలుపెట్టారు. స్థానిక నాయకుడికి చందా చెల్లించి రక్షణ పొందడమే ఏకైక మార్గంగా ఉండేది. ఆ విధంగా బయటి ప్రాంతాల దౌర్జన్యకారుల దాడుల నుండి రైతులు తప్పించుకునేవారు. ఉత్తర ప్రాంతం నుండి ఈశాన్యం వరకు సామ్రాజ్యంలోనే స్థిరపడిపోయిన ఆయా తెగల ప్రజలు ఇలాంటి ఆచారాన్ని పాటించేవారు.

బానిసత్వంపై ఆధారపడిన సామ్రాజ్య సమగ్ర ఆర్థిక వ్యవస్థ పశ్చిమ ప్రాంతంలో రైతాంగంపై ఆధారపడ్డ గ్రామీణ ఆర్థిక వ్యవస్థగా రూపాంతరం చెందింది. దానికి స్వయం సమృద్ధి లక్షణం ఉండేది. అయితే బానిసత్వం పూర్తిగా అంతరించలేదు. క్రీ.శ.1000 సంవత్సరాల వరకు బానిస శ్రమను వినియోగించారు. నగరాల ఆర్థిక స్థాయి దిగజారడంతో బడా భూస్వాములంతా గ్రామీణ ప్రాంతాలలోని తమ జాగీర్లలో స్థిరపడి బానిసలతో వ్యవసాయ పనులు చేయించేవారు. వ్యవసాయదారుల నుండి సాధ్యమైనంత వరకు అదనపు నిల్వలను సమకూర్చుకోవడానికి అదే సరైన మార్గమని వారు గ్రహించారు. కాని ఈ ఏర్పాటు నాగరికత లేదా సామ్రాజ్య మనుగడకు మౌలికాధారంగా మాత్రం నిలవలేకపోయింది. ఆరవ శతాబ్దం మధ్యభాగంలో పశ్చిమ, ఈశాన్య ప్రాంతాలను స్వల్పకాలంపాటు ఏకం చేసిన జస్టీనియన్, తదుపరి 250 ఏళ్లకు పవిత్ర రోమను సామ్రాజ్యాన్ని స్థాపించిన చార్లీమాగ్ని వ్యవసాయ ఆధారిత ఆర్థిక వ్యవస్థను క్రమబద్ధీకరించడానికి చేసిన ప్రయత్నాలు అనతి కాలంలోనే విఫలమయ్యాయి. అలాంటి విశాలమైన వ్యవస్థను కొనసాగించడానికి భౌతిక ఆధారం అంత బలంగా ఉండేది కాదు.

## ఆరవ అధ్యాయం

# క్రైస్తవ మత విస్తరణ

క్రీ.శ. 400 సంవత్సరాల తర్వాత పశ్చిమ రోమను సామ్రాజ్య సంక్షోభాన్ని తట్టుకొని నిలబడ్డ ఏకైక శక్తి క్రైస్తవ మతం. శతాబ్దాల క్రితం ఈ మతం సాధారణ స్థాయిలో విస్తరిస్తూ సామ్రాజ్య అధికారిక సిద్ధాంతంగా ఎదిగింది. ఆటవికుల దండయాత్రలు ప్రారంభమయ్యే నాటికి సామ్రాజ్యంలోని ప్రతి చిన్న పట్టణం చర్చి, మత బోధకులను కలిగి ఉండేది. అలాగే ప్రతి ప్రాంతం ఒక మతాధిపతిని కలిగి ఉండేది. రోము, బైజాంటియం కేంద్రాలుగా చర్చి వ్యవస్థ అనేక విభాగాలుగా సమీకృతమై ఉండేది. పై రెండు నగరాల్లో చర్చి ప్రాబల్యం, సామ్రాజ్యవాద అధికారం పరస్పరం విలీనమై ఉండేవి. చర్చి సిద్ధాంతీకరణల్లోని సున్నితమైన అంశాలను చక్రవర్తులు ఆచరణలో పెట్టేవారు.

సామ్రాజ్య సిద్ధాంతంగా క్రైస్తవ మతం ఆవిర్భవించలేదు. మతస్థాపకునిగా పిలవబడే నజరేతు జీసస్ గురించి చారిత్రకంగా అసలు ఎలాంటి విషయాలు తెలియవు. పురాణ పురుషుడి కంటే అతడు చారిత్రక వ్యక్తి అని చెప్పడానికి నిర్దిష్టమైన సాక్ష్యమంటూ ఏదీ లేదు. క్రైస్తవ మత కొత్త ప్రబోధనంలో అలాంటి సాక్ష్యం ఖచ్చితంగా లభించదు. కొత్త ప్రబోధనం ప్రకారం జీసస్ రోమను రాష్ట్రమైన జుదాయలోని బెత్లెహామ్‌లో జన్మించాడు. అగస్టస్ పాలనా కాలంలో జనగణనం కోసం అతడి కుటుంబం ఆ నగరానికి తరలివెళ్లింది. అయితే మతగ్రంథంలో పేర్కొన్నట్లు ఎలాంటి జనగణన జరగలేదు. ఆ సమయంలో జుదాయ రోమను రాష్ట్రం కూడా కాదు. క్రీ.శ.7లో జనగణన జరిగినపుడు స్థానికులు తమ నివాస ప్రాంతాలను వదలి వెళ్లాలన్న నిబంధన ఏదీ లేదు. అలాగే కొత్త నిబంధనల ప్రకారం జీసస్, హెరోద్ రాజు పాలనా కాలంలో జన్మించాడు. హెరోద్ క్రీ.పూ. 4లో మరణించాడు. అయితే ఆ కాలం నాటి రోమను, గ్రీకు రచయితలు ఎవ్వరూ జీసస్ గురించి ప్రస్తావించలేదు. యూదు-రోమను సంతతికి చెందిన రచయిత జోసెఫస్ చేసినట్లు చెబుతున్న ప్రస్తావన మధ్యయుగ మతప్రచారకుల కల్పిత గాధల ఫలితమేనని ఖచ్చితంగా చెప్పవచ్చు. క్రీ.శ. 100 సంవత్సరంలో రచనలు చేసిన టాసిటస్ క్రైస్తవులను తొలిసారిగా అధికారికంగా ప్రస్తావించినా జీసస్‌ను పేరు పెట్టి నివేదించలేదు. కాని 'క్రిస్టోస్' అనే గ్రీకు పదాన్ని మాత్రం వినియోగించాడు. క్రిస్టోస్ అంటే ప్రవక్త అని అర్థం. ఆ ప్రవక్త ఎవరైనా కావచ్చు.

క్రైస్తవ మత స్థాపకుడి గురించి మనకు ఎంత తక్కువ తెలుసో అంతే తక్కువగా తొలి క్రైస్తవుల మత నమ్మకాల గురించి తెలుసు. కొత్త ప్రబోధనం ప్రవచనాలన్నీ పరస్పర విరుద్ధమైన ప్రకటనలతో నిండి ఉన్నాయి. లూకే లాంటి అధ్యాయాల్లో వర్గ వైషమ్యాల గురించి తీవ్రమైన భావనలు ఉన్నాయి. ఉదాహరణకు : ఒక ధనికుడు నేరుగా నరకానికి వెళతాడు. మరోవైపు పేదవాడైన లాజరస్ అబ్రహాము కౌగిట్లోకి చేరతాడు. జీసస్ ఈ విధంగా ప్రబోధించాడు : "ఒక ఒంటె సూది బెజ్జం నుండి దూరి వెళ్లడం సాధ్యమేమో కాని ఒక ధనికుడు దేవుని రాజ్యంలో ప్రవేశించడం అసాధ్యం." సినాయ్ పర్వతంపై దేవుని ప్రవచనాన్ని లూకే అధ్యాయం ఈ విధంగా వర్ణించింది : "పేదలూ! మీరు ధన్యులు. ఎందుకంటే మీది దేవుని రాజ్యం. ఆకలి గ్రస్తులూ! మీరూ ధన్యులే. మీ కోరికలన్నీ నెరవేరతాయి... కాని ధనికులైన వారు అష్టకష్టాలు పడక తప్పదు. ఎందుకంటే మీరు ధనాశతో సంతృప్తి చెందారు. తిండికి కొదవలేని వారు కూడా పాప పరిహారం చేయకతప్పదు. ఆకలితో అల్లాడక తప్పదు." ఈ సందేశంలోనే మరో చోట వైరుధ్యం కనిపిస్తుంది. ఆ ప్రకటనలో పేదలు, ధనికుల మధ్య సత్సంబంధాల గురించి బోధించబడింది. ఆ విధంగా మాథ్యూ కథనంలో జీసస్ ప్రవచనాన్ని ఇలా పేర్కొన్నాడు : " పేదలు ఆత్మీయత కారణంగా దీవించబడ్డారు. ఎందుకంటే వారిది స్వర్గ రాజ్యం. ఆకలి దప్పులతో బాధపడేవారు నిజాయితీ కారణంగా దీవించబడ్డారు. వారి ప్రార్థనలు ఫలిస్తాయి." 'అర్హత'ల చిట్టా ప్రకారం సేవకుడినినగదు రూపంలో తగిన విధంగా సత్కరించే ధనికుడు ప్రశంసాపాత్రుడు. అతడి దాతృత్వానికి ఫలితంగా దేవుడు అతడికి మూడు అర్హతలు ప్రసాదిస్తాడు. వాటిని అతడు వ్యాపారంలో పెట్టుబడిగా పెట్టి లాభాలను ఆర్జిస్తాడు. అయితే సేవకుడిని శిక్షించే యజమానికి ఒకే ఒక అర్హత లభిస్తుంది. దానిని రుణదాతకు అందించడం వల్ల వడ్డీని కూడా రాబట్టడంలో అతడు విఫలమవుతాడు. (ఇక్కడ 'అర్హత' అంటే నాణెం అని అర్థం) ఈ అర్హతల పత్రం మరో హెచ్చరిక కూడా చేస్తుంది : "ధనికుడికి ఒక్క అర్హత కూడా లేకపోతే అతడి నుండి సంపద అంతా వెనక్కి తీసుకోబడుతుంది."

అలాగే కొన్ని వ్యాఖ్యానాలు పాలకులకు వ్యతిరేకంగా ప్రజా ప్రతిఘటనను ప్రబోధిస్తాయి. మరికొన్ని వ్యాఖ్యానాలు పాలకుల ఆజ్ఞకు ప్రజలు కట్టుబడి ఉండాలని ప్రోత్సహిస్తాయి. రోమన్లకు పన్ను చెల్లించాలని జీసస్ ప్రజలకు పిలుపునిచ్చాడు. "సీజర్‌కు న్యాయంగా దక్కాల్సిన వాటాను అతడికి చెల్లించండి. దేవునికి చెందాల్సిన వాటాను తప్పకుండా చెల్లించండి." చివరగా, యూదు మత సూత్రాలకు లోబడి ఉండాలన్న ప్రవచనాల్లో కూడా వైరుధ్యాలు కనిపిస్తాయి. అలాగే మత సూత్రాలను ఉల్లంఘించాలని కొన్ని ప్రవచనాలు పిలుపునిస్తాయి. ఈ వైరుధ్యాలు గందరగోళపరిచేవిగా ఉన్నాయి.

మార్క్సిస్టు దృక్పథంతో కారల్ కౌట్స్కీ రచించిన "క్రైస్తవ మత పునాదులు" 90 ఏళ్ల క్రితమే ఈ వైరుధ్యాలను ప్రస్తావించింది. కార్మికవర్గాలకు చెందిన వామపక్ష భావాలను తక్కువ చేసి చూపడానికి తర్వాతి తరం క్రైస్తవ రచయితలు ప్రయత్నించడంవల్లే ఈ వైరుధ్యాలు తలెత్తాయని ఆ గ్రంథం సూచించింది. ఈ అంశంపై కౌట్స్కీ లేవదీసిన కొన్ని వాదనలు సందేహాస్పదంగా ఉన్నాయి. అయినప్పటికీ పాత నిబంధనల్లోని చాలా వ్యాఖ్యానాలు పరమార్థం

(మార్క్, లూకే) సామ్రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలని ప్రజలను ప్రోత్సహించడమే. అదే సామ్రాజ్యం తర్వాతి కాలంలో క్రైస్తవ మతాన్ని స్వీకరించి దానికి అధికారిక హోదా కల్పించింది.

అలా ఎందుకు జరిగింది అని అర్థం చేసుకోవడానికి తొలుత ఏ పరిస్థితుల్లో క్రైస్తవ మత ఆవిర్భావం, విస్తరణ జరిగిందో తెలుసుకోవడం ముఖ్యం.

క్రీ.శ. ఒకటవ శతాబ్దం తొలియార్థంలో జెరుసలేం రోమను సామ్రాజ్యంలోని అతి పెద్ద నగరాల్లో ఒకటిగా ఉండేది. ఓరియంట్ (ఆగ్నేయ ప్రాంతం)లోనే 'జెరుసలేం వైభవోపేతమైన నగరంగా ప్లినీ (మొదటివాడు) అభివర్ణించాడు. అయితే ఆ నగరం సామ్రాజ్యంలోకెల్లా అత్యంత కల్లోలిత ప్రాంతంగా ఉండేది. ముఖ్యమైన వాణిజ్య మార్గాలకు అతి చేరువగా ఉండడం వల్లే జెరుసలేంకు ఎనలేని వైభవం దక్కింది. తర్వాతి కాలంలో మతపరమైన కేంద్రంగా రూపాంతరం చెందడంతో సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతాల నుండి నగరానికి ధనం వెల్లువలా వచ్చి పడింది. అయితే దాని చుట్టూ ఉన్న ప్రాంతాలు – జుదాయ, సమారియా, గలిలీ – సంపదకు ఆమడ దూరంలో ఉండేవి. ఇతర రోమను రాష్ట్రాల వలె ఈ ప్రాంతాలు కూడా అనేక కష్టాలను ఎదుర్కొనేవి. సామ్రాజ్యానికి పన్ను చెల్లించడంతోపాటు స్థానిక గవర్నర్లకు సరిపడ సంపద, ధాన్యాన్ని సమకూర్చాల్సి రావడంతో ప్రజలు, ముఖ్యంగా రైతులు, దుర్భర జీవితాన్ని గడిపేవారు. రాజ్య వాటాను వసూలు చేయడానికి స్థానిక అధికారులు అణచివేతకు పాల్పడేవారు. పన్ను శాతం అధికంగా ఉండేది. ఈ ప్రాంతాల్లో పేదరికం తాండవించేదని చెప్పడానికి విస్తృతమైన సాక్ష్యాధారాలు ఉన్నాయి.

ఫలితంగా ప్రజల్లో రోమన్లు, వారికి సహకరించే ఉన్నత వర్గం పట్ల తీవ్రమైన శత్రు భావం నెలకొంది. అసలు రోమన్లను ఆహ్వానించింది తొలుత యూదు రాజులే. క్రీ.పూ. 139 మొదలుకొని స్థానిక పాలకులు రోమను సామ్రాజ్య సహాయంతో శత్రు రాజ్యాలతో నిరంతరంగా యుద్ధం చేసేవారు.

జెరుసలేంలో తరచూ ఘర్షణలు చోటు చేసుకునేవి. గ్రామీణ ప్రాంతాల్లో దోపిడీ ముఠాలు స్వైర విహారం చేసేవి. ముఖ్యంగా గలిలీ ప్రాంతంలో దోపిడీ దొంగల బెడద ఎక్కువగా ఉండేది. కొన్ని సందర్భాల్లో ఈ ఘర్షణలు, దోపిళ్లు మతం రంగును పుణికిపుచ్చుకునేవి. చావుకు దగ్గరలో ఉన్న హెరోద్ రాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు బయల్దేరింది. తిరుగుబాటును అణచివేసేందుకు హెరోద్ కుమారుడు అర్చీలాస్ కఠినమైన చర్యలు తీసుకున్నాడు. రాజ్య దమనకాండకు 3,000 మంది యూదుల బలైపోయారు. మరో రెండు వేల మందిని శిలువపై కెక్కించారు. గలిలీ గ్రామీణ ప్రాంతంలో గెరిల్లా యుద్ధం మొదలైంది. దానికి జుదాస్ అనే వ్యక్తి నాయకత్వం వహించాడు. అతడు తనను తాను 'యూదుల రాజు'గా ప్రకటించుకున్నాడు. క్రీ.శ. 7లో రోమను జనగణన జరిగిన సమయంలో ఇద్దరు వ్యక్తులు ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టారు. రక్తం ఏరులై పారిందని జోసెఫస్ పేర్కొన్నాడు. సుమారు 40 ఏళ్ల తర్వాత మళ్లీ తిరుగుబాటు వచ్చింది. తనను తాను ప్రవక్తగా ప్రకటించుకున్న థియూడస్ ప్రజలను సమీకరించాడు. రాజద్రోహం నేరంపై అతడి శిరస్సును ఛేదించారు. తమ అలౌకిక ఆలోచనలతో

ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టి నగరాల్లో కల్లోలం సృష్టించే 'దుష్టజనుల' బృందాలతో రోమను పాలకులు ఇంతే కఠినంగా వ్యవహరించేవారు. తిరుగుబాటు నాయకులు దైవవాణి లేదా దైవాజ్ఞ పేరుతో ప్రజలను ఉత్తేజపరిచేవారు.

తర్వాతి కొంత కాలానికే ఈజిప్టు నుండి వచ్చిన ఒక నకిలీ ప్రవక్త తన మంత్ర విద్యలతో ప్రజల చేత 'ప్రవక్త'గా ఆమోద ముద్ర వేయించుకోవడంలో సఫలమయ్యాడు. జెరుసలేంలో చొరబడి అక్కడి రోమను సైనిక స్థావరాన్ని ధ్వంసం చేయాలనే ఆలోచనతో అతడు 30,000 మంది ప్రజలను ఎడారి నుండి బయటికి రప్పించాడు. ఆలివ్స్ పర్వతంగా చెప్పబడే ప్రాంతానికి వారిని తరలించాడు. అయితే ఈ తిరుగుబాటు యత్నాన్ని రోమన్లు విఫలం చేశారు. ఈ తిరుగుబాటును అణచివేశారో లేదో మాంత్రికులు, హంతకులు తిరుగుబాటు దళాల్లో చేరిపోయారు. అనుచరులను పెద్ద సంఖ్యలో సమీకరించారు. యూదు భూమంతా కలియ తిరుగుతూ ధనికుల ఇళ్లను దోచుకున్నారు. ప్రతిఘటించిన వారిని వీధుల్లోనే నరికి చంపారు. గ్రామాలు గ్రామాలనే తగులబెట్టారు. పంటను సర్వనాశనం చేశారు. ఈ ఘర్షణలకు యూదు మతంలోని పేదవర్గాల్లో ఉన్నత వర్గాలపట్ల ఉన్న వర్గ వైషమ్యాలు రోమను దురాక్రమణ శక్తులపై ఉన్న విద్వేషంతో జతయ్యాయి.

యూదు మతాన్ని వివిధ రకాలుగా అన్వయించిన తీరులో వర్గ విభేదాలు బహిర్గతమయ్యాయి. గ్రీకు భాష మాట్లాడే ధనికులు రోమన్లతో పొత్తు కుదుర్చుకున్నారు. వంశపారం పర్య పురోహితుల వ్యవస్థను బలపరచిప సద్దూసీ మత సంస్థను వెనకేసుకొచ్చారు. ఈ మత సంస్థ 'ఆత్మ శాశ్వతమైంది కాదని, మరణం తర్వాత శిక్ష కాని, సత్కారం కాని ఉండవు' అని ప్రబోధించేది. జోసెఫస్ ప్రకారం ఈ పంథా తన అనుచరులను తమతోటి దేశస్థులతోపాటు విదేశీయులపట్ల కఠినంగా, క్రూరంగా వ్యవహరించమని సూచించేది. అందుకు భిన్నంగా అనువంశికంగా కాని మత పండితులు (వీరు వివిధ సామాజిక నేపథ్యాలు నుండి వచ్చిన వారు) ఫారిసీ పంథాను అనుసరించేవారు. యూదు మతచట్టం (పాత ప్రబోధనంలో పేర్కొనబడిన మతాచారాలు, ఆహార నియమాలు) ప్రకారమే అందరూ నడుచుకోవాలని ఈ పంథా నొక్కి చెప్పేది. రోమన్లతో యూదు ఉన్నత వర్గం లాలూచీ పడటాన్ని నిరసించింది. ఆత్మ శాశ్వతమని, మంచి వారి ఆత్మలు కొత్త శరీరాల్లోకి ప్రవేశిస్తాయని, దుష్టుల ఆత్మలు శాశ్వత వేదనతో కుమిలిపోతాయని ప్రబోధించింది. ఎస్సీన్స్ అనే మూడో పంథా సమాజంలోని దుష్టాచారాల నుండి తప్పించుకోవడానికి గ్రామీణ ప్రాంతాలలో మతపరమైన సముదాయాలను ఏర్పరచింది. ఈ మఠాల్లో వారు ఎలాంటి వ్యక్తిగత ఆస్తులు లేకుండా జీవించేవారు. బానిసత్వం అన్యాయమైనదని వారు స్పష్టం చేశారు. ఈ వాదన క్రైస్తవ మతబోధకుల ఆలోచన కంటే తీవ్రమైనది. చివరగా మత మౌఢ్యులు మత విశ్వాసాన్ని రాజకీయ ఆందోళనతో జత చేసి రోమన్ పాలనకు వ్యతిరేకంగా పోరాటం మొదలుపెట్టారు.

అప్పుడు జెరుసలేం అల్లకల్లోలంగా ఉండేది. విభిన్న మత అభిప్రాయాలు (అన్ని తప్పుడు అభిప్రాయాలు) పరస్పరం పోటీ పడుతూ విభిన్న వర్గ భావనలకు, వైఖరులకు (రోమను పాలనపట్ల) ఒక రూపం ఇచ్చాయి. ఈ కాలంలోనే జీసస్ మతబోధనలు చేశాడని

చెబుతారు. ఈ వ్యవహారం అంతటితో ముగియలేదు. క్రైస్తవ మతానికి సామ్రాజ్యంలోని ప్రతి మహానగరంలో అనుచరులు ఉండేవారు. ఫలితంగా సిద్ధాంతపరమైన వాద ప్రతివాదనల ప్రభావం బయటి ప్రాంతాల్లో స్పష్టంగా కనిపించేది. ఎందుకంటే యూదులు అప్పుడు కేవలం ఒక చిన్న భూభాగానికే పరిమితమై ఉండేవారుకాదు. యూదు రాజ్యాలైన జుదాయ, ఇజ్రాయేలుకు చెందిన యూదు ఉన్నత వర్గాలను అస్సీరియా, బాబిలోనియా ఆక్రమణదారులు మెసొపొటామియాకు 500 ఏళ్ల క్రితమే తరలించారు. పర్షియా చక్రవర్తి జెర్క్స్ జెరుసలేంను యూదులను తిరిగి అప్పగించినా చాలా మంది యూదులు తమ స్వదేశానికి తిరగి వెళ్లలేదు. కొత్త దేశాల్లో సంపన్న వర్గాలుగా ఎదగడమే వారికి తృప్తిని, సంతోషాన్ని కలిగించింది. అలాగే ఇతర యూదులు కూడా పెద్ద సంఖ్యలో పాలస్తీనా నుండి తరలిపోయారు. మధ్యధరా ప్రాంతంలోని వివిధ రాజ్యాల్లో స్థిరపడిపోయారు. ఉన్నతమైన జీవన ప్రమాణాలు ఆశించి గ్రీకులు విదేశాల్లో స్థిరపడినట్లే యూదులు కూడా ఇతర రాజ్యాలకు వలసపోయారు సారవంతమైన భూములు లేని తమ స్వదేశంలో అభ్యున్నతి సాధించడం కష్టమని వారు స్పష్టంగా తెలుసుకున్నారు. మరోవైపు కొందరు యూదులు బలవంతంగా ఇతరప్రాంతాల్లో స్థిరపడాల్సి వచ్చింది. ముఖ్యంగా యుద్ధ ఖైదీలుగా చిక్కిన వారు తమ యజమానులు ఎక్కడికి తీసుకెళితే అక్కడ స్థిరపడ్డారు.

క్రీ.శ. ఒకటవ శతాబ్దం ప్రారంభమయ్యేనాటికి ప్రతి రోమను నగరంలోనూ యూదులు గణనీయమైన సంఖ్యలో ఉండేవారు. నగర జనాభాలో 10 నుండి 15 శాతం వరకు యూదులే ఉండేవారు. అలెగ్జాండ్రియా నగరంలో వారి జనాభా శాతం అంత కంటే ఎక్కువగా ఉండేది. ఈజిప్టులో గ్రీకు నగరమైన అలెగ్జాండ్రియా యూదు నగరంగా కూడా చెలామణీ అయ్యింది. జూలియస్ సీజర్ యూదుల మద్దతును కోరిన కారణంగా రోములో కూడా వారు పరిగణించదగ్గ స్థాయిలో ఉండేవారు.

విదేశాల్లో స్థిరపడిన యూదుల ప్రవాస సముదాయం తన ఉనికిని ప్రత్యేకంగా చాటుకుంది. కనిపించని ఏకైక దైవం, ఆహారపు అలవాట్లు, విశ్రాంతి దినం తదితర మతాచారాలతో వారు ప్రత్యేక సముదాయంగా గుర్తింపు పొందారు. ఈ ఆచారాలవల్ల యూదులుల మిగతా ప్రజలతో విలీనం కాలేకపోయారు. అలాగే జెరుసలేం నిర్వహణకు ప్రవాస యూదులు ప్రతి సంవత్సరం విరాళాలు సమకూర్చేవారు. ఫలితంగా జెరుసలేంలో అపారమైన సంపద పోగయ్యేది. పాస్ఓవర్ పండుగ నాడు పరిస్థితులు అనుకూలిస్తే ప్రవాసీయులు ఆ నగరాన్ని తప్పకుండా సందర్శించేవారు. ఆహార నియమాలు, ఉపవాసం వల్ల యూదులు సామాజిక సంబంధాలను పెంచుకోలేకపోయారు. యూదేతర ప్రజలతో కలిసి పని చేయలేకపోయారు. అయినప్పటికీ యూదు సముదాయాలు మనుగడ సాగించగలిగాయి. ముఖ్యంగా తమ ప్రార్థనా మందిరమైన సినోగాగ్‌లో వారాంతపు సమావేశాలు నిర్వహిస్తూ సముదాయ ఐక్యమత్యాన్ని, పరస్పర సహకార సంబంధాలను బలోపేతం చేసుకుంటూ ఆర్థికంగా, సామాజికంగా అభ్యున్నతిని సాధించారు. బహుశా ఇవే కారణాలవల్ల ఇతర ప్రవాస సముదాయాలు కూడా చర్చిలు, మసీదులపై ఎక్కువగా ఆధారపడేవి. మత సంబంధాలు ఒక

సముదాయాన్ని ప్రార్థనల్లోనే కాకుండా ఆహారం, నైతిక ప్రవర్తన విషయంలో కూడా సమైక్యంగా ఉంచేవి. వ్యక్తిగత కుటుంబాలు ఎక్కువగా నివసించే నగరాల్లో ఇలాంటి సముదాయ సమావేశాలు ప్రవాస యూదులకు సాంత్వన కలిగించేవి. విదేశీ గడ్డపై అడ్డంకులను, అవాంతరాలను ఎదుర్కొనడానికి అవి ఎంతో ఉపయోగపడేవి. ఆత్మీయ సంబంధాలు కొరవడ్డ నగరాలలో ధనిక వ్యాపారి లేదా వృత్తిదారుని జీవితానికి కూడా భద్రత ఉండేది కాదు. అలాగే అట్టడుగు వర్గాల పరిస్థితి మరింత దుర్భరంగా ఉండేది.

అయితే, యూదు సముదాయాలు కేవలం మనుగడను మాత్రమే సాగించలేదు. తమ వైపు ఇతరులను కూడా ఆకర్షించారు. యూదు మతం పుచ్చుకున్న ప్రొసెలైట్లు ఈ కాలంలో సర్వసాధారణంగా కనిపించేవారు. అలెగ్జాండ్రియా యూదుడు ఫిలో ఇలా పేర్కొన్నాడు : "యూదు మతం మానవాళినంతా జయిస్తోంది. ఆటవికులు, హెలెనీయులు, పశ్చిమ, ఈశాన్య దేశాలు, ఐరోపా, ఆసియా వాసులు అందరూ మా పంథాను స్వీకరిస్తున్నారు."

గ్రీకు, రోమను నగరాల్లో యూదు ఎంత ఆకర్షణీయంగా ఉండేదంటే విశ్వాసుల ప్రత్యేక వర్గం ఆవిర్భవించింది. వీరిని దైవభీతి గలవారిగా పిలిచేవారు. యూదేతరులైన ఈ విశ్వాసులు సినోగాగ్‌లను సందర్శించేవారు. అయితే చాలా మంది సుంతి చేయించుకోవడానికి, మత సూత్రాలను పూర్తిగా పాటించడానికి అంగీకరించేవారు కాదు.

సముదాయ భావన ఒక్కటే వారిని ఆకర్షించలేదు. యూదు మత ప్రధాన సిద్ధాంతమైన ఏకేశ్వరవాదం నగర వాసుల జీవన పరిస్థితులకు చాలా అనుకూలంగా ఉండేది. విగ్రహ ఆరాధన పాటించే ఇతర మతాల్లో అనేక మంది దేవతలు, దేవుళ్లు ఉండేవారు. ప్రతి ప్రాంతానికో దైవం ఉండేది. ఈ మతాలను ఆచరించేవారు ప్రకృతి శక్తులను కూడా కొలిచేవారు. గ్రామీణ ప్రాంతవాసులను ఇలాంటి మతాలు ఆకర్షించేవి. గ్రామీణ లేదా ప్రాంతీయ సముదాయం, సామాజిక జీవితానికి అవి కీలక ఆధారాలుగా ఉండేవి. అయితే పట్టణ వ్యాపారులు, వృత్తిదారులు, భిక్షగాళ్లు నగరంలోని వివిధ ప్రాంతాలకు చెందిన వ్యక్తులు, వివిధ వృత్తులు నిర్వహించే వారితో తరచూ సంప్రదించేవారు. ఇలాంటి బహుళ సంబంధాల వాతావరణంలో ఒక పేరులేని ఏకైక దైవం ప్రజలకు సహకారాన్ని, భద్రతను కల్పించే అవకాశం ఉండేది. అందుకే ప్రాచీన నాగరికతల్లో ఏకేశ్వర మతాలు పరిఢవిల్లాయి. భారతదేశం, చైనాలలో బౌద్ధం, పర్షియాలో ఏకైక సుదైవం (ఈ దైవం దుష్టశక్తులతో నిరంతరంగా పోరాడుతూనే ఉంటుంది) ఆవిర్భవించాయి.

రోమను బహుదైవత్వం కూడా సూర్యదేవుడిని ఇతర దైవాల్లోకెల్లా అత్యంత శక్తివంతునిగా భావించేది. అన్నింటికంటే మించి ఫారిసీ స్వరూపంలోని యూదు మతం ఏకేశ్వరవాదాన్ని పునర్జన్మ సూత్రంతో ముడిపెట్టి కొత్తవారిని తన వైపు ఆకర్షించేది.

యూదు మతం జనప్రియమై లక్షలాది మంది విశ్వాసులను ఒకే బంధంలో కట్టిపడేసింది. రోమను సామ్రాజ్యంలోని అన్ని ప్రధాన వాణిజ్య కేంద్రాలలో యూదు మత విశ్వాసుల సంఖ్య గణనీయంగా పెరిగింది. పరిచయాలు, సంబంధాలు వేలాది మైళ్ల పొడవులో విస్తరించాయి. ఈ సమాచార వ్యవస్థ ద్వారా జెరుసలేంలో జరిగే పరిణామాలు, మతపరమైన

తగాదాలు, ప్రవక్తల ప్రవచనాలు ప్రసారమయ్యేవి. పాలస్తీనాలో జరిగే పరిణామాలు రోమను నగరాల్లో స్థిరపడ్డ యూదులకు సుదూర ప్రాంత సంఘటనలుగా కనిపించేవి కావు. పాలస్తీనా ప్రజల కష్టాలు ఆక్రమణకు గురైన ఇతర రాజ్యాల పీడిత వర్గాల కష్టాలకు భిన్నంగా ఉండేవి కావు. రోమను సామ్రాజ్యమంతటా పీడితులు దుర్భరమైన పరిస్థితులను ఎదుర్కొనేవారు.

ఆ విధంగా యూదు మతం రోమను సామ్రాజ్యంలోని పట్టణ ప్రజల సార్వజనిక విశ్వాసంగా ఎదిగే దశకు చేరుకుంది. అయితే దానికి రెండు ప్రధాన సవాళ్లు ఎదురయ్యాయి. మొదటిది దాని ఆహార నియమాలు, సుంతి చేయించుకోవాలన్న నిబంధన. అయితే యూదు మతాన్ని స్వీకరించిన వారు చాలా వరకు ఈ నిబంధనలను పాటించడానికి ముందుకు రాలేదు. రెండో సవాలు మత విశ్వాసులకు యూదు మతం ఇచ్చిన హామీ. యూదు మత విశ్వాసులు దేవుడు ఎంపిక చేసిన ప్రజలని, వారికి తప్పకుండా విముక్తి లభిస్తుందన్న హామీ లోపభూయిష్టంగా ఉండేది. ఎందుకంటే అన్ని ప్రాంతాలపై రోమను సామ్రాజ్య ఆధిపత్యం ఉండేది. ప్రజలు పరాధీనులై ఉండేవారు. ఈ వాస్తవం యూదు మత హామీని స్పష్టంగా ధిక్కరిస్తుంది. పాలస్తీనా ప్రజలు రోమను పాలనను తిరుగుబాటు ద్వారా అంతం చేయడానికి వ్యూహం రూపొందించవచ్చు. కాని పరిమిత సంఖ్యలో ఉండే ప్రవాస యూదులు తిరుగుబాటు చేసే పరిస్థితిలో లేరు. నిజానికి క్రీ.శ.70లో పాలస్తీనా యూదులు తిరుగుబాటు చేసినపుడు ప్రవాస యూదులు ఏమీ చేయలేకపోయారు. తిరుగుబాటు విఫలం కావడంతో యూదు మత విముక్తి సిద్ధాంతాన్ని ప్రపంచ పాలకులవుతామన్న హామీని నమ్మడానికి ఎవరూ ముందుకు రాలేదు. దాంతో యూదుల తమ మత సిద్ధాంతాలను వేరుగా అన్వయించారు. ఈ జన్మలో కాకపోయినా వచ్చే జన్మలో తప్పకుండా యూదు మత విశ్వాసులు ప్రపంచాన్ని ఏలుతారని సూత్రీకరించారు. ఆ మేరకు యూదు మతం పరిమిత స్థాయిలో విస్తరించగలిగింది.

యూదు మతానికి చెందిన ప్రత్యేక పంథాగా క్రైస్తవం ఆవిర్భవించింది. ప్రవచనాల్లోని చాలా వ్యాఖ్యలు సూచిస్తున్నదేమిటంటే తొలుత క్రైస్తవ మతం ఇతర ప్రవక్తల మత వర్గాలకు ఎందులోనూ భిన్నంగా ఉండేది కాదు. ఆ కాలంలో చాలా మత వర్గాలు (యూదు మతానికి సంబంధించిన) ఉండేవి.

చాలా సందర్భాల్లో ప్రవచనాలు వేర్వేరు పిలుపులను ఇచ్చాయి. ఒక సందర్భంలో ఫారిసీ సూక్తి అయిన మత చట్టాల పాలన, మరో సందర్భంలో మత మౌఢ్యుల పోరాట పిలుపు, చివరగా ఎస్సీన్‌ల పంథా అయిన మత జీవనం (కుటుంబాన్ని త్యజించి రావాలన్న పిలుపు) గురించి వివరించబడింది. ఈ పిలుపులు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఒక వ్యాఖ్యానంలో లూకే ఇలా నివేదించాడు : నన్ను ఆశ్రయించే వ్యక్తి తన తల్లితండ్రులను, సోదరీ సోదరులను, చివరకు తన స్వంత జీవితాన్ని ద్వేషించకుండా ఉంటే, నా శిష్యుడు కాజాలడు.' ఆధునిక మతబోధకులు కుటుంబ విలువలకు ఇచ్చే ప్రాధాన్యత పై ప్రవచనానికి చాలా వ్యతిరేకంగా ఉంది. జీసస్ జెరుసలేంపై తన శిష్యబృందంతో కలసి ఆధిపత్యం వహించడం, యూదుల రాజుగా ప్రజల మన్ననలు పొందడం, ప్రార్థనా మందిరం నుండి వడ్డీ వ్యాపారులను తరిమివేయడం లాంటి కథనాలకు జోసెఫస్ ఇతర ప్రవక్తల కార్యకలాపాల గురించి చేసిన వర్ణనలతో చాలా దగ్గరి పోలికలు ఉన్నాయి.

యూదు మత వర్గాలలో కేవలం ఒక వర్గం మిగిలిపోవడానికి క్రైస్తవ మతానికి అంత కారణం కనిపించలేదు. కనుక గ్రీకు భాష మాట్లాడే సావుల్ (టార్సస్‌కు చెందిన వాడు) అనే వ్యక్తి ఫారిసీ పంథా నుండి వేరుపడినపుడు క్రైస్తవ మతం అతడిని చేర్చుకుంది. అతడు పాలస్తీనా బయట నివసించేవాడు. సంచార చేతివృత్తిదారునిగా ఉండేవాడు. గుడారాలను నిర్మించేవారు. సామ్రాజ్యంలోని వివిధ నగరాలలో కొత్త మత సిద్ధాంతాలను ఆహ్వానించగల ప్రజలు ఎందరో ఉన్నారని సావుల్ ద్వారా క్రైస్తవ మతం గ్రహించింది. యూదు మతంపట్ల పాక్షికంగా ఆకర్షితులైన ప్రజలకు చేరువ కావడానికి సావుల్ ఉద్దేశపూర్వకంగా బయల్దేరి వెళ్లాడు. క్రైస్తవ మతాన్ని స్వీకరించిన తర్వాత అతడు తన పేరును హిబ్రూ పదమైన సావుల్ నుండి రోమను పదమైన పౌల్‌గా మార్చుకున్నాడు. జెరుసలేంలో స్థిరపడ్డ జుదాయ క్రైస్తవుల ప్రతిఘటన నడుమ అతడు క్రైస్తవ మతం పక్షాన ఒక ప్రకటన చేశాడు. కొత్త మతాన్ని స్వీకరించడానికి సుంతి చేయించుకోవలసి అవసరం లేదని, ఆహార నియమాలు పాటించాల్సిన అవసరం లేదని పేర్కొన్నాడు. పరాజితులైన జెరుసలేం యూదులు విముక్తిని సాధించలేరని స్పష్టం చేశాడు.

చివరగా, ఆ కాలంలో పరిఢవిల్లిన అనేక మతపరమైన సాంప్రదాయాల నుండి భావాత్మక అంశాలను క్రైస్తవ మతం పుణికిపుచ్చుకుంది. ప్రజాభిమానం చూరగొన్న అదోని, ఓసిరి, తదితర మతాల్లో దేవుని ఉత్థానం, పునరుత్థాన సిద్ధాంతం ప్రబలంగా ఉండేది. దేవుడి జన్మ పునర్జన్మ ప్రపంచాన్ని పరిరక్షిస్తుందని అన్ని మతాలు ప్రబోధించేవి. (దేవుని పునరుత్థానం వసంత రుతువు ఆగమనాన్ని సూచిస్తుంది. క్రైస్తవులకు ఈస్టర్ దినం అలాంటి సూచికగా నిలిచింది) లూకే, మాథ్యూ ప్రవచనాల్లో పేర్కొనబడ్డ కన్యమేరీగాథ ఈజిప్టుకు చెందిన ఓసిరిని పురాణ గాథల్లోని అంశాలతో రూపొందించబడింది. ఈజిప్టు గాథ ప్రకారం ఓసిరి పరిశుద్ధమైన ఆవు నుండి జన్మించాడు. ఈజిప్టు మతంలో ప్రధాన పాత్ర పోషించిన ఐసిస్ అనే దేవతకు పవిత్ర మేరి పరిశుద్ధ స్వభావానికి చాలా దగ్గరి పోలికలు కనిపిస్తాయి. (అయితే లూకే, మాథ్యూ ప్రవచనాలు మాథ్యూ స్వంత వాదనతోనే విభేదిస్తాయి. ఒక కథనంలో మాథ్యూ జీసస్ వంశాన్ని అతడి తండ్రి జోసెఫ్ ద్వారా యూదుల రాజు డేవిడ్‌తో ముడిపెట్టాడు) ఐసిస్ దేవతను ఈజిప్టు ప్రజలు చాలా పవిత్రమైన సాధ్విగా, మానవాళిని ఎల్లప్పుడూ సంరక్షించే శక్తిగా, మానవ సమస్యలన్నింటినికీ మూలాధారంగా భావించేవారు. ఈ వర్ణనను క్రైస్తవ భక్తి గీతమైన "దేవుని మాతృమూర్తి"గా తిరగ రాయడానికి అంతగా శ్రమపడాల్సిన అవసరం లేకుండాపోయింది.

తొలి క్రైస్తవులు ఆ తర్వాత యూదు మత అంశాలను అన్వయించారు. ఈ అంశాలు కొత్త వారిని తమలో చేర్చుకోవడానికి యూదులకు ఎంతో సహకరించేవి. అయితే క్రైస్తవ మతం కఠినమైన నిబంధనలకు తిలోదకాలిచ్చింది. పౌరాణిక మతాలలో జనరంజకమైన అంశాలను జతపరిచింది. ఈ సవరణలు మత విస్తరణకు విజయసోపానాలయ్యాయి. అయితే తొలి క్రైస్తవులు తాము నమ్మని సిద్ధాంతాలను భావాత్మక అంశాలను అత్యంత చాకచక్యంగా మత విస్తరణకు వినియోగించుకున్నట్లు అర్థం [illegible]

అందుకు భిన్నంగా ఉంది. సామ్రాజ్యంలోని వివిధ నగరాలలో ప్రజలు ఎదుర్కొంటున్న అణచివేత, అభద్రతకు తీవ్రంగా స్పందించిన తొలి క్రైస్తవులు మతాన్ని క్రియాశీలంగా పాటించడం మొదలుపెట్టారు. ఆధ్యాత్మిక జీవితాన్ని సంపూర్ణంగా పాటించారు. ఈ కారణంగా ఇతరమతాల్లోని ప్రధానాంశాలను గ్రహించి చివరగా మిగిలిన జుదాయి మతాన్ని ఉద్ధరించారు. ఈ ప్రక్రియ లక్ష్యం పీడిత ప్రజల బాధలకు ఒక అర్థాన్ని ఇవ్వడమే. కొత్త నిబంధనలు అపోస్తలుగా వ్యవహరించిన వారిని కీర్తిస్తూ ఇలా వ్యాఖ్యానించింది : "వారు (అపోస్తలు) తమ నాలుకలతో మాట్లాడారు." దీనర్థం అపోస్తలు ఉద్వేగభరితమైన ప్రసంగాలు చేస్తూ తమ హృదయాంతర భావాలకు భాష్యం చెప్పేవారు. ఈ స్థితిలోనే వారు పాత మతాలలోని సద్గుణాలను తమ కొత్త మతంతో జత చేసి ఉంటారు.

కొత్త మతానికి అనుచరులెవరు? సామ్రాజ్యంలోని నిరుపేద వర్గాలే కొత్త మతానికి ఆధారంగా ఉండేవారు కాదు. అలాగే వ్యవసాయ పనులు చేసే బానిసలే అందులో ప్రధాన భాగంగా ఉండేవారు కాదు. ఎందుకంటే ఎస్సీన్స్ వలె తొలి దశలో క్రైస్తవం కూడా బానిసత్వాన్ని నిక్కచ్చిగా వ్యతిరేకించలేదు. పరిశుద్ధుడైన పౌల్ బానిసలు తమ యజమానులతోనే కలిసి ఉండాలని ప్రవచించగలిగాడు. బానిసలు క్రీస్తు అనుచరులైనా సరే తమ ధర్మాన్ని (యజమానికి సేవలందించడం) నిర్వర్తించాలని సూచించాడు. అయితే క్రైస్తవ మతమంతా రైతాంగంతోనే నిండి ఉండేది కాదు. ఎందుకంటే ఈ మతం పాలస్తీనా వెలుపల పట్టణాల ద్వారానే విస్తరించింది. ఇదే విషయాన్ని అపోస్తలుల చర్యలు కూడా స్పష్టం చేస్తాయి.

మతారాధకులంతా పట్టణాల్లో నివసించే మధ్య తరగతికి చెందిన వారేనని బోధపడుతోంది. ఈ వర్గం పాలకవర్గ కుటుంబాలకు కింది స్థాయిలో ఉండేది. అప్పటి పాలకవర్గాలు జనాభాలో కేవలం 0.2 శాతంగా ఉండేవి. వర్ధమాన దేశాల నగరాల తరహాలో ప్రాచీన నగరం చిన్న వ్యాపారులు, చేతివృత్తిదారులు, సాధారణ ఉద్యోగులు, కింది స్థాయి ఉద్యోగులను పెద్ద సంఖ్యలో కలిగి ఉండేది. ఈ విశాలమైన వర్గం భిక్షగాళ్లు, వేశ్యలు, బందిపోటు దొంగలతో కూడిన అరాచక కార్మిక వర్గంతో సహజీవనం చేసేది. అలాగే ఉన్నత స్థాయిలో ధనిక వ్యాపారులు, ఉన్నతాధికారుల చిన్న వర్గమొకటి ఉండేది. సమాజంలోని ఈ వర్గాలన్నీ వివిధ స్థాయిలలో సామ్రాజ్య ఒత్తిడిని, అణచివేతను ఎదుర్కొనేవి. అయితే సామ్రాజ్యాన్ని బహిరంగంగా ధిక్కరించే సాహసం చేయలేకపోయాయి. క్రైస్తవ మతం వారికో విముక్తి సందేశాన్ని అందించింది. స్వర్గం నుండి ఒక కొత్త ప్రపంచం వెలువడుతుందని, దానిని బహిరంగంగా సవాలు చేయాల్సిన అవసరముండదని హామీ ఇచ్చింది. మత సందేశం వ్యక్తిగత సమస్యలకు దారి తీసినా (బలిదానం) విముక్తిని అది త్వరితం చేస్తుందని అదే సమయంలో క్రైస్తవం ప్రబోధించింది.

పేద వృత్తిదారులు, చిన్న వ్యాపారులు అలాంటి సందేశంపట్ల ఆకర్షితులవడం ఖాయం. ఎందుకంటే యూదుల సినోగాగ్‌లాగ క్రైస్తవ మతం వారిని సామాజిక బంధనంలోకి తీసుకెళ్లి భౌతిక అభద్రతను ఎదుర్కోవడానికి తగిన ధైర్యం కల్పించ గలుగుతుంది. వేరే ప్రపంచం కోసం ఎదురు చూడకుండా జీవిత కాలంలోనే భౌతిక, ఆధ్యాత్మిక తృప్తి పొందడానికి అవకాశం

ఉంటుంది. మతంపట్ల ఆకర్షితులైన వారిలో కొందరు ధనికులు కూడా ఉన్నారు. ఒక అధ్యయనంలో పౌల్ కార్యకలాపాలకు ఆర్థిక సహకారం అందించిన 40 మంది వ్యక్తులను గుర్తించారు. వారంతా చేవ ఉన్నవారు, సాంస్కృతికంగా ఉన్నత వర్గానికి చెందిన వారు. అలాంటి వ్యక్తులు అపోస్తలుల ప్రవచనాలకు, మతపరమైన సమావేశాలకు ధన సహాయం అందించారు. తమ స్వంత ఇళ్లలో అధ్యాత్మిక సమావేశాలు నిర్వహించుకోవడానికి తొలి క్రైస్తవ బృందాలకు అనుమతినిచ్చారు. అలాంటి సంపన్నులను ఆకర్షించడానికి పౌల్ గట్టిగానే కృషి చేశాడు. "కొత్తగా మతాన్ని స్వీకరించిన వారిలో అత్యధికులు పేదలేనన్న విషయం పౌల్‌కు స్పష్టంగా తెలిసినా అతడు వ్యక్తిగతంగా ఉన్నత వర్గాలకు చెందిన వారినే పరిశుద్ధులను చేయడం గమనార్హం." క్రైస్తవ మతం మౌలికంగా పేదలనే ఆకర్షించి ఉండొచ్చు కాని తొలి దశ నుండి అది ధనికులను కూడా తనలో కలుపుకోవాలని తీవ్రంగా కృషి చేసింది. కాలం గడిచేకొద్దీ అది నిజమైన అధికారం, ధనబలం గలవారిని కూడా ఆకర్షించగలిగింది. ఈ వర్గం సెనేటర్ల అహంకారాన్ని భరించలేక క్రైస్తవ మతం వైపు మొగ్గు చూపింది. ధనిక వ్యాపారులు, స్వతంత్రులైన సంపన్న మహిళలు, బానిసత్వం నుండి విముక్తి పొందిన వారు (మాజీ బానిసలు, బానిసల సంతానం) చక్రవర్తి స్వంత కుటుంబానికి చెందిన ఉన్నతాధికారులు ఈ వర్గంలో ఉండేవారు.

తొలి రచనల నుండి కొత్త ప్రబోధనాన్ని రెండు, మూడవ శతాబ్దాలలో సంకలించారు. మతం విస్తరించిన కొద్దీ దాని సూత్రాలలో వచ్చిన మార్పులను కొత్త ప్రబోధనం అద్దం పడుతుంది.

దీనిని బట్టి ప్రతి పుటలో వైరుధ్యాలు ఎందుకు కనిపిస్తాయో మనకు బోధపడుతుంది. అయినప్పటికీ ఈ వైరుధ్యాలు వర్గ విభేదాలకు అతీతంగా ప్రజలను ఆకర్షించడానికి తోడ్పడ్డాయి. విప్లవాత్మకమైన తక్షణ చర్యలు అవసరమన్న భానవ, త్వరితంగా మార్పును చూడాలన్న ఆతృత ప్రజల్లో ఉండేది. జెరుసలేం విధ్వంసానికి ముందు పాలస్తీనాలోని యూదు తిరుగుబాటుదారుల అనుభవం నుండి అలాంటి ఆలోచనలు పుట్టాయి. ప్రజలలో గూడుకట్టుకున్న అసంతృప్తి 'ప్రళయం తప్పదన్న సిద్ధాంతం' ద్వారా బహిర్గతమయ్యేది. ప్రళయం తుచ్ఛ బాబిలోన్ (రోము అని దీనిని సులభంగా అర్థం చేసుకోవచ్చు)ను తుదముట్టించి పరిశుద్ధాత్మల రాజ్యాన్ని నెలకొల్పుతుందని ప్రజలు నమ్మేవారు. ధనిక, ఉన్నత వర్గాలు నశించిపోయి వారి స్థానంలో ప్రజలు ప్రపంచాన్ని పాలిస్తారని విశ్వాసం ప్రబలంగా ఉండేది. అయితే ఈ తీవ్ర పరిణామాన్ని భవిష్యత్ కాలానికి నిర్ధారించడం, ఆధ్యాత్మిక ప్రపంచానికి తీసుకెళ్లడంతో విప్లవ సందేశాన్ని నీరుగార్చినట్లయింది. అదే సమయంలో సామ్రాజ్యంపై వ్యతిరేకతను పెంచుకొని, నిజమైన విప్లవం సంభవించగలదని ఆందోళన చెందుతున్న ఉన్నత వర్గాలను క్రైస్తవ మతం ఆకర్షించగలిగింది. కొంత మంది బానిసలనుకలిగి ఉన్న వ్యాపారి లేదా కర్మాగార యజమానికి ఇలాంటి సందేశంతో ఎలాంటి ముప్పు ఉండేది కాదు. క్రైస్తవ సమాజంలో స్వాతంత్ర్యాన్ని ప్రబోధించిన ఆ సందేశం భౌతిక అంశాలలో కొంత ప్రభావం చూపవచ్చేమోకాని సామాజిక-ఆర్థిక-రాజకీయ రంగాలలో విప్లవాత్మకమైన మార్పులను మాత్రం తీసుకురాలేదన్న

అభిప్రాయం మధ్యతరగతి వర్గంలో ఉండేది. ఒంటె దూరగల సూది బెజ్జం వాస్తవంగా జెరుసలేం మహాద్వారమని, దాని గుండా ఆ పవిత్ర నగరంలోకి ప్రవేశించడం సాధ్యమేనని మతబోధకులు ధనికులకు పునర్విశ్వాసం ఇవ్వగలిగారు. ధనికురాలైన విధవ లేదా ధనిక రోమనుకు భార్య అయిన స్వతంత్ర మహిళ కొన్ని ప్రవచనాల కారణంగా మతంపట్ల ఆకర్షితులయ్యారు. పాల్ తన ప్రసంగాల్లో ఈ ప్రవచనాల సారాన్ని వివరిస్తూ దేవుని దృష్టిలో స్త్రీ పురుషులిద్దరూ సమానమేనని నొక్కి చెప్పేవాడు. అదే సమయంలో క్రైస్తవుడైన భర్తను ఓదారుస్తూ ఈ జన్మలో అతడికి సేవ చేయడానికే భార్య ఉందని నమ్మించేవాడు. ప్రతి మహిళ శిరస్సు వాస్తవానికి పురుషుని శిరస్సు అని కూడా బోధించేవాడు.

క్రైస్తవ సందేశం పేదలకు సాంత్వన ఇచ్చింది. తమ సాధారణ పుట్టుకవల్ల ఛీత్కారానికి గురైన మధ్యతరగతి వారికి ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చింది. తమ చుట్టూ ఉన్న ప్రపంచం తమపై తిరగబడుతోందని నిరంతరం ఆందోళన చెందే ధనిక వర్గంలో పశ్చాత్తాప భావనను పెంపొందించింది. కాని వారు తమ ధనాన్ని మాత్రం అట్లాగే అట్టి పెట్టుకున్నారు.

తొలి దశలో ఒక చిన్న పంథాగా అభివృద్ధి చెందిన క్రైస్తవం కాలక్రమంలో గణనీయమైన ప్రగతిని సాధించింది. యూదు మతం లాగా అది కూడా వ్యాపారులు, చేతివృత్తిదారులకు ప్రతి నగరంలోనూ సంబంధాలను అందించేది. వారాంతపు సమావేశాలు పేదలకు ధనికులతో కలిసిమెలిసి ప్రార్థనలు జరిపే అవకాశాన్ని, సంతోషాన్ని కల్పించేవి. అలాగే వ్యాపార లావాదేవీలపై సమాచారాన్ని పంచుకునే అవకాశాన్ని ధనిక వ్యాపారులకు ఇచ్చేవి. వాణిజ్య మార్గాలు, పరిపాలనా కేంద్రాలలో విస్తరిస్తూ వచ్చిన క్రైస్తవ మతం అనతి కాలంలోనే రోమను సామ్రాజ్యానికి ప్రతిబింబంగా మారింది. వాణిజ్య మార్గాలు, పరిపాలనా కేంద్రాలనే సామ్రాజ్యాన్ని సుస్థిరంగా ఉంచేవి. ఈ కారణంగా సామ్రాజ్యంతో సమానంగా క్రైస్తవం తన ప్రభావాన్ని పెంచుకుంది. ఈ వాణిజ్య మార్గాల ద్వారానే సామ్రాజ్య ప్రాబల్యం లేని కొత్త ప్రాంతాలకు కూడా విస్తరించింది. ఆ విధంగా ఆర్మేనియా, పర్షియన్ మెసొపొటామియా, ఇథోపియా, దక్షిణ అరేబియా, చివరకు దక్షిణ భారతానికి కూడా క్రైస్తవ మతబోధకులు చేరుకోగలిగారు, మతాన్ని విస్తరించగలిగారు.

విస్తరణతో సమానంగా మతం సంస్థాగత స్వరూపాన్ని సంతరించుకుంది. తొలి అపోస్తలులకు తాముచేసే ప్రసంగాలపై స్వీయ నియంత్రణ ఉండేది కాదు. ఆహార, వసతి సౌకర్యం కోసం స్థానిక మద్దతుదారుల దాతృత్వంపై ఆధారపడేవారు. ఒకనగరం తర్వాత మరో నగరాన్ని వారు వరుసగా సందర్శించేవారు. అయితే మత బోధకులు, మతారాధకుల సంఖ్య పెరిగే కొద్దీ ప్రతి నగరంలోనూ నిధుల సేకరణ, మత సంస్థల నిర్వహణే ప్రధాన వ్యాపకంగా మారింది. నకిలీ ప్రవక్తల బెడద కూడా ఎక్కువైంది. వీరు ప్రజల ఆతిథ్యాన్ని దుర్వినియోగం చేసేవారు.

స్థానిక బృందాలకు నిధుల సేకరణ కేంద్రీకరణ, సంస్థాగత పరిపాలనను డీకాన్‌లకు అప్పగించడమే పరిష్కార మార్గంగా ఉండేది. డీకాన్‌ల పనితీరును ప్రెస్‌బిటర్‌లు, బిషప్‌లు పర్యవేక్షించేవారు. చాడ్విక్ ప్రకారం రెండు తరాలలోపే బిషప్‌లు, ప్రెస్‌బిటర్‌లు, డీకాన్‌ల

ఉన్నత స్థాయి పరిపాలనా వర్గం ఏర్పడింది. పాలనలో అపోస్తలుల పాత్ర నామమాత్రంగా కూడా ఉండేది కాదు. ప్రవక్తలకు సంస్థల నిర్వహణాలో ఎలాంటి పాత్ర లభించలేదు. తొలుత బిషప్‌లను సాధారణ క్రైస్తవులే ఎన్నుకునే వారు. తర్వాత బోధకులే నియామక అధికారాలను హస్తగతం చేసుకున్నారు. అదే సమయంలో బిషప్‌ల సమావేశాలు ఏది సరైన సిద్ధాంతమో, దానిని ఎవరు బోధించాలో నిర్ధారించడం మొదలుపెట్టాయి.

దుష్టత్వం ఎక్కడి నుండి ఉద్భవించిందనే అంశంపై వివాదం చెలరేగడంతో ఈ ప్రక్రియ (పాలనా వ్యవహారాల) ఊపందుకుంది. అయితే ఈ ప్రక్రియ ఆచరణలో తీవ్ర పరిణామాలకు దారి తీసింది. దేవుడు ఒక్కడనేని, అతడే ప్రపంచాన్ని సృష్టించాడని క్రైస్తవ మత శాస్త్రం మొదటి నుండి బోధిస్తూ వచ్చింది. దీనర్థం దేవుడు మంచి, చెడు రెండింటినీ సృష్టించాడని భావించాల్సి ఉంటుంది. దేవుడిని, మంచిని సమదృష్టితో చూసే విశ్వాసులను ఈ నిర్ధారణ ఆందోళనకు గురి చేసింది. ఈ వివాదం తీవ్రతను తగ్గించే ఉద్దేశంతో సాంప్రదాయ క్రైస్తవం దేవుడు, చెడుల మధ్య కొత్త పాత్రలను సృష్టించింది. వాటిలో బహిష్కరణకు గురైన దేవ కన్యలు, రాక్షసులు, ద్రోహచింతన కలిగిన మానవులు ఉన్నారు. అయితే ఈ వివరణ సంతృప్తికరంగా లేకపోవడంతో దేవుడికే అన్ని విషయాలు తెలుసునని, మానవులకు ఊహకు అలాంటి అంశాలు అందవని సాంప్రదాయవాదులు సూత్రీకరించారు. దేవుడు సర్వాంతర్యామి అని, అతడి అవగాహన మానవుల కంటే చాలా అపారమైనదని వారు నమ్మబలికారు.

అయితే ఎంతో తార్కికమైన జవాబు ఒకటుండేది. విశ్వంలో రెండు ప్రధాన శక్తుల మధ్య నిరంతరం సంఘర్షణ జరుగుతూ ఉందని, ఒక శక్తి మంచికి ప్రాతినిధ్యం వహిస్తే మరో శక్తి చెడుకు సారథ్యం వహించేదని చెప్పడమే ఆ తర్కం. గ్నాస్టికులు ఈ సమాధానాన్ని పాక్షికంగానైనా వివరించగలిగారు. ఆత్మ పరిశుద్ధమైనదని, భౌతిక ప్రపంచం, మానవ దేహం దుష్టమైనవని వారు చెప్పారు. ప్రాపంచిక విషయాల నుండి తమ ఆత్మలను విముక్తి చేసినప్పుడే క్రైస్తవులు పరిశుద్ధులు కాగలరని సూచించారు. అయితే ఈ వివరణ పూర్తిగా మౌలికమైన నిర్ధారణ కాదు. దానిని కొత్త నిబంధనలలోని అనేక వ్యాసాలలో వివిధ రకాలుగా అన్వయించారు. అయితే మతాధిపతులకు ఆందోళన కలిగించే రీతిలో అది ప్రతికూల ప్రభావాన్ని చూపింది. విజ్ఞత ఒక్కటే పరిశుద్ధమైనదైతే భౌతిక ప్రపంచాన్ని త్యజించిన వారే పరిశుద్ధమైన క్రైస్తవులవుతారు. ముఖ్యంగా తమను తాము క్షోభ పెట్టుకొని, దారిద్ర్యంలో జీవించే దైవ పిపాసులే నిజమైన క్రైస్తవులుగా పరిగణించబడాలి. కాని మానవాళినంతటిని మత ప్రబోధనం వైపు ఆకర్షించడానికి లేదా స్థానిక చర్చికి ధనికుల నుండి విరాళాలు సేకరించడానికి ఈ సూత్రీకరణ ఎందుకు దోహదపడదు. దారుణమైన విషయమేమిటంటే గ్నాస్టికులు అంతకంటే తీవ్రమైన నిర్ధారణకు వచ్చారు. "బుద్ధి ఒక్కటే స్వచ్ఛమైనదైతే దేహం ఏమి చేసినా పట్టించుకోవలసిన అవసరం లేదు. ఎందుకంటే మానవ దేహం చేసే కార్యకలాపాలన్నీ అపవిత్రమైనవి" వీరి నినాదాన్ని మంచి వారు వక్రీకరించారు. తాముచేసే కార్యాలన్నీ మంచివేనన్న భావనను వారు పెంచుకున్నారు. తాము అనుభవించగలిగినంతా విలాసంగా జీవించడానికి వారికి ఆ నినాదం అనుమతించింద. ఇతరులు, ముఖ్యంగా ధనికులు, వస్తువులను అపరిశుద్ధం చేయడానికి,

మత పెద్దలకు దిగ్భ్రాంతి గొలిపే రీతిలో మలిన శృంగారానికి పాల్పడడానికి స్వేచ్ఛ లభించింది.

క్రైస్తవ సామూహిక సమావేశాల్లో ఈ అంశంపై దశాబ్దాల తరబడి సంఘర్షణ చోటు చేసుకుంది. అపోస్తలుల వారసులమైన తమకే మత సిద్ధాంతాలపై వివాదాలను పరిష్కరించే సామర్థ్యం ఉందని బిషప్‌లు వాదించడంతో ఆ వివాదానికి తెర పడింది. అయితే మూడవ శతాబ్దంలో మళ్లీ వాద ప్రతివాదనలు మొదలయ్యాయి. సిరియాకు చెందిన సాంప్రదాయ క్రైస్తవం, బౌద్ధం, పర్షియన్ జొరాస్ట్రేనిజం నుండి మౌలికాంశాలను తీసుకొని కొత్త మతాన్ని స్థాపించడానికి (మానిషీజం) సన్నాహాలు మొదలుపెట్టడంతో వివాదం మళ్లీ మొదటికొచ్చింది. ఒక దశలో ఈ కొత్త మతం హిప్పోకు చెందిన అగస్టైన్‌ను కూడా తన వైపు తిప్పుకుంది. తర్వాతి కాలంలో ప్రధానమంత్రి క్రైస్తవ చింతనలో అగస్టైన్ ప్రముఖ వ్యక్తిగా అవతరించాడు. ఇలాంటి దైవ దూషణలకు వ్యతిరేకంగా చేపట్టిన పోరాటంలో చర్చి పాలకవర్గం పాలనా నిర్వహణ నుండి సైద్ధాంతిక నియంత్రణ వైపు మళ్లారు. వ్యవస్థీకృత చర్చిలన్నీ ఆ సిద్ధాంతాలను పాటించడానికి అనుమతించారు. అలా చేయడం ద్వారా బైబిల్‌లోని వైరుధ్యాలు వేరే పంథాలకు, తిరుగుబాటు భావనలకు తావివ్వకుండా అడ్డుకున్నారు. వ్యతిరేక భావనలు ధనికులైన క్రైస్తవులను అసంతృప్తికి గురి చేయగలవన్న ఆందోళనతోనే మత పెద్దలు ఆ విధంగా నిర్ణయం తీసుకున్నారు.

రోమను సామ్రాజ్యానికి పాక్షిక ప్రతిబింబంగా క్రైస్తవ మతముంటే, మత పెద్దలు సామ్రాజ్య అధికార యంత్రాంగానికి ప్రతిరూపంగా ఎదిగారు. సామ్రాజ్య వ్యవస్థతో సమానంగా అన్ని నగరాలలో పాలనా వ్యవస్థలను ఏర్పాటు చేశారు. అయితే అధికార యంత్రాంగానికి ప్రతి రూపమైన మత పెద్దలు సామ్రాజ్యం కూడా అందించలేని సేవలను నగర ప్రజలకు అందించగలిగారు. మతపరమైన సముదాయమనే తీవ్రమైన భావన మూడవ శతాబ్దం చివరలో తలెత్తిన సంక్షోభంలో సైతం మతపెద్దల యంత్రాంగాన్ని ప్రతి పట్టణంలోనూ స్థిరంగా ఉంచగలిగింది. ప్లేగువ్యాధి లేదా ఘర్షణలు చెలరేగినపుడు క్రైస్తవ మతపెద్దలు ఒక్కరే పట్టణంలో సమైక్యంగా నిలబడి బాధితులకు ఆహార సరఫరాలను అందించేవారు. దహన సంస్కారాలు నిర్వహించేవారు. 250 సంవత్సరంలో రోమను పౌరునిగా ఉండడం కంటే క్రైస్తవునిగా వ్యవహరించడం వల్లే తోటి విశ్వాసుల రక్షణ లభించేది.

ఈ సమయానికి చర్చి ప్రభావాన్ని, అనుచరగణాన్ని నిలువరించగల మార్గాలు రెండే రెండుండేవి. మొదటిది రాజ్య అణచివేత, రెండవది మతంలోని అంతర్గత అసమ్మతి.

క్రైస్తవ మత సమర్థకులు 'అణచివేత, హింసను ఎదుర్కొని ఆ మతం నిలదొక్కుకోవడాన్ని' ఎప్పుడూ గొప్పగా చేసి చూపుతుంటారు. తమ మతం కోసం ప్రాణాలను త్యాగం చేసిన వారిని పునీతులుగా కొలిచేవారు. వీరిని అద్భుతాలు చూపిన ప్రవక్తలతో సమానంగా ఆరాధించేవారు. తొలినాళ్లలో చర్చిపై అణచివేత అక్కడక్కడా చెల్లాచెదురుగా ఉండేది. రోము నగరం తగలబడిన తర్వాత నీరో చక్రవర్తి అప్పటి కొందరు రోమను క్రైస్తవులను బలిపశువులను చేశాడు. అయితే ఆ అణచివేత ప్రక్రియ నీరో హతాన్మరణం కంటే ఎక్కువ కాలం కొనసాగలేదు. శత్రుభావం పెంచుకున్న ప్రాంతీయ పాలకులు (గవర్నర్లు) కూ కొందరు క్రైస్తవులను పీడించేవారు. చాలా సందర్భాల్లో మత విశ్వాసులను కారాగారానిక

పంపేవారు లేదా మరణశిక్షను విధించేవారు. సామ్రాజ్య సాంస్కృతిక పంథాను వ్యతిరేకించే వారు ఇలాంటి అణచివేతకు గురయ్యేవారు. కాని సామ్రాజ్య అధికారులు చాలా వరకు సంయమనంతో వ్యవహరించేవారు. సామ్రాజ్య వ్యవస్థతో సమాంతరంగా విస్తరిస్తున్న క్రైస్తవ మతాన్ని, మత సంస్థలను సహించేవారు. మూడవ శతాబ్దంలోనైతే అలెగ్జాండర్ సెవెరస్, ఫిలిప్ (అరబ్) లాంటి చక్రవర్తులు చర్చికి అనుకూలంగా ఉండేవారు.

అయితే మూడవ శతాబ్దం చివరి నాటికి చర్చికి అపారమైన ప్రాబల్యం సమకూరింది. చర్చి వ్యవస్థను పాలకులు విస్మరించలేనంతగా పరిస్థితులు ఏర్పడ్డాయి. సమాంతర వ్యవస్థను విచ్ఛిన్నం చేయడమో లేదా దానితో సహకరించడమో తప్ప చక్రవర్తులకు మరో ప్రత్యామ్నాయం ఉండేది కాదు. సామ్రాజ్య అధికార యంత్రాంగాన్ని ప్రభావితం చేయగల స్థాయికి చేరుకున్న చర్చిని అదుపులో పెట్టడానికి సమయం ఆసన్నమైందని మాక్సిమస్ భావించాడు. 284 సంవత్సరం తర్వాత చక్రవర్తిగా బాధ్యతలు చేపట్టిన డయోక్లెషియన్ ఇంకో అడుగు ముందుకు వెళ్లాడు. సాయుధ దళాల సమగ్రతకు క్రైస్తవ మతం ముప్పుగా పరిణమించిందని అతడు బలంగా నమ్మాడు. అందుకు ప్రతిగా నికొడేమియాలోని తన రాజభవనానికి ఎదురుగా ఉన్న కేథడ్రల్‌ను కూల్చి వేయించాడు. సామ్రాజ్యంలోని అన్ని చర్చిలను ధ్వంసం చేయాలని, మతాధికారులందరినీ నిర్బంధించాలని, దేవతలకు బలి ఇవ్వని వారికి మరణ దండన విధించాలని ఆదేశిస్తూ రాజశాసనాన్ని జారీ చేశాడు. ఈశాన్య సామ్రాజ్యంలో అలా అణచివేత తీవ్రస్థాయిలో జరిగింది.

అయితే, అప్పటికే పరిస్థితి చేయిదాటిపోవడంతో అణచివేత, హింసకు పాల్పడినా గణనీయమైన మార్పు అంటూ ఏదీ రాలేదు. పశ్చిమ ప్రాంత పాలకుడు కాంస్టంటియస్ డయోక్లెషియన్ ఆదేశాలను నామమాత్రంగానే అమలు చేశాడు. అతడి వారసుడు కాంస్టంటైన్ చర్చి సహాయంతో 312లో ఆధిపత్య పోరుకు సిద్ధమయ్యాడు. తనను తాను ఒక క్రైస్తవునిగా కాంస్టంటైన్ భావించేవాడు. అంతకు ముందు అతడు సూర్యుడిని కొలిచేవాడు. క్రైస్తవులు కూడా కాంస్టంటైన్‌ను తమలో ఒకనిగా పరిగణించేవారు. కాంస్టంటైన్ వ్యక్తిగత నడవడికపై వారికి ఎలాంటి ఆందోళన ఉండేది కాదు. చక్రవర్తిది క్రూర స్వభావం. తన స్వంత కొడుకును స్నానఘట్టంలో ముంచివేశాడు, భార్యను హత్య చేయించాడు. మరణశయ్యపై చేరేంత వరకు బాప్టయిజ్ కాకుండా యధేచ్ఛగా పాపాలకు పాల్పడ్డాడు. అణచివేత ఆగిపోగానే క్రైస్తవులు ఎనలేని ప్రాబల్యాన్ని సంతరించుకున్నారు. అవిశ్వాసులను వెంటాడే స్థితికి చేరుకున్నారు. స్వంత మతంలోని అసమ్మతి వర్గాలను తీవ్రంగా అణచివేశారు.

సామ్రాజ్యాన్ని తన ప్రభావ సీమలో పూర్తిగా చేర్చుకోవడానికి కొన్ని సంవత్సరాల ముందు చర్చిని ఇబ్బంది పెట్టే విధంగా దైవ దూషణలు బయల్దేరాయి. కాని ఒక్కసారి సామ్రాజ్య పరిపాలనా వ్యవస్థ అంతా చర్చికి మద్దతుగా నిలబడగానే పరిస్థితి మారిపోయింది. చర్చిని ధిక్కరించే వారు సామ్రాజ్యాన్నే ధిక్కరిస్తున్నవారిగా పరిగణించబడ్డారు. క్రైస్తవ మతాన్ని స్వీకరించిన కాంస్టంటైన్ అనతికాలంలోనే మత వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం ప్రారంభించాడు. తన ఆజ్ఞలకు లోబడి నడుచుకోని బిషప్‌లను కారాగారానికి పంపేవాడు లేదా సామ్రాజ్యం నుండి

బహిష్కరించేవాడు. అతడి వారసులు కూడా అదే పంథాను అనుసరించారు. మత పెద్దల్లో చీలికను ఆసరా చేసుకొని వంతుల వారీగా ఆయా వర్గాలకు మద్దతునిస్తూ అరాచకాన్ని సృష్టించారు. ఈజిప్టు బిషప్ అథనాసియస్ ఈ విధానం కారణంగా ఐదుసార్లు తొలగింపునకు గురయ్యాడు. మరలా నియమించబడ్డాడు. కేవలం జులియాన్ చక్రవర్తి మాత్రమే ఈ వివాదాలకు దూరంగా ఉండేవాడు. క్రైస్తవ మతంలోని అన్ని పంథాలను అతడు సహించేవాడు. పై వర్గాలు తమలో తాము కలహించుకొని పతనమైన తర్వాత విగ్రహారాధనను పునరుద్ధరించవచ్చన్న నమ్మకంతోనే జులియాన్ తటస్థంగా ఉండిపోయాడు.

సామ్రాజ్యాన్ని పూర్తిగా లొంగదీసుకొనే చివరి దశలో క్రైస్తవ మతంలో మరో ముఖ్యమైన పరిణామం సంభవించింది. ఆ దశలో మతతత్వం ఆవిర్భవించింది. ఒకవైపు చర్చి విజయవంతంగా ముందుకు దూసుకెళ్తుంటే మరోవైపు ప్రజల్లో అసంతృప్తి నిరంతరంగా గూడుకట్టుకుంది. పరిశుద్ధత, పేదరికం అనే సందేశం నుండి చర్చి దూరంగా జరుగుతోందన్న భావన ప్రజలలో బలపడింది. బిషప్‌లు ఇప్పుడు బలమైన వ్యక్తులుగా ఎదిగారు. విశాలమైన భవంతుల్లో నివసించడం మొదలుపెట్టారు. అధికార, ధనబలం ఉన్నవారితోనే ఎక్కువగా కలిసి తిరగడం ప్రారంభించారు. ఒకప్పుడు పేదలతో సన్నిహితంగా మెలిగే బిషప్‌లు (చర్చి ప్రార్థనల సమయంలో) వారిని పూర్తిగా విస్మరించారు. తొలుత ఈజిప్టులో ప్రజా ఉద్యమం బయల్దేరింది. చర్చి తొలి దశలో సాధించిన విజయాలను కాపాడుకోవాలంటే విముక్తి పథాన్ని అనుసరించక తప్పదని వారు నిర్ణయించారు. బిషప్‌ల భౌతిక విజయాలకు దూరంగా జరగడమే మేలని భావించారు. పట్టణాలను వదలి ఎడారులకు బయల్దేరారు. సానుభూతిపరులు అందజేసే రొట్టెలు, నీరుపై ఆధారపడి జీవించడం ప్రారంభించారు. శృంగారానికి దూరంగా ఉంటూ సాత్వికమైన జీవితాన్ని (కొన్నిసార్లు మాసిపోయిన చిరిగిపోయిన వస్త్రాలను ధరించేవారు) అవలంబించారు. వీరిని సన్యాసులుగా పరిగణించేవారు. దుర్భరమైన, కష్టాలతో కూడుకున్న జీవితాన్ని ఎన్నుకోవడం ద్వారా పాపాలకు దూరంగా ఉండవచ్చని ఈ సన్యాసులు నమ్మారు. అలాంటి జీవన విధానాన్ని అనుసరించడం ద్వారా ప్రపంచాన్ని పరిరక్షించవచ్చని జీసస్ కూడా నిరూపించి ఉన్నాడు. సన్యాసుల నైతిక వర్తనం ఇతర విశ్వాసులకు స్ఫూర్తినిచ్చింది. వారు సన్యాసులను గౌరవభావంతో చూసేవారు. విలాసవంతమైన జీవితాన్ని అనుభవిస్తున్న బిషప్‌లను అనుసరించడం కంటే మత ప్రవచనాలను కఠినంగా అనుసరించడమే ముక్తికి మార్గమని విశ్వాసులు భావించారు.

ఈ ఉద్యమానికి మతాన్ని విచ్ఛిన్నం చేసే సామర్థ్యం ఉండేది. సామ్రాజ్యం, సంపన్న వర్గాలకు వ్యతిరేకంగా ఒక ప్రవక్త ద్వారా దైవ ప్రవచనాలను వల్లించే ప్రమాదం ఎక్కువగా ఉండేది. అయితే వ్యవస్థలో ఈ ఉద్యమాన్ని అంతర్భాగం చేయడానికి ఎంతో సమయం పట్టలేదు. సన్యాసులు సమావేశం కావడం మొదలుపెట్టారు. సౌకర్యంగా ఉంటుందనే కారణంతో వారు బృందాలుగా సమీకృతమయ్యారు. కఠినమైన క్రమశిక్షణతో కలిసి శ్రమించాలని నిర్ణయించడానికి ఈ వ్యవస్థీకరణ తొలి మెట్టుగా ఉపయోగపడింది. సిజేరియాకు చెందిన బాసిల్ ఈ పంథాను మరింత అభివృద్ధి పరిచాడు. సిద్ధాంతాలతోపాటు క్రమశిక్షణతో కూడిన

పరి(శమ, వ్యక్తిగత త్యాగనిరతిని మత పెద్దకు ధారాదత్తం చేయడంలాంటి నియమాలను రూపొందించాడు. బాసిల్ వారసులు అనతి కాలంలోనే కండబలంపై ఆధారపడసాగారు. భిన్నమైన ఆలోచనలు గల క్రైస్తవులను హింసించడం మొదలుపెట్టారు.

అయితే, మతతత్వం మరో దీర్ఘకాలిక పరిణామానికి దారి తీసింది. అపారమైన భక్తిభావాలు గల అనుచరులు (సన్యాసులు) శ్రమశక్తిని పెద్దఎత్తున అందించేవారు. ఫలితంగా మఠాలు సంక్షోభాలు, సంఘర్షణల సమయంలో కూడా వైరి వర్గాల నుండి సురక్షితంగా ఉండగలిగాయి. ఆ సమయంలోనే పశ్చిమ ప్రాంతంలో సామ్రాజ్యం పతనమైంది. మఠాలు విద్వాంసుల స్థావరాలుగా మారాయి. తమ చుట్టూ సామ్రాజ్యం కూలిపోతూ ఉంటే విద్యావంతులు ఈ మఠాల్లో సురక్షితంగా ఉండగలిగారు. లౌకికవాద గ్రంథాలయాలు, అధ్యయన కేంద్రాలు అగ్నికి ఆహుతైనా కొన్ని మత గ్రంథాలయాలు స్థిరంగా ఉండగలిగాయి. గ్రంథాలను పుటలుపుటలుగా తిరిగి రాయడం, వాటి నకళ్లను సృష్టించడం మతపరమైన బాధ్యతగా గ్రంథాలయ నిర్వాహకులు భావించారు. అదే సమయంలో కొన్ని దైవదూషణ గ్రంథాలను కూడా సృష్టించారు. సామ్రాజ్యం విచ్ఛిన్నమవుతున్న దశలో హింస, అరాచకం నుండి తప్పించుకోవడానికి సాధారణ రైతులు పెద్ద సంఖ్యలో ఈ మఠాలలో చేరారు. కఠిన శ్రమ ద్వారా సన్యాసులకు పని తప్పించారు. ప్రార్థనలు, మత విద్యను అభ్యసించడానికి సన్యాసులు పరిమితమయ్యారు లేదా సోమరులుగా ఉండిపోయేవారు. ఏదేమైనా, కుళ్లిపోయిన సమాజానికి దూరంగా ఆధ్యాత్మిక కేంద్రాలుగా ప్రారంభమైన మఠాలు, చర్చిలు కొన్ని శతాబ్దాల కాలంలోనే శక్తివంతమైన అధికార కేంద్రాలుగా ఎదిగాయి. (అప్పటికే పశ్చిమ ప్రాంతంలో సామ్రాజ్యం పతనమైపోయింది.) బిషప్‌ల వ్యవస్థతో సమన్వయం కుదుర్చుకొని సమాజంలో ప్రాబల్యంగల శక్తులుగా రూపాంతరం చెందాయి. తర్వాతి వెయ్యేళ్ల వరకు అధికారం, ధనం కోసం పోపు ఆధ్వర్యంలోని బిషప్‌లు వ్యవస్థ సుదీర్ఘంగా పోరాడింది. విశాలమైన శ్రమశక్తి కలిగిన మఠాలు అదనపు నిల్వలను సమకూర్చుకున్నాయి. ఈ ప్రక్రియ పశ్చిమ ఐరోపా ప్రాంతమంతటా సంభవించింది.

# పరిణామక్రమం

***క్రీ.శ.600-900 :***

ఐరోపాలో చీకటి యుగాలు. వాణిజ్య పతనం. రోమను తరహా సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేయడానికి ఫ్రాంక్‌ల విఫలయత్నం (800-814లో చార్లీ మాగ్నె సామ్రాజ్యాన్ని స్థాపించడానికి ప్రయత్నించాడు) 800-900 మధ్య నోర్స్‌మెన్‌ల దురాక్రమణలు.

భారతదేశంలో భూస్వామ్య వ్యవస్థ. క్షీణించిన వాణిజ్యం గ్రామాల్లో బ్రాహ్మణుల ఆధిపత్యం, వర్ణ వ్యవస్థ.

బైజాంటిన్ సామ్రాజ్యంలో సంక్షోభం. ఈజిప్టు, సిరియా, మెసొపొటామియా, బాల్కన్లను కోల్పోయిన సామ్రాజ్యం. స్తంభించిపోయిన ఆర్థిక, సాంకేతికాభివృద్ధి.

మక్కాను స్వాధీనం చేసుకున్న మహమ్మద్ (630). పశ్చిమాసియా ప్రాంతాన్ని చాలా వరకు ఆక్రమించిన ఇస్లామిక్ అరబ్ సైన్యాలు(640), కాబుల్ స్వాధీనం (664), స్పెయిన్ దండయాత్ర (711). 750లో అబ్బాసిద్ విప్లవం, పెరిగిన వ్యాపారుల రాజకీయ ప్రాముఖ్యత. వాణిజ్య, చేతివృత్తి పరిశ్రమల పురోగతి. ఉన్నత శిఖరానికి చేరుకున్న ఇస్లామిక్ సంస్కృతి. గ్రీకు గ్రంథాల అనువాదం. శాస్త్రాలు, గణితంలో పురోగతి. ఇస్లామిక్ మహా మేధావుల (తత్త్వవేత్తలు) ప్రాబల్యం.

వరిని పండించే యాంగ్జీ ప్రాంతానికి తరలిన చైనా నాగరికత కేంద్రం. పరిశ్రమ, వాణిజ్యాల పునరుద్ధరణ, బౌద్ధమత వికాసం, శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రగతి.

పశ్చిమ ఆఫ్రికా, ఈశాన్య ఆఫ్రికా తీర ప్రాంతాలలో నాగరికతల అభివృద్ధి.

***పదవ, 11వ శతాబ్దాలు :***

ఐరోపాలో వ్యవసాయం, వాణిజ్యాల పునరుద్ధరణ. అధునాతన ఉత్పత్తి పద్ధతుల వినియోగం. బానిసత్వం స్థానంలో రైతుల వెట్టి.

ముస్లిం అబ్బాసిద్ సామ్రాజ్యం విభజన, స్తంభించిన ఆర్థిక ప్రగతి. ఇస్లాంలో అంతరార్థ, మాంత్రిక పంథాల ఆవిర్భావం. ఈజిప్టులో ఫాతిమిద్ వంశ స్థాపన.

బాల్కన్స్‌లో కొంత భాగాన్ని ఆక్రమించిన బైజాంటియమ్, కొనసాగిన శాస్త్రసాంకేతిక స్తబ్ధత. ఇస్లాం మతాన్ని, అరబ్ లిపిని స్వీకరించిన పశ్చిమ ఆఫ్రికా నాగరికతలు. సంగ్ వంశం (960-1279) పాలనలో ఉచ్ఛస్థాయికి చేరుకున్న చైనా నాగరికత. కాగితం తయారీ, ముద్రణ, మందుగుండు, యాంత్రిక గడియారాలు, దిక్సూచిలను కనుగొన్న చైనీయులు. పెరిగిన వ్యాపారుల ప్రాధాన్యత, ప్రభావం.

***12వ, 13వ శతాబ్దాలు :***

ఇస్లామిక్ మెసొపొటామియాలో సంక్షోభం.

రెండుగా చీలిన చైనా సామ్రాజ్యం (సంగ్, చిన్ సామ్రాజ్యాలు)

పోలండ్ నుండి కొరియా వరకు యురేషియాను ధ్వంసం చేసిన మంగోలు రైతాంగ దళాలు.

బాగ్దాద్ విధ్వంసం (1258). ఆక్రమణకు గురైన చైనా (1279)

పశ్చిమం వైపు నుండి ఇస్లామిక్ సామ్రాజ్యంపై దాడి చేసిన పశ్చిమ ఐరోపా క్రూసేడర్లు. జెరుసలేం స్వాధీనం (1099-1187), బైజాంటియమ్ దోపిడీ (1204).

మధ్య ఆసియా ఇస్లామిక్ ప్రజల దండయాత్రతో స్వాధీనమైన ఉత్తర భారతం.

మళ్లీ పుంజుకున్న వాణిజ్యం, మారకద్రవ్య వినియోగం.

ఐరోపాలో వ్యవసాయ దిగుబడి, జనాభా, వాణిజ్యం, హస్తకళాకృతుల పరిశ్రమల అభివృద్ధి. విస్తరించిన నీటి చక్రాలు. చర్చిల నిర్మాణం. ఇస్లామిక్ స్పెయిన్ పరిచయంతో బయల్పడిన గ్రీకు, లాటిన్ గ్రంథాలు. తొలి ఐరోపా విశ్వవిద్యాలయాలు. చైనాలో కనుగొన్న సాంకేతిక పద్ధతుల వినియోగం. పెరిగిన ఇటలీ నగర రాజ్యాలు. డాంటే (జననం : 1265) ఇటాలియన్ రచనలు. ఈజిప్టులో అధికారాన్ని హస్తగతం చేసుకున్న బానిస దళాలు (మామ్లూక్‌లు). పశ్చిమ ఆఫ్రికాలో మాలి రాజ్య ఆవిర్భావం. ఇస్లామిక్ అధ్యయన కేంద్రంగా తింబుక్తూ.

***14వ శతాబ్దం :***

తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొన్న ఐరోపా భూస్వామ్య వ్యవస్థ. ఫ్లాండర్స్, ఫ్రాన్స్, ఇంగ్లాండ్, వేల్స్, ఉత్తర ఇటలీలలో కరువు, ప్లేగు, తిరుగుబాట్లు. ప్రత్యర్థి పోప్‌లు. ఇంగ్లాండ్-ఫ్రాన్స్ మధ్య వందేళ్ల యుద్ధం.

చైనాలో ఆకలి చావులు, ప్లేగు వ్యాధి. చైనాలో మంగోలులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన ఎర్రతలపాగధారులు. చైనాలో మింగ్ వంశస్థాపన. వ్యవసాయ పునరుద్ధరణ.

ఆసియా మైనర్‌ను స్వాధీనం చేసుకోవడం ప్రారంభించిన ఒట్టోమన్ టర్కులు.

మహా జింబాబ్వే నిర్మాణం.

టెనోచ్ టిట్లాన్‌ను కనుగొన్న అజ్టెక్ ప్రజలు.

*15వ శతాబ్దం :*

చైనాలో మరోసారి పుంజుకున్న ఆర్థికాభివృద్ధి వేలాది మైళ్ల దూరంలో ఉన్న ఈశాన్య ఆఫ్రికా తీరానికి బయల్దేరిన చైనా ఓడలు.

మెక్సికోలో అజ్టెక్ సామ్రాజ్యం.

1483 తర్వాత ఆండియాన్ ప్రాంతమంతటిని స్వాధీనం చేసుకున్న ఇంకాలు.

పశ్చిమ ఆఫ్రికాలో బెనిన్ ఆవిర్భావం.

పశ్చిమ ఐరోపాలో నెమ్మదిగా పుంజుకున్న జనాభా సంఖ్య, ఆర్థిక ప్రగతి.

క్షీణించిన రైతుల వెట్టి.

విస్తరించిన మార్కెట్ సంబంధాలు.

ముద్రణ ప్రారంభం.

ఉత్తర ఇటలీలో విద్య, కళ, శాస్త్రాల పునరుజ్జీవనం

మెరుగుపడిన నౌకాయాన పద్ధతులు, ఓడ నిర్మాణం.

పశ్చిమ ఆఫ్రికా తీరానికి బయల్దేరి కేప్ ఆఫ్ గుడ్ హోప్‌కు చేరుకున్న పోర్చుగీసులు.

1492లో గ్రనడా గ్రామీణ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్న స్పెయిన్ పాలకులు.

1493లో అట్లాంటిక్ సముద్రాన్ని దాటిన కొలంబస్.

ఒకటవ అధ్యాయం

# కల్లోలిత శతాబ్దాలు

దక్షిణ యూరేషియాపై ఆధిపత్యం వహించిన మూడు ప్రధాన సామ్రాజ్యాలు ఐదవ శతాబ్దంలో విచ్ఛిన్నమయ్యాయి. ఆ శతాబ్దమంతా గందరగోళ పరిస్థితులు నెలకొన్నాయి. వెయ్యేళ్ల చరిత్ర కలిగిన నాగరికతలు కూడా ఇలాంటి సంక్షోభాన్ని, గందరగోళాన్ని, దిగ్భ్రాంతికర పరిస్థితులను ఎదుర్కొని పతనంవైపు పయనించాయి. సరిహద్దులను దాటుకొని అనాగరిక ప్రజలు రాజ్యాలను ధ్వంసం చేశారు. యుద్ధ ప్రభువులు స్వంత రాజ్యాలను ఏర్పాటు చేసుకున్నారు. కరువు, ప్లేగు వ్యాధులు విలయతాండవం చేశాయి. వ్యాపారం క్షీణించి నగరాలు ఖాళీ అయ్యాయి. కొత్తగా వచ్చిపడిన అభద్రతను ఎదుర్కోవడానికి పై మూడు సామ్రాజ్యాలలోనూ సైద్ధాంతిక నిబద్ధతలను నిర్ధారించడానికి ప్రయత్నాలు జరిగాయి. రోమను ఆధిపత్యంలోని ఉత్తర ఆఫ్రికాలో క్రైస్తవ మత సిద్ధాంతంపై తీవ్ర ప్రభావం చూపిన 'దేవుని నగరం' అనే గ్రంథాన్ని అగస్టైన్ రచించాడు. భోగవిలాసాలకు ప్రతిరూపమైన రోము నగరం దోపిడీకి గురి కావడంతో ఆ బాధను అధిగమించే ప్రయత్నంలోనే అగస్టైన్ ఆ గ్రంథాన్ని రచించాడు. చైనాలో బౌద్ధ మత సిద్ధాంతాలు ప్రజలను ఆకర్షించడం మొదలుపెట్టాయి. ఈ సిద్ధాంతాలు వెయ్యేళ్ల క్రితమే భారతదేశంలో వివరించబడ్డాయి. చైనాలో తీవ్రమైన అణచివేతను ఎదుర్కొన్న వ్యాపారులు బౌద్ధంవైపు మొగ్గు చూపడం ప్రారంభించారు. భారతదేశంలో ఒకవైపు హిందూ మతం తన స్థానాన్ని పదిలం చేసుకోగా మరో వైపు కొత్త మత విధానాలెన్నో వికసించాయి.

ఆయా నాగరికతలు ఎదుర్కొన్న సంక్షోభాల మధ్య పోలికలు ఉండడంతో కొందరు చరిత్రకారులు ప్రపంచ వాతావరణంలో సంభవించిన మార్పుల కారణంగానే సమస్యలు తలెత్తినట్లు సూచించారు. కాని కేవలం వాతావరణాన్నే నిందించడం ఒక ప్రధాన సమస్యను విస్మరించినట్లవుతుంది. ఆ ప్రధాన సమస్య ఈ నాగరికతలను శతాబ్దాల తరబడి వేధిస్తూ ఉండేది. ఆ సమస్యకు మూలాలు ప్రజల వ్యవసాయ పద్ధతులు, జీవనోపాధి మార్గాలలో కనిపిస్తాయి. వెయ్యేళ్ల క్రితం లోహ పరిశ్రమ విస్తరణకు ప్రజలు చేసిన కృషితో పోలిస్తే ఈ కాలంలో వ్యవసాయ ఉత్పాదకత సాధించిన ప్రగతి ఎన్నిరెట్లు ఎక్కువ ఉంటుందో గణించడం అసాధ్యం. అయినప్పటికీ ధనికుల వినియోగం బ్రహ్మాండమైన స్థాయిలో ఉండేది. రాజ్య స్వరూపం, పాలనా వ్యవస్థ ఎన్నడూ లేనంత విస్తారంగా ఉండేది. ఒక దశలో ముందుకు

వెళ్లలేని పరిస్థితులు ఏర్పడి ఉంటాయి. తొలి కాంస్యయుగ నాగరికతలు కూడా ఇలాంటి స్తబ్ధతనే ఎదుర్కొన్నాయి.

రోమను ప్రపంచం తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కొంది. నాగరిక వికాసం తరగని బానిసల సరఫరాపై ఆధారపడి ఉండేది. ఫలితంగా సామ్రాజ్య అధికారులు, బడా భూస్వాములు వ్యవసాయ దిగుబడులను పెంచడంపై ఎలాంటి శ్రద్ధ వహించలేదు. అదేసమయంలో భారతదేశం లేదా చైనాలోని పాలక, ఉన్నత వర్గాలు వ్యవసాయ ఉత్పాదకతను పెంచే విషయంలో ఎక్కువగా ఆసక్తి చూపేవారు. ఫలితంగా రోమను సామ్రాజ్య పతనం కూడా భారీ స్థాయిలోనే సంభవించింది.

ఐరోపాలో సంక్షోభానంతర కాలాన్ని 'చీకటి యుగాలు'గా ఖచ్చితంగా పరిగణించారు. నాగరికత క్రియాశీలంగా పతనమైంది. అంటే నగర జీవనం, విద్యాభ్యాసం, సాహిత్యం, కళలు క్రమంగా క్షీణించాయి. ఈ పతనం అంతటితో ఆగలేదు. రోము సామ్రాజ్య ప్రాభవానికి ఎంతో మూల్యం చెల్లించిన సాధారణ ప్రజలు సామ్రాజ్యం పతనం కావడంతో అంతకంటే ఎక్కువ మూల్యాన్ని చెల్లించాల్సి వచ్చింది. పూర్వపు సామ్రాజ్య భూభాగాలపై కరువు, ప్లేగు విలయతాండవం చేశాయి. ఆరవ శతాబ్దం చివర నుండి ఏడవ శతాబ్దం వరకు జనాభా సగానికి సగం తగ్గిపోయిందని ఒక అంచనా. జర్మానిక్ యుద్ధవీరులు పూర్వపు సామ్రాజ్య సరిహద్దులను ఛేదించారు. వారిలో గోథ్‌లు, ఫ్రాంక్‌లు, విసిగోథ్‌లు, ఆస్ట్రోగోథ్‌లు, ఆంగెల్స్, సాక్సన్లు, జూట్లు ఉన్నారు. వీరు రోమను నేలలపై స్థిరపడడం మొదలుపెట్టారు. అనతి కాలంలోనే రోమను ఆచారాలను అలవర్చుకున్నారు. క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. లాటిన్ భాషలో మాట్లాడసాగారు. కాని వారి వెనువెంటనే ఆక్రమణదారులు వచ్చారు. అప్పటి వరకు రోమను సంస్కృతితో ప్రభావితం కాని ఈ కొత్త ఆక్రమణదారులు కేవలం నగరాలను దోచుకోవడానికి, వాటిని తగులబెట్టడానికే దాడులు జరిపారు. రోమను ప్రాంతాల్లో స్థిరపడి, వ్యవసాయం చేసుకోవాలన్న ఆలోచన వారికి ఉండేది కాదు. ఫ్రాంక్‌లు, గోథ్‌లు, ఆంగ్లో-సాక్సన్లు స్థాపించిన రాజ్యాలలోకి హన్లు, నోర్స్‌మెన్లు, చొచ్చుకువచ్చారు. అభద్రత, భయోత్పాతాలను సృష్టించారు. ఐదవ లేదా ఆరవ శతాబ్దాలలో నెలకొన్న అరాచక పరిస్థితులు 9, 10వ శతాబ్దాల్లో కూడా పునరావృతమయ్యాయి.

ఎట్టకేలకు ఆక్రమణదారులందరూ కొత్త ప్రాంతాల్లో స్థిరపడ్డారు. వీరిలో అత్యధిక శాతం మంది తమ మాతృభూముల్లో వ్యవసాయదారులుగా ఉండేవారు. లోహాలతో తయారైన పనిముట్ల, ఆయుధాలను కూడా తొలి నుండి వినియోగించేవారు. ఇనుముతో చేసిన ఆయుధాలను నాగరిక సమాజ సైన్యాలను యుద్ధ రంగంలో ఓడించడానికి వినియోగించారు. ఆదిమ కమ్యూనిజం నుండి వర్గ విభజన వరకు వారి సమాజాలు ప్రస్థానం సాగించాయి. తెగ నాయకులు రాజ్యాధికారాన్ని చేపట్టాలని ఆకాంక్షించారు. భూస్వాములు రైతులు, పశువుల కాపర్లపై పెత్తనం చెలాయించడానికి ప్రయత్నించారు. రైతులు, ఇతర వర్గాలు సముదాయ వ్యవసాయ సాంప్రదాయాలను అప్పటికీ అనుసరించేవారు. రోమను సామ్రాజ్యంలో వ్యవసాయ పద్ధతులు అంతగా అభివృద్ధి చెందలేదు. బానిసల శ్రమపై ఆధారపడ్డ జాగీర్లు ఉత్పత్తి పద్ధతులను

ప్రోత్సహించలేకపోయాయి. రోమను వ్యవసాయ పద్ధతుల్లో నిజంగా అభివృద్ధే జరిగి ఉంటే అనాగరిక ఆక్రమణదారులు రోమన్ల వ్యవసాయ విధానాలను అనుసరించి రోమను తరహా జీవనశైలిని అలవర్చుకొని ఉండేవారు. అయితే ఖచ్చితంగా ఇలాంటి ప్రక్రియే చైనా, దాని సరిహద్దు ప్రాంతాల్లో సంభవించింది. చైనాపై వరుసగా దాడులు జరిపిన అనాగరిక మంగోలులు ప్రత్యేక సామ్రాజ్యాలను ఏర్పాటు చేయగలిగారు. వ్యవసాయంలో చైనీయులు సాధించిన ప్రగతిని తమకు అనుకూలంగా మలచుకున్నారు.

అయితే హన్లు, నోర్స్‌మెన్లు, దండయాత్రలు ప్రారంభించే నాటికే రోమను సామ్రాజ్యం విచ్ఛిన్న దశకు చేరుకుంది. దండయాత్రలు విచ్ఛిన్న ప్రక్రియను త్వరితగతం చేశాయి. కొందరు ఆక్రమణదారులు రోమను తరహా వ్యవసాయాన్ని అనుసరించడానికి ప్రయత్నం కూడా చేశారు. యుద్ధ ఖైదీలతో జాగీర్లను సాగు చేశారు. కొందరు పాత సామ్రాజ్యపు కేంద్రీకృత వ్యవస్థలను పునరుద్ధరించడానికి కూడా ప్రయత్నించారు. ఐదవ శతాబ్ది చివరలో పశ్చిమ ప్రాంత చక్రవర్తిగా ఆస్ట్రోగోథ్ థియోడెరిక్ తనను తాను ప్రకటించుకున్నాడు. ఎనిమిదవ శతాబ్దం చివరి నాటికి చార్లీ మాగ్ని కొత్త సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఈ సామ్రాజ్యంలో నేటి ఫ్రాన్స్, కాటలోనియా, ఇటలీ, జర్మనీ దేశాలు అంతర్భాగంగా ఉండేవి. అయితే పై ఇద్దరి సామ్రాజ్యాలు వారి మరణానంతరం పతనమయ్యాయి. రోమను సామ్రాజ్య విచ్ఛినానికి దారి తీసిన కారణాలే ఈ కొత్త సామ్రాజ్యాల పతనానికి కూడా వర్తిస్తాయి. అలాంటి విశాలమైన వ్యవస్థలను నిరంతరంగా నిలబెట్టే భౌతిక ఆధారం (ఉత్పత్తి) అంత బలంగా ఉండేది కాదు.

అనతి కాలంలోనే నగరాలు నిర్మానుష్యమయ్యాయి. ఆలనాపాలనా లేక శిథిలమయ్యాయి. వాణిజ్యం ఎంతగా క్షీణించిందంటే బంగారు నాణేలు కూడా చెల్లకుండా పోయాయి. విద్యాభ్యాసం మతపెద్దల కుటుంబాలకే పరిమితమైంది. రోజువారీ జీవితంలో ఉపయోగించని భాష-లాటిన్- విద్యాబోధనకు మాధ్యమం అయ్యింది. సాహిత్య శోధన స్తంభించిపోయింది. కేవలం కొన్ని మఠాలే సాహిత్య అధ్యయన కేంద్రాలుగా ఉండేవి. ఈ అధ్యయన కేంద్రాలు కూడా ఐరోపా శివారు ప్రాంతమైన ఐర్లాండ్‌లోనే కేంద్రీకృతమై ఉండేవి. సంచార సన్యాసులే (విద్వాంసులు) విద్యాధిక సామాజిక కేంద్రాల మధ్య అనుసంధాన కర్తలుగా ఉండేవారు. గ్రీకు-రోమను ప్రపంచంలో వెలువడిన విజ్ఞాన శాస్త్రాలు, సాహిత్య ఖండకావ్యాలు నశించిపోయాయి. వరుసగా వచ్చిన ఆక్రమణదారులు మఠాలను తగులబెట్టడంతో సాహిత్య, విజ్ఞాన సంపద అంతా కాలి బూడిదైపోయింది.

సుమారు 600 సంవత్సరాలపాటు పశ్చిమ ఐరోపా ప్రాంతమంతటా ఇలాంటి పరిస్థితులే నెలకొన్నాయి. అయినప్పటికీ ఈ అరాచక పరిస్థితుల నుండే ఎట్టకేలకు ఒక కొత్త వ్యవస్థ ఆవిర్భవించింది. ఐరోపా అంతటా వ్యవసాయ నిర్వహణా పద్ధతులు ఒక సమగ్ర రూపాన్ని సంతరించుకున్నాయి. పూర్వపు సామ్రాజ్య జాగీర్లకు, ఆక్రమణదారుల గ్రామీణ సముదాయాలకు అదనపు నిల్వలను సమకూర్చే స్థాయికి వ్యవసాయం పుంజుకుంది. సమయం గడిచే కొద్దీ వ్యవసాయ ఉత్పాదకత నూతన సాగు పద్ధతులు అభివృద్ధి చెందాయి. పూర్వపు సామ్రాజ్య కాలం కంటే రైతులు ఎక్కువ స్థాయిలో దిగుబడిని సాధించారు.

రైతులు ఆహార పంటలను విభిన్న పద్ధతుల్లో సాగు చేస్తూ దిగుబడిని గణనీయంగా పెంచారు. వ్యవసాయ, నౌకాయాన పద్ధతుల్లో సాధించిన ప్రగతి వల్లే వైకింగ్‌లు (వీరు ఆక్రమణదారులు) ఘనమైన విజయాలను సొంతం చేసుకున్నారు. నాగరిక, పట్టణ వృత్తుల నేపథ్యం లేకున్నా ఆక్రమణదారులు వ్యవసాయ, సామాజిక రంగాల్లో ప్రగతిని సాధించగలిగారు. మారుతున్న వ్యవసాయ పద్ధతులకు సామాజిక సంఘటన కొత్త రూపాలు తోడయ్యాయి. ప్రతి చోటా సాయుధ బలగాలు కలిగిన భూస్వాములు పుట్టుకొచ్చారు. సురక్షితమైన రాతి భవనాల నుండి వారు పెత్తనం చెలాయించారు. పరాధీనమైన రైతులను దోచుకుంటూనే గ్రామాలను కాపాడే బాధ్యతను భుజాన వేసుకున్నారు. వస్తు రూపం (ధాన్యం)లో కాని, ఉచిత శ్రమ రూపంలో కాని రైతుల నుండి కప్పం వసూలు చేశారు. అయితే కొత్త నాగరికతకు పునాదులు వేయడానికి ఈ పరిస్థితులు చాలా సమయం తీసుకున్నాయి.

## రెండవ అధ్యాయం

# చైనా : సామ్రాజ్య పునరుత్థానం

ఆర్థిక మాంద్యం, వరుస కరువుల కారణంగా రోమను సామ్రాజ్యం లాగే చైనా సామ్రాజ్యం కూడా క్షీణ దశకు చేరుకుంది. బయటి నుండి అనాగరికులు దండయాత్రలు చేయడంతో పూర్తిగా పతనమైంది. నాల్గవ శతాబ్దంలో వరుస కరువులు, ప్లేగు వ్యాధి, అంతర్యుద్ధాలు, ప్రత్యర్థి సామ్రాజ్యాల ఆవిర్భావం, రాజకీయ–ఆర్థిక–పాలనా రంగాల్లో అరాచక పరిస్థితులు నెలకొన్నాయి. సుమారు పది లక్షల మంది ప్రజలు తమ ఇళ్లను, భూములను వదలి వెళ్లారు. యాంగ్జీనదీ ప్రాంతానికి ఆవల ఉన్న ఉత్తర చైనా సామ్రాజ్య కేంద్రం నుండి దక్షిణ ప్రాంతానికి వలసపోయారు. ఉత్తరచైనా ప్రాంతం నిర్మానుష్యమైంది. వినాశకర పరిస్థితులు నెలకొన్నాయి. వ్యవసాయ భూములు బంజరుగా మారాయి. అదనపు ఉత్పాదకత స్థానంలో స్వయం సమృద్ధి వ్యవసాయం వైపు ప్రజలు మళ్లారు. వాణిజ్యం పరిమితంగా ఉండడంతో మారకద్రవ్య వినియోగం క్షీణించింది.

అయినా సామ్రాజ్య పతనానంతర పరిస్థితులను వివరించడానికి 'చీకటియుగాలు' అన్న పదాన్ని ఉపయోగించడం భావ్యం కాదు. విశాలమైన రైతాంగ జీవన స్థితిగతులు దుర్భరంగా ఉండేవి. ఆకలి, వ్యాధుల కారణంగా లక్షలాది మంది ప్రజలు మృత్యువాత పడ్డారు. అయినప్పటికీ నాగరికత కుప్పకూలిపోలేదు. ఉత్తర చైనాలో వ్యవసాయం క్షీణించినా అనతి కాలంలోనే యాంగ్జీనది పరీవాహక ప్రాంతంలో వరి సాగు గణనీయంగా విస్తరించింది. ఫలితంగా నాగరికత మనుగడ సాగించింది. పురోగమన బాటలో ఉన్న నగరాలకు వ్యవసాయ దిగుబడులు ఆదుకున్నాయి. నగరాలతోపాటు విద్యాధిక ఉన్నత వర్గం కూడా మనుగడ సాగించింది. పశ్చిమ ఐరోపా వినాశనాన్ని కోరి తెచ్చుకుంటే దక్షిణ చైనా మాత్రం ఆగ్నేయ ఆసియా, భారత ఉపఖండం, ఇరాన్‌లతో కొత్త వ్యాపార మార్గాలను తెరిచింది. ఉత్తర ప్రాంతంలో రాజ్యాధికారం కోసం అనాగరిక వంశాలు తీవ్రంగా ఘర్షణపడ్డాయి. అయితే ఈ వంశాలన్నీ చైనా నాగరికత ప్రయోజనాలను గుర్తించి చైనా సంస్కృతిని అలవర్చుకున్నాయి.

విశేషమేమిటంటే అనాగరిక ప్రజలు పూర్వపు చైనా సామ్రాజ్యం నుండి పాఠాలు నేర్చుకోవడమే కాక పాత నాగరికతకు కొన్ని విషయాలను సైతం బోధించారు. సామ్రాజ్యం విధించే భారాలు, సాంప్రదాయాలకు దూరంగా ఉన్న అనాగరిక హస్తకళాకారులు స్వతంత్రమైన,

విభిన్నమైన ఉత్పత్తి పద్ధతులను అభివృద్ధి పరిచారు. ఈ పద్ధతులు ఇప్పుడు చైనాలో విస్తరించాయి. గుర్రాల పోషణ, గుర్రపు కవచాల వినియోగం, వంతెనలు, పర్వత మార్గాల నిర్మాణం, ఔషధ మొక్కలు, విషాల శాస్త్రం, సముద్ర ప్రయాణం, తదితర రంగాల్లో వినూత్నమైన పద్ధతులు ఆచరణలోకి వచ్చాయి. ఇలాంటి ఆ విష్కరణలు సంపదను, అదనపు నిల్వలను గణనీయంగా పెంచాయి. ఉదాహరణకు, పూర్వం గుర్రాలను యుద్ధరంగంలో, సమాచార రంగంలో ఎక్కువగా వినియోగించేవారు. అయితే పాత పోషణా పద్ధతులు గుర్రాల శక్తిని హరించివేసేవి. పెద్ద బరువులను మోయడానికి లేదా భూమిని దున్నడానికి అవి ఉపయోగపడేవి కావు. కాని కొత్త పద్ధతులు పరిస్థితిని ఒక్కసారిగా మార్చివేశాయి.

కేంద్ర సామ్రాజ్యం పతనమైనా మేథోపరమైన ప్రగతి స్తంభించలేదు. నిరంతర సంఘర్షణలు గ్రంథాలయాలను, ప్రాచీన చేతివృత్తులను నాశనం చేశాయి. కాని పాత మేధా సాంప్రదాయాల స్థానంలో కొత్త సాంప్రదాయాలు పుట్టుకొచ్చాయి. ఈ కాలంలో బౌద్ధ మత ప్రభావం విస్తరించ సాగింది. బౌద్ధ మత సాంప్రదాయాలను తొలుత వ్యాపారులు చైనాలో ప్రవేశపెట్టారు. సుదూర వ్యాపార మార్గాలలో వ్యాపారం నిర్వహించే ధనిక వ్యాపారులు టిబెట్ నుండి, దక్షిణ భారతం నుండి బౌద్ధ మతాన్ని తమ స్వదేశానికి తీసుకెళ్లారు. అలాగే తమ దేశం నుండి సమర్ఖండ్, ఇరాన్‌లకు ఆ మతాన్ని విస్తరింపజేశారు. చైనా కళలలో భారతీయ, గ్రీకు, ఇరాన్ ప్రభావాలు ప్రతిబింబిచేవి. కొన్ని బుద్ధ విగ్రహాలలో గ్రీకు శిల్ప శైలి స్పష్టంగా గోచరిస్తుంది. ఈ కాలాన్ని మధ్యయుగ నాగరికతలో స్వర్ణయుగంగా గెర్నెట్ అభివర్ణించారు. "మతపరమైన భావనలు గల భూస్వామ్య సమాజంగా చైనా రూపాంతరం చెందిందని, మధ్య ఆసియాకు భూమార్గాన ఉన్న వ్యాపార సంబంధాలు, హిందూ మహాసముద్రం గుండా వెళ్లే సముద్ర మార్గాల ద్వారా చైనాకు భారీ స్థాయిలో సంపద సమకూరిందని గెర్నెట్ పేర్కొన్నారు. ఐరోపా చీకటి యుగాలకు చాలా భిన్నంగా చైనా నాగరికత ఉండేదని ఇక్కడ స్పష్టంగా బోధపడుతుంది.

ఆరవ శతాబ్దం చివరికల్లా చైనా సామ్రాజ్యం పునరేకీకరణ చెందింది. ఈ ప్రక్రియ తొలుత సుయ్ వంశం, ఆ తర్వాత త'ఆంగ్ వంశాల పర్యవేక్షణలో జరిగింది. శత్రువులపై సైనిక విజయాలు సాధ్యం కావడంతో కొత్త చక్రవర్తులు ప్రజా బాహుళ్యం నుండి అదనపు నిల్వలను సేకరించి ప్రజాపనులను భారీ స్థాయిలో చేపట్టారు. రెండు కొత్త రాజధాని నగరాలు– లోయంగ్, చ'ఆంగ్-అన్– నిర్మాణమయ్యాయి. లోయాగ నగర ప్రహరీ గోడలు ఈశాన్యం నుండి పశ్చిమానికి తొమ్మిది కిలోమీటర్ల, అలాగే ఉత్తరం నుండి దక్షిణానికి ఎనిమిది కిలోమీటర్ల, మేరకు విస్తరించి ఉండేవి. చతుర్భుజ ఆకారంలో నిర్మించబడిన ఈ నగరంలో 25 కూడళ్లు ఉండేవి. ఒక్కో కూడలి వైశాల్యం 70 మీటర్ల వరకు ఉండేది. సుమారు 40 మీటర్లు వైశాల్యం కలిగిన నీటి కాలువలు వందల కిలోమీటర్ల వరకు ప్రవహించేవి. ఈ కాలువలు ఎల్లో, వాయ్, యాంగ్జీ నదులతో అనుసంధానమై ఉండేవి. పశ్చిమోత్తర సరిహద్దులో వందలాది కిలోమీటర్ల పొడవున మహాప్రాకారాలను పునర్నిర్మించారు. సైనిక దాడులతో సామ్రాజ్య ప్రాబల్యం కొరియా, భారతదేశం, పర్షియా, ఇండో చైనాలకు విస్తరించింది.

విద్యాధికులైన పూర్తిస్థాయి అధికారులు పాలనా యంత్రాంగాన్ని నడిపేవారు. కొందరు అధికారులను అర్హతా పరీక్షల ద్వారా ఎంపిక చేసేవారు. భూస్వామ్య వర్గానికి సామ్రాజ్య యంత్రాంగం సమతుల్యమైన శక్తిగా వ్యవహరించడం మొదలుపెట్టింది. భూములను చిన్న భాగాలుగా విభజించి రైతులకు కట్టుబెట్టడానికి ప్రయత్నించింది. అలా చేయడం ద్వారా అదనపు దిగుబడిని రాజ్య ఖజానాకు మళ్లించింది. భూస్వాములు కౌలు రూపంలో సంపదను ఆర్జించకుండా అడ్డుకుంది. ఉప్పు, మద్యం, తేయాకు ఉత్పత్తి, విక్రయాలపై సామ్రాజ్యానికి గుత్తాధిపత్యం ఉండడంతో రాజ్యానికి అదనపు ఆదాయం సమకూరింది.

రాజ్యం చాలా శక్తివంతంగా ఉండేది. నగరాలలో ప్రజల జీవితాన్ని చాలా దగ్గరి నుండి పర్యవేక్షించేది. పోలీసు వ్యవస్థ బలంగా ఉండేది. విశ్వాసం, అంగీకారం అనే కన్‌ఫూషియ నిజం సూత్రాల ఆధారంగా పాలనా యంత్రంగం పని చేసేది. అయితే వాణిజ్య కార్యకలాపాలు విస్తరించడంతో ఆసియాలోని అన్ని ప్రాంతాల నుండి సైద్ధాంతిక ప్రభావాలు చైనాకు చేరుకున్నాయి. బౌద్ధ మతం ప్రాముఖ్యత విపరీతంగా పెరిగింది. నెస్టోరియన్ క్రైస్తవ పంథా (రోమ్, బైజాంటియమ్‌లలో ఈ పంథాను దైవధిక్కారంగా పరిగణించేవారు) కొంత మేరకు ప్రభావం చూపేది. అలాగే మానిచేయిజం, జొరాస్ట్రియనిజానికి కొందరు అనుచరులు ఉండేవారు. దక్షిణ తీర ప్రాంతంలోని వాణిజ్య నగరాల్లో విదేశీ వ్యాపారులు పెద్ద సంఖ్యలో స్థిరపడ్డారు. వారిలో మలయా, భారతీయ, ఇరానీ, వియత్నాం, ఖ్మేర్, సుమత్ర వ్యాపారులు ఎక్కువగా ఉండేవారు. ముస్లిం వ్యాపారుల కోసం కాంటన్ నగరంలో షియా, సున్నీ మసీదులు కూడా ఉండేవి. చైనా ప్రభావం కూడా అన్ని దిశలలో విస్తరించింది. బౌద్ధమతంతోపాటు చైనా భాష, సాహిత్యం కొరియా జపాన్‌లకు విస్తరించాయి. కాగితం తయారీ పరిజ్ఞానం సమర్‌ఖండ్, ఇరాన్, అరబ్ ప్రపంచం, చివరగా ఐరోపాకు(అనేక శతాబ్దాల తర్వాత) విస్తరించింది.

త'ఆంగ్ వంశ పాలన మూడు శతాబ్దాలపాటు కొనసాగింది. ఆ తర్వాత సంక్షోభాన్ని ఎదుర్కొంది. ఆస్థాన ప్రముఖులు, ఉన్నతాధికారుల మధ్య ఘర్షణలు నిత్యకృత్యంగా మారాయి. కొందరు పాలకులు బౌద్ధ మతాన్ని ప్రోత్సహిస్తే మరికొందరు దానిని రూపుమాపడానికి ప్రయత్నించారు. పాలకవర్గాల విలాసవంతమైన జీవితశైలి, ప్రజాపనులు, రాజ్య నిర్వహణా ఖర్చులు భారీగా పెరిగాయి. సన్నకారు రైతుల వర్గం బాగా క్షీణించడంతో రాజ్య ఆదాయ వనరులు తగ్గిపోయాయి. సన్నకారు రైతుల స్థానంలో పెద్ద జాగీర్లు ఆవిర్భవించాయి. వీటిలో కౌలు రైతులు, వేతన కార్మికులు పని చేసేవారు. ఈ లోపు రైతుల పరిస్థితి మరింత దిగజారింది. ఒక ప్రాంతంలో 90 శాతం మంది రైతులు ధాన్యాలను అరువు తీసుకొని మనుగడ సాగించేవారని నివేదికలు చెబుతున్నాయి. గ్రామీణ ప్రాంతంలో బందిపోటు దొంగతనాలు ఎక్కువయ్యాయి. గ్రామీణ ఘర్షణలలో రైతులు పెద్ద సంఖ్యలో పాలుపంచుకునేవారు. 870 దశకంలో ఏకంగా సామ్రాజ్యాన్నే సవాలు చేసే స్థాయిలో రైతాంగ తిరుగుబాటు సంభవించింది. తిరుగుబాటు సైన్యం ఒకటి ఉత్తరప్రాంతం నుండి దక్షిణానికి బయల్దేరింది. 880లో సామ్రాజ్య రాజధాని అయిన చ'ఆంగ్-అన్‌ను స్వాధీనం చేసుకోవడానికి వెనక్కి మళ్లింది.

అయితే సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న రైతులకు ఈ తిరుగుబాటు విజయాన్ని సమకూర్చలేకపోయింది. తిరుగుబాటుదారుల్లో రైతులు ఎక్కువగా ఉండేవారు కాదు. రైతులు

తమ భూములను ఎక్కువ కాలం వదలి ఉండలేకపోయారు. అయితే భూములను, వ్యవసాయాన్ని త్యజించినవారు పెద్ద సంఖ్యలో తిరుగుబాటు దళాల్లో చేరారు. తిరుగుబాటు నాయకుల్లో భూస్వాములు, పేదలు సమానంగా ఉండేవారు. తిరుగుబాటుకు నాయకత్వం వహించిన హంగ్ చావ్ ఒకప్పుడు సామ్రాజ్య సేవ అర్హత పరీక్షల్లో స్థానిక అభ్యర్థిగా కూడా ఎంపికయ్యాడు, తిరుగుబాటు మొదలైన కొద్ది రోజులకే నాయకులు, సాయుధ దళాలు తమకు తోచిన పంథాను అనుసరించడం ప్రారంభించారు. క్షేత్రస్థాయి దళాలు స్థానిక పేదలతో కలిసి ప్రపంచంలోనే సంపన్నమైన నగరాన్ని దోచుకున్నాయి.

"మార్కెట్లు తగులబడిపోయాయి. ప్రజలు పెద్దసంఖ్యలో హతమయ్యారు. ప్రజాకంటకులైన అధికారులను వారి ఇళ్లనుండి బయటి లాగి నరికివేశారు." అందుకు భిన్నంగా హంగ్ లక్ష్యం ఉండేది. తానే చక్రవర్తిగా ఒక సుస్థిరమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని అతడు తలపోశాడు. సామ్రాజ్య వ్యవస్థను అతడు పునరుద్ధరించాడు. రాజ్య పాలనా యంత్రాంగం నుండి కేవలం ఉన్నతాధికారులనే తొలగించాడు. పాత భూస్వాములను వారి హోదాలలో అలాగే కొనసాగించాడు. తన నిర్ణయాలపై నిరసన వ్యక్తం చేసిన అనుచరులపై కఠినమైన చర్యలు తీసుకున్నాడు. ఒక మంత్రిత్వ శాఖ భవన ద్వారంపై రాజ్యానికి వ్యతిరేకంగా ఎవరో వ్యక్తి పద్యం రాశాడు. దానిని జీర్ణించుకోలేని హంగ్ సహచరుడు మంత్రిత్వశాఖ అధికారులను హత్య చేశాడు. వారి కనుగుడ్లను పీకించి మృత దేహాలను వేలాడదీశాడు. ద్వారం వద్ద పహారా కాసే సైనికులనూ హత్య చేయించాడు. రాజధాని నగరంలో కవిత్వం రాయగల సామర్థ్యం ఉన్న వారినందరినీ హత్య చేయించాడు. మిగతా విద్యావంతులను తక్కువ శ్రేణి పదవుల్లో నియమించారు. ఈ హత్యాకాండలో మొత్తం 3,000 మంది ప్రజలు మరణించారు."

తన స్వంత అనుచరులపైనే తిరగబడ్డ హంగ్ తన సింహాసనాన్ని మాత్రం కాపాడుకోలేకపోయాడు. సామ్రాజ్య సైన్యంలోని ఒక ఉన్నతాధికారి సంవత్సరం తర్వాత రాజధాని నగరంపై నియంత్రణ సాధించాడు. అప్పటికే తిరుగుబాటు సైన్యాల మానసిక స్థైర్యం క్షీణించిపోయింది. అయితే తిరుగుబాటు త'ఆంగ్ పాలకవంశ ప్రాబల్యాన్ని పూర్తిగా నశింపచేయగలిగింది. సామ్రాజ్యంపై  ఆధిపత్యం కోసం వైరి సైనికాధికారులు అంతర్యుద్ధాన్ని ప్రారంభించడంతో త'ఆంగ్ వంశానికి ఎలాంటి పలుకుబడి లేకుండాపోయింది. సామ్రాజ్యం ఐదు పరస్పర విరోధి రాజ్యాలుగా ముక్కలైంది. ఈ పరిస్థితి సుమారు 50 ఏళ్ల పాటు కొనసాగింది. ఐదు రాజ్యాలలో ఐదు పాలకవంశాలు ఆవిర్భవించాయి. అనంతరం సంగ్ అనే కొత్త వంశం సామ్రాజ్యాన్ని మళ్ళీ ఏకం చేసింది.

క్రీ.పూ. 206లో చి'ఇన్ వంశ పాలనకు తెరదించిన తిరుగుబాటుతో ప్రస్తుత తిరుగుబాటును పోల్చడానికి ఎన్నో ఉదంతాలు ఉన్నాయి. అలాగే క్రీ.శ. 184లో ఇలాంటి తిరుగుబాటే హన్ సామ్రాజ్యాన్ని ముక్కలు ముక్కలుగా చేసింది. చైనా చరిత్ర క్రమంలో ఇంకా అనేక తిరుగబాట్లు సంభవించాయి. అవి కూడా ఒకే పంథాలో నడిచాయి. తిరుగుబాట్ల పరిణామక్రమాన్ని ఈ విధంగా వర్ణించవచ్చు: "ఒక పాలక వంశం ఆవిర్భవిస్తుంది. రాజ భవనాలు, కాలువలు, రహదారుల నిర్మాణానికి భారీ ప్రణాళికను చేపడుతుంది. ఉత్తర, పశ్చిమ

సరిహద్దుల్లో అనాగరిక ప్రజల నుండి ముప్పును తొలగించుకోవాలని ప్రయత్నిస్తుంది. ఆ దిశలో సైనిక స్థావరాలను ఏర్పాటు చేస్తుంది అవసరమైతే దండయాత్రలు నిర్వహిస్తుంది. దండయాత్రల ద్వారా తన ప్రాబల్యాన్ని పెంచుకుంటుంది. అదే సమయంలో విశాల సంఖ్యలో ఉండే గ్రామీణ ప్రజానీకాన్ని దారిద్ర్యం వైపు నెడుతుంది. రైతాంగంలో గూడుకట్టుకున్న అసంతృప్తి తిరుగుబాటు రూపం దాల్చి సామ్రాజ్య అధికారాన్ని కూకటివేళ్లతో సహా కదిలించివేస్తుంది. అప్పుడు ఒక తిరుగుబాటు నాయకుడో లేదా సైనికాధికారో కొత్త పాలక వంశాన్ని స్థాపిస్తాడు. చరిత్ర ఇలా పునరావృతం అవుతూనే ఉంటుంది."

సామ్రాజ్య విజయ ఫలాలు గ్రామీణ ప్రజానీకానికి ఎన్నడూ చేరలేదు. సువిశాలమైన గ్రామీణ ప్రాంతంలో చెల్లాచెదురుగా ఉన్న ఈ ప్రజలు తమ భూములకు పరిమితమై ఉండేవారు. పెద్దగా చదువు లేకపోవడంతో సామ్రాజ్యంలో సంభవిస్తున్న పరిణామాల గురించి వారికి సమాచారం ఏదీ అందేది కాదు. రాజ్య దోపిడీకి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయగల శక్తి సామర్థ్యాలు వారికి ఉన్నప్పటికీ వాటిని, తమ ఉమ్మడి సంఘటనాశక్తిని రాజ్యాధికారాన్ని సాధించడం కోసం వినియోగించుకోలేకపోయారు. ఒక బలమైన పాలక వర్గంగా ఎదగలేకపోయారు. అందుకు భిన్నంగా సామ్రాజ్య వ్యవస్థతో పోలి ఉన్న రాజ్యవ్యవస్థను సృష్టించడానికి, నియంతృత్వ పోకడలున్న చక్రవర్తి స్థానంలో ప్రజానుకూల చక్రవర్తిని ముందుకు తేవడానికి ప్రయత్నించారు. ఈ ధోరణి ఎక్కువగా ఉండడంతో ఒకవేళ తిరుగుబాటు జయప్రదమైనా పాత పాలకుల దృక్పథం కలిగిన కొత్త పాలకులనే ప్రజలు ఎన్నుకొని ఉండేవారు. కొత్త పాలకుల చేతిలో ఎప్పటిలాగే దోపిడీకి గురయ్యే వారు.

ఈ ప్రక్రియ రాజ్య సిద్ధాంతంలో బలంగా నాటుకుపోయింది. పాలకవంశ చట్టబద్ధత దైవ ప్రపంచంపై ఆధారపడి ఉందన్న భావన బలపడింది. రాజ్యాధికారం కాలక్రమంలో చేతులు మారుతూ ఆయా పాలకవంశాలు ఆవిర్భవిస్తాయన్న నమ్మకం ప్రజల్లో ఏర్పడింది.

అయినప్పటికీ ఈ పరిణామక్రమాన్ని బట్టి చైనా సమాజం నిర్జీవమైనదని భావించడానికి వీల్లేదు. చాలా మంది పశ్చిమ రచయితలు చైనా సమాజం చైతన్యం కోల్పోయిందన్న భావనను పెంపొందించడానికి ప్రయత్నించారు. పాలకవంశాల ఉత్థానపతనం సమూలమైన మార్పులకు దారి తీసింది. ఆయా రంగాల్లో సంభవించిన వేర్వేరు మార్పులు స్థూలంగా సమాజంపై ప్రభావం చూపాయి. ఉత్పాదకత కార్యక్రమాల్లో కొత్త పద్ధతులు వచ్చాయి. వాటితోపాటు సమాజంలో వివిధ వర్గాల మధ్య ఉన్న సంబంధాలలో కూడా ముఖ్యమైన మార్పులు వచ్చాయి. పై మార్పులన్నీ క్రమంగా చోటు చేసుకున్నవే.

## ప్రపంచ సారథ్యం

చైనా నిరంతర ఆర్థిక ప్రగతిని చవి చూసింది. బడా భూస్వాములు వ్యవసాయ పనిముట్లు, ధాన్య శుద్ధి యంత్రాలపై పెట్టుబడి పెట్టి తమ ఆదాయాన్ని మరింత పెంచుకోవాలని ప్రయత్నించారు. వారి విశాలమైన జాగీర్లలో కౌలు రైతులు కాని వ్యవసాయ కార్మికులు కాని పెద్ద సంఖ్యలో పనిచేసేవారు. వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి పరచి సంవత్సరానికి రెండు

పంటలు సాగు చేయడానికి ప్రయత్నించారు. వరిని విస్తారంగా పండించే యాంగ్జీలోయ, దక్షిణ చైనా ప్రాంతాలకు ఉత్తర చైనా నుండి ప్రజలు వలసపోయారు వలసలు సుదీర్ఘకాలం పాటు కొనసాగాయి. అందుబాటులోకి రావడంతో ధనికులు వివిధ రకాల విలాస వస్తువులను ఎక్కువగా కొనుగోలు చేయగలిగారు.

వాణిజ్య సంబంధాలు స్థానిక రైతులను స్థానిక మార్కెట్లతో అనుసంధానం చేయడం మొదలుపెట్టాయి. అలాగే స్థానిక మార్కెట్లు ప్రాంతీయ నగరాలతో ముడిపడ్డాయి. ఈ ప్రాంతీయ నగరాలు వైశాల్యంలో, ప్రాముఖ్యతలో చాలా అభివృద్ధి చెందాయి. సుమారు 50,000 మైళ్లలో విస్తరించిన అంతర్గత జలమార్గాలపై రవాణా నౌకలు ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా రాకపోకలు కొనసాగించాయి. మిగతా ప్రపంచంలోని నౌకల సంఖ్య కంటే చైనా నౌకల సంఖ్య చాలా ఎక్కువగా ఉండేది. ఈ నౌకలు కేవలం ధనికులకు విలాస వస్తువులను సరఫరా చేయడమే కాకుండా భారీ ఉత్పత్తులను కూడా రవాణా చేసేవి. సమాజంలోని అన్ని వర్గాల ప్రజలలో మారకద్రవ్య వినియోగం ఎక్కువగా ఉండేది. వ్యాపార లావాదేవీలన్నీ నగదు రూపంలోనే జరిగేవి. నాణేలతోపాటు బ్యాంకు నోట్లు కూడా చెలామణి అయ్యేవి. వ్యాపారుల సంఖ్య విపరీతంగా పెరిగింది. వారిలో కొందరు అపర కుచేరులయ్యారు. నగరాలు విస్తరించాయి. సంగ్ వంశ రాజధాని అయిన కాయ్‌ఫెంగ్ మధ్యయుగ పారిస్ కంటే 12 రెట్లు ఎక్కువగా విస్తరించి ఉండేది. అందులో సుమారు పది లక్షల మంది నివాసముండేవారు. యాంగ్జీనది లోయలోని ప్రధాన నగరం హాంగ్- చావ్‌లో 15 నుండి 50 లక్షల వరకు నివసించేవారని ఒక అంచనా.

పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందాయి. కాయ్‌ఫెంగ్‌లో తయారైన ఆయుధాలు గ్రామీణ ప్రాంతాలకూ ఉపయోగపడ్డాయి. అదే సమయంలో సైనిక, ఆయుధ ఉత్పత్తి, శాస్త్రీయ పరిజ్ఞానం గణనీయంగా పెరిగింది. షెజ్‌వాన్, యాంగ్జీ డెల్టా ప్రాంతాల నుండి వలస వచ్చిన కార్మికుల సహాయంలో జౌళి పరిశ్రమ అభివృద్ధి చెందింది. ఇనుము, స్టీలు పరిశ్రమలు అత్యంత సమగ్రమైన నిర్వహణతో, అధునిక పరిజ్ఞానం, నిర్మాణ పద్ధతులతో ప్రగతిని సాధించాయి. యంత్రాలపై ప్రైవేటు వ్యక్తుల నిర్వహణలో ఈ పరిశ్రమలు సమానంగా అభివృద్ధి చెందాయి. సామ్రాజ్యవాద కుటుంబాలకు (పాలకవర్గాలు) అవసరమైన విలాస వస్తువులను కర్మాగారాలు ఉత్పత్తి చేసేవి. ఉన్నతాధికారులు, ధనిక వ్యాపారులు కూడా విలాసవస్తువులను ఎక్కువగా వినియోగించేవారు. అలాగే భవన నిర్మాణ సామాగ్రి, రసాయనాలు, పుస్తకాలు, వస్త్రాలకు విపరీతమైన డిమాండ్ ఉండేది.

సాంకేతికపరమైన అభివృద్ధి గణనీయంగా జరిగింది. లోహ పరిశ్రమల్లో చార్‌కోల్ (ముడిబొగ్గు) స్థానంలో పొడి బొగ్గును వినియోగించడం మొదలుపెట్టారు. నీటి ఆధారిత యంత్రాలు కూడా పెద్ద ఎత్తున వినియోగంలోకి వచ్చాయి. గనులలో పేలుడు పదార్థాలను ప్రయోగించేవారు. 1078 సంవత్సరంలో ఇనుము ఉత్పత్తి 114,000 టన్నులకు చేరుకుంది. (1788లో కూడా ఇంగ్లండ్ కేవలం 68000 టన్నుల ఇనుమునే ఉత్పత్తి చేయగలిగింది.) సిరామిక్, పింగాణీపాత్రల తయారీ కూడా పుంజుకుంది. 1044 నాటికే చైనాలో మందుగుండు

వినియోగంలో ఉండేది. ఐరోపాలో 240 ఏళ్ల తర్వాతనే మందుగుండు గురించిన సమాచారం అందుబాటులోకి వచ్చింది. 1132 నాటికి చైనీయులు వెదురు బొంగుల ద్వారా రాకెట్లను ప్రయోగించేవారు. అలాగే 1280 నాటికి కాంస్య, ఇనుము ఫిరంగుల నుండి మందుగుండును పేల్చడం నేర్చుకున్నారు.

నౌకాయానం, సముద్ర యానంలో కూడా కొత్త సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టారు. ముఖ్యంగా తెరచాపలు, దిక్సూచి, దేరాలు, రద్దర్లు, ఆంకర్లు, నీటిశక్తిని తట్టుకోగల కంటైనర్లను బాగా అభివృద్ధి పరిచారు. ఫలితంగా చైనా ఓడలు అరేబియన్ ఎడారి, ఆఫ్రికా ఈశాన్య తీరం వరకు కూడా ప్రయాణం చేయగలిగాయి. కొన్ని ఓడలు వెయ్యి మంది ప్రయాణీకులను కూడా తీసుకెళ్లగలిగాయి. ఐరోపా, అలాగే అరబ్ పశ్చిమాసియా కంటే చైనా చిత్ర పటాల తయారీలో అగ్రభాగాన ఉండేది.

చివరగా, పుస్తక ముద్రణలో సాధించిన ప్రగతివల్ల సాహిత్యం విస్తరించింది. మధ్యతరగతి ప్రజలకు చరిత్రలో తొలిసారిగా సాహిత్యకృతులు అందుబాటులోకి వచ్చాయి. తొమ్మిదవ శతాబ్దం నాటికే బ్లాక్ ముద్రణ అభివృద్ధి చెందింది. సాంస్కృతిక పంథాలు, జ్యోతిష్య శాస్త్రం, బౌద్ధమత గ్రంధాలు, చరిత్ర గ్రంథాలు, ప్రాచీన సాహిత్యకృతులు, సమగ్ర బౌద్ధ సాహిత్యం, ప్రామిసరీ నోట్లు, మందులు-ఔషధాలపై కరపత్రాలు ముద్రణ అయ్యేవి. పదకొండవ శతాబ్దం నాటికి యాంత్రిక ముద్రణ వచ్చింది. అయితే 15వ శతాబ్దం వరకు దానిని పూర్తి స్థాయిలో వినియోగించలేకపోయారు. అక్షరాల ప్రతిరూపాలను అవసరం మేరకు మార్చుకునే అవకాశం ఏర్పడింది. బ్లాక్ ముద్రణ చైనా లిపికి చాలా అనుగుణంగా ఉండడం వల్లే యాంత్రిక ముద్రణ చాలా శతాబ్దాల వరకు ఆచరణరూపం దాల్చలేకపోయింది. ఏదేమైనా ఐరోపా కంటే 500 ఏళ్ల ముందే చైనాలో ముద్రితమైన పుస్తకాలు ఉండేవి. ఈ దశలో రాత పూర్వకమైన పదం కేవలం విద్యావంతులైన ఉన్నత వర్గాలు లేదా బౌద్ధవిహారాలకే పరిమితమై ఉండేది కాదు. దేశవ్యాప్తంగా, ముఖ్యంగా దిగువ యాంగ్జీ ప్రాంతంలో, పాఠశాలలు స్థాపించబడ్డాయి. ప్రభుత్వ, ప్రైవేటు నిర్వహణలోని ఈ పాఠశాలలు క్రమంగా విస్తరించాయి. ఆ కాలంలో యాంగ్జీ ప్రాంతంలో నివసించిన ఒక రచయిత ప్రకారం: "ప్రతి రైతు, చేతివృత్తిదారుడు, వ్యాపారి తన కుమారుడికి పుస్తక పఠనాన్ని నేర్పేవాడు. చివరకు పశువుల కాపర్లు, వారి భార్యలు కూడా ప్రాచీన కవుల పద్యాలను ధారాళంగా పఠించేవారు." వాణిజ్య పారిశ్రామికాభివృద్ధితో సమానంగా వ్యాపారవర్గ సంపద, ప్రభావం, పరిమాణం పెరిగాయి. అందుకే కొందరు చరిత్రకారులు ఈ వర్గాన్ని బూర్జువా వర్గమని కూడా అభివర్ణించారు. ట్విచెట్ ప్రకారం సంగ్ వంశ పాలన చివరి దశ నాటికి చైనా సమాజంలో ఒక సంపన్నమైన, వివేకవంతమైన మధ్యతరగతి వర్గం ఉండేది. అంతే కాదు, రాజ్యం కూడా వ్యాపారులపట్ల తన వైఖరిని మార్చుకుంది. గతంలో పాలకవర్గాలు వ్యాపారులను విచ్ఛిన్నకరశక్తులుగా పరిగణించేవి. వారిని నిరంతరం అదుపులో పెట్టేవి, పొద్దు గడిచిన తర్వాత నగర వీధుల్లో ఎవరూ సంచరించకుండా కర్ఫ్యూ విధించేవారు. రాజ్య భద్రత దళాల నిరంతర పర్యవేక్షణలో మార్కెట్లు నగర ప్రహరీగోడలకే

పరిమితమై ఉండేవి. రాజ్య పాలనాయంత్రాగంలో ఎలాంటి హోదాలు నిర్వహించకుండా వ్యాపార కుటుంబాలపై నిషేధం ఉండేది. కాని ఇప్పుడు అలాంటి ప్రతిబంధకాలన్నీ నీరుగారి పోయాయి. పదకొండవ శతాబ్దం తొలి దశకాల నాటికి ఒక ఉన్నతాధికారి వ్యాపారులపై సరైన నియంత్రణ లేదని వాపోయే పరిస్థితి ఏర్పడింది. వ్యాపారులు విలాసవంతమైన జీవితాన్ని అనుభవించసాగారు. రుచికరమైన భోజనం, మాంసాన్ని ఆరగించేవారు. విశాలమైన భవంతులను, లెక్కలేనన్ని గుర్రపు బండ్లను కలిగి ఉండేవారు. తమ భార్యాపిల్లలను నగలతో, ఖరీదైన వస్త్రాలతో ముంచెత్తేవారు. బానిసలు తెల్లని పట్టువస్త్రాలు ధరించేవారు. పొద్దున లేవగానే సంపదను ఎలా ఆర్జించాలని వ్యాపారులు ఆలోచనలు సాగించేవారు. సాయంత్రానికల్లా పేదలను దోచుకునే మార్గాలను రూపొందించేవారు.

నవీన ధనికవర్గం తన ధనబలాన్ని సామ్రాజ్య అధికార యంత్రాంగాన్ని ప్రభావితం చేయడానికి వినియోగించడం మొదలుపెట్టింది :

> "అర్హత పరీక్షల వ్యవస్థ ప్రభుత్వ హోదాలలో సమాజంలోని ఇతర వర్గాల ప్రజలకు కూడా అవకాశం కల్పించింది. కొత్తగా చేరిన అధికారులు ఎక్కువగా వాణిజ్య విప్లవం వల్ల లబ్ది పొందిన కుటుంబాల నుండే వచ్చేవారు. వారిలో ధనిక వ్యాపారుల, సంపన్న భూస్వాముల కుటుంబాలకు చెందిన వారు పెద్ద సంఖ్యలో ఉండేవారు."

జాతీయ నియామక అర్హత పరీక్షల్లో కేవలం వందల సంఖ్యలోనే అభ్యర్థులు ఎంపికయ్యే వారు. కాని విశాలమైన పాలనా యంత్రాంగంలో వారే ఉన్నతాధికారులుగా వ్యవహరించేవారు. 13వ శతాబ్దం నాటికి ప్రభుత్వ పాఠశాలల్లో రెండు లక్షల మంది విద్యను అభ్యసించేవారు. ప్రైవేటు, బౌద్ధ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య అంతకంటే ఎక్కువగా ఉండేది. విద్యార్థులందరూ ఉన్నత స్థాయికి చేరుకోవాలని ఆకాంక్షించేవారు. విద్యార్థులలో ఎక్కువ మంది వ్యాపార కుటుంబాలకు చెందిన వారే కావడం విశేషం."

## వృధా అయిన శతాబ్దాలు

వ్యాపారుల ప్రాబల్యం పెరిగినప్పటికీ రాజ్యాన్ని పాలించే స్థాయికి వారు చేరుకోలేక పోయారు. భారీ ఉత్పాదనా కేంద్రాలు అప్పటికీ ప్రభుత్వ నియంత్రణలోనే ఉండేవి. అదే సమయంలో లాభాలను గడించే కార్యక్రమాలను ప్రభుత్వ యాజమాన్యంలోని ఓడల నిర్వహణ వ్యాపారులకు అప్పగించేవారు. రాజ్యమే స్వయంగా అధికారుల చేత నిర్వహించబడేది. అధికారులు, విద్యాధికులు, పాలనా వ్యవహారాలలో వారికి సమగ్రమైన శిక్షణ ఇచ్చేవారు. ఈ అధికారులకు గ్రామీణ ప్రాంత భూస్వాములు ఆదర్శంగా ఉండేవారు. వ్యాపారుల సంతానం కూడా భూస్వాములనే ఆదర్శంగా తీసుకొనేవారు, అధికార హోదాను చేపట్టేవారు. ఫలితంగా సంగ్ సామ్రాజ్యం ఉన్నత శిఖరానికి చేరుకున్నప్పటికీ సంక్షోభాన్ని సూచించే కొత్త లక్షణాలు వెలుగులోకి రావడం ప్రారంభించాయి.

'నయా కన్‌ఫూషియనిజం' అని చరిత్రకారులు సాధారణంగా పిలిచే భావజాలం రాజ్య ప్రధాన సిద్ధాంతంగా మారింది. పాలకులు, అధికారులు క్రమబద్ధమైన పంథాను అవలంబించాలని, పరస్పర గౌరవభావం ఆధారంగా పాలన ఉండాలని ఆ సిద్ధాంతం ప్రబోధిస్తుంది. భూస్వామ్య యుద్ధ తెగల హింసాత్మక చర్యలను, వ్యాపారుల అపరిమితమైన లాభార్జనను అడ్డుకోవడానికి అది ప్రయత్నించింది. రాజ్య అధికార యంత్రాంగంలో ఉద్యోగాలను ఆకాంక్షించే అభ్యర్థులు నయా కన్‌ఫూషియనిజం ప్రబోధించిన మేరకు పాఠ్యాంశాలను అభ్యసించాల్సి ఉంటుంది. ఆ సిద్ధాంతం సాంప్రదాయవాదులైన సామాజిక వర్గాలకు అనుకూలంగా ఉండేది. వారు పోటీతత్వాన్ని, సైనిక ఘర్షణలను సహించేవారు కాదు. అధ్యయనమే పరమావధిగా జీవితం ఉండాలని కోరుకునేవారు.

తొలి సంగ్ సామ్రాజ్యవాద చక్రవర్తుల వైఖరి లేదా దృక్పథానికి నయా సిద్ధాంతం చోటు కల్పించింది. సైనికపరమైన విస్తరణను సాధించే దిశగా ఖరీదైన ప్రణాళికలను రూపొందించడంవల్లే త'అంగ్ వంశం పతనమైందని సంగ్ పాలకులు నిందించేవారు. అందుకే సైనిక పరిమాణాన్ని కుదించివేశారు. లంచాలు, ప్రలోభాల ఆధారంగా సరిహద్దు రాజ్యాలతో మైత్రిని కొనసాగించారు. ఈ వైఖరిని పాక్షిక మతపరమైన భావనల ద్వారా వెల్లడి చేసేవారు. ప్రకృతి, సామాజిక సమతుల్యంపై మతపరమైన భావనలు కొన్ని ఉండేవి. అయితే ఈ వైఖరికి హేతుబద్ధత, అనుశీలత ఉండేది. గతంలో సుదీర్ఘకాలం కొనసాగిన సంక్షోభం పునరావృతం కాకుండా చూడటానికి ఈ వైఖరి ఒక మార్గంగా ఉండేది.

చైనాలో క్యాపిటలిస్టు పంథా పురోగమించకుండా అడ్డుకుంది నయా కన్‌ఫూషియానిజం ప్రాబల్యమేనని చాలా మంది పశ్చిమ చరిత్రకారులు తేల్చారు. క్యాపిటలిస్టు భావనకు వ్యతిరేకంగా నిలిచిన కన్‌ఫూషియానిజం చైనా సమాజాన్ని వెయ్యేళ్లపాటు స్తబ్దుగా ఉంచిందని వారు విశ్లేషించారు. అయితే మరికొందరు మాత్రం చైనాలోని బహుతాత్వికవాదమే ఆర్థిక ప్రగతికి ప్రతిబంధకంగా నిలిచిందని వాదించారు. అయితే మనం పరిశీలించినట్లు సంగ్‌పాలనా కాలంలో చైనా సమాజం స్తబ్ధతలకు ఆమడదూరంలో ఉండేది. ఇతర భావజాలాలైన బౌద్ధ, తావో, నెస్టోరియాలు మనుగడ సాగించడమే కాకుండా గ్రంథాలరూపంలో వ్యాప్తి చెందాయి. సిద్ధాంతపరంగా కన్‌ఫూషియా నిజం వైపు నిలిచిన అధికారులు ఆచరణలో భిన్నంగా వ్యవహరించారు. ఉదాహరణకు పాట్రిసియా ఎబ్రేరాజ్య సిద్ధాంతంలోని వైరుధ్యాలను వేలెత్తి చూపారు. అప్పటి సిద్ధాంతవేత్త యునాన్‌త్సాయి రచించిన 'సామాజిక జీవితానికి మార్గదర్శక సూత్రాలు' అనే నియమావళి కన్‌ఫూషియానిజం సిద్ధాంతాలను నిశితంగా విమర్శించింది. త్సాయిదృష్టిలో 'మానవుని జీవిత ఆశయం వ్యాపారంలో లాభాలు గడించడం,' "వ్యాపారాత్మక ధోరణులను అలవర్చుకోవడం" అందుకే కన్‌ఫూషియానిజంకు పూర్తిగా కట్టుబడిన వారు పై కుసంస్కారాలకు దూరంగా ఉండాలని త్సాయి ప్రబోధించాడు. ఈ నైతిక సూత్రాలను అధికారులు ఖచ్చితంగా పాటించాలని ఉపదేశించాడు.

రాజ్యసిద్ధాంతమైన నయా కన్‌ఫూషియనిజం, వ్యాపార వర్గ కార్యకలాపాల మధ్య అగాధం ఉండేది. ఆర్థిక వ్యవస్థ పురోగమిస్తున్నంత వరకు వ్యాపారులకు రాజ్య సిద్ధాంతంపట్ల వ్యతిరేకత ఉండేది కాదు. తమ సంపద, ప్రాబల్యం విస్తరిస్తున్నంత వరకు వారు ఆ సిద్ధాంతాన్ని

సహించారు. వందల ఏళ్ల తర్వాత ఇలాంటి పరిస్థితి ఐరోపాలో కూడా పునరావృతమైంది. తమ లాభార్జనకు ఎలాంటి పరిస్థితే ఐరోపాలో కూడా పునరావృతమైంది. తమ లాభార్జనకు ఎలాంటి ఇబ్బందులు కల్పించనంత వరకు తొలితరం క్యాపిటలిస్టులు సామ్రాజ్యవాద రాజ్యాలతో, రాజ్య సిద్ధాంతాలతో కలిసి పని చేశాయి.

చైనాలో వ్యాపారులు, సంపన్న వాణిజ్యవేత్తలు పూర్తిస్థాయి క్యాపిటలిస్టు వర్గంగా రూపాంతరం చెందకపోవడానికి ఒక ప్రత్యేకత ఉంది. సిద్ధాంతపరమైన కారణాల కంటే భౌతికపరమైన కారణాలే ఈ వర్గాల సామర్థ్యాన్ని క్షీణింపచేశాయి. రాజ్య యంత్రాంగంలోని ఉన్నతాధికారులపై వారు ఎక్కువగా ఆధారపడేవారు. ఆధునిక ఐరోపాలో ఇలాంటి పరిస్థితి ఉండేది కాదు. ఎందుకంటే చైనాలో ఉత్పత్తికి ప్రధానమైన సాధనాలను నిర్వహించడంలో రాజ్య అధికారులకే ఎక్కువ బాధ్యతలు ఉండేవి. విశాలమైన నీటి కాలువల (జలమార్గాల) వ్యవస్థకు, నీటిపారుదల పనులను అధికారులే చేపట్టేవారు. ఫలితంగా చైనా వ్యాపారులకు అధికారులతో కలిసి పని చేయడం మినహా మరో మార్గం లేకుండా పోయింది. రాజ్యం అదనపు ఉత్పత్తిని భారీ స్థాయిలో మళ్లిస్తున్నా, రాబడి సమకూర్చని కార్యక్రమాలపై (విలాస వస్తువుల కొనుగోలు, సరిహద్దు ప్రజలకు ముడుపులు చెల్లించడానికి) వెచ్చిస్తున్నా వ్యాపారులు వ్యవస్థతో సర్దుబాటు చేసుకోక తప్పలేదు.

భూస్వామ్య కుటుంబాలకు చెందిన అధికారులతోపాటు ధనిక వ్యాపారులు కూడా ఈ కాలంలో ఎనలేని సంపదను కూడబెట్టుకున్నారు. మరోవైపు రైతులు దుర్భరమైన పేదరికాన్ని అనుభవించారు. 11వ శతాబ్దంలో సూ హసున్ ఇలా రాశారు :

> “ధనిక కుటుంబాలు భూములను పెద్ద విస్తీర్ణంలో కలిగి ఉన్నాయి. వారి పొలాలను వ్యవసాయ కార్మికులు సాగు చేస్తారు. వీరిని కొరడాలతో నియంత్రించేవారు, బానిసలుగా చూసేవారు. వ్యవసాయ దిగుబడిలో సగం యజమానికి, సగం వ్యవసాయదారునికి దక్కేది. ప్రతి భూస్వామికి పది మంది వ్యవసాయదారులు ఉండేవారు. తనకు దక్కే సగం దిగుబడిని యజమాని సద్వినియోగం చేసుకొని ఆర్థికంగా, రాజకీయంగా మరింత బలపడేవాడు. కాని వ్యవసాయదారులు మాత్రం తమకు దక్కే వాటాను ప్రతి రోజూ వినియోగిస్తూ అనతి కాలంలోనే పేదరికం, ఆకలిదప్పులను అనుభవించేవారు.”

భూస్వామ్య అధికారుల కన్‌ఫూషియనిజం నైతిక విలువలు వారి కింద పని చేసే వారికి మాత్రం ఖచ్చితంగా వర్తించేవి కావు. యువాన్‌త్సాయి మార్గదర్శక సూత్రాలు రైతులు, చేతివృత్తిదారులను తక్కువ శ్రేణి ప్రజలుగా గుర్తించేవి. సేవకుల్లోని నిరాశతనాన్ని, ఆత్మహత్యకు పాల్పడే స్వభావాన్ని ఎత్తిచూపేవి. సేవకులను ఎలా చిత్రహింసలు పెట్టాలి. సాధు జంతువుల తరహాలో వారితో ఎలా వ్యవహరించాలనే విషయాలను సూచించేవి.

జాన్ హేగర్ అనే చరిత్రకారుడు ఇలా రాశాడు : “దక్షిణ సంగ్ పాలన చివరి నాటికి గ్రామీణ ప్రాంతాలు చాలా వరకు దారిద్ర్యంలో కూరుకుపోయాయి. వ్యవసాయ, వాణిజ్య విప్లవానికి దోహదపడిన శక్తులే రైతులను నిస్సహాయ స్థితిలోకి తోసివేశాయి.”

అంతర్గత సంక్షోభ లక్షణాలు ముదిరిపోకముందే, అధికారులు - వ్యాపారుల మధ్య వర్గ ప్రయోజనాల ఘర్షణ తలెత్తకముందే రాజ్యాన్ని బయటి నుండి వచ్చిన సంక్షోభం విచ్ఛిన్నం చేసింది. 1127లో ఉత్తరంవైపు నుండి జరిగిన దండయాత్ర చైనాను రెండు ముక్కలుగా చేసింది. ఫలితంగా సంగ్ వంశ నియంత్రణలో కేవలం దక్షిణ ప్రాంతం మాత్రమే మిగిలింది. 1271లో రెండవసారి జరిగిన దండయాత్రతో దేశం మొత్తం పరాధీనమైంది.

తొలి దండయాత్ర ఉత్తర చైనాలోని సామాజిక, రాజకీయ పరిస్థితులలో మౌలికంగా ఎలాంటి మార్పు తీసుకురాలేదు. దండయాత్రకు వచ్చిన జుర్చెన్ ప్రజలు అప్పటికే చైనా సామ్రాజ్యం తరహాలో రాజ్య వ్యవస్థను ఏర్పాటు చేశారు. పూర్వపు చి'ఇన్ సామ్రాజ్యాన్ని వారు చైనా (మాండరిన్) భాష మాట్లాడే అధికారుల సహాయంతో పాలించారు. వారి రాజ్యం చైనాలోని సగభాగాన్ని తన పరిధిలో కలిగి ఉండేది. సుమారు 150 సంవత్సరాల వరకు రెండు చైనా సామ్రాజ్యాలు సమాంతరంగా కొనసాగాయి.

రెండవ దండయాత్ర తీవ్రమైన పరిణామాలకు దారి తీసింది. అప్పటికే తమ మాతృభూమి అయిన మధ్య ఆసియా నుండి ప్రాబల్యాన్ని విస్తరించుకుంటూ బయల్దేరిన మంగోలు సైన్యాలు పశ్చిమంలో మధ్య ఐరోపా, దక్షిణంలో అరేబియా, భారతదేశం, ఈశాన్యంలో చైనా, కొరియా దేశాలను కొల్లగొట్టాయి. చైనాపై దాడికి వందేళ్ల పూర్వమే ఈ పరిణామాలు సంభవించాయి. మంగోలు సమాజంపై యుద్ధ తెగ నాయకుల ప్రాబల్యం ఉండేది. వీరికి సంచార పశు సంపద పెద్ద ఎత్తున ఉండేది. మంగోలులు గొప్ప అశ్వికులు. అధునాతన ఆయుధాలు, రక్షణ కవచాలను సమకూర్చుకోగల ధన సంపత్తి అపారంగా ఉండేది. ఈ కారణంగా మంగోలుల సైనిక ధాటిని తట్టుకోగల సామర్థ్యం కేవలం కొన్ని సాయుధ బలగాలకు మాత్రమే ఉండేది. అయితే వారికి తమ స్వంత పాలనా వ్యవస్థ అంటూ ఉండేది కాదు. అందుకే తాము జయించిన ప్రజలపైనే ఆధారపడి రాజ్యాన్ని పాలించేవారు.

చైనాను ఆక్రమించుకున్న తర్వాత మంగోలు పాలకులు తమను తాము యువాన్ వంశంగా ప్రకటించుకున్నారు. పాత సామ్రాజ్యంలో సేవలందించిన కొన్ని అధికార వర్గాలపై ఆధారపడి తమ సామ్రాజ్యాన్ని పాలించారు. అయితే అధికారులను పూర్తిగా నమ్మకపోవడంతో కీలక బాధ్యతలన్నీ తమ వద్దే ఉంచుకున్నారు. నికర లాభాలను తెచ్చిపెట్టే పన్నుల సేకరణ బాధ్యతలను మధ్య ఆసియాకు చెందిన ముస్లిం వ్యాపారులకు కట్టబెట్టారు.

ఈ వ్యాపారులు సైనిక బలగాల అండతో పన్నులను వసూలు చేయసాగారు. ఫలితంగా ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా సాంకేతిక, ఆర్థిక ప్రగతిని సాధించిన చైనా నాగరికతలో సామాజిక ఏర్పాట్లు విచ్ఛిన్నమయ్యాయి.

సంగ్ పాలనాకాలంలో నెమ్మదిగా ఉద్భవిస్తూ వచ్చిన ఆర్థిక సమస్యలు - ముఖ్యంగా గ్రామీణ పేదరికం - ఇప్పుడు తీవ్ర రూపం దాల్చాయి. 1270 నుండి నిత్యావసర వస్తువుల ధరలు పెరగసాగాయి. ఉత్తర ప్రాంత రైతుల పరిస్థితి మరింత దిగజారింది. జాగీర్ల వైశాల్యం విస్తరించడంతో ఈ ప్రాంత రైతులు దారిద్ర్యంలో కూరుకుపోయారు.

అయినప్పటికీ విదేశీయులకు ఆశ్చర్యం గొలిపే విధంగా చైనా సమాజం ప్రగతిని సాధించింది. 1275లో చైనా సందర్శించిన ఇటలీ యాత్రికుడు మార్కో పోలో బీజింగ్‌లోని మంగోలు రాజ ప్రసాదాన్ని చూసి ముగ్ధుడయ్యారు. యూరేషియా అంతటా మంగోలు ప్రాబల్యం విస్తరించి ఉండడంతో చైనా సాధించిన సాంకేతిక ప్రగతి పశ్చిమంలోని వెనుకబడిన సమాజాలకు చేరింది. కాని చైనా ఆర్థిక క్రియాశీలతను కోల్పోయింది. రైతాంగ దారిద్ర్యం తిరుగుబాట్లకు దారి తీసింది. ఈ తిరుగుబాట్లకు మత సంస్థలు లేదా రహస్య సమాజాలు నేతృత్వం వహించేవి. 'శ్వేత కమలం', 'శ్వేతమేఘం', 'ఎర్రతలపాగ' అనే సంస్థలు వాటిలో ముఖ్యమైనవి. చివరగా ఒక వ్యవసాయ కార్మికుడి కుమారుడైన చు-యువాన్-చాంగ్ అనే ఎర్రతలపాగ సంస్థ నాయకుడు మంగోలు రాజధాని బీజింగ్‌ను హస్తగతం చేసుకొని తనను తాను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు. ఈ సంఘటన 1368 లో జరిగింది.

మింగ్ అని పిలవబడ్డ కొత్త సామ్రాజ్యంలో పరిస్థితులు క్రమంగా మెరుగుపడ్డాయి. మంగోలు పాలన చివరి దశలో చోటు చేసుకున్న విధ్వంసం నుండి చైనా సమాజం క్రమంగా కోలుకున్నా ఆర్థిక క్రియాశీలతను మాత్రం పునరుద్ధరించలేకపోయింది. వ్యవసాయ రంగంపై సాధ్యమైనన్ని వనరులు వెచ్చించాలని నిర్ణయించుకున్న తొలి మింగ్ చక్రవర్తులు ఉద్దేశ్యపూర్వకంగా పరిశ్రమలు, విదేశీ వాణిజ్యాన్ని నీరుగార్చారు. ఫలితంగా చైనా సమాజం 12వ శతాబ్దంలో ఉన్నంత సంపన్నంగా 16వ శతాబ్దంలో కొనసాగలేకపోయింది. ఈలోగా యూరేషియాలోని ఇతర ప్రాంతాలు చైనా సాంకేతిక పరిజ్ఞానాన్ని సద్వినియోగం చేసుకొని తమ స్వంత పట్టణ నాగరికతలను గణనీయంగా విస్తరించుకున్నాయి. నాగరిక సమాజాలతో (సామ్రాజ్యాలు)పాటు శక్తివంతమైన సైన్యాలు, నావికా దళాలను ఏర్పాటు చేసుకున్నాయి.

## మూడవ అధ్యాయం

# బైజాంటియమ్ : సజీవ శిథిలం

పశ్చిమ ఐరోపాలో రోమను సామ్రాజ్యం పతనమైనంత మాత్రాన సామ్రాజ్యం పూర్తిగా అంతరించలేదు. తాము రోమన్లమని చెప్పుకున్న చక్రవర్తులు కాన్స్టంటినోపుల్ (నేటి ఇస్తాంబుల్) నగరాన్ని పాలించసాగారు. రోమ్ నగరాన్ని గోథ్‌లు విధ్వంసం చేసిన వెయ్యేళ్ల తర్వాత కూడా ఈ చక్రవర్తుల ప్రాబల్యం కొనసాగింది. ఇప్పుడు సామ్రాజ్యాన్ని బైజాంటియమ్ పేరుతో పిలవసాగారు. కాని చక్రవర్తులు, వారి పాలితులు తమను తాము రోమన్లుగా పరిగణించేవారు. గ్రీకు భాష మాట్లాడుతున్నప్పటికీ వారిలో రోమన్లమనే భావన ఉండేది. ఈ వెయ్యేళ్ల కాలంలో కాన్స్టంటినోపుల్ వైభవం అనూహ్యంగా పెరిగింది. విలాసవంతమైన రాచరిక భవనాలు, గ్రంథాలయాలు, స్నానఘట్టాలు, ప్రాచీన గ్రీకు, రోమను సాహిత్యంలో విద్వాంసులైన కవులు, 300 చర్చిలు, వైభవోపేతమైన సెయింట్ సోఫియా కేథడ్రల్‌తో ఆ నగరం వెలిగిపోయేది. ఐరోపాలోని మిగతా క్రైస్తవ ప్రాంతాల్లో పేదరికం, నిరక్షరాస్యత, మూఢనమ్మకాలు, నిరంతరయుద్ధాలు తాండవిస్తుండగా కాన్స్టంటినోపుల్ మాత్రం నాగరిక సంస్కృతికి నిలయంగా వెలసిల్లేది.

12వ శతాబ్దంలో పశ్చిమ ఐరోపా కోలుకుంటున్న దశలో కూడా కాన్స్టంటినోపుల్ జనాభా లండన్, పారిస్,రోమ్ నగరాల స్థూల జనాభా కంటే ఎక్కువగా ఉండేది. పొరుగున ఉన్న ముస్లిం సామ్రాజ్యాల పాలక వర్గాలను కాన్స్టంటినోపుల్ ఆకర్షించేది. బాగ్దాద్, కాయిరో, కార్దోవా (కార్డోబా) సామ్రాజ్యాలు కాన్స్టంటినోపుల్ కంటే విశాలంగా, ఎక్కువ జనాభా కలిగి ఉన్నా ఆ నగర వైభవం అందరిని మంత్రముగ్ధులను చేసేది.

అయినప్పటికీ ఆ వెయ్యేళ్ల కాలంలో మానవాళి జీవనోపాధిని పెంచడంలో కాని మానవాళి మేధా సంపత్తిని పెంచడంలో కాని బైజాంటిన్ సామ్రాజ్యం చేసిన అదనపు కృషి అంటూ చాలా తక్కువగా ఉంది. ప్రతి రంగంలో పాత రోమను సామ్రాజ్యం సాధించిన సాంకేతిక ప్రగతిపైనే ఆధారపడేది. ఈ సాంకేతిక పరిజ్ఞానం క్రీ.పూ. ఐదవ శతాబ్ద కాలంలో గ్రీకులకు అందుబాటులో ఉండేది.

ఆరవ శతాబ్దం మధ్యభాగంలో నిర్మాణం పూర్తి చేసుకున్న సెయింట్ సోఫియా కేథడ్రల్ అప్పటి ఐరోపాలోనే అత్యంత వైభవోపేతమైన కట్టడంగా ఉండేది. కాని బైజాంటిన్ వాస్తు శిల్పుల సృజనాత్మకతకు ఆ కట్టడం చివరి మజిలీగా మిగిలిపోయింది. వినూత్నమైన పద్ధతులను మరలా ఆచరణలో పెట్టలేకపోయారు. తర్వాతి తరం వాస్తు శిల్పులు కేథడ్రల్‌ను

పూర్తి స్థాయిలో ఎలా మరమ్మతు చేయాలో నిర్ధారించలేకపోయారు. బైజాంటిన్ సాహిత్యం నవ్యతను, సృజనాత్మకతను ఉద్దేశ్యపూర్వకంగా తోసిపుచ్చింది. ప్రాచీన కావ్యకృతుల సాహిత్యశైలిని రచయితలు అనుకరించేవారు. కేవలం బోధనా పరమైన నియమాలకు లోబడి వ్యవహరించడంపైనే వారు దృష్టి సారించేవారు. నవ్యతకు ఎలాంటి సాహిత్యపరమైన విలువ ఇచ్చేవారు కాదు. కొత్తశైలిని సృష్టించే స్వేచ్ఛ లేదా సాహిత్య అంశాన్ని ఎన్నుకునే స్వేచ్ఛకు ఎలాంటి ప్రాధాన్యత దక్కలేదు. గతాన్ని అనుకరించాలన్న తపనలో అధికారిక సమాజ భాషగా వెయ్యేళ్ల క్రితం నాటి ప్రాచీన గ్రీకు భాషను మార్చివేశారు. నగర జీవనంలో అమల్లో ఉన్న భాషకు అది చాలా భిన్నంగా ఉండేది. 'తన అధికారిక ప్రసంగంలో వక్త రోజువారీ జీవితంలో వినియోగించే ఏ వస్తువునైనా దాని సార్వజనిక పేరుతో ఎన్నడూ సంబోధించేవాడు కాదు' బైజాంటిన్ కళను 'నిరంతర పరిమితి' అనే ప్రక్రియ శాసించేది. ఒక దశలో అది సామ్రాజ్యశక్తి లేదా చర్చి ప్రభావానికి ప్రచారం కల్పించే సాధనంగా మారిపోయింది.

సాంకేతిక రంగంలో పరిమితమైన ప్రగతిని సాధించారు. పరిశోధకులు లోహాల ఉత్పత్తికి కొన్ని కొత్త పద్ధతులను కనిపెట్టారు. అయితే ఖనిజ పరిజ్ఞానం దాదాపు అంతరించిందనే చెప్పాలి. ప్రాచీన సాంప్రదాయాలు (మతపరమైన) ఖనిజ శాస్త్రానికి ఆశనిపాతంలా మారాయి. గాజు పరిశ్రమలో కొంత అభివృద్ధిని సాధించారు. సున్నితమైన, సూక్ష్మ పరికరాలవల్ల గాజు కొలతలను నిర్దిష్టంగా నిర్ధారించగలిగారు. ముద్రణ పరికరాలు కూడా మెరుగుపడ్డాయి. ముఖ్యంగా చైనా నుండి కాగితం తయారీకి సంబంధించిన పరిజ్ఞానం అందుబాటులోకి రావడంతో ఈ ప్రగతి సాధ్యమైంది. బైజాంటిన్లకు సాధారణ యంత్రాల పరిజ్ఞానం బాగానే ఉండేది. ఈ యంత్రాలను విడిభాగాలుగా ఎక్కువగా వినియోగించేవారు. ముఖ్యంగా నౌకాయానం, ఓడ ప్రయాణం, రవాణా చక్రాలు, బరువులు మోసే యంత్రాలు, కోత యంత్రాలలో విడిభాగాలను అమర్చేవారు. అయినప్పటికీ సాంకేతిక ప్రగతిని కేవలం రెండు రంగాలకే పరిమితం చేశారు. ఒకటి, పాలకవర్గానికి విలాస వస్తువులను సరఫరా చేయడానికి (లియో అనే గణిత శాస్త్రజ్ఞుడు రాచరిక ఆస్థానం కోసం పాడే కోయిలను యాంత్రికంగా తయారు చేశాడు), రెండు సైనిక అవసరాల కోసం సైనిక రంగంలో కూడా బైజాంటిన్లు నామమాత్రపు ప్రగతినే సాధించగలిగారు. వెయ్యేళ్ల క్రితం అలెగ్జాండ్రియా కేంద్రంగా అభివృద్ధి చెందిన సైనిక యుద్ధ తంత్ర పరిజ్ఞానాన్ని కొంత మేరకే అధిగమించగలిగారు.

శాస్త్ర రంగంలో పరిమితమైన ప్రగతిని కూడా సాధించలేకపోయారు. అప్పటి చేతి కృతులు గ్రీకు అలెగ్జాండ్రియా గణిత, ఖగోళ శాస్త్రాలలో సాధించిన ప్రగతిని సవివరంగా ప్రస్తావించాయి. కాని కేవలం కొద్ది మంది విద్వాంసులు మాత్రమే వాటిని తీవ్రంగా పరిగణించారు. ప్రధాన స్రవంతి ఆలోచనలు బైబిలులోని పుట్టుపూర్వోత్తరాల అధ్యాయంపై ఆధారపడి తమ చుట్టూ ఉన్న భౌతిక ప్రపంచాన్ని అర్థం చేసుకునేవారు. వారి దృష్టిలో భూమి గుండ్రంగా కంటే చదునుగా ఉండేది.

అన్నింటికంటే మించి, వ్యవసాయదారుల్లో జీవనోపాధిని సంపాదించే మార్గాలు ఏవీ అభివృద్ధి చెందలేదు. సమాజంలో రైతులే అత్యధికంగా ఉండేవారు. వ్యవసాయ పద్ధతులు, పరికరాలు ప్రాచీన కాలంనాటి కంటే పరిమితంగా అభివృద్ధి చెందాయి లేదా అలాగే కొనసాగాయి. విత్తడానికి కాడెద్దులతో కూడిన నాగలినే వినియోగించేవారు. పొలాలను పద్ధతి

ప్రకారం పరిరక్షించేవారు కాదు. ఈ పరిస్థితి 12వ శతాబ్దం వరకు కూడా కొనసాగింది. ఫలితంగా పశువులు తమ శక్తిని కోల్పోయాయి. రెండు గుర్రాలు కలిసినా 500 కేజీల బరువునే లాగగలిగేవి. చాలాసార్లు ఇంతకంటే తక్కువ బరువునే మోసుకెళ్లేవి. ఫలితంగా రైతులు ఎంత ఆకలితో అలమటించినా రాజ్య నిర్వహణకు, పాలకవర్గాల విలాసానికి కావలసిన అదనపు నిల్వలు మాత్రం పెరగలేదు. విశాలమైన బైజాంటిన్ సమాజాన్ని అలుముకున్న స్తబ్ధతకు ఒక మౌలిక కారణముంది. పశ్చిమంలో పాత రోమను సామ్రాజ్యాన్ని నాశనం చేసిన సంక్షోభాన్ని అది తట్టుకొని నిలబడగలిగింది. అయితే ఉత్పత్తిని పెంచే కొత్త మార్గాలను అన్వేషించలేకపోయింది. ఏ వర్గం కూడా కొత్త ఉత్పాదనా పద్ధతులను అభివృద్ధి పరచలేదు. పశ్చిమ ప్రాంతంలో ఐదవ శతాబ్దం సందర్భంగా ముదిరిన సంక్షోభ పరిస్థితులను ఇప్పుడు బైజాంటిన్ తప్పించుకోలేకపోయింది.

ఈశాన్యంలో సామ్రాజ్యం మనుగడ సాగించడానికి ప్రధాన కారణం ఈ ప్రాంతంలో వ్యవసాయం విస్తారంగా ఉండడమే. 330లో సామ్రాజ్య రాజధానిగా కాంస్టంటినోపుల్ అవిర్భవించిన తర్వాత చక్రవర్తులు ఆసియా మైనర్, సిరియా, బాల్కన్స్, సారవంతమైన నైలు లోయను నియంత్రించగలిగారు. గతంలో రోమను సామ్రాజ్య అవసరాలను తీర్చినట్లుగానే ఇప్పుడు కూడా నైలు లోయ బైజాంటిన్ ధాన్యగారాలకు అదనపు నిల్వలను సమకూర్చిపెట్టింది. సామ్రాజ్యంలోని ఆయా ప్రాంతాల ఆర్థిక వ్యవస్థలన్నీ బడా భూస్వాముల నియంత్రణలో ఉండేవి. వాస్తవంగా వారు తమ జాగీర్లను కేంద్రంగా చేసుకొని స్వతంత్రంగా పాలించేవారు. ఈజిప్టులోనైతే ఈ జాగీర్లు చిన్న రాజ్యాలను తలపించేవి. వాటికి పోలీసు బలగాలు, న్యాయస్థానాలు, వ్యక్తిగత సైన్యాలు, రవాణా సేవలు, తపాలా సౌకర్యాలు ఉండేవి. కాని అదే సమయంలో సామ్రాజ్య సైన్యం అత్యంత శక్తివంతంగా, కట్టుదిట్టమైన నియంత్రణలో ఉండేది. సైనిక నిర్వహణకు అవసరమైన నిధులను సామ్రాజ్యం భరించేది.

అయితే సైనిక వ్యవస్థ జస్టినియన్ హయాంలో కూలిపోయింది. పశ్చిమ ప్రాంతాన్ని ఆక్రమించుకోవడానికి చేసిన చివరి ప్రయత్నం విఫలమైంది. ఆరవ శతాబ్దంలో సెయింట్ సోఫియా నిర్మాణం పూర్తయిన 50 ఏళ్లకే సైన్యం విచ్ఛిన్నమైంది. సైన్యాలు, సార్వజనిక భవనాలు, అస్థాన విలాసాలు, చర్చి అవసరాలు.. అన్ని సామ్రాజ్య ఖజానాపై ఆధారపడి ఉండేవి. కాని ఖజానాలో నిల్వలు వేగంగా అంతరించాయి. రైతుల నిరంతర దారిద్ర్యం, సాధారణ ప్రజల్లో గూడుకట్టుకున్న అసంతృప్తి సామ్రాజ్యంలోని అన్ని నగరాల్లో ప్రత్యర్థి ముఠాల మధ్య తీవ్రమైన సంఘర్షణకు దారి తీశాయి. తమ మత మౌఢ్యాన్ని ప్రజలపై బలవంతంగా రుద్దడానికి సామ్రాజ్యం, చర్చి ప్రయత్నించడంతో విశాలమైన ప్రజానీకం మద్దతును అవి కోల్పోయాయి. సన్యాసుల కండబలం ఆధారంగా బిషప్‌లు విగ్రహారాధనపై యుద్ధాన్ని ప్రకటించారు. దేవాలయాలపై పాశవిక దాడులు నిర్వహించి వాటిని కూల్చివేశారు. యూదులపై వరుస దాడులు జరిగాయి. క్రైస్తవ మతంలోని ఇతర పంథీకులను అణచివేశారు. ఈ పంథాలకు మెజారిటీ ప్రజల మద్దతు ఉండేది. ముఖ్యంగా మోనోఫిసైట్, అరియన్, నెస్టోరియన్ శాఖలకు ప్ర..ల్లో ఆదరణ ఉండేది. ఏడవ శతాబ్దం తొలిదశకంలో సామ్రాజ్యానికి సిరియా, ఈజిప్టులలో ప.. ..ం అరబ్-ఇస్లామిక్ సైన్యాలు సవాలు విసిరినపుడు కాని, బాల్కన్స్‌పై స్లావ్ ప్రజలు దాడి చేసినప్పుడు కాని పాలకులు ప్రజల మద్దతును సమీకరించలేకపోయారు. సామ్రాజ్యం

కేవలం కాన్‌స్టంటినోపుల్ నగరం, ఆసియామైనర్‌లోని కొంత ప్రాంతానికే పరిమితమైపోయింది. ఈ ప్రాంతంలో కొన్ని పట్టణాలు మాత్రమే ఉండేవి. అలాగే రాజధానిలో జనాభా తగ్గిపోయింది. అక్షరాస్యత, విద్యా రంగాలలో ప్రమాణాలు క్షీణించిపోయాయి.

విచ్ఛిన్నమైన సామ్రాజ్యం కొంత వరకు నిలదొక్కుకొంది. ఎందుకంటే దాని పాలకులు సామ్రాజ్య సంరక్షణకు అవసరమైన నిధులను ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించడం ద్వారా సమకూర్చుకోగలిగారు. విశాలమైన జాగీర్లను రద్దు చేసి సరిహద్దు ప్రాంతాల్లో సైనిక బలగాలను వ్యవసాయదారులుగా స్థిరపరచడానికి ప్రయత్నించారు. ఈ వ్యవస్థ తమకు సైనిక బలగాలతోపాటు పన్ను రూపంలో అదనపు నిల్వలను అందించగలదని పాలకులు విశ్వసించారు.

ఈ విధంగా సామ్రాజ్యాన్ని వారు సమైక్యంగా ఉంచగలిగారు. అలాగే పదవ శతాబ్దం నాటికి స్లావ్‌ల నియంత్రణలోని కొన్ని బాల్కన్ భూములను తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు. అయితే వ్యవస్థ మౌలిక బలహీనతలను మాత్రం అధిగమించలేకపోయారు. పదకొండవ శతాబ్ది మధ్య దశకాల్లో కాన్‌స్టంటినోపుల్ మరోసారి పతనం వైపు పయనించడం మొదలుపెట్టింది. సామ్రాజ్యం అంతర్గత వైరుధ్యాల అంచున నిలిచింది. ఈ దశలో పన్ను విధించదగ్గ స్వతంత్ర రైతాంగ వర్గాన్ని నిర్మించాలని పాలకులు లక్ష్యంగా పెట్టుకున్నారు. కాని పన్ను భారం రైతులను భూములు విడిచివెళ్లేలా చేసింది. రైతులు తమ భూములను ధనికులు, శక్తిమంతులకు ధారాదత్తం చేశారు. ఈ ప్రక్రియ నిరంతరంగా కొనసాగింది.

సన్నకారు రైతులు ప్రతి ఏటా క్రూరులైన పన్నుసేకరణదారుల, సైనికుల దాడిని ఎదుర్కొనే వారు. పన్ను ఎగవేతదారులను బహిరంగంగా శిక్షించేవారు, వారి ఆస్తులను, పంట దిగుబడిని స్వాధీనం చేసుకునేవారు. కొన్నిసార్లు రైతులను నిర్బంధించి చిత్రహింసలకు గురి చేసేవారు. 12వ శతాబ్దపు సైప్రస్‌లో రైతులపై వేట కుక్కలను వదిలేవారు. అయితే సాధారణ సమయాల్లో కూడా రైతులు దివాళా అంచున జీవితం గడిపేవారు. ఒక్కసారి పంట విఫలమైతే చాలు ఎంతో శ్రమపడే రైతులు సైతం తమ భూములను అమ్ముకొని వలసపోయేవారు. 'రక్షణ' కోసం రైతులు ఆ విధంగా బడా భూస్వాముల వద్ద వెట్టి కార్మికులుగా మిగిలిపోయేవారు. విశేషమేమిటంటే, 932లో రైతాంగ తిరుగుబాటు సంభవించినపుడు దానికి ఒక మోసకారి నాయకత్వం వహించాడు. తాను పాలక వంశానికి చెందిన ఒక గొప్ప కుటుంబంలో జన్మించానని అతడు రైతులను నమ్మబలికాడు.

పట్టణ వాసులు స్వతంత్రంగా సమీకృతం కాకుండా సామ్రాజ్య అధికారగణం అడ్డుకోగలిగింది. రాజ్య నియంత్రణలోని మండళ్ల ఆధారంగా వ్యాపారులు, చేతివృత్తిదారులు సమీకృతమై ఉండేవారు. ఫలితంగా వారి లాభార్జనపై కఠినమైన పరిమితులు ఉండేవి. దాంతో బలమైన స్థానిక బూర్జువా వర్గ ఆవిర్భావం ఆలస్యమైంది. వాణిజ్యానికి పరిస్థితులు అనుకూలించినప్పుడు విదేశీ వ్యాపారులు పూర్తిగా సద్వినియోగం చేసుకున్నారు. వారి కార్యకలాపాలవల్ల సామ్రాజ్యం మరింత బలహీనమైంది.

అలాగే స్వేచ్ఛాయుతమైన కార్మికవర్గం కూడా ఆవిర్భవించలేకపోయింది. [illegible] నగరాల్లో బానిసత్వం పాతుకుపోవడంవల్ల అది సాధ్యపడలేదు. క్రీ.శ. 9 నుండి 11వ [illegible] [illegible] సాధించిన ఘన విజయాలు [illegible] తెచ్చి[illegible]

సైనిక పరాజయం, మార్కెట్ల పతనం, సంపద తరిగిపోయే వరకు బానిసలు సరఫరా ఆగలేదు. 12వ శతాబ్దం నుండి బానిసత్వం కనుమరుగై స్వేచ్ఛా కార్మికుల ఆర్థిక శక్తి పెరగసాగింది.

కాన్స్టంటినోపుల్ వైభవం, పాలకుల ధన సంపదకు మరో పార్శ్వంగా సామ్రాజ్య ప్రజల పేదరికం ఉండేది. అత్యధిక ప్రజలు గుడిసెలు లేదా అస్థిరమైన గృహాలలో నివసించేవారు. నిండు చలిలో కూడా కొందరు ఇంటి ఆవరణలో నిదురించే వారు. కాని స్వతంత్రమైన ఆర్థిక పునాది లేకపోవడంతో పేదలు ఒక స్వతంత్ర శక్తిగా వ్యవహరించలేక పోయారు. వీధి పోరాటాలకు దిగి కొంత కాలంపాటు అస్థిర పరిస్థితులను మాత్రం సృష్టించేవారు. అయితే వారి అసంతృప్తిని కొన్ని స్వార్థపరశక్తులు (తమ స్వంత ప్రయోజనాల కోసం) దుర్వినియోగం చేయడానికి అవకాశాలు ఎక్కువగా ఉండేవి. ఈ శక్తులు ప్రజలను చాలా తేలికగా మభ్యపెట్టేవి. ఈ కారణంగానే జస్టీనియన్ పాలనా కాలంలో సంభవించిన 'నైక్' ఘర్షణను చక్రవర్తి వ్యతిరేకులైన పాలకవర్గాలు సద్వినియోగం చేసుకొని పక్షం రోజుల్లోనే నగరంలోని దాదాపు సగ భాగాన్ని తగులబెట్టారు. జస్టీనియన్ తమపై విధించిన అధిక పన్నులను ఈ వర్గాలు తీవ్రంగా వ్యతిరేకించాయి. సమయం కోసం ఎదురు చూస్తున్న వీరికి నైక్ ఘర్షణ మంచి అవకాశాన్ని కల్పించింది. ఈ ఘర్షణ జరిగినప్పటి నుండి చక్రవర్తులు జాగ్రత్తగా వ్యవహరించడం మొదలుపెట్టారు. అందులో భాగంగా పట్టణ పేదలకు తిండి గింజలను ఉచితంగా పంపిణీ చేసేవారు. చక్రవర్తి అనుకూలంగానే ప్రజల ఘర్షణకు దిగేవారు. ఈ ఘర్షణలు ప్రధానంగా చక్రవర్తిని వ్యతిరేకించేవారిని లక్ష్యంగా పెట్టుకునేవి.

ఘర్షణలు కాలక్రమంలో వ్యవస్థాగత స్వరూపాన్ని సంతరించుకున్నాయి. పట్టణ ప్రజలు తమ వర్గ కోరికలను ముందుకు తెచ్చే పరిస్థితులు ఏర్పడినప్పుడు పాలకులు వారి దృష్టిని మళ్లించేందుకు ఘర్షణలను సృష్టించేవారు. హిప్పోడ్రోమ్ గోదాలో క్రీడలు జరిగే సమయంలో ప్రేక్షకులు ప్రత్యర్థి ముఠాలుగా (గ్రీన్, బ్లూ ముఠాలు) చీలిపోవడానికి ఈ ప్రక్రియే కారణం. ప్రత్యర్థి ముఠాలకు చెందిన యువత తమదైన ప్రత్యేక వస్త్రాధారణతో క్రీడామైదానంలోని ముందు వరుసలో ఆసీనులయ్యేవారు. తమ వర్గానికి చెందిన క్రీడాకారులను ప్రోత్సహిస్తూ వైరి వర్గం వారిని కించపరిచేవారు. కొన్నిసార్లు పరిస్థితులు అదుపు తప్పి ప్రత్యర్థి వర్గాలు ఘర్షణకు దిగి మారణహోమం సృష్టించేవి. అలాంటి సమయాల్లో సైన్యాన్ని రంగంలోకి దింపి శాంతిభద్రతలను పునరుద్ధరించేవారు. అయితే ఈ వర్గాలను చక్రవర్తి లేదా మహారాణితో సహా పాలకవర్గంలోని ప్రముఖులు ప్రోత్సహించేవారు. ఆ విధంగా సామ్రాజ్యానికి ఎలాంటి ముప్పు వాటిల్లకుండా ప్రజల ఆగ్రహాన్ని దారి మళ్లించేవారు. ఉచిత ధాన్యాల సరఫరా వ్యవస్థ కుప్పకూలిన తర్వాత 12వ శతాబ్దంలో వర్గపోరును ప్రతిబింబించే ఘర్షణలు చోటు చేసుకోవడం ప్రారంభించాయి. ఈ ఘర్షణలు పట్టణ పేద వర్గ ఆకాంక్షలకు ప్రతిరూపంగా మారాయి. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఈ దశలోనే వ్యాపార, చేతివృత్తిదారుల మండళ్లు క్రియాశీల పాత్రను పోషించాయి.

గ్రీకు భాషలో నిష్ణాతులైన అధికారులే పాలనా యంత్రాంగాన్ని నిర్వహించడం వల్ల గ్రీకు – రోమను సంస్కృతికి చివరి కేంద్రంగా బైజాంటియమ్ విలసిల్లింది. అయితే ఈ వర్గం ఇతరుల కష్టంపై ఆధారపడి జీవించేది. సామ్రాజ్య ఉత్పాదకతకు తోడ్పాటునందించడం కాని ఉత్పత్తిని క్రమబద్ధంగా నిర్వహించడం కాని జరగలేదు. భౌతిక ప్రపంచానికి తాము చాలా

దూరంగా ఉన్నామని ఈ వర్గం గర్వపడేది. అదే సమయంలో ఉత్పత్తి శక్తులు అధికారాన్ని హస్తగతం చేసుకొని అదనపు నిల్వలను తమ నియంత్రణలోకి తెచ్చుకోగలవన్న ఆందోళన దానిని పట్టి పీడించేది. బైజాంటిన్ సంస్కృతిలో స్తబ్దత, ప్రాచీన సాంప్రదాయాల కొనసాగింపును ఈ పరిస్థితి చక్కగా అద్దం పడుతుంది. అలాగే మూఢ నమ్మకాలు, మంత్ర విద్యలపట్ల అన్ని సామాజిక వర్గాల్లో ఉన్న విశ్వాసాన్ని కూడా ఈ పరిస్థితి విశదీకరిస్తుంది. పురోహితులు సాధారణంగా పాక్షిక విద్యావంతులుగా ఉండేవారు. సంతుల పురాణ కథలు, కాల్పనిక గాథలు, అద్భుతాల వర్ణనలు, పవిత్రమైన అవశేషాలకు ఉన్న మంత్రశక్తులపై విశ్వాసం ఆధారంగా వారు తమ సందేశాలను ప్రజలకు వినిపించేవారు. విగ్రహారాధన ప్రజలకు స్థానిక దేవతలను అందిస్తే ఇప్పుడు క్రైస్తవమతం వారికి స్థానిక పురోహితులను అందించింది. వీరు ప్రజాశ్రేయస్సును ఆకాంక్షించే దాతలుగా వ్యవహరించేవారు. మాతృదేవత సాంప్రదాయం కన్యమేరి సాంప్రదాయంగా అవతారమెత్తింది. ఫలదీకరణ హక్కులు పవిత్ర మంగళవార ఉత్సవాలు, ఈస్టర్ వేడుకలుగా మారాయి.

మూఢనమ్మకాలకు తోడు కొన్ని క్రూరమైన ఆచారాలు కూడా అమల్లో ఉండేవి. క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దం నాటికి క్రూరమైన నేర వ్యవస్థ ఆవిర్భవించింది. నేరస్తులకు అత్యంత పాశవికమైన శిక్షను విధించేవారు. నాలుక, చేతులు, ముక్కును కత్తిరించివేసే వారు. ఈ శిక్షలను చర్చి ఆమోదించేది. ఎందుకంటే నాలుక లేని పాపికి పశ్చాత్తాపం వ్యక్తం చేయడానికి తగిన సమయం లభించగలదని చర్చి నమ్మేది. నగరాలలో చర్చి ప్రభావం కారణంగా మహిళలను దూరంగా పెట్టేవారు. పవిత్రత, సాత్వికతను కాపాడే ఉద్దేశ్యంతో అలా వ్యవహరించేవారు. గౌరవ ప్రదమైన కుటుంబానికి చెందిన ఏ మహిళ కూడా పర్దా ధరించకుండా వీధుల్లోకి అడుగుపెట్టేది కాదు. అయితే వేశ్యవృత్తి కూడా పెద్ద ఎత్తున జరిగేది.

బైజాంటిన్ నాగరిక మౌలిక బలహీనత 13వ శతాబ్దం తొలియార్థంలో బయటపడింది. ఐరోపాకు చెందిన దోపిడీదారుల ముఠా జరిపిన దాడిలో కాంస్టంటినోపుల్ పతనమైంది. నాల్గవ క్రుసేడ్‌లో పాల్గొన్న సైనికులకు జెరుసలేం కంటే కాంస్టంటినోపుల్ నగరమే ఆకర్షణీయమైన యుద్ధ కానుకగా కనిపించింది. వారు తొలుత ఆ నగరాన్ని దోచుకున్నారు. తర్వాత దానిని ఫ్యూడల్ రాజ్యంగా మార్చివేసి పరిపాలించారు. 1261లో క్రుసేడర్లు నగరం నుండి గెంటివేయబడినా బైజాంటిన్ రాజ్యం తన పాత వైభవానికి కేవలం ప్రతిబింబంగా ఉండిపోయింది. చివరకు 1453లో అది ఒట్టోమన్ తుర్కుల వశమైంది.

నాగరికతను ప్రతిబింబించే ఒక స్వరూపం సుమారు వెయ్యేళ్లపాటు సంరక్షించబడింది. అయితే పాలకులకు ప్రజల మధ్య కేవలం పన్ను సేకరణదారులే మాధ్యమంగా ఉండేవారు. అలాగే గ్రామీణ పురోహితులు కూడా రాజ్యానికి ప్రాతినిధ్యం వహించేవారు. అలాంటి నాగరికత ఒక సజీవ శిథిలం అవుతుంది. తప్ప మరొకటి కాదు. గత కాలపు విజయాలను వర్తమాన పరిస్థితులలో అమలు చేస్తూ నాగరికత అభివృద్ధికి ఎలాంటి తోడ్పాటును అందించలేదు.

గ్రీకు – రోమను సమాజంలో సమాజాన్ని విప్లవాత్మకమైనరీతిలో తీర్చిదిద్ది, ఉత్పత్తి శక్తులకు అధికారాన్ని కట్టబెట్టగల వర్గమంటూ ఆవిర్భవించలేదు. ఈ పరిస్థితి పశ్చిమ ఐరోపాలో చీకటి యుగాలకు దారి తీస్తే, బాల్కన్స్, ఆసియా మైనర్‌లలో వెయ్యేళ్ల స్తబ్దతను నెలకొల్పింది.

నాల్గవ అధ్యాయం

# ఇస్లామిక్ విప్లవాలు

**జ**స్టీనియన్ హయాం తర్వాత బైజాంటియమ్‌లో నెలకొన్న స్తబ్ధత పాత రోమను సామ్రాజ్యానికి పేలవరూపమైన వ్యవస్థలో కేవలం విచ్ఛిన్న ప్రక్రియకు మాత్రమే పునాదులు వేయలేదు. మానవాళి విజ్ఞాన సంపదకు, ఉత్పత్తి పద్ధతులకు ఎంతో తోడ్పాటునందించిన పశ్చిమ ఆసియాలో కూడా నాటకీయ పరిణామాలకు ఆ సంక్షోభం తెరలేపింది. ఈ ప్రాంతం ప్రపంచంలోనే గొప్ప మతాలుగా ప్రసిద్ధిగాంచిన వాటిలో ఒకదాన్ని అందించింది.

అరేబియా ద్వీపకల్పంలోని ఎడారుల్లో వాణిజ్య పట్టణంగా ఉండిన మక్కా ఈ పరిణామాలకు అనూహ్యమైన వేదిక అయ్యింది. ఈ ప్రాంతంపై సంచార తెగల ప్రాబల్యం ఉండేది. వీరు ఒంటెలపై తిరుగుతూ ఒక నీటి ఆధారం నుండి మరో నీటి ఆధారానికి తమ పశు సంపదతో సహా వలస వెళ్లేవారు. (క్రీ.పూ.1000 నాటికే ఒంటెను ఇంటి ఆవరణలో పోషించడం మొదలుపెట్టారు) ఈ సంచార తెగలు ఒకవైపు వ్యాపారం నిర్వహిస్తూనే మరోవైపు దారి దోపిడికి పాల్పడేవారు. ఈ సంచార ప్రజలు అనేక జాతులుగా, తెగలుగా విడిపోయి ఉండేవారు. కులపెద్దలు వారికి నాయకత్వం వహించేవారు. ఈ తెగలు పరస్పరం కలహించుకోవడమే కాకుండా భూములపై స్థిరపడ్డ వ్యవసాయాధార గ్రామాలపై క్రమం తప్పకుండా దాడులు నిర్వహించేవారు. ఎడారి ప్రాంతానికి అవతల నివసిస్తున్న వారిపై కూడా దాడులు జరిపేవారు.

అయితే ఎడారిలోని నీటి ఆధారాల చుట్టూ వ్యవసాయదారులు కూడా స్థిరపడి ఉండేవారు. అలాగే తీర ప్రాంతాల్లో కూడా, ముఖ్యంగా దక్షిణ భాగంలో, వ్యవసాయం చేసే ప్రజలు గ్రామాల్లో స్థిరపడి ఉండేవారు. ఈ తీర ప్రాంతాల్లో సుమారు వెయ్యేళ్ల చరిత్ర కలిగిన నాగరికత ఉండేది. దానికి ఎర్ర సముద్రం అవతల ఉన్న ఇథోపియన్ నాగరికతతో సంబంధాలు ఉండేవి. ధనం పోగయ్యే కొద్దీ కొన్ని సంచార కుటుంబాలు కూడా వాణిజ్య కేంద్రాల్లో స్థిరపడటం ప్రారంభించాయి. రోమను సామ్రాజ్యం, ఈశాన్య ప్రాంత నాగరికతల మధ్య ఒంటెలపై ప్రయాణం చేస్తూ ఈ కుటుంబాలు విలాస వస్తువుల వ్యాపారం నిర్వహించేవి. ఆ విధంగా

వాటికి అపారమైన ధన సంపత్తి సమకూరింది. మక్కా అలాంటి వలస కేంద్రాల్లో ఒకటి. ఏడవ శతాబ్దం మొదలయ్యే నాటికి మక్కా వ్యాపార కార్యకలాపాలకు కీలకమైన పట్టణంగా ఆవిర్భవించింది.

సంచార జాతుల సాంప్రదాయ విలువలు వ్యక్తిగత ధైర్యసాహసం, కుటుంబ ప్రతిష్టపై ఆధారపడి ఉండేవి. రాజ్య వ్యవస్థ అంటూ ఉండేది కాదు. వ్యక్తిగత బాధ్యతలంటూ ఏవైనా ఉంటే అవి స్వంత తెగ లేదా సముదాయానికి సంబంధించినవై ఉండేవి. ఈ దశలో సామాజిక బాధ్యతలు కూడా ఏవీ ఉండేవి కావు. దాడులు, హత్యలు, దోపిళ్లను కుటుంబం లేదా తెగపై జరిగిన అత్యాచారంగా పరిగణించేవారు. అందుకు సరైన రీతిలో ప్రతీకారం తీర్చుకునేవారు. ఈ ప్రక్రియలో రక్తపాతం ఎక్కువగా సంభవించేది. ఒక తెగ సముదాయంతోపాటు ప్రయాణించే వ్యక్తిగత దైవంతో ముడిపడి ఉండడం వరకే మతం పరిమితమయ్యేది. ఉదాహరణకు పాత నిబంధనల్లో పేర్కొన్నట్లు ఎడారుల్లో సంచార జీవితం గడిపిన 'ఇజ్రాయేలు సంతానం' తను వ్యక్తిగత ఆరాధ్య దైవమైన ఆర్క్ ఆఫ్ కావెనంట్‌ను ఎల్లప్పుడూ మోసుకెళ్లేవారు.

కొందరు సంచార జాతి ప్రజలు స్థిరమైన జీవితాన్ని అనుసరించే కొద్దీ తలెత్తిన వివాదాలు, ఘర్షణలను వారి సాంప్రదాయ విలువలు ఏ విధంగానూ పరిష్కరించలేకపోయేవి తరతరాలుగా స్థిరపడిపోయిన రైతులు, పట్టణ ప్రజలు సంచార తెగలతో సంబంధాలను ఎప్పుడో తెంచుకున్నారు. దక్షిణ అరేబియాలో క్రైస్తవ మతం విస్తరించింది. వ్యవసాయదారులు యూదు మతాన్ని, లేదా ఆ మతంలోని ఆయా పంథాలలో ఒకదాన్ని (ఇందులోక్రైస్తవం కూడా ఒకటి) స్వీకరించారు. మక్కా లాంటి నగరంలో సంచార తెగలు, వ్యాపారులు, చేతి వృత్తిదారులు, రైతుల సమ్మేళనం ఆయా మతాభిప్రాయాలు మధ్య వాదోపవాదాలకు తెరతీసింది. కొన్ని వాదనలకు ఆచరణాత్మకమైన పరిణామాలు ఉండేవి. ఎందుకంటే పాత విలువలు, దైవాలు సముదాయ లేదా తెగపట్ల విధేయతను సవాలు చేసే ఏ ఒక్క మత చట్టాన్ని లేదా నైతిక వర్తనాన్ని ఆమోదించేవి కావు.

అరేబియా సరిహద్దులో ఉన్న బైజాంటియమ్ పర్షియా మహాసామ్రాజ్యాలలో సంభవిస్తున్న పరిణామాలు ఈ సంక్షోభాన్ని (మతపరమైన) మరింత తీవ్రతరం చేశాయి. ఆరవ శతాబ్దం చివరిలో బైజాంటియమ్ సామ్రాజ్యం నుండి ఈజిప్టు, సిరియాలను పర్షియా స్వల్పకాలం పాటు హస్తగతం చేసుకుంది. ఆ విధంగా సుమారు 900 సంవత్సరాల పాటు సాగిన గ్రీకు-రోమను ఆధిపత్యానికి తెరదించింది. కాని అప్పటికే పర్షియా సమాజం సంక్షోభంలో కూరుకుపోయింది. బడా భూస్వామ్య వర్గాలు మెసపటోమియా (వ్యవసాయ) నీటిపారుదల వ్యవస్థలను నిర్లక్ష్యం చేయడం వల్లే ఆ సంక్షోభం ముదిరింది. ఈ నీటి ఆధారాలు నగరాలకు అవసరమైన నిల్వలను సమకూరుస్తూ వాటి పురోగతికి సహకారం అందించేవి. యుద్ధ వినాశనం పరిస్థితులను మరింత దిగజార్చింది. రెండు సామ్రాజ్యాల్లోనూ పేదరికం, సామాజిక అభద్రత విలయతాండవం చేశాయి. ప్రపంచమంతటా అరాచక పరిస్థితులు నెలకొన్నాయన్న భావనను ఆ సంక్షోభం ప్రతిబింబించింది.

ఇలాంటి ప్రాపంచిక పరిస్థితులలో మక్కాకు చెందిన మహమ్మద్ అనే అనాధ బాలుడు పెరిగి పెద్దయ్యాడు. అతడు ఎలాంటి ప్రాధాన్యత లేని వ్యాపార కుటుంబానికి చెందిన వాడు. యుక్తవయస్సులో వ్యాపారిగా స్థిరపడటానికి అతడు విఫలయత్నం చేశాడు. తన చుట్టూ ఉన్న ప్రపంచంలో నెలకొన్న అరాచక పరిస్థితులను అతడు మానసిక సంఘర్షణగా పరిగణించాడు. ఈ సంఘర్షణలో నిమగ్నమైన పరస్పర విరుద్ధమైన ప్రాపంచిక దృష్టికోణాలు, విలువలు ఏవీ అతడికి వివేకవంతమైనవిగా కనిపించలేదు. తన స్వంత జీవితానికి, అలాగే తాను జీవిస్తున్న సమాజానికి ఒక అర్థాన్ని ఇవ్వడానికి కృషి చేయాలని సంకల్పించాడు. అతడికి వరుసగా దివ్య దర్శనాలు కలిగాయి. అందులో దేవుడు (అరబిక్ లో అల్లాహ్)తనతో మాట్లాడాడని మహమ్మద్ విశ్వసించాడు. ఈ దివ్య దర్శనాల ఆధారంగా అతడు వివిధ మత సిద్ధాంతాలను కొత్త పంథాలో జోడించాడు. మహమ్మద్ పలుకులకు ఇతరులు ఖురాన్ రూపంలో లిఖించారు. క్రమంగా అనుచర వర్గాన్ని నిర్మించారు. కొత్త మతంలో ఎక్కువగా మక్కాలోని వివిధ వ్యాపార కుటుంబాలకు చెందిన యువకులు చేరారు.

అరబ్రైతులు, పట్టణ ప్రజలు అనుసరించే క్రైస్తవ, యూదు మతాల బోధనలతో మహమ్మద్ సందేశానికి చాలా పోలికలు ఉండేవి. సంచార పశుపోషకుల బహుదైవాల స్థానంలో ఆ సందేశం ఏకేశ్వరవాదాన్ని సమర్థించింది. పాత సముదాయ, తెగ నియమావళి స్థానంలో అది సార్వజనిక బాధ్యతల ఆధారంగా మత విశ్వాసాలను నిర్మించింది. ఏకపక్ష అణచివేతకు వ్యతిరేకంగా దైవ సంరక్షణను ప్రస్తుతించడంతో పేదలు మహమ్మద్ సందేశం పట్ల ఆకర్షితులయ్యారు. అయితే అది ధనికులను పూర్తిగా ధిక్కరించలేదు. దాతృత్వం చూపే ధనికులను తన పంథాలోకి అనుమతించింది. తొలి క్రైస్తవ మతం లాగే మహమ్మద్ సందేశం కూడా పట్టణ మహిళలను ఆకర్షించింది. (మహమ్మద్ అనుచర బృందంలో కొందరు గృహిణులు ఉండేవారు. అయితే వారి భర్తలు ఆ బృందాన్ని తీవ్రంగా వ్యతిరేకించేవారు.) కొత్త మతం మహిళలు పురుషులకు లోకువేనని భావించినా (ఉదాహరణ బైజాంటిన్ సామ్రాజ్యంలో అమల్లో ఉన్న పర్దా వ్యవస్థను ఆమోదించింది) మగవారు మహిళల కంటే అధికులైనా వారి పట్ల అనుచితంగా వ్యవహరించకూడదని ప్రబోధించింది. అలాగే మహిళలకు కొన్ని ఆస్తి హక్కులను ప్రసాదించింది.

మతపరమైన సిద్ధాంతానికి వస్తే మహమ్మద్ సందేశం యూదు, క్రైస్తవ మతాచారాలు, పురాణ గాథలు రెండింటిని కలిగి ఉంది. కాని ఒక ముఖ్యమైన విషయంలో ఆ సందేశం అప్పటి క్రైస్తవ మతసారాలతో విభేదించింది. ఆ సందేశం కేవలం నైతిక ప్రవర్తనకు సంబంధించిన విశ్వాసాలు లేదా నియమాల పుట మాత్రమే కాదు, సమాజాన్ని సంస్కరించే రాజకీయ కార్యక్రమం కూడా. పోటీతత్వమనే పాశవికత స్థానంలో (తరచూ యుద్ధాల రూపంలో జరిగే పోటీ) మత చట్టాల ఏకైక నియమావళి ఆధారంగా నడుచుకునే ఉమ్మా సముదాయాన్ని అది సూచించింది.

మహమ్మద్ ప్రవచనాల్లోని ఈ రాజకీయ అంశం మక్కా పాలక కుటుంబాల సంఘర్షణలకు దారి తీసింది. ఫలితంగా మహమ్మద్ అనుచరవర్గం మదీనా పట్టణానికి

బలవంతంగా వలస వెళ్లాల్సి వచ్చింది. ఎట్టకేలకు క్రీ.శ 630లో మక్కాలో కొత్త రాజ్యాన్ని స్థాపించడానికి మహమ్మద్ ఒక పెద్ద సైన్యంతో తిరిగి వచ్చాడు. ఈ ప్రయత్నంలో అతడు విజయం సాధించాడు. ఎందుకంటే ఏక ప్రాపంచిక దృష్టికి కట్టుబడిన యువకులను అతడు సమీకరించగలిగాడు. వారు వ్యూహాత్మకమైన పొత్తులు కుదుర్చుకొని తమ లక్ష్యాన్ని సాధించగలిగారు. విశేషమేమిటంటే మహమ్మద్ అనుచర బృందం కుదుర్చుకున్న పొత్తుల లక్ష్యం ఆయా వర్గాలు లేదా సముదాయాలకు వేర్వేరుగా ఉండేది. వారితో కలిసిన రైతులు, పట్టణప్రజలు శాంతిని కోరుకున్నారు. వ్యాపార కుటుంబాలు భవిష్యత్‌లో ఏర్పడబోయే శక్తివంతమైన అరబ్ రాజ్యం తమకు ఎనలేని లాభాలు తెచ్చి పెడుతుందని ఆశించారు. తెగనాయకులు యుద్ధఫలాలను కోరుకున్నారు.

గొప్ప సామ్రాజ్యాలలో నెలకొన్న జంట సంక్షోభాలను తనకు అనుకూలంగా మలచుకునే స్థితిలో కొత్త రాజ్యం ఉండేది. క్రీ.శ. 632లో మహమ్మద్ మరణించాడు. అయితే అతడి తొలి ఇద్దరు వారసులు లేదా ఖలీఫాలు అబు బకర్, ఉమర్‌లకు (వీరు వ్యాపార కుటుంబాలకు చెందిన వారు. మహమ్మద్‌కు సుదీర్ఘకాలం పాటు శిష్యులుగా ఉన్నారు.) మత సూత్రాలకు రాజకీయ విజ్ఞతను జోడించడం కూడా తెలుసు. ఎప్పుడూ కలహించుకునే వైరి తెగల శక్తియుక్తులను మళ్లించి రెండు మహాసామ్రాజ్యాలకు చెందిన సంపన్న నగరాలపై దాడులు నిర్వహించారు. ఈ ప్రక్రియలో ఆ సామ్రాజ్యాలు ఎంత బలహీనంగా ఉన్నాయో తెలుసుకున్నారు. అరబ్ సైన్యాల ధాటికి నగరాలు ఒకదాని తర్వాత ఒకటి వరుసగా కూలాయి. క్రీ.శ. 636లో దమాస్కస్, 637లో పర్షియా రాజధాని టెలిఫాన్, 639లో ఈజిప్టు మహాప్రాకారాల నగరం బాబిలాన్ (ఇప్పుడు ఇది కైరోలో అంతర్భాగంగా ఉంది), 642లో అలెగ్జాండ్రియా అరబ్ సైన్యాల వశమయ్యాయి. పదేళ్ల స్వల్పకాలంలోనే మహమ్మద్ అనుచరులు మహా సామ్రాజ్యాన్ని నిర్మించారు. అందులో పశ్చిమాసియాకు చెందిన చారిత్రక నాగరికతల భూములన్నీ అంతర్భాగమయ్యాయి.

ఈ విజయాలు ఆయా సంచార తెగల యుద్ధ సామర్థ్యాన్ని తెలివిగా వినియోగించడం వల్ల కొంత వరకు సాధ్యమయ్యాయి. సంచార యోగ్యం కాని ఎడారి ప్రాంతాల గుండా ఒంటెలపై వేగంగా చొచ్చుకుపోతూ సరిహద్దు సామ్రాజ్యాల్లో ఉన్న నగరాలపై ఆకస్మికంగా శక్తివంత మైన దాడులు నిర్వహిస్తే విజయం తథ్యమని ఇస్లామిక్ సైనికాధికారులు గుర్తించారు. పాత బ్రిటీష సామ్రాజ్యయుద్ధనౌకలు విశాలమైన సముద్ర జలాలను వినియోగించినట్లే అరబ్ సైన్యాలు కూడా విశాలమైన ఎడారులను వినియోగించుకొని శత్రు సైన్యాలను తమకు తోచిన సమయంలో మట్టికరిపించాయి. వైరి పక్షాలు అరబ్ సైన్యాల వేగాన్ని అందుకోలేక పోయాయి. దూరపు లక్ష్యాలను ఛేదించేందుకు ఆధునిక సైన్యాలు పారాట్రూపర్లను వినియోగించిన స్థాయిలో అరబ్ సైన్యాల దాడులు జరిగేవి.

అయితే ఈ విజయాలు మరో కోణాన్ని కూడా ఆవిష్కరించాయి. రెండు మహా సామ్రాజ్యాల్లో పాలకవర్గాల పట్ల ప్రజలకు ఎంత ద్వేషభావం ఉండేదో అవి నిరూపించాయి. పట్టణ

జనాభాలో అత్యధిక సంఖ్యలో ఉండే యూదులు, ఉదారవాద క్రైస్తవులు అరబ్ సైన్యాలకు ఘనస్వాగతం పలికారు. అందుకో కారణం ఉంది. ముస్లిం దండయాత్రికులు తొలుత కొత్త రాజ్యవ్యవస్థలను సృష్టించాలని యోచించలేదు. అలాగే పరాధీనులను తమ మతంలోకి మార్చడానికి ప్రయత్నించలేదు. అందుకు భిన్నంగా వారు పాత పాలనాయంత్రాంగాలను చాలా వరకు అలాగే వదిలి వెళ్లారు. క్రైస్తవులు, యూదులు పర్షియా జొరాస్ట్రీయన్ల మత భావాలను గౌరవించారు. వారు కోరుకున్నదల్లా పన్నుల సత్వర చెల్లింపే. రాజ్యం, పాలక వర్గాల ఆస్తులను తమకు స్వాధీనం చేయాలని ఆదేశాలు జారీ చేశారు. పాలక వర్గాలు అప్పటికీ విదేశీ ఆక్రమణను ప్రతిఘటిస్తూ ఉన్నారు. విశాలమైన ప్రజానీకానికి పాత సామ్రాజ్యంలోని అణచివేత పరిస్థితుల కంటే కొత్త పరిస్థితులు కొంత సరళంగా కనిపించాయి.

"సృష్టికర్త మిమ్ములను (ప్రజలను) పాపచింతన నుండి రక్షించడానికి ఇస్మాయెల్ రాజ్యాన్ని (అరబ్‌ల రాజ్యాన్ని) తీసుకొచ్చాడని," ఒక యూదు రచయిత వ్యాఖ్యానించాడు. అలాగే ఒక సిరియన్ క్రైస్తవ చరిత్రకారుడు ఇలా పేర్కొన్నాడు: "దేవుడా! మమ్ములను రోమన్ల కబంధహస్తాల నుండి అరబ్‌ల సాయంతో రక్షించు.... రోమన్ల కిరాతకం నుండి, మా పట్ల వారికున్న తీవ్రమైన ద్వేష భావం నుండి విముక్తి కల్పించు".

ఈ దండయాత్రల నుండి మొదట లాభపడినవారు మాత్రం అరబ్ యుద్ధతెగల నాయకులు, మక్కాకు చెందిన ఉన్నత కుటుంబీకులే. యుద్ధఫలాలను వారు పరస్పరం పంచుకున్నారు. ఫలితంగా స్వల్పకాలంలోనే వారు అరబ్ పాలకవర్గంగా ఆవిర్భవించారు. ఈ పాలకవర్గం అత్యంత సంపన్నమైనది. కాని అగ్రకులాల్లోని ఒక చిన్న వర్గానికే ప్రాతినిధ్యం వహించేది. ఎడారి శివార్లలో కొత్తగా నిర్మించిన సైనిక స్థావరాలలో ( వీటిని పాలనావసరాలకు కూడా వినియోగించేవారు) నివసిస్తూ ఈ కొత్త వర్గం ప్రజానీకం నుండి పన్నుల రూపంలో కప్పాన్ని వసూలు చేసేది. అయితే పాత సామ్రాజ్యంలోని ఆయా ప్రాంతాల నిర్వహణను స్థానిక భూస్వాములు, పాత అధికార యంత్రాంగానికే వదలివేసింది.

ఊహించినట్లుగానే యుద్ధ విజయాలు ఆయా సైనిక బలగాల మధ్య విభేదాలకు ఆజ్యం పోశాయి. యుద్ధ ఫలాల పంపిణీలో తమకు అన్యాయం జరిగిందన్న భావనతో కొన్ని అరబ్ తెగలు కుమిలిపోయాయి. 640 దశకంలో ఈ అసంతృప్తి భావన మరింత తీవ్రమైంది. చివరికి అది అంతర్యుద్ధానికి దారి తీసింది. ఈ అంతర్గత సంఘర్షణ ఇస్లాం చరిత్ర అంతటిపై చెరగని ముద్ర వేసింది. రెండవ ఖలీఫా ఉమర్ హత్య తర్వాత ( 644లో అతడిని ఒక బానిస హత్య చేశాడు) అధికార పగ్గాలు ఉథ్మన్ చేతికి దక్కాయి. ఇతడు మహమ్మద్ తొలి అనుచరుడే కాకుండా మక్కాకు చెందిన అత్యంత సంపన్నమైన వ్యాపార కుటుంబ సభ్యుడు కూడా. అధికార మార్పిడి అంతర్గత వైషమ్యాలను మరింత పెంచింది. ఉథ్మన్ 656లో హత్యకు గురయ్యాడు. మహమ్మద్ సమీప బంధువు, అల్లుడైన అలీ ఖలీఫాగా ఎన్నిక కావడంతో ప్రత్యర్థి ముస్లిం సైన్యాల మధ్య బహిరంగ యుద్ధం జరిగింది. ఖరిజైత్‌లు అని పిలవబడే కొందరు స్వంత

అనుచరులు అలీని హత్య చేసే వరకు రక్తపాతం ఆగలేదు. ప్రత్యర్థులతో అలీ రాజీపడటాన్ని అతడి అనుచరులు జీర్ణించుకోలేకపోయారు. పరిస్థితులు చేయిదాటడంతో వారు తమ నాయకుని అడ్డు తొలగించారు. ఉథ్మన్ సమీప బంధువు అధికారాన్ని చేజిక్కించుకున్నాడు. అతడు ఉమాయ్యద్ అనే వంశాన్ని స్థాపించాడు. ఉమాయ్యద్ కుటుంబీకులు వంశపారంపర్యంగా పాలన కొనసాగించారు.

విజయవంతమైన ఈ కుటుంబం మహమ్మద్ ప్రవచనాలకు వ్యతిరేకంగా వ్యవహరిస్తోందని చాలా మంది భావించారు. మహమ్మద్ వ్యతిరేకించిన దుర్గుణాలు, పాప కార్యలతో ఉమాయ్యద్‌లు గుర్తించబడ్డారు. మహమ్మద్ ప్రవచనాలను గట్టిగా సమర్థించేవారు గత వైభావాన్ని కోరుకున్నారు. 680లో ఉమాయ్యద్ సైన్యం చేతిలో హత్యకు గురైన అలీ, అతడి కుమారుడు హుస్సేన్‌లను అమరవీరులుగా పూజించడం మొదలుపెట్టారు. మహమ్మద్ జీవించిన కాలాన్ని వారు స్వచ్ఛతకు, నైతికతకు చిహ్నంగా భావించారు. కాని ఉమాయ్యద్‌ల పాలనలో మత విలువలు భ్రష్టుపట్టిపోతున్నాయన్న ఆగ్రహంతో ఊగిపోయారు. తదుపరి ఇస్లామిక్ చరిత్రలో అలీ లేదా తొలి ఇద్దరు ఖలీఫాల రాజ్యం తీసుకురావాలన్న ఆకాంక్షలు తరచుగా వ్యక్తమయ్యాయి. ప్రజలు తమ ఆకాంక్షలను నెరవేర్చుకోవడానికి విప్లవాన్ని ఒక మార్గంగా ఎంచుకున్నారు. రాజ్య వ్యవహారాలను ఒక సామాజిక వర్గం నుండి మరో సామాజిక వర్గానికి అప్పగించడమే ఈ విప్లవాల లక్ష్యమైపోయింది. నేడు కూడా కొందరు ఇస్లామిక్ ఛాందసవాదులు ఇలాంటి పిలుపులే (విప్లవం కోసం) ఇస్తున్నారు.

అయితే, ఆ సమయం వరకు, ఉమాయ్యద్‌లు ఇస్లామిక్ సామ్రాజ్య ప్రాబల్యాన్ని సుస్థిరపరిచారు. సిరియాలో రాజధానిని స్థాపించారు ఈశాన్యంలో కాబుల్, బుఖారా నగరాలను స్వాధీనం చేసుకోవడానికి, పశ్చిమంలో అట్లాంటిక్ తీరానికి విస్తరించడానికి అరబ్ సైన్యాలు బయల్దేరి వెళ్లాయి. ఈ దండయాత్రల వల్ల అరబ్ పాలకవర్గానికి అంతులేని సంపద లభించింది. ఈ వర్గంలోని వారందరూ పూర్వపు యుద్ధ తెగల నాయకులు, మాజీ వ్యాపారులే కావడం విశేషం. చుట్టూ ప్రాకారాలతో నిర్మించబడిన నగరాలలో పాలక వర్గాలు విలాసవంతమైన జీవితాన్ని గడపడం మొదలుపెట్టారు. తమ స్వంత అవసరాల కోసం విశాలమైన భవంతులను నిర్మించుకున్నారు. పాలకవర్గంలో తదుపరి శ్రేణులైన అరబ్ సైన్యాలను పన్నుల నుండి మినహాయించారు. దండయాత్రల్లో లభించిన ధనసంపత్తి నుండి సైనికాధికారులు, సైనికులకు జీతభత్యాలు, పెన్షన్లు మంజూరు చేశారు.

## పట్టణ వర్గాలు- మతపరమైన తిరుగుబాట్లు

సువిశాలమైన ప్రాంతాన్ని ఒకే సామ్రాజ్యం పరిధిలోకి చేర్చడం వల్ల విలాస వస్తువుల వాణిజ్యానికి మరింత ప్రోత్సహం లభించింది. వ్యాపారులు, దుకాణదారులు, చిన్నస్థాయి ఉద్యోగులు, చేతివృత్తిదారులు నగరాలకు చేరుకొని శివార్లలో స్థిరపడ్డారు. నగర ప్రాకారాల

బయట వ్యాపార కార్యకలాపాలు నిర్వహిస్తూ అరబ్ పాలకులు, వారి రాజభవనాలు, సైన్యాలు, వాటి నిర్వాహకుల అవసరాలను తీర్చారు. వీరంతా అరబేతరులు, కాని తమ పాలకుల మతం వైపు ఆకర్షితులయ్యారు. ఈ మతం పాత సామ్రాజ్యాల్లో వెలసిల్లిన ఏకేశ్వర వాద మతాలకు ఏ మాత్రం భిన్నంగా లేకపోవడంతో దానిని స్వీకరించడానికి వారు ఏ మాత్రం సంకోచించలేదు. అయితే కొత్త వారికి తమ మతంలో ప్రవేశం కల్పించడానికి అరబ్ ముస్లింలు ఆసక్తి చూపలేదు. మరీ ముఖ్యంగా మత హక్కు అయిన పన్నుల మినహాయింపు, సామ్రాజ్య సంపదలో వాటాను కొత్త వారికి ప్రసాదించడానికి పాలక వర్గం ఇష్టపడలేదు. అందుకే కొత్తగా మతాన్ని స్వీకరించిన వారిని 'మవాలీ' గా వర్గీకరించి అరబ్‌లు అనుభవిస్తున్న ప్రత్యేక హక్కుల నుండి మినహాయించారు. అరబ్‌లు తమను తాము పరిపూర్ణమైన ముస్లింలుగా భావించేవారు.

ముస్లిం సామ్రాజ్యానికి వందేళ్లు పూర్తయ్యే నాటికి సామ్రాజ్యంలోని ప్రధాన నగరాలన్నింటిలోనూ అరబేతర ముస్లింలే అత్యధిక సంఖ్యలో ఉండేవారు. వాణిజ్య, పారిశ్రామిక వ్యవహారాలలో కీలకమైన పాత్రను వారే పోషించేవారు. ఈ రంగాలను పూర్వపు అరబ్ వ్యాపారులు పూర్తిగా వదిలివేసి పాలకవర్గంలో చేరి పోయారు అధికార యంత్రాంగంలో కూడా అరబేతరులు కీలక స్థానాల్లో ఉండేవారు. కాని ఈ వర్గాల పట్ల వివక్ష మాత్రం ఎప్పటిలాగే కొనసాగింది.

'షియాతు అలీ' అని తమను తాము ప్రకటించుకున్న కొన్ని ముస్లిం అసమ్మతి వర్గాలకు (అలీ పక్షం లేదా క్లుప్తంగా షియాలు) ప్రజలను తమ వైపు తిప్పుకోవడానికి ఎంతో సమయం పట్టలేదు. గతంలో కూడా అలీకి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించడానికి ఖారీజాలకు ఎక్కువ సమయం పట్టలేదు. మత విశ్వాసాలకు భంగం వాటిల్లుతోందన్న ఆరోపణపై రెండు సందర్భాల్లోనూ అసమ్మతివాదులు పాలకవర్గానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టారు. (అవిశ్వాసులతో అలీ రాజీపడి మతాన్ని భ్రష్టు పట్టించాడన్న నేరంతో ఖారీజాలు అతడిని హత్య చేశారు.) మహమ్మద్ జీవించి ఉన్నప్పుడు మక్కా ప్రజలను అన్యాయమైన, దోపిడిదారి వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపు ఇచ్చాడు. ఇపుడు పట్టణ వర్గాలు మహమ్మద్ అనుచరులు ఏర్పాటు చేసిన రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడానికి అతడి ప్రవచనాలనే సాధనంగా ఎంచుకున్నారు. కొత్త వ్యవస్థను ఏర్పాటు చేద్దామనే నినాదం మార్మోగింది. పీడిత వర్గాలను పాలకుల అణచివేత, దోపిడీ నుండి ఆ నినాదం విముక్తి కల్పించగలదని తిరుగుబాటుదారులు ఘోషించారు.

ఈ ఘర్షణలను కొందరు చరిత్రకారులు పర్షియన్లు, అరబ్‌ల మధ్య చెలరేగిన ఘర్షణలుగా వర్గీకరించారు. అయితే వాస్తవం అందుకు విరుద్ధంగా ఉంది. పర్షియన్ పాలకవర్గం ఉమాయ్యద్‌లను సమర్థించగా, రాజ్యం పట్ల అసంతృప్తి పెంచుకున్న వారిలో ఎక్కువగా అరబ్బులే ఉండేవారు.

"తమ స్వార్థపర ప్రయోజనాలను పరిరక్షించనంత కాలం పర్షియా పాలకవర్గం అరబ్ సామ్రాజ్యంతో సహకరించింది. మతం మార్చుకున్న తర్వాత తమ జొరాస్ట్రియన్ సాంప్రదాయాలను వదలి సనాతన ముస్లింలుగా పర్షియన్లు స్థిరపడ్డారు. ఇస్లామీకరణ చెందిన పర్షియా పట్టణ ప్రజలు, రైతులు కూడా జొరాస్ట్రియన్ మత గ్రంథాల స్థానంలో ఇస్లామిక్ తిరుగుబాటు ప్రవచనాలను ఎంచుకున్నారు. అరబ్, పర్షియన్ పాలకవర్గాలు రెండింటికీ వ్యతిరేకంగా కొత్త సిద్ధాంతాలను ఆచరణలో పెట్టారు."

వర్గవైషమ్యాలు పెరిగే కొద్దీ తిరుగుబాట్లు కూడా వరుసగా సంభవించాయి. వాటికి ఆయా మహదీ వర్గాలు నాయకత్వం వహించాయి. అవి కొత్త మత, సామాజిక వ్యవస్థ ఏర్పాటును ప్రబోధించాయి. ఈ తిరుగుబాట్లన్నీ అణచివేయబడ్డాయి. కాని ఎనిమిదవ శతాబ్దం మధ్యదశకాల్లో అరబ్ సైన్యాల నాయకుల మధ్య అంతర్గత పోరు మళ్లీ ప్రారంభమయ్యింది. హషేమ్ కుటుంబానికి చెందిన మహమ్మద్ వారసుడు అబూ-ఎ-అబ్బాస్ ఈ గందరగోళ పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకున్నాడు. తన కుటుంబం విముక్తి చేసిన అబూ ముస్లిం అనే బానిసను నైరుతి పర్షియాకు పంపి అక్కడ సామాజిక మతపరమైన ఆందోళనను రెచ్చగొట్టించాడు. అబూ ముస్లిం రహస్యంగా పని చేస్తూ బలమైన వర్గాన్ని సిద్ధం చేసుకున్నారు. ప్రజాందోళనకు పరిస్థితులు కలిసి వచ్చేవరకు వేచి చూశాడు. అబ్బాసిద్ నినాదం కింద పశ్చిమ పర్షియా నగరాలు ఒక్కొక్కటిగా తిరుగుబాటుకు మద్దతు ప్రకటించాయి. ఈ వర్గాలకు నల్ల రంగులోని ధ్వజం చిహ్నంగా ఉండేది. ఆ రంగు అణగారిన వర్గాలకు ప్రతీకగా ఉండేది. యూఫ్రేట్స్‌కు చేరుకున్న అబూ ముస్లిం సైన్యం అక్కడ ఉమాయ్యద్‌లకు చెందిన భారీ సైన్యాన్ని ఓడించింది. అంతటి విస్తృతమైన, విజయవంతమైన విప్లవ ప్రచారం ఉమాయ్యద్‌లను ఓడించడంలో అబూ-ఎ-అబ్బాస్‌కు ఎంతో సహకరించింది. అతడు ఉమాయ్యద్ కుటుంబీకులందరినీ హత్య చేయించాడు. కొత్తగా అబ్బాసిద్‌ల వంశాన్ని స్థాపించాడు. తమకు విముక్తి లభిస్తుందని ఆశించిన పేదలకు నిరాశే ఎదురైంది. అబ్బాసిద్ పాలకులు తమ మద్దతుదారుల్లోని విప్లవకారులపై అణచివేతను తీవ్రతరం చేశారు. అబూ ముస్లింను, అతడి అనుచరులను ఊచకోత కోయించారు. అయినా ఈ విప్లవం అధికార మార్పిడి (పాలక వంశాల మార్పు) ని తెచ్చింది తప్ప వ్యవస్థను మార్చలేకపోయింది.

తాను రచించిన ఇస్లాం చరిత్రలో బెర్నార్డ్ లూయిస్ "ఈ విప్లవాన్ని ఇస్లామిక్ చరిత్రలో ముఖ్యమైన అధ్యాయం" గా పేర్కొన్నాడు. దానిని ఐరోపా చరిత్రలో సంభవించిన ఫ్రెంచి లేదా రష్యా విప్లవాలతో పోల్చాడు. కొందరు చరిత్రకారులు ఈ విప్లవాన్ని "బూర్జువా విప్లవం" అని కూడా ప్రస్తావించారు. అయితే ఒక్క విషయం మాత్రం వాస్తవం: అబ్బాసిద్‌లు ప్రజల ఆగ్రహాన్ని సమీకరించి సామ్రాజ్య పాలనను పూర్తిగా పునర్వ్యవస్థీకరించారు. గతంలో

సామ్రాజ్యాన్ని పరిమితమైన అరబ్ సైనిక పాలకవర్గమే శాసించేది. సంపద కోసం యుద్ధాలు, దండయాత్రలు నిర్వహించడంతోనే ఆ వర్గం ఆవిర్భవించింది. అబ్బాసిద్‌ల పాలనలో ఇస్లాం నిజమైన సార్వజనీక మతంగా విస్తరించింది. అందులో అరబ్, అరబేతర విశ్వాసులను సమానంగా గౌరవించేవారు. కుల లేదా తెగ సంబంధాలకు ప్రాధాన్యతనిచ్చేవారు కాదు. అయినప్పటికీ ధనిక, పేద అనే తేడాలు స్పష్టంగా ఉండేవి. వ్యవసాయం, వాణిజ్యం ఆధారంగా శాంతియుతమైన ఆర్థిక వ్యవస్థ సమాజంలో అమల్లో ఉండేది. ఆ సమాజంలో విద్యావంతులైన అధికారులు, వ్యాపారులు, బ్యాంకర్లు, ఉలేమాల ఉన్నత వర్గం ఉండేది. అలాగే మత విద్వాంసులు, న్యాయవేత్తలు, ఉపాధ్యాయులు ఇతర ప్రముఖుల వర్గం కూడా బలంగా ఉండేది. సామాజిక మార్పునకు చిహ్నంగా కొత్త రాజధాని అయిన బాగ్దాద్ నగరం విలసిల్లేది. అత్యంత సారవంతమైన ప్రాంతంలో (మెసపటోమియా) కేంద్రీకృతమైన ఆ నగరం భారతదేశంతో వాణిజ్యానికి ప్రధాన మార్గంగా ఉండేది. పాత పర్షియా రాజధాని టెసిఫాన్ (శిథిలమైన నగరం) కు బాగ్దాద్ కేవలం కొన్ని మైళ్ల దూరంలో ఉండేది.

అబ్బాసిద్ విప్లవం ఆర్థిక ప్రగతిలో నూతన శకాన్ని ఆవిష్కరించింది. మెసపటోమియా, నైలులోని గొప్ప నదీ లోయలు సిరిసంపదలతో, పసిడి పంటలతో పరిఢవిల్లాయి. ఈ ప్రాంతాల్లో గోధుమలు, బార్లీ, వరి, ఆలివ్, పప్పు ధాన్యాలు విస్తారంగా పండేవి. సామ్రాజ్య పాలకులు మెసపటోమియాలోని వ్యవసాయ కాలువలకు మరమ్మతులు చేపట్టడంతో పంట దిగుబడి గణనీయంగా పెరిగింది. భారత్ నుండి దిగుమతి అయిన పత్తిని ఈశాన్య పర్షియా నుండి స్పెయిన్ వరకు ఉన్న వ్యవసాయ భూముల్లో విస్తారంగా పండించారు. సామ్రాజ్య వాణిజ్య కార్యకలాపాలు కూడా భారీ స్థాయిలో ఉండేవి. అరబ్ వ్యాపారులు భారత్, శ్రీలంక, ఈస్ట్ ఇండీస్, చైనాలలో వాణిజ్యం నిర్వహిస్తూ ఆయా దేశాలలో స్థిరపడ్డారు. ముఖ్యంగా దక్షిణ చైనా నగరాల్లో అరబ్ వ్యాపారులు శాశ్వత స్థావరాలను ఏర్పాటు చేసుకున్నారు. అలాగే నల్లసముద్రం నుండి ఓల్గా నది ద్వారా రష్యా వరకు కూడా వాణిజ్యం విస్తరించింది. ఇథోపియా, నైలు లోయగుండా ఆఫ్రికా, యూదు వ్యాపారుల ద్వారా పశ్చిమ ఐరోపాకు వ్యాపార కార్యకలాపాలు విస్తరించాయి. ( స్వీడన్‌లో కూడా అరబ్ నాణేలు పెద్ద సంఖ్యలో లభించాయి.) వాణిజ్యంతో సమాంతరంగా బ్యాంకింగ్ వ్యవస్థ కూడా అభివృద్ధి చెందింది. బాగ్దాద్‌లో ప్రధాన కార్యాలయం గల బ్యాంకులు సామ్రాజ్యంలోని అన్ని నగరాల్లోనూ శాఖలు కలిగి ఉండేవి. చెక్కులు, రుణపత్రాల విశాలమైన వ్యవస్థ అమల్లో ఉండేది. ఈ వ్యవస్థ అమల్లోకి రావడంతో వ్యాపారులు సామ్రాజ్యంలోని ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి బంగారు, వెండి నాణేలను భారీ పరిణామంలో మోసుకెళ్లాల్సిన అవసరం లేకుండా పోయింది. బాగ్దాద్‌లో చెక్కు తీసుకొని మొరాకోలో నగదుగా మార్చుకునే సౌకర్యం ఉండేది. వడ్డీవ్యాపారాన్ని ఖురాన్ బోధనలు నిర్దిష్టంగా తోసిపుచ్చడం కారణంగా క్రైస్తవులు, యూదులే ఎక్కువగా బ్యాంకులను నిర్వహించేవారు. అయితే మాగ్జింరోడిన్‌సన్ పేర్కొన్నట్లు ఖురాన్ నిబంధనలను అధిగమించే మార్గాలను అన్వేషించడంలో ముస్లిం వ్యాపారులు ఏ మాత్రం ఆలస్యం చేయలేదు.

చేతివృత్తిదారుల ఆధారంగా నెలకొల్పిన పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందాయి. ముఖ్యంగా చేనేత రంగంలో ఎన్నో పరిశ్రమలు ఏర్పాటయ్యాయి. అలాగే మట్టి, పింగాణి పాత్రల తయారీ, లోహ పరికరాల తయారీ, సబ్బు, అత్తరు, కాగితం తయారీ (చైనా నుండి దిగుమతి అయ్యింది) పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందాయి. వాణిజ్యపరమైన జీవనం, నగరాల ప్రగతి ఛాయలు సాహిత్యం, ఆలోచనల్లో కూడా కనిపించాయి. నిజాయితీపరుడైన వ్యాపారిని ఆదర్శ పురుషునిగా కొలిచేవారు ప్రఖ్యాతిగాంచిన అరేబియన్ నైట్స్ కథలు బూర్జువా వర్గానికి చెందిన వ్యాపారులు, హస్తకళాకారుల జీవనశైలిని ప్రతిబింబిస్తాయి. ఈ వర్గంలో ధనిక వ్యాపారులు, తిండిగింజల వ్యాపారులు, పన్ను చెల్లించే రైతులు, దిగుమతిదారులు, నగరాల్లో స్థిరపడిన భూస్వాములు ఉన్నత స్థానాన్ని కలిగి ఉండేవారు.

ఈ కాలంలోనే మహమ్మద్ ప్రవచనాలు (హదీస్‌లు), ఇస్లామిక్ చట్టాల (షరియా)ను మత విద్వాంసులు అధికారికంగా సంకలించడం మొదలు పెట్టారు.

పశ్చిమ దేశాలలో నేడు ఈ చట్టాలను (షరియా) అనాగరికమైన నిబంధనలుగా నిందిస్తున్నారు. యూదు-క్రైస్తవ మత సూత్రాలు మానవీయమైనవని, నాగరిక సమాజ స్థాపనకు ఉద్దేశించబడినవని ఘోషిస్తున్నారు. అయితే తొమ్మిది, పదవ శతాబ్దాలలో ఈ ఇస్లామిక్ చట్టాలు కొంత వరకు వ్యాపారులు, చేతివృత్తిదారుల విలువలకు ప్రాతినిధ్యం వహించేవి. పై రెండు వర్గాలు సామ్రాజ్య అధికార యంత్రాంగం, భూస్వాముల కబంధ హస్తాల నుండి విముక్తి కావాలని ఆకాంక్షించాయి. ఆ లక్ష్యం వైపు నిర్దిష్టమైన చర్యలు తీసుకున్నాయి. క్రైస్తవ బైజాంటియంలో నెలకొన్న పరిస్థితులకు భిన్నంగా ఈ వర్గాలు వ్యవహరించాయి. అప్పటికే పశ్చిమ ఐరోపాలో అభివృద్ధి చెందుతున్న భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా రైతాంగం చేపట్టిన ఆందోళనతో అరబ్ వ్యాపారులు, చేతివృత్తిదారుల పోరాటానికి అసలు పోలికలే లేవు. ఇస్లాం చరిత్రకారుడు ఒకరు వ్యాఖ్యానించినట్లు “మధ్య తరగతి ఆకాంక్షలను ప్రతిబింబించే సమసమాజ సంబంధాలను పటిష్టం చేసే దిశగానే షరియా చట్టాలు రూపొందించబడ్డాయి. వ్యవసాయధార సామ్రాజ్యాలకు భిన్నంగా షరియా తన స్వయం ప్రతిపత్తిని కొనసాగించింది.” వ్యాపారులు, చేతివృత్తిదారులు సమాజాన్ని పారదర్శకంగా పునర్వ్యవస్థీకరించాలని ఆశించారు. సమానత, సమన్యాయం సూత్రాల ఆధారంగా సమసమాజాన్ని నిర్మించాలని, అందుకు ఇస్లాం చట్టబద్ధ సాధనం కావాలని ఆకాంక్షించారు.

మొత్తం మీద ఈ చారిత్రక ఘట్టాల్లో విలువల సంఘర్షణలు మేధోవికాసానికి బాటలు వేశాయి. ఈ ఘర్షణలు సమాజంలో సంభవిస్తున్న విప్లవాత్మక మార్పుల వల్లే చోటు చేసుకున్నాయి. ఇస్లాంను సనాతనవాద మతంగా తీర్చిదిద్దాలన్న ప్రయత్నం ఒక్కటి కూడా జరగలేదు. ప్రత్యర్థి మత సంస్థలు ప్రజల మదిని దోచుకోవడంపైనే ఎక్కువ దృష్టిని సారించేవి. పట్టణ ప్రజల్లోని పేద వర్గాలు షియా సిద్ధాంతాలవైపు ఆకర్షితులయ్యారు. ఈ సిద్ధాంతాలు

సామ్రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లను ప్రోత్సహించాయి. షియా వర్గాలు తిరుగుబాటు తేవడానికి ముమ్మర ప్రయత్నాలు చేశాయి.

ఈ లోపు కవులు, విద్వాంసులు, తత్త్వవేత్తలు (సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాలకు చెందిన) బాగ్దాద్‌కు వలస వచ్చారు. ధనిక రాచకుటుంబీకుడు, భూస్వామి లేదా వ్యాపారి పోషణను ఆశిస్తూ వారు పెద్ద సంఖ్యలో రాజధానికి మకాం మార్చారు. గ్రీకు, పర్షియన్, సిరియాక్ (ప్రాచీన సిరియా భాష) భాషల్లో వెలువడ్డ సాహిత్య గ్రంథాలను అరబిక్‌లో అనువదించారు. అలాగే భారతీయ తత్త్వశాస్త్రం, గణిత శాస్త్రం, ఔషధ గ్రంథాలను కూడా అనువదించారు. అల్-కిందీ, అల్-ఫరాబీ, ఇబ్న్‌సినా (ఇతడిని పశ్చిమ దేశాలలో అవిసెన్నాగా పరిగణిస్తారు) లాంటి తత్త్వవేత్తలు ప్రపంచ పరిస్థితులను తార్కికంగా వివరించడానికి ప్రయత్నించారు. అందుకు ప్లాటో, అరిస్టాటిల్ లాంటి సిద్ధాంత కర్తల ఆలోచనలను ఆధారం చేసుకున్నారు. అల్-ఖ్వరాజ్మి, అల్-బుజ్‌జాని, అల్-బిరౌనీ లాంటి గణిత విద్యాంసులు గ్రీకు, భారతీయ గణితశాస్త్రాలను జోడించి వాటిని మరింత అభివృద్ధి పరిచారు. ఖగోళ శాస్త్రజ్ఞులు కొత్త సూత్రీకరణలను కనుగొన్నారు. భూమి వైశాల్యాన్ని నిర్దిష్టంగా లెక్కించారు.

## దోపిడీదారులు - అచేతనం

చీకటి యుగపు ఐరోపాతో సహా పతనమవుతున్న బైజాంటియమ్ సామ్రాజ్యానికి భిన్నంగా ముస్లిం సామ్రాజ్యం విస్తరించింది. అయితే కాలగమనంలో ఎన్నో ఘోర తప్పిదాలు చేయడంతో ప్రగతిశీల స్వభావాన్ని కోల్పోయింది. ఫలితంగా చైనా వలే సాంకేతికాభివృద్ధి, సృజనాత్మకతను సాధించలేకపోయింది.

**మొదటి అంశం :** పట్టణ జీవనం, సంస్కృతితో సమాంతరంగా ఉత్పాదనా పద్ధతులు అభివృద్ధి చెందలేకపోయాయి. వాణిజ్య విస్తరణ, రాజ్య నిర్వహణపై పట్టణ మధ్య తరగతి (వ్యాపారవర్గం)కి పట్టును అబ్బాసిద్ విప్లవం పెంచగలిగింది. కాని నిర్దిష్టమైన అధికారమంతా దోపిడీవర్గాల చేతుల్లోనే ఉండిపోయింది. పాలకవర్గాలు ఇతరులు సాధించే ఉత్పాదనపైనే ఆధారపడేవి. రాచరిక ఆస్థానం సాంప్రదాయబద్ధమైన సామ్రాజ్యవాద లక్షణాలను (ఆగ్నేయ ప్రాంత సామ్రాజ్యాల స్వరూపం) అలవర్చుకుంది. పాలకుల గొంతెమ్మ కోరికలు తీర్చడానికి, వారి అనుంగు అనుచరులను మెప్పించడానికి సంపదను భారీగా వ్యయం చేసేవారు. లంచాలు, రాజ్య వనరులను మళ్లించడం ద్వారా సంపదను భారీగా పోగు చేయాలని రాజ్య అధికారులు భావించేవారు. వాణిజ్య కార్యకలాపాల ద్వారా అపార సంపదను కూడబెట్టుకున్న వ్యాపారులు కూడా భూముల యాజమాన్యం లేదా పన్ను - ఆధార వ్యవసాయాన్ని లాభదాయకమైన రంగాలుగా పరిగణించేవారు. ఉత్పత్తిని పెంచే మార్గాలపై అదనపు పెట్టుబడి పెట్టడం కంటే జాగీర్ల నిర్వహణే లాభదాయకంగా తోచేది.

వ్యక్తిగత కార్మికులు (చేతివృత్తిదారులు) నెలకొల్పిన కుటీర పరిశ్రమలే పట్టణ ప్రాంతాల్లో ఎక్కువగా ఉండేవి. భారీ కర్మాగారాల ఏర్పాటు నామమాత్రంగా ఉండేది. రాజ్యం

లేదా ప్రైవేటు పారిశ్రామికవేత్తలు నెలకొల్పిన భారీ పరిశ్రమలు స్వల్ప సంఖ్యలో ఉండేవి. వ్యాపార లాభాల్లో కూడా వాటా కోరడానికి సామ్రాజ్యం ఎంతో సమయం తీసుకోలేదు. రాజ్య అధికారులు ఆహార ఉత్పత్తుల వ్యాపారాన్ని నియంత్రిస్తూనే కొన్ని ఉత్పత్తుల వ్యాపారంపై గుత్తాధిపత్యం సాధించడానికి ప్రయత్నించారు.

అబ్బాసిద్ పాలన తొలి దశకాల్లో గ్రామీణ ప్రాంతాలు సాధించిన ప్రగతి తర్వాతి కాలంలో స్తంభించిపోయింది. నీటిపారుదల వ్యవస్థలను వాటి పూర్వపు సామర్థ్యానికి ఒక్కసారి పునరుద్ధరిస్తే నిర్వహణ ఉద్దేశించబడిన రాజ్య వనరులను ఇతర అవసరాలకు మళ్లించేవారు. అలా నిధుల్లో కొంత భాగం అధికారుల స్వంత జేబుల్లోకి వెళ్లేది. వ్యవసాయ భూములు క్రమంగా బడా భూస్వాముల వశమయ్యాయి. భూస్వాములు నగరాల్లో విలాసవంతమైన జీవితాన్ని గడిపేవారు. ఫలితంగా వ్యవసాయం నుండి వారు కేవలం స్వల్పకాలిక లాభాలను మాత్రమే ఆశించేవారు.

విలాసవంతమైన జీవితానికి సరిపడ నిధుల కోసం వారు రైతులపై తీవ్రమైన ఒత్తిడి తెచ్చేవారు. ఆ దిశలోనే జాగీర్లలో పనిచేయడానికి బానిసలను నియమించారు. భూ యాజమాన్యం కలిగిన రైతులు తమ భూముల ఉత్పాదకతను పరిరక్షించడానికి అనేక చర్యలు తీసుకునేవారు. అయితే బానిసలను వ్యవసాయ రంగంలో ప్రవేశపెట్టిన తర్వాత భూసారాన్ని పరిరక్షించే వారు కరువయ్యారు.

గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయ దిగుబడి స్తంభించిపోయినా గణనీయంగా విస్తరించిన పాలక వర్గం అదనపు నిల్వల కోసం గ్రామీణ ప్రాంతంపైనే ఎక్కువగా మెసపటోమియా సమాజాల్లో వ్యవసాయరంగ ప్రగతిపై జరిగిన అధ్యయనంలో కొన్ని ప్రాధాన్యత కలిగిన అంశాలు బయటపడ్డాయి. అందులో ముఖ్యమైనది వ్యవసాయాభివృద్ధిపై పట్టణ వర్గాలు చూపిన నిర్లక్ష్యమే. వ్యవసాయ దిగుబడిని పెంచడానికి చర్యలు తీసుకోవడానికి బదులు నగర వాసులు రాచరిక వ్యవహారాలు, రాజకీయ ఎత్తుగడలు, అవినీతి కార్యకలాపాలు, అంతర్యుద్ధాల్లో నిమగ్నమయ్యారు. ఈ వ్యవహారాలన్నీ రైతాంగ వనరులను మరింత క్షీణింపచేశాయి. అవినీతి, అణచివేత ఆధారంగా వ్యవసాయ పన్నులను మరింత విస్తరించాలన్న పాలకుల స్వల్పకాలిక ప్రయత్నాలు పరిస్థితులను మరింత దిగజార్చాయి.

ప్రకృతి వైపరీత్యాల, ముఖ్యంగా భూముల కోత, ప్రమాదం ఎప్పుడూ ఉండడంతో భూములను జాగ్రత్తగా పరిరక్షించాల్సిన అవసరం ఉండేది. భూసారాన్ని సంరక్షించడానికి ఎన్ని చర్యలు తీసుకున్నా వ్యవసాయ దిగుబడిని పెంచే అవకాశాలు చాలా తక్కువగా ఉండేవి. శతాబ్దాల పూర్వం సాధించిన పంట దిగుబడుల స్థాయిని అందుకోవడం కూడా గగనంగా ఉండేది. ఈ దశలో వ్యవసాయ రంగాన్ని నిర్లక్ష్యం చేయడంతో దిగుబడి దారుణంగా పడిపోయింది. వ్యవసాయ కార్యలాపాలు నిలిచిపోయాయి. ఒకప్పుడు ఎంతో సంపన్నంగా ఉన్న గ్రామీణ ప్రాంతాలు (ఖిలాఫత్ నియంత్రణలోని) నిర్మానుష్యమయ్యాయి. 13వ శతాబ్దం తొలి నాళ్లలో నెలకొన్న పరిస్థితులను అధ్యయనం చేసిన ఒక పరిశీలకుడు ఈ విధంగా నివేదించాడు.

"ఇప్పుడు అన్ని ప్రాంతాలు శిథిలమయ్యాయి. నగరాలు, గ్రామాలన్నీ నిర్జీవంగా మారాయి. పరిస్థితులను చక్కబెట్టడానికి, నిర్మాణాత్మక పనులను చేపట్టడానికి ఒక్క సుల్తాను కూడా ఆసక్తి చూపలేదు. వాళ్ల ఏకైక లక్ష్యం పన్నులను వసూలుచేసి వాటిని స్వంత అవసరాల కోసం వినియోగించడమే."

సామ్రాజ్యానికి ఆయువు పట్టు అయిన గ్రామీణ ప్రాంతాలు ఆర్థికంగా పతనంకావడంతో ఇస్లామిక్ సామ్రాజ్యంలో రాజకీయ వైషమ్యాలు పెరిగాయి. ఫలితంగా సామ్రాజ్య ఆర్థిక వ్యవస్థ మరింత బలహీనపడింది. భూమి నుండి లభించే ఆదాయం పడిపోవడంతో రాచరిక ఆస్థానం వ్యాపారులను పీడించడం ప్రారంభించింది. తన పోషణకు వ్యాపారులపైనే ఆధారపడింది. వ్యాపారులు ఆర్జించే లాభాల్లో అత్యధిక భాగం పాలకుల పరమయ్యేది. సామ్రాజ్యంలోని ఆయా ప్రాంతాల పాలనా బాధ్యతలను గవర్నర్లకు కట్టబెట్టడంతో వారు పన్నుల్లో సింహ భాగాన్ని తమ స్వంత అవసరాల కోసం వినియోగించారు. ప్రాంతీయ గవర్నర్లు స్వతంత్ర పాలకులుగా ఎదగడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

అదేసమయంలో అరబ్ సైన్యాలపై ఆధారపడకుండా పాలన సాగించాలని ఖలీఫాలు చేసిన ప్రయత్నాలు ప్రతికూల ఫలితాలనిచ్చాయి. అరబ్ సైన్యాలు సర్వస్వతంత్రంగా వ్యవహరించేవి. సామ్రాజ్యం లేదా ఖలీఫాలపై తిరగబడే అవకాశాలు కూడా ఎక్కువగా ఉండేవి. మధ్య ఆసియాకు చెందిన తుర్కు ప్రజలు కిరాయి సైన్యాలుగా (మామ్లూక్‌లు) వ్యవహరించేవారు. సామ్రాజ్యవాద లేదా రాచరిక కుటుంబం కోసం సైనిక విధులను నిర్వహించేవారు. మామ్లూక్‌లు ఉన్నత హోదా కలిగిన బానిసలు. కాలం గడిచేకొద్దీ మామ్లూక్ నాయకులు ఆర్థికంగా, సైనిక పరంగా శక్తిమంతులయ్యారు. ఖలీఫాల భవిష్యత్‌ను నిర్ధారించే స్థాయికి చేరుకున్నారు. ఈ దశలో ఖలీఫాలు నామమాత్రపు పాలకులుగా ఉండిపోయారు. ఇతరులు తీసుకున్న నిర్ణయాలను ఆమోదించడం వరకే వారి పాత్ర పరిమితమైంది.

పదకొండవ శతాబ్దం నాటికి ఇస్లామిక్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. స్పెయిన్, మొరాకో, టునీషియా అప్పటికే స్వతంత్ర రాజ్యాలుగా వ్యవహరించడం మొదలు పెట్టాయి. బాగ్దాద్ ఖలీఫాలపట్ల లిఖితపూర్వకమైన విధేయతను కనబరిచే పాలక వంశాలు ఈశాన్య పర్షియాపై పూర్తి ప్రాబల్యాన్ని సాధించాయి. షియా వర్గానికి చెందిన ఇస్మాయిలీ తెగ ఈజిప్టు, సిరియా, పశ్చిమ అరేబియా, భారతదేశంలోని సింధ్ ప్రాంతంలో సమాంతర ఖలీఫత్‌ను స్థాపించింది. ఆ తెగ స్థాపించిన కొత్త రాజధాని కైరో 11వ శతాబ్దంలో బాగ్దాద్‌తో సమానంగా ఇస్లామిక్ కేంద్రంగా విలసిల్లింది. కైరోలోని అల్-అజహర్ మసీదు వైభవం వర్ణనాతీతంగా ఉండేది. ఇస్మాయిలీల ప్రభుత్వం ముస్లిం అసమ్మతివాదులకు, వారి విప్లవ ఆకాంక్షలకు ప్రతిరూపంగా ఉండేది. ఈజిప్టు నుండి సమర్‌కండ్ వరకు విస్తరించి ఉన్న ముస్లిం విప్లవ వర్గాలకు ఇస్మాయిలీ ప్రభుత్వం స్ఫూర్తినిచ్చేది. అయితే అనతి కాలంలోనే ఈ ప్రభుత్వం కూడా తన స్వంత అనుచర

గణంలోని అసమ్మతివాదుల తిరుగుబాటును ఎదుర్కొంది. తిరుగుబాటు ఫలితంగా దరూజ్ అనే కొత్త వర్గం ఆవిర్భవించింది. ఈ వర్గం లెబనాన్‌లో నేటికీ కొనసాగుతోంది.

ఇస్లామిక్ ప్రపంచం చీలిపోయినంత మాత్రాన ఆర్థిక వ్యవస్థ మొత్తం పతనం కాలేదు. అలాగే సంస్కృతి కూడా అంతరించలేదు. బాగ్దాద్ వైభవం క్రమంగా క్షీణించింది. 1258లో ఆ నగరాన్ని మంగోలు సైన్యం దోచుకుంది. అయితే రెండు శతాబ్దాలపాటు ఈజిప్టు నిరంతర ప్రగతిని సాధించింది. ఇస్లామిక్ సంస్కృతి వికసించింది. వైరి రాచరిక ఆస్థానాలు కళాసాహిత్యాల పోషణలో పోటీ పడడంతో ఇస్లామిక్ ప్రపంచంలోని అన్ని ప్రాంతాల నుండి విద్వాంసులు ఈ కేంద్రాలకు వలస వచ్చారు. పశ్చిమంలో కార్డోబా నుండి ఈశాన్యంలో బుఖారా వరకు విస్తరించి ఉన్న సాహిత్యకారులు, కవులు, విద్వాంసులు కైరోకు తరలివచ్చారు.

గతంలో ఇస్లామిక్ సామ్రాజ్యాన్ని అతలాకుతలం చేసిన సమస్యలే దాని వారసత్వ రాజ్యాలను అనతి కాలంలోనే పట్టి పీడించడం మొదలు పెట్టాయి. పాత ఉత్పత్తి వ్యవస్థను పునరుద్ధరించడంవల్ల, సుదూర ప్రాంతాల్లో వాణిజ్య కార్యకలాపాలను చేపట్టడంవల్ల ఈ రాజ్యాలు కొంత కాలంపాటు గణనీయమైన ప్రగతిని సాధించగలిగాయి. అయితే సమాజం మొత్తాన్ని మరింత పై స్థాయికి తీసుకెళ్లే విధంగా ఉత్పత్తి పద్ధతులను అభివృద్ధి పరచలేకపోయారు. ఈజిప్టు రాజ్యంలోని సంపన్నమైన వాణిజ్య కేంద్రాలైన అలెగ్జాండ్రియా, కాయిరో కూడా నైలు లోయ, డెల్టా ప్రాంతాల వ్యవసాయ దిగుబడిపైనే ప్రధానంగా ఆధారపడేవి. ఆహార, ఇతర ముడి సరుకులు గ్రామీణ ప్రాంతాల నుండే సరఫరా అయ్యేవి. పన్నుల రూపంలో ఈ ఉత్పత్తులు పాలకులకు, భూస్వాములకు సమకూరేవి. అయితే అధునాతన పనిముట్ల విషయంలో కాని, ఉత్పత్తిని పెంచే విషయంలో కాని నగరాలు గ్రామీణ ప్రాంతాలకు ఏ విధంగానూ సహకరించలేదు. గ్రామీణ ప్రాంత ప్రజల జీవితం వెయ్యేళ్ల క్రితం నాటి పరిస్థితులకు ఏ మాత్రం భిన్నంగా ఉండేది కాదు. చివరకు ఈ దోపిడీ నగరాల ఆర్థిక వ్యవస్థనే బలహీనపరచింది. పన్నెండవ శతాబ్దం నాటికి ఈజిప్టులోని కొన్ని ప్రాంతాలు ఎంత బలహీనమయ్యాయంటే క్రుసేడర్లు వాటిని ఎక్కువగా శ్రమపడకుండానే ఆక్రమించుకున్నారు. మతం ముసుగు ధరించిన ఈ దోపిడీ దొంగల ముఠాలు పశ్చిమ ఐరోపాకు చెందిన వారు. ఇస్లామిక్ సామ్రాజ్యాలతో పోలిస్తే వారి నాగరికత స్థాయి చాలా తక్కువగా ఉండేది.

పశ్చిమాసియాలో ప్రగతి కుంటుపడుతున్న దశలో పశ్చిమ ఐరోపా వెనుకబాటుతనం నుండి బయటపడడానికి ప్రయత్నించింది. క్రుసేడర్లు సాధించిన విజయాలే అందుకు నిదర్శనం. తదుపరి శతాబ్దంలో మామ్లూక్ నాయకులు అధికారాన్ని హస్తగతం చేసుకోకపోయి ఉంటే ఈజిప్టు క్రుసేడర్ల వశమయ్యేది. ఈ కాలంలోనే పర్షియా మంగోలు సైన్యాల ఆధీనంలోకి వచ్చింది.

ఈ సమయానికి ఇస్లామిక్ సంస్కృతి, విజ్ఞాన శాస్త్రాల మహర్దశ అంతరించింది. తొలినాళ్లలో వ్యాపార కేంద్రాలు, నగర ప్రాంతాల్లో వేగంగా విస్తరించిన ఇస్లాం ఇపుడు గ్రామీణ

ప్రాంతాల్లో చొచ్చుకుపోయింది. సూఫీ ఉద్యమకారుల ప్రజాదరణపై ఎక్కువగా ఆధారపడింది. కొందరు సూఫీ సంతులు మరణం తర్వాత దైవ సంభూతులుగా కొలవబడ్డారు. ఏకేశ్వరవాద మతమైన ఇస్లాంలో ఆ విధంగా దైవదూతల ఆరాధన మొదలైంది. తార్కిక వాదనలు గత కాలపు వ్యవహారాలుగా మిగిలిపోయాయి. మతపరమైన సంస్థలు, మద్రసలు సనాతన వాదాన్ని ప్రబోధించాయి. ముఖ్యంగా షియా వర్గానికి వ్యతిరేకంగా ద్వేషాన్ని రెచ్చగొట్టాయి. ఒక మత వ్యవస్థ ఈ సనాతనవాద సిద్ధాంతాలను సమాజమంతటిపై రుద్దడానికి కంకణం కట్టుకుంది. విద్యాభ్యాసం కేవలం ఖురాన్, హదీసుల పఠనం వరకే పరిమితమైంది. చుట్టూ ఉన్న ప్రపంచాన్ని తెలుసుకోవాలన్న తలంపు కన్నా మత సూత్రాలు, చట్టాలను అధ్యయనం చేయడానికే మత సంస్థలు, మద్రసలు ప్రాధాన్యనిచ్చాయి. ఫలితంగా స్వతంత్ర ఆలోచనలు, శాస్త్ర, సాంకేతికాభివృద్ధిని అవి చాలా వరకు అడ్డుకున్నాయి. పన్నెండవ శతాబ్దం తొలి దశకంలో కవి, గణిత విద్వాంసుడైన ఉమర్ ఖయ్యాం మేధావులు మాయమైపోయారని ఆవేదన వ్యక్తం చేశాడు. కొందరు విద్వాంసులు మాత్రమే మిగిలినా వారిలో ఎక్కువ మంది దుర్భరమైన పేదరికాన్ని అనుభవిస్తున్నారని పేర్కొన్నాడు. అయితే 13వ శతాబ్దానికి చెందిన విద్వాంసులు స్పెయిన్‌లోని అరబిక్ నగరాలలో క్రియాశీలంగా ఉండేవారు. వారి ఆలోచనలు 18వ శతాబ్దానికి చెందిన ఫ్రెంచి, స్కాట్‌లాండ్ తత్త్వవేత్తలకు, తదుపరి పునర్విచారణ ఉద్యమానికి ఎంతో స్ఫూర్తినిచ్చాయి.

అరబ్ సైన్యాలు, అబ్బాసిద్‌ల విప్లవం అట్లాంటిక్ నుండి సింధూ నది వరకు ఉన్న భూభాగాన్ని ఒక మత సిద్ధాంతం ఆధారంగా ఏకం చేయడంతో ఏడు, ఎనిమిదవ శతాబ్దాల్లో ఇస్లామిక్ నాగరికత విస్తరించింది. ఈ ప్రక్రియలో భూస్వాములు, సైనికాధికారులతో సమానంగా వ్యాపారులు, చేతివృత్తిదారులకు ప్రాధాన్యత ఇవ్వడం ద్వారా ఖలీఫాలు సత్వర విజయాలను సాధించగలిగారు. ఈ కారణంగానే ఉత్పత్తులు, సాంకేతిక ఆవిష్కరణలు, ఉత్పత్తి పద్ధతులు, శాస్త్రీయ పరిజ్ఞానం యురేషియాలోని ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి చేరగలిగాయి. అలాగే ప్రాచీన మెసపటోమియా, ఈజిప్టు, గ్రీసు, రోము నాగరికతలకు అదనపు ప్రగతిని కృషిని అందించగలిగాయి. ప్రాచీన భారతీయ, చైనా సమాజాలను కూడా సాంస్కృతిక రంగంలో బలోపేతం చేయగలిగాయి. అదే విధంగా, పదవ శతాబ్దం నుండి పతనం వైపు పయనించిన ఇస్లామిక్ నాగరికత అబ్బాసిద్ విప్లవానికి ఉన్న పరిమితులను చాటి చెప్పింది. వాస్తవంగా అయితే అబ్బాసిద్‌ల విప్లవం అసంపూర్ణమైనది. రాజ్య వ్యవహారాలను ప్రభావితం చేసే సామర్థ్యాన్ని అది వ్యాపారులు, చేతివృత్తిదారులకు కట్టబెట్టింది కాని రాజ్యంపై వారికి ఎలాంటి నియంత్రణ ఇవ్వలేకపోయింది.

.పట్టణ ప్రజలు, భూస్వామ్య వర్గాల మధ్య సమతుల్యం సాధిస్తూ రాజ్య యంత్రాంగం ఎనలేని అధికారాలను సంతరించుకుంది. సమాజంలోని అన్ని వర్గాల నుండి పన్నులను రాబడుతూ సైనికాధికారులు, పాలనాధికారులకు పెద్ద జాగీర్లను కట్టబెట్టింది. సమాజ ఉత్పాదనా ఆధారాన్ని విస్తరించడానికి అదనపు నిల్వలను వినియోగించే బదులు పాలకవర్గాలు వాటిని

అనుత్పాదక రంగాలపై, స్వంత విలాసంపై వ్యయం చేశాయి. చివరికి రైతులను దుర్భర దారిద్ర్యంలోకి నెట్టివేశాయి. నిరంతరం శ్రమిస్తే కాని మనుగడ సాగించలేని స్థితికి రైతులు చేరుకున్నారు. మరోవైపు స్థూల దిగుబడి క్రమంగా క్షీణించింది. పర్యావసానంగా వ్యాపారులు, పారిశ్రామికవేత్తలకు మార్కెట్ కుదించుకుపోయింది. చేతివృత్తిదారుల ఉత్పత్తిపై ఆధారపడకుండా మౌలిక పారిశ్రామిక వ్యవస్థ వైపు వ్యాపారులు, పెట్టుబడిదారులు ప్రగతి సాధించలేకపోయారు. సాంకేతికాభివృద్ధి స్తంభించిపోయింది. చైనాలో వ్యాపారం నిర్వహించే అరబ్ వ్యాపారులకు ముద్రణ గురించి చాలా కాలం క్రితమే తెలిసినా ముద్రణా యంత్రాలను ముస్లిం ప్రపంచంలో ప్రవేశపెట్టలేకపోయారు. విశాల ప్రజానీకం పేదరికం, మూఢ నమ్మకాల్లో కూరుకుపోయింది. నాగరికత అన్నది సమాజంలోని ఒక చిన్న వర్గానికే పరిమితమైంది. ఈ వర్గం అభ్యున్నతికి దోహదపడిన ఆర్థిక పరిస్థితులు దిగజారడంతో అది కూడా బలహీనమైంది.

ఇస్లామిక్ సామ్రాజ్యాల్లో తిరుగుబాట్లు సర్వసాధారణమయ్యాయి. విప్లవ నాయకుడైన అబూ ముస్లిం అనుచరులు కొన్ని తిరుగుబాట్లకు సారథ్యం వహించారు. అలీ అనుచరులైన షియా ప్రజలు తిరుగుబాటు బావుటా ఎగురవేశారు. ఇస్లాంను ఖలీఫాలు భ్రష్టు పట్టిస్తున్నారన్న ఆరోపణపై వారు ప్రజలను సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సమీకరించారు. పట్టణ ప్రజలు,రైతులు కూడా తిరుగుబాటు చేశారు. తొమ్మిదవ శతాబ్దంలో మెసపటోమియా దక్షిణ ప్రాంత ఉప్పు నేలల్లో నల్లజాతి బానిసలు 16 సంవత్సరాలపాటు సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడారు. దీనిని జాంజ్ తిరుగుబాటు అని పిలుస్తారు. చివరగా ఇస్మాయలీ తిరుగుబాటు ఈజిప్టులో సమాంతర ఖలీఫత్ ఆవిర్భావానికి దారి తీసింది.

ప్రాచీన రోములో బానిసల తిరుగుబాటు లేదా చైనాలో రైతాంగ విప్లవాల కంటే ఎక్కువగా ఇస్లామిక్ తిరుగుబాట్లలో ఒక్కటి కూడా వ్యవస్థలో మార్పులను తీసుకురాలేకపోయింది. ప్రజల అసంతృప్తిని తిరుగుబాట్లు వ్యక్తం చేసినా అవి మతపరమైన భావాలకే పరిమితమయ్యాయి. కొత్త విలువల ఆధారంగా సమాజాన్ని ప్రక్షాళన చేయగల కార్యక్రమాన్ని మాత్రం తిరుగుబాట్లు ముందుకు తేలేకపోయాయి. అసలు అలాంటి ఒక కార్యక్రమాన్ని రూపొందించడానికి కూడా ప్రయత్నం చేయలేదు. వాస్తవంగా అయితే ప్రజల జీవనోపాధి మార్గాలు ప్రత్యామ్నాయ వ్యవస్థను ఏర్పాటు చేయగల స్థాయిలో ఉండేవి కావు.

చైనాలో త'ఆంగ్, సంగ్ పాలనా కాలాల వలే ఇస్లామిక్ నాగరికత కూడా మానవాళి ప్రగతికి బీజాలు వేసింది. కాని పాత వ్యవస్థల భారం కారణంగా ఆ అభివృద్ధి విత్తనాలు మొలకెత్తలేకపోయాయి. విశాలమైన పాలనా వ్యవస్థలేని మారుమూలమైన ప్రాంతమైన యురేషియాలో తిరిగి నాట్లు వేసే వరకు మానవాళి ప్రగతి పథంలో పయనించలేకపోయింది.

ఐదవ అధ్యాయం

# ఆఫ్రికా నాగరికతలు

ఆధునిక ఐరోపా వలసదారులు (19, 20వ శతాబ్దాలకు చెందిన) ఆఫ్రికాను 'చీకటి ఖండం'గా వర్ణించారు. వారి దృష్టిలో ఆఫ్రికాకు ఒక నాగరికత, ఒక చరిత్ర అంటూ లేదు. దాని జీవితం శూన్యమైనదని, అనాసక్తికరమైనదని, పాశవికమైనదని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ఆచార్యుడు ఎగర్టన్ పేర్కొన్నాడు. ఐరోపా ప్రజల వైఖరి ఎంత ప్రతికూలంగా ఉండేదంటే పన్నెండవ శతాబ్దికి చెందిన గ్రేట్ జింబాబ్వే నగర శిథిలాలను సందర్శించిన తొలి ఐరోపా పురావస్తు శాస్త్రవేత్త కారల్ మౌచ్ ఆ శిథిలాలకు స్థానిక పుట్టుపూర్వోత్తరాలు లేవని బలంగా నమ్మాడు. ఉత్తర భూగోళం నుండి వచ్చిన నల్లజాతియేతర ప్రజలు ఆ నగరాన్ని జెరుసలేంలోని సొలొమాన్ దేవాలయ నమూనా ఆధారంగా నిర్మించి ఉంటారని విశ్లేషించాడు. సాంప్రదాయవాద (టోరీ) చరిత్రకారుడైన హగ్ ట్రెవర్-రోపర్ 1965లో ఇలా రాశాడు : "ఆఫ్రికాలో ఉన్నది కేవలం ఐరోపా చరిత్రే. మిగతా కాలమంతా చీకటిమయమైనది."

అయినప్పటికీ యురేషియా, అమెరికాలలో నాగరికతలు ఆవిర్భావానికి దారి తీసిన ప్రక్రియలన్నీ ఆఫ్రికాలో కూడా సంభవించాయి. ఈ ప్రక్రియలు ఒక్కసారి కాదు అనేక మార్లు చోటు చేసుకున్నాయి. ఈజిప్టు సామ్రాజ్యమే అందుకు చక్కటి ఉదాహరణ. ఆఫ్రికా నాగరికతలోని పలు అంశాలు మెసపటోమియాతో ఉన్న సంబంధం కారణంగా ప్రభావితమైనా దాని వేర్లు మాత్రం దక్షిణ ఈజిప్టులో స్వతంత్రంగా సంభవించిన పరిణామాలలో కనిపిస్తాయి. నైలు లోయలో పశ్చిమం నుండి దక్షిణ ప్రాంతం వరకు స్థిరపడిన ప్రజలలో ఈ పరిణామక్రమాలు సంభవించాయి. గ్రీకు చరిత్రకారుడు హెరోడటస్ నుబియా (నైలు నుండి ఆస్వాన్ వరకు)కు చెందిన కుషా నాగరికత గురించి ప్రస్తావించాడు. ఈ నాగరికత క్రీ.పూర్వం 1000లో ఈజిప్టును స్వల్పకాలంపాటు ఆక్రమించింది. తన స్వంత భాషను, లిపిని అభివృద్ధి పరిచింది. ఇథోపియాకు చెందిన ఆక్సమ్ నాగరికత గురించి రోమన్లకు అవగాహన ఉండేది.

క్రైస్తవ మతాన్ని స్వీకరించిన ఈ నాగరికత దక్షిణ అరేబియాతో సన్నిహిత సంబంధాలు కలిగి ఉండేది. (మక్కాలో అణచివేత నుండి తప్పించుకోవడానికి మహమ్మద్ అనుచరులు ఆక్సమ్ ప్రాంతానికి పారిపోయారు) తర్వాతి కాలంలో ఈ నాగరికత తన స్వంత అక్షరమాలను రూపొందించుకుంది. భారత్, చైనా, ముస్లిం సామ్రాజ్యాలకు చెందిన వ్యాపారులు మొజాంబీక్‌కు దక్షిణాన ఉన్న ఆఫ్రికా ఈశాన్య తీరం వెంబడి వెలసిన నగరాలతో సంబంధాలు కలిగి ఉండేవారు. వ్యాపారులలో ఒకడైన ఇబ్న్ బట్టుటా ప్రస్తుత టాంజానియాలో ఉన్న కిల్వాను 1331లో ఈ విధంగా వర్ణించాడు : “కిల్వా ప్రపంచంలోనే సుందరమైన, ప్రణాళికా బద్ధంగా నిర్మించిన నగరం.” గ్రనడా నుండి బహిష్కరణకు గురైన హసన్-అల్-వజ్జాన్ (ఇతడిని ఇటాలియన్ మారుపేరైన లియో ఆఫ్రికానస్‌గా బాగా గుర్తిస్తారు) 15వ శతాబ్దం తొలినాళ్లలో నైజర్ నది వెంబడి వెలసిన సుమారు 24 రాజ్యాలను పర్యటించడానికి మొరాకో నుండి సహారా ఎడారుల గుండా ప్రయాణించాడు. తన ప్రయాణ అనుభవాలను వర్ణిస్తూ అతడు పుస్తకాలు రాశాడు. తంబూ (తింబుక్తు) వేలాది మంది ప్రజలు నివసించే నగరమని, నగరంలో అనేక మంది న్యాయాధీశులు, విజ్ఞులైన వైద్యులు, మతపెద్దలు ఉన్నారని పేర్కొన్నాడు. నగరంలో బర్బర దేశాల నుండి దిగుమతి అయిన రాత ప్రతులను ఒక పెద్ద మార్కెట్‌లో విక్రయిస్తారని, పుస్తక విక్రయాల ద్వారా సమకూరే లాభాలు ఇతర ఉత్పత్తులు ఏవి అమ్మినా దక్కేవి కావని వివరించాడు. పశ్చిమాఫ్రికా తీర ప్రాంత అడవులలో ఇతర నాగరికతలు ఆవిర్భవించాయి. ఇక్కడ బెనిన్ నగరం తొలి పోర్చుగీసు నావికుడిపై ఎనలేని ప్రభావం చూపింది. ఈ నావికుడు ఉత్తర అంగోలాలోని కాంగో రాజ్యం నుండి ప్రస్తుత ఉగాండాలోని బుగాండా వరకు ఉన్న సువిశాలమైన మధ్య ఆఫ్రికా తీర ప్రాంతాన్ని చుట్టుముట్టాడు.

యురేషియా, అమెరికా నాగరికతలు ఆవిర్భవించిన రీతిలోనే ఆఫ్రికా నాగరికతలు కూడా అభివృద్ధి చెందాయి. కొన్ని ప్రాంతాల్లో ప్రజలు ప్రత్యేకమైన వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి పరిచారు. వ్యవసాయం ద్వారా అందరికీ సరిపడ అదనపు నిల్వలను సాధించారు. పాత సముదాయ వ్యవస్థల్లో ఈ పరిణామమే చీలికలకు దారి తీసింది. పూర్వం ఈ సముదాయాలు తెగ, కుటుంబ సంబంధాల ఆధారంగా సామాజిక జీవనం గడిపాయి. కాలక్రమంలో కొన్ని ముఖ్యమైన తెగలు పాలక వర్గాలుగా రూపాంతరం చెందాయి. ఈ వర్గాలు మిగతా సమాజాన్ని దోచుకోవడం మొదలు పెట్టాయి. విశాలమైన ప్రజానీకంలో వ్యాపారులు, చేతివృత్తిదారుల ప్రత్యేక వర్గాలు ఆవిర్భవించాయి. సమాజంలోని మిగతా వర్గాల్లో రైతులు, పశుపోషకులు ఎక్కువగా ఉండేవారు.

కొన్నిసార్లు ఈ పరిణామాలు ఇతర నాగరికతల ప్రభావం కారణంగా త్వరితంగా సంభవించేవి. ఈజిప్టు నూబియాను పూర్తిగా ప్రభావితం చేసింది. బహుశా దక్షిణ అరేబియా

(క్రీ.పూ.1000 లోనే ఇక్కడ పట్టణాలు వెలిశాయి) ఎర్ర సముద్రం సమీపంలో ఉన్న ఇథోపియాను ప్రభావితం చేసి ఉండవచ్చు. ఈశాన్య ఆఫ్రికా తీర ప్రాంతంపై భారతీయ, అరబ్ వ్యాపారులు ప్రభావం బలంగా ఉండేది. అయితే అలాంటి ప్రభావాన్ని తమకు అనుకూలంగా మలచుకునే సామర్థ్యం ఆఫ్రికా సమాజాల్లో అప్పటికీ ఉండడంతో ఈ పరిణామాలు సాధ్యమయ్యాయి. ఈశాన్య తీరం లాంటి ప్రాంతాలనే వ్యాపారులు సందర్శించేవారు. ఎందుకంటే అక్కడ వ్యాపార యోగ్యమైన విశాల సమాజాలు అప్పటికే అభివృద్ధి చెందాయి.

బయట ప్రభావాలకు స్వతంత్రంగా ఆఫ్రికాకు చెందిన వివిధ నాగరికతల జీవనోపాధి మార్గాలలో ముఖ్యమైన మార్పులు చోటు చేసుకున్నాయి. ప్రధానంగా మొక్కల పెంపకం విషయంలో ఆఫ్రికా ప్రజలు ప్రత్యేకతను సాధించారు. యురేషియా, నైలు లోయకు చెందిన ప్రాచీన నాగరికతల్లో సాగు చేసిన పంటలను సబ్-సహారన్ ఆఫ్రికాలోని ఉష్ణ వాతావరణంలో సాగు చేయడం అసాధ్యం కనుకనే కొత్త వంగడాలను సృష్టించారు. ఆఫ్రికా ప్రజలు తమవైన స్వంత వ్యవసాయం స్వరూపాలను అభివృద్ధి పరిచారు. శతాబ్దాల తర్వాత ఇనుము ఉత్పత్తిలో కూడా కొత్త పద్ధతులను అనుసరించారు. పశ్చిమాఫ్రికాకు చెందిన కంసాలులు ఇనుము ధాతువును కరిగించడం నేర్చుకున్నారు. క్రీ.పూ.1000 కాలంలో ఇనుము ఉత్పత్తి పరిజ్ఞానం యురేషియా అంతటా విస్తరిస్తున్న సమయంలోనే ఆఫ్రికాలో ఈ పరిణామం చోటు చేసుకుంది. అయితే ఆఫ్రికా కంసాలులు అనుసరించిన పద్ధతులు వేరుగా ఉండేవి. ఆఫ్రికా ప్రజలు స్వతంత్రంగా అభివృద్ధి చెందారనడానికి ఈ పరిణామమే సూచిక.

వ్యవసాయం, ఇనుము రెండూ కలిసి సబ్-సహారన్ ఆఫ్రికా ముఖచిత్రాన్ని పూర్తిగా మార్చివేశాయి. ఈ పద్ధతులను తొలిగా ఆమోదించిన పశ్చిమాఫ్రికా బంటూ ప్రజల జనాభా విపరీతంగా పెరిగింది. క్రీ.పూ.2000 నుండి క్రీ.శ.500 వరకు బంటూ ప్రజల జనాభా ఏ స్థాయిలో పెరిగిందంటే మధ్య, దక్షిణ ఆఫ్రికాలలో శతాబ్దాల తరబడి జీవించిన వేట-సేకరణదారులు పెద్ద సంఖ్యలో నిర్వాసితులయ్యారు. వ్యవసాయ నిల్వలు గణనీయంగా కలిగిన వారు లేదా వ్యాపార నిర్వహణ సామర్థ్యం కలిగిన వారు పట్టణ జీవనం వైపు ప్రస్థానం కొనసాగించారు. వారిలో వర్గ విభజనలు కూడా చోటు చేసుకున్నాయి. క్రీ.శ.500 తర్వాత ఒక దశలో ఈ పరిణామాలు సంభవించి ఉంటాయి. వాణిజ్య కార్యకలాపాల కారణంగా ఈశాన్య తీర పట్టణాలకు హిందూ మహా సముద్రంలోని ఇతర నాగరికతల సంబంధాలు ఏర్పడ్డాయి. పశ్చిమాఫ్రికా పట్టణాలు వాణిజ్య కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి. ఈ కేంద్రాలు ఒక వైపు నైలు, ఈజిప్టుకు మరోవైపు సహారా నుండి మగ్రేబ్ వరకు వ్యాపార మార్గాలు కలిగి ఉండేవి. వ్యాపార సంబంధాల కారణంగా స్వంత లిపిని అభివృద్ధి పరచడానికి

ఆఫ్రికా ప్రజలకు సుదీర్ఘ ప్రక్రియను చేపట్టాల్సిన అవసరం తప్పింది. వారు అరబిక్ లిపిని స్వీకరించారు. దానితోపాటు ఇస్లాం మతాన్ని కూడా స్వీకరించారు. పాత విగ్రహారాధన విశ్వాసాల కంటే కొత్త మతం పట్టణ జీవితానికి ఎంతో అనుకూలంగా ఉండేది. స్థానిక ప్రగతి కారణంగా ఈజిప్టు, నుబియా, ఇథోపియా నాగరికతలు వరుసగా ఆవిర్భవించాయి. పదిహేనవ శతాబ్దం నాటికి ఆఫ్రికా ఖండమంతటా నాగరికతలు వెలిసాయి. నాగరికతలు ఒక తీరం నుండి మరో తీరానికి విస్తరించాయి. కొన్నిసార్లు వర్గరహిత సమాజాల్లో జీవిస్తున్న ప్రజలను కూడా తమలో అంతర్భాగం చేసుకున్నాయి. ఆఫ్రికా తీర ప్రాంతాలపై ఐరోపా నావికులు అడుగుపెట్టడానికి చాలా కాలం పూర్వమే ఆఫ్రికా ప్రజలు ప్రపంచ వాణిజ్య వ్యవస్థతో ముడిపడి ఉండేవారు. వాణిజ్య నిర్వహణ విషయంలో వారికి ఇస్లాం మత సంబంధాలు ఎంతో ఉపకరించాయి. (ప్రాచీన జింబాబ్వే నాగరికత అంతరించడానికి 15వ శతాబ్దంలో అంతర్జాతీయ మార్కెట్‌లో బంగారు ధరలు పడిపోవడం కూడా ఒక కారణమని బోధపడుతోంది. జింబాబ్వే బంగారు నిల్వలను ఎక్కువగా ఎగుమతి చేసేది)

అప్పటికే ఉద్భవిస్తున్న ప్రపంచ వ్యవస్థ బాధితులుగా ఆఫ్రికా ప్రజలు మిగిలిపోయారు. ఆఫ్రికా ప్రజలను నాగరికులుగా గుర్తించని జాత్యహంకార సిద్ధాంతాలు వారి నాగరికతలను చరిత్ర పుటల నుండి దాదాపుగా తుడిచివేశాయి. కాని అందుకు గల కారణాలు భౌగోళిక దుర్ఘటనలో పెనవేసుకొని ఉన్నాయి.

యురేషియా పశ్చిమం నుండి ఈశాన్యం వరకు విస్తరించి ఉంది. వాతావరణ పరిస్థితులు సమానంగా కలిగి ఉన్న విశాల భూభాగాలు ఇందులో ఉన్నాయి. కనుక ఒకే తరహా పంటలను ఈ ప్రాంతాల్లో పండించే అవకాశం ఎక్కువగా ఉండేది. గోధుమ, బార్లీ, సజ్జ ఐర్‌లాండ్ నుండి బీజింగ్ వరకు పండేవి. అలాగే వరి కొరియా, జపాన్‌ల నుండి హిందూ మహా సముద్ర తీర దేశాల వరకు సాగయ్యేది. సాధు జంతువుల పోషణ ఆయా ప్రాంతాలకు విస్తరించకుండా కొన్ని సహజ ప్రతిబంధకాలు అడ్డుకున్నాయి. గుర్రాలు, ఆవులు, మేకలు, గొర్రెలు దాదాపు అన్ని భౌగోళిక ప్రాంతాల్లోనూ పెరిగేవి. ఎడారి ప్రాంతాల్లో కూడా వాటిని అప్పుడప్పుడు పెంచేవారు.

ఒకే తరహా వాతావరణ పరిస్థితులు ఉన్న ప్రాంతాల్లో పెరిగే పంటలు, మొక్కల గురించి ప్రజలు తమ సాంప్రదాయబద్ధమైన సంబంధాల కారణంగా ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి సమాచారాన్ని చేరవేయడం చాలా సులభంగా ఉండేది. ఈ సమాచారం కూడా చాలా త్వరితగతంగా ఇతర ప్రాంతాలకు చేరేది. ఒక ఖండంలోని మారుమూల ప్రాంతం నుండి మరో ఖండంలోని మారుమూల ప్రాంతానికి ప్రజలు తరచుగా వలస వెళ్లేవారు లేదా వ్యాపార నిర్వహణ కోసం ప్రయాణించేవారు. ఈ రాకపోకల సందర్భంగా

కొన్నిసార్లు విధ్వంసం కూడా జరిగేది. ముఖ్యంగా హన్ లేదా మంగోలు ప్రజల విషయంలో ఈ విపరీతమైన పరిణామాలు సంభవించాయి. అయితే ప్రజల రాకపోకలవల్ల శాస్త్రీయ పరిజ్ఞానం మారుమూల ప్రాంతాలకు సైతం విస్తరించింది.

అయితే ఆఫ్రికా ఖండం భౌగోళికంగా భిన్నమైన ప్రాంతం. ఉత్తరం నుండి దక్షిణం వైపు విస్తరించి ఉన్న ఈ ఖండంలో వాతావరణ పరిస్థితులు భిన్నంగా ఉన్న ప్రాంతాలు ఎక్కువగా ఉన్నాయి. ఈజిప్టు లేదా మగ్రేబ్‌లో పెరిగే పంటలను సమ ఉష్ణత గల సహన్నా ప్రాంతంలో సాగు చేయడం కష్టం. అలాగే సహన్నా ప్రాంతంలో పెరిగే మొక్కలు ఉష్ణమండల ప్రాంతాలలో (భూమధ్య రేఖకు చాలా దగ్గరగా ఉన్న ప్రాంతాలు) మొలకెత్తలేవు. కనుక స్థానికంగా అభివృద్ధి పరచిన వ్యవసాయ పద్ధతులకు ప్రాంతీయ ప్రాధాన్యత మాత్రమే ఉండేది. రవాణా రంగంలో విప్లవాత్మకమైన మార్పులు చోటు చేసుకోవడంతో ఆయా ప్రాంతాల రైతులు వాతావరణ ప్రతికూలతను అధిగమించగలిగారు. అయితే ఉత్తర ప్రాంతం నుండి దక్షిణం వరకు పశుపోషణ పద్ధతులు లేదా పరిజ్ఞానం విస్తరించకుండా మధ్య ఆఫ్రికా ప్రాంతంలో ఒక సహజ శక్తి (ప్రకృతి సమతుల్యం) అడ్డుకుంది. ముఖ్యంగా సీ-సీ దోమలు పశువుల పాలిట యమపాశంగా ఉండేవి. ఫలితంగా ఉత్తర ప్రాంతం నుండి దక్షిణానికి పశువులను రవాణా చేయడం కష్టంగా మారింది. రైతులు ఆవులను ఎక్కువగా పోషించేవారు. అయితే ఆవుల పెంపకానికి దక్షిణ ప్రాంత భూములు చాలా అనుకూలంగా ఉన్నా ఉత్తర ఆఫ్రికా రైతులు వాటిని సీ-సీ దోమల బెడద వల్ల తరలించలేకపోయారు. 15వ శతాబ్దం వరకు పశ్చిమాఫ్రికా తీర ప్రాంతం నుండి సుదీర్ఘ సముద్రయానం అసాధ్యంగా ఉండేది. ఎందుకంటే అప్పటి వరకు ఈదురుగాలులను తట్టుకొని ఓడలను ముందుకు తీసుకెళ్లగల సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందలేదు. ఈశాన్య తీరాన్ని చేరుకోవడం సులభంగానే ఉన్నా అక్కడి నుండి భూభాగంలో ఉన్న ఎత్తయిన మైదాన ప్రాంతాలకు ప్రయాణించడం చాలా కష్టంగా ఉండేది. ఆఫ్రికా ఖండాన్ని రెండు భాగాలుగా చీల్చే సహారా ఎడారి కారణంగా అంతర్గత భూమార్గ ప్రయాణం అసాధ్యంగా ఉండేది. క్రీ.శ.500లో ఒంటెలను పోషించే సామర్థ్యం ప్రజలకు దక్కే వరకు అంతర్గత రవాణా సాహసవంతులకు కూడా ప్రాణంతో చెలగాటమాడడంగా ఉండేది.

ఐరోపాకు చెందిన వెనుకబడిన ప్రజలు- బ్రిటీష్, జర్మన్లు లేదా స్కాండినేవియన్లు- చీకటి యుగాల్లో సైతం భారత్, చైనా, పశ్చిమాసియాలకు చెందిన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం, అధునాతన వ్యవసాయ పద్ధతులను తెలుసుకోగలిగారు. వాటిని ఆచరణలో పెట్టి ప్రగతి వైపు మళ్లీ ప్రస్థానం కొనసాగించారు. అలాగే ప్రపంచం నలుమూలలా ఎలాంటి సాంకేతిక ప్రగతి సాధ్యమైనా దానిని సద్వినియోగం చేసుకున్నాడు. సబ్- సహారా ఆఫ్రికా సమాజాలు

తమ స్వంత వనరులపైనే ఆధారపడాల్సి వచ్చింది. వారు ప్రపంచ పరిణామాలకు చాలా దూరంగా ఉండిపోయారు. యురేషియా వైశాల్యంతో పోలిస్తే సగభాగం వరకు ఆఫ్రికా ఖండం విస్తరించి ఉంటుంది. అలాగే దాని జనాభా యురేషియా జనాభాతో పోలిస్తే ఆరో వంతు కలిగి ఉంటుంది. సమాజాభివృద్ధికి ఆఫ్రికా ప్రజల ఏకాంత జీవనం అవరోధం కల్పించలేదు. అయితే పూర్వపు వెనుకబడిన ప్రాంతమైన పశ్చిమ ఐరోపా నుండి వలసదారులు ఎట్టకేలకు తమ ఖండంపై పాదం మోపినపుడు ఆఫ్రికా ప్రజలు వారిని ఎదురించే పరిస్థితిలో లేరు. సాంకేతికాభివృద్ధి, వ్యవసాయాభివృద్ధి ఫలాలకు దూరంగా ఉండం వల్లే వారి సామర్థ్యం స్తంభించిపోయింది. అదే సమయంలో ప్రపంచం నలుమూలలా సంభవించిన అభివృద్ధి ప్రక్రియలను అనుసరించి వాటిని మరింత పదునుపెట్టిన ఐరోపా వాసులుచీకటి యుగాలను అధిగమించగలిగారు.

## ఆరవ అధ్యాయం

# ఐరోపా భూస్వామ్య వ్యవస్థ

సుమారు వెయ్యేళ్ల క్రితం కైరో, కార్డోబా లాంటి ఇస్లామిక్ నగరాలకు చెందిన వ్యాపారులు ప్రపంచం నలుమూలలా విస్తృతంగా పర్యటించారు. వీరిలో ఎవరైనా కాని ఉత్తర ఐరోపాలోని రాచరిక దర్బార్లను సందర్శించి ఉంటే అక్కడి పరిస్థితులను చూసి ఆశ్చర్యపోయి ఉంటారు. ఆశ్చర్యమే కాదు దిగ్భ్రాంతి కూడా చెంది ఉంటారు.

ఐరోపాలో భూములు జాగీర్లుగా విభజించబడి ఉండేవి. దట్టమైన అడవులు లేదా చిత్తడి నేలలు ఈ జాగీర్లకు సరిహద్దులను నిర్ణయించేవి. ప్రతి జాగీరు స్వయం పోషక ఆర్థిక వ్యవస్థను పోలి ఉండేది. జాగీర్లలో నివసించే ప్రజలు తమ పరిధిలోని భూముల్లో పండే ఆహార ధాన్యాలపైనే పూర్తిగా ఆధారపడేవారు. ఈ పరిస్థితులను బట్టి మనం అర్థం చేసుకోవలసిందేమిటంటే రైతులకు రొట్టె, కూరతో కూడిన ఆహారం లభించేది. ధరించడానికి ఇంట్లో నేసిన వస్త్రాలే (ఉన్ని, ఫ్లాక్స్) ఉండేవి. మరోవైపు తమ శక్తియుక్తులలో రెండింట ఐదొంతుల భాగాన్ని భూస్వామికి ఉచితంగా శ్రమ చేయడానికి కేటాయించేవారు. ఈ ఉచిత సేవ శారీరక శ్రమ రూపంలో కాని వస్తు రూపంలో కాని ఉండేది. కౌలుదారులు కావడం మూలాన రైతులకు భూములను కాని, భూస్వామిని కాని విడిచివెళ్లే స్వాతంత్ర్యం (స్వేచ్ఛ) ఉండేది కాదు.

భూస్వామ్య కుటుంబ జీవన ప్రమాణాలు రైతుల కంటే ఎంతో ఉన్నతంగా ఉండేవి. అయినప్పటికీ రైతులు పండించే దిగుబడిపైనే వారి విలాస జీవనం ఆధారపడి ఉండేది. భూస్వాములు కోటలు మట్టి, రాయి, కలపతో నిర్మాణమై ప్రకృతి శక్తుల నుండి సరైన రక్షణ లేకుండా ఉండేవి. రైతులతో పోలిస్తే భూస్వాముల వస్త్రాలు కొంత హుందాగా కనిపించినా శరీరానికి అవి సౌకర్యంగా ఉండేవి కావు. రైతుల కంటే నాగరిక ప్రకృత్తి కలిగిన భూస్వాములు చాలా అరుదుగా ఉండేవారు. తమ జాగీర్లను ప్రత్యర్థి భూస్వామ్య వర్గాల నుండి రక్షించడానికి భూస్వాములు గుర్రపు స్వారీ, ఆయుధాల వినియోగంపై తరచూ శిక్షణ తీసుకునేవారు. తమ ఆదేశాలను ఉల్లంఘించే రైతులను కఠినంగా శిక్షించేవారు. చదువు సంధ్యలు తమకు అవసరమని వారు ఎన్నడూ భావించలేదు. విద్యను అభ్యసించే విషయంలో ఎలాంటి శ్రద్ధ చూపలేదు.

పెద్ద జాగీర్లు ఉన్న భూస్వాములకు రాతపూర్వకమైన నివేదికలు అవసరమని తోస్తే సమాజంలో కొద్దిమందిగా ఉన్న విద్యావంతుల వర్గం నుండి సభ్యులను పనిలో పెట్టుకునేవారు. సాధారణంగా అయితే ఈ చిన్నవర్గంలో విద్యావంతులైన సన్యాసులు, పురోహితులు ఎక్కువగా ఉండేవారు.

వ్యాపారులు కొన్ని ఉత్పత్తులను సరఫరా చేసేవారు. ముఖ్యంగా, ఉప్పు, నాగలి కొనల కోసం ఇనుము, కత్తులు, భూస్వాములకు ఆయుధాలను వ్యాపారులు సమకూర్చేవారు. అయితే ఈ వ్యాపారులు ఈశాన్య నాగరికతలకు చెందిన సంపన్న వ్యాపారులకు చాలా భిన్నంగా ఉండేవారు. వీరు సంచులు మోసేవారితో సమానంగా ఉండేవారు. అడవులు, గుట్టల్లో మైళ్ల తరబడి బురదమయమైన రహదారుల వెంట తిరుగుతూ వ్యాపారం నిర్వహించేవారు.

ఐరోపాలో కేవలం కొన్ని పట్టణాలు మాత్రమే ఉండేవి. చారిత్రక ఆధారాల ప్రకారం ఇంగ్లాండ్, జర్మనీ, తదితర ప్రాంతల్లో పట్టణాల జాడే ఉండేది కాదు. కొన్ని చోట్ల పట్టణాలు ఉన్నా అవి బడా భూస్వాములకు అధికార లేదా పాలనా కేంద్రాలుగా ఉపయోగపడేవి. కొన్ని మత సంస్థలు కూడా ఇలాంటి కేంద్రాలను స్థాపించాయి. పట్టణాలు కోట, మఠం లేదా విశాలమైన చర్చి చుట్టూ వెలిసేవి. వాటిలో కొన్ని నివాస గృహాలు మాత్రమే ఉండేవి.

అయినప్పటికే యురేషియా ఖండంలో ఇంత వెనుకబాటు తనాన్ని చవిచూసిన ఈ ప్రాంతం ఒక కొత్త నాగరికతకు జన్మస్థలంగా మారి చివరగా ప్రపంచంలోని ఇతర ప్రాంతాలన్నింటినీ శాసించింది.

ఈ పరిణామ క్రమానికి అన్నిరకాల వివరణలు వెలువడ్డాయి. కొన్ని వివరణలు అద్భుతాన్ని స్పృశిస్తే కొన్ని పనికిమాలిన, నీతి బాహ్యమైన అంశాలను ముందుకు తెచ్చాయి. కొందరు యూదు – క్రైస్తవ సాంప్రదాయాన్ని కీర్తిస్తే మరికొందరు ఐరోపా వాసులు శ్రమ అన్వేషణాగుణాన్ని ప్రస్తుతించారు. ఐరోపా అభివృద్ధిని క్రైస్తవమత సాంప్రదాయం శాసించిందని చెప్పడంలో ఎలాంటి తర్కం కనిపించదు. రోమను సామ్రాజ్య చివరి రోజుల్లో ఐరోపా చీకటి యుగాల్లోకి జారిపోయినపుడు, బైజాంటియం సామ్రాజ్య క్షీణదశకు చేరుకున్నపుడు క్రైస్తవ మతం ఎలాంటి 'ప్రభావాన్ని' చూపలేకపోయింది. ఇక కష్టపడే గుణానికి వస్తే ప్రాచీన సామ్రాజ్యాలు లేదా నాగరికతలకు చెందిన ప్రజలు కష్టపడకుండానే వైభోగాన్ని వెలగబెట్టారని మనం ఆశ్చర్యపోవలసి వస్తుంది. ఐరోపా ప్రజలు జాతిపరంగా సర్వోన్నతులు అని కొందరు వ్యర్థమైన వాదనను లేవదీశారు. ఇక్కడి ప్రజలు చాలా కాలం పాటు వెనుకబాటుతనాన్ని అనుభవించారన్న విషయాన్ని ఎవరూ మరువకూడదు.

సాంప్రదాయ ప్రధాన స్రవంతి చరిత్ర ప్రకారం కొందరు మహాపురుషులు వరుసగా ఆవిర్భవించారు. ఈ మహానుభావులంతా అనుకోకుండా భూమిపై జన్మించిన వారే. జర్మన్ సామాజికవేత్త మాక్స్ వెబెర్ అనుచరుల ప్రకారం 'కాల్విన్‌వాదం', '(ప్రొటెస్టెంటు నైతికత' అదృష్టవశాత్తు విస్తరించాయి. కొందరు ఉత్తర అమెరికా విద్వాంసుల ప్రకారం 15వ శతాబ్ది ఇంగ్లాండుల్లో భూస్వాములు, రైతుల మధ్య ఉన్నట్లుండి ఘర్షణలు చెలరేగాయి. ఈ ఘర్షణల్లో ఏ వర్గమూ విజయం సాధించలేక పోయింది.

## ప్రగతి దిశగా మందగించిన ప్రస్థానం

ఈ వివరణలన్నీ ఒక ముఖ్యమైన అంశాన్ని విస్మరించాయి. ఐరోపా వెనుకబాటు తనమే ప్రజలను జీవనోపాధికి కొత్త మార్గాలను ఎంచుకునేలా ప్రోత్సహించింది. చైనా, భారతదేశం, ఈజిప్టు, మెసపటోమియా, దక్షిణ స్పెయిన్‌లో ఎంతో కాలం క్రితమే ఆచరణలోకి వచ్చిన ఉత్పాదనా పద్ధతులు, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఐరోపా ప్రజలు అందిపుచ్చుకున్నారు. శతాబ్దాల తరబడి నెమ్మదిగా వాటిని వినియోగిస్తూ ముందుకు వెళ్లారు. సంగ్ పాలనలోని చైనా లేదా అబ్బాసిద్ ఖలీఫత్‌లో వలె ఐరోపా సమాజంలో కూడా సామాజిక సంబంధాలలో స్థూలమైన మార్పులు వచ్చాయి. ఈ మార్పులు రావడానికి చాలా సమయం పట్టింది. అయితే ఈసారి పాత సామ్రాజ్యవాద మహావ్యవస్థ భారం లేకుండానే మార్పు వచ్చింది, నిరంతర ప్రగతికి బాటలు వేసింది. ఐరోపా వెనుకబాటుతనమే ఇతర మహాసామ్రాజ్యాలను సైతం అధిగమించేలా ఐరోపాను సమాయత్తం చేసింది.

ఆర్థిక, సాంకేతిక ప్రగతి ఎలాంటి అడ్డంకులు లేకుండానే సాధ్యం కాలేదు. అది పరిణామక్రమంలో సహజంగా సంభవించినదీ కాదు. పాత వ్యవస్థలు తరచూ కొత్త మార్గాలను అడ్డుకుంటూ, అడ్డంకులు సృష్టిస్తూ, కొన్ని సందర్భాల్లో వాటిని పూర్తిగా అణచివేస్తూ తమ ఉనికిని చాటుకున్నాయి. మిగతా చోట్ల వలే ఐరోపాలో కూడా తిరుగుబాట్లు సంభవించాయి. వాటిని పాలకవర్గాలు (భూస్వాములు) అణచివేశాయి. కొత్త వ్యవస్థను సృష్టిస్తామని హామీ ఇచ్చిన ఉద్యమాలు చివరకు పాత వ్యవస్థనే పునరుద్ధరించాయి. సారవంతమైన భూములు బీడుగా మారాయి. సంపన్నమైన నగరాలు శిథిలాలుగా మిగిలిపోయాయి. ఘోరమైన, అనాలోచితమైన యుద్ధాలు చోటు చేసుకున్నాయి. పాశవికమైన చిత్రహింస, బానిసత్వం విశృంఖలంగా పెరిగాయి. అయినప్పటికీ చివరలో సమాజాన్ని, ఉత్పత్తిని నిర్వహించే కొత్త వ్యవస్థ ఆవిర్భవించింది. చరిత్ర ఇలాంటి వ్యవస్థను గతంలో ఎన్నడూ ఎరుగదు.

తొలి మార్పులు వ్యవసాయంలో వచ్చాయి. చీకటి యుగాల్లో భూములపై ఆధారపడి మనుగడ సాగించిన వారు నిరక్షరాస్యులై ఉండొచ్చు. మూఢనమ్మకాలు కలిగి తమ చుట్టూ ఉన్న ప్రపంచం గురించి ఏమీ తెలుసుకోలేని అజ్ఞానులై ఉండొచ్చు: అయితే తమ జీవనోపాధి ఎక్కడి నుండి వస్తుందో వారికి బాగా తెలుసు. అందుకే నెమ్మదిగానైనా కొత్త వ్యవసాయ పద్ధతులను అనుసరించడానికి సిద్ధమయ్యారు. ప్రయత్నం ఫలిస్తే (వ్యవసాయంలో ప్రయోగం) తమ పొట్టలను ముప్పూటలా నింపుకొనేవారు. క్రీ.శ. ఆరవ శతాబ్దంలో నాగలిని కొత్త ఆకారంలో మలిచారు. బలమైన చక్రాల మీద నడిచే ఈ నాగలి సారవంతమైన గట్టి నేలలను దున్నడానికి చాలా ఉపయోగకరంగా ఉండేది. ఇలాంటి నాగలిని తొలుత ఈశాన్యఐరోపాకు చెందిన స్లావ్ ప్రజలు వినియోగించారు. తదుపరి 300 ఏళ్ల కాలంలో అది పశ్చిమ ఐరోపా ప్రాంతాలన్నింటికీ విస్తరించింది. నాగలితోపాటు పశుపోషణలో కొత్త పద్ధతులు వచ్చాయి. రైతులు పశువుల పేడను సహజ ఎరువుగా వినియోగించి భూములను మరింత సారవంతంగా తీర్చిదిద్దారు. వ్యవసాయ, పాడి పరిశ్రమ రెండూ కలిసి రైతుకు అన్ని విధాలా మేలు చేకూర్చాయి. పంట

దిగుబడి 50 శాతానికి పైగా పెరిగింది. అలాగే రైతులకు పాలు, పాలపదార్థాలు, మాంసం, చర్మం, ఉన్న గతంలో కంటే చాలా పెద్ద పరిమాణంలో లభించాయి. అదే సమయంలో పంట కోతలో కూడా మార్పులు వచ్చాయి. కోతలను రైతులు మరింత సమర్థవంతంగా నిర్వహిస్తూ దిగుబడిని పెంచుకున్నారు.

"మానవశక్తితో పోలిస్తే ఈ వ్యవసాయ పద్ధతి ఎంతో ఫలప్రదంగా రుజువైంది. ప్రపంచం ఎన్నడూ ఇలాంటి మార్పును చవిచూడలేదు", అని ఒక ఆర్థిక చరిత్రకారుడు వాదించాడు.

తదుపరి శతాబ్దాల్లో మరిన్ని అధునాతన పద్ధతులు వచ్చాయి. ముఖ్యంగా గుర్రాల పోషణల్ మధ్య ఆసియా పద్ధతిని అనుసరించారు. గుర్రాలను సాధు జంతువులుగా తీర్చిదిద్దడంతో వ్యవసాయంలో (దున్నడం, విత్తడం) కాడెద్దుల అవసరం తప్పింది. ఎద్దుల కంటే గుర్రాలు ఎంతో వేగంగా పని పూర్తి చేయగలిగాయి. భూమిని మరింత సారవంతం చేయడానికి చిక్కుడు, తదితర పంటలను సాగు చేశారు. మధ్యయుగాల రైతాంగంపై విస్తృతంగా అధ్యయనం చేసిన ఫ్రెంచి చరిత్రకారుడు జార్జస్ దూబీ ప్రకారం ఈ అన్వేషణల (ఆవిష్కరణలు) స్థూల ప్రభావం 12వ శతాబ్దానికల్లా పంట దిగుబడిని రెండింతలు పెంచివేసింది.

ఇలాంటి మార్పులు నెమ్మదిగా చోటు చేసుకున్నాయి. ఆర్థిక చరిత్రకారిణి సిల్వియా థ్రప్ ప్రకారం మధ్యయుగాల్లో ఆర్థిక ప్రగతి రేటు గరిష్టంగా అయితే 0.5 శాతంగా ఉండొచ్చు. అయినప్పటికీ 300-400 సంవత్సరాల్లో ఇలాంటి అభివృద్ధి రేటు ప్రజల ఆర్థిక జీవితాన్ని గణనీయంగా మార్చివేసి ఉంటుంది.

ఇలాంటి ప్రగతి రైతాంగ ఉత్పత్తిదారుల సృజనాత్మకత, క్రియాశీల కృషి ఆధారంగానే చాలా వరకు సంభవించి ఉంటుంది. కాని అందుకు మరో ప్రోత్సాహకం కూడా అవసరం - అదనపు నిల్వలను పూర్తిగా దోచుకోకుండా భూస్వాములు వాటిలో కొంత భాగాన్ని వ్యవసాయాభివృద్ధికి కేటాయించారు. కొందరు ప్రభువులు కిరాతకంగా, దూకుడుగా వ్యవహరించేవారు. వారు రైతులను భూములను సేకరించి బలవంతంగా తమ ఆధీనంలో ఉంచుకునేవారు. ఆహారధాన్యాల క్రయవిక్రయాల కంటే రైతులు తమకు ప్రత్యక్షంగా విధేయులై ఉండాలని కోరుకునేవారు. ఆ విధంగా ఎనలేని సంపదను కూడబెట్టేవారు. కాని సంపదలో అధిక భాగాన్ని భోగభాగ్యాలపై, యుద్ధాలపై వృధా చేసేవారు. అయినప్పటికీ తమ స్వంత జాగీర్లలోనే నివసించేవారు. రోము గణరాజ్య చివరి దశలో లేదా అబ్బాసిద్‌ల పాలన చివరలో బడా భూస్వాములంతా నగరాలలో నివాసముంటూ తమ భూముల నుండి వచ్చే ఆదాయాన్ని విలాసాలపై వెచ్చించేవారు. కాని ఈ దశలో ఐరోపా భూస్వాములు తమ స్వంత జాగీర్లలోనే కొనసాగారు. భూస్వాముల దోపిడీ స్థాయి పెరిగింది. ఒక దశలో రైతులను మరింత ఇబ్బంది పెడితే తదుపరి పంటను సాగు చేసే నాథులే ఉండరనే భావన మూర్ఖుడైన భూస్వామిలో సైతం తలెత్తింది. జర్మన్ ఆర్థిక చరిత్రకారుడు క్రైడే పేర్కొన్నట్లు రైతు భూమిని భూస్వామి ఎట్టి పరిస్థితుల్లోనూ పరిరక్షించాల్సిన అవసరం ఏర్పడింది. పంట వైఫల్యం తదితర అత్యవసర సమయాల్లో రైతులకు తోడ్పాటును అందించాల్సి వచ్చింది.

అధునాతన వ్యవసాయ పని ముట్లను రైతులకు అందుబాటులోకి తెస్తే భూస్వాములు అదనపు నిల్వలను మరింత ఎక్కువ పరిమాణంలో సమీకరించే అవకాశముండేది. తద్వారా విలాసాలకు, యుద్ధాలకు సరిపడ వనరులను కూడగట్టడానికి వీలు పడేది. కొందరు భూస్వాములైతే ఇనుముతో తయారు చేసిన వ్యవసాయ కాలాల్లో అరువు ఇచ్చేవారు. భూస్వాములు వ్యక్తిగతంగా అడవుల నరికివేతను, భూముల అభివృద్ధిని స్వంత వనరులతో చేపట్టేవారు. ఈ ప్రక్రియను భూస్వామ్య వ్యవస్థ కొనసాగినంత కాలం నిరంతరంగా చేపట్టారు. వ్యవసాయ రంగంలో తొలిసారిగా మానవ రహితమైన, యాంత్రికమైన నీటి చక్రాన్ని వినియోగంలోకి తేవడంలో భూస్వామ్య వర్గాలు కీలకపాత్రను పోషించాయి.

ఇతర పాలక వర్గాలవలె భూస్వామ్య దొరలు కూడా రైతాంగ దోపిడీపై ఎక్కువగా దృష్టి సారించేవారు. రైతులు అందించే ఉచిత శ్రమను వినియోగించి పిండి మిల్లులను నిర్మించేవారు. తిండి గింజలను పిండి రూపంలో మార్చడానికి రైతులనే కార్మికులుగా పెట్టుకునేవారు. అలా శ్రమ పడ్డందుకు రైతుల నుండి నగదును కూడా వసూలు చేసేవారు. చారిత్రక గమనంలో ఒక దశ వచ్చే సరికి దోపిడీ స్థాయిని పెంచడానికి మార్గాలను అన్వేషించడమే కాకుండా కొందరు భూస్వాములు ఉత్పత్తి మార్గాలలో మార్పులను కూడా ప్రోత్సహించారు.

భూస్వామ్య పాలకవర్గం కేవలం యుద్ధ ప్రభువులకే పరిమితం కాలేదు. పెద్ద జాగీర్లలో అత్యధిక భాగాన్ని మత సంస్థలు నియంత్రించేవి. ముఖ్యంగా క్రైస్తవ మతాలు, మత శిక్షణా సంస్థలు ఎక్కువ సంఖ్యలో జాగీర్లను కలిగి ఉండేవి. "యుద్ధ ప్రభువులతో సమానంగా క్రైస్తవ మతాలు, బిషప్‌లు, మత పెద్దలు ధన, రాజకీయ, కండబలాన్ని ప్రదర్శించేవారు. మత సముదాయాలు లేదా మత విద్వాంసులు అపారమైన సంపదను కూడబెట్టారు."

కొన్ని సందర్భాల్లో మత సన్యాసుల విద్యాభ్యాసాన్ని గ్రీకు, రోమను, బైజాంటిన్, అరబ్ సామ్రాజ్యాలలో అభివృద్ధి చెందిన శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని తెలుసుకోవడానికి ఉపయోగించేవారు. "ప్రాచీన నాగరికతల్లో అభివృద్ధి చెందిన నీటి చక్రాలు లేదా గాలిమరలను కాని, వ్యవసాయ పద్ధతుల్లో వచ్చిన మార్పుల గురించి కాని తెలుసుకోవాలంటే మత సంస్థలు ఎప్పుడూ వాటి అధ్యయనంలో ముందు ఉండేవి."

కొత్త ఉత్పత్తి పద్ధతులను పూర్తిగా ఆచరణలోకి పెట్టడమంటే భూస్వాములు, వ్యవసాయదారుల మధ్య సంబంధాల్లో కూడా మార్పు వచ్చినట్లే. బడా భూస్వాములు ఎట్టకేలకు రోమను సాంప్రదాయమైన బానిసత్వాన్ని త్యజించారు. ఐరోపాలో బానిస వ్యవస్థ పదవ శతాబ్దం చివరకంటూ కొనసాగింది. తర్వాత భూస్వాములు కౌలుదారీ వ్యవస్థ సమకూర్చే లాభాలను బేరీజు వేయడం ప్రారంభించారు. దిగుబడిలో వాటాకు ప్రతిఫలంగా వారు రైతులకు భూములను కౌలుపై అప్పగించడం మొదలుపెట్టారు. కౌలు రైతులు తమ శక్తి మేరకు శ్రమపడుతూ వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి పరిచారు. స్థూల దిగుబడి పెరిగే కొద్దీ భూస్వాముల ఆదాయం కూడా పెరిగింది. పాలకవర్గం తన సైనిక బలం ఆధారంగా స్వేచ్ఛాయుతమైన రైతాంగాన్ని కూడా కౌలుదారీ వ్యవస్థలో చేసి తన ఆదాయాన్ని, నిల్వలను మరింత పెంచుకుంది.

క్రీ.శ.1000ను బోయిస్ చారిత్రక పరిణామవాద సంవత్సరంగా అభివర్ణించాడు. ఈ సంవత్సరంలోనే వ్యవసాయ రంగంలో వెట్టిచాకిరికి తెరపడింది. భూస్వామ్య కౌలుదారీ వ్యవస్థ పాత రోమను వ్యవస్థ స్థానాన్ని ఎట్టకేలకు భర్తీ చేసింది. ఉత్పాదకత పరంగా కౌలుదారీ వ్యవస్థ ఎంతో సమర్థవంతమైన సాధనంగా రుజువైంది.

క్రీ.శ.1000 నుండి 1300 వరకు గ్రామీణ ప్రాంతాల్లో సంభవించిన పరిణామాల ప్రాముఖ్యతను సూపర్‌మార్కెట్ల నుండి ఆహార ఉత్పత్తులను కొనుగోలు చేసే మనలాంటి ఆధునిక చరిత్రకారులు చాలా తక్కువ చేసి వివరిస్తారు. ఒక్కో వ్యవసాయ కుటుంబం పండించే ఆహార ధాన్యాల దిగుబడి రెట్టింపై ఐరోపా అంతటా మానవాళి జీవితాన్ని, జీవనోపాధి మార్గాలను గణనీయంగా మార్చివేసింది. అదనపు ఆహార ధాన్యాలను నియంత్రించగలిగిన వారెవరైనా చేతివృత్తిదారులు లేదా సంచార వ్యాపారులతో వస్తు మార్పిడిని చేసుకొనే వారు.

ఉదాహరణకు ధాన్యాలను భూస్వామ్య కుటుంబం పట్టువస్త్రాల కోసం మార్చుకొనేది. భూస్వాములు ఆయుధాల తయారీ కోసం ఇనుమును, తమ కోటలను అలంకరించడానికి కలప సామాగ్రిని, విందులు వినోదాల కోసం మద్యం, మసాలా దినుసులను సమకూర్చుకునేందుకు తిండి గింజలను మార్చుకునేవారు. తిండిగింజలను వంటల రూపంలో మార్చి వ్యవసాయదారుల ఉత్పాదకతను (శ్రమశక్తిని ఇనుమడింపచేయడం ద్వారా) పెంచేవారు. వ్యవసాయ దిగుబడిని పెంచేందుకు కలపతో తయారైన నాగళ్లకు ఇనుప మొనలను అమర్చేవారు. రైతులకు కత్తులు,కొడవళ్లు అందించే వారు. కొన్ని సందర్భాల్లో వారికి ఇనుప కవచాలతో కూడిన గుర్రాలను, చక్రాలను, ఇనుముతో తయారైన పాదరక్షలను కూడా సమకూర్చేవారు.

పైన పేర్కొన్న పరికరాలు, వస్తువులను సాధారణ మార్కెట్లకు సరఫరా చేయడం ద్వారా సంచార వ్యాపారులు గౌరవ ప్రదమైన వ్యాపారులుగా రూపాంతరం చెందారు. సమాజంలో ప్రతిష్ట కలిగిన వ్యాపారులు సంపన్న వ్యాపారులుగా ఎదిగారు. చేతివృత్తిదారులు, వ్యాపారులు స్థిరపడడంతో పట్టణాలు పునరుద్ధరించబడ్డాయి. పట్టణాల్లో చర్చిలు, కోటల చుట్టూ వారు దుకాణాలను, కర్మాగారాలను స్థాపించారు. వ్యాపార సంబంధాలు పెరిగి మారుమూల గ్రామాల పట్టణాలతో అనుసంధానమయ్యాయి. విశాలమైన ప్రాంతాల్లో వ్యాపారం ప్రజల జీవన విధానాన్ని ప్రభావితం చేసింది. విలాస వస్తువులు, ఆయుధాల కొనుగోలు కోసం ధనాన్ని సేకరించేందుకు యుద్ధ ప్రభువులు వాణిజ్య పంటలనుసాగు చేసేలా కౌలుదారులను ప్రోత్సహించేవారు. శ్రమ లేదా వస్తు రూపేణా సేవలందించే బదులు నగదు రూపంలో అద్దె చెల్లించాలని కోరేవారు. తమ భూములలో తాత్కాలిక మార్కెట్లను ఏర్పాటు చేసుకోవడానికి వ్యాపారులను అనుమతించడం ద్వారా కొందరు భూస్వాములు అద్దె రూపంలో అదనపు ఆదాయాన్ని పొందేవారు.

గ్రామీణ జీవితం కంటే పట్టణ జీవితం చాలా భిన్నంగా ఉండేది. పట్టణాల్లో నివసించే వ్యాపారులు, చేతివృత్తిదారులు పూర్తి స్వేచ్ఛను అనుభవించేవారు. వారిపై ఏ భూస్వామి నియంత్రణ ఉండేది కాదు. "పట్టణ గాలి నిన్ను స్వేచ్ఛా జీవిని చేస్తుంది," అనే జర్మన్ లోకోక్తి ఒకటుంది. భూస్వామ్య వర్గాల ఆధిపత్యాన్ని అంగీకరించడానికి పట్టణ వర్గాలు ఏ మాత్రం ఇష్టపడేవికావు. పట్టణాలకు సమీపంలోని జాగీర్ల నుండి వెట్టిచాకిరిని తప్పించుకొని వచ్చిన

వారిని వ్యాపారులు, చేతివృత్తిదారులు తమ కొలువులో కార్మికులుగా పెట్టుకునే వారు. పట్టణాలు విస్తరించే కొద్దీ వాటి సంపద కూడా పెరిగింది. సంపద అపారంగా సమకూరడంతో తమ స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కాపాడుకోవడానికి పట్టణాలు తగిన మార్గాలను కనుగొన్నాయి. పట్టణాల చుట్టూ ప్రాకారాలను నిర్మించి పట్టణ యువతను సాయుధ సైనికులుగా తీర్చిదిద్దారు.

## 13వ శతాబ్ది నాగరికత

కాలక్రమంలో సమాజంలోని ప్రతి రంగంలోనూ మార్పులు చోటు చేసుకున్నాయి. ఐరోపా భూస్వామ్య వ్యవస్థపై సమగ్ర గ్రంథాన్ని రచించిన ఫ్రెంచి చరిత్రకారుడు మార్క్ బ్లాచ్ ఈ కాలాన్ని ద్వితీయ భూస్వామ్య యుగమని అభివర్ణించాడు. ఈ యుగంలో భూస్వామ్య వర్గాల మధ్య అంతర్గత సంబంధాల్లో గణనీయమైన మార్పులు వచ్చాయి. రాజులు మరింత బలోపేతమయ్యారు. వారి ప్రభావం, ప్రాబల్యం విస్తరించింది. భూస్వామ్య దొరలకు పై స్థాయిలో తమ ప్రాబల్యాన్ని సుస్థిరం చేసుకోవడంలో రాజులు సఫలమయ్యారు. పట్టణాలకు స్వయం పాలన హక్కులను ప్రసాదించడం ద్వారా రాజులు యుద్ధ ప్రభువులకు వ్యతిరేకంగా సమతుల్యాన్ని సాధించేవారు. భూస్వాముల ప్రాబల్యానికి పట్టణాలు పరిమితులు విధించేవి. తమ స్వంత జాగీర్లలో భూస్వాములు సర్వశక్తులు కలిగి ఉన్నా జాతీయ స్థాయిలో న్యాయపాలనకు రాజులు న్యాయస్థానాల వ్యవస్థను ప్రవేశపెట్టారు. రాజ్యం నియమించిన అధికారులే అందులో తీర్పులు చెప్పేవారు.

మేథోపరమైన జీవనంలో కూడా మార్పు వచ్చింది. గత కాలపు భూస్వాములు ఎన్నడూ నిర్వహించని పద్దుల వ్యవస్థను ఇపుడు వ్యాపారులు అమలు చేశారు. వ్యాపార లావాదేవీలను లిఖితపూర్వకంగా నమోదు చేయడానికి, జమాబందీని నిర్వహించడానికి విద్యావంతులను ప్రత్యేకంగా నియమించారు. తాత్కాలిక తీర్పుల స్థానంలో లిఖితపూర్వకమైన, నిర్దిష్టమైన చట్టాలను అమలు చేయాలని వ్యాపారులు పాలకులను కోరారు. గ్రామీణ ప్రాంతాల్లో భూస్వాములు తమకు తోచిన విధంగా తీర్పులు చెప్పేవారు. కొన్నిసార్లు ఈ తీర్పులు ఏకపక్షంగా, అసమంజసంగా ఉండేవి. కొందరు వ్యాపారులు రాయడం, చదవడం నేర్చుకున్నారు. స్థానిక భాషల్లోనే వారి విద్యాభ్యాసం కొనసాగింది. ఈ దశలో అక్షరాస్యత కేవలం మఠాలకే పరిమితం కాలేదు. అక్షర రూపం కలిగిన ఏకైక భాషగా లాటిన్‌కు ఉన్న ప్రాధాన్యత కూడా తగ్గిపోయింది. పారిస్, ఆక్స్‌ఫర్డ్, ప్రాగ్ లాంటి నగరాల్లో విశ్వవిద్యాలయాలు ఏర్పాటయ్యాయి. విద్యాభ్యాసం మఠాల నుండి ఈ కొత్త విశ్వవిద్యాలయాలకు చేరింది. విద్వాంసులు విద్యాబోధన ద్వారా జీవనోపాధిని సాధించారు. వారిపై చర్చి నియంత్రణ సడలిపోయింది. గ్రీకు, రోమను నాగరికతలకు చెందిన మతేతర గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసేందుకు వారికి అవకాశం లభించింది. సిసిలీ, గ్రామీణ  స్పెయిన్ లేదా సిరియాలలో పర్యటిస్తూ విద్వాంసులు అరబిక్ అనువాదాల ద్వారా గ్రీకు, రోమను గ్రంథాల విజ్ఞానాన్ని పెంచుకున్నారు. ప్లాటో, అరిస్టాటిల్ సిద్ధాంతాలపై విద్వాంసులు, మేధావుల మధ్య వాదోపవాదాలు చోటు చేసుకున్నాయి. అలాగే అరిస్టాటిల్, అవెరోస్ సిద్ధాంతాలపై ఉన్న ఇస్లామిక్ విశ్లేషణలపై వివరణలపై కూడా ఎడతెగని వాదనలు జరిగాయి.

మధ్యయుగాల ఆలోచనా విధానం మతపరమైన బోధనలతో ముడిపడి ఉండేది. ప్రాచీన గ్రంథాలను వేర్వేరుగా అన్వయించే విద్వాంసుల మధ్య చర్చలు తీవ్రస్థాయిలో జరిగేవి. ప్రతి విశ్లేషణను ఇతరులు ఖండించి తమ వాదనను ముందుంచేవారు. అందుకు ప్రాచీన గ్రంథాలను ప్రామాణికంగా చూపేవారు. అయితే ఆధునిక ఆలోచనా సరళి తొలి దశ ఈ పరిస్థితికి (గ్రంథాలపై ఆధారపడే) చాలా దూరంగా ఉండేది. పాత గ్రంథాలను (మరుగున పడిన ప్రాచీన గ్రంథాలు) వినియోగించి కొత్త ఆలోచనలను సృష్టించేందుకు ఈ ప్రక్రియ ప్రయత్నించింది. ఆ విధంగా 12వ శతాబ్దం తొలియార్ధంలో విద్యావంతుల మేధోపరమైన జీవితాన్ని (పారిస్ విశ్వవిద్యాలయంలో) ప్రభావితం చేసిన అబెలార్డ్ ఇలా వాదించాడు : "పరిణామాలను ప్రభావితం చేసే రహస్య కారణాలు, అంశాలను అర్థం చేసుకొని ఆలోచించేవాడే నిజమైన విద్యావంతుడు. ఇక్కడ రహస్య కారణాలంటే పరిణామాలకు పునాదులు వేసేవి. వాటిని తర్కంతో అన్వేషించాలి కాని భౌతిక అనుభవంతోకాదు." దైవాన్ని ధిక్కరించే విధంగా మానవ ఆలోచనలతోనే పరిణామాలను విశ్లేషించగలనని వాదించిన అబెలార్డ్‌ను కాలిర్వాక్స్‌కు చెందిన సెయింట్ బెర్నార్డ్ అనే తాంత్రికుడు తీవ్రంగా దూషించాడు.

తర్కంపై ఆధారపడడమంటే ఆచరణాత్మక కార్యకలాపాలకు దూరంగా కొత్త విద్యాభ్యాసం ఉండాలనే అర్థాన్ని సూచించదు. పశ్చిమ దేశాలలో మందుగుండు తయారీకి సంబంధించిన సూత్రీకరణలను రూపొందించిన తొలి విద్వాంసుడు రోజర్ బేకన్. అద్దాలు, గాజు పరికరాల సహాయంతో దుర్భిణీలను సృష్టించేందుకు అతడు అనేక మార్గాలను అన్వేషించాడు. మరో విద్వాంసుడు మారికోర్ట్‌కు చెందిన పీటర్ ఆయస్కాంత ధర్మాలను పరిశోధించాడు. వాటి ఆధారంగా కొత్త యంత్రాలను రూపొందించాడు.

విజ్ఞానవంతమైన అనువాదాలతోపాటు గ్రీసు, రోము లేదా అలెగ్జాండ్రియాలో వెయ్యేళ్ల క్రితం కనుగొనబడిన నూతన సాంకేతిక పద్ధతులు, ఈశాన్య మధ్యధరా ప్రాంతానికి చెందిన ఇస్లామిక్ సమాజాల పద్ధతులు, చైనా నుండి మధ్య ఆసియా సమకూర్చుకున్న సాంకేతిక పరిజ్ఞానం తదితర సమాచారం కూడా అందుబాటులోకి వచ్చింది.

స్థానిక మిల్లు కార్మికులు, కంసాలులు, భవననిర్మాణ కార్మికులు అప్పటికే పనిముట్లను మెరుగుపరుస్తున్నారు. కొత్తగా లభించిన పరిజ్ఞానంతో వారు మరింత అధునాతమైన పరికరాలను రూపొందించగలిగారు. ఈ ప్రక్రియలో పరిశ్రమను యాంత్రీకరించాలన్న తపన ఎక్కువైంది. ఫలితంగా ఏ నాగరికత ఎరుగని విధంగా యాంత్రిక ప్రగతి సాధ్యమైంది.

నీటి యంత్రాల వినియోగం విస్తరించింది. కంసాలులు, నేత పనివారు నీటి యంత్రాల ఆధారంగా తమ వృత్తిని తీర్చిదిద్దుకున్నారు. యంత్రశక్తితో ఇనుము, జౌళి ఉత్పత్తులను తయారు చేయడం నేర్చుకున్నారు. మర చక్రాలు వేగాన్ని, భ్రమణశక్తిని పెంచాయి. 12వ శతాబ్దంలో ఆగ్నేయ ప్రపంచం నుండి దిక్సూచి, నేత చక్రం దిగుమతి అయ్యాయి. 13వ శతాబ్దంలో నౌకా చాలన పరికరం స్థానంలో రడ్డర్‌ను వినియోగించడం మొదలు పెట్టారు. ఫలితంగా సముద్రయానం సురక్షితంగా, సరళంగా మారింది. కంటద్దాలను కనుగొ[illegible] [illegible]నారులు, విద్వాంసులు దృష్టి [illegible] నుండి [illegible]. వారి [illegible]

కూడా పెరిగింది. గుర్రపు కవచాలు, ఆయుధాల తయారీలో ఆధునిక పద్ధతులు, ఏటవాలుగా ఉండే విల్లు, దుర్భేదన పరికరం, తర్వాత మందుగుండు, ఫిరంగి (దీనిని 1320లో తొలిసారిగా వాడారు) యుద్ధతంత్రాన్ని పూర్తిగా మార్చివేశాయి. అంతవరకు వెలుగులోకి రాని సాధారణ కలుపు చక్రం వ్యవసాయంలో మానవశ్రమను చాలా వరకు తగ్గించివేసింది.

13వ శతాబ్ది చివరి నుండి 14వ శతాబ్ది తొలి దశకాల వరకు మధ్యయుగ సమాజం, సంస్కృతి ప్రగతి పథాన పయనించడానికి ఈ సాంకేతిక ప్రగతే కారణం. ఈ సమయానికి సముదాయ నివాస ప్రాంతాలు, స్వయం పాలిత నగర రాజ్యాలు ఉత్తర ఇటలీ, ఫ్లాండర్ రాజకీయ రంగంలో ఆధిపత్యం సాధించాయి. బొకాషియో, చౌసర్, డాంటే లాంటి రచయితలు లౌకికవాద సాహిత్యాన్ని సృష్టించి పేరు గడించారు. స్థానిక యాసలో వారి రచనలు సాగాయి. ఈ ప్రక్రియలో స్థానిక భాషలు, యాసలు జాతీయ భాషలుగా రూపాంతరం చెందాయి. వాటి ప్రతిష్ట కూడా పెరిగింది. మధ్యయుగ పట్టణాలలో విశాలమైన, ఎత్తయిన చర్చిలు ప్రధాన ఆకర్షణగా మారాయి. భవన నిర్మాణం, సాహిత్యం, కళారంగాలలో గొప్ప కృతులు వచ్చాయి. వ్యవసాయ, సాంకేతిక, సైద్ధాంతిక రంగాలలో కొన్ని శతాబ్దాలుగా వచ్చిన మార్పులే ఈ నిర్మాణాలకు, శిల్పకళకు, సాహిత్యానికి స్ఫూర్తినిచ్చాయి.

## 14వ శతాబ్దంలో సంక్షోభం

అయితే ఆర్థిక ప్రగతి, సాంకేతికాభివృద్ధి యుగం నిరంతరంగా కొనసాగలేదు. ఎందుకంటే ఈ యుగం సమాజంపై భూస్వాములు ఆధిపత్యం వహించిన సమయంలో వచ్చింది. ఈ భూస్వామ్య వర్గాలు స్వంత ప్రయోజనాలను ఆశించేవి. విలాసవంతమైన జీవితం, తరచూ యుద్ధాలు, సంఘర్షణ, సైనికపరమైన గుర్తింపు కోసం ఆరాటం సమాజ సంపదపై భారం మోపాయి. కాలక్రమంలో ఈ భారం సాంకేతిక, ఆర్థిక ప్రగతిని కూడా నాశనం చేసింది. రిచర్డ్ ద లయన్ హార్ట్ లేదా సెయింట్ లూయి IX (ఫ్రాన్స్) లాంటి మహాపురుషుల గాథలతో మధ్యయుగాల సాహిత్యం నిండి ఉంది. వీరు కిరాయి సైన్యాలపై భారీగా ధనాన్ని వెచ్చించి ఐరోపా, ఆసియా మైనర్‌ల నుండి ముస్లింలను తరిమివేయడానికి పవిత్ర యుద్ధాన్ని చేపట్టారు. వారి జీవితమంతా ఈ యుద్ధాలలోనే గడిచిపోయింది. ఈ యుద్ధాల ప్రధాన లక్ష్యం పాలస్తీనా నుండి ముస్లింలను తరిమివేయడానికి ప్రయత్నించడమే. ఇలాంటి అనాలోచిత, విధ్వంసకరమైన యుద్ధాలనే నార్మన్ పాలకులు కూడా చేపట్టారు. స్కాట్‌లాండ్, వేల్స్, ఫ్రాన్స్, ఇంగ్లాండ్, ఐర్లాండ్‌లను అణచివేయడానికి నార్మన్ పాలకులు ఈ భీకరమైన యుద్ధాలను చేశారు. అలాగే 13వ శతాబ్దంలో జర్మనీకి చెందిన పవిత్ర రోమను చక్రవర్తులు, పోప్‌తో చేతులు కలిపిన ఫ్రెంచి పాలకుల మధ్య ఇటలీలో వరుసగా యుద్ధాలు జరిగాయి. రాజ్యాల వనరులలో ఒకటి నుండి రెండు శాతం మేరకే అభివృద్ధి ప్రక్రియలో పెట్టుబడులుగా ఉండేవి.

తాము అనుభవిస్తున్న సంపదను సృష్టించడం ఎంత శ్రమతో కూడుకున్న వ్యవహారమో భూస్వాములు గ్రహించలేకపోయారు. వాస్తవ పరిస్థితులకు వారు చాలా దూరంగా

ఉండిపోయారు. యుద్ధప్రభువుల వారసులు ఖరీదైన పట్టు వస్త్రాలు, నగలు, కవచాలు ధరించి విలాసవంతమైన భవనాల్లో జీవించేవారు. అలా చేయడం ద్వారా తాము సమాజంలోని ఇతర వర్గాల కంటే ఎంతో ఉన్నతులమని చాటుకునేవారు. తమ వర్గాన్ని వారు ఒక ప్రత్యేక కులంగా పరిగణించేవారు. పవిత్రమైన మత ఆచారాలు తమకు వారసత్వంగా న్యాయపరమైన హక్కులను కల్పించాయని భావించేవారు. ఈ కులం కూడా వివిధ హోదాలు కలిగిన వర్గాల సమూహంగా ఉండేది. బడా భూస్వాములు, సాధారణ భూస్వాముల మధ్య విభజన ఉండేది. సాధారణ భూస్వాములు పాలకవర్గాలపై (బడా భూస్వాములు) ఆధారపడేవారు. అయితే ఈ శ్రేణులన్నీ ధనార్జనకు పాల్పడే ఇతర సామాజిక వర్గాలను తీవ్రంగా నిరసించేవి. సంపన్న వ్యాపారులు, చేతివృత్తిదారులు లేదా పేద రైతులంటే వారికి గిట్టేది కాదు.

పోప్‌లు, మఠాలు, బిషప్‌లు ఈ పాలకవర్గంలో ఒక భాగంగా ఉంటూ దాని వైఖరులను, విలువలను సమర్థించేవారు. కాని వారికంటూ కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు ఉండేవి. 11వ శతాబ్దం చివరి దశలో సంస్కరణవాద పోప్‌లు మఠాలు, చర్చిల విశాలమైన యంత్రాంగాన్ని ఏర్పాటు చేసి ఐరోపా ఖండమంతటిపై సాంప్రదాయ వ్యవస్థను రుద్దాలని ఆకాంక్షించారు. ఈ ప్రక్రియలో చర్చి ప్రత్యర్థి భూస్వాముల మధ్య శాంతిని, సయోధ్యను నెలకొల్పాలని ప్రయత్నించింది. తద్వారా సమాజంలో బలమైన శక్తిగా ఎదగాలని భావించింది. మరో అంశం ఏమిటంటే పవిత్ర యుద్ధాలు (క్రుసేడ్లు) సృష్టించిన విధ్వంసం. పవిత్ర యుద్ధాల పేరుతో సమాజ సంపదనంతా దుబారా చేశారు. అవిశ్వాసులైన ముస్లిం కబంధహస్తాల నుండి జెరుసలేంను విముక్తి చేయాలని పోప్‌లు క్రైస్తవులకు పిలుపునిచ్చారు. పవిత్ర యుద్ధాల పేరుతో సమకూరే సంపద ఆశ చూపి వారు రాజులు, యుద్ధ ప్రభువులు, సాయుధ భూస్వాములను కూడా పోగు చేశారు. విశాలమైన సైన్యాలన్నీ పోపు నియంత్రణలో ఉండేవి. పవిత్ర యుద్ధాలలో భాగంగా ఈ సైన్యాలు నగరాలను ఉద్దేశ్యపూర్వకంగా ధ్వంసం చేసినా, మహిళలు, పిల్లలను ఊచకోత కోసినా, అత్యాచారాలు, దోపిడీ, యూదులు, ముస్లింలు, కాథలిక్‌లు కాని క్రైస్తవుల మారణహోమానికి పాల్పడినా, 1204లో కాన్‌స్టంటినోపుల్‌ను దోచుకొని తగులబెట్టినా పోప్‌లకు ఏమీ పట్టలేదు. ఫ్రెంచి పాలకునితో చేతులు కలిపిన పోప్‌లు, ఇతర చక్రవర్తులకు మధ్య జరిగిన యుద్ధాలు (13వ శతాబ్దంలో) ఇటలీని సర్వశాసనం చేశాయి. పోప్‌లకు అధికారదాహానికి ఈ అనాలోచిత విధ్వంసం ఒక నిదర్శనం.

పోప్‌లు, బిషప్‌లు, అబ్బాట్‌లు తాము పాలకులతో సమానంగా పంచుకునే విలువలను పరిరక్షించేందుకు కృషి చేశారు. ఆ కాలపు అద్భుత కళాసృష్టికి ప్రతిరూపాలైన కేథడ్రల్లు పాలకవర్గ అధికారానికి చిహ్నాలుగా ఉండేవి. భగవంతుడే సమాజాన్ని సృష్టించాడని, దాన్ని వర్గీకరించడని, దానికో లక్షణాన్ని నిర్ధారించాడని కేథ్రడల్ ప్రబోధించేది. దైవదూతలు, సంతులు, మానవుల వర్గీకరణను ఇపుడు రాజులు, యుద్ధ ప్రభువులు, బిషప్‌లు, భూస్వాములు, సాధారణ పౌరుల వ్యవస్థగా ప్రచారం చేశారు.

మూఢనమ్మకాలు, తంత్రశక్తుల ఆధారంగా ప్రజల ఆలోచనలను చర్చి శాసించేది. పవిత్ర అవశేషాలకు అతీంద్రియ శక్తులు ఉంటాయని, అవి అద్భుతాలు సృష్టిస్తాయన్న భావన

సమాజంలో నెలకొంది. ఈ సమాజంలో మానవ జీవితం క్షణికంగా, అభద్రంగా ఉండేది. ఈ కారణంగా నగరాల్లో కొత్త ఆలోచనలు వ్యాప్తి కాగలవన్న ఆందోళన చర్చి పెద్దలకు పట్టి పీడించేది. అబేలార్డ్, బేకాన్ లాంటి మేధావుల తర్కంపై ప్రజల్లో విశ్వాసం ఏర్పడితే మూఢనమ్మకాల పట్టు సడలిపోయే ప్రమాదం ఉండేది. మరోవైపు 'నిరాడంబరం, వినయం' అనే మత సూత్రాలను సన్యాసులు విస్తృతంగా ప్రచారం చేస్తే 'పవిత్రులైన' పేదలకు 'దుష్టులైన' ధనికులపై యుద్ధాన్ని చేపట్టే మతపరమైన హక్కు ఉందన్న వ్యతిరేక భావన ప్రబలే అవకాశముండేది. అందుకే కొత్త ఆలోచనలన్నింటిపై చర్చి నిషేధం విధించింది. మధ్యేవాదులైన ఫ్రాన్సిసియన్లను క్షమించిన చర్చి మితవాదులైన ఫ్రటెల్లీలను అణచివేసింది. తర్వాత 1277లో మత బోధనల నుండి క్షమకు అర్హత కలిగిన 219 తప్పులను తొలగించాలని ప్రయత్నించింది. (ఈ తప్పుల్లో కొన్నింటిని మధ్యయుగాల చివరలో థామస్ అక్వినాస్ అనే క్రైస్తవ ప్రబోధకుడు సమర్థించాడు). రోజర్ బేకాన్‌ను గృహ నిర్బంధంలో ఉంచినట్లు తెలుస్తోంది. అవెరోస్ అనుచరులు పారిస్‌ను వదలి పడువాకు పారిపోయేలా చర్చి ఒత్తిడి పెంచింది. చివరగా, 14వ శతాబ్దం సందర్భంగా 'విచారణ' అనే సూత్రం తెరపైకి వచ్చింది. దైవధిక్కార ఆలోచనలను ప్రచారం చేసే లేదా నమ్మే వ్యక్తులను సజీవ దహనం చేసే సాంప్రదాయం కూడా అమల్లోకి వచ్చింది. ఈ కొత్త వాతావరణంలో విద్వాంసులు ప్రమాదకరమైన అంశాలు లేదా చర్చల జోలికి వెళ్లకుండా మౌనంగా ఉండిపోయారు. అరిస్టాటిల్ ఆలోచనల ఆధారంగా క్రైస్తవ మతశాస్త్రాన్ని థామస్ అక్వినాస్ తీర్చిదిద్దిన తర్వాత (ఈ ప్రక్రియలో అతడు సామాజిక వర్గీకరణను సమర్థించాడు) మధ్యయుగాల ఆలోచనా సరళి తొలిసారి నిజమైన మత విద్యగా మారిపోయింది. చర్చి తిరోగమన సిద్ధాంతాన్ని లేదా దాని ప్రాపంచిక దృష్టికోణాన్ని ప్రశ్నించే వారు కరువయ్యారు. ఈ నిస్తేజమైన కాలంలో ప్రజలలో చైతన్యం కొరవడింది.

1300 సంవత్సరం నాటికి ఐరోపా సమాజంలో తీవ్రమైన వైరుధ్యం వచ్చింది. అప్పటికే భౌతిక, సాంస్కృతిక జీవనం ఉన్నత శిఖరానికి చేరుకొని ఉంది. ఇది రోమన్ సామ్రాజ్య ఉన్నత దశతో పోలి ఉండేది. పేదరికం, అభద్రత, మూఢనమ్మకాలను నెమ్మదిగా అధిగమిస్తూ సమాజం ముందుకు వెళుతున్నట్లు కనిపించింది. అయితే సమాజంలోని ఉన్నతవర్గం కట్టుదిట్టమైన పరిమితులను విధించుకుంది. బడా భూస్వాములు సమాజంలోని ఇతర వర్గాలకు దూరంగా ఉంటూ వర్గ విభజనలను మరింత పటిష్టం చేశారు. అసమ్మతి, తార్కిక ఆలోచనలను చర్చి తీవ్రంగా అణచి వేసింది. పాలకవర్గం తన విలాసానికి, అలాగే యుద్ధాలు, పండుగలు, వేడుకలకు అదనపు నిల్వలను మరింత ఎక్కువ పరిమాణంలో వెచ్చించారు.

వరుసగా కరువు సంభవించడంతో ఈ వైరుధ్యం తీవ్ర దశకు చేరుకొంది. ఐరోపా అంతటా ప్లేగు వ్యాపించింది. పౌష్టికాహారలోపంతో వేలాది మంది ప్రజలు మృత్యువు పాలయ్యారు. ఐరోపా జనాభా సగానికి సగం తగ్గిపోయింది. లెక్కలేనన్ని గ్రామాలు ఖాళీ అయ్యాయి. లక్షలాది హెక్టార్ల వ్యవసాయ భూమి బీడుగా మారింది. ఈ దశ 14వ శతాబ్దంలో మహాసంక్షోభాన్ని సూచిస్తుంది. గయ్ బోయిస్ చెప్పినట్లు " శతాబ్దానికి పైగా ఐరోపా ఖండంలో అత్యధిక భాగం జనాభా తరుగుదలను, ఉత్పాదకతలో క్షీణతను చవిచూసింది. ఈ పతనస్థాయిని,

కాలపరిమితిని కొలబద్ధగా తీసుకుంటే ఐరోపా సంక్షోభం చరిత్రలో ఎన్నడూ సంభవించని ఘట్టంగా మిగిలిపోతుంది. ఈ సంక్షోభం విపత్కర వాతావరణంలో చోటు చేసుకుంది. అంతులేని వ్యాధులు, నిరంతర యుద్ధాలు, తత్సంబంధిత విధ్వంసం, ఆధ్యాత్మిక గందరగోళం, సామాజిక-రాజకీయ అల్లర్లు సంక్షోభ లక్షణాలుగా ఉండేవి".

పాత నాగరికతలను చీకటి యుగాల్లోకి నెట్టివేసిన సంక్షోభాలను విశ్లేషించినట్లే వాటిని ప్రభావితం చేసిన సహజ కారణాలను కూడా వివరించే ప్రయత్నాలు జరిగాయి. కొందరు చరిత్రకారులు ఐరోపా ఖండంలో వాతావరణ ఉష్ణోగ్రత తగ్గిపోయిన విషయాన్ని ప్రస్తావించారు. ఉష్ణోగ్రత పడిపోవడం వల్లే అరాచకం, ఆకలి, కరువు ప్రబలాయని నిందించారు. అయితే మారిన వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా ప్రజలు తదుపరి దశాబ్దాల్లో ఎందుకు సర్దుకోలేకపోయారన్న అంశాన్ని పై వివరణ స్పష్టం చేయదు. ఉదాహరణకు ప్రజలు కొత్త పంటలను, ముఖ్యంగా బార్లీని గోధుమల స్థానంలో ఎందుకు సాగు చేయలేకపోయారు? లేదా ఒకప్పుడు ద్రాక్ష తోటలను పెంచిన భూముల్లో గోధుమ పంటను ఎందుకు వేయలేకపోయారు? మరికొందరు చరిత్రకారులు జనాభా పెరుగుదలే సంక్షోభానికి దారి తీసిందని వాదించారు. జనాభా పెరగడంవల్ల వ్యవసాయ భూములు సత్తువ కోల్పోయి దిగుబడి (అదనపు నిల్వలతో సహా) అంతా వినియోగమైందని పేర్కొన్నారు. అయితే బంజరు భూములన్నీ వినియోగంలోకి వచ్చాయని ఇక్కడ భావించలేము. ఏదేమైనా, గడిచిన శతాబ్దాల్లో పెరిగినట్లు పంట దిగుబడులు ఎందుకు పెరగలేదో పై వాదన వివరించదు.

సంక్షోభానికి దారి తీసిన ప్రధాన కారణం మాత్రం పాలక వర్గాలదోపిడే. తమ విలాసాలకు, భోగాభాగ్యాలకు, యుద్ధాలకు సరిపడ నిల్వలను సమకూర్చుకునేందుకు భూస్వామ్య వర్గాలు సమాజంపై ఒత్తిడిని తీవ్రతరం చేస్తూ వచ్చాయి. జార్జస్ డూబీ పేర్కొన్నట్లు ఒకవైపు అభివృద్ధిలో అగ్రభాగాన ఉన్న దేశాల్లో ధాన్యాగార ఆధారిత వ్యవస్థ క్షీణించిపోగా (పాలకవర్గాల అపరిమిత వినియోగంవల్ల) మరోవైపు సాంకేతికాభివృద్ధికి ఎలాంటి ప్రోత్సాహం కాని పెట్టుబడులు కాని లభించలేదు. రాడ్నీ హిల్టన్ ఇలా నివేదించారు. భూస్వామ్య పాలకవర్గ సామాజిక కూర్పు, దాని అలవాట్లు ఉత్పత్తిని పెంచేందుకు అవసరమైన పెట్టుబడి సమకూరకుండా అడ్డుకున్నాయి."

## వర్గపోరాటాలు - సామాజిక ఉద్యమాలు

ఈ సంక్షోభం యొక్క తీవ్రత సమాజమంతటిలో ప్రకంపనలు రేపింది. చివరికి పాలక వర్గం కూడా అనేక కష్టాలను ఎదుర్కొంది. పాలకవర్గ ఆదాయాలు సందిగ్ధంలో పడ్డాయి. ఆదాయాలు పడిపోవడానికి ప్రధాన కారణం రైతాంగం ఆకలి దప్పులతో ఉండడమే. అప్పటికే దోపిడీ స్థాయి ఎక్కువై రైతాంగం పూర్తిగా బలహీనపడి పోయింది. అలాగే పాలకవర్గాలకు శ్రామిక శక్తి అందుబాటులో లేకుండా పోయింది. కరువు, అంటువ్యాధులు ప్రబలడంతో జనాభా సగానికి సగం తగ్గిపోయింది. మనుగడ సాగిస్తున్న వారు ఎక్కువగా వృద్ధులు, శక్తిహీనులే కావడంతో పాలకులు వారి నుంచి శ్రమను దోచుకోలేకపోయారు. జాగీర్లలో పంటను సాగు

చేయడానికి వ్యవసాయ కార్మికులు కొరవడ్డారు. ఈ దశలోనే భూస్వాములు అంతర్గత యుద్ధాలను తీవ్రతరం చేశారు. వీటిలో ప్రధానమైన ఇంగ్లాండు, ఫ్రాన్స్ రాజుల మధ్య జరిగిన 'వందేళ్ల యుద్ధం' పాలకవర్గాలు తమ కింది స్థాయిలో ఉన్న ప్రజల నుండి నిల్వలను మరింత ఎక్కువగా సేకరించాలని కూడా ప్రయత్నించాయి. ముఖ్యంగా రైతులు, వ్యాపారుల నుండి వనరులను సేకరించి తమ అవసరాలు తీర్చుకోవాలని భావించాయి.

భూస్వాములు, రైతుల మధ్య సాయుధ సంఘర్షణలు అనూహ్యమేమీ కావు. ఉదాహరణకు పదవ శతాబ్దంలో ఉత్తర ఫ్రాన్స్‌కు చెందిన రైతులు పాలకవర్గాల కౌలుదారీ వ్యవస్థను వ్యతిరేకిస్తూ పెద్ద ఎత్తున ఉద్యమించారు. ఉద్యమం తీవ్రతరమై సాయుధ తిరుగుబాటుకు దారి తీసింది. ఈ తిరుగుబాటును వివరిస్తూ తర్వాతి కాలంలో ఒక పద్యం వచ్చింది.

**"రైతులు, తిరుగుబాటు నాయకులు**
**ఎన్నో సమావేశాలను నిర్వహించారు.**
**వారు ఈ ఆదేశాన్ని జారీ చేశారు:**
**ఉన్నత స్థానంలో ఎవరున్న అతడు మన శత్రువే...**
**వారిలో చాలా మంది ఒక ప్రతిజ్ఞ చేశారు**
**భూస్వామిని కాని యజమానిని కాని**
**మేము ఎన్నడూ అంగీకరించం."**

భూసామ్య వ్యవస్థ ఒక్కసారి పూర్తిగా ఏర్పడిన తర్వాత భూస్వామిని ప్రత్యక్షంగా ఎదుర్కోవడం రైతులకు చాలా కష్టంగా మారింది. భూస్వాములు రైతులకంటే ఎన్నో రెట్లు సాయుధులై ఉండేవారు. వ్యవసాయ పని ముట్లు కోసం, పంట విఫలమైనపుడు ఆహారధాన్యాల కోసం రైతులు భూస్వాములపై ఆధారపడేవారు. మరో కారణమేమిటంటే భూస్వాముల ప్రాబల్యానికి చర్చి బోధనల మద్దతు ఉండేది. అయితే ఒక స్థాయికి మించి భూస్వాములు ఎక్కువ దోపిడీకి పాల్పడితే మాత్రం రైతులు తిరగబడేవారు. కిరాయి సైన్యాలను సాయుధంగా ప్రతిఘటించే సామర్థ్యం వారికి ఉండేది. భూస్వామి, అతడి కిరాయి మూకల కంటే ఎక్కువ సంఖ్యలో ఉండడం కారణంగా రైతులకు కొంత బలం చేకూరేది. తరతరాలుగా ఉన్న సముదాయ, కుటుంబ సంబంధాలు (చాలా కుటుంబాలు తమ స్వంత గ్రామంలోనే వివాహాలు చేసుకునేవి) రైతుల మధ్య ఐకమత్యాన్ని పెంచేవి. ఈ ఐకమత్యమే వారికి కొండంత బలంగా ఉండేది.

చాలా ప్రాంతాల్లో గతంలో ఎన్నడూ లేని విధంగా వైషమ్యాలు రాజుకున్నాయి. 1325లో స్వతంత్రులైన పశ్చిమ ఫ్లాండర్స్ రైతులు చర్చి లేదా భూస్వాములకు పంట దిగుబడిలో వాటా చెల్లించడానికి నిరాకరించారు. ఆయుధాలను చేతపట్టి ప్రతిఘటనకు సిద్ధపడ్డారు. 1328లో ఫ్రాన్స్ రాజు జోక్యం చేసుకునేవారు రైతుల ప్రతిఘటనను అణచివేయలేకపోయారు. 1358లో ఉత్తర ఫ్రాన్స్‌లోని సీన్ లోయలో గ్రామీణ తిరుగుబాటు సంభవించింది. మ... జాకురేగా పిలవబడ్డ ఈ తిరుగుబాటు సందర్భంగా భూస్వాములపై, వారి కోటలపై దాడులు

జరిగాయి. చాటుయాక్స్ తగలబడిపోయింది. 1381 జూన్‌లో ఇంగ్లాండ్ రైతులు తిరుగుబాటు చేశారు. వాట్ టైలర్ నేతృత్వంలోని రైతాంగ దళాలు లండన్‌ను స్వల్పకాలం పాటు నియంత్రించగలిగాయి. రాజును నమ్మిన టైలర్ అతడి అనుచరులు నగరం నుండి ఉపసంహరించుకున్నారు. అయితే రాజు నమ్మకద్రోహానికి పాల్పడి టైలర్, అతడి ముఖ్య అనుచరులను ఉరి తీయించాడు. ఈ తిరుగుబాటు సందర్భంగా రైతులంతా ఏకమై తమకు భూస్వాముల నుండి స్వాతంత్ర్యం కావాలని ముక్తకంఠంతో డిమాండ్ చేశారు. "వెట్టి చాకిరి, కౌలుదారీ వ్యవస్థల రద్దు రైతాంగ ఉద్యమ ప్రధాన డిమాండ్లలో మొదటి స్థానంలో ఉండేది." లోకప్రియుడైన మాజీ బిషప్ జాన్ బాల్ ఈ ఉద్యమానికి స్ఫూర్తినిచ్చాడు. పాలకవర్గాల ప్రత్యేక ప్రయోజనాలపై నిసిగ్గుగా దాడి చేయాలని అతడు రైతులకు పిలుపునిచ్చాడు:"ఆడమ్ కష్టపడినపుడు, ఈవ్ దుబారా చేసినపుడు ఇద్దరిలో ఎవరు సజ్జనులు?"

పట్టణ ప్రజానీకంలోని కొన్ని వర్గాలు 1320లో ఫ్లాండర్స్ రైతులకు, 1381లో ఇంగ్లాండ్ రైతులకు మద్దతునిచ్చాయి. లండన్ నగర మహాద్వారాలను రైతుల కోసం బార్లా తెరిచింది కూడా పట్టణ ప్రజలే. తిరుగుబాటు దళాలలో పేదలైన లండన్ వాసులు కూడా చేరారు. అయితే 14వ శతాబ్దంలో పాత వ్యవస్థకు వ్యతిరేకంగా పట్టణ తిరుగుబాట్లు కూడా పెద్ద సంఖ్యలో జరిగాయి.

స్థానిక భూస్వాముల నుండి స్వాతంత్ర్యాన్ని సాధించాలన్న పట్టుదలతో కొన్ని పట్టణాలకు చెందిన ప్రజలు పోరాటాలు నిర్వహించారు. రైతాంగ తిరుగుబాట్లుకు ఈ పోరాటాలు కొనసాగింపు మాత్రమే. ఇలాంటి సంఘర్షణలు ఫ్లాండర్స్‌లో వరుసగా జరిగాయి. 1350లో పారిస్‌కు చెందిన ధనిక వ్యాపారులు ఫ్రాన్స్ రాజు ఆంగ్లేయులకు బందీగా చిక్కినపుడు ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని నగరాన్ని తమ నియంత్రణలోకి తెచ్చుకున్నారు. ఒక సంపన్న వ్యాపారులు కుటుంబానికి చెందిన ఇటియేన్ మార్సెల్ సుమారు 3,000 మంది చేతివృత్తిదారులను వెంట వేసుకొని రాచరిక భవనంలో జొరబడ్డారు. రాజు వారసుడైన దౌఫిన్‌ను తిరుగుబాటులో చేరేలా బలవంతం చేశారు. ఉత్తర ఇటలీ నగరమైన ఫ్లారెన్స్‌లో తిరుగుబాటు మరో అడుగు ముందుకు వేసింది. 1378లో ఉన్ని వ్యాపారం నిర్వహించే సాధారణ కార్మికులు (సియోంపి) వ్యాపార మండళ్ల నాయకులపై తిరుగుబాటు చేసి నగరాన్ని రెండు నెలల పాటు సమర్థవంతంగా నియంత్రించారు. తమ బతుకులు ఛిద్రమవుతుంటే ప్రజలు కేవలం అలాంటి ప్రత్యక్ష సాయుధ వర్గ పోరాటాల ద్వారానే తిరుగుబాటు చేయలేదు. మధ్యయుగాల ఐరోపాలో జుబిలీ ఉద్యమాలకు ఘన చరిత్రే ఉంది. ధనికుల పట్ల ప్రజల్లో ఉన్న తీవ్రమైన ద్వేషంతో పాటు క్రీస్తు రెండవ సారి భూమిపై అవతరిస్తాడన్న మత విశ్వాసం ఈ జుబిలీ ఉద్యమాలకు ప్రాణం పోసింది. ఈ ఉద్యమాల్లో ప్రతికూల అంశమేమిటంటే ప్రజల్లో విదేశీయుల పట్ల ద్వేషభావం పెరగడం. పోప్‌లు తలపెట్టిన అధికారిక పవిత్ర యుద్ధాలు ప్రజల అనధికార పవిత్రయుద్ధాలకు ఆజ్యం పోశాయి. ప్రజల, పిల్లల, పశుకాపర్ల పవిత్ర యుద్ధాలు బయల్దేరాయి. తాము జీసస్ వారసులమని ప్రకటించుకున్న ఆధునిక తమ బోధకులకు ప్రజల నుండి పెద్ద ఎత్తున మద్దతు లభించింది. సాంప్రదాయ మతవిశ్వాసాలు, మత ప్రబోధనలకు భిన్నంగా వీరు మత ప్రచారం నిర్వహించేవారు. ప్రజలు వేలాది సంఖ్యలో ఒక పట్టణం నుండి మరో

పట్టణానికి కవాతు నిర్వహిస్తూ, దోపిడికి పాల్పడుతూ, స్థానికుల మద్దతును కూడగడుతూ ముందుకు సాగారు. కేవలం పాలక భూస్వామ్య వర్గం పైనే ప్రజలు తమ ద్వేషాన్ని వెల్లగక్కలేదు. అవినీతిపరులైన మత పెద్దలను, ముఖ్యంగా యూదులను కూడా లక్ష్యంగా పెట్టుకున్నారు. యూదులను అణచివేయడం సులువైన మార్గంగా ఉండేది. సమాజంలో యూదులొక్కరే క్రైస్తవేతర సముదాయానికి చెందిన వారు. మిగతా సమాజం పూర్తిగా క్రైస్తవులతో నిండి ఉండేది. చర్చి వైఖరి కారణంగా యూదులను వ్యవసాయ రంగానికి దూరంగా ఉంచారు. మధ్యయుగ సమాజంలో వ్యాపారులు, రుణదాతలుగా పరిమిత పాత్రను పోషించేలా క్రైస్తవ మతపెద్దలు యూదులను బలవంతపెట్టారు. ధనిక వర్గాల తరహాలో తమను తాము రక్షించుకొనే శక్తి యూదులకు కొరవడింది. తక్షణ మరణమో, క్రైస్తవ మత స్వీకారమో తప్ప యూదులకు మరో దారి ఉండేది కాదు. అయినప్పటికీ ప్రజలు క్రైస్తవ మతబోధకులను వీధుల్లోకి లాగి వారి చర్చిలను దోపిడి చేసేవారు. సంక్షోభం కారణంగా అలాంటి తర్కరహితమైన పాక్షిక మత ఉద్యమాలు వరుసగా పుట్టుకొచ్చాయి. 1309 సంవత్సరంలో ఫ్లాండర్స్, ఉత్తర ఫ్రాన్స్‌లలో సాయుధ ముఠాలు ప్రత్యక్షమయ్యాయి.

> వాటిలో చాలా వరకు పేద చేతివృత్తిదారులు, కార్మికులు సర్వం కోల్పోయిన భూస్వాములు ఉండేవారు. వీరు భిక్షం ఎత్తుకునే వారు. గ్రామీణ ప్రాంతాల్లో దోపిడీకి పాల్పడేవారు. యూదులను చంపడమే కాకుండా వారి కోటలు, నివాసాలపై దాడులు జరిపేవారు. చివరగా డ్యూక్ ఆఫ్ బ్రాబంట్ కోటను ముట్టడించారు. ఈ సంఘటనకు మూడేళ్ల పూర్వమే తిరుగుబాటు జరిపిన వస్త్ర తయారీదారుల దళాన్ని అతడు తుడిచిపెట్టాడు. తిరుగుబాటు నాయకులను అతడు సజీవ సమాధి చేసినట్లు చెబుతారు.

1520లో నిర్వాసితులు, పేదలతో కూడిన సాయుధ దళాలు మరో మారు దండయాత్రకు కదిలాయి. చర్చి నుండి బహిష్కరణకు గురైన ఒక మత బోధకుడు, ఒక తిరుగుబాటు సన్యాసి, కొందరు ప్రవక్తలు ఈ దళాలకు నాయకత్వం వహించారు. కొత్త యుగ ఆవిర్భావానికి రక్తాన్ని ఎక్కువగా చిందించాల్సి వస్తోందని ఈ ప్రవక్తలు ప్రకటించారు. తౌలూస్, బోర్డెయాక్స్‌పై దండయాత్రకు బయల్దేరే ముందు వారు పారిస్‌లో ఒక కారాగారాన్ని ముట్టడించారు. చాలే రాజభవనంపై దాడి జరిపారు. ఈ దళాలు ముందుకు సాగుతూ యూదులను ఊచకోత కోశాయి. అయితే వారు క్రైస్తవ మత పెద్దలను కూడా కపట కాపరులుగా, పశువులను తస్కరించే ద్రోహులుగా నిందించేవారు. మఠాలకు సంబంధించిన ఆస్తులన్నింటిని స్వాధీనం చేసుకోవలసిన అవసరం గురించి చర్చించడం మొదలుపెట్టారు. అవినాన్ కేంద్రంగా పని చేసే పోప్ ఈ తిరుగుబాటు దళాలను అణచివేయడానికి ఒక పెద్ద సైన్యాన్ని పంపాడు. ఒకేసారి 20 నుండి 30 మంది తిరుగుబాటుదారులను ఉరి తీస్తూ ప్రతిఘటనను అణచివేయడానికి ప్రయత్నించారు.

1340 చివరలో ప్లేగుమరణాల సందర్భంగా చోటు చేసుకున్నా భయాందోళనలు మత వైషమ్యాలను మరింత తీవ్రతరం చేశాయి. ఈ దశలోనే ఫ్లాగెల్లంట్ల ఉద్యమం ఆవిర్భవించింది. పోప్ ప్రకటనను స్ఫూర్తిగా తీసుకొని 500 మంది సాయుధులు గల బృందాలు

ఏర్పడ్డాయి. ఈ బృందాల సభ్యులు ఒకే రకమైన వస్త్రాధారణతో భక్తి గీతాలను పాడుతూ పట్టణాలలో పర్యటించేవారు. ఒక పట్టణానికి చేరుకున్న తర్వాత బృంద సభ్యులు మానవ చక్రాన్ని నిర్మించి తమ వీపులను ఇనుప చువ్వలతో బాదుకునేవారు. రక్తంతో తడిసి ముద్దయ్యే వరకు వారు ఈ విన్యాసాన్ని కొనసాగించేవారు. నొప్పిని భరిస్తూనే క్రీస్తు శిలువపైకి వెళ్లినట్లే తమ శరీరాన్ని శిక్షించడం ద్వారా పునీతులుకావాలని, స్వర్గానికి చేరుకోవాలని ఈ బృందాలు భావించేవి. వీరి మత ఛాందసానికి నేడు 'నైతిక విలువల పతనం' అని పేర్కొనే అపరాధభావన తోడైంది. ప్లేగు వ్యాధి ఉన్నట్లుండి సంభవించడం వెనుక ఏదో ఒక పెద్ద కుట్ర ఉందని ఈ బృందాలు నమ్మేవి. బావులలో విషం కలిపి ప్లేగును వ్యాపింపజేశారన్న నిందను మూటగట్టుకున్న యూదులను వారు నిర్దాక్షిణ్యంగా హత్య చేశారు. అయితే క్రైస్తవులతో సమానంగా యూదులు కూడా ప్లేగు బారిన పడ్డారు. ఇది నిర్వివాదాంశం. మరోవైపు ఫ్లాగెల్లంట్లు క్రైస్తవ బోధకులపై కూడా దాడులు జరిపారు. చర్చి ఆస్తులను స్వాధీనం చేసుకోవాలని యోచించారు. ఈ పరిణామంతో కంగారు పడిన పోప్ ఫ్లాగెల్లంట్ల చర్యలను ఖండిస్తూ ఒక ప్రకటన చేశారు. తన ఆదేశాలను ధిక్కరించేవారిని ఎద్దులతో తొక్కించి చంపాలని ఉత్తర్వులు జారీచేశాడు. వివిధ లౌకికవాద అధికారకేంద్రాలు కూడా చర్చిని గౌరవించని బృంద సభ్యులను ఉరితీయించేవి లేదా బహిరంగంగా శిరచ్ఛేదనం చేసేవి. పదిహేనవ శతాబ్దం ప్రారంభ దశలో బొహేమియా ప్రాంతంలో పూర్తిగా భిన్నమైన ఒక మత ఉద్యమం ఆవిర్భవించింది. ఫ్రాన్స్, ఫ్లాండర్స్, ఇటలీలలో అంతకుముందు సంభవించిన పట్టణ తిరుగుబాట్ల లక్షణాలు కొన్ని ఈ ఉద్యమానికి ఉండేవి. అయితే వందేళ్ల తర్వాత వచ్చిన గొప్ప ప్రొటెస్టంట్ సంస్కరణకు అది తొలి ప్రయత్నంగా నిలిచిపోయింది. బొహేమియా ప్రాంతం అప్పటికే శీఘ్రమైన ఆర్థిక ప్రగతిని చవి చూసి ఉంది. ఐరోపాలోనే సంపన్నమైె వెండి గని ఈ ప్రాంతంలో ఉండేది. పవిత్ర రోమను సామ్రాజ్యం (జర్మనీ)లో అది ప్రముఖ విద్యా కేంద్రంగా వెలసిల్లేది. కాని సంపద చాలా వరకు చర్చి ఆధీనంలో ఉండేది. ప్రాంతంలోని సగానికి సగం భూమిపై చర్చి యాజమాన్యం ఉండేది. ఈ కారణంగా పట్టణ, గ్రామీణ పేదవర్గాల్లోనే కాకుండా భూస్వాములలో కూడా తీవ్రమైన అసంతృప్తి నెలకొంది. ఈ ప్రాంత భూస్వాములు జర్మన్ కంటే చెక్ భాషలోనే సంభాషించేవారు.

ప్రజల్లో గూడుకట్టుకున్న అసంతృప్తిని జాన్ హూస్ అనే విశ్వవిద్యాలయ ఆచార్యుడు తన అభిప్రాయాల ద్వారా వ్యక్తం చేశాడు. అతడి ఆలోచనలకు ప్రజలు పూర్తి. మద్దతునిచ్చారు. చర్చిలో పేరుకుపోయిన అవినీతి, పోప్ ఏకఛాత్రాధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ జాన్ హూస్ ఉద్యమాలు నిర్వహించాడు. అతడికి బొహేమియా రాజు వెన్సెలాస్ కూడా కొంతవరకు మద్దతునిచ్చాడు. 1415లో పోప్ ప్రేరణ మేరకు చక్రవర్తి ఎట్టకేలకు హూస్‌ను సజీవదహనం చేసినపుడు బొహేమియాకు చెందిన చెక్ ప్రజానీకం మొత్తం తిరుగుబాటు చేసింది. చర్చి, దాని ఆస్తులను స్థానిక ప్రజలు ఎక్కడికక్కడ స్వాధీనం చేసుకున్నారు. బొహేమియా రాజు ఉద్యమ వ్యతిరేకిగా మారిపోయాడు. తమను దోచుకోవడానికి ప్రయత్నం చేస్తే దోపిడీదారులు ఎవరైనా సరే శిక్షించడం తథ్యమని వెలుగెత్తి చాటుతున్న రైతాంగాన్ని చూసి భూస్వాములు, ధనిక వ్యాపారులు బెంబేలెత్తిపోయారు. రైతులుచర్చినే కాకుండా పాలకవర్గాన్ని కూడా లక్ష్యంగా పెట్టుకున్నారు.

ఉద్యమంలో మితవాద వర్గమైన తాబోరైట్ (చేతివృత్తిదారుల సమూహం) ప్రేగ్ నగరాన్ని నాలుగు నెలలపాటు నియంత్రించింది. చివరికి ఈ వర్గాన్ని ధనిక వ్యాపారులు నగరం నుండి గెంటివేశారు. పోప్, చక్రవర్తి మధ్య సయోధ్యకుదర్చాలని వ్యాపారులు యోచించారు. బోహేమియా తిరుగుబాటును అణచివేసే ప్రక్రియలో చక్రవర్తి, పోప్‌లు పదేళ్ల పాటు యుద్ధం చేశారు. చెక్ పాలకవర్గం, ప్రేగ్ వ్యాపారుల నిలకడలేని తత్వం తాబోరైట్లను నిరాశకు గురి చేసింది. విప్లవాత్మమైన ఆలోచనల వైపు వారు దృష్టి సారించారు. "అందరం అన్నదమ్ముల్లా జీవిద్దాం," 'ఒకరికి ఒకరు అణిగి ఉండాల్సిన అవసరంలేదు', "భగవంతుడు తప్పక పాలిస్తాడు – రాజ్యాన్ని భూవాసులకు అప్పగించక తప్పదు," "భూస్వాములు, యుద్ధప్రభువులు, పాలకులందరూ పతనం కాక తప్పదు – వారిని బందిపోట్లుగా నిర్ధారించి అడవులకు తరిమివేయక తప్పదు" లాంటి నినాదాలతో ఉద్యమించారు. 1434 మేలో 25,000 మంది సైనికులతో కూడిన భూస్వాముల సైన్యం తాబోరైట్ దళాన్ని ఓడించేవరకు ఈ ఉద్యమం కొనసాగింది. తాబోరైట్ దళంలోని ఒక సైనికాధికారి ద్రోహం చేయడం వల్లే ఉద్యమం నీరుగారిపోయింది. కనీసం 13,000 మంది తాబోరైట్లు ఈ యుద్ధంలో మరణించారు.

ఫ్లాండర్స్, ఉత్తర ఇటలీ, ఉత్తర ఫ్రాన్స్, బ్రిటన్, బోహేమియా... ఇలా భూస్వామ్య వ్యవస్థను చుట్టుముట్టిన సంక్షోభం వరుస తిరుగుబాట్లకు దారితీసింది. అయినప్పటికీ భూస్వాముల ప్రాబల్యం చెక్కు చెదరకుండా ఉండిపోయింది. వ్యవస్థకు వ్యతిరేకంగా సమాజంలో మిగతా ప్రజలను తన వెనుక సమీకరించగల వర్గం ఒక్కటి కూడా ఆవిర్భవించలేదు.

పట్టణ వ్యాపారులు శతాబ్దాల తరబడి భూస్వాముల ప్రాబల్యాన్ని ప్రతిఘటించ గలిగారు. అయితే పట్టణ పాలక మండళ్లు ధనిక వ్యాపారులతో నిండి ఉండేవి. ఈ సంపన్నులు ఎన్నడూ భూస్వాములను వ్యతిరేకించలేదు. కనీసం వారి ప్రాబల్యాన్ని నిరసిస్తూ గళం కూడా విప్పలేదు. భూస్వామ్య వ్యవస్థలో జీవిస్తూ భూస్వామ్య సిద్ధాంతాన్ని ధనికులు చాలా వరకు ఆమోదించేవారు. వారి లక్ష్యం భూస్వాములను వ్యతిరేకించడం కంటే వారి పక్షాన చేరి అధికారాన్ని హస్తగతం చేసుకోవడమే. వ్యాపారం ద్వారా తాము సంపాదించిన ధనాన్ని నిర్దిష్టమైన ఆస్తులుగా (భూమి, భవనాలు తదితర ఆస్తులు) మార్చుకోవాలనే తపన వారిలో ఎక్కువగా ఉండేది. పెద్ద జాగీర్లను సృష్టించి అందులో కౌలుదారులతో వ్యవసాయం చేయించాలని ఆకాంక్షించేవారు. పరిణామాల ప్రతి కీలక మలుపులో వారు నిలకడకోల్పోయి భూస్వాములతో సయోధ్య కుదుర్చుకోవడానికి ప్రయత్నించే వారు. అలా కాకపోతే భూస్వాముల పక్షాన చేరి ప్రజలను అణచివేసే వారు. ఉత్తర ఇటలీలో సంభవించిన తిరుగుబాటు, తదన్వంతర పరిస్థితులే ఇందుకు నిదర్శం. పద్నాల్గవ శతాబ్ది ఆరంభంలో ఉత్తర ఇటలీ ఐరోపాలోనే అత్యంత సంపన్నమైన ప్రాంతంగా వెలుగొందేది. భూస్వామ్య వ్యవస్థ సంక్షోభాన్ని ఎదుర్కొన్న ఈ ప్రాంతం చాలా తక్కువ స్థాయిలో విధ్వంసాన్ని చవిచూసింది. ఈ ప్రాంతంలోని ముఖ్యమైన నగరం ఫ్లోరెన్స్‌పై మెడిసిస్ అనే సంపన్న వ్యాపార కుటుంబానికి ప్రాబల్యం ఉండేది. ఫ్లోరెన్స్ ప్రముఖ వస్త్ర వ్యాపార కేంద్రంగా ఖ్యాతి గడించింది. అయితే ఆ కుటుంబ సభ్యులు 15వ శతాబ్దంలో తమ అధికారాన్ని భూస్వామ్య వ్యవస్థను నిర్వీర్యం చేయడానికి వినియోగించే బదులు పాలకవర్గ

రాజకీయాల్లో కీలక పాత్రను పోషించడానికే పరిమితం చేశారు. అలా చేయడం ద్వారా ఆ ప్రాంత విచ్ఛిన్నానికి పునాదులు వేశారు. విరోధి రాజ్యాలు ఆవిర్భవించి నిరంతర సంఘర్షణలకు తెర లేపాయి. ఉత్తర ఇటలీ ఆర్థికంగా పతనమైంది.

పట్టణాల్లో నివసించే చేతివృత్తిదారులు మితవాదులుగా వ్యవహరించే అవకాశాలే ఎక్కువగా ఉండేవి. కౌలుదారీ వ్యవస్థ ఏర్పడకముందు ఉన్న రెండు లేదా మూడు తరాల వారు ఇలాంటి తీవ్రవాద వైఖరిని ప్రదర్శించేవారు. గ్రామీణ రైతాంగం తరహాలో వారు కూడా పంట విఫలమైనపుడు ఆకలి పస్తులను అనుభవించేవారు. పట్టణ పాలకమండళ్లతో వారు ఘర్షణపడిన దాఖలాలు అనేకం ఉన్నాయి. కొన్ని సందర్భాల్లో రైతాంగ తిరుగుబాట్లకు సంపూర్ణంగా మద్దతు ఇచ్చేవారు. అయితే వారు ఆర్థికంగా ఒకే హోదాను కలిగి ఉండకపోవడంతో కొన్ని ఇబ్బందులు వచ్చేవి. కొందరు తమ కర్మాగారాలను ఏర్పాటుచేసుకొని కుటుంబ సభ్యుల శ్రమ, జీతగాళ్ల సహాయంతో ఉత్పత్తులను సృష్టిస్తూ అపారమైన సంపదను పోగు చేసుకున్నారు. ఇతరులు ఎక్కువగా పేద కుటుంబాలకు చెందిన వారే. గ్రామీణ ప్రజల నిరంతర వలసతో పట్టణాల్లో తమకు జీవనోపాధి అవకాశాలు తరగిపోతాయన్న ఆందోళనతో వారు నిరంతరం అభద్రతాభావాలతో ఉండేవారు. ఈ కారణంగానే పట్టణ తిరుగుబాట్లు రైతాంగ ఉద్యమాలతో సమన్వయం సాధించినపుడు కొందరు చేతివృత్తిదారులు సంపన్న వ్యాపారుల పక్షాన చేరారు. ఈ కారణంగానే పట్టణ ప్రజానీకంలోని కొన్ని వర్గాలు మత విద్వేషాలను రెచ్చగొట్టిన పవిత్ర ప్రజాయుద్ధాలకు, ఫ్లాగెల్లంట్లకు మద్దతు నిచ్చారు.

చివరగా మనం రైతుల గురించి తెలుసుకోవాలి. రైతాంగ తిరుగుబాట్లు సమాజ పునాదులను కదిలించివేసేవి. అయితే నిరక్షరాస్యులైన రైతులు గ్రామీణ ప్రాంతాల్లో చెల్లాచెదురై తమ స్వంత గ్రామాలు, స్వంత భూముల గురించే ఎక్కువగా ఆలోచించేవారు. ఫలితంగా సమాజాన్ని విప్లవాత్మకమైన రీతిలో పునర్వ్యవస్థీకరించగల ఒక కార్యాచరణ పథకాన్ని రూపొందించలేకపోయారు. అలాంటి కార్యాచరణ పథకంలో భూస్వాముల ప్రాబల్యాన్ని విప్లవాత్మక దాడులతో క్షీణింపచేయడం ఒక భాగమై ఉండాలి. దానితోపాటు గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయ దిగుబడిని గణనీయంగా పెంచే లక్ష్యంతో సాంకేతికాభివృద్ధిని ప్రోత్సహించే కార్యాక్రమాలను చేపట్టాలి. కాని ఈ రెండూ జరగలేదు. ఆర్థిక ప్రగతి ఒక బలమైన వర్గాన్ని (కార్మికులు, కర్షకుల) సృష్టించ లేకపోయింది. పట్టణాలు, నగరాలు లేదా గ్రామీణ ప్రాంతంలో ఒక నిర్దిష్టమైన వర్గమంటూ ఆవిర్భవించలేదు. పీడిత ప్రజలు సమీకృతమైనా సమాజాన్ని లేదా వ్యవస్థను ప్రక్షాళన చేసే ఆర్థిక స్థోమత వారికి లేకపోయింది. సమాజ పునర్నిర్మాణ కార్యక్రమం ఎంత లోపభూయిష్టమైనా దానిని అమలు చేసే సామర్థ్యం సాధారణ ప్రజలకు కొరవడింది.

అయితే అప్పటికే అలాంటి వర్గ ఆవిర్భావానికి బీజం పడింది. కొన్ని పట్టణాల్లో సాంకేతిక ఆవిష్కరణ, లాభదాయకమైన పెట్టుబడిపై ఆసక్తి చూపే వ్యాపారులు, చేతివృత్తిదారులు ఉండేవారు. గ్రామీణ ప్రాంతాల్లోని కొన్ని భాగాల్లో సంపన్నమైన రైతులు కూడా ఉండేవారు.

భూస్వాముల దోపిడీని తొలగించి తాము ఆర్థికంగా మరింత బలోపేతం కావాలన్న ఆకాంక్ష వారిలో తీవ్రంగా ఉండేది. అలాగే వ్యవసాయాన్ని మరింత ప్రయోగాత్మకంగా తీర్చిదిద్దాలని యోచించేవారు. అయితే సమాజాన్ని విచ్ఛిన్నం చేస్తున్న సంక్షోభాన్ని తొలగించే సామర్థ్యం ఉన్న వర్గం మాత్రం ఏర్పడలేదు.

## మార్కెట్ భూస్వామ్య వ్యవస్థ ఆవిర్భావం

అయితే ప్రాచీన రోమను, సంగ్ చైనా లేదా పశ్చిమాసియాకు చెందిన అరబ్ సామ్రాజ్యాలను కుదిపివేసిన సంక్షోభం కంటే ఐరోపా భూస్వామ్య వ్యవస్థ ఎదుర్కొన్న సంక్షోభం చాలా భిన్నంగా ఉండేది. ఇక్కడ సమాజ పునరుద్ధరణ చాలా త్వరగా జరిగింది.

ఆర్థిక వ్యవస్థ, జనాభా సంఖ్య పుంజుకున్నాయి. 15వ శతాబ్దం మధ్య దశకాల నాటికి ఈ పునరుద్ధరణ ప్రక్రియ పూర్తయింది. కరువు, ప్లేగు వ్యాధిని తట్టుకొని నిలబడ్డ వారు తమ జీవన ప్రమాణాలను పెంచుకోగలిగారు. జనాభా తక్కువగా ఉండి భూమిని పరిమితంగానే సాగు చేసినా వ్యవసాయ దిగుబడి మాత్రం బాగా వచ్చింది. ఆ భూమి సారవంతంగా ఉండడమే అందుకు కారణం. ప్రజల అవసరాలను అటు ఇటుగా తీర్చగల స్థాయిలో తిండి గింజలు లభించాయి. విశేషమేమిటంటే కొన్ని పట్టణాల ప్రాముఖ్యత పెరిగింది. గ్రామీణ ప్రజానీకంలోని ఒక వర్గం, ముఖ్యంగా భూస్వాములు, సమాజం కోసం వస్తువులను ఉత్పత్తి చేసే పట్టణాలపై తమ భౌతిక అవసరాల కోసం పూర్తిగా ఆధారపడేది. ఫలితంగా స్వయంసమృద్ధి గల జాగీర్ల వ్యవస్థను ఆ వర్గం పునరుద్ధరించలేక పోయింది. వస్తువుల (ఉత్పత్తుల) కోసం భూస్వాముల డిమాండ్ ఎక్కువైంది. దానితోపాటు నగదు కోసం వారు ఆరాటపడ్డారు. గ్రామీణ ఉత్పత్తులను విక్రయించడం ద్వారా భూస్వాములు నగదును రాబట్టారు. మార్కెట్లు గ్రామీణ ప్రాంతాల్లో చొచ్చుకెళ్లాయి. ఈ మార్కెట్లు ప్రతి గ్రామాన్ని, గ్రామీణ కుటుంబాన్ని పట్టణ వ్యాపారులతో అనుసంధానం చేశాయి.

మార్కెట్ వ్యవస్థ విస్తరించడంతో భూస్వామ్య సమాజంలో నెమ్మదిగా అయినా నిర్దిష్టమైన మార్పులే వచ్చాయి. విలాస వస్తువులను విక్రయించే వ్యాపారులు కుబేరులయ్యారు. వీరు భారతదేశం, చైనా, ఆగ్నేయ ఆసియాల నుండి ఖరీదైన ఉత్పత్తులను తీసుకొచ్చి ఐరోపాలో విక్రయించేవారు. రాజులు, చక్రవర్తులకు సైతం వడ్డీపై రుణాలందించే స్థాయిలో వారు సంపదను కూడబెట్టుకున్నారు. యుద్ధాలకు ఆర్థిక సహకారం అందించడం ద్వారా రాజకీయంగా, ఆర్థికంగా బలపడ్డారు. సంపదను ఓ మోస్తరుగా కూడబెట్టిన వారు సైతం తమ స్వంత పట్టణాల్లో రాజకీయ ప్రాబల్యం సంపాదించారు. రాజుల ప్రభావసీమను, ఆధిపత్యాన్ని విస్తరింపచేయడంలో కీలక పాత్ర పోషించారు.

వ్యాపారుల సంపాదన పాలకులను సైతం ఆకర్షించింది. పరస్పర యుద్ధాలు, భూమి కోసం రాచరిక కుటుంబాలతో వియ్యం పెట్టుకోవడంతోపాటు వ్యాపారంలో లాభాలు గడిస్తేనే తమకుభవిష్యత్ ఉండగలదన్న ఆలోచనకు వచ్చారు. ఆసియా సిరిసంపదలను చేరుకోవాలనే

లక్ష్యంతో పోర్చుగీసు పాలకులు సముద్రయానాన్ని సులభతరం చేయడానికి ఎన్నో చర్యలు తీసుకున్నారు. అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో ఓడల నిర్మాణాన్ని చేపట్టారు. ఆఫ్రికా తీరం వెంబడి ప్రయాణించి ఆసియా దేశాలను చేరుకోవాలని నావికులను ప్రోత్సహించారు. మరోవైపు స్పెయిన్‌కు చెందిన కాథలిక్ రాజులు కొలంబస్ యాత్రను ప్రాయోజితం చేశారు. అట్లాంటిక్ సముద్రం పశ్చిమ తీరం అవతల ఉన్న భూభాగాలకు చేరుకోవాలన్నదే కొలంబస్ లక్ష్యం.

పెద్ద సంఖ్యలో ఉన్న సాధారణ వ్యాపారులు దుకాణాల నిర్వహణ స్థాయి నుండి పైకి ఎదగలేకపోయారు. అదృష్టం కొద్దీ వారు తమ పలుకుబడిని, సంపదను పెంచుకోగలిగారు. భూస్వామ్య సమాజంలోని లోపాలను తమకు అనుకూలంగా మలచుకొని సంపదను కూడబెట్టారు. అలాంటి లోపాలను మరింత విస్తృతపరిచారు. కసాయి చాలా వినయంగా దర్శనమిచ్చినా స్థానిక రైతులకు పశువుల పెంపకం కోసం రుణాలు అందించే స్థాయిలో ఉండేవాడు. ఆ విధంగా వ్యవసాయ ఆర్థిక వ్యవస్థపై కొంత వరకు నియంత్రణను సాధించ గలిగాడు. 15వ శతాబ్దం నాటికి ప్రతి పట్టణంలోనూ కసాయివాళ్లు (మాంసం విక్రేతలు) వ్యాపారాలు నిర్వహించేవారు. వారంతా ధనిక వర్గంగా ఉండేవారు. వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో కొత్తగా పుట్టుకొచ్చిన ఈ వర్గం ఆ వ్యవస్థను నియంత్రించే స్థాయికి చేరుకుంది.

పట్టణ వ్యాపారులు గ్రామీణ ప్రాంత జీవనాన్ని కూడా మరో మార్గంలో ప్రభావితం చేశారు. మధ్యతరగతి లేదా సన్నకారు రైతులను తమ గ్రామాల్లో కుటీర పరిశ్రమలు స్థాపించేలా ప్రోత్సహించారు. ఈ పరిశ్రమలు పట్టణ వ్యాపార మండళ్ల నియంత్రణ సీమకు బయట ఉండేవి. 'వికేంద్రీకరణ' వ్యవస్థ విస్తరించింది. వికేంద్రీకరణ కంటే వ్యాపారులు రైతులకు ముడి సరుకులను సరఫరా చేస్తారు. రైతులు వాటితో ఉత్పత్తులను తయారు చేసి వ్యాపారులకు అందిస్తారు. అయితే వ్యాపారి నిర్ణయించిన ధరలను అంగీకరించడం తప్ప రైతులకు మరో దారి ఉండేది కాదు.

ఈ వ్యవస్థ జౌళి రంగంలో ప్రాముఖ్యతను సంపాదించుకుంది. ఆర్థిక వ్యవస్థలో వచ్చిన ఈ మార్పు ఎంత కీలకమైనదో దీనిని బట్టి అర్థమవుతుంది. 14వ శతాబ్దం మధ్య దశకాల్లో ఇంగ్లాండు ప్రధాన ఎగుమతి అయిన ఉన్ని దాదాపు 96 శాతం విదేశాల్లోనే నేయబడేది. అలా తయారైన ఉన్ని వస్త్రం ఇంగ్లాండ్‌కు దిగుమతి అయ్యేది. ఈ ఉన్ని నేత కేంద్రాలు ఎక్కువగా ఫ్లాండర్స్‌లోని పట్టణాల్లో ఉండేవి.

ఒక శతాబ్దం తర్వాత ఇంగ్లాండులోనే అల్లిన ఉన్నిని 50 శాతం వరకు ఎగుమతి చేసే వారు. ఫ్లెమిష్ చేనేతల పట్టును సడలించి వ్యాపారులు తమ లాభాలను పెద్ద ఎత్తున పెంచుకున్నారు. ఈ ప్రక్రియలో వ్యాపారులు మరో పని కూడా చేశారు. అంత వరకు భూస్వామి నియంత్రణలో ఉండిన గ్రామీణ కార్మికులను కొంత వరకు తమ వైపు తిప్పుకున్నారు. దీర్ఘకాలంలో ఈ పరిణామం ఒక అణచివేత వ్యవస్థను మరో అణచివేత స్థానంలో ప్రవేశపెట్టింది. రైతాంగ శ్రమ దోపిడీ ద్వారా ఉత్పత్తులను సేకరించే బదులు ధరల వ్యవస్థను ప్రవేశపెట్టారు.

ఇందులో రైతులు తమ ఉత్పత్తుల పూర్తి లేదా అంతకంటే తక్కువ విలువను వేతనంగా పొందేవారు. వారికి ముడిసరుకులను, పనిముట్లను వ్యాపారులే సరఫరా చేసేవారు.

అయితే మనకు తెలిసినట్లు ఇది క్యాపిటలిస్టు ఉత్పత్తి మాత్రం కాదు. పెట్టుబడిదారుని ప్రత్యక్ష నియంత్రణలోని భారీ కర్మాగారాల్లో ఉత్పత్తికేవలం కొన్ని పరిశ్రమలకే పరిమితమై ఉండేది. ముఖ్యంగా ఖనిజాల తవ్వకం ఈ తరహాలో జరిగేది. వికేంద్రీకరణ వ్యవస్థ తమకు తాము యజమానులుగా భావించే వ్యక్తులపై ఆధారపడి ఉండేది. అయితే పూర్తి స్థాయి క్యాపిటలిజానికి ఈ వ్యవస్థ ఓ మెట్టుగా తయారైంది. సరుకుల క్రయవిక్రయాల వ్యవహారాన్ని మరచిపోయి వ్యాపారులు వాటి ఉత్పత్తి గురించే ఎక్కువగా చింతించడం మొదలుపెట్టారు. తాము తయారు చేసే ఉత్పత్తులు వ్యాపారులకు లాభాలు తెచ్చిపెట్టనిదే రైతులకు జీవనోపాధి లభించడం కష్టమైంది.

అంతటితో ఈ వ్యవహారం ఆగలేదు. ఉత్పత్తిదారులు, వ్యాపారులిద్దరూ మార్కెట్ నియంత్రణలతో సమానంగా ప్రభావితమయ్యేవారు. మార్కెట్‌లను శాసించే సామర్థ్యాన్ని వారు కోల్పోయారు. గ్రామీణ ప్రాంతంలో చెల్లాచెదురుగా కేంద్రీకృతమై ఉన్న రైతాంగ కార్మికులకు పట్టణ వ్యాపార మండళ్లకు ఉన్న స్థాయిలో అధికారం లేకపోవడంతో ఉత్పాదకతను ధరలను నియంత్రించలేకపోయారు. ఇతర ఉత్పత్తిదారులు తక్కువ వ్యయం కాగల కొత్త ఉత్పత్తి పద్ధతులను అనుసరించడం మొదలుపెట్టడంతో ఆ పరిణామాలను జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండిపోయారు. ఉత్పత్తిలో భూస్వామ్య నిర్వహణ స్థానంలో పోటీతత్వం నెలకొంది. పోటీతత్వం వల్ల పెట్టుబడుల స్థాయి పెరిగితే పెట్టుబడుల వల్ల పోటీ మరింత తీవ్రమైంది. పాత వ్యవస్థలో అంతర్భాగంగానే ఈ మార్పులు చోటు చేసుకున్నాయి. అయితే పోటీ ఆమ్లంలా పని చేసింది. తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని దోచుకుంటూ దానిని మార్చివేయ సాగింది.

ఈ మార్పులు భూస్వాముల ప్రవర్తనను కూడా ప్రభావితం చేశాయి. నగదును రాబట్టుకోవడానికి భూస్వాములు ఆరాటపడేవారు. అందుకు రెండే మార్గాలుండేవి. మొదటిది తమ పాత భూస్వామ్య అధికారాలను వినియోగించి కౌలుదారీ వ్యవస్థను బలోపేతం చేయడం. అవసరమైతే రక్తపాతాన్ని సృష్టించడం. ఆ విధంగా తమ జాగీర్లలో రైతులు అదనంగా శ్రమశక్తిని సమకూర్చేలా బలవంతం చేయడం. తమ వైపునుండి సాయం ఆశించకుండానే కౌలుదారులు కుటుంబాలను పోషించుకోవలసి ఉంటుంది. అలాంటి పరిస్థితిలో భూస్వామికి అదనపు నిల్వలు సమకూరుతాయి. వాటిని అతడు వ్యాపారులకు మంచి ధరలకు అమ్ముకోవచ్చు.

రెండవ మార్గం మధ్యతరగతి రైతులకు భూములను వార్షిక కౌలుకు ఇవ్వడం. భూములను అలా దీర్ఘకాలంపాటు కౌలుకు ఇస్తే మధ్యతరగతి రైతులు భూమిలేని ఇతర నిరుపేద రైతులను, సన్నకారు రైతులను చేరదీస్తూ పంటలను సాగు చేయగలరని భూస్వాములు యోచించారు. నిర్దిష్టంగా చెప్పాలంటే ఉద్భవిస్తున్న మార్కెట్ వ్యవస్థ, దాని పరిణామాలను భూస్వాములు పూర్తిగా ఆమోదించాల్సి ఉంటుంది. అలాగే క్యాపిటలిస్టు పద్ధతిలో సాగయ్యే భూముల నుండి ఆదాయాన్ని అద్దెరూపంలో స్వీకరించాల్సి ఉంటుంది.

పట్టణాలతో సన్నిహిత సంబంధాలు కలిగిన ప్రాంతాలు క్యాపిటలిస్టు వ్యవసాయం వైపు అడుగులు వేశాయి. మిగతా చోట్ల కౌలుదారీ వ్యవస్థను బలోపేతం చేసేందుకు భూస్వాములు ప్రయత్నించారు. సుమారు 300 సంవత్సరాల కాలంలో ఇంగ్లాండు, నెదర్లాండ్స్, పశ్చిమ జర్మనీ, బొహేమియా, ఫ్రాన్స్‌లోని కొన్ని ప్రాంతాలు ఒక దిశగా ప్రయాణిస్తే ఈశాన్య ఐరోపా, దక్షిణ ఇటలీ మరో దిశలో పయనించాయి. ఈ రెండు పరిణామ క్రమాలు ఉన్నట్లుండి సంభవించలేదు, వాటి పర్యవసానాలు కూడా లేకపోలేదు. ఒక్కో భూస్వామి ఒక్కో వేగంతో పయనించాడు. ఈ ప్రక్రియ స్థూలంగా ఇతర మార్పులతో అనుసంధానమైంది. పట్టణ ధనికుల సహాయంతో తమ రాజ్యాలను విస్తరించాలని కొందరు పాలకులు ప్రయత్నించారు. అయితే వారు బడా భూస్వాముల నుండి ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. పాలకవంశాల మధ్య ఘర్షణలు చోటు చేసుకున్నాయి. పట్టణీకరణ ప్రభావంతో కొత్త ఆలోచనలు పుట్టుకొచ్చాయి. భూస్వామ్య వ్యవస్థతో ముడిపడి ఉన్న పాత విలువలతో అవి ఘర్షణపడ్డాయి. పాత విలువలు చర్చి బోధనల నుండి ఏర్పడినవే భూస్వాములపై రైతులు తిరుగుబాటు చేశారు. నగరాల్లో పేదలు, ధనికుల మధ్య వర్గపోరు ఉధృతమైంది.

వందేళ్లపాటు యుద్ధాలు, విప్లవాలు, సైద్ధాంతిక అనిశ్చితి చోటు చేసుకున్నాయి. అంతవరకు వివాదం ఎక్కడా పరిష్కారం కాలేదు. ఇదే కాలంలో మరోసారి ఆర్థిక సంక్షోభం తలెత్తి కరువు, ప్లేగు సంభవించాయి.

# పరిణామక్రమం

**15వ శతాబ్దం** : 1453లో కాంస్టంటినోపుల్‌ను స్వాధీనం చేసుకున్న ఒట్టోమన్లు.
ఉన్నత దశకు చేరుకున్న ఇటలీ పునర్వికాస ఉద్యమం (1450-1520)
లియోనార్డో డా విన్సీ, మైకెలాంజెలో, మాఖియవెల్లి కృతులు.
1490 దశకంలో బలపడ్డ ఫ్రాన్స్, స్పెయిన్, బ్రిటన్ సామ్రాజ్యాలు.
1493లో గ్రనడాను ఆక్రమించిన స్పానిష్ పాలకులు.
1492లో క్యారబియన్ దీవులపై పాదం మోపిన కొలంబస్

**16వ శతాబ్దం** : 1510లో గోవాను స్వాధీనం చేసుకున్న పోర్చుగీసు దళాలు.
1517లో కైరో, 1529లో అల్జియర్స్, 1529లో వియాన్నాను స్వాధీనం చేసుకున్న ఒట్టోమన్లు.
పశ్చిమ ఐరోపా అంతటా విస్తరించిన పునర్వికాస ఉద్యమ ప్రభావం.
హాలెండ్‌లో ఎరాస్మస్, జర్మనీలో డ్యూరర్, ఫ్రాన్స్‌లో రబెలియాస్.
దక్షిణ జర్మనీని కుదిపివేసిన లూథర్ సంస్కరణోద్యమం (1518-25)
1519-21 మధ్య అజ్టెక్‌లను జయించిన కార్టెస్.
జర్మన్ రైతాంగ యుద్ధం (1525)
1529లో ఉత్తర భారతాన్ని ఆక్రమించిన మొగల్ సైన్యాలు.
1532లో ఇంకా సామ్రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్న పిజ్జారో.
1534-39 మధ్య ఉన్నత స్థాయి సంస్కరణ, క్రైస్తవ మఠాల మూసివేత.
ఇంగ్లాండ్‌లో తొలి వ్యవసాయ నిర్బంధాలు.
1540లో 30 ఏళ్ల అంతరాయం తర్వాత విశ్వసిద్ధాంతాన్ని ప్రచురించిన కోపర్నికస్.
రష్యాలో అధికారాన్ని కేంద్రీకృతం చేసిన ఇవాన్ ది టెర్రిబుల్ (1544-84)
సైబేరియా దండయాత్ర ప్రారంభం.

1550, 60 దశకాల్లో మత యుద్ధాలను చవిచూసిన ఫ్రాన్స్.
1560లలో ప్రతీఘాత సంస్కరణోద్యమాన్ని ప్రారంభించిన ట్రెంట్ కౌన్సిల్.
1560–1630 మధ్య చేతబడిదారులపై చెలరేగిన దహనకాండ.
'ఫ్లాండర్స్‌లో ప్రజల జీవితం' అనే అంశంపై చిత్రాలు గీసిన పీటర్ బ్రూఘెల్ (1540–60)
1560, 70 దశకాల్లో స్పానిష్ పాలనకు వ్యతిరేకంగా దిగువ దేశాలలో తొలిసారిగా సంభవించిన తిరుగుబాట్లు.
1590 దశకంలో షేక్స్పియర్ తొలి నాటకాల రచన.

**17వ శతాబ్దం** : 1600లో విచారణ పీఠం వద్ద సజీవ దహనమైన గియోర్దానో బ్రూనో.
1609లో గ్రహాల భ్రమణాన్ని నిర్దిష్టంగా లెక్కవేసి కెప్లర్ (ప్రేగ్‌లో)
1609లో చంద్రుడిని అధ్యయనం చేయడానికి టెలిస్కోప్‌ను ఉపయోగించిన గలీలియో.
1618లో ప్రారంభమైన ముప్ఫై ఏళ్ల యుద్ధం (బొహేమియా)
1620, 30 దశకాల్లో ఉత్తర అమెరికాలో తొలి ఆంగ్లేయ వలసవాద కేంద్రాల ఏర్పాటు.
యురేషియా, ఆఫ్రికాలలో విస్తరించిన అమెరికా పంటలు (ఉల్లిగడ్డలు, మొక్కజొన్న, బంగాళా దుంపలు, పొగాకు)
1628లో రక్త ప్రసరణను వివరించిన హార్వే.
అరిస్టాటిల్ భౌతిక శాస్త్రాలను తోసిపుచ్చిన గలీలియో (1632)
విచారణ పీఠం వద్ద సజీవ దహనం (1637)
1637లో హేతువాద తత్త్వశాస్త్ర అధ్యయన కేంద్రాన్ని ప్రారంభించిన డెసాక్రటస్ (పద్ధతిపై చర్చ)
1630లో పూర్వపు పోర్చుగీసు సామ్రాజ్యాన్ని చాలా వరకు హస్తగతం చేసుకున్న హాలెండ్.
1630 నుండి 1660 వరకు అమేస్టర్‌డామ్‌లో చిత్రలేఖనాన్ని కొనసాగించిన రెంబ్రాంట్.
1641–42లో ప్రారంభమైన ఇంగ్లాండ్ అంతర్యుద్ధం.
భారత్‌లో షాజహాన్ పాలన. 1643లో ప్రారంభమైన తాజ్‌మహల్ నిర్మాణం.
చైనాలో పతనమైన మింగ్ వంశం. మంచు స్వాధీనం (1644)
ఐరోపాకు మరింత పెరిగిన భారత పత్తి ఉత్పత్తుల ఎగుమతి.
1648లో ముగిసిన ముప్ఫై ఏళ్ల యుద్ధం.
1649లో శిరచ్ఛేదానికి గురైన ఇంగ్లాండ్ రాజు.

ఈశాన్య ఐరోపాలో ద్వితీయ కౌలుదారీ వ్యవస్థ ప్రాబల్యం.
సాంప్రదాయవాద రాజకీయాలకు 'భౌతికవాద' సమర్థన ఇచ్చిన హాబ్స్ కృతి లెవియాథన్ (1651)
అమెరికాలలో మొదలైన తోట బానిసత్వం. బార్బడాస్‌లో 20,000 మంది నల్లజాతి బానిసలు (1653)
చైనా పట్టువస్త్రాలకు పెరిగిన మార్కెట్. ఐరోపా, లాటిన్ అమెరికాలలో పట్టు వస్త్రాలు, పింగాణీ పాత్రల భారీ విక్రయాలు.
1655లో హాలెండ్‌ను ఓడించి జమైకాను స్వాధీనం చేసుకున్న ఇంగ్లాండ్.
1658లో భారతదేశ సింహాసనాన్ని హస్తగతం చేసుకున్న ఔరంగజేబు.
మరాఠాలతో యుద్ధాలు (1662)
వాయు నియమాలను కనుగొన్న బాయిల్. పరమాణు సిద్ధాంతానికి సమర్థన (1662)
1687లో భౌతిక శాస్త్రంలో విప్లవాన్ని పూర్తిచేసిన న్యూటన్
'మహోజ్వల విప్లవం' (1688). ఇంగ్లాండ్‌పై పట్టు బిగించిన మార్కెట్-ఆధారిత ఉన్నత వర్గాలు.
1690లో అనుభవవాద తత్త్వశాస్త్ర అధ్యయన కేంద్రాన్ని ప్రారంభించిన లాకే.
1687లో శ్వేత, నల్లజాతీయులు చేతులు కలిపి వర్జీనియాలో తిరుగుబాటు చేశారు. దీనిని బేకన్ తిరుగుబాటు అంటారు. 1691లో జాత్యంతర వివాహాలను నిషేధించిన చట్టసభ

ఒకటవ అధ్యాయం

# 'నూతన' స్పెయిన్ ఆక్రమణ

"నీటిపై నిర్మాణమైన అనేక నగరాలు, గ్రామాలు, ఎండు నేలలపై వెలసిన ఇతర పట్టణాలు, వంతెనలను వీక్షించినపుడు మేము ఆశ్చర్యపోయాము. అమాడీల భూమిలో నాగరికత ప్రస్థానాన్ని ఈ కట్టడాలు ప్రతిబింబిస్తాయని చెప్పుకున్నాము. నీటిపై లేపబడిన ఈ మహా స్థూపాలు, పిరమిడ్‌లు, భవనాలు శిల్పకళ మణిమకుటాలు. మా సైనికులు కొందరు 'మనం చూస్తున్నది కల కాదు కదా!' అనే సందేహాన్ని కూడా వ్యక్తం చేశారు."

"ఈ దేవాలయం సెవిల్లీ కాథడ్రల్ కంటే ఎత్తుగా ఉంది. నగర నడిబొడ్డులోని ప్రధాన ప్లాజా అనేక భాగాలుగా విభజించబడి ఉంది. సాలమాంక ప్లాజా కంటే ఇది రెండింతలు ఎక్కువ విస్తీర్ణం కలిగి ఉంది. ప్రతి రోజూ ఇక్కడ కనీసం 60,000 మంది ప్రజలు గుమికూడి వ్యాపార లావాదేవీలు నిర్వహిస్తారు. సామ్రాజ్యంలోని ప్రతి ప్రాంతం నుండి తెప్పించబడిన అన్ని రకాల వస్తువులు ఇక్కడ లభిస్తాయి. ఆహార ఉత్పత్తులు, వస్త్రాలు, బంగారు, వెండి, రాగితో తయారైన ఆభరణాలు విలువైన వజ్రాలు, చర్మం, ఎముకలు, శంఖాలు, పత్తి, ఈకలు, సముద్రపు మొక్కలు... అన్నీ ఇక్కడ విక్రయిస్తారు."

"నగరం చాలా అందంగా ఉంది. అందులో మనోహరమైన భవనాలు ఉన్నాయి. స్పెయిన్‌లో కూడా ఇలాంటి కట్టడాలు అద్భుతంగానే కనిపిస్తాయి. ఇన్‌కాల ఇళ్లలో విశాలమైన (200 అడుగుల పొడవు, 60 అడుగుల వెడల్పు) మందిరాలు కనిపిస్తాయి. ఇలాంటి విశ్రాంతి లేదా వినోద మందిరం 4,000 మంది అతిథులకు చోటు కల్పిస్తుంది."

1520, 30 దశకాల్లో మెక్సికోకు చెందిన అజ్టెక్, పెరూకు చెందిన ఇన్‌కా నాగరికతలను సందర్శించిన తొలి ఐరోపా వాసులు అక్కడి భవనాల వైభోగాన్ని, సంపదను

చూసి ఆశ్చర్యంలో మునిగిపోయారు. అజ్టెక్ నగరమైన టెనోష్టిట్లాన్ ఐరోపా మహానగరాలతో సమానంగా ఉండేది. ఇన్కా రాజధాని కుజ్కో మధ్య స్థాయి నగరమే అయినా రహదారుల వ్యవస్థతో అనుసంధానమై ఉండేది. ఇలాంటి రహదారుల వ్యవస్థ ఐరోపాలో ఎక్కడా కనిపించదు. ఈ రహదారులు 3,000 మైళ్లలో విస్తరించి ఉన్న సామ్రాజ్యాన్ని సంధానించేవి. ఈ సామ్రాజ్యం ఐరోపా ఖండం లేదా మింగ్ చైనా సామ్రాజ్యాల కంటే చాలా విశాలంగా ఉండేది.

ప్రజలకు జీవనోపాధిని కల్పించే అత్యాధునిక మార్గాల ఆధారంగా ఈ నాగరికతలు నిర్మాణమై ఉండేవి. వాటిలో ఆధునిక నీటిపారుదల వ్యవస్థలు వినియోగంలో ఉండేవి. సామ్రాజ్యంలోని మారుమూల ప్రాంతాల నుండి సైతం ఉత్పత్తులను సేకరించి వాటిని రాజధాని నగరాలకు రవాణా చేసే వ్యవస్థను ఈ నాగరికతలు అభివృద్ధి పరిచాయి. సరుకులను వేలాది మైళ్ల దూరంలో ఉన్న రాజధానులకు రవాణా చేసేవారు. వ్యవసాయంలో సంస్కరణలతోపాటు శాస్త్ర, కళారంగాలలో కూడా ఎంతో ప్రగతిని సాధించారు. ముఖ్యంగా వాస్తుకళ, చిత్రలేఖనం, శిల్పకళ, గణితం, కాల సూచికల తయారీ (చంద్ర భ్రమణం ఆధారంగా నెలలను, సూర్య భ్రమణం ఆధారంగా సంవత్సరాన్ని నిర్ధారించేవారు)లో విశేషమైన ప్రగతిని సాధించారు.

ఈ సామ్రాజ్యాల వైభోగం అంత ఉన్నత స్థాయిలో ఉన్నప్పటికీ స్పానియార్డుల చిన్న చిన్న సైనిక బలగాలు కేవలం కొన్నినెలల కాలంలోనే రెండు సామ్రాజ్యాలనూ ఆక్రమించాయి. స్పెయిన్ దళాలకు హెర్నాన్ కార్టెస్, ఫ్రాన్సిస్కో పిజ్జారోలు నాయకత్వం వహించారు. పిజ్జారో నిరక్షరాస్యుడు. దళాల్లోని చాలా మంది సైనికులు అరాచకవాదులు. సైనిక ఆక్రమణను వారో సాహసంగా పరిగణించారు.

ఈ ఆక్రమణదారులు క్రిస్టోఫర్ కొలంబస్ అడుగుజాడలను అనుసరించారు. (స్పానిష్లో క్రిస్టోఫర్ కొలంబస్ను క్రిస్టోబల్ కొలాన్ అని పిలుస్తారు) జెనోవాకు చెందిన ఈ నావికాదళ అధికారి స్పెయిన్ ఉమ్మడి పాలకులైన ఫెర్డినాండ్ (అరేగాన్), ఇసాబెల్లా (కాస్టిల్)లను తన సముద్రయానానికి నిధులు సమకూర్చేలా ఒప్పించగలిగాడు. పేరుమోసిన చైనా నాగరికత (కాథే)ను, ఆగ్నేయ ప్రాంత దీవులను అట్లాంటిక్ సముద్ర పశ్చిమ తీరాన్ని దాటుకొని చేరుకోవాలన్నదే కొలంబస్ లక్ష్యం.

కొలంబస్కు సంబంధించి ఒక కాల్పనిక గాథ ప్రచారంలో ఉంది. భూమి చదునుగా ఉందని నమ్మేవారు కొలంబస్ తార్కిక, శాస్త్రీయ వాదనలను తిరస్కరించారని చెబుతారు. వాస్తవం మరో విధంగా ఉంది. 15వ శతాబ్దం నాటికే భూమి గుండ్రంగా ఉందన్న అభిప్రాయం సర్వత్రా వ్యాపించింది. మరోవైపు కొలంబస్ వాదనలే అశాస్త్రీయంగా ఉండేవి. కుహనా శాస్త్రాలను ప్రాచీన గ్రీకు, రోమను కృతులు, మత మౌఢ్యంతో జోడించాడు. ప్రపంచం అంతరించకముందే క్రైస్తవ మతాన్ని సంరక్షించేందుకు ఆ 'భగవంతుడు' తనను ప్రతినిధిగా ఎంచుకున్నాడని కొలంబస్ నమ్మేవాడు. పదవ శతాబ్ది అరబ్ భూగోళ శాస్త్రజ్ఞుడు అల్-ఫర్ఘానీ

గణనాలను తప్పుగా అర్థం చేసుకున్న కొలంబస్ భూమి వైశాల్యాన్ని సుమారు 25 శాతం తక్కువగా అంచనా వేశాడు. 1492 ఆగస్టు 3న అతడు మూడు చిన్న ఓడలతో బయల్దేరాడు. కొన్ని వారాల వ్యవధిలోనే తాను జపాన్ లేదా చైనా తీరాన్ని చేరుకోగలనని అతడు భావించాడు. మార్కోపోలో పర్యటన కాలంలో (200 సంవత్సరాల క్రితం) చైనాను పాలించిన మహా చక్రవర్తి వారసులతో చర్చలు జరపగలనని ఊహించాడు. అయితే అక్టోబరు రెండవ వారంలో అతడు ఒక చిన్న క్యారబియన్ దీవిని చేరుకున్నాడు. అక్కడి నుండి అతడు నేటి క్యూబా, హైతీ దీవులకు ప్రయాణం చేశాడు.

ఈ దీవులలో ఎలాంటి రాజ్యాలు కాని వ్యక్తిగత ఆస్తులు కాని లేకుండానే ప్రజలు జీవించేవారు. అంతుపట్టని ఈ కొత్త ప్రజల పట్ల వారు ఎంతో స్నేహభావంతో వ్యవహరించారు. స్పెయిన్ ప్రజలు ఈ దీవుల వాసులను 'తాయినో'లుగా పరిగణించేవారు. ఒక స్పెయిన్ వాసి వారి గురించి ఇలా రాశాడు : "వారు ఎంతో మర్యాదస్తులు, శాంతికాముకులు. అన్నింటి కంటే మించి వారు చాలా సాధారణమైన ప్రజలు." "నీటి కోసం నావను తీరానికి పంపితే ఈ ఇండియన్లు నీటి ఆధార ఆచూకీ తెలపడానికి ఎంతో ఆసక్తిని కనబరిచారు. నీటితో నింపిన కుండలను నావ వరకు మోసుకొచ్చారు."

అయితే కొలంబస్ ఉద్దేశ్యం స్థానికులతో స్నేహసంబంధాలను పెంచుకోవడం కాదు. స్థానికులు ధరించిన బంగారు ముక్కుపోగులే అతడిని అమితంగా ఆకర్షించాయి. అపార ధనరాశులను కూడగట్టుకొని స్వదేశానికి తిరిగి వెళ్లి తన ప్రయాణానికి నిధులను సమకూర్చడం సబబేనని స్పెయిన్ పాలకులకు తెలియజేయాలనుకున్నాడు. బంగారు నిక్షేపాల ఆచూకీ గురించి అతడు స్థానికులను తరచూ ప్రశ్నించసాగాడు. వారి భాషలోని ఒక్క పదం అర్థం కాకపోయినా, స్థానికులకు అతడి మాటలు అర్థం కాకపోయినా బంగారం గురించి తెలుసుకోవాలనే ప్రయత్నాన్ని మాత్రం వదల్లేదు.

తర్వాత కాలంలో కొలంబస్ తన అనుభవాలను వివరిస్తూ ఇలా రాశాడు : "బంగారం అద్భుతమైనది... అది ఉన్న వారు ఎవరైనా సరే ప్రపంచంలో తాము తలచుకున్నది చేయగలరు. స్వర్గానికి ఆత్మలను తీసుకెళ్లడంలో అతడు సఫలం కూడా కావచ్చు."

తన రాచరిక పోషకులకు కొలంబస్ ఒక లేఖ రాశాడు:" స్థానికులు ఎంతో ఆత్మీయులు, దయాగుణంగలవారు. కొత్త వారితో ఇట్టే కలిసి పోతారు. వీరిని చూస్తే ప్రపంచంలోనే ఇంత మంచి ప్రజలు లేదా భూమి లేదనిపిస్తుంది. వీరు తమకంటే ఎక్కువగా తమ పొరుగువారిని ప్రేమిస్తారు. వారి మాటతీరు చాలా మృదువుగా, తియ్యగా ఉంటుంది. ఇలాంటి తియ్యటి భాష ప్రపంచంలో ఎక్కడా కనిపించదు. అన్నింటి కంటే మించి ఇక్కడి ప్రజలు ఎప్పుడూ చిరునవ్వుతోనే సంభాషిస్తారు," అయితే కొలంబస్ ఉద్దేశం వేరుగా ఉండేది. అతడు స్థానికులను స్వాధీనం చేసుకొని వారిని బానిసలుగా మార్చివేయాలని యోచించాడు. కొలంబస్ తనయుడు తన తండ్రి గురించి ఇలాచెప్పాడు : "ద్వీపంలోని కొందరు స్థానికులను

బందీలుగా మార్చాలని అతడు ఆదేశించాడు. అతడి ఆదేశాలపై క్రైస్తవులు మహిళలు, పురుషులు, పిల్లలతో సహా 12 మందిని బంధించారు.” ద్వీపంలో ఒక కోటను నిర్మించి, అక్కడి నుండి 50 మంది అధికారులతో స్థానికులపై పెత్తనం చేయాలని, వారితో తనకు తోచిన విధంగా పనులు చేయించుకోవాలని కొలంబస్ పథకం వేశాడు.

అయితే అలాంటి ప్రవర్తనను సహించడానికి స్థానికులందరూ అంత మూర్ఖులేమి కాదు. శాంతి కాముకులైన తాయినోలతోపాటు కొందరు హింసావాదులైన 'కారిబ్'లు కూడా వున్నారని కొలంబస్ అనతి కాలంలోనే వాదించసాగాడు.కారిబ్‌లు నరమాంసభక్షకులని వారిని అణచివేయక తప్పదని ప్రచారం చేశాడు. అప్పటి వరకు కాని లేదా ఎన్నటికి కాని వారు ప్రజలు మానవ మాంసాన్ని ఆరగించేవారని చెప్పడానికి ఎలాంటి ఆధారాలు లేవు. కారిబ్‌లు నివసించే ఒక్క దీవిపైన కూడా పాదం మోపేందుకు కొలంబస్ స్వయంగా ఎప్పుడూ సాహసం చేయలేదు. తన నావికా సిబ్బంది నిర్బంధించిన మహిళలు, పిల్లలను తప్ప అతడు కారిబ్‌లను ఎన్నడూ చూడలేదు. అయితే నరమాంసభక్షకులన్న గాలిమాటలతో స్థానికులను భయోత్పానికి గురి చేయడానికి తుపాకుల వినియోగాన్ని స్పెయిన్‌వాసులు సమర్థించుకున్నారు. అలాగే స్థానికులను తమ ఇనుప ఖడ్గాలు, ఈటెలతో నరికి చంపారు. 20వ శతాబ్దంలో అడుగుపెట్టినా వలసవాదులు అనాగరిక ప్రజల నరమాంసభక్షణ సాకు చూపి ఆయా దేశాలను వలసవాద కేంద్రాలుగా (కాలనీలు) మార్చివేశారు.

కిరాతక పద్ధతులు ఎన్ని అనుసరించినా కొలంబస్ బంగారు నిక్షేపాలను చాలా తక్కువ పరిమాణంలోనే సమకూర్చుకోగలిగాడు. అలాగే 1493లో తలపెట్టిన తదుపరి సముద్రయానంలో కూడా అతడు పెద్ద విజయమేమి సాధించలేకపోయాడు. ఈ యాత్రకు పాలకులు మరింత ఎక్కువగా పెట్టుబడులు సమకూర్చారు. ఓడల సంఖ్య పెంచారు. అలాగే వలస కోసం 1,500 మంది సభ్యులను కేటాయించారు. వీరిలో అన్ని రకాల వృత్తిదారులు, కార్మికులు, వ్యవసాయం చేయడానికి రైతులు, సాయుధ వీరులు, ఉన్నతాధికారులు, బంగారు నిక్షేపాలను ఆశించిన ఇతర ప్రయోజకులు, సైనికులు, ముగ్గురు పురోహితులు ఉన్నారు. ఒకకోట, చుట్టూ అడవులతో కూడిన ఏడు వలస కేంద్రాలను హిస్పానియోలా (హైతి) దీవిపై స్థాపించిన తర్వాత కొలంబస్ ఒక శాసనాన్ని జారీ చేశాడు. దాని ప్రకారం 14 ఏళ్ల పైబడిన ప్రతి ఇండియన్ మూడు నెలలకోసారి కొంత మొత్తంలో బంగారాన్ని చెల్లించాలి. అలా చేయని వారి చేతులను నరికివేస్తారు.మరణించే వరకు రక్తస్రావం జరిగేలా చేస్తారు. ఇంత క్రూరంగా ప్రవర్తించినప్పటికీ స్పానియార్డులు బంగారు రాసులను పోగు చేయలేకపోయారు. అందుకు కారణం సుస్పష్టం. ఏవో పరిమిత పరిమాణంలో తప్ప ఆ దీవిపై ప్రజలెవ్వరూ బంగారు నిక్షేపాలను కనుగొనలేదు.

బంగారంతో కాకపోయినా బానిసత్వం ఆధారంగా తన సంపదను పెంచుకోవాలని కొలంబస్ ప్రయత్నించాడు. 1495 ఫిబ్రవరిలో అతడు 1,600 మంది తాయినోలను నిర్బంధించి

అందులో 550 మందిని ఓడలలో సెవిల్లీకి పంపాడు. అక్కడ వారిని బానిసలుగా అమ్మి సొమ్ము చేసుకోవాలన్నదే అతడి లక్ష్యం. (ఈ ప్రజలు అతడికి రెండున్నర ఏళ్ల ముందు ఎంతో సౌమ్యులుగా, శాంతికాముకులుగా, సహాయపరులుగా కనిపించారు)

ఇప్పుడు వారిని ఇనుప సంకెళ్లతో బంధించి బానిసలుగా మార్చివేయడానికి ప్రయత్నించాడు. అయితే అట్లాంటిక్ సముద్రాన్ని దాటే లోపు సుమారు 200 మంది బందీలు చనిపోయారు. సంఘటన తర్వాత కొలంబస్ వెట్టి చాకిరి వ్యవస్థను నెలకొల్పాడు. అందులో వలసవాద అధికారులకు ఇండియన్లతో బలవంతంగా శ్రమ చేయించుకునే వెసులుబాటును కల్పించాడు.

అప్పటి వరకు కూడా 'ఇండియన్లు'గానే స్థానికులను కొలంబస్ పిలిచేవాడు. అతడు తీసుకున్న కఠిన చర్యలు స్థానికులపై వినాశకరమైన ప్రభావాన్ని చూపాయి.(కొలంబస్ తొలిసారిగా అడుగుపెట్టినపుడు) హిస్పానియోలా జనాభా బహుశా పది లక్షల కంటే ఎక్కువగా ఉండి ఉండొచ్చు. ఇరవై ఏళ్ల తర్వాత ఆ దీవి జనాభా 28,000 కు కుదించుకుపోయింది. 1542 నాటికి అది 200కు పడిపోయింది. వలసదారునిగా వచ్చి పురోహితునిగా స్థిరపడిపోయిన లాస్ కాస్ వలసవాదుల కిరాతక పద్దతులే ఈ పరిణామానికి దారి తీశాయని నిందించాడు. "ప్రజలపై ఘోరమైన అత్యాచారాలు, మారణకాండ జరిగాయి." ఈ మధ్య కాలంలో ఒక వాదనను ముందుకు తీసుకొచ్చారు. ఐరోపా వాసులు తమతోపాటు మోసుకొచ్చిన వ్యాధులు ఒక కారణం కావచ్చని, ఆ వ్యాధులను తట్టుకొనే శక్తి లేక హిస్పానియాలా ప్రజలు అంతరించిపోయి ఉంటారని చెబుతున్నారు. తట్టు, పడిశం, టైఫాయిడ్, న్యుమోనియా, క్షయ, ఉబ్బసం, అన్నింటికంటే మించి మసూచి లాంటి వ్యాధులు స్థానికులపై తీవ్రమైన ప్రభావం చూపి ఉంటాయి. ఈ వ్యాధులను వారు ఎన్నడూ ఎరిగి ఉండరు. అయితే వ్యాధులొక్కటే తొలి నివాసితులను పూర్తిగా అంతరింపజేశాయని భావించడం చాలా కష్టం.అమెరికా ప్రధాన భూభాగాల్లోని చాలా ప్రాంతాల్లో కొందరు 'ఇండియన్లు' అయినా మనుగడ సాగించి ఉంటారు. స్పెయిన్ తొలి వలస కేంద్రాల్లో అంతభారీ స్థాయిలో చావులు సంభవించడానికి కొలంబస్, అతడి సిబ్బంది అనుసరించిన దుర్మార్గపు పద్ధతులు ఎంతో కొంత బాధ్యత వహించక తప్పవు.

అయితే కిరాతక పర్వం ఒక్కటే కొలంబస్, అతడి రాచరిక పోషకులు, వలసదారులకు వారు కోరుకున్న విధంగా సంపదను కట్టబెట్టలేదు. తొలి వలసవాద కేంద్రాలు ఎన్నో సమస్యలతో అతలాకుతలమయ్యేవి. తాము అనుకున్నదానికి విరుద్ధంగా జీవన స్థితిగతులు కఠినంగా ఉండడంతో సంస్కారవంతులైన అధికారులు చాలా ఇబ్బంది పడ్డారు. వారి కోసం పని చేసే ఇండియన్లు చనిపోయారు. విశాలమైన జాగీర్లను నిర్వహించేందుకు వారికి తగిన శ్రమశక్తి లేకుండా పోయింది. కిందిస్థాయి వలసవాదులు ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు పని చేయడానికి అంగీకరించలేదు. అసలు శ్రమపైనే వారికి విరక్తి కలిగింది. హిస్పానియోలాకు కొలంబస్ గవర్నర్‌గా వ్యవహరించిన కాలమంతా అతడి పాలనకు వ్యతిరేకంగా ప్రజల

తిరుగుబాటు గాధగా మిగిలిపోయింది. స్థానికులపై క్రూరంగా ప్రవర్తించినట్లే అతడు ప్రజలందరినీ అణచివేయడానికి ప్రయత్నించాడు. మూడవ ప్రయాణం తర్వాత కొలంబస్‌ను స్పెయిన్‌కు సంకెళ్లలో బంధించి పంపారు. సంకెళ్లతో అతడు అలా నడిచివెళ్తుంటే హిస్పానియోలా వలసదారులు కేరింతలు పెట్టారు. గవర్నరు పదవి నుండి తొలగించబడిన తర్వాత సాంటో డొమింగో పట్టణ ప్రధాన కూడలిలో ఏడుగురు స్పానియార్డులు ఉరిపై వేలాడుతుండడాన్ని చూసి కొలంబస్ భయంతో కంపించిపోయాడు. స్పెయిన్‌లో కొద్దికాలం కారాగార శిక్ష అనుభవించిన తర్వాత అతడు విడుదలయ్యాడు. అయితే అతడి నాల్గవ పర్యటన దయనీయమైన వ్యవహారంగా మిగిలిపోయింది. రాజశాసనం అతడిని హిస్పానియోలా వలస కేంద్రాల నుండి బహిష్కరించింది. పూర్తిగా దెబ్బతిన్న ఓడతో అతడు మిగిలిపోయాడు. నిరాశా నిస్పృహలతో స్పెయిన్‌కు తిరిగి వచ్చిన కొలంబస్‌ను అందరూ మరచిపోయారు. స్పానిష్ పాలకులు ఇటలీపై ఆధిపత్యం సాధించేందుకు ఫ్రాన్స్‌తో జరుగుతున్న యుద్ధాలపైనే ఎక్కువగా దృష్టి సారించారు. ఎంతో దూరాన ఉన్న చిన్న దీవుల గురించి ఆలోచించే సమయం వారికి లేకపోయింది. అయితే ఇతర సాహస యాత్రికులు అపారమైన సంపదను కనుగొన్న తర్వాతే స్పెయిన్ పాలకులు తమ వైఖరిని మార్చుకున్నారు.

## అజ్టెక్‌లపై దండయాత్ర

1511లో మెక్సికో పాలకుడైన అజ్టెక్ వంశీయుడు మాకైజుమా తన సామ్రాజ్య పరిధిలో ఉన్న తీర ప్రాంతంలో ఎవరో విదేశీయులు పెద్ద పర్వతాలవలెఉన్న ఓడలపై బయల్దేరి వస్తున్నారన్న వార్తలను అందుకున్నాడు. ఆ ఓడలన్నీ ప్రాథమిక పరిశీలన జరిపే లక్ష్యంతో వచ్చాయి. రెండేళ్ల తర్వాత 500 సైనికులు గల సాయుధబలగం ఒకటి స్పెయిన్‌కు చెందిన క్యూబా వలస ప్రాంతం నుండి తరలి వచ్చింది. దానికి హెర్నాన్ కార్టెస్ నాయకత్వం వహించాడు. కార్టెస్ మహాసామ్రాజ్యం గురించిన పుకార్లు ఏవో విని ఉన్నాడు. ఆ సామ్రాజ్యాన్ని జయించాలన్న పట్టుదలను పెంచుకున్నాడు. అతడి సిబ్బంది ఈ లక్ష్యాన్ని నమ్మకశక్యం కాని మూర్ఖపు చర్యగా పరిగణించారు. మెక్సికో తీర ప్రాంతంపై అడుగు పెట్టాక ఎవరూ క్యూబాకు తిరిగి వెళ్లకుండా ఓడలన్నింటిని కార్టెస్ కాల్చి వేయించాడు. అయితే రెండేళ్లలోనే అతడు తన సైనిక బలగం కంటే వందల రెట్లు పెద్దదైన సైన్యాన్ని జయించాడు.

అతడి విజయానికి ఎన్నో కారణాలున్నాయి. అవకాశమున్నా కూడా తీరప్రాంతంలో స్థావరాలు ఏర్పాటు చేసుకున్న కార్టెస్ బలగాలను అజ్టెక్ పాలకుడు మాక్తెజుమా నాశనం చేయలేదు. అందుకు భిన్నంగా వారికి సకల సౌకర్యాలు కల్పించి తీరప్రాంతం నుండి మెక్సికో లోయకు మకాం మార్చేందుకు సహాయపడ్డాడు. కార్టెస్ నయవంచనకు ఎలాంటి హద్దు ఉండేది కాదు. అజ్టెక్ రాజధాని టెనోష్టిట్లాన్‌కు చేరుకున్న తర్వాత అతడు స్నేహం చేస్తున్నట్లు నటించి మాకైజుమాను బందీగా తీసుకున్నాడు. స్పెయిన్ సైనికులు తమకు తెలియకుండానే మోసుకొచ్చిన స్మాల్‌పాక్స్ వ్యాధికారకాలు నగరమంతటా వ్యాపించి వేలాది మంది ప్రజలను

బలిగొన్నాయి. నగరాన్ని విదేశీయులు ముట్టడించే కీలకమైన దశలో ఈ పరిణామం సంభవించింది. చివరగా చెప్పాలంటే ఆయుధసంపత్తిలో స్పానియార్డులకు ఆధిపత్యం ఉండేది. ఇక్కడ తుపాకులు ఒక్కటే ప్రధానాంశం కాదు. అవి లోపభూయిష్టంగా ఉండేది. వాటిలో మందుగుండును నింపడానికి చాలా సమయం పట్టేది. స్పానియార్డుల రక్షణ కవచాలు, ఖడ్గాల పటిష్టతకు విశేష ప్రాధాన్యత ఉంది. ఈ ఆయుధాలకు అజ్టెక్‌ల రక్షణ కవచమైన దళసరి వస్త్రాన్ని చీల్చే సామర్థ్యం ఉండేది. రాజధాని నగరంపై పట్టు కోసం జరిగిన చిట్టచివరి యుద్ధంలో స్పెయిన్ సైనికుల అత్యాధునిక నౌకాయాన పరిజ్ఞానం వారికి నగరం చుట్టూ ఉన్న నీటికాలువలపై ఆధిపత్యాన్ని తెచ్చి పెట్టింది. ఆహార సరఫరాల కోసం అజ్టెక్‌లు ఆధారపడే చిన్న నావలను వారు తరిమివేశారు.

స్పానిష్ విజయంలోని కొన్ని అంశాలు యాదృచ్ఛికంగా చోటు చేసుకున్నవే. మాక్టెజుమా సోదరుడు కుయిత్లాహువాక్ తన అన్న స్థానంలో కనుక పాలిస్తూ ఉన్నట్లయితే రాజధానిలో నిర్దేశిత పర్యటనను కార్టెస్ ఎన్నడూ జరిపి ఉండేవాడు కాదు. చక్రవర్తిని అపహరించే అవకాశమే లభించేది కాదు. కార్టెస్ బలగాలు కూడా దుర్భేద్యమైనవేమి కాదు. ఒక దశలో కార్టెస్ రాజధాని నుండి పారిపోయాడు. అతడి సైన్యం చాలా దెబ్బతింది. స్థానికుల నుండి ప్రతిఘటన తీవ్రమై ఉండి ఉంటే కార్టెస్ సైన్యంలోని అంతర్గత విభేదాలు కీలకంగా పరిణమించేవి. ఎందుకంటే కార్టెస్‌ను ద్రోహిగా పరిగణించాలనే ఆదేశాలతో మెక్సికో గడ్డపై ఒక కొత్త స్పెయిన్ సాయుధ దళం అడుగుపెట్టింది.

అయితే కార్టెస్ విజయానికి యాదృచ్ఛికంగా తోడ్పడిన కారణాలు కొంత వరకు మౌలికమైనవి. అతడు ఎదురిస్తున్న సామ్రాజ్యం స్పానిష్ సామ్రాజ్యం తరహాలోనే దోపిడీదారి, పెత్తందారి స్వరూపం కలిగి ఉండేది. కాని దానికి అత్యాధునికమైన సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో ఉండేది కాదు.

తొలుత అజ్టెక్‌లు వేట – సేకరణదారుల సముదాయంగా ఉండేవారు. వ్యవసాయం గురించి వారికి కనీస పరిజ్ఞానం ఉండేది కాదు. వీరు 13వ శతాబ్దం మధ్య దశకాల్లో మెక్సికో లోయలో ప్రవేశించారు. అప్పటికే ఆ లోయ ప్రాంతమంతా నగర రాజ్యాలతో నిండిపోయి ఉంది. ఇవి తియోతిహుకన్, మాయ నాగరికతలకు వారసత్వంగా ఉండేవి. ఈ నగర రాజ్యాలు అజ్టెక్‌లపై దౌర్జన్యాలు చేసి వారిని లొంగదీసుకున్నాయి. వారికి బీడు భూములను మాత్రమే వదిలాయి. అయితే అజ్టెక్‌లు ఎంతో కాలం అణిగిమణిగి ఉండలేదు. సాంకేతికపరంగా వారు ఎంతో ప్రగతిని సాధించారు. ఫలితంగా వ్యవసాయ దిగుబడిని గణనీయంగా పెంచగలిగారు. కాలువలు, సరస్సుల ఒడ్డున కృత్రిమ వ్యవసాయ భూములను సృష్టించి పంటలను విస్తృతంగా సాగు చేశారు. ఈ ప్రక్రియలోనే అజ్టెక్‌లలో పాలకవర్గం ఒకటి ఆవిర్భవించింది. మిగతా సమాజ శ్రమశక్తిని అది దోచుకుంది. పాలకవర్గం కేవలం కిందిస్థాయి అజ్టెక్‌లను దోచుకోవడం వరకే పరిమితం కాలేదు. మెక్సికో లోయపై ప్రాబల్యం కోసం అది ఇతర నగర రాజ్యాలతో

పోరాటం మొదలుపెట్టింది. తర్వాత నేటి గౌటిమాలాకు దక్షిణాన వేలాది మైళ్ల విస్తీర్ణంలో ఉన్న ప్రాంతంలో సామ్రాజ్యాన్ని స్థాపించేందుకు కంకణం కట్టుకుంది. సైనిక పాలకవర్గ ఆవిర్భావంతోపాటు యుద్ధసిద్ధాంతం కూడా విస్తరించింది. ఈ సిద్ధాంతం హుయ్‌జిలోపోచ్లి అనే అజ్టెక్‌ల తెగ దైవాన్ని ఆరాధించడంపై కేంద్రీకృతమై ఉండేది. ఈ దైవం కూతపిట్ట. హింసాత్మకమైన రీతిలో మరణించే వారికి అది ముక్తిని, అమరత్వాన్ని ప్రసాదించేది. అయితే తన ప్రయాణాన్ని నిరంతరంగా కొనసాగించడం కోసం దానికి నిత్యం మానవ రక్తం తర్పణం ఇవ్వాల్సి వచ్చేది. ఈ మతం ప్రధాన వేడుకలో యుద్ధఖైదీలను నరబలిగా ఇచ్చేవారు. కొన్ని సందర్భాల్లో పాలిత ప్రజలను కూడా బలి ఇచ్చేవారు. అలాగే అజ్టెక్‌లకు భౌతికపరమైన కానుకలు సమర్పించేవారు. అజ్టెక్ యుద్ధతెగకు ఈ మతం సామ్రాజ్య స్థాపన కొరకు యుద్ధం చేసేలా ప్రేరణ ఇచ్చేది.

మత ప్రభావం కారణంగా అజ్టెక్‌లలోని నిమ్న వర్గాలు కూడా తమ జీవితాలు ఇక ఇలాగే కొనసాగగలవన్న భావనలో ఉండిపోయాయి. ఈ వర్గాలు తరచూ ఆకలిదప్పులను ఎదుర్కొనేవి. ప్రాచీన రోములోని శ్రామిక వర్గాల (కార్మికులు, రైతులు) జీవన స్థితిగతులతో అజ్టెక్‌ల జీవితాన్ని పోల్చవచ్చు. అయితే అజ్టెక్ సామ్రాజ్యం విస్తరించే కొద్దీ సమాజంలో వైషమ్యాలు కూడా పెరిగాయి. పాలకవర్గాలు ప్రజలపై త్యాగాల భారాన్నివిపరీతంగా పెంచడంవల్లే ఈ పరిస్థితి నెలకొంది. ఒక దశలో 80,000 మంది బాధితులను నిర్దాక్షిణ్యంగా బలి ఇచ్చారని తెలుస్తోంది. ఈ నరబలి కేవలం 96 గంటల్లో టెనోష్టిట్లాన్ ఆలయం వద్ద జరిగింది. పరాధీనులైన ప్రజలు కూడా తమపై అణచివేత పెరుగుతోందన్న భావనను పెంచుకున్నారు. అయితే దురాక్రమణ అనంతర అరాచక పరిస్థితుల్లో వారు తిరుగుబాటు చేయడానికి సాహసించలేకపోయారు. స్వాధీనమైన ప్రాంతాల్లో భయానక వాతావరణం చోటు చేసుకొంది. అజ్టెక్ పాలకవర్గాన్ని కూడా ఒక మతపరమైన శాపం పట్టి పీడించేది. నాగదేవత క్వెట్జాల్‌కోల్ మళ్లీ తిరిగి వచ్చి తమను నాశనం చేస్తుందన్న భయం వారిలో ఉండేది.

ఈ వైషమ్యాలు తీవ్రమైన దశలోనే స్పానిష్ ఆక్రమణదారులు మెక్సికో లోయలో ప్రవేశించారు. 1505లో ఒక మహా ఉపద్రవం అజ్టెక్ నిమ్న వర్గాలను కుదిపివేసింది. కరవు విలయతాండవం చేయడంతో చాలా మంది పేదలు తమను తాము బానిసలుగా అమ్ముకున్నారు. ఆక్రమణల ద్వారా దక్కే సంపద కూడా తగ్గిపోయింది. పాలకవర్గంలో మాకైజుమా తన అధికారాలను గణనీయంగా పెంచుకున్నాడు. రక్తతర్పణం అనే ఆచారాన్ని ఆసరగా చేసుకొని అతడు శక్తిమంతుడయ్యాడు. అయితే ఈ దురాచారానికి వ్యతిరేకంగా పెరుగుతున్న నిరసన ఎంత తీవ్రంగా ఉండేదంటే స్వయంగా క్వెట్జార్‌కోల్ (నాగదేవత) కార్టెస్ రూపంలో తిరిగి వస్తోందని చక్రవర్తి భయపడసాగాడు. కార్టెస్‌ను సాదరంగా ఆహ్వానం పలకడం ద్వారా దేవతను ప్రసన్నం చేసుకోవాలని నిర్ణయించాడు. అయితే ముఖ్యమైన అంశం ఏమిటంటే అజ్టెక్‌లు లొంగదీసుకున్న ప్రజలు కొత్తగా వచ్చిన ఆక్రమణదారుల పక్షాన చేరిపోయారు. అజ్టెక్‌ల

కంటే స్పానిష్ సైన్యం పక్షానే ఎక్కువ మంది స్థానికులు పోరాడారు. రాజధాని నగరం కోసం జరిగిన చివరి యుద్ధంలో ఈ సమీకరణలు చోటు చేసుకున్నాయి.

అజ్టెక్, స్పానిష్ సామ్రాజ్యాలు రెండూ కప్పంపై ఆధారపడినవే. తిరుగుబాటు చేయడానికి ప్రయత్నించే ప్రజలను అవి తీవ్రంగా అణచివేసేవి. రెండు సామ్రాజ్యాలూ మానవతా దృష్టి లోపించిన మతాలకు కట్టుబడి ఉండేవి. దైవ దూషకులను విచారణపీఠం వద్ద స్పానిష్ సామ్రాజ్యం సజీవ దహనం చేస్తే అజ్టెక్‌లు తమ దేవతలను ప్రసన్నం చేసుకునేందుకు నరబలి ఇచ్చేవారు. ఆక్రమణ తర్వాత స్పానిష్ పాలకులు శాశ్వతమైన దహన వేదికలను నిర్మించారు. ప్రధానమైన వేదికను టెనోష్టిట్లాన్ మార్కెట్ కూడలిలో ఏర్పాటు చేశారు. గత రెండు వేల సంవత్సరాల కాలంలో యురేషియా, ఆఫ్రికాలలో అభివృద్ధి చెందిన ఇనుము ఆధారిత సాంకేతిక పరిజ్ఞానాన్ని స్పానిష్ పాలకులు కలిగి ఉంటే అజ్టెక్‌లు మాత్రం రాతి, కలప ఆధారిత పరిజ్ఞానంపై ఎక్కువ ఆధారపడేవారు. ఈ పరిజ్ఞానం ప్రపంచంలోని మిగతా అనాగరిక సమాజాల్లోకెల్లా అత్యాధునికమైనదే అయినా విదేశీయుల ఇనుము పరికరాల ధాటిని తట్టుకోవడానికి ఏ మాత్రం సరిపోలేదు. ఇతర లోహాల విషయానికి వస్తే, అజ్టెక్‌లకు కేవలం బంగారు, రాగి మాత్రమే అందుబాటులో ఉండేవి. ఇందులో కూడా రాగి అరుదుగా లభించేది. దానిని కేవలం అలంకరణ అవసరాల కోసమే వినియోగించేవారు. అబ్సిడియాన్ అనే రాతి నుండి వారు ఆయుధాలను మలిచేవారు. ఆయుధాలను పదునుగా తయారు చేయగలిగినా అవి చాలా త్వరగా విరిగిపోయేవి.

లోహాల లేమి కారణంగా అజ్టెక్‌ల సాంకేతిక పరిజ్ఞానం కూడా బలహీనంగా ఉండేది. ఉదాహరణకు అజ్టెక్‌లకు ఎలాంటి చక్రాల వాహనాలు ఉండేవి కావు. చక్రాలను తయారు చేయాలంటే రంపం అవసరం. రంపం తయారు చేయాలంటే రాగి కంటే దళసరైన లోహం అవసరం. ఈ కారణంగానే అజ్టెక్‌లు చక్రాల వాహనాలను రూపొందించలేకపోయారని గార్డన్ చైల్డ్ సూచించారు.

లోహశాస్త్రాన్ని అజ్టెక్‌లు ఎందుకు నేర్చుకోలేదు? జార్డ్ డైమండ్ ప్రకారం భౌగోళిక ప్రతికూలతలే అజ్టెక్‌లను ఈ రంగంలో వెనుకబడేలా చేశాయి. ఆఫ్రికా సమాజాలు ఎదుర్కొన్న సమస్యే అజ్టెక్ నాగరికత కూడా ఎదుర్కొంది. మెక్సికో ప్రజలు వేలాది మైళ్ల దూరంలో జరిగిన సాంకేతిక ఆవిష్కరణలను పుణికిపుచ్చుకోలేకపోయారు. మెక్సికోను ఆండిస్‌లోని ఇతర మహా లాటిన్ అమెరికా నాగరికతల నుండి మధ్య అమెరికా ఉష్ణతీరం భౌగోళికంగా వేరు చేస్తుంది. అప్పటికే ఆండిస్‌లోని లాటిన్ నాగరికత లోహశాస్త్రంలో ఉన్నత దశకు చేరుకొని ఉంది. అయితే దానికి ఇనుము పరిజ్ఞానం ఉండేది కాదు. మరోవైపు లోహశాస్త్రాన్ని నేర్చుకోవడానికి లేదా అధ్యయనం చేయడానికి మెక్సికన్లకు ఎలాంటి ప్రోత్సాహం లభించలేదు. పంట దిగుబడిని పెంచే మార్గాలను మాత్రమే వారు అభివృద్ధి పరచగలిగారు. లోహాల పరిజ్ఞానం లేకుండా మహానగరాలను నిర్మించగలిగారు. అజ్టెక్ ప్రజలు తరచూ కరువు బారినపడ్డారు. ఆ మాటకొస్తే ఐరోపా, ఆసియాలోని లోహ-ఆధారిత నాగరికతలు కూడా కరువులను

ఎదుర్కొన్నాయి. అయితే ఐరోపా ఆక్రమణదారుల ఇనుము కవచాలు, ఆయుధాలను ఎదుర్కొన్నప్పుడే తమకున్న లోహశాస్త్ర బలహీనతను అజ్టెక్‌లు గుర్తించగలిగారు. లోహశాస్త్రంలో ఆధిపత్యం ఉన్న కారణంగానే మిగతా రంగాల్లో అంతగా 'అభివృద్ధి' చెందని ప్రజలు తమను జయించగలిగారని తెలుసుకున్నారు.

## దాసోహమైన పెరూ

చరిత్ర చర్విత చరణంగా ఎప్పుడూ పునరావృతంకాదు. అయితే కార్టెస్ సంబంధీకుడైన ఫ్రాన్సిస్కో పిజ్జారో పనామా నుండి దక్షిణ దిశగా దక్షిణ అమెరికా పసిఫిక్ తీరాన్ని 1530 తొలినాళ్లలో చేరుకున్నప్పుడు చరిత్ర వెనువెంటనే పునరావృతమైంది. మెక్సికో పరాధీనమైన దశాబ్ద కాలంలోనే ఈ పరిణామం సంభవించింది.

అంతకుముందు పిజ్జారో రెండుసార్లు పరిశీలన నిమిత్తం యాత్రలు నిర్వహించాడు. ప్రధాన భూభాగంలోపల ఎక్కడో ఒక మహా సామ్రాజ్యం విస్తరించి ఉందని అతడికి బాగా తెలుసు. ఈసారి అతడు తీరప్రాంత పట్టణమైన తుంబేజ్‌లో అడుగుపెట్టాడు. అతడి వెంట 106 మంది పదాతి సైనికులు, 62 మంది అశ్వికులు ఉన్నారు. మహా సామ్రాజ్యమైన ఇన్‌కాలో అంతర్యుద్ధం చెలరేగుతోందన్న వార్తను అక్కడ అందుకున్నాడు. ఇన్‌కా సామ్రాజ్యంలోని ఉత్తర ప్రాంతంపై పట్టు కలిగిన అతహువాల్పా, దక్షిణ ప్రాంతాన్ని శాసించే హువాస్కర్ అనే సోదరుల మధ్య వారసత్వపోరు మొదలైంది. మహా ఇన్‌కా సామ్రాజ్యాధిపతి హువానా కుపాక్ వీరికి తండ్రి. అతహువాల్పా ప్రతినిధులతో వెంటనే సంబంధాలను ఏర్పాటు చేసుకున్న పిజ్జారో తన సంపూర్ణ మద్దతును అతడికి ప్రకటించాడు. ఆండిస్ ప్రాంతంలోని కజామార్కా పట్టణంలో తనను కలుసుకోవాలని అతహువాల్పా పిజ్జారోను ఆహ్వానించాడు. ఇన్‌కా సైనికుల తోడ్పాటు లేకుండా ఉన్నట్లయితే స్పానిష్ దళం భూమార్గాన పర్వత ప్రాంతానికి ప్రయాణం కట్టడం దాదాపు అసాధ్యమేనని చెప్పవచ్చు. ఇన్‌కా సైనికులు స్పానిష్ దళాన్ని విశ్రాంతి గృహాలతో కట్టుదిట్టంగా ఉన్న రహదారి వెంట తీసుకెళ్లారు.

కజామార్కాలో స్పానిష్ సైనికులు పట్టణంలోని మహాప్రాకారాల లోపాలే గుడారాలను ఏర్పాటు చేసుకున్నారు. తమ గుర్రాలు, ఆయుధాలను దాచిపెట్టారు. భారీగా ఉన్న ఇన్‌కా సైన్యాన్ని వెనుకన వదిలేసి కేవలం ఐదారు వేల మంది సైనికులతో పట్టణంలో స్వాగత లాంఛనాలతో అడుగుపెట్టిన అతహువాల్పా పోరుకు ఏ మాత్రం సిద్ధమయ్యే పరిస్థితిలో లేడు.

పిజ్జారో సోదరుడు హెర్నాండో ఆ ఘటనలను నెమరవేసుకుంటూ ఇలా రాశాడు :

> "అతడు (పిజ్జారో) తుప్పు పట్టిన బండిలో పట్టణంలో అడుగుపెట్టాడు. అతడి వెంట మూడు లేదా నాలుగు వందల మంది ఇండియన్లు వచ్చారు. తమకాళ్లతో మట్టిని గాల్లో లేపుతూ వారు పాడసాగారు. తర్వాత అతహువాల్పా ప్రవేశించాడు.

అతడి చుట్టూ నాయకులు, తెగపెద్దలు ఉన్నారు. వారిలో ముఖ్యమైన వారిని తక్కువ శ్రేణి సైనికులు తమ భుజాల మీద మోసుకొచ్చారు."

స్పానియార్డులతోపాటు వచ్చిన ఒక డొమినికన్ సన్యాసి అతహువాల్పాతో మాట్లాడ్డం ప్రారంభించాడు. క్రైస్తవ మతాన్ని స్వీకరించమని అతడిని నచ్చజెప్పాడు. స్పానిష్ రాజుకు కప్పం చెల్లించమని సూచించాడు. పోప్ లాటిన్ అమెరికాలోని ఈ ప్రాంతాన్ని స్పెయిన్‌కు కేటాయించినందున ఇక్కడి పాలకులు కప్పం చెల్లించక తప్పదని వాదించాడు. అతహువాల్పా ఈ విధంగా సమాధానం ఇచ్చాడని చెబుతారు :

"నేను ఎవరి సామంతరాజునూ కాను. మీరు చెబుతున్న పోప్ విషయానికి వస్తే అతడి చెందని దేశాలను కూడా ఇతరులకు కట్టబెట్టడం పిచ్చికూతలా ఉంది. నా మత విశ్వాసానికి వస్తే, నేను దాన్ని ఎన్నడూ మార్చను. మీ స్వంత దేవుడిని అతడు సృష్టించిన మానవులే మరణశిలపై ఎక్కించారని నీవే చెప్పావు. అయితే నా దేవుడు ఇప్పటికీ స్వర్గంలోనే నివసిస్తూ భూలోకంలో ఉన్న తన సంతానాన్ని చల్లగా చూసుకుంటున్నాడు."

తనకు ప్రసాదంగా ఇవ్వబడిన బైబిల్‌ను అతడు నేలకేసి కొట్టాడు. అపుడు ఆ సన్యాసి పిజ్జారోతో ఇలా అన్నాడు : "మేమిక్కడ నిలబడి శ్వాసను కోల్పోతుండగా లేదా ఈ కుక్కతో మాట్లాడుతుండగానే రంగమంతా ఇండియన్లతో నిండిపోతున్నట్లు నీకు కనిపించడం లేదా? వారినందరినీ అగ్నికి ఆహుతి చేయి. అప్పుడు నిన్ను నేను క్షమిస్తాను." అపుడు పిజ్జారో తెల్లటి రుమాలును ఊపాడు. కాపు కాసి ఉన్న స్పెయిన్ సైనికులు కాల్పులు జరిపారు. కాల్పుల హోరు, పొగ అక్కడ గుమికూడి ఉన్న ఇన్‌కాలలో భయాందోళనలను కల్గించాయి. వారిపై అశ్వికదళం ఒక్కసారిగా విరుచుకుపడింది. పారిపోవడానికి ఇన్‌కాలకు ఎలాంటి మార్గం దొరకలేదు. స్పానిష్ అంచనాల ప్రకారం సుమారు రెండు వేల మంది ఇన్‌కాలు ఈ దాడిలో చనిపోయారు. అయితే 10,000 వరకు చనిపోయి ఉంటారని ఇన్‌కాలు అంచనా వేశారు.

ఇపుడు అతహువాల్పా స్పానిష్ సైనికుల బందీ అయ్యాడు. అతడి సామ్రాజ్యంలోని ముఖ్యమైన ప్రాంతాలన్నింటిని స్పానియార్డులు స్వాధీనం చేసుకోగా అతహువాల్పా వారికి కీలుబొమ్మగా మారిపోయాడు. స్పానిష్ సైనికులను ధనాశతో లోబరచుకోవచ్చని అతడు భావించాడు. బంగారు నిక్షేపాలపై స్పానియార్డులకు ఉన్న అత్యాశను బట్టి అతడు అలా ఊహించాడు. ఆ మేరకు బంగారు రాశులను భారీగా పోగు చేశాడు. అయితే అతడు పూర్తిగా పొరబడ్డాడు. ధనాన్ని స్వాధీనం చేసుకున్న పిజ్జారో విచారణ పీఠం వద్ద ఇన్‌కా నేతను

బహిరంగంగా ఉరి తీయించాడు. ఆ విచారణ ఒక ప్రహసనంలా సాగింది. వ్యభిచారం, బహుభార్యత్వం, విగ్రహారాధన, స్పానిష్‌లకు వ్యతిరేకంగా తిరుగుబాటును లేవదీశాడన్న ఆరోపణలపై అతడికి మరణశిక్ష విధించారు. నగర ప్రధాన కూడలి వరకు అతడిని ఊరేగింపుగా తీసుకొచ్చి దహనవేదిక వద్ద తగులబెట్టడానికి ఏర్పాట్లు చేశారు. సజీవ దహనానికి ఏర్పాట్లు జరుగుతుండగానే అతహువాల్పా తన మనసును మార్చుకున్నాడు. తాను క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తానన్నాడు. మతం పుచ్చుకున్న వారిని అగ్నికి ఆహుతి చేయరన్న విషయం అతడికి బాగా తెలుసు. అతడు సరైన సమయంలో సరైన నిర్ణయమే తీసుకున్నాడు. కాని బాప్టిజం పూర్తయిన తర్వాత పిజ్జారో అతడిని ఉరి తీయమని ఆదేశించాడు.

మారణహోమంతోపాటు అతహువాల్పా హత్య ఇన్‌కా సామ్రాజ్య పతనానికి బాటలు వేశాయి. బంగారు నిక్షేపాల ఆశతో వందలాది సైనికులు కొత్తగా వచ్చి చేరారు. స్పానిష్ బలగాల సంఖ్య పెరుగుతున్న కొద్దీ పిజ్జారో తన ప్రాబల్యాన్ని కూడా పెంచుకున్నాడు. అతహువాల్పా సోదరుల్లో ఒకడిని కీలుబొమ్మ చక్రవర్తిగా నియమించి ఇన్‌కా రాజధాని కుజ్‌కో వైపు సైన్యంతో బయల్దేరివెళ్లాడు. తనను వ్యతిరేకించిన మరో ఇన్‌కా నాయకుడు కాలికుషిమాను సజీవ దహనం చేయించాడు. రాజధాని నగరాన్ని స్వాధీనం చేసుకోగానే స్పానియార్డులు గృహాలను, ఆలయాలను దోచుకున్నారు. బంగారు ఆభరణాలనే ఎక్కువగా లూటీ చేశారు. అలాగే ఇన్‌కా రాకుమార్తెలను నిర్బంధించారు. ఒక 15 ఏళ్ల అమ్మాయి ద్వారా బిడ్డను కన్నందుకు 56 ఏళ్ల పిజ్జారో గర్వపడేవాడు. తర్వాత ఆ అమ్మాయికి తన అనుచరుడితో వివాహం జరిపించాడు. ఒక స్పానిష్ సైనిక దళంతోపాటు దక్షిణాన ఉన్న చిలీకి బయల్దేరిన క్రిస్టోబల్ డొ మోరీనా అనే క్రైస్తవ బోధకుడు సాధారణ ఇన్‌కాల పట్ల స్పానియార్డులు వ్యవహరించిన తీరును వివరించాడు :

> "స్పానియార్డుల వెంట స్వచ్ఛందంగా వెళ్లని ఏ స్థానికుడినైనా తాళ్లు, సంకెళ్లతో బంధించి బలవంతంగా తీసుకెళ్లేవారు. ప్రతిరాత్రి అలాంటి వ్యక్తులను కఠినమైన కారాగారాల్లో నిర్బంధించేవారు. తెల్లవారగానే వారికి బరువైన సంకెళ్లు వేసేవారు. బందీలు దాదాపు ఆకలితోనే చనిపోయేవారు. ఇప్పటి మా ప్రయాణంలో ఒక స్పానియార్డు 12 మంది ఇండియన్లను సంకెళ్లలో బంధించాడు. ఆ 12 మంది సంకెళ్లు మోయలేక చనిపోయారని అతడు గొప్పలకు పోయాడు."[28]

స్పానిష్ ఆక్రమణదారులు తమను తాము కుబేరులుగా తీర్చిదిద్దుకోవాలని నిర్ణయించారు. ఆ దశలో బానిస వ్యవస్థను పునరుద్ధరించారు. బంగారాన్ని దోచుకున్నారు. రాజ్యాన్ని జిల్లాలుగా విభజించారు. వలసవాద అధికారులకు శ్రమదోపిడీ హక్కులను కల్పించారు. అందుకు 1512-13లో రూపొందించిన బుర్గోస్ చట్టాలను ఆసరగా చేసుకున్నారు. ఈ చట్టాల ప్రకారం ఇండియన్లు స్పానిష్ ప్రజల కోసం సంవత్సరంలో తొమ్మిది నెలలు ఉచితంగా

శ్రమను అందించాల్సి ఉంటుంది. ఇండియన్లకు ఈ శాసనాన్ని చదివి వినిపించేవారు. శాసనాన్ని ఉల్లంఘించే వారి భార్యా పిల్లలను బానిసలుగా మార్చివేస్తామని వలస వాద అధికారులు హెచ్చరించేవారు. అలాగే వారి ఆస్తులను కూడా జప్తు చేస్తామని బెదిరించేవారు. క్రైస్తవ మతాధికారులకు ప్రజలు కప్పం కూడా చెల్లించాల్సి వచ్చేది. కొన్ని సందర్భాల్లో ఈ మతబోధకులు ప్రైవేటు నిల్వలను, కారాగారాలను, ఓడలను కలిగి ఉండేవారు. మతద్రోహులు లేదా దూషకులను శిక్షించడానికి సంకెళ్లను కూడా సిద్ధంగా ఉంచేవారు.

తాము చెప్పిందే వేదమన్న స్పానిష్ పాలకుల ధోరణి అన్ని సందర్భాల్లోనూ, అన్ని రంగాల్లోనూ పారలేదు. వారి దోపిడీకి వ్యతిరేకంగా వరుసగా తిరుగుబాట్లు సంభవించాయి. పిజ్జారో సోదరుల్లో ఒకడు కుజ్కోలో నెలల తరబడి బందీగా ఉండిపోయాడు. 1572లో ఇన్కా చివరి చక్రవర్తి టుపాక్ అమూరాను హత్య చేసేవరకు ఇన్కాల ప్రతిఘటనను అణచివేయలేకపోయారు. మెక్సికోకు చెందిన అజ్టెక్లు ఎదుర్కొన్న సమస్యలే ఇన్కాలను కూడా పుట్టి ముంచాయి. ఇన్కాలకు రాగి అందుబాటులో ఉండేది కాని ఇనుము ఏ మాత్రం ఉండేది కాదు. అలాగే గాడిదలు తప్ప గుర్రాలుకాని, కంచర గాడిదలుకాని ఉండేవికావు. ఎంత పరిణతి చెందినప్పటికీ ఒక కాంస్య యుగనాగరికత ఇనుప యుగానికి చెందిన నాగరికత (ఎంత వెనుకబడినదైనా)ను ఎదుర్కోవడం చాలా కష్టం. హెమ్మింగ్స్ పేర్కొన్నట్లు గుర్రాలు దండయాత్రల్లో ట్యాంకుల్లాగా ఉపయోగపడ్డాయి. దక్షిణాన ఉన్న చిలీలో ఇండియన్లు గుర్రాలను వినియోగించడం మొదలు పెట్టినప్పుడే ఆక్రమణదారుల చొరబాటుకు తీవ్రమైన విఘాతం కలిగింది.

సామ్రాజ్య కుటుంబానికి చెందిన కొందరు సభ్యులు తమను తాము కాపాడుకోగలిగారు. క్రమంగా వారు స్పానిష్ ఉన్నత వర్గంలో విలీనమయ్యారు. హెమ్మింగ్స్ వివరించినట్లు : "ఈ సభ్యులు హోదాల కోసం పరితపించేవారు. ఆయుధాలు, స్పానిష్ వస్త్రాలు, స్పానిష్ అధికారుల వలే కష్టం లేని సంపాదన కోసం ఎగబడేవారు." అయితే ఇన్కా సామ్రాజ్యంలో నివసించే సాధారణ ప్రజల జీవితం మాత్రం గతం కంటే మరింత దుర్భరంగా మారింది. 1535లో స్పానిష్ రాజుకు ఒక ఉన్నతాధికారి లేఖ రాశాడు. "నేను ఈ దేశంలోని చాలా ప్రాంతాల్లో పర్యటించాను. ఎక్కడ చూసినా నాకు విధ్వంసం, వినాశనం తప్ప మరొకటి కనిపించలేదు. మరో అధికారి ఇన్కా, స్పానిష్ పాలనల మధ్య ఉన్న తేడాలను వివరిస్తూ ఇలా రాశాడు : "గతంలో సామ్రాజ్యమంతా ప్రశాంతంగా, పరిపుష్టిగా ఉండేది. అయితే నేడు రాజ్యంలోని అన్ని రహదారుల వెంట లెక్కలేనన్ని గ్రామాలు నిర్మానుష్యంగా ఉన్నాయి."

దురాక్రమణ తెచ్చిన ముప్పు పాలకుల ధనాశతో మరింత తీవ్రరూపం దాల్చింది. కొత్తగా వచ్చిన పాలకుల్లో ప్రతి ఒక్కరూ సాధ్యమైనంత సంపదను కూడబెట్టుకోవడానికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చారు. ఫలితంగా స్పానిష్ సైనికాధికారుల మధ్య అంతర్యుద్ధాలు చెలరేగాయి. స్పానిష్ రాచరిక ప్రతినిధులకు వ్యతిరేకంగా ధనికులైన వలసదారులు తిరుగుబాటు చేశారు.

వైరి సైన్యాలు దోపిడీకి, విధ్వంసానికి పాల్పడగా వ్యవసాయానికి కీలకమైన వ్యవసాయ కాలువలు, కొండ ప్రాంత నీటి ఆధారాలు ఎందుకూ పనికి రాకుండా పోయాయి. పశుకాపర్లు దారుణంగా హతమయ్యారు. పంట విఫలమైన పక్షంలో వినియోగించడానికి పోగు చేసిన ఆహార నిల్వలు అంతరించిపోయాయి. క్యారబియన్ దీవుల్లో వేలాది మందిని పొట్టన పెట్టుకున్న ఐరోపా వ్యాధులు ఇన్‌కా సామ్రాజ్యంలో కూడా పేదలను వణికించాయి. 14వ శతాబ్ది ఐరోపాలో సంభవించిన ఘోరకలి (ప్లేగు) కంటే ఈ వ్యాధులు తీవ్ర ప్రభావం చూపాయి. కేవలం ఒక్క లిమా లోయలోనే 1540 దశకంలో 25 వేల మంది జనాభాలో 2,000 మంది మాత్రమే మిగిలారు. సామ్రాజ్యానికి చెందిన స్థానిక ప్రజల జనాభా సగానికి లేదా మూడోవంతుకు పడిపోయింది.

వ్యవసాయ భూమి ఎంత తీవ్రంగా దెబ్బతిందంటే స్వయంగా స్పానిష్ రాజే ఆందోళన చెందసాగాడు. సంపదను సమకూర్చే సామ్రాజ్యాన్ని తప్ప ఎలాంటి శ్రామిక శక్తి లేని ప్రాంతాన్ని అతడు కోరుకోలేదు. 1500 దశకం మధ్యలో వలసదారుల దోపిడీ స్థాయికి పరిమితులు విధించే విషయమై స్పానిష్ పాలకవర్గం ఎడతెగని చర్చలు జరిపింది. ఇండియన్ల దోపిడీని నియంత్రించాలని ప్రయత్నించింది. ఈ దశలోనే వలసదారులను దూషించిన లాస్ కాసాస్ లాంటి మతబోధకులు ప్రాముఖ్యంలోకి వచ్చారు. అయితే వారి ప్రయత్నాలు పూర్వపు ఇన్‌కా సామ్రాజ్యంలో నిర్దిష్టమైన మార్పులేమీ తీసుకురాలేకపోయాయి. ఎందుకంటే అప్పటికే బలవంతపు శ్రమను ఒక సాధనంగా చేసుకొని స్పానిష్ రాజుకు లాభాలు చేకూర్చిపెట్టేవారు. ముఖ్యంగా వెండి, పాదరసం గనులలో కార్మికులను ఎక్కువగా వినియోగించేవారు. ఈ గనులు పొటోసి నగర పరిసరాల్లో ఉండేవి. సుమారు 1,50,000 జనాభా గల ఈ నగరం ప్రపంచంలోని అతిపెద్ద నగరాల్లో ఒకటిగా ఉండేది. 1570లో ఆర్చ్‌బిషప్ లోయ్‌జా నేతృత్వంలోని ఒక విచారణ సంఘం బలవంతపు శ్రమను ప్రతిఒక్కరూ ఆమోదించాల్సిందేనని తేల్చి చెప్పింది. ప్రజా ప్రయోజనాల కోసం గనులను నిర్వహిస్తున్నందున ఆ మాత్రం సర్దుబాటు చేసుకోక తప్పదని పేర్కొంది.

రెండవ అధ్యాయం

# పునరుజ్జీవం నుండి సంస్కరణ వైపు

అమెరికాను 'కనుగొన్నది' కొలంబస్ కాదు. "ఇండియన్లు" ఆ పనిని 14,000 సంవత్సరాల క్రితమే చేశారు. అప్పుడు వారు సైబేరియా నుండి బేరింగ్ జలసంధిని దాటుకొని అలస్కాకు చేరుకున్నారు. కొలంబస్ ఈ ప్రాంతంపై అడుగుపెట్టిన తొలి ఐరోపావాసి కూడా కాదు. అతడి కంటే 500 సంవత్సరాల క్రితమే వైకింగ్‌లు ఉత్తర అమెరికాలోని ఈశాన్య తీర ప్రాంతంపై కొంత కాలం పాటు నివాసం ఏర్పాటు చేసుకున్నారు. అయితే 1493 సంవత్సరం మాత్రం చరిత్రలో ఒక కీలకమైన మలుపుగా మిగిలిపోయింది. యూరేషియా అట్లాంటిక్ తీరంలోని పూర్వపు వెనుకబడిన సమాజాలు తొలిసారిగా ప్రపంచంలోని మిగతా ప్రాంతాలపై ఆధిపత్యం వహించే సామర్థ్యాన్ని ప్రదర్శించసాగాయి. మూడు లేదా నాలుగు వందల సంవత్సరాల కిందట పశ్చిమాసియాలో కిరాతకంగా వ్యవహరించిన పవిత్ర యుద్ధవీరులకు ఏ మాత్రం తీసిపోని విధంగా స్పానిష్ సైనికులు అమెరికాలలో ప్రవర్తించారు. అయితే అమెరికాలలో ఫలితం మాత్రం వేరుగా వచ్చింది. పవిత్రయుద్ధవీరులు వచ్చారు, చూశారు, ఆక్రమించారు, విధ్వంసం సృష్టించారు. చివరికి పశ్చిమాసియా నుండి గెంటి వేయబడ్డారు. పలాయనం చిత్తగించినపుడు ఖాళీ అయిన కోటలు తప్ప మరేమీ మిగిల్చి వెళ్లలేదు. స్పానిష్ సైనికులు వచ్చారు, చూశారు, ఆక్రమించారు, విధ్వంసం సృష్టించారు. చివరగా అక్కడే స్థిరపడిపోయి కొత్త, శాశ్వతమైన సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేశారు.

అట్లాంటిక్ తీరానికి అవతల ఈ పరిణామాలు సంభవిస్తుండగానే ఐరోపాలో కూడా అంతే ప్రాధాన్యత కలిగిన, ప్రపంచాన్నే కుదిపివేయగల మార్పులు చోటు చేసుకున్నాయి. రాజకీయాలు, మేధోపరమైన జీవితం, భావజాలం తదితర రంగాల్లో మార్పులు వచ్చాయి. ఈ మార్పులకు అంతర్లీనంగా ప్రజల జీవనోపాధి మార్గాల్లో కూడా మార్పులు వచ్చాయి.

ప్రధాన సవంతి చరిత్రంతా చక్రవర్తుల కుయుక్తులు, అధికార రాజకీయాల చుట్టే ఎక్కువగా పరిభ్రమిస్తుంది. అందులో రాజులు, రాణులు, మంత్రుల జాబితా, సంస్థానాధీశుల ఎత్తుగడల గాథలు, రాచరిక హత్యలు, వారసత్వపోరు తప్ప మరెలాంటి విషయాలు కనిపించవు. 15వ శతాబ్దం చివరలో మొదలైన రాజకీయ మార్పులు పైన పేర్కొన్న పసలేని విషయాలకు చాలా భిన్నంగా కనిపిస్తాయి. ఈ మార్పులు కొత్త తరహా రాజ్య ఆవిర్భావానికి దారి తీశాయి. ప్రపంచాన్ని ఏదో ఒక రూపంలో ఆ రాజ్యం శాసించడం మొదలుపెట్టింది.

ప్రాచీన లేదా మధ్యయుగాల ప్రపంచాల గురించి చర్చించే సమయంలో చాలా మంది దేశం, మాతృభూమి లాంటి పదాలను తరచుగా వాడుతుంటారు. అయితే అప్పటి కాలంలో పాలించిన ఈ రాజ్యాలు ఆధునిక 'జాతీయ' రాజ్యానికి చాలా భిన్నంగా ఉండేవి.

స్థిరమైన సరిహద్దులు కలిగి భౌగోళికంగా నిరంతరంగా విస్తరించి ఉన్న ప్రాంతాన్ని ఒక దేశంగా నేడు మనం పరిగణిస్తున్నాము. అలాంటి దేశంలో ఏకీకృత పాలనావ్యవస్థ ఏకీకృత పన్ను విధానం ఉంటుంది. దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య సరుకుల రవాణాకు సుంకాలు అడ్డంకిగా ఉండవని మనం భావిస్తాము. తన పట్ల పౌరులు విధేయుత కలిగి ఉండాలని దేశం కోరుకుంటుందని, అందుకు ప్రతిఫలంగా ప్రజలకు కొన్ని హక్కులు (పరిమితంగానే అయినా) కల్పిస్తుందని ఊహిస్తాము. ఏ దేశ పౌరసత్వం లేని పరిస్థితిని కొనితెచ్చుకోకుండా ఉండటానికి ప్రజలు ఎంత దూరమైనా వెళ్లగలరు. అలాగే పాలకులు, పాలితులు సమానంగా మాట్లాడే జాతీయ భాష (కొన్ని సార్లు బహుభాషాలు) ఒకటుందని కూడా మనం భావిస్తాము.

ఈ లక్షణాలు కొన్నింటిని మధ్యయుగాల ఐరోపా రాచరికాలు కలిగి ఉండేవి. అవి భాషాపరమైన వైరుధ్యాలు, భౌగోళిక అడ్డంకులను దాటుకొని విస్తరించి ఉన్న రాజ్యాలు. జర్మనీ దేశానికి చెందిన పవిత్ర రోమను సామ్రాజ్య చక్రవర్తి బొహేమియాను రాజ్యంగా పరిపాలించే వాడు. జర్మన్ భాష మాట్లాడే భూభాగాల్లోని చాలా ప్రాంతాలపై, అలాగే ఇటలీలోని కొన్ని ప్రాంతాలపై తనకు సార్వభౌమత్వం ఉందని వాదించేవాడు. ఫ్రెంచి మాట్లాడే ప్రాంతాల్లోని చాలా భూభాగంపై తమకు హక్కు ఉందని పునరుద్ఘాటించడానికి ఇంగ్లాండ్ రాజులు వరుసగా యుద్ధాలు చేశారు. ఆల్ప్స్ పర్వతాలకు అవతల ఉన్న ప్రాంతంపై పట్టు సాధించడానికి ఫ్రెంచి పాలకులు కూడా అనేక యుద్ధాలు చేశారు. ఆ ప్రాంతం నేటి ఇటలీలో భాగంగా ఉంది. అయితే ఫ్రెంచి రాజులకు ఈశాన్య ఫ్రాన్స్‌పై కనీస నియంత్రణ కూడా ఉండేది కాదు. ఈ ప్రాంతం ప్రత్యర్థి రాజ్యమైన బుర్గుండీలో అంతర్భాగంగా ఉండేది. అలాగే నైరుతి ఫ్రాన్స్, నార్మండీ (బ్రిటీష్ రాజులు దీన్ని పాలించేవారు) లేదా బ్రిట్టనీపై కూడా ఫ్రెంచి పాలకులకు ఎలాంటి ప్రాబల్యం ఉండేది కాదు. రాజ్య సరిహద్దుల్లో ఒక్కసారిగా భారీ మార్పులు రావడానికి అవకాశాలుండేవి. ముఖ్యంగా రాచరిక వివాహాలు, వారసత్వంవల్ల రాజులకు దూరపు ప్రాంతాలపై సార్వభౌమత్వం దక్కేది. లేదా యుద్ధాల్లో ఓటమి కారణంగా వారు స్వంత ప్రాంతాలను సైతం కోల్పోయేవారు. రాజ్యం లోపల ఏకీకృత పాలనా వ్యవస్థ చాలా అరుదుగా ఉండేది. సాధారణంగా అయితే రాజ్యంలో ప్రాంతీయ కేంద్రాలు, సామంత రాజ్యాలు, జాగీర్లు, స్వతంత్ర రాజ్యాలు (వీటిలో పాలకులు, న్యాయస్థానాలు, స్థానిక చట్టాలు, స్వంత పన్ను వ్యవస్థ, సుంకం వసూలు చేసే కేంద్రాలు, సాయుధ బలగాలు ఉండేవి) అంతర్భాగంగా ఉండేవి. స్థానిక పాలకులు చక్రవర్తికి పేరుకు మాత్రమే విధేయత కనబరిచేవారు. ప్రత్యర్థి రాజ్యాధిపతి మంచి బేరాన్ని ముందు పెడితే తమ విధేయతను తక్షణమే మార్చేవారు. తాము పాలించే ప్రజల భాషలను చాలా మంది రాజుల లేదా చక్రవర్తులు మాట్లాడలేకపోయేవారు. అధికారిక ఉత్తర్వులు, చట్టాలు పాలితుల భాషలో చాలా అరుదుగా ఉండేవి.

అయితే 15వ శతాబ్దం చివరి నాటికి ఐరోపాలోని కొన్ని ముఖ్యమైన ప్రాంతాల్లో ఈ పరిస్థితి మారసాగింది. ఈ దశలోనే లాటిన్ అమెరికాను స్వాధీనం చేసుకోవడానికి స్పెయిన్ దళాలు బయల్దేరి వెళ్లాయి. ఫ్రాన్స్‌లో చార్ల్స్ 7, లూయి 11, ఇంగ్లాండ్‌లో హెన్రీ 7, హెన్రీ 8, స్పెయిన్‌లో జంట పాలకులైన

ఇసాబెల్, ఫెర్డినాండ్.... ఇలా అందరూ బడాభూస్వాములకు తీరని నష్టం కల్గిస్తూ తమ స్వంత ప్రాబల్యాన్ని పెంచుకోవడంలో సఫలమయ్యారు. నేటి దేశ సరిహద్దులను పోలిన విధంగా రాజ్య వ్యాపిత వ్యవస్థను ప్రజలపై రుద్దగలిగారు.

ఈ మార్పులు ముఖ్యమైనవి. ఎందుకంటే అవి భూస్వామ్య వ్యవస్థ నుండి ఆధునిక వ్యవస్థ వైపుగా జరిగిన ప్రస్థానంలో తొలి అడుగులుగా సార్థకమయ్యాయి. ఈ పరివర్తన సంపూర్ణతకు చాలా దూరంగా ఉండేది. కొత్త రాజ్యాలలో అత్యంత బలమైన స్పెయిన్ అప్పటికి కూడా తన కాటాలోనియా, వెలెన్షియా, అరేగాన్, కాస్టిల్ ప్రాంతాలకు వేర్వేరు పాలనా వ్యవస్థలను కలిగి ఉండేది. ఇటలీ, దిగువ దేశాలలో స్వాధీనం చేసుకున్న ప్రాంతాలను కాపాడుకోవడానికి అదే సమయంలో స్పెయిన్ రాజులు సుమారు 150 సంవత్సరాలపాటు యుద్ధాలు కొనసాగించారు. తమ ప్రాబల్యాన్ని భూస్వాములు సంపూర్ణంగా ఆమోదించేలా చర్యలు తీసుకునే వరకు ఫ్రెంచి పాలకులు యుద్ధాలు, అంతర్యుద్ధాలను వరుసగా ఎదుర్కోవలసి వచ్చింది.(ఏకఛత్రాధిపత్య పాలన రూపుదాల్చినప్పటికీ) ఆంతరంగిక సుంకం వసూలు కేంద్రాలు అలాగే కొనసాగాయి. 1066లో నార్మన్ ఆక్రమణ తర్వాత ఐరోపాలో ఎక్కడా లేని విధంగా ఇంగ్లాండులో భూస్వామ్య రాజ్యం ఏర్పడింది. అక్కడ కూడా ఉత్తర ప్రాంతానికి చెందిన సామంతులు (ఎర్ల్స్) గణనీయమైన ప్రాబల్యం కలిగి ఉండేవారు. ఫ్రాన్స్‌లోని కొన్ని భూభాగాలపై ఇంగ్లాండ్ రాజులు తమ హక్కులను అప్పటికీ వదులుకోలేదు. ఏదేమైనప్పటికీ కొత్త రాజ్యాలు, ఏకీకృత పాలనా వ్యవస్థ (ఫ్రాన్స్, స్పెయిన్)లు పాత భూస్వామ్య వ్యవస్థకు భిన్నంగా కనిపించాయి. భూస్వామ్య పునాదులపై నిర్మాణమైన ఈ రాజ్యాలలో పాలకులు మార్కెట్ వ్యవస్థతో ముడిపడి ఉన్న కొత్త శక్తులతో సంబంధాలు పెంచుకొని వాటిని తమ అవసరాల కోసం వినియోగించడం నేర్చుకున్నారు. అలాగే విస్తరిస్తున్న పట్టణాలను భూస్వామ్య దొరల ప్రాబల్యాన్ని అడ్డుకట్ట వేయడానికి వాడుకున్నారు. అయితే పాలకుల విధానాలన్నీ ప్రాచీన భూస్వామ్య లక్ష్యాలైన భూసేకరణకు సంబంధించినవే. భూమిని కయ్యం లేదా వియ్యం ద్వారా సొంతం చేసుకోవడానికే పాలకులు ఎక్కువగా ప్రాధాన్యతనిచ్చేవారు. అయితే మరో లక్ష్యానికి ఎనలేని ప్రాధాన్యత ఏర్పడింది వాణిజ్య విస్తరణ, స్థానిక ఉత్పత్తి. అందుకే ఇసాబెల్, ఫెర్డినాండ్‌లు మూర్ రాజ్యమైన గ్రనడాను స్వాధీనం చేసుకున్నారు. కొన్ని ప్రాంతాలను హస్తగతం చేసుకోవడానికి ఇటలీతో యుద్ధాలు చేశారు. అదే సమయంలో వాణిజ్యాన్ని విస్తరించే ధ్యేయంతో కొలంబస్ యాత్రలకు నిధులను సమకూర్చారు. ఇతర పాలకులతో వంశపారంపర్యమైన సంబంధాలను పెంచుకోవడానికి హెన్రీ వివాహాలను ఒక సాధనంగా ఎంచుకున్నాడు. అలాగే బ్రిటీషు ఉన్ని పరిశ్రమలు, నావికాదళ అభివృద్ధిని కూడా ప్రోత్సహించాడు.

ఈ మార్పులను బట్టి ఈ కొత్త రాజ్యాలు పాత వాటికంటే తక్కువ స్థాయిలో అణచివేతకు పాల్పడ్డాయని చెప్పడానికి వీల్లేదు. ఈ రాజ్యాలు తమ ప్రాబల్యాన్ని సుస్థిరం చేసుకోవడానికి ఎలాంటి పద్ధతులనైనా అనుసరించేవి. రాజ్యాల మధ్య సైనిక సమతుల్యం పాటించడానికి ప్రజలను నియంత్రణలో పెట్టడానికి తీవ్రమైన, కఠినమైన పద్ధతులను ఆచరించేవి. నయవంచన, హత్య, అపహరణ, చిత్రహింస..... ఇవన్నీ పాలకుల అమ్ముల పొదిలో ఉండేవి. మాకియావెల్లీ రచనల్లో పాలకుల సిద్ధాంతం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది. ఫ్లోరెన్స్‌కు చెందిన ఈ ప్రభుత్వ ఉద్యోగి జీవిత ఆశయం ఇటలీ రాజ్యాల ఏకీకరణే. ఏకీకరణకు అనుసరించాల్సిన కొన్ని మార్గదర్శక సూత్రాలను అతడు రూపొందించాడు. ఒక 'రాకుమారుడు'

ఈ కార్యాన్ని పూర్తి చేయగలడని అతడు బలంగా నమ్మాడు. అయితే మాకియావెల్లీ ఆశలన్నీ అడియాసలయ్యాయి. కాని అతడి రచనలు మాత్రం కొన్ని నిర్దిష్టమైన పద్ధతులను వివరిస్తాయి. స్పానిష్ పాలకులు లేదా హెన్రీ 8 అనుసరించిన విధానాలను అవి ప్రతిబింబిస్తాయి.

గ్రనడా ఆక్రమణకు కొనసాగింపుగా ఇసాబెల్, ఫెర్డినాండ్‌లు అణచివేతను రాజ్య సిద్ధాంతంగా మార్చివేశారు. క్రైస్తవులపై ఇస్లామిక్ రాజ్యాలు ఎన్నడూ వ్యవహరించిన విధంగా ఈ పాలకులు క్రైస్తవేతరులపట్ల తీవ్ర అణచివేత చర్యలు తీసుకున్నారు. క్రైస్తవ మతం స్వీకరించని వారిని, దేశ బహిష్కరణ ఆదేశాన్ని ఉల్లంఘించేవారిని విచారణ పీఠం వద్ద సజీవ దహనం చేసేవారు. 17వ శతాబ్దం మొదలయ్యే నాటికి స్పెయిన్ నుండి ముస్లిం జనాభా అంతా వెలివేయబడింది. ముస్లింలు ఆ దేశంలో సుమారు 900 సంవత్సరాలపాటు జీవించారు. ఇస్లామిక్ పాలన కొనసాగిన ఎనిమిది శతాబ్దాలలో యూదులను సహించారు. అయితే ఇప్పుడు వారు దేశం వదిలి వెళ్లేలా ఒత్తిడి చేశారు. ఉత్తర ఆఫ్రికా, తుర్కు పాలిత బాల్కన్లు (ఈ ప్రాంతంలోని సలోనికాలో స్పానిష్ మాట్లాడే యూదు సముదాయ ప్రజలు ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ఆ నగరాన్ని హిట్లర్ నాజీ సైన్యాలు ఆక్రమించే వరకు నివసించారు). ఈశాన్య ఐరోపాలో యూదులు కొత్త జీవితాలను ప్రారంభించారు. స్పెయిన్‌లోనే జీవితం గడపాలన్న భావనతో క్రైస్తవ మతం స్వీకరించిన వారు కూడా సురక్షితంగా ఉండలేకపోయారు. 1570 దశకంలో ఈ వర్గం ప్రజల మీద వరుసగా దాడులు జరిగాయి.

హెన్రీ 7, హెన్రీ 8, వారి వారసులు ఇంగ్లాండ్‌లో అనుసరించిన అణచివేత చర్యలు బడాభూస్వాముల ప్రాబల్యాన్ని అరికట్టడానికే ఉద్దేశించినవి కావు. పెద్ద సంఖ్యలో ఉన్న పేదలను కూడా నియంత్రణలో ఉంచడానికి ప్రయత్నించారు. బడాభూస్వాములు తమ జాగీర్ల నుండి పేద కార్మికులను, రైతులను, సేవకులను పెద్ద సంఖ్యలో తొలగించడంతో వారు గ్రామీణ ప్రాంతాల్లో జీవనోపాధి లేక దిక్కుతోచని స్థితిలో తిరిగేవారు. పాత ఉమ్మడి భూముల్లో వ్యవసాయాన్ని నిషేధించడంతో సన్నకారు రైతులు తమ భూములను, జీవనోపాధిని కోల్పోయారు. వరుసగా వచ్చిన పాలకులు ఈ వర్గం ప్రజలను వాంఛిత నేరగాళ్లుగా పరిగణించేవారు. 1530లో రూపొందించిన ఒక శాసనం ప్రకారం:

> "భారీ కాయులైన దేశదిమ్మరులను కొరడా దెబ్బలతో శిక్షించి, నిర్బంధించాలి. వారిని గుర్రపుబండిచక్రాలకు కట్టేసి శరీరం నుండి రక్తం ధారాళంగా కారే వరకు కొరడాతో కొట్టాలి. స్వంత ప్రాంతానికి తిరిగి వెళ్లేలా వారితో ప్రతిజ్ఞ చేయించాలి. లేదా మూడేళ్ల నుండి వారు నివసిస్తున్న ప్రాంతానికి తిప్పి పంపించాలి. అక్కడ వారితో శ్రమ చేయించాలి".
> ఆ శాసనాన్ని తర్వాత సవరించారు:
>
> "రెండవ సారి దేశ దిమ్మరిగా తిరిగితే కొరడాదెబ్బల శిక్షను పునరుద్ధరించాలి. దానితోపాటు నేరస్తుని చెవిని సగం వరకు కోసివేయాలి. మూడవ సారి అదే నేరానికి పాల్పడితే నేరస్తుడిని కరుడుగట్టిన నేరస్తునిగా గుర్తించి ఉరితీయాలి."

## కొత్త ఆలోచనలు

అమెరికాను 'కనుగొన్న' కాలాన్ని, 'కొత్త రాజరికాలు' ఏర్పడిన కాలాన్ని పునరుజ్జీవ కాలంగా

కూడా పరిగణించవచ్చు. ఈ కాలంలో మేధోపరమైన జీవితం పునర్జన్మ ఎత్తింది. ఇటలీ నగరాలలో ఉద్భవించిన కళ వందేళ్ల తర్వాత పశ్చిమ ఐరోపాలోని మిగతా ప్రాంతాలన్నింటిలోనూ విస్తరించింది. ఐరోపా ఖండమంతటా ప్రాచీన గ్రంథాల అధ్యయనం ఊపందుకుంది. పాత కళాత్మక సాంప్రదాయాలు, మతమౌఢ్యం నుండి ప్రజలు మెల్లగా బయటపడ సాగారు. ఈ అవలక్షణాలు ఐరోపా మధ్యయుగాలను చాలా వరకు శాసించాయి. పునరుజ్జీవ ఉద్యమం కారణంగా కళా, సాహిత్యం, సాంకేతిక రంగాల్లో ఐరోపా ఖండం ఎన్నడూ ఎరుగని రీతిలో ప్రగతి సాధ్యమైంది. ప్లాటో, అరిస్టాటిల్, ఈక్లిడ్ శకం తర్వాత ఇంతటి సాంకేతిక సామాజిక వికాసాన్ని ఐరోపా చవిచూడలేదు.

ఇది ఈ కాలం గతాన్ని పక్కనపెట్టడానికి జరిగిన తొలి ప్రయత్నం మాత్రం కాదు. కొన్ని చరిత్ర గ్రంథాలు వాస్తవానికి భిన్నంగా వాదనలను ముందుకు తెచ్చాయి. రెండు శతాబ్దాల క్రితమే ఈ ప్రయత్నం జరిగింది. టొలేడోలో లాటిన్, గ్రీకు, అరబిక్ భాషల్లో ఉన్న గ్రంథాలను అప్పుడు అనువదించారు. అబెలర్డ్, రోజర్ బేకాన్ లాంటి ఆలోచనాపరుల కృషి, బొకాషియో, చౌసర్, డాంటే రచనలు పునరుజ్జీవ ప్రక్రియకు పునాదులు వేశాయి. అయితే 14వ శతాబ్దంలో పుట్టుకొచ్చిన పెనుసంక్షోభం ఈ ప్రక్రియను నిలిపివేసింది. ఆ సంక్షోభ కాలంలో చర్చి, రాజ్యం చేతులు కలిపి గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో వర్గపోరుకు బాటలు వేయగల ఆధునిక భావాలు, ఆలోచనలను కట్టడి చేశాయి. మేధోపరమైన ఆలోచనలకు కేంద్రాలుగా వెలగాల్సిన విశ్వవిద్యాలయాలు మతపరమైన వాదప్రతివాదనల్లో కూరుకుపోయాయి. ఈ వాదనలకు ఆచరణాత్మక ప్రాముఖ్యత ఏమాత్రం ఉండేది కాదు.

13వ శతాబ్దపు శాస్త్ర, సాంస్కృతిక, మేధోపరమైన కార్యకలాపాల పునరుద్ధరణకు పునరుజ్జీవ ఉద్యమం ప్రాతినిధ్యం వహిస్తుంది. కాని ఈ ఉద్యమ స్థాయి ఎంతో ఉన్నతమైనది, విశాలమైనది. ఇటలీ నగర రాజ్యాలలో ఆవిర్భవించిన ఈ ఉద్యమం మధ్యయుగపు ప్రపంచ దృష్టికోణానికి నేరుగా సవాలు విసరలేదు. ఈ దశలో ఆలోచనలు (పాలకవర్గ) తిరోగమన పథంలో ఉన్నాయి. ఆ నగర రాజ్యాలపై సంపన్న వ్యాపారులకు పూర్తి ఆధిపత్యం ఉండేది. భూస్వామ్యేతర మార్గాలలో కూడబెట్టిన సంపదను వారు విరివిగా ఖర్చు చేస్తూ సమాజంలో తమ స్థాయిని, ప్రతిష్టను మరింత పెంచుకున్నారు. అలాగే అప్పటి వరకు సమాజంలో ఉన్నత వర్గాలుగా చెలామణి అయిన భూస్వాములను పక్కకు తప్పించారు. అయితే భూస్వామ్య వ్యవస్థ ఏర్పరచిన అధికార కేంద్రాలలో పదవులను దక్కించుకునేందుకు వ్యాపారులు తమ ధన, కండబలాన్ని ఉపయోగించారు. ఉదాహరణకు మెడిషీలు ఫ్లోరెన్స్ నగరంలో ఒక సంపన్న కుటుంబానికి ప్రాతినిధ్యం వహించేవారు. తొలుత బ్యాంకర్లుగా, వ్యాపారులుగా తమ ప్రస్థానాన్ని మొదలుపెట్టిన మెడిషీ కుటుంబీకుల్లో ఒకరు పోప్‌గా, మరొకరు ఫ్రాన్స్ రాణిగా స్థిరపడ్డారు. వారి సాంస్కృతిక ఆచారాలు సమాజంలో వారి సందిగ్ధ స్థాయిని ప్రతిబింబించాయి. పేద కార్మిక కుటుంబాలకు చెందిన చేతివృత్తిదారులతో శిల్పాలు, చిత్రాలను తయారుచేయించారు. ఈ పేద కళాకారులు తాము కలగంటున్న ఆదర్శ సమాజానికి మనోహరమైన దృశ్యరూపం ఇచ్చేవారు. 'దేవుడు ఆదాముకు ప్రాణం పోసే' చిత్రం, సిస్టీన్ చాపెల్‌లోని "తుది తీర్పు" చిత్రం ద్వారా మైకెలాంజెలో మానవత్వానికి దృశ్యరూపం ఇచ్చాడు. కొండ చెరియల మధ్య ఇరుక్కుపోయి ప్రాణాలు కాపాడుకోవడానికి బానిసలు పడుతున్న అవస్థను అనేక చిత్రాలలో ప్రతిబింబించాడు. మరోవైపు పాలకవర్గాలు ప్రోత్సహించిన సాహిత్యం కొన్ని విధాలుగా 13, 14వ శతాబ్దపు సాంప్రదాయానికి భిన్నంగా తిరోగమన దిశలో పయనించింది. సుమారు 70 ఏళ్ళ క్రితం ఇటలీ విప్లవవాది ఆంటోనియో గ్రామ్‌సీ పేర్కొన్నట్లు డాంటే రచనలు ఫ్లోరెన్స్ ప్రజల ఇటలీ యాసలో కొనసాగగా పునరుజ్జీవ ఉద్యమ మానవతావాదం బుద్ధిజీవుల భాష అయిన లాటిన్‌ను

ఒక సాధనంగా ఎంచుకుంది. ఐరోపా అంతటా విస్తరించి ఉన్న మేధావులకు లాటిన్ రచనలు ఒక వారధిగా ఉపయోగపడినా ఫ్లోరెన్స్, మిలాన్ లేదా వెనీస్ విశాల ప్రజానీకానికి ఏ విధంగానూ ఉత్సాహపరచలేకపోయాయి. ఇంకా చెప్పాలంటే ప్రాచీన గ్రంథాల పట్ల ఉన్న గుడ్డి నమ్మకం అప్పటికీ పోలేదు. ఒక గ్రీకు లేదా రోమను రచయిత వ్యాఖ్యను పునరుద్ఘాటిస్తే వాద ప్రతివాదనలలో పై చేయి దక్కేది.

ఐరోపా అంతటా పునరుజ్జీవ ఉద్యమం విస్తరించే కొద్దీ దాని సిద్ధాంతాలలో కూడా మార్పు రావడం మొదలుపెట్టింది. లాటిన్ లేదా గ్రీకు గ్రంథాలను ఐరోపా భాషల్లోకి కవితా శైలిలో అనువదించారు. ప్రాచీన గ్రంథాలను అధ్యయనం చేయడమే కాక వాటి సిద్ధాంతాలను, తర్కాలను ప్రశ్నించే గుణం కూడా విస్తరించింది. ఉదాహరణకు కాపర్నికస్, కెప్లర్, గలీలియో లాంటి శాస్త్రవేత్తలు సనాతనవాద సిద్ధాంతాలను శాస్త్రీయ, ప్రగతిశీల వాదనలతో నీరుగార్చారు. సుమారు 2,000 సంవత్సరాలుగా పాతుకుపోయిన ఆలోచనలను పటాపంచలు చేస్తూ 16వ శతాబ్దం ప్రారంభమై ఉండొచ్చు కాని తదుపరి వందేళ్ళలో ప్రజాభిప్రాయాలను ప్రతిబింబించే రచనలు వెల్లువలా వచ్చాయి. ఫ్రెంచిలో రబెలాయిస్, ఆంగ్లంలో షేక్స్‌పియర్, మార్లోవ్, బెన్ జాన్సన్, స్పానిష్‌లో సెర్వాంత్ అనేక రచనలు చేశారు. కథలు, నాటకాలు లేదా కొత్త ఆలోచనలకు అక్షర రూపం ఇవ్వడానికే ఈ వ్యవహారం పరిమితం కాలేదు. కోట్లాది ప్రజలు మాట్లాడే భాషకు కూడా ఒక స్వరూపాన్ని ఇచ్చింది. కొత్త రాచరిక వంశాల ఆవిర్భావాన్ని చవిచూసిన ఈ శకం తొలి జాతీయ భాషల ఆవిర్భావానికి కూడా సాక్షిగా నిలిచింది.

## కొత్త మతాలు

గ్రనడా స్వాధీనం, వెస్ట్ ఇండీస్‌లో కొలంబస్ పాదం మోపిన తర్వాత 25 ఏళ్లకు మార్టిన్ లూథర్ అనే ఒక 34 ఏళ్ల మత బోధకుడు దక్షిణ జర్మనీలోని విటెన్‌బర్గ్ చర్చికి ఒక పత్రాన్ని సమర్పించాడు. అందులోని 95 అంశాలు కాథలిక్ చర్చి నిర్వాకాలను తీవ్రంగా విమర్శించాయి. చర్చి అప్పటి వరకు 'పాపపరిహారాలను' అమ్ముకునేది. లూథర్ పత్రాలు ప్రజలను పాపవిముక్తులను చేసి స్వర్గానికి నేరుగా వెళ్లడానికి అనుమతి పత్రాన్ని (పాస్‌పోర్ట్) అందిస్తామని హామీ ఇచ్చాయి. లూథర్ చర్య కారణంగా పశ్చిమ ప్రపంచ చర్చిలో పెద్ద చీలిక వచ్చింది. 12 శతాబ్దాల క్రితం క్రైస్తవ మతాన్ని కాన్‌స్టంటైన్ స్వీకరించినప్పటి నుండి చర్చిలో ఇంత పెద్ద సంక్షోభం ఎప్పుడూ తలెత్తలేదు. చర్చి లేదా పవిత్ర రోమను సామ్రాజ్యం ఎన్ని కుయుక్తులు పన్నినా లూథర్‌కు పెరుగుతున్న ప్రజాదరణను అడ్డుకోలేకపోయాయి. దక్షిణ జర్మనీలోని ప్రధాన నగరాలు బాసెల్, జూరిచ్, స్ట్రాస్‌బర్గ్, మైంజ్‌తోపాటు స్విట్జర్లాండ్‌లో కూడా ప్రజలు లూథర్ పక్షాన నిలబడ్డారు. అలాగే జర్మనీలోని శక్తిమంతులైన రాకుమారులు కూడా లూథర్‌కు మద్దతు తెలిపారు. ముఖ్యంగా సాక్సనీ, హెస్, బ్రాండెన్‌బర్గ్ రాకుమారులు అందరికంటే ముందున్నారు. అనతికాలంలోనే హాలెండ్, ఫ్రాన్స్‌లలో కొత్త మతాన్ని స్వీకరించడానికి ప్రజలు ఎగబడ్డారు. రాజ్యం, చర్చి అధికారులు తీవ్రమైన అణచివేతకు పాల్పడినా ఈ మాతమార్పిడి ఆగలేదు. ఒక దశలో అణచివేత పతాకస్థాయికి చేరుకుంది. 1546లో మియాక్స్ పట్టణ ప్రధాన కూడలిలో 14 మంది లూథర్‌వాద వృత్తిదారులను ఒకేసారి సజీవదహనం చేశారు. ఇంగ్లాండ్‌కు చెందిన ఎనిమిదవ హెన్రీ కాథలిక్ చర్చితో సంబంధాలను పూర్తిగా తెంచుకున్నాడు. అరేగాన్‌కు చెందిన స్పానిష్ రాకుమారి కాథరీన్‌తో తన విడాకులను పోప్ (ఇతడు స్పానిష్ పాలక వర్గానికి సన్నిహితంగా ఉండేవాడు) ఆమోదించకపోవడంతో హెన్రీ ఈ

తీవ్ర నిర్ణయం తీసుకున్నాడు.

పాపకార్యాలు, చర్చి వేడుకలు, భగవంతునికి భక్తులకు మధ్య వారధులుగా ఫాదరీల పాత్ర, ఫాదరీలను నియంత్రించే పోప్ హక్కును సవాలు చేస్తూ మతపరమైన వాదనలను లూథర్ తొలుత లేవదీశాడు. అయితే మధ్యయుగ సమాజంలో కాథలిక్ చర్చికి ప్రధాన పాత్ర ఉండడం వల్ల లూథర్ ముందుకు తెచ్చిన అంశాలు రాజకీయ, సామాజిక రంగును సంతరించుకున్నాయి. మొత్తం భూస్వామ్య వ్యవస్థ పక్షాన సైద్ధాంతిక నియంత్రణను తన చేతుల్లోకి తీసుకున్న సంస్థ (చర్చి)ను లూథర్ నేరుగా సవాలు విసిరినట్లయింది. అలాంటి సైద్ధాంతిక నియంత్రణపై నమ్మకం ఉన్నవారు ఎదురుదాడికి దిగడం అనివార్యం. ఈ అంశాలపై చెలరేగిన వాదోపవాదాలు ఐరోపాను చాలా వరకు యుద్ధాలు, అంతర్యుద్ధాల పరంపరలో ముంచెత్తాయి. ఈ అరాచక పరిస్థితులు సుమారు 125 ఏళ్ల పాటు కొనసాగాయి. జర్మనీలో స్మాల్‌కాల్డిక్ యుద్ధం, ఫ్రాన్స్‌లో మతపరమైన అంతర్యుద్ధాలు, స్పెయిన్ నుండి విముక్తి కోసం డచ్‌లు జరిపిన సుదీర్ఘ స్వాతంత్ర్య సమరం, జర్మనీలోని చాలా భూభాగాలను నాశనం చేసిన 30 ఏళ్ల యుద్ధం, ఇంగ్లాండ్‌లో అంతర్యుద్ధం ఈ కాలంలోనే జరిగాయి.

లూథర్ చురుకైన తార్కికవాది. తన వాదనను బలోపేతం చేసుకునేందుకు అతడు ఒక అంశం తర్వాత మరో అంశాన్ని ప్రస్తావించేవాడు. అలాగే అతడు బైబిల్‌ను జర్మన్ భాషలోకి అనువదించాడు. జర్మన్ భాషా వికాసంపై ఈ అనువాదం నిర్ణయాత్మకమైన ప్రభావం చూపింది. అయితే ఈ అంశాలన్నీ లూథర్ చర్యల ప్రభావాన్ని పూర్తిగా వివరించవు.

రోమన్ కాథలిక్ చర్చిపట్ల వ్యతిరేకతకు సుదీర్ఘమైన చరిత్రే ఉంది. లూథర్ ఆలోచనలలో దాదాపు పోలి ఉన్న ఆలోచనల ఆధారంగానే చర్చి విస్తరించింది. వాల్డెన్సియన్ అనే రహస్య చర్చి కూడా ఉండేది. ఐరోపా ప్రధాన నగరాల్లో అనుచర వర్గాన్ని సంపాదించుకున్న ఈ చర్చి సుమారు రెండువందల ఏళ్ల పాటు కొనసాగింది. ఇలాంటి ఆలోచనల పక్షాన వందేళ్లకు పూర్వం బోహేమియాలో హుస్సైట్లు పోరాడారు. 14వ శతాబ్ది చివరలో ఇంగ్లాండ్ మతశాస్త్రాలను బోధించిన వైక్లిఫ్ అనే సంస్కరణవాది అనుచరులు (లొల్లార్డ్) ఈ కాలంలో కూడా ఉండేవారు. అయితే ఈ ఉద్యమాలన్నీ చర్చిని తుత్తునియలు చేయలేకపోయాయి. అలాగే చర్చి చుట్టూ ఉన్న సమాజాన్ని కదిలించలేకపోయాయి. లూథర్ ఖచ్చితంగా ఈ పనే చేశాడు. మతశాస్త్రాల్లోని కొన్ని అంశాలపై లూథర్‌తో విభేదించిన ఇతర సంస్కరణవాదులు కూడా అందుకు తోడ్పడ్డారు. ముఖ్యంగా జూరిచ్‌లో జ్వింగ్లీ, జెనీవాలో కాల్విన్ చర్చి పునాదులను కదిలించడంలో కీలక పాత్ర పోషించారు.

ఇలా ఎందుకు జరిగిందో అర్థం చేసుకోవడానికి స్థూల ఆర్థిక, సామాజిక మార్పులను విశ్లేషించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. 14వ శతాబ్దిలో సంక్షోభం మొదలైనప్పటి నుండి సామాజిక, ఆర్థిక రంగాల్లో వచ్చిన మార్పులను అధ్యయనం చేయాల్సి ఉంటుంది. ఈ మార్పులే కొత్త మతాల ఆవిర్భావానికి రంగం సిద్ధం చేశాయి. అదే సమయంలో కొత్త రాచరికాల ఏర్పాటుకు, కొత్త ప్రపంచాన్ని స్వాధీనం చేసుకోవడానికి, పునరుజ్జీవ కాలంలో కొత్త శాస్త్రాల అధ్యయనానికి బాటలు వేశాయి. భూస్వామ్య ఆర్థిక వ్యవస్థ, భూస్వామ్య సమాజం ఏదో ఒక కొత్త వ్యవస్థకు జన్మనిచ్చే దశలో ఉండేది. ప్రొటెస్టెంట్‌వాదం ఆ పురుటి నొప్పుల్లో ఒకటి.

## పరిణామ దశలో ఆర్థిక వ్యవస్థ

పశ్చిమ ఐరోపా సమాజం శతాబ్దాల తరబడి మార్పులను చవిచూస్తూ వచ్చింది. ఈ మార్పుల

స్థూలప్రభావం హాటి పరిధిలో జీవించే ప్రజలకు చాలా అరుదుగా కనిపించేది. తొలుత ఉత్పత్తి పద్ధతుల్లో నెమ్మదిగా, నిరంతరంగా మార్పులు వచ్చాయి. చేతివృత్తిదారులు, ఓడనిర్మాణ కార్మికులు, సైనిక సాంకేతిక నిపుణులు యురేషియా, ఉత్తర ఆఫ్రికాలో అభివృద్ధి చెందిన పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకొని దానిని మరింత పదునుపెట్టారు. ఫలితంగా 16వ శతాబ్దం నాటికి ఎన్నో పరికరాలు అందుబాటులోకి వచ్చాయి. ఈ పరికరాల గురించి 12వ శతాబ్దంలో కాని, చివరికి 14వ శతాబ్దంలో కాని ఎన్నడూ ఊహించి ఉండరు. ప్రతి ముఖ్యమైన పట్టణంలో యాంత్రిక (మర) గడియారాలు, గాలిమరలు, నీటి చక్రాలు, కొత్త కొలిమి స్వరూపాలు (ముడి ఇనుమును ఉత్పత్తి చేయగల సామర్థ్యం వీటికి ఉండేది), ఓడ నిర్మాణంలో కొత్త పద్ధతులు, ఓడలు నిలపడానికి కొత్త పరికరాలు, యుద్ధం చేయడానికి ఫిరంగులు, తుపాకులు, ముద్రణా యంత్రాలు కనిపించేవి. గతంలో కేవలం గుర్తించబడిన గ్రంథలయాలకే పరిమితమైన రాతప్రతులు ముద్రణాయంత్రాల రాకతో వేలాది సంఖ్యలో ప్రజలకు అందుబాటులోకి వచ్చాయి.

ఈ సాంకేతిక ఆవిష్కరణలు భారీ మార్పులన్నింటికీ నిర్దిష్టమైన ముందుస్తు పరిస్థితిగా మారాయి. చైనా అరబ్ భూముల నుండి దిక్సూచి కాలచక్రం అందకపోయినా కొలంబస్ అమెరికాకు సముద్రమార్గాన్ని అన్వేషించి ఉండొచ్చు కాని అతడు ఒక క్రమబద్ధమైన మార్గాన్ని మాత్రం ఏర్పాటు చేయలేకపోయాడు. కొలంబస్ కంటే చాలా ముందు వేరేవారు అమెరికాకు ప్రయాణం చేసి ఉండొచ్చు కూడా. కొలంబస్ కనుక క్రమబద్ధమైన మార్గాన్ని కనుగొని ఉంటే స్పెయిన్, అమెరికాల మధ్య తరచుగా రాకపోకలు సాగేవి, దండయాత్రలు త్వరగా పూర్తయ్యేవి. అధునాతన ఆయుధాలు, మందుగుండు తుపాకులు అందుబాటులో లేకుండా ఉన్నట్లయితే స్పానిష్ సామ్రాజ్య సైన్యాలు ఒక యుద్ధం కూడా గెలిచి ఉండేవి కావు. అదే సమయంలో ఆయుధ బలం లేకుండా ఉన్నట్లయితే సాయుధులైన భూస్వాములను, వారి కిరాయి సైన్యాన్ని స్పానిష్ దళాలు ఓడించేవికావు. భూస్వాముల కోటలను నాశనం చేయడంలో కాని, రైతాంగ విల్లుకారులను అణచివేయడంలో కాని వాటికి అంత సామర్థ్యం ఉండేది కాదు. పునరుజ్జీవ ఉద్యమ ఆలోచకులు ఉత్తర ఇటలీలో గ్రీకు, రోమను రచనలపట్ల ఆసక్తిని (ముద్రణాయంత్రాలు అందుబాటులో లేకపోయినా) రేకెత్తించే అవకాశం ఉండేది. కాని ముద్రణాయంత్రాలే అంటూ లేకుండా ఉన్నట్లయితే నూతన ఆలోచనలు వేలాది పుస్తకాల రూపంలో ఐరోపా అంతటా విస్తరించకపోయేవి. అదే విధంగా, పోప్‌కు సవాలు విసిరిన లూథర్ ప్రజల మద్దతు అంత స్థాయిలో కూడబెట్టుకునేవాడు కాదు. వాస్తవం చెప్పాలంటే అప్పటికే అభివృద్ధి చెందిన లూథర్ ఆలోచనలను ఐరోపా అంతటా వ్యాపింపచేయడానికి ముద్రణాయంత్రాలు రంగం సిద్ధం చేశాయి. ఉదాహరణకు ఇంగ్లాండ్‌లో ముద్రణా కేంద్రాలు వైక్లిఫ్ ప్రవచించిన పోప్- వ్యతిరేక ఆలోచనలకు ఎనలేని బలాన్ని చేకూర్చాయి. ఈ ప్రక్రియ నెమ్మదిగానే జరిగినా దాని ప్రభావం తీవ్రంగా ఉండేది. లాగ్లాండ్ రచించిన 'పియర్స్ ప్లవ్‌మాన్', కొంతవరకు చౌసర్ రచనల్లో కూడా చర్చి వ్యతిరేక భావాలు వ్యక్తమయ్యాయి. ఆ విధంగా 14వ శతాబ్ది 16వ శతాబ్దిని ఆలోచనాశక్తితో అందుకుంది.

అయితే కేవలం సాంకేతిక ప్రగతి ఒక్కటే ప్రతి కార్యాన్ని సాధించపెట్టలేదు. అధునాతన పద్ధతులను కొన్నిసార్లు భారీ వ్యయంతో ఆచరణలో పెట్టాల్సి వచ్చేది. ఆయుధాలను తయారు చేయాల్సి వచ్చేది. ఖనిజాలను తవ్వి తీయాల్సి వచ్చేది. ముద్రణా కేంద్రాలకు ఆర్థిక వనరులను సమకూర్చాల్సి వచ్చేది, ఓడలను నిర్మించాల్సి వచ్చేది. అన్నిటికి మించి సైన్యాలకు ఆహార, ఆయుధ సరఫరాలను

సమకూర్చాల్సి వచ్చేది.

ఉత్పత్తి యొక్క సామాజిక, సాంకేతిక నిర్వహణలో భారీ మార్పులు చోటు చేసుకున్న కారణంగా పై కార్యాలన్నీ ఒక పరిమిత స్థాయిలోనే చేపట్టేవారు. అవసరానికి సరిపడ ఉత్పత్తి మాత్రమే సాధ్యమయ్యేది.

తొలితరం భూస్వామ్య వ్యవస్థలో ఉత్పత్తి తక్షణ వినియోగానికి మాత్రమే పరిమితమై ఉండేది. రైతు కుటుంబాన్ని సజీవంగా ఉంచడం కోసం, భూస్వామి విలాసంగా జీవించడం కోసం ఉత్పత్తి జరిగేది. ఆధునిక ఆర్థికవేత్తలు ఆడమ్ స్మిత్, కారల్ మార్క్స్ నిర్వచించిన "వినియోగదారీ విలువలు" అప్పుడు ఎంతో ప్రాధాన్యతను కలిగి ఉండేవి. ఈ విలువల ప్రకారం రైతుల మనుగడకు సరిపడ వస్తువులు, భూస్వాముల గొంతెమ్మ కోర్కెలు తీర్చడానికి అవసరమైన విలాస వస్తువులను ఉత్పత్తి చేసేవారు. రైతుల శ్రమశక్తితో కాని ఆధునిక పద్ధతుల్లో కాని ఉత్పత్తిని పెంచాలన్న ఒత్తిడి కేవలం రైతు నుండే వచ్చేది. తన జీవన ప్రమాణాలను మెరుగుపరుచుకునేందుకు అతడు తహతహలాడే వాడు. మరోవైపు విలాస వస్తువులను మరింత ఎక్కువ స్థాయిలో వినియోగించాలన్న భూస్వామి కోరిక కూడా ఉత్పాదకతపై ఒత్తిడి తెచ్చేది. మార్క్స్ పేర్కొన్నట్లు భూస్వాముల 'పొట్ట పరిమాణం' కారణంగా రైతులను దోచుకునే స్థాయిపై పరిమితులు ఏర్పడ్డాయి. అలాంటి సమాజంలో వస్తుమార్పిడి, మారకద్రవ్యం పరిమిత పాత్రనే పోషించాయి. ఎవరైనా తమ సంపదను పెంచుకోవాలని ఆకాంక్షిస్తే భూములను బలవంతంగా స్వాధీనం చేసుకునే వారు తప్ప బంగారు రాసులను కూడబెట్టేవారు కాదు.

పదిహేనవ శతాబ్దం మొదలయ్యే నాటికి పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. అమ్మకాల కోసం సరుకులను ఉత్పత్తి చేయడం సర్వసాధారణమైపోయింది. సరుకులను బంగారునాణేలు లేదా వెండి నాణేలతో మార్చుకునేవారు. ఇతర వస్తువులను కొనుగోలు చేయడానికి ఈ మారకద్రవ్యాన్ని వినియోగించేవారు. స్మిత్, మార్క్స్ నిర్వచించిన 'మారక విలువ'కు ప్రాధాన్యత పెరుగుతూ వచ్చింది. రైతు కుటుంబం అప్పటి కూడా తన అవసరాలకు సరిపడ ఆహార ధాన్యలను, వస్త్రాలను ఉత్పత్తి చేసేది. అయితే భూమి కౌలును చెల్లించడానికి దానికి మారకద్రవ్యం అవసరమయ్యేది. వ్యవసాయ ఉపకరణాలు కొనుగోలు చేయడానికి, పంట విఫలమైన పక్షంలో మనుగడ సాగించడానికి కూడా మారక ద్రవ్యం చేతిలో ఉండాల్సిన అవసరం ఎంతైనా ఉండేది. చక్రవర్తులు (రాజులు), భూస్వాములకు కూడా మారకద్రవ్యం పెద్ద మొత్తంలో అవసరమయ్యేది. సుదూరపు వాణిజ్యమంటే ప్రపంచంలోని నలుమూలల నుండి విలాసవస్తువులను అధిక ధరకు సమకూర్చుకోవడమే. ఎవరైనా భారీ మొత్తంలో డబ్బును సంపాదించగలిగితే అతడు లేదా ఆమె ఇతరులను జయించే సామర్థ్యంగల సాయుధ బలగాలను సమకూర్చుకునే అవకాశముండేది. (అప్పటి కాలంలో సైన్యాలన్నీ దాదాపు కిరాయి మూకలతో నిండి ఉండేవి) లేనిపక్షంలో వారు ఓడలను కొనుగోలు చేసి నావికులను నియమించే అవకాశముండేది. తద్వారా కొత్త సముద్ర మార్గాల అన్వేషణతోపాటు వాణిజ్య లావాదేవీలను కూడా విస్తరించుకునేవారు. కొన్ని సందర్భాల్లో సముద్ర మార్గాల్లో దోపిడీకి పాల్పడి సంపదను కూడగట్టేవారు మొత్తం మీద, నేటి పరిస్థితిని తలపిస్తూ ధనమే సర్వస్వమైపోయింది.

కాలక్రమంలో ఈ పరిస్థితి శ్రామిక లోకాన్ని పూర్తిగా మార్చివేసింది. శ్రామికశక్తి మానవుల రోజువారీ అవసరాలను తీర్చుకునే సాధనంగా కాకుండా సంపదను సృష్టించడానికి ఒక మార్గంగా మారిపోయింది. ధనికులు మరింత సంపదను పోగు చేయడానికే ఉత్పత్తి పరిమితమైంది. 16వ శతాబ్దం

తొలినాళ్ల వరకు ఈ ప్రక్రియ సంపూర్ణం కాలేదు.

తాము చేసే ఉద్యోగానికి తగిన ప్రతిఫలాన్ని చాలా మంది వృత్తిదారులు అప్పటికి కూడా ఆశించేవారు. పండుగలు, మత వేడుకలను జరుపుకొనే స్వేచ్ఛ తమకు కూడా కావాలని కోరుకునేవారు. రుతుపవనాల ఆధారంగానే తమ జీవితం కొనసాగుతోందని, వినియోగదారీ మార్కెట్లు తమ జీవనోపాధిపై ఎలాంటి ప్రభావం చూపడం లేదని రైతులు సైతం భావించేవారు. అయితే మార్కెట్ వ్యవస్థ అప్పటికే విస్తరణ దిశలో పయనిస్తూ ఉంది. ఈ ప్రక్రియ రెండు శతాబ్దాలపాటు కొనసాగింది. మార్కెట్ వ్యవస్థ నెమ్మదిగా విస్తరించింది. పట్టణాలు, గ్రామీణ ప్రాంతాల్లో సైతం మార్కెట్ శక్తుల ప్రభావం పెరిగింది. విశాల ప్రజానీకం జీవితాన్ని నియంత్రించడం మొదలుపెట్టింది. ప్రధాన పట్టణాలు, ఓడరేవులు, నదీమార్గాలకు సమీపంలో ఉండే గ్రామీణ ప్రాంతాలు ఏకమొత్తంగా వాణిజ్య పంటలను సాగుచేసే పారిశ్రామిక కేంద్రాలుగా రూపాంతరం చెందసాగాయి. పత్తి, ద్రాక్ష, ఆలివ్, కేసరి పంటలు ఎక్కువగా సాగయ్యేవి. అలాగే మాంసం సరఫరాలకు డిమాండ్ పెరగడంతో పశుపోషణ కూడా విస్తరించింది. ఉత్పత్తిలో వికేంద్రీకరణ వ్యవస్థను వ్యాపారులు పెద్దఎత్తున ప్రోత్సహించారు. సరఫరా, డిమాండ్ ఆధారంగా తక్కువ వేతనాలను అంగీకరించాలని చేతివృత్తిదారులపై ఒత్తిడిని పెంచారు. పాత సాంప్రదాయ పద్ధతులకు తిలోదకాలిచ్చారు. గ్రామీణ- ఆధారిత పరిశ్రమలను (కొత్తవి) ప్రోత్సహించారు. వ్యాపారులకు లాభాలను చేకూర్చడం కోసం తమ జీవనశైలిని మార్చుకోలేమని పట్టణ ప్రాంత వృత్తిదారులు తేల్చి చెప్పడంతో గ్రామీణ- ఆధారిత పరిశ్రమల వైపు పెట్టుబడిదారులు దృష్టి సారించారు. దక్షిణ జర్మనీలోని ఎగువ ప్రాంతాలు, బొహేమియా, ట్రాన్సిల్వేనియా లాంటి ప్రాంతాల్లో ఫుజ్జర్ కుటుంబం లాంటి పెట్టుబడిదారులు (వీరు స్పానిష్, పవిత్ర రోమను చక్రవర్తుల యుద్ధావసరాల కోసం నిధులను సమకూర్చేవారు) వేతన కార్మికుల శ్రమశక్తి ఆధారంగా గనులను తవ్వడం మొదలుపెట్టారు.

మార్కెట్ కోసం ఉత్పత్తి అనే ప్రక్రియ ముందుగానే పోషించిన పాత్ర కారణంగా 14వ శతాబ్ద సంక్షోభ పర్యవసానాలు ఐదవ శతాబ్దిలో రోమను సామ్రాజ్యాన్ని, మూడు, 13వ శతాబ్దాల్లో చైనాను కుదిపివేసిన సంక్షోభాలకు పూర్తి భిన్నంగా ఉండేవి. ఆ సందర్భాల్లో కరువు, అంతర్యుద్ధం, విదేశీ ఆక్రమణ సామ్రాజ్యాలను పెద్ద జాగీర్లుగా విచ్ఛిన్నం చేశాయి. ఈ జాగీర్ల మధ్య పరస్పర ఆర్థిక సహకారం కానీ విశాల సమాజంతో సంబంధాలు కానీ ఉండేవి కావు. అందుకు భిన్నంగా 14వ శతాబ్ది సంక్షోభం ఐరోపా అంతట మార్కెట్ సంబంధాల విస్తరణకు బాటలు వేసింది. భూస్వామ్య కౌలుదారీ వ్యవస్థ ఉన్న ప్రాంతాల్లో సైతం కౌలుదారులు భూస్వామికి ధనిక వ్యాపారుల నుండి లాభాలను చేకూర్చి పెట్టే వాణిజ్య పంటలను సాగు చేసేవారు.

ఆ సంక్షోభం పట్టణాలను భూస్థాపితం చేయలేదు. కరువు, ప్లేగు కారణంగా లెక్కలేనన్ని గ్రామాలు ఖాళీ అయినా పట్టణాలు చాలా వరకు స్థిరంగా ఉండిపోయాయి. 15వ శతాబ్ది మధ్యదశకాల నాటికి ఈ పట్టణాలు నూతన ఆర్థిక విస్తరణలో అగ్రభాగాన నిలిచాయి. ఆర్థిక విస్తరణ కొత్త సాంకేతిక పద్ధతులను, పరిజ్ఞానాన్ని ప్రోత్సహించింది. ముఖ్యంగా ముద్రణ, ఓడ నిర్మాణ రంగాల్లో ఈ మార్పు కనిపించింది, ఈ కొత్త శకంలో పట్టణాలు అన్ని రంగాల్లోనూ లబ్ధిపొందలేదు. మార్కెట్ విస్తరణ, మారకద్రవ్యం కోసం ఉత్పత్తి ఊపందుకోవడంతో వ్యక్తిగత పట్టణాల లాభార్జన అస్థిరంగా మారింది. గతంలో బాగా లబ్ధిపొందిన పట్టణాలు ఇపుడు మార్కెట్ ప్రతికూలతను ఎదుర్కొన్నాయి. ఉత్పత్తిలో ఊహించని మార్పులు లేదా దూరపు ప్రాంతాల్లో చోటుచేసుకున్న రాజకీయ ఘటనలు కూడా పట్టణాల

ప్రగతిని తీవ్రంగా ప్రభావితం చేశాయి. గతంలో ఎంతో వెనుకబడి ఉన్న పట్టణాలు ఇపుడు వేగంగా పుంజుకున్నాయి. 16వ శతాబ్దంలో బార్సిలోనా, ఫ్లోరెన్స్, ఉత్తర ఐరోపాకు చెందిన ప్రముఖ వాణిజ్య కేంద్రాలు, బాల్టిక్ నగరాలు వేర్వేరు స్థాయిలో పతనమయ్యాయి. మరోవైపు ప్రస్తుత నెదర్లాండ్స్‌లోని ఉత్తర దిగువ దేశం, దక్షిణ స్పెయిన్, నైరుతి జర్మనీ, ఇంగ్లాండ్‌కు చెందిన ఇతర నగరాలు ప్రగతిపథంలో పయనించాయి.

మార్కెట్ మరో ప్రభావం కూడా చూపింది. కోట్లాది ప్రజల జీవనస్థితిగతుల్లో అది మార్పును తెచ్చింది. 15వ శతాబ్ది మధ్య దశకాల తర్వాత నిత్యావసర సరుకుల ధరలు పెరగడం మొదలుపెట్టాయి. ఫలితంగా అత్యధిక సంఖ్యలో ఉన్న సాధారణ ప్రజల జీవనప్రమాణాలు క్షీణించాయి. ప్లేగు తర్వాత శతాబ్ది కాలంలో రెట్టింపైన నగదు వేతనాలు ఈ కాలంలో సగానికి పడిపోయాయి. వివిధ రకాల బకాయిలపేరుతో భూస్వాములు రైతులపై ఒత్తిడిని తీవ్రతరం చేశారు.

గ్రామీణ, పట్టణ ప్రాంత సంపన్నులలో ధనవ్యామోహం పెరిగింది. కొలంబస్, కార్టెస్, పిజ్జారోలు బంగారు నిక్షేపాలపట్ల కనబరిచిన ఆతృత ఇందులో ఒక భాగమే. మరో వైపు చర్చి 'పాపవిముక్తి' వ్యాపారంలో నిమగ్నం కావడంతో లూథర్ తొలిసారిగా మతపెద్దలపై విరుచుకుపడ్డాడు. ఈశాన్య ఐరోపాలో కౌలుదారీ వ్యవస్థ మళ్లీ జీవం పోసుకుంది. పశ్చిమ ఐరోపాలో తొలిదశ క్యాపిటలిస్టు వ్యవసాయం వేళ్లూనుకుంది. ప్రతి విషయానికి ధనమే కొలబద్దగా మారింది. అయినప్పటికీ సమాజ అధికారిక విలువలు పాత భూస్వామ్య వ్యవస్థ విలువల చట్రంలోనే ఉండిపోయాయి.

మధ్యయుగాల విలువలకు చర్చి ప్రధాన కేంద్రంగా ఉండేది. దాని వేడుకలు సమాజంలోని వివిధ వర్గాల నైతిక ప్రవర్తనకు ప్రతిరూపాలుగా ఉండేది. ఆ విలువలకు చిత్రరూపం కూడా ఇవ్వబడింది. అయితే స్వయంగా చర్చే బంగారు వ్యామోహంలో కొట్టుకుపోయింది. మెడిసీలు లేదా బోర్జియాలు లాంటి సంపన్న వ్యాపార కుటుంబాల సభ్యులు తమ స్వంత ఆస్తిని పెంచుకోవడం కోసం పోప్‌లుగా అవతారమెత్తారు. అలా కూడబెట్టిన సంపదను తమ అక్రమ సంతానానికి కట్టబెట్టాలని యోచించారు.

యవ్వనంలో అడుగుపెట్టిన బాలురను లాభదాయకమైన బిషప్ పదవుల్లో నియమించారు. తమ పరిధిలో ఉన్న చర్చిల నుండి మత పెద్దలు ఆదాయాన్ని రాబట్టేవారు. కాని ఏ చర్చిలోనూ మత ప్రవచనాలను బోధించేవారు కాదు. చర్చిలకు సమకూరే విరాళాలపై భూస్వాములు కూడా ఆధారపడేవారు. వారి ఆదాయంలో సగం వరకు చర్చి నుండే సమకూరేది. బిషప్‌లు, సన్యాసులు పేద రైతులకు రుణాలు అందజేసి వడ్డీల పేరుతో పీల్చిపిప్పి చేసేవారు. అప్పటికీ వడ్డీ వ్యాపారం మహాపరాధంగా ఉండేది.

క్యాపిటలిజం, ప్రొటెస్టంట్‌వాదం మధ్య ఉన్న అంతర్గత సంబంధాల నిర్దిష్ట స్వరూపాన్ని తేల్చడంపై చరిత్రకారులు విలువైన సమయాన్ని వృథా చేశారు. జర్మన్ జాతీయవాది, సామాజిక శాస్త్రవేత్త అయిన మాక్స్ వెబర్‌తో ప్రభావితమైన ఒక ఉన్నత వర్గం ప్రొటెస్టెంట్ విలువల కారణంగానే క్యాపిటలిజం ఆవిర్భవించిందని వాదించింది. అయితే ప్రొటెస్టెంట్ స్ఫూర్తి ఎక్కడి నుండి పుట్టుకొచ్చిందో వివరించలేకపోయింది. ఇతర విచారధారలు ప్రొటెస్టెంట్‌వాదం, క్యాపిటలిజం మధ్య అసలు ఎలాంటి సంబంధం లేదని వాదించాయి. తొలి ప్రొటెస్టెంట్లు ఎవ్వరూ క్యాపిటలిస్టులు కారని పేర్కొన్నారు. జర్మనీలో ప్రొటెస్టెంట్‌వాదం గట్టిగా పునాదులు వేసుకున్న ప్రాంతాల్లో ద్వితీయ కౌలుదారీ వ్యవస్థ అమల్లో ఉన్న ప్రాంతాలు కూడా అంతర్భాగంగా ఉండేవి.

అయితే పై రెండు ఆలోచనా విధానాల మధ్య సంబంధం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది. సాంకేతిక మార్పులు, కొత్త మార్కెట్ సంబంధాల ప్రభావం కారణంగా 'మిశ్రమ సమాజం' ఆవిర్భవించింది.

దీన్ని మార్కెట్ భూస్వామ్య వ్యవస్థ అని కూడా పరిగణించవచ్చు. ఈ వ్యవస్థలో భూస్వామ్య, క్యాపిటలిస్టు ఆలోచనలు, ఆచరణ మధ్య సమన్వయం ఉన్నప్పటికీ వాటి మధ్య సంఘర్షణ జరిగేది.

భూస్వామ్య వ్యవస్థ మీద మార్కెట్ వ్యవస్థను మోపడంతో విశాల సంఖ్యలో ఉన్న ప్రజలు రెండు వ్యవస్థల్లోనూ ఉన్న లోపాలతో మరింత నష్టపోయారు. మార్కెట్ ఉత్థాన పతనాలు ప్రజల జీవనోపాధిని తరచూ హరించివేసేవి. భూస్వామ్య పద్ధతుల్లోని వ్యవసాయం ఈశాన్య, దక్షిణ ఐరోపాలలో పెద్ద ఎత్తున విస్తరించింది. రైతులను పోషించడానికి, భూస్వాములకు విలాస వస్తువులను సమకూర్చడానికి సరిపడ దిగుబడిని ఈ తరహా వ్యవసాయం అందించలేకపోయింది. పెద్ద సంఖ్యలో ఉన్న సామ్రాజ్య సైన్యాలకు సరఫరాలను తగిన స్థాయిలో సమకూర్చలేకపోయింది. పాలకవర్గ స్వరూపం విస్తరించే కొద్దీ రైతాంగ ఉత్పత్తి ఆధారం కుదించుకుపోయింది. పదహారవ శతాబ్దం గడిచేకొద్దీ సమాజం సరికొత్త సంక్షోభ కాలంలోకి నెట్టబడింది. ఈ సంక్షోభ కాలంలో సమాజం ఒక అడుగు ముందుకు వేస్తే నాలుగు అడుగులు వెనక్కు వెళ్లేది.

ఫలితంగా సమాజంలోని ప్రతి వర్గం సందిగ్ధావస్థలో ఉండిపోయింది. ప్రతి వర్గం పునరాశ్వాసం కోసం పాత మత విశ్వాసాలవైపు దృష్టి సారించడం మొదలుపెట్టింది. కాని స్వయంగా చర్చి వ్యవస్థే గందరగోళ పరిస్థితి ఎదుర్కొంటోందని అన్ని వర్గాలు ఎట్టకేలకు గ్రహించాయి. పాత భూస్వామ్య వ్యవస్థ నుండి వారసత్వంగా పొందిన ఆలోచనలను పునఃసమీక్షించడానికి మార్గాలు లభిస్తే కాని కొత్త పరిస్థితితో ప్రజలు రాజీపడేవారు కాదు. లూథర్, జ్వింగ్లీ, కాల్విన్, జాన్ నాక్స్, తదితరులు (చివరకు ఇగ్నేషియస్ లయోలా కూడా) ప్రజలకు అలాంటి మార్గాలను చూపారు. ఇగ్నేషియస్ జెసుయిట్స్ వర్గాన్ని స్థాపించి కాథలిక్ల ప్రతీఘాత సంస్కరణోద్యమాన్ని ఉధృతం చేశాడు.

## జర్మన్ సంస్కరణోద్యమం

విప్లవోద్యమాలను కాని సాంఘిక సంస్కరణోద్యమాలను కాని లేవదీయాలని మార్టిన్ లూథర్, జీన్ కాల్విన్లు ఎన్నడూ అనుకోలేదు. సమాజంలో బలంగా పాతుకుపోయిన మత వ్యవస్థను తీవ్రంగా ప్రతిఘటించడానికి సంసిద్ధులయ్యారు. అయితే వారి దృష్టిలో వాదనలన్నీ మతశాస్త్రాలకు సంబంధించినవే. జీసస్ బోధనలను కాథలిక్ చర్చి తప్పుగా ఎలా అన్వయించింది, బైబిల్లో పేర్కొనబడిన అపోస్తులుల పవిత్ర కార్యాలను ఎలా భ్రష్టు పట్టించిందన్న అంశాలపై వారి వాదనలు కేంద్రీకృతమయ్యాయి. ప్రజల వ్యక్తిగత మత విశ్వాసమే కీలకమని, మత బోధకుల జోక్యం లేదా 'మంచి పనులు' అవసరం లేదని వారు నొక్కి చెప్పారు. (మంచి పనులంటే చర్చికి విరాళాలు చెల్లించడమే) విగ్రహాలు, స్మారక మందిరాల ద్వారా పూజించబడే క్రైస్తవ సంతుల పంథా బైబిల్ సందేశాన్ని విగ్రహారాధన అనే దైవ ధిక్కార చర్యతో భ్రష్టు పట్టించడమేనని వారు వాదించారు. కాల్విన్ మరో అడుగు ముందుకు వేసి కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాడు. హోలీ కమ్యూనియన్ (Holy Communion) వేడుక సందర్భంగా భక్తులు జీసస్ మాంసాన్ని ఆరగించారన్న నమ్మకం (విశ్వాసం) దైవదూషణతో సమానమని పేర్కొన్నాడు. ఈ వివాదాస్పద అంశం కారణంగానే కాల్విన్ లూథర్ అనుచరులతో సయోధ్యను కుదుర్చుకోలేకపోయాడు. ఈ విషయంలో అతడిని రోము చర్చి కూడా తీవ్రంగా నిందించింది. ఇలాంటి అంశాలపైనే తొలి ప్రొటెస్టెంట్లు వ్యక్తిగతంగా చొరవ తీసుకొని తమ అనుచరులను గట్టిగా నిలబడమని ఉద్బోధించారు. ఐరోపాలోని అన్ని నగరాల్లోనూ దైవదూషణకు శిక్షగా బహిరంగంగా సజీవ దహనం చేసేవారు. ముప్పు తప్పదని గ్రహించినప్పటికీ

ప్రొటెస్టెంట్లు తమ అనుచరులలో విశ్వాసం నెలకొల్పేందుకు అన్ని చర్యలు తీసుకున్నారు. అయితే కాల్విన్, లూథర్ ఇద్దరూ సామాజిక అంశాలపై సాంప్రదాయవాదులుగా వ్యవహరించారు. 1521లో తన శిరస్సుకు సామ్రాజ్య అధికారులు వెల కట్టినపుడు లూథర్ ప్రజలకు సందేశమిస్తూ రాజ్య పాలకులను పాలన సంబంధిత విషయాల్లో అందరూ గౌరవించాలని కోరాడు.

> "ఘర్షణకు బలమైన కారణాలున్నప్పటికీ అది ఎంత మాత్రం న్యాయసమ్మతం కాదు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకే లౌకికవాద అధికారాన్ని, ఖడ్గాన్ని రూపొందించారు. అయితే మంచి, చెడుల మధ్య తేడాను అర్థం చేసుకోకుండా ఒక వ్యక్తి ఉద్యమిస్తే అతడు విచక్షణారహితంగా దాడి చేస్తాడు. అలాంటి దాడి మహాపరాధం, ఘోరమైన అన్యాయం. కనుక నా మాటను ఆలకించి అధికారులు చెప్పినట్లు నడుచుకోండి."

ఇదే కారణంగా కాల్విన్ ఆలోచనలను "సార్వజనీన విధేయత ప్రమాణ పత్రం"గా నిర్వర్తించారు. "సామాజిక వ్యవస్థలో పాలకుడు, పాలితుల విభజనలు ఉండాలని దేవుడు నిర్దేశించాడు. మానవాళి పాపకార్యంతో ఉద్భవించిన కారణంగా ఈ ప్రపంచంలో అణచివేతను సహించడం తప్పనిసరి, అన్న అర్థం స్ఫురించేలా కాల్విన్ ఆలోచనలు ఉండేవి.

ఇలాంటి ప్రవచనాలున్నప్పటికీ సామాజిక సంఘర్షణలను కాల్విన్, లూథర్‌ల సిద్ధాంతాలు నివారించలేకపోయాయి. ఈ సంఘర్షణల్లో వారు ఏదో ఒక పక్షం వహించక తప్పలేదు.

మతబోధకుడి స్థాయి నుండి విశ్వవిద్యాలయ ఆచార్యునిగా ఎదిగిన లూథర్ ఐరోపా ఖండమంతటా విస్తరించిన మానవీయ పునరుజ్జీవ ఉద్యమంలో క్రియాశీల పాత్రను పోషించాడు. ఆ కారణంగా అతడు మానవతావాదులను ఆకర్షించడంలో సఫలమయ్యాడు. అలాగే సాక్సనీ పాలకుడు ఫ్రెడరిక్ లాంటి శక్తిమంతులను కూడా తనవైపు తిప్పుకోగలిగాడు. వారి రక్షణను పొందగలిగాడు. విశేషమేమిటంటే ఫ్రెడరిక్ కూడా చర్చితో అనేక విషయాల్లో విభేదించాడు. అయితే 1520లో దక్షిణ జర్మనీలో లూథర్ బోధనలకు విశేష స్పందన రావడానికి కారణం అక్కడి సామాజిక వర్గాల్లో గూడుకట్టుకున్న అసంతృప్తే. ఈ వర్గాలను లూథర్ మొదటి నుండి విశ్వసించేవారు కాదు. ఫ్రాన్స్‌లో కాల్విన్ ప్రచారం ఉధృతం కావడానికి కూడా ఇలాంటి పరిస్థితులే అనుకూలించాయి. లూథర్ ఉద్యమం తర్వాత 25 ఏళ్లకు కాల్విన్ ఫ్రాన్స్‌లో సంస్కరణవాద ఉద్యమాన్ని చేపట్టాడు.

జర్మన్ సంస్కరణోద్యమ చరిత్రకారులు నేడు ఆ ఉద్యమాన్ని వేర్వేరు దశలుగా వర్గీకరించారు. పట్టణ ప్రాంత సంస్కరణోద్యమమని, గ్రామీణ సంస్కరణోద్యమని, రాచరిక సంస్కరణోద్యమమని మూడు దశలుగా ఆ ఉద్యమాన్ని విభజించాడు.

1521లో వామ్స్ వద్ద జరిగిన చారిత్రక సమావేశం (డయట్) లో చక్రవర్తిని బహిరంగంగా వ్యతిరేకించడం ద్వారా లూథర్ ప్రజానాయకుడయ్యాడు. ప్రజల్లో పలుకుబడిని సంపాదించుకున్న లూథర్ చర్చి, రాజ్యవ్యతిరేక ప్రచారం మొదలుపెట్టడంతో దక్షిణ జర్మనీ, స్విస్ నగరాలన్నింటిలో సంస్కరణోద్యమం వ్యాపించింది. ఈ నగరాలను పాత భూస్వామ్య పాలకవర్గాలు శాసించేవి. పాలకవర్గాల్లో ఎక్కువగా భూస్వామ్య, ధనిక వ్యాపార, తక్కువ శ్రేణి రాచరిక కుటుంబాలు అంతర్భాగంగా ఉండేవి. పట్టణ పాలకమండళ్లు, సెనేట్లపై వీరి ఆధిపత్యం తరతరాలుగా కొనసాగుతూ వచ్చింది. ప్రజాస్వామ్య వ్యవస్థ

నిర్దిష్ట స్వరూపాన్ని సంతరించు కున్నప్పుడు కూడా నగరాలపై వారి పట్టు కొనసాగింది.

ఈ ధనిక పాలకవర్గాలకు చర్చి ప్రాబల్యంపై కొన్ని అభ్యంతరాలు ఉండేవి. ఉదాహరణకు చర్చి తనకు పన్నుల నుండి పూర్తి మినహాయింపు ఉండాలని వాదించేది. ఫలితంగా సామాన్య ప్రజలపై అదనపు భారం పడేది. దీనికి తోడు స్థానిక రాకుమారుల అధికారాలు కూడా పాలకవర్గాలకు ఆందోళన కలిగించేవి. అయితే వాటికి సామాజిక, మతపరమైన వ్యవస్థలతో అనేక విధాలుగా సంబంధాలుండేవి. నగరాలకు దూరంగా ఉన్న వ్యవసాయ భూముల నుండి వీరికి కౌలు లభించేది. దాని ఆధారంగా వారు మనుగడ సాగించేవారు. తమ సంతానం కోసం లాభాలను చేకూర్చే చర్చి పదవులను దక్కించుకునేవారు. చర్చికి లభించే విరాళాల్లో కొంత మొత్తాన్ని రాబట్టేందుకు మార్గాలను అన్వేషించేవారు. ఈ కారణంగానే చర్చిని సంస్కరించాలన్న నినాదం వారిని ఆకర్షించింది. అదే సమయంలో చర్చి వ్యవస్థను సంపూర్ణంగా ప్రక్షాళన చేయాలన్న వాదనను వారు వ్యతిరేకించారు. ఒక్క మాటలో చెప్పాలంటే పాలకవర్గాలు సాధారణ మార్పులను తప్ప విప్లవాత్మక ప్రక్షాళనను అంగీకరించలేదు. నగర మతపరమైన జీవనంపై తమకు మరింత నియంత్రణ సాధించి పెట్టగల మార్పులనే అవి కోరుకున్నాయి. ఎలాంటి వివాదాలు తలెత్తని రీతిలో చర్చి నిధులను వినియోగించే అధికారం తమ స్వంతం కావాలని ఆశించాయి.

అయితే ఈ సామాజిక ఉన్నత వర్గానికి దిగువన చిరువ్యాపారులు, చేతివృత్తిదారులు పెద్ద సంఖ్యలో ఉండేవారు. ఈ వర్గంలో కొన్నిసార్లు మతబోధకులు, సన్యాసులు, సన్యాసినులు (వీరు వృత్తిదారి కుటుంబాలకు చెందిన వారు) కూడా అంతర్భాగంగా ఉండేవారు. ఈ వర్గం ప్రజలంతా చర్చికి విరాళాలను చెల్లించడానికి విముఖత చూపేవారు. తాము దాతృత్వం చూపినా అవసరమైన సమయాల్లో ఆధ్యాత్మిక సాంత్వన చేకూర్చడానికి మతబోధకులు ఎవ్వరూ ముందుకు రావడం లేదని అసంతృప్తి వ్యక్తం చేసేవారు.

ఈ వర్గం చేపట్టిన పోరాటం వల్లే ఒక నగరం తర్వాత మరో నగరంలో సంస్కరణోద్యమం జయప్రదమవుతూ వచ్చింది. ఎర్ఫర్ట్ నగరంలో విద్యార్థులు, చేతివృత్తిదారులు కలిసి మతపెద్దలపై దాడులు నిర్వహించారు. 1521 లో ఈ నగరం గుండా లూథర్ బయల్దేరి వెళ్లిన తర్వాత కానన్ భవనాన్ని వారు తగులబెట్టారు. బాసెల్ నగరంలో నేతపనివారు కొత్త ప్రతిపాదనను ముందుకు తెచ్చారు. మతప్రవచనాలను ఆధ్యాత్మికంగానే కాకుండా భౌతికంగా కూడా గ్రహించాలని, తోటి మానవులపట్ల ప్రేమానురాగాలతో, నిజమైన విశ్వాసంతో వ్యవహరించాలని సూచించారు. శీతాకాలంలో కలప, మైనపు ఒత్తులు, ఇతర నిత్యావసర వస్తువుల కొరతను ఎదుర్కొనే పేదలకు సహాయం అందించేందుకు చర్చి అలంకరణకు వెచ్చించే నిధులను మళ్లించాలని డిమాండ్ చేశారు. బ్రౌన్స్‌ష్విగ్, హాంబర్గ్, హానోవర్, లెంగో, ల్యాచెక్, మ్యాజ్‌బర్గ్, మల్‌హౌసెన్, వైజ్మార్ నగరాలలో వ్యాపారులు, చేతివృత్తిదారులతో కూడిన మండళ్లు పట్టణ పాలకవర్గాలపై తీవ్రమైన ఒత్తిడి తెచ్చి మతపరమైన సంస్కరణలు అమలయ్యేలా చేశారు. విటెన్‌బర్గ్‌లో పోరు ఉధృతమైంది. మార్పును కోరుతున్న వారు ఆ నగరాన్ని చుట్టు ముట్టారు. పరిస్థితి చేజారిపోయిందని గ్రహించిన పాలకులు స్వయంగా మార్టిన్ లూథర్‌నే ఆహ్వానించి అవసరమైన మార్పులను క్రమబద్ధంగా ఆచరణలో పెట్టాలని కోరారు. స్ట్రాస్‌బర్గ్‌లో సముదాయ సమావేశాల నుండి ఒత్తిడి రావడంతో మెజిస్ట్రేట్లు మత ఆచారాలను (ఇవి చట్టవిరుద్ధమైనవి) సంస్కరించడం మొదలుపెట్టారు. అయితే మతచట్టాల్లో భారీ మార్పులు తీసుకురావాలని ప్రజలనుండి ఒత్తిడి పెరగకముందే ఎవరో ఒకరు తమకు ఈ బాధ్యతల నుండి ఊరట కలిగిస్తారన్న నమ్మకంతో మెజిస్ట్రేట్లు ఉండిపోయారు. ముఖ్యంగా చక్రవర్తి, సామ్రాజ్య శాసనమండలిలేదా చర్చి సాధారణ పాలకమండలి తమను ఆదుకోగలవని నగరపాలనాధి కారులు

ఆకాంక్షించారు.

ఈ విధంగా క్షేత్ర స్థాయి నుండి వచ్చిన ఒత్తిడి కారణంగా జర్మనీలోనీ మూడింట రెండొంతుల సామ్రాజ్య నగరాలు కొత్త మతాన్ని స్వీకరించాయి. తన సిద్ధాంత విజయానికి దేవుని కోరికే (నిర్ణయం) కారణమని మార్టిన్ లూథర్ పేర్కొన్నాడు. "ఒక వాక్కు ఇంత పని చేసింది. నేను ఫిలిప్, ఆమ్స్‌డార్ఫ్‌తో కలిసి మద్యం సేవిస్తూ ఉండగా దేవుడు పోప్ ఆధిపత్యాన్ని తీవ్రంగా దెబ్బతీశాడు." అని లూథర్ రాశాడు. అయితే వాస్తవ పరిస్థితులను పరిగణనలోకి తీసుకుంటే ఆ సమయంలో నెలకొన్న ఆర్థిక సంక్షోభం వర్గ భావనను బలోపేతం చేసిందని, వర్గ ఆకాంక్షలే లూథర్ బోధనలకు భారీ ఎత్తున స్పందన వచ్చేలా తోడ్పడ్డాయని బోధపడుతుంది.

ఏదేమైనప్పటికీ, పాలకమండళ్లు, సెనేట్లు క్షేత్ర స్థాయి నుండి వచ్చిన ఉద్యమాన్ని చల్లార్చేందుకు తగిన రీతిలో మార్పులు తీసుకురావడంలో చాలా వరకు సఫలమయ్యాయి. "పాలకమండలి ఒక్కసారి మతబోధనలను తన గుప్పిట్లో తీసుకున్న తర్వాత, ప్రజామండలిలో సామాన్యుల స్థానంలో మతపెద్దలను చేర్చుకున్న తర్వాత నగర చర్చి జీవితానికి సంబంధించిన నిర్ణయాధికారాలన్నీ వీధుల నుండి మండలి కార్యాలయానికి బదిలీ కావడం సహజమని తేలిపోయింది."

## రైతాంగ పోరాటం

1524 సంవత్సరం చివరలో అత్యంత హింసాత్మకమైన ఉద్యమం రెండవ సారి ఆవిర్భవించింది. 'రైతాంగ పోరాటం'గా ప్రసిద్ధిగాంచిన ఉద్యమం ఆధునిక కాలానికి పూర్వం ఐరోపాలో సంభవించిన అత్యంత ముఖ్యమైన ప్రజా ఉద్యమంగా నిర్వచించబడింది. నేటి చరిత్రకారులు కొందరు ఈ ఉద్యమాన్ని సాధారణ పౌరుల విప్లవంగా గుర్తిస్తారు. ఈ ఉద్యమానికి అరశతాబ్దం ముందే దక్షిణ జర్మనీలో గ్రామీణ తిరుగుబాట్లు వరుసగా సంభవించాయి. ఇప్పుడు పట్టణాల్లో మత వైషమ్యాలు పెరిగిపోయినట్లు నివేదికలు రూపొందాయి. అప్పటికే విస్తరిస్తున్న గ్రామీణ పరిశ్రమల నుండి స్ఫూర్తి పొందిన వృత్తిదారులు ఇలాంటి మతపరమైన ఉద్యమాలను ముందుకు తీసువెళ్లారు. అంతకుముందు అనేక తరాలపాటు ఈ వర్గాలు అభద్రతను, అణచివేతను ఎదుర్కొని ప్రతీకారంతో రగిలిపోతూ ఉండేవి. అలా గూడుకట్టుకున్న వైషమ్యాలు తిరుగుబాటుకు బాటలు వేశాయి. ఈ తిరుగుబాటుకు సామాజిక నేపథ్యంతోపాటు మతపరమైన కోణం కూడా జత అయ్యింది.

వేలాది ప్రజలతో కూడిన తాత్కాలిక సైన్యాలు ఉద్యమాన్ని ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి విస్తరిస్తూ సామ్రాజ్యంలోని దక్షిణ, మధ్య ప్రాంతాలను పూర్తిగా తమ నియంత్రణలోకి తీసుకున్నాయి. క్రైస్తవ మఠాలను తగులబెడుతూ భూస్వాముల, పాలకవర్గాల కోటలను ముట్టడిస్తూ నగరాలు, పట్టణాలను స్వాధీనం చేసుకోవడానికి ఈ ఉద్యమం ప్రయత్నించింది. ఉద్యమ ధాటికి భూస్వామ్య దొరలు, బిషప్‌లు ఖంగుతిన్నారు. స్థానికంగా సంప్రదింపులు జరపడం ద్వారా తిరుగుబాటుదారులను మచ్చిక చేసుకోవడానికి తరచూ ప్రయత్నించేవారు. అదే సమయంలో తమకు అండగా నిలవాలని బలమైన రాకుమారులను ప్రాధేయపడేవారు. ఉద్యమాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలియక పట్టణ పాలకవర్గాలు దిక్కుతోచని స్థితిలో ఉండిపోయాయి. ఒకవైపు గ్రామీణ భూస్వాములు బిషప్‌లు, క్రైస్తవ మఠాల ఆధిపత్యాన్ని నిరసిస్తూ వచ్చిన ఈ పాలకవర్గాలు పట్టణాల్లోని పేద ప్రజల నుండి 'ఉద్యమంలో భాగస్వాములు కావలసిందిగా' ఒత్తిడిని ఎదుర్కొన్నాయి. మరోవైపు ఉద్యమం కారణంగా భూములు కోల్పోయే ప్రమాదమున్న వ్యక్తులు

కూడా ఈ పాలకవర్గాల్లో సభ్యులుగా ఉండేవారు. భయాందోళనలకు గురైన ఈ వర్గ సభ్యులు ఉద్యమానికి దూరంగా ఉండిపోయారు. భవిష్యత్‌లో చర్చల ద్వారా శాంతిని, సయోధ్యను ఎలాగోలా సాధించవచ్చన్న ఆశతో వారు ప్రేక్షకపాత్రను పోషించారు.

అయితే తిరుగుబాటుదారులు కొన్ని నగరాలను హస్తగతం చేసుకోవడంలో విజయం సాధించారు. అలాగే మరికొన్ని నగరాలను ఉద్యమం పక్షాన నిలబడేలా పరిస్థితులను సృష్టించారు. సాల్జ్‌బర్గ్‌లో గని కార్మికులు, గనుల యజమానులు, రైతులు ఉద్యమంలో చేరారు. హీల్‌బ్రాన్‌లో ప్రజల ఒత్తిడి కారణంగా (ముఖ్యంగా మహిళల నుండి) నగర పాలనాధికారులు తిరుగుబాటుదారుల కోసం నగర ద్వారాలను బార్లా తెరిచారు. ఉద్యమకారులు చర్చి, మత సంస్థలను స్వాధీనం చేసుకున్నారు. ఈ పద్ధతుల్లో తిరుగుబాటుదారులు మెమ్మింగిన్, కౌఫ్‌బ్యూరెన్, వీన్‌బర్గ్, బెర్మాటింజన్, న్యూస్టాడ్, స్టట్‌గార్ట్, మల్‌హౌసెన్ లాంటి పట్టణాలను తమ నియంత్రణలోకి తీసుకున్నారు.

ఉద్యకారులు ప్రతిచోటా ఒక ఫిర్యాదుల చిట్టాను రూపొందించారు. వీటిని స్థానిక, ప్రాంతీయ కార్యాచరణ ప్రణాళికల్లో పొందుపరిచారు. అలాంటి జాబితాలలో మెమ్మింగన్ ప్రాంత రైతులు రూపొందించిన 12-అంశాలు జాబితా జాతీయ కార్యక్రమంగా అవతరించింది. మెమ్మింగిన్ రైతులు ఆ ప్రణాళికను ఉద్యమ సానుభూతిపరుడైన ఒక వృత్తిదారుడు, ఒక తిరుగుబాటు మతబోధకుని సహాయంతో రూపొందించారు. ఉద్యమానికి జాతీయ ప్రణాళికగా రూపాంతరం చెందిన ఆ జాబితాను మళ్లీ మళ్లీ ప్రచురించి పంపిణీ చేశారు. స్థానిక సముదాయాలకు పాస్టర్లను నియమించే అధికారం ఉండాలని, చర్చి ఆస్తులను ఎలా వినియోగించాలో నిర్ణయించే హక్కు ఉండాలన్న డిమాండ్‌తో ఈ జాతీయస్థాయి ఉద్యమం ప్రారంభమైంది. ఉద్యమం విస్తరించే కొద్దీ మరికొన్ని ముఖ్యమైన డిమాండ్లు కూడా ముందుకొచ్చాయి. ప్రధానంగా రైతుల మనుగడను శాసించే అంశాలపై ఉద్యమం దృష్టి సారించింది. కౌలుదారీ వ్యవస్థ రద్దు, భూస్వాములకు రైతులు చెల్లించాల్సిన వివిధ రకాల రుసుముల రద్దు, ఉమ్మడి భూముల ఆక్రమణపై ఆంక్షలు, రైతులవేట, కలప సేకరణ, చేపలు పట్టడంపై భూస్వాములు విధించిన నిషేధం తొలగింపు, ఏకపక్ష తీర్పులకు తిలోదకాలు.... ఇవీ రైతుల డిమాండ్లలో ప్రధానమైనవి.

ఇది ఒక విప్లవాత్మకమైన ప్రణాళిక లేదా రాజకీయ కార్యక్రమమేమీ కాదు. రైతుల సమస్యలను రాచరికాలు, పాలకులు పరిష్కరిస్తారన్న భ్రమలో ఉద్యమకారులు ఉండిపోయారు. ఉద్యమం ప్రారంభమైన దశలో చాలా మంది భాగస్వాములు తాము భూస్వాములపై ఒత్తిడి తెచ్చి వారి వ్యవహారశైలిని మార్చగలిగితే తమ సమస్యలన్ని పరిష్కారం కాగలవన్న నమ్మకంతో ఉండేవారు. "మొత్తమ్మీద, రైతులు పాలకవర్గాలను ఆమోదించడానికి సిద్ధంగా ఉన్నారు. అయితే తమ సముదాయ వర్గాల కోర్కెలను అవి తీర్చగలగాలి." ఈ సముదాయ వర్గాలలో సాయుధ దళాలు, క్రైస్తవ సంఘాలు (తిరుగుబాటుదారులవి) ప్రధానమైనవి. సాంప్రదాయవాద చరిత్రకారుడైన జి.ఆర్. ఎల్టన్ ఇలా ఉల్లేఖించాడు: "స్థూలంగా చెప్పాలంటే రైతాంగమంతా చాలా నిగ్రహంతో వ్యవహరించింది." అందుకు విరుద్ధమైన అభిప్రాయం కలిగిన ఫ్రెడరిక్ ఎంగెల్స్ ఇలా వ్యాఖ్యానించాడు: "రాచరికం, రాజ్యాల వైఖరికి సంబంధించిన అంశాలపై వారు (రైతులు) ఎలాంటి చిత్తశుద్ధిని చూపలేదు. తమ శత్రువుల వైఖరిని అనుభవపూర్వకంగా తెలుసుకున్న తర్వాతనే రైతులు పోరాటం సందర్భంగా దృఢమైన వైఖరిని తీసుకున్నారు." రైతులు చూపిన ఉదారత్వం కారణంగానే వారు చాలా సందర్భాల్లో నమ్మి మోసపోయారు. భూస్వాములతో చర్చించి తమ సమస్యలను సామరస్యపూర్వకంగా పరిష్కరించుకోగలమని కొందరు ఉద్యమ నాయకులు భావించారు. వారిని నమ్మిన

రైతులకు చివరికి నిరాశే ఎదురైంది.

అయితే గతంలో పాలకులు, రాచరికాలు ఏ ఆధారంగానైతే పరిపాలించారో ఆ ఆధారానికి రైతులు ముందుకు తెచ్చిన ప్రాథమిక డిమాండ్లు సవాలుగా మారాయి. తమ మతపరమైన పరిభాషలో రైతులు ఇపుడు న్యాయపరమైన చట్టాల కంటే ఉన్నతమైన దైవ చట్టాలున్నాయని పేర్కొన్నారు. ఒక గ్రామసభ ఇలా తీర్మానించింది:" మన సృష్టికర్త అయిన దేవుడు తప్ప ఎవరూ కూడా పాలితులను కలిగి ఉండడానికి వీలులేదు." రైతాంగ ప్రయోజనాలను ప్రతిబింబించే 'దైవచట్టం' 'అనుశాసిత చట్టం' స్థానాన్ని భర్తీ చేయాల్సి ఉంది. ఈ అనుశాసిత చట్టం ప్రజలను భూస్వాములకు, చర్చికి లోబడి ఉండేలా చేసేది.

తన స్వంత వర్గ స్థాయిని దిగజార్చే విధంగా రైతులకు రాయితీలు ఇచ్చేందుకు భూస్వామ్య వర్గం నిస్సహాయతను వ్యక్తం చేసింది. అదేసమయంలో రాయితీలు ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నామని నటిస్తూ భూస్వాములు కిరాయి సైన్యాలను సమీకరించడం మొదలుపెట్టారు. 1525 ఏప్రిల్‌లో ఈ కిరాయి సైన్యాలు రంగంలోకి దిగాయి. ఎల్టన్ చెప్పినట్లు :

> "పాలకవర్గాలు తమ పునాదులు కదిలిపోతున్నట్లు గ్రహించాయి. తాము ఎదుర్కొంటున్న ముప్పుకు వారు ప్రతిస్పందించిన తీరు అత్యంత కిరాతకమని చెప్పాలి. వేలాది మంది రైతులు ఊచకోతకు గురయ్యారు. కొన్ని అంచనాల ప్రకారం లక్షమంది వరకు హతులయ్యారు. సాయుధ పోరాటాలనబడే చిన్నస్థాయి ఘర్షణల తర్వాతే ఈ మారణహోమం జరిగింది. రాకుమారుల సాయుధ బలగాలు తిరుగుబాటుదారులను అణచివేయడాన్ని ఒక గొప్ప క్రీడగా పరిగణించాయి."

ప్రజల తిరుగుబాటును పరిశీలించిన మార్టిన్ లూథర్ కంగారు పడిపోయాడు. తొలుత పట్టణ పాలకవర్గాల తరహాలో అతడు ప్రజల అసంతృప్తికి భూస్వాముల ఆగడాలే కారణమని నిందించాడు. అయితే రైతాంగ సాయుధ దళాలు నిర్దిష్టమైన విజయాలను సొంతం చేసుకోవడం మొదలుపెట్టడంతో లూథర్ భూస్వాములకు తన సంపూర్ణ మద్దతును ప్రకటించాడు. 'రైతాంగ హంతక, దోపిడీ ముఠాలకు వ్యతిరేకంగా' అనే విమర్శనాత్మక కరపత్రాన్ని రూపొందించాడు. తిరుగుబాటుదారులను అణచివేయడానికి భూస్వాములు అత్యంత హింసాత్మకమైన పద్ధతులను అవలంభించాలని ఆ కరపత్రంలో అతడు పిలుపునిచ్చాడు. "వారిని(విద్రోహులను) ముక్కలు ముక్కలుగా నరికి చంపాలి. పిచ్చికుక్కను ఎలా చంపుతారో అలా వారి గొంతునొక్కాలి, కత్తులతో పొడవాలి. ఈ పనిని ఎవరైనా చేపట్టవచ్చు. అందుకు ప్రత్యక్ష, పరోక్ష పద్ధతులను అనుసరించ వచ్చు. ఈ ప్రక్రియలో పాలకులెవరూ జోక్యం చేసుకోకూడదు. కండబలం ఉన్నవారు ఎవరైనా సరే తిరుగుబాటుదారులను అంతమొందించాలి, వారిని ఊచకోత కోయాలి." ఒక లేఖలో లూథర్ ఇలా సూచించాడు: "రాకుమారులు, పాలనాధికారుల కంటే రైతులందరూ చావడమే మేలు."

> ఈ విషయంలో లూథర్ ఒక్కడే చొరవ తీసుకోలేదు. ప్రజా ప్రతిఘటనను రాజద్రోహంగా భూస్వాములు పరిగణించినట్లే సంస్కరణవాదులు కూడా తిరుగుబాటును మత విశ్వాసఘాతంగా అన్వయించారు. 1515లో సాధారణ పౌరునికి వ్యతిరేకంగా ఒక వైఖరి తీసుకోవడంలో ఎవరూ కూడా వెనుకాడలేదు. మార్టిన్ లూథర్, ఫిలిప్ మెలాన్‌చ్థన్, జొహానెస్

బ్రెంజ్, అర్బనస్ రీజియస్, జ్వింగ్లీ... ఇలా అందరూ ప్రజా ఉద్యమాన్ని వ్యతిరేకించారు.

నిజం చెప్పాలంటే ప్రొటెస్టంట్ ప్రచారకులు కొందరు ప్రజా ఉద్యమానికి వెన్నుదన్నుగా నిలిచారు. అందులో ప్రముఖుడు థామస్ ముంజర్. విశ్వవిద్యాలయంలో శిక్షణ పొందిన ఈ మత బోధకుడు, లూథర్ తొలిసారిగా పోప్, చక్రవర్తికి వ్యతిరేకంగా పోరాటం మొదలుపెట్టినప్పుడు అతడికి బాసటగా నిలిచాడు. అయితే మూడు, నాలుగేళ్లు గడవక ముందే అతడు లూథర్‌ను విమర్శించడం మొదలుపెట్టాడు. వ్యవస్థకు వ్యతిరేకంగా చేపట్టిన ఉద్యమాన్ని లూథర్ తానే స్వయంగా నీరుగార్చడంతో ఇద్దరి మధ్య సైద్ధాంతిక విభేదాలు పొడసూపాయి. థామస్ తన రచనల్లో మతపరమైన విషయాలను దాటిపోయి ప్రజాపీడనను సవాలు చేసే స్థితికి చేరుకున్నాడు. ప్రపంచాన్ని విప్లవాత్మకమైన రీతిలో సంస్కరించడమే క్రైస్తవ మత పరమార్థమని అతడు నమ్మాడు.

> "పేద ప్రజల అవసరాలను తీర్చడానికి ఎవరూ ముందుకు రాకపోవడం (ఈ భూమిపై జరుగుతున్న) మహాపరాధం. వ్యభిచారం, దొంగతనం, దోపిడీ... ఈ దుర్లక్షణాలకు చాలా దిగువ స్థాయిలో మన చక్రవర్తులు, పాలకులు ఉన్నారు. వారు పేద పశుకాపర్లను, వృత్తిదారులను అణచివేస్తున్నారు. పీడిత ప్రజల్లో ఎవరైనా ఒకరు చట్టాన్ని ఉల్లంఘించడమో, విధ్వంసానికి పాల్పడ్డమో జరిగితే అతడు అంతకు అంత అనుభవించాల్సి ఉంటుంది. ఇలాంటి అత్యాచారాలన్నింటికీ అబద్ధాలకోరు (లూథర్) తల ఊపుతున్నాడు."

ఇలాంటి పదప్రయోగం కారణంగా ముంజర్ అధికారుల ఆగ్రహాన్ని కొని తెచ్చుకున్నాడు. ఫలితంగా 1524 సంవత్సరమంతా అతడు అజ్ఞాతవాసం గడపాల్సి వచ్చింది. గ్రామీణ ప్రాంతాల్లో రహస్యంగా పర్యటిస్తూ అతడు చిన్నచిన్న రహస్య బృందాలను ఏర్పాటు చేశాడు. ముంజర్‌పై కఠిన చర్యలు తీసుకోవాలని పాలకులకు లూథర్ సూచించాడు. నేటికి కూడా కొందరు చరిత్రకారులు థామస్ ముంజర్‌ను దాదాపు పిచ్చివాడిగానే పరిగణిస్తారు. ఎల్టన్ దృష్టిలో ముంజర్ ఒక భయంకరమైన మేధావి (సంస్కరణోద్యమ తొలిదశలో), పట్టపగ్గాల్లేని ఛాందసుడు, కరుడుగట్టిన పిచ్చివాడు.

అయితే ముంజర్ చేసిన 'పిచ్చి' పని మాత్రం ఒక్కటే : మేధావులైన క్రైస్తవులందరికీ అర్థమయ్యే మతశాస్త్రాల ఆధారంగా వర్గపాలనకు మద్దతునివ్వకుండా, వారికి వ్యతిరేకంగా ఆవిర్భవించిన ప్రజాప్రతిఘటనను సమర్థించడమే.

తిరుగుబాటు మొదలు కాగానే ముంజర్ తన స్థావరాన్ని గనుల ప్రాంతమైన థురింజియాలోని మల్‌హౌసెస్ పట్టణానికి మార్చాడు. అక్కడ అతడు కరుడుగట్టిన ఉద్యమకారుల (రైతుల) సరసన చేరాడు. ఈ తిరుగుబాటుదారులకు మాజీ సన్యాసి అయిన ఫీఫర్ నాయకత్వం వహించేవాడు. విప్లవ కేంద్రమైన ఆ పట్టణాన్ని శత్రుసైన్యాల నుండి సంరక్షించడానికి ఆ రైతాంగ దళం ఏర్పాటైంది. అయితే ఫీఫర్ బందీగా చిక్కాడు. అతడిని దారుణంగా హింసించి శిరచ్ఛేదం చేశారు. మరణించే నాటికి అతడి వయస్సు 28 సంవత్సరాలు. తిరుగుబాటు దళాలను ఫ్రాంకెన్‌హౌసెస్ వద్ద లూథర్‌వాది అయిన హెస్సీ రాకుమారుడు, కాథలిక్ పంథాను అనుసరించే సాక్సనీ యువరాజు సైన్యాలు ఓడించిన తర్వాతే ఫీఫర్‌కు బహిరంగంగా మరణశిక్ష విధించారు.

తిరుగుబాటు అణచివేత జర్మన్ సమాజంపై తీవ్రమైన ప్రభావం చూపింది. శక్తిమంతులైన

రాకుమారుల ప్రాబల్యం మరింత సుస్థిరమైంది. రాకుమారుల సైనిక ప్రాబల్యానికి ప్రతీకలైన యుద్ధవీరులు కొన్ని సందర్భాల్లో మతపరమైన అంశాలపై సాయుధ ఘర్షణకు దిగారు. సమైక్య సామ్రాజ్యవాద జర్మనీకి విధేయులుగా ఉండేలా రాకుమారుల మెడలు వంచాలని కలలు గనేవారు. తిరుగుబాటు తొలిదశలో వారు సాధారణ ప్రజలపట్ల సానుభూతి కూడా చూపారు. అయితే ఇప్పుడు వారు రాకుమారుల పక్షాన నిలబడ్డారు. రైతాంగాన్ని నిరంతరంగా దోచుకునేందుకు పాలకులు హామీగా ఉండగలరని భావించారు. అలాగే పట్టణ పాలకవర్గాలు తొలుత సంశయించినప్పటికీ ప్రజా ఉద్యమం నుండి తమకు రక్షణగా పాలకులు (రాకుమారులు) వ్యవహరించగలరనే నిర్ధారణకు వచ్చారు. సన్నకారురైతులు కూడా పాలకుల ఆధిపత్యాన్ని అంగీకరించకతప్పలేదు. తిరుగుబాటును బహిరంగంగా సమర్థించే ధైర్యం చేయలేకపోయిన ఈ ప్రజలు అధికారం ఉన్న పాలకులకే మద్దతు తెలపడం శ్రేయస్కరమని భావించారు.

రాకుమారుల చేతికి దక్కిన కొత్త అధికారాలను, పెరిగిన వారి ప్రాబల్యాన్ని అంగీకరించిన పట్టణ ఉన్నత, మధ్యతరగతి వర్గాలు జర్మన్ సమాజ భవిష్యత్ స్వరూపాన్ని తాము ఏ మాత్రం నిర్ధారించలేమన్న విషయాన్ని కూడా గ్రహించారు. తమ స్వప్రయోజనాల ఆధారంగా సమాజాన్ని నిర్దేశించలేమని తెలుసుకున్నారు. భూస్వామ్య వ్యవస్థలోనే క్యాపిటలిస్టు అంశాల కారణంగా ముదిరిన సంక్షోభం విప్లవోద్యమానికి పునాదులు వేసింది. అయితే ఈ తిరుగుబాటును పాలకవర్గాలు అణచివేశాయి. 14వ శతాబ్దంలో పుట్టుకొచ్చిన పెను సంక్షోభం కారణంగా ఐరోపా అంతటా బయల్దేరిన ఉద్యమాలను అణచివేసినట్లే ఈ తిరుగుబాటును కూడా అణచివేశారు. కొత్త మత సిద్ధాంతమైన ప్రొటెస్టెంట్‌వాదాన్ని అంగీకరిస్తూనే పట్టణ మధ్యతరగతి ప్రజలు ఆ సిద్ధాంతాన్ని పాత వ్యవస్థను కూలదోయడానికి ఒక సాధనంగా ఉపయోగించలేకపోయారు. కొత్త మత సిద్ధాంతం ఆధారంగా పీడిత ప్రజలను సమీకరించి పాలకవర్గాలను తప్పించలేకపోయారు. ఫలితంగా రైతులు ఊచకోతకు గురయ్యారు. పట్టణ మధ్యతరగతి ప్రజల రాజకీయ ప్రాబల్యం క్షీణించిపోయింది. రాకుమారులు మరింత బలోపేతమయ్యారు. సన్నకారు రైతులు, పట్టణ మధ్యతరగతి ప్రజల ఈ పిరికితనం వల్ల నష్టపోయిన వ్యవస్థల్లో జర్మన్ ప్రొటెస్టెంట్‌వాదం ముఖ్యమైనది. రాకుమారులను ప్రోత్సహించిన లూథర్‌వాదం వారి చేతిలో చారిత్రక బందీ అయ్యింది. లూథర్ సిద్ధాంతాలు చర్చి ప్రాబల్యాన్ని ప్రశ్నించాయి. బిషప్‌లపై పోప్‌కు ఉన్న నియంత్రణను ప్రశ్నిస్తూ దైవధ్యానం లేదా ప్రార్థనలో అందరికీ సమానత్వం ఉండాలని లూథర్ సిద్ధాంతాలు వాదించాయి. అయితే ప్రజా ఉద్యమం వస్తుందన్న భయంతో లూథర్ అనుచరులు పాత క్రమశిక్షణ విలువలను మళ్లీ ప్రవేశపెట్టారు. 1525 పరిణామాల తర్వాత లూథర్ సమీప సహచరుడైన మెలాన్చ్‌థన్ ఇలా రాశాడు : "ఇంతటి క్రూరులు, విచక్షణ లేని జర్మన్లకు ఇప్పుడున్న స్వేచ్ఛ కంటే చాలా తక్కువ స్వేచ్ఛ ఉండడం ఎంతైనా అవసరం." అలాంటి క్రమశిక్షణను కఠినంగా అమలు చేయగల వారు రాకుమారులొక్కరే. తిరుగుబాటు అణచివేయబడ్డ తర్వాత లూథర్‌వాదం పాలకులకు రెండు వైపులా పదును ఉన్న ఆయుధంలా ఉపయోగపడింది. తమ ప్రాబల్యాన్ని గండికొట్టడానికి ప్రయత్నించే కాథలిక్ చక్రవర్తికి వ్యతిరేకంగా రాకుమారులు లూథర్ వాదాన్ని వినియోగించారు. మరోవైపు తమ పరిధిలోని పీడిత వర్గాలపై సైద్ధాంతిక నియంత్రణ సాధించేందుకు దానిని ఆయుధంగా వాడుకున్నారు. జర్మన్ భూస్వామ్య వ్యవస్థను అతలాకుతలం చేసిన సంక్షోభం నుండే ఈ కొత్త మత సిద్ధాంతం ఆవిర్భవించింది. ఉత్తర, ఈశాన్య జర్మనీ ప్రాంతాలలో అది రాజ్య సిద్ధాంతంగా మారింది. ఈ ప్రాంతాలలో రైతులను కౌలుదారీ వ్యవస్థ వైపు మళ్లీ నెట్టారు. ప్రాచీన రోమను సామ్రాజ్యం ఎదుర్కొన్న సంక్షోభం నుండి క్రైస్తవం పుట్టినట్లే, ఆ తర్వాత సామ్రాజ్య అధికార సిద్ధాంతంగా మారినట్లే ఈ కొత్త మతం కూడా జర్మన్ భూస్వామ్య వ్యవస్థ సంక్షోభానికి ప్రతిక్రియగా

ఆవిర్భవించింది.

1525 తర్వాత దోపిడీదారులతో చేతులు కలిపిన ప్రొటెస్టెంట్‌వాదం వల్ల తమకు ఒరిగేదేమి ఉండదని దక్షిణ, మధ్య జర్మనీకి చెందిన రైతులు ఒక అభిప్రాయానికి వచ్చారు.

ఫలితంగా దక్షిణ జర్మనీ పట్టణాలపై కాథలిక్ చక్రవర్తితోపాటు ప్రాంతీయ కాథలిక్ రాకుమారులు కొత్త మతాన్ని త్యజించాలని ఒత్తిడిని తీవ్రతరం చేశారు. పట్టణ పాలకవర్గాలు మాత్రం ప్రొటెస్టెంట్ రాకుమారుల రక్షణ కోసం ఎదురు చూశారు. ఈ వ్యవహారంలో వారు ఆయా పాలకుల మధ్య ఉన్న అంతర్గత వైషమ్యాలు, వారసత్వ యుద్ధాలలో కూరుకుపోయారు. ప్రొటెస్టెంట్ కూటమికి 1546లో అసలు పరీక్ష స్మల్కాల్డిక్ యుద్ధం రూపంలో ఎదురైంది. ఆ యుద్ధంలో ప్రొటెస్టెంట్లు చక్రవర్తితో తలపడ్డారు. అంతటి విషమ పరిస్థితిలో కూడా ప్రొటెస్టెంట్ రాకుమారులు చిత్తశుద్ధితో యుద్ధం చేయడానికి సిద్ధం కాలేదు. దూసుకొస్తున్న కాథలిక్ సైన్యాల దయాదాక్షిణ్యాలకు ప్రొటెస్టెంట్ నగరాలను వదిలేశారు. ఈ దశ నుండి ప్రొటెస్టెంట్‌వాదం దక్షిణ ప్రాంత నగరాల్లో క్లిష్టపరిస్థితులను ఎదుర్కొంటూ మనుగడ సాగించింది. చివరకు అది పతనమైంది. పట్టణ మధ్యతరగతి వర్గాలు తమ స్వేచ్ఛను కోల్పోయాయి. ప్రొటెస్టెంట్ వాదానికి మధ్యతరగతి వర్గాల స్వేచ్ఛకు మధ్య ప్రత్యక్ష సంబంధముండేదని దీనిని బట్టి అవగతమవుతుంది.

## ఫ్రాన్స్ మత యుద్ధాలు

ఫ్రాన్స్ సంస్కరణోద్యమ కథ చర్విత చరణమే. జర్మనీలో సంభవించిన పరిణామాలు ఫ్రాన్స్‌లో 30 ఏళ్ల తర్వాత పునరావృతమయ్యాయి. ఆర్థిక సంక్షోభం కారణంగా రైతులు దారిద్ర్యంలో కూరుకుపోయారు. వృత్తిదారులు, వేతన కార్మికులు జీవనోపాధిని కోల్పోయారు. వరుస కరువులు, అంటువ్యాధులు ప్రబలిపోయాయి. ప్లేగు వ్యాధి తరచూ వచ్చేది. 1557లో రాజ్యం దివాళా తీసింది. సామాజిక వర్గాలకు చెందిన ప్రతి వ్యక్తి చర్చికి వ్యతిరేకంగా ఉద్యమించాడు. అప్పటికీ చర్చి ఆస్తులను విస్తృతంగా కలిగి ఉండేది. పాలక వంశాలకు చెందిన కుటుంబాలకు సమాజంపై గట్టి పట్టు ఉండేది. ప్రజలు ఈ పాలక వంశాలపై కూడా విరుచుకుపడ్డారు. ప్రొటెస్టెంట్ వాదం సమాజంలోని అన్ని వర్గాలనూ ఆకర్షించింది. అయితే హెన్రీ హెల్లర్ నిరూపించినట్లు "ఈ ప్రజా ఉద్యమంలో ప్రధానంగా చిన్న తరహా ఉత్పత్తిదారులు, చిరువ్యాపారులు, వృత్తిదారులే క్రియాశీల కార్యకర్తలుగా ఉండేవారు." ఇదే విషయాన్ని 150 ఏళ్ల క్రితం ఫ్రాన్స్‌కు చెందిన గొప్ప నవలా రచయిత బల్జాక్ కూడా ధృవీకరించాడు.

> "మత సంస్కరణ ప్రధానంగా సమాజంలో అట్టడుగున ఉన్న చైతన్యవంతులను ఆకర్షించింది. తమ స్వార్థ ప్రయోజనాల కోసమే కొందరు పాలకులు ఆ ఉద్యమాన్ని బలపరిచారు. అయితే వృత్తిదారులు, వ్యాపారంలో నిమగ్నమైన వారు మత విశ్వాసాలను పూర్తిగా నమ్మారు. వివేకవంతమైన ప్రయోజనాల ఆధారంగానే ఈ వర్గం ప్రజలు కొత్త మత సిద్ధాంతాన్ని, సంబంధిత ఉద్యమాన్ని బలపరిచారు."

ఒక ఫ్రెంచి మధ్యతరగతి కుటుంబానికి చెందిన జీన్ కాల్విన్ రాజ్యహింస నుండి తప్పించుకోవడానికి జెనీవా నగరానికి పారిపోయాడు. అక్కడ లూథర్ సిద్ధాంతం కంటే పట్టణ వర్గాలను మరింత ఆకర్షించగలిగే ప్రాపంచిక దృష్టికోణాన్ని సిద్ధాంతీకరించాడు. చర్చి నైతిక నియంత్రణను తొలుత వ్యతిరేకించిన లూథర్ తర్వాతి కాలంలో పాలకవర్గాల ప్రయోజనాలను పరిరక్షించే విధంగా తన బోధనలను

మలచుకున్నాడు. అందుకు విరుద్ధంగా కాల్విన్ పట్టణ మధ్య తరగతి వర్గాలను బలోపేతం చేసే విధంగా చర్చిపై వారికి నైతిక నియంత్రణ ఉండాలని ప్రబోధించాడు. తన అనుచరులలో తాము దేవుని చేత ఎంపిక చేయబడ్డ మత పరిరక్షకులమన్న భావనను అతడు చొప్పించాడు. ఫలితంగా అతడి అనుచరులు ఇతర పంధీకులకు భిన్నంగా వ్యవహారశైలిని అలవర్చుకున్నారు. తాము వివేకవంతులమని, స్వయం నియంత్రణ కలిగిన వారమని, సాత్విక జీవితం గడిపేవాళ్లమన్న రీతిలో ప్రవర్తించసాగారు. ఇలాంటి వైఖరులు ఆత్మగౌరవం కలిగిన వృత్తిదారులను, వ్యాపార కుటుంబాలను బాగా ఆకర్షించాయి. వీరు పాలక వర్గాల విలాసవంతమైన ప్రపంచానికి దూరంగా ఉండేవారు కాని అదే సమయంలో తమకు దిగువన ఉన్న పేద ప్రజలపట్ల రాగద్వేషాలతో వ్యవహరించేవారు. వారి నుండి ఎప్పటికైనా తమకు ముప్పు తప్పదన్న భావనతో మెలిగేవారు.

హెల్లర్ పేర్కొన్నట్లు :

> "కొందరు పట్టణ ప్రాంత వాసులు ప్రబలిపోతున్న పేదరికాన్ని గమనించగలిగారు. శతాబ్దం క్రితం సాధించిన భౌతిక, సాంస్కృతిక ప్రగతి మరోసారి ప్రమాదంలో పడిందని గ్రహించారు. వారు ఖచ్చితంగానే విశ్లేషించారు. సమాజ సంపదను యుద్ధాలు, విలాసం, వైభోగంపై వెచ్చించే భూస్వామ్య వ్యవస్థే ఈ పరిస్థితికి కారణమని నిందించారు. వ్యవస్థను నియంత్రించే పాలకవర్గాలతోపాటు వ్యవస్థను కూలదోయడానికి ప్రయత్నిస్తున్న వారి నుండి కూడా తమను తాము రక్షించుకోవడానికి ఈ వర్గం ప్రజల తిరుగుబాటు కృషి చేసింది. అందులో భాగంగా శ్రమ, సాత్విక, క్రమశిక్షణాయుతమైన జీవితం అనే సిద్ధాంతాన్ని ఆయుధంగా మలచుకున్నారు."

సామాజిక అంశాలలో కాల్విన్ సాంప్రదాయవాదిగా వ్యవహరించాడు. సామాజిక వ్యవస్థను దేవుడే సృష్టించాడన్న భావన అతడిలో ఉండేది. అయితే మత సంస్కరణలకు అతడిచ్చిన పిలుపు సామాజిక మార్పులు కూడా తప్పనిసరి అన్న అభిప్రాయం కలిగించింది. పట్టణ బూర్జువా వర్గం ప్రగతి బాటలో పయనించాలని ఆ పిలుపు స్పష్టం చేసింది. ఆర్థిక విమోచనమే కాకుండా మతపరమైన విషయాలలో కూడా బూర్జువా వర్గానికి స్పష్టమైన అధికారాలు ఉండాలన్నదే కాల్విన్ వాదన. రాజ్యాన్ని విప్లవాత్మకమైన రీతిలో పునర్వ్యవస్థీకరించాలని కాల్విన్ పిలుపునివ్వలేదు. అలాంటి బృహత్ ప్రణాళికను చేపట్టడానికి పట్టణ మధ్యతరగతి వర్గం చాలా బలహీనంగా ఉండేది. అయితే మౌలిక సంస్కరణలు తీసుకురావలసిన అవసరముందని మాత్రం అతడి పిలుపు స్పష్టం చేసింది. సామాజిక సంక్షోభంలో బూర్జువా వర్గ ప్రయోజనాలను అలాంటి పిలుపు తప్పకుండా పరిరక్షించేది.

కాల్విన్ చూపిన సామాజిక ఉదారత మౌలిక సంస్కరణలను కూడా తీసుకురాలేక పోయింది. 1550 దశకం సందర్భంగా సామాజిక సంక్షోభం తీవ్రతరమైనా కాల్విన్ సిద్ధాంతాలు ఎలాంటి మార్పులను తీసుకురాలేకపోయాయి. చర్చి సంస్థ అనుభవిస్తున్న ప్రత్యేక హక్కులను ఉపసంహరించడానికి పాలకుల్లోని ఒక వర్గం ప్రయత్నాలు మొదలుపెట్టింది. బౌరబాన్, మాంట్ మోరెన్సీ పాలక కుటుంబాలు సింహాసనం కోసం వారసత్వ పోరును తీవ్రతరం చేయగా వారిని మూడవ కుటుంబానికి చెందిన కాథలిక్ గయిస్‌లు అడ్డుకోవడానికి ప్రయత్నించారు. గయిస్ కుటుంబీకులు ఛాందసవాదులుగా వ్యవహరించేవారు.

పాలకవంశాల్లో ఏర్పడిన చీలికను సద్వినియోగం చేసుకొని రైతులను, పట్టణపేదలను వ్యవస్థకు

వ్యతిరేకంగా సమీకరించడానికి మధ్యతరగతి వారికి మంచి అవకాశం ఉండేది. అప్పటికే రైతులు అసంతృప్తితో రగిలిపోయేవారు. తమదైన శైలిలో వారు అసమ్మతిని, చర్చివ్యతిరేక భావాలను ప్రదర్శించేవారు. అయితే కాల్విన్ సలహామేరకు మధ్యతరగతిలోని ఒక మితవాద వర్గం పాలకవంశాల్లోని అసమ్మతివాదులతో చేతులు కలిపింది. పెరిగిపోతున్న తమ దారిద్ర్యానికి నిరసనగా 1550 దశకం మధ్యలో రైతులు మతపరమైన ప్రదర్శనలు చేపట్టినపుడు వారిని పట్టణాల నుండి తరిమివేయడానికి మధ్యతరగతి ప్రజలు తమ శక్తి మేరకు కృషి చేశారు. ఈ ప్రదర్శనల్లో రైతులు దైవదూతలను స్తుతిస్తూ పాటలు పాడేవారు, పాపపరిహార నిమిత్తం తమ శరీరాలను కొరడాలతో రక్తం చిందేవరకు బాదుకునేవారు. రైతుల అమాయకత్వాన్ని, మూఢనమ్మకాలను, సున్నిత మనస్తత్వాన్ని చూసి కాల్విన్ మద్దతుదారులు దిగ్భ్రాంతికి గురయ్యారు. మరోవైపు కాల్విన్ మద్దతుదారుల ఛాందసవాదాన్ని చూసి రైతులు నివ్వెరపోయారు. తమ సంతులు, మంత్రవిద్యలు, పంథీకులను అంటిపెట్టుకొని ఉండిపోయారు. మతవేడుకలు, పండుగలు, నృత్యాలు, మద్యపానం తదితర ఆచారాలను ఎప్పటిలాగే కొనసాగించారు. 1560 దశకంలో ఈ సంక్షోభం మూలంగా రక్తసిక్తమైన మత ఘర్షణలు వరుసగా చోటు చేసుకున్నాయి. పారిస్‌లో బార్థలోమ్యూ దినాన్ని పురస్కరించుకొని ప్రొటెస్టెంట్ సమర్ధకులను ఊచకోత కోశారు. కాల్విన్ మద్దతుదారులు పాలకులపై ఆధార పడడంతో భూస్వామ్య పద్ధతుల్లో సాయుధ పోరాటం చేయాల్సి వచ్చింది. వారి సైన్యాల్లో ఎక్కువగా రాచరిక కుటుంబీకులే ఉండేవారు. ఫలితంగా వారు సామాజిక అంశాలను పూర్తిగా విస్మరించారు. పాత వ్యవస్థ సమర్థకులకు ఇది మంచి అవకాశాన్ని కల్పించింది. వీరు (కాథలిక్‌లు) ప్రొటెస్టెంట్‌ల కంటే రెట్టింపు సంఖ్యలో ఉండేవారు.

అంతర్యుద్ధాల్లో పాల్గొన్న వారికి మౌలిక అంశాలపై ధ్యాసే ఉండేది కాదు. అలాగే చరిత్రకారులు కూడా సామాజిక అంశాలపై దృష్టి సారించలేదు. వారి దృష్టిలో ఈ అంశాలు వర్గపోరాటాన్ని ఏ కోణం నుండి కూడా ప్రతిబింబించలేదు. కాల్వినిస్టు రాకుమారుల ప్రవర్తన కాల్విన్ మద్దతుదారులైన మధ్యతరగతి ప్రజలకు ఏవగింపు కలిగించింది. ముఖ్యంగా ఈ రాకుమారులు డబ్బును బలవంతంగా గుంజుకునేవారు. ప్రత్యర్థులైన కాథలిక్‌ల వలే వారు అనైతికంగా, అనుచితంగా ప్రవర్తించేవారు. మరొవైపు కాల్వినిస్టు మధ్యతరగతి వర్గం పేదల పట్ల ద్వేషభావం ప్రదర్శించేవారు. ఈ పరిస్థితిని తమకు అనుకూలంగా మలచుకున్న కాథలిక్‌లు పేదల సహాయంతో పారిస్‌లో హింసాత్మకమైన ఘర్షణలను సృష్టించారు. చరిత్రలో తరచూ జరిగినట్లే వ్యవస్థ వ్యతిరేక ఉద్యమకారులు పాలకవర్గాల్లోని ఒక సమూహాన్ని సమర్థించడమే "ఆచరణాత్మక రాజకీయాలకు" తార్కాణమని భావించేవారు. ఈ భావన కారణంగా కాల్వినిస్టులు చివరకు ఘోర పరాజయాన్ని చవిచూశారు.

కాల్వినిస్టులు ఎంచుకున్న నాయకుడు నవార్రేకు చెందిన హెన్రీ. ప్రొటెస్టెంట్‌వాదాన్ని త్యజించి ఎట్టకేలకు అతడు సింహాసనాన్ని హస్తగతం చేసుకోగలిగాడు. ప్రొటెస్టెంట్‌లను నగర శివార్లకు పరిమితం చేశారు. శతాబ్దం తర్వాత వారిని దేశం నుండి తరిమివేశారు. జర్మనీలో జరిగినట్లు ఫ్రాన్స్‌లో మధ్యతరగతి పూర్తిగా ఓడిపోలేదు. వాణిజ్యం, పరిశ్రమ రంగాల్లో కొద్ది మేరకు అభివృద్ధి జరిగింది. చురుకైన వ్యాపారులు సంపన్నులయ్యారు. ధనిక వ్యాపారుల్లో కొందరు పాలకవర్గ స్థాయికి చేరుకున్నారు. తమ సంతానాన్ని రాచరిక కుటుంబ సభ్యులతో వివాహం జరిపించారు. అయితే తదుపరి రెండున్నర శతాబ్దాలపాటు వారు అణచివేత, దోపిడీ, దుబారా వ్యయం, పాలకవర్గాల పెత్తనం ఉన్న సమాజంలో జీవించాల్సి వచ్చింది. ఉదారత, నిర్దిష్టత, గౌరవభావం చివరకు పరాజయానికి దారి తీస్తాయని చరిత్ర అనేకసార్లు నిరూపించింది. ఫ్రాన్స్‌లో ప్రొటెస్టెంట్‌వాదం చవి చూసిన అనుభవం కూడా అందులో భాగమే.

మూడవ అధ్యాయం

# కొత్త వ్యవస్థ పురుటి నొప్పులు

కాల్విన్‌వాదం అన్ని చోట్లా పరాజయం పాలు కాలేదు. నగర రాజ్యమైన జెనీవాలో బూర్జువా వర్గ ప్రజలు కాల్విన్‌ను సాదరంగా ఆహ్వానించారు. అనతికాలంలోనే అతడు ఆ నగరంలో ప్రబలమైన రాజకీయ శక్తిగా, ప్రముఖ మేధావిగా అవతరించాడు. సనాతనవాద మత సిద్ధాంతాన్ని ఆ నగరంపై రుద్దాడు. పాత మత వ్యవస్థకు ఈ కొత్త సిద్ధాంతం ఛాందస వాదంలో ఏమాత్రం తీసిపోని విధంగా ఉండేది. 1547లో దైవదూషణ, నాస్తికవాద భావాలు కలిగి ఉన్నాడన్న ఆరోపణపై జాక్స్ గ్రుయెట్‌ను ఉరితీశారు. 1553లో స్పానిష్ కాందిశీకుడైన సర్వెటస్‌ను సజీవ దహనం చేశారు. మతసిద్ధాంతాలకు భిన్నంగా ప్రచారం నిర్వహించినందుకు అతడికి మరణశిక్ష విధించారు. బహిరంగ దూషణ, బహిష్కరణ, కొరడాదెబ్బలు లాంటి శిక్షలను ఆచరణలో పెట్టడం ద్వారా కాల్విన్ తన స్వంత సిద్ధాంతమైన 'కఠిన పరిశ్రమ, క్రమశిక్షణ' ను ప్రజలపై బలవంతంగా రుద్దాడు. వ్యభిచారం, దైవధిక్కారాన్ని చట్టాలు నిషేధించాయి. నిర్బంధ విద్యను అమలు చేశారు. సమాజంలో గౌరవప్రతిష్టలున్న కొందరు మధ్యతరగతి వర్గం వారు ఈ కొత్త వ్యవస్థ పట్ల అసంతృప్తి, చికాకును వ్యక్తం చేశారు. అయితే ఈ వ్యవస్థ ధనార్జనకు అనుకూలమైన పరిస్థితులను సృష్టించింది.

జెనీవా ప్రయోగం ఐరోపాలో ఇతర నగరాలకు స్ఫూర్తినిచ్చింది. స్కాట్లాండ్ లాంటి ప్రాంతంలో కూడా కాల్విన్‌వాదానికి మద్దతు లభించింది. సమాజాన్ని ఎలాగైనా సరే ముందుకు తీసుకువెళ్లాలన్న తాపత్రయం కలిగిన వారు కాల్విన్ సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆ సమయంలో స్కాట్లాండ్ ఆర్థిక వ్యవస్థ ఎంతో వెనుకబడి ఉండేది. జాన్ నాక్స్ అనే బోధకుడు కాథలిక్ మహారాణి మేరీ స్టువార్ట్‌కు వ్యతిరేకంగా పాలకవంశాల్లోని కొందరు అసంతృప్తివాదులను, బలహీనంగా ఉన్న బూర్జువా వర్గాన్ని సమీకరించడంలో సఫలమయ్యాడు. అన్నింటికంటే ప్రధానమైన విషయమేమిటంటే నెదర్లాండ్స్‌లో కాల్విన్‌వాదం సంపన్న పట్టణాలకు చెందిన మధ్యతరగతి ప్రజలకు, స్థానిక రాకుమారులకు స్పానిష్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడానికి ఒక వేదికను అందించింది.

## డచ్ తిరుగుబాటు

15వ శతాబ్దంలో స్పానిష్ సింహాసనం నేటి బెల్జియం, హాలెండ్ దేశాలలో విస్తరించిన ప్రాంతమంతటిని తన నియంత్రణలోకి తెచ్చుకుంది. తొలుత, విదేశీ ఆక్రమణ స్థానిక ప్రజల్లో ఎలాంటి రాగద్వేషాలను కల్గించలేదు. అప్పటికీ ఆధునిక సిద్ధాంతమైన జాతీయవాదం ఇంకా అభివృద్ధి చెందలేదు. 1555 వరకు సామ్రాజ్యాన్ని పాలించిన మహాచక్రవర్తి చార్ల్స్‌వి (ఇతడుఫ్లెమిష్ వంశానికి చెందినవాడు)కు సేవలందిస్తూ బడా భూస్వాములు అభ్యున్నతిని సాధించారు. పట్టణ మధ్యతరగతి ప్రజలు కూడా సంపన్నులయ్యారు. స్పానిష్ ఉన్నిని తమ జౌళి పరిశ్రమల్లో వినియోగిస్తూ, స్పెయిన్ పాలనలో ఉన్న అమెరికా సామ్రాజ్యానికి తయారైన ఉత్పత్తులను ఎగుమతి చేస్తూ లాభాలను గడించారు. వలసవాద దేశాల నుండి బంగారు, వెండి నాణేలు వెల్లువలా వచ్చి పడ్డాయి. స్పానిష్ సామ్రాజ్య ఖజానా నుండి ఈ ధనం దిగువ దేశానికి చెందిన వ్యాపారుల జేబుల్లోకి వచ్చి చేరింది. 15వ శతాబ్దంలో అత్యంత శక్తివంతమైన, సంపన్నమైన కాసిలీ నగరం (స్పెయిన్ సామ్రాజ్యానికి ఇది గుండెకాయలాగా ఉండేది) తర్వాతి కాలంలో తీవ్రమైన ఆర్థిక మాంద్యాన్ని ఎదుర్కొంది. ఈ పరిస్థితి శతాబ్దాల తరబడి కొనసాగింది. మరోవైపు నెదర్లాండ్స్ ఐరోపా ఖండంలోనే అత్యంత క్రియాశీలమైన ఆర్థిక కేంద్రంగా అవతరించింది.

కాథలిక్ మత వ్యవస్థను, ముఖ్యంగా విచారణ ప్రక్రియను, తన స్వంత ప్రయోజనాలను పరిరక్షించుకోవడానికి వినియోగించుకున్న స్పానిష్ సింహాసనం 1490 నుండి తన ప్రాబల్యాన్ని లేదా ఆధిపత్యాన్ని సవాలు చేసే అసమ్మతివాదులను లేదా వ్యతిరేకులను తీవ్రంగా అణచివేసింది. 1550 దశకం మధ్యలో అధికార పగ్గాలను చేపట్టిన రెండవ ఫిలిప్ ఈ ప్రక్రియను మరో అతడుగు ముందుకు తీసుకెళ్ళాడు. ఐరోపాలో దైవధిక్కారాన్ని, ప్రొటెస్టెంట్‌వాదాన్ని రూపుమాపడం తన పవిత్ర కర్తవ్యమన్నట్లు ప్రవర్తించాడు. కాసిలీ నగర ఆర్థిక వ్యవస్థ వెనుకబాటు తనానికి కాథలిక్ భావజాలం ఖచ్చితంగా ఇమడగలదని భావించాడు. ఆ మేరకు కాథలిక్ వాదాన్ని ఆ నగరంపై రుద్దాడు. స్పెయిన్‌లో ఈ చర్యను కాటలోనియా స్వయంప్రతిపత్తిపై దాడిగా, మూరిష్ అల్పసంఖ్యాకుల అణచివేతగా పరిగణించారు. దిగువ దేశాలలో ఈ చర్యను స్థానిక భూస్వాములపై ఎదురుదాడిగా, పట్టణ వర్గాలలో క్రమంగా పెరుగుతున్న ప్రొటెస్టెంట్ మైనారిటీల అణచివేతగా గుర్తించారు. ఆర్థిక సంక్షోభం, పేదరికం తీవ్రతరమవుతున్న ఈ దశలో జనసామాన్యంపై అదనపు పన్నుల భారం ఎక్కువైంది.

1560 దశకం చివరలో తిరుగుబాటు తొలి కెరటం ఉవ్వెత్తున ఎగిసిపడింది. అదే సమయంలో ఫ్రాన్స్ మత యుద్ధాలతో సతమతమవుతూ ఉంది. కాల్వినిజం దక్షిణ ప్రాంత నగరాల నుండి ఉత్తర ప్రాంత నగరాలకు విస్తరించింది. దానితోపాటు వ్యక్తిగత విధ్వంసకాండ కూడా ప్రబలింది. ఫలితంగా మత సూచికలు, చర్చిలు కూల్చివేతకు గురయ్యాయి. స్పెయిన్‌కు చెందిన ఆల్బా డ్యూక్ ఈ తిరుగుబాటును అణచివేశాడు. పదివేల మంది సైనికులు గల

బలగంతో అతడు బ్రసెల్స్ నగరంలో ప్రవేశించి వేలాది మంది తిరుగుబాటుదారులను ఊచకోత కోశాడు. వారిలో ఎగ్మోంట్‌కు చెందిన కాథలిక్ పాలకుడు కూడా ఉన్నాడు. ఇతర భూస్వామ్య దొరల్లాగా అతడు సాయుధ ప్రతిఘటనను వ్యతిరేకించలేకపోయాడు. ఒక దశాబ్దం తర్వాత మరో తిరుగుబాటు వచ్చింది. ఉత్తర ప్రాంతంలో అది విజయవంతమైంది. అక్కడ తిరుగుబాటుకు కొందరు స్థానిక పాలకులు మద్దతునిచ్చారు. వారిలో ముఖ్యుడు ఆరెంజ్ రాకుమారుడు. ఉత్తర భాగంలో తిరుగుబాటు ఒక స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించగలిగింది. ఆ రాజ్యం పేరు 'సమైక్య రాష్ట్రాలు' తర్వాత కాలంలో అది డచ్ రిపబ్లిక్‌గా ప్రసిద్ధి పొందింది. ఆ రాజ్యంలోని పట్టణాలు, వాణిజ్యం అనూహ్యంగా విస్తరించి సంపన్నమయ్యాయి. సుమారు వందేళ్లకుపైగా ఆ రాజ్యం ఐరోపాలోనే అత్యంత అభివృద్ధి చెందిన ప్రాంతంగా వెలుగొందింది. ఈస్ట్ ఇండీస్ వలస కేంద్రాలను పోర్చుగల్ నుండి స్వాధీనం చేసుకుంది. చివరకు పోర్చుగల్‌కు బ్రెజిల్‌పై ఉన్న నియంత్రణకు కూడా ముప్పుగా పరిణమించింది. అందుకు భిన్నంగా దక్షిణ ప్రాంతంలోని స్థానిక పాలకులు పోరుకు స్వస్తి పలికారు. స్పానిష్ సైన్యాలు పట్టణాలను మరలా కైవసం చేసుకునేందుకు అవకాశం కల్పించారు. ఘెంట్, బ్రూజెస్, ఆంట్వెర్ప్ లాంటి ప్రాంతాల్లో ఆర్థిక మాంద్యం ఏర్పడింది. అంతకుముందు 300 ఏళ్లపాటు ఈ నగరాలు ఎంతో సంపన్నంగా ఉండేవి. ఆర్థిక మాంద్యం దశాబ్దాల తరబడి కొనసాగింది.

## 30 ఏళ్ల యుద్ధం

1609 సంవత్సరంలో 12 ఏళ్ల నిర్యుద్ధ సంధి అమల్లోకి వచ్చిన తర్వాత నెదర్లాండ్స్, స్పెయిన్‌ల మధ్య పోరు ఆగిపోయింది. అయితే నిర్యుద్ధ సంధి కాలం పూర్తి కాగానే మరో మహా సంగ్రామం (మతపరమైన) చెలరేగింది. ఈశాన్య ప్రాంతంలో కొన్ని వందల మైళ్ల దూరాన ఈ సాయుధ పోరాటం మొదలైంది. రైన్‌లోయ, బాల్టిక్ ప్రాంతం మధ్య విస్తరించిన భూభాగంలో 30 ఏళ్లపాటు ఈ యుద్ధం కొనసాగింది. ప్రాణ, ఆస్తి నష్టం భారీ ఎత్తున సంభవించాయి. జర్మనీ జనాభా మూడో వంతు పడిపోయింది.

ఈ యుద్ధం గురించి నేడు అధ్యయనం చేసేవారు ఎవరైనా సరే దాని బహులక్షణాలను చూసి గందరగోళానికి గురి కాకతప్పదు. సంకీర్ణ కూటములు ఏర్పడ్డాయి. విచ్ఛిన్నమయ్యాయి. ఒక రోజు ఐరోపాలోని ఒక మూలన యుద్ధం జరిగితే మరుసటి రోజు వందలాది మైళ్ల దూరంలో పోరాటం జరిగేది. ఒక అంశం పరిష్కారమయ్యే లోపే మరో వివాదం తలెత్తేది. సైన్యాలకు సైన్యాలు తమ విధేయతను మార్చుకునేవి. మతపరమైన విలువల పరిరక్షణకు తాము ఆత్మబలిదానానికైనా సిద్ధమే అన్న భావనతో వేలాది మంది సైనికులు వ్యవహరించేవారు. అయినప్పటికీ కొందరు ప్రొటెస్టెంట్ రాకుమారులు ఒక దశలో కాథలిక్ చక్రవర్తిని సమర్థించారు. మరో సందర్భంలో పోప్, కాథలిక్ ఫ్రాన్స్ పాలకులు ప్రొటెస్టెంట్ అయిన స్వీడన్ రాజును సమర్థించారు. యుద్ధంలో సమర్థవంతంగా వ్యవహరించిన ఒక సైనికాధికారిని అతడి స్వంత అనుచరులే తన స్వంత పాలకుడి ప్రోద్బలంతో హత్య చేశారు. యుద్ధం కొనసాగినంత కాలం

కిరాయి సైన్యాల ఆగడాలే నిత్యకృత్యంగా దర్శనమిచ్చేవి. దోపిడీకి గురైన గ్రామాలు, ఆకలితో అలమటిస్తున్న రైతులు, తగులబడిపోతున్న పట్టణాలు... ఈ దృశ్యాలను బెర్టాల్ట్ బ్రెచ్ ప్రసిద్ధిగాంచిన తన "మదర్ కరేజ్" అనే యుద్ధ వ్యతిరేక నాటకంలో చాలా చక్కగా చిత్రీకరించాడు. చరిత్రలో చరిత్రకారుల మధ్య తీవ్ర వివాదం సృష్టించిన యుద్ధం మరొకటి లేదని చెప్పడంలో ఎలాంటి ఆశ్చర్యం లేదు. అయినప్పటికీ ఈ ఘటనా క్రమంలో ఒక నిర్దిష్టమైన తీరును వెలికి తీయడం సాధ్యమే.

1610 దశకంలో కూడా స్పెయిన్ ఐరోపాలోనే ప్రబలమైన శక్తిగా ఉండేది. హాబ్స్‌బర్గ్ వంశంలోని ఒక కుటుంబానికి చెందిన స్పెయిన్ పాలకులు తమ సామ్రాజ్య పరిధిలో ఉన్న అన్ని ప్రాంతాలపై పట్టును సుస్థిరం చేసుకోవడానికి కాథలిక్ సిద్ధాంతాన్ని కఠినంగా అమలు చేయాలనే ప్రయత్నించారు. కేవలం కాసిలీ నగరంలోనే కాకుండా ఇబేరియన్ రాజ్యాలైన అరేగాన్ (ముఖ్యంగా కాటలోనియా), పోర్చుగల్ (ఈ ప్రాంతాన్ని స్పెయిన్ పాలకులు స్వాధీనం చేసుకోగలిగారు), అమెరికా (చిలీలో ఇండియన్లు పెద్ద ఎత్తున తిరుగుబాటు చేయడంతో ఈ ప్రాంతాల్లో స్వల్పకాలంపాటు స్పానిష్ పాలకులు ఆత్మరక్షణలో పడ్డారు)లో సైతం తమ పట్టును నిలుపుకోవడానికి కాథలిక్ మతవిధానాన్ని రాజ్య సిద్ధాంతంగా అమలు చేయడానికి కృషి చేశారు. ఇటలీలోని చాలా భాగాలు (మిలాన్, నేపుల్స్‌తో సహా), దక్షిణ నెదర్లాండ్స్‌పై కూడా స్పెయిన్‌కు ఆధిపత్యం ఉండేది. అదే సమయంలో ఉత్తర నెదర్లాండ్స్‌ను కూడా తమ నియంత్రణలోకి మళ్లీ తెచ్చుకోవడానికి యుద్ధ సన్నాహాలు ప్రారంభించారు.

హాబ్స్‌బర్గ్ కుటుంబంలోని మరో శాఖకు చెందిన జర్మనీ దేశపు పవిత్ర రోమను సామ్రాజ్య చక్రవర్తులు స్పెయిన్ పాలకులతో చాలా సన్నిహితంగా మెలిగేవారు. తమ సామ్రాజ్యాన్ని అట్లాంటిక్ తీరం నుండి ఒట్టోమన్ తుర్కుల సరిహద్దుల వరకు విస్తరించి ఉన్న ఐరోపా అంతటా వ్యాపింపచేసి ఒక కేంద్రీకృత రాచరిక వ్యవస్థను ఏర్పాటు చేయాలని జర్మన్ చక్రవర్తులు కలలు కనేవారు. అయితే ప్రస్తుత దశలో సామ్రాజ్యంలోని చాలా భాగాన్ని శక్తిమంతులైన, స్వతంత్రులైన రాకుమారులు పాలించేవారు.చక్రవర్తుల ప్రాబల్యం కేవలం వారి స్వంత ప్రాంతమైన ఆస్ట్రియాకే పరిమితమై ఉండేది. ఆస్ట్రియాలో సైతం బడా భూస్వాముల పెత్తనం నడిచేది.ఆస్ట్రియా అంతా జాగీర్లుగా విభజించబడి ఉండేది. వాటిపై భూస్వాములు, యుద్ధవీరులు, పట్టణ పాలకవర్గాలకు యాజమాన్యం ఉండేది. రాజ్య విధానాల రూపకల్పనలో తమకూ భాగస్వామ్యం ఉండాలని ఈ జాగీర్లు వాదించేవి. ఆస్ట్రియా భూభాగంలో అత్యంత విశాలమైన బొహేమియా రాజ్యంలో ప్రజలు పాలకుని ఎంపికలో తమకు పూర్తి స్వాతంత్ర్యం కావాలని కోరేవారు. పాలకుడిగా హాబ్స్‌బర్గ్ కుటుంబీకుడే ఉండాల్సిన అవసరం లేదని గట్టిగా వాదించేవారు. సామ్రాజ్య ప్రాబల్యానికి ఎదురవుతున్న ముప్పును, ప్రతిఘటనను అణచివేయడానికి స్పానిష్ తరహా మత సిద్ధాంతాన్ని జర్మన్ చక్రవర్తులు ఒక ఆయుధంగా వాడుకుంటున్నారన్న భావనను ఆస్థాన ప్రముఖుల్లోని ఒక వర్గం పెంచుకుంది.

1560 దశకంలో ఉధృతమైన ప్రతీఘాత సంస్కరణోద్యమంలో కాథలిక్ సిద్ధాంతం, సంఘటనం మరింత బలోపేతమయ్యాయి. చర్చికి చెందిన ట్రెంట్ కౌన్సిల్ చివరకు ఒక ఉమ్మడి కాథలిక్ మతసిద్ధాంతాన్ని రూపొందించింది. కాథలిక్ ప్రబోధకులందరూ దానిని

ఖచ్చితంగా అనుసరించాల్సి ఉంటుంది. జెస్యూట్‌లు అనే ఒక కొత్త మత వ్యవస్థ ఆవిర్భవించింది. క్రమశిక్షణ, మతపరమైన కాంక్ష, మేధోసంపద ఆధారంగా అది ఏర్పడింది. గతంలో చర్చిని భ్రష్టు పట్టించిన సోమరితనం, అలసత్వం, అవినీతి తదితర అవలక్షణాలకు భిన్నంగా జెస్యూట్‌ల వర్గం కొత్త ప్రవర్తనా నియమావళిని రూపొందించుకుంది. ప్రొటెస్టెంట్‌వాద వ్యతిరేకపోరుకు జెస్యూట్‌లు నాయకత్వం వహించారు. ముఖ్యంగా ఐరోపా ఉన్నత వర్గాలలో వారి ప్రభావం గణనీయంగా పెరిగింది. పాలకులతో ప్రతి నగరంలోనూ (తనకు ప్రాబల్యమున్న) కూటమిని ఏర్పాటు చేయగలిగింది.

ప్రతీఘాత సంస్కరణోద్యమ కాథలిక్‌వాదం స్పెయిన్ పాలకుల అవసరాలకు ఖచ్చితంగా సరిపోయింది. ఐరోపా పాలకవర్గాన్ని లొంగదీసుకోవడం ద్వారా జెస్యూట్‌లు స్పానిష్ సైనిక శక్తికి సైద్ధాంతిక బలాన్ని కూడా జోడించారు. ఈ ప్రక్రియ ఒక్కసారి ఆచరణలోకి వచ్చిన తర్వాత దానికో స్వంత సిద్ధాంతం ఏర్పడింది. 16వ శతాబ్దం తొలియార్థంలో పోప్ చూపిన అలసత్వం కారణంగా చర్చి వ్యవస్థ అవినీతి ఊబిలో కూరుకుపోయింది. పునరుజ్జీవ ఆలోచనలు, కళలు వికసించడానికి తోడ్పడింది. జెస్యూట్‌ల తొలితరం పునరుజ్జీవ ఉద్యమ సాంప్రదాయాలను వారసత్వంగా పుణికి పుచ్చుకుంది. విద్యారంగంలో క్రియాశీల పాత్ర, దాతృత్వంపై ప్రత్యేక దృష్టిని సారించడం ద్వారా జెస్యూట్‌లు ఎనలేని గౌరవాన్ని సంపాదించుకున్నారు. అయినప్పటికీ ప్రతీఘాత సంస్కరణోద్యమం, ముఖ్యంగా జెస్యూట్‌లు, దైవధిక్కార నేరానికే కాకుండా విమర్శనాత్మకమైన ఆలోచనా సరళి కారణంగా అణచివేతను ఎదుర్కొన్నారు. గొప్ప మత విద్వాంసుడైన ఎరాస్మస్ రచనలన్నింటినీ పోప్ కార్యాలయం నిషేధించింది. వాడుక భాషల్లోకి బైబిల్‌ను అనువదించడాన్ని కూడా నిషేధించారు. ట్రెంట్ కౌన్సిల్‌లో కీలక పాత్ర పోషించిన టొలేడో ఆర్చ్‌బిషప్‌ను విచారణ పీఠం వద్ద దైవ దూషణ నేరంపై సజీవ దహనం చేశారు. అనతి కాలంలోనే జెస్యూట్‌లు తమ నైతిక స్థాయిని కోల్పోయారు. విముక్తికి ఎలాంటి మార్గాలనైనా అనుసరించవచ్చునని వాదించే పాలకులకు వత్తాసు పలకడంతో వారు తమ పరువును పోగొట్టుకున్నారు. విముక్తి మార్గాలు తర్కరహితమైనవి అయినా అవి లక్ష్యాన్ని సాధించి పెడితే చాలుననే భావనను జెస్యూట్‌లు పెంచుకున్నారు. 'జీసస్ సమాజం' కొత్త పుంతలను తొక్కింది. అనాలోచితమైన, ఏకఛత్రాధిపత్యం కలిగిన ఈ సమాజం వ్యక్తిత్వాన్ని (అనుచరుల) తన సంఘటనానికి దాసోహం చేసి ఐరోపాలోని పలు ప్రాంతాల్లో పాతుకుపోయింది.

ప్రతీఘాత సంస్కరణోద్యమ కాథలిక్ వాదానికి, హాబ్స్‌బర్గ్ వంశానికి చెందిన రెండు కుటుంబాలకు ఒక ఉమ్మడి శత్రువు ఉండేది. అదే విముక్తి పథంలో పయనిస్తున్న హాబ్స్‌బర్గ్ వ్యతిరేక ప్రొటెస్టెంట్ ప్రాంతమైన ఉత్తర నెదర్లాండ్స్. చెక్ చరిత్రకారుడు పోలీసెంకి చెప్పినట్లు "ఐరోపా అంతర్గతంగా విచ్ఛిన్నమైంది.... విముక్తి అయిన నెదర్లాండ్స్ ఒకవైపు, స్పానియార్డులు మరోవైపు ప్రత్యర్థి శిబిరాలుగా చీలిపోయి సాయుధ శక్తులను సమీకరించడం మొదలుపెట్టాయి. ఫలితంగా ఐరోపా ఖండమంతా అతలాకుతలమైంది."

అయినప్పటికీ నెదర్లాండ్స్ సరిహద్దుల వద్ద యుద్ధం ప్రారంభం కాలేదు. సుమారు 400 మైళ్ల దూరంలో ఉన్న బొహేమియాలో సైనిక ఘర్షణ రాజుకుంది. నేటి చెక్

గణరాజ్యం,సిలేషియాలలో విస్తరించి ఉన్న బొహేమియా రాజ్యం పవిత్ర రోమన్ సామ్రాజ్యానికి అత్యంత కీలకమైన ప్రాంతంగా ఉండేది. సామ్రాజ్యంలో బొహేమియా ఒక్కటే విశాలమైన రాజ్యం. ఇక్కడే సామ్రాజ్య అధికార కేంద్రాలు చాలా వరకు పని చేసేవి. 16వ శతాబ్దం ద్వితీయార్ధంలో సామ్రాజ్య నిర్వహణ చాలా వరకు బొహేమియా రాజ్యం నుండే జరిగేది. ఈ కారణంగానే స్పెయిన్ నుండి విస్తరించిన ప్రతీఘాత సంస్కరణోద్యమం ఈ సామ్రాజ్యంపై ప్రతికూల ప్రభావం చూపింది. ఈ ప్రతీఘాత ఉద్యమం పాలకుల ప్రాబల్యాన్ని సమర్థిస్తూ, అసమ్మతిని ఏ రూపంలోనూ సహించేది కాదు. అందుకు భిన్నంగా బొహేమియా రాజ్యం రాచరిక కుటుంబాలకు చెందని పాలకుల ఆధిపత్యానికి ప్రతిబింబంగా, వివిధ మతాల సహజీవనానికి ప్రతీకగా ఉండేది. సుమారు 170 ఏళ్ల క్రితం జరిగిన హుస్సీ యుద్ధాల తర్వాత ఈ ప్రాంతంలో వివిధ మతాలు, సంస్కృతులకు చెందిన వారు ఇక్కడ స్థిరపడ్డారు. కాథలిక్‌లతోపాటు లూథర్‌వాదులు, కాల్విన్‌వాదులు, మితవాదులు అందరూ బొహేమియాలో సహజీవనం చేసేవారు. ఈ సామాజిక కూర్పు, రాజ్య స్వభావం ప్రతీఘాత సంస్కరణోద్యమ సిద్ధాంతానికి తీవ్రమైన ముప్పుగా పరిణమించింది. కేంద్రీకృత జర్మన్ సామ్రాజ్య ఏర్పాటుకు జాగీర్ల ఆధిపత్యం సవాలు విసిరినట్లే ప్రతీఘాత సంస్కరణోద్యమానికి బొహేమియా రాజ్యం పెద్ద అడ్డంకిగా నిలిచింది. స్పెయిన్ లాగా తాము కూడా ఒక ప్రబలమైన, కేంద్రీకృత సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని జర్మనీ చక్రవర్తులు కలలు కనేవారు.

యుద్ధం చెలరేగడానికి ప్రధాన కారణం బొహేమియా రాజ్యంలో ఉన్న మత స్వాతంత్ర్యమే. ఆ స్వాతంత్ర్యాన్ని హరించివేయడానికే యుద్ధాన్ని ప్రకటించారు. సామ్రాజ్య పాలనాధికారులు ప్రొటెస్టెంట్ చర్చిలను కూల్చివేయడం మొదలుపెట్టారు. ప్రముఖ ప్రొటెస్టెంట్‌వాదులను నిర్బంధించారు. మత సాహిత్యాన్ని నిషేధించారు. ప్రభుత్వ ఉద్యోగాల్లో కాథలిక్‌లు కాని వారిపై (వీరు జనాభాలో 90% ఉండేవారు) నిషేధం విధించారు. ప్రొటెస్టెంట్ జాగీర్దార్ల ప్రతినిధులు ఫిర్యాదు చేసినపుడు చక్రవర్తి అన్ని రకాల నిరసన ప్రదర్శనలను నిషేధించాడు. జాగీరు ప్రాంతంలో బహిరంగ సభలను నిర్వహించడం చట్టవిరుద్ధమని ప్రకటించాడు. జాగీరు అధిపతులు ఆగ్రహంతో ఊగిపోయారు. తీవ్ర ప్రతిఘటనను లేవదీశారు. 1618లో ప్రాగ్ సమావేశం ఒక ప్రకటనను విడుదల చేసింది. సామ్రాజ్యానికి వ్యతిరేకంగా ఉద్యమాన్ని తీవ్రతరం చేయాలని ప్రొటెస్టెంట్లు (భూస్వాములు, స్థానిక పాలకులు) పిలుపునిచ్చారు. ప్రాగ్ సమావేశ మందిరం నుండి సామ్రాజ్య అధికారులను (60 మీటర్ల ఎత్తు నుండి) కిందికి విసిరివేశారు. హాబ్స్‌బర్గ్ కుటుంబానికి చెందిన ఫెర్దినాండ్‌ను తప్పించి జర్మనీకి చెందిన ప్రొటెస్టెంట్ రాకుమారుడు ఫ్రెడరిక్ (పలాటినేట్)ను బొహేమియా రాజుగా పట్టాభిషేకం చేశారు.

ఉత్తర నెదర్లాండ్స్ స్వాధీనానికి బొహేమియా జాగీర్లతో ఘర్షణను హాబ్స్‌బర్గ్ వంశం తొలిమెట్టుగా పరిగణించింది. అయితే ఈ మహా సంఘర్షణకు మరో పార్శ్వం కూడా ఉండేది. పాత భూస్వామ్య వ్యవస్థను సమూలంగా సంస్కరిస్తున్న క్యాపిటలిజం, సంబంధిత మార్పులను ఐరోపా అంతటా విభిన్న పంథాల్లో ప్రతిస్పందించారు. ఈ ప్రతిస్పందన ఎలా ఉండాలనే

విషయమై పాలకులు, సంస్కరణవాదులు ఘర్షణపడ్డారు. ఈ ఘర్షణలు ఆయా రాజ్యాలు, ఆయా మత విధానాల మధ్య సాయుధ పోరాటాలుగా రూపాంతరం చెందాయి.

అయితే ఈ పరిణామాలు బొహేమియా రాజ్యం ప్రాథమికంగా క్యాపిటలిజాన్ని సమర్థించిందని కాని, బూర్జువా వర్గం భూస్వామ్య వ్యవస్థను వ్యతిరేకించిందని కాని ఏ విధంగానూ నిర్ధారించవు. బొహేమియా జాగీర్లు సమాజంలోని మూడు శ్రేణులను ప్రతిబింబిస్తాయి. అందులో వ్యాపారులే కాకుండా (వీరిని మధ్యతరగతిగా పరిగణిస్తారు) భూస్వామ్య వర్గంలోని బడా భూస్వాములు, యుద్ధవీరులు కూడా ఉండేవారు. వ్యాపార ప్రతినిధులంతా బూర్జువా వర్గానికి చెందిన వారు కాదు. ఎందుకంటే వారిలో కొందరికి వ్యవసాయ భూములు కూడా ఉండేవి. భూస్వామ్య పద్ధతుల్లో వారు ఆ భూములను నిర్వహించేవారు. అయితే పోలీసెంకి నిరూపించినట్లు బొహేమియా ప్రాంతాల్లో గ్రామీణ జీవనానికి ఉన్న భూస్వామ్య స్వభావాన్ని హరించివేసే విధంగా మార్పులు సంభవించాయి. చాలా మంది భూ యజమానులు, దొరలు, వ్యాపారులు కౌలుదారీ రైతుల స్థానంలో కౌలును నగదు రూపంలో వసూలు చేయడం ప్రారంభించారు. ఈ కౌలు మొత్తాన్ని నిర్దిష్టంగా నిర్ధారించారు. వాణిజ్య పంటల సాగును ప్రోత్సహించారు. చిన్న పట్టణాల విస్తరణకు నిధులను సమకూర్చారు. వృత్తిదారులు తమ స్వంత భూముల్లో సరుకులను ఉత్పత్తి చేసేలా ఏర్పాట్లు చేశారు. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో ఉత్పాదకతను పెంచడానికి కొత్త మార్గాలను అన్వేషించేలా రైతులు, వృత్తిదారులకు ప్రోత్సాహకాలను అందజేశారు. ఈ ప్రక్రియలో వేతనకార్మిక వ్యవస్థ అనూహ్యంగా విస్తరించింది. రైతులు భూస్వాములకు ఉచితంగా అందించాల్సిన శ్రమ సంవత్సరంలో ఒక్క రోజుకే పరిమితమైంది. అయితే మొత్తమ్మీద బొహేమియా అంతటా భూస్వామ్య వ్యవస్థ పూర్తిగా అంతరించలేదు. అదే సమయంలో భూస్వామ్య వ్యవస్థ క్యాపిటలిస్టు ఉత్పత్తి విధానాలతో సయోధ్య కుదుర్చుకుంది.

పోలీసెంకి పేర్కొన్నట్లు "భూస్వామ్య వ్యవస్థలోని వ్యక్తిగత, వృత్తిపరమైన బాధ్యతలను (రైతులు, వృత్తిదారుల శ్రమ) అనేక రకాల ఒత్తిళ్లు పటాపంచలు చేయడానికి కంకణం కట్టుకున్నాయి. భూస్వాముల కబంధ హస్తాల నుండి ఉత్పత్తిని విముక్తి చేయడానికి వివిధ రకాల కొత్త పద్ధతులు తెరపైకి వచ్చాయి." ఫలితంగా బొహేమియా ఆర్థికంగా క్రియాశీల శక్తిగా మారింది. కనీసం 1590 దశకం వరకూ ఆ రాజ్యం ఏ విధంగానూ నష్టపోలేదు. అప్పటికే పొరుగున ఉన్న జర్మన్ భూభాగాల్లో ఆర్థిక మాంద్యం, రైతుల దారిద్ర్యం తీవ్ర స్థాయిలో ఉండేవి.

జాగీర్ల పాలనా వ్యవస్థ ఆర్థికపరమైన మార్పులకు కొన్ని నిర్దిష్టమైన స్వరూపాలను కలిగి ఉండేది. ఈ వ్యవస్థ వివిధ వర్గాల ప్రయోజనాలను, పరమత సహనాన్ని గౌరవించేది. ఆర్థిక సంస్కరణలను శాంతియుతంగా, నెమ్మదిగా ఆచరణలో పెట్టడం ద్వారా బొహేమియా సమాజం అభ్యున్నతి వైపు కదిలింది. ఇలాంటి వ్యవస్థను పరిరక్షించడం ఎంతైనా అవసరమని రాజ్యంలో మూడు ప్రధాన జాగీర్ల అధిపతులు గుర్తించగలిగారు. వ్యవస్థ తమకు లాభాలను

ఆర్జించిపెడుతోందని, అలాగే శాంతియుతమైన జీవితం గడిపేందుకు అవకాశం కల్పిస్తోందని వారు గ్రహించారు. చివరకు కొందరు బడాభూస్వాములు కూడా తిరోగమన శక్తులను వ్యతిరేకించడం మొదలుపెట్టారు. ఈ శక్తులు ఐరోపా ఖండాన్ని ప్రాచీన భూస్వామ్య వ్యవస్థ వైపు మళ్లించడాన్ని తమ లక్ష్యంగా పెట్టుకున్నాయి.

అయితే కథ అంతటితో ముగియలేదు. యుద్ధం కొనసాగినంత కాలం సంభవించిన పరిణామాలు అందుకు నిదర్శనం. కొందరు బడా భూస్వాములు సామ్రాజ్యం పక్షాన చేరారు. ప్రతీఘాత సంస్కరణోద్యమానికి నాయకత్వం వహించారు. ఇది యుద్ధానికి ముందు జరిగిన పరిణామం. జెస్యూట్‌లలో చేరే వారి సంఖ్య కూడా పెరిగింది. బొహేమియా వైఖరిని సమర్థించిన కొందరు పాలకులు కూడా తమ వర్గ ప్రయోజనాల మేరకే యుద్ధ వ్యూహాన్ని రచించారు. ఫలితంగా వ్యాపారులలో అసంతృప్తి జ్వాలలు రేగి యుద్ధ సన్నాహాలు బలహీనమయ్యాయి. ప్రొటెస్టెంట్ రాజు ఆస్థానంలోని పరిశీలకులు ఫ్రెడరిక్, అతడి సమీప అనుచరులు రైతులపట్ల చూపిన నిర్లక్ష్యాన్ని క్రూరత్వాన్ని చూసి నివ్వెరపోయారు. పాలకుల్లో ఆస్ట్రియా వాసి అయిన షెర్నెంచి ఒక్కడే కౌలు రైతుల పక్షాన గళం విప్పారు. "కౌలు రైతులను విముక్తి చేసి కౌలుదారీ వ్యవస్థను రద్దు చేస్తే సాధారణ ప్రజలు తమ దేశం పక్షాన పోరాడేందుకు సిద్ధమవుతారు." అయితే అతడి వాదనను పాలకులు తోసిపుచ్చారు.

సామ్రాజ్య రాజధాని అయిన వియన్నాపై బొహేమియా సైన్యాలు రెండుసార్లు దండెత్తినా ప్రతిసారీ అవి వెనక్కు నెట్టివేయబడ్డాయి. అదే సమయంలో శత్రు సైన్యాలు బొహేమియా భూభాగాలలో ఎలాంటి ప్రతిఘటనను ఎదుర్కోకుండా ముందుకు చొచ్చుకెళ్లాయి. చివరకు 1620లో వైట్ మౌంటెయిన్ యుద్ధంలో బొహేమియా సైన్యాలు ఘోర పరాజయం పొందిన తర్వాత ప్రొటెస్టెంట్ రాజు, భూస్వామ్య సైనికాధికారులు దేశం విడిచి పారిపోయారు.

ప్రాగ్‌లో తిష్టవేసి ప్రతిఘటనను మరలా తీవ్రతరం చేయడానికి ప్రయత్నించే బదులు బొహేమియా పాలకులు పలాయనం చిత్తగించారు. సామ్రాజ్య సైన్యాలను తుదముట్టించడానికి బొహేమియా జాగీర్లకు ఎలాంటి వనరులు కొరత ఉండేది కాదు. అయితే పాలకుల వర్గ ప్రయోజనాలు అలాంటి వనరులను వినియోగించడానికి నిరాకరించడంవల్లే బొహేమియా యుద్ధంలో ఓడిపోయింది.

తమకు రక్షణగా ఐరోపాలోని ఇతర ప్రొటెస్టెంట్ పాలకులు సైనిక బలగాలను సమకూర్చగలరన్న నమ్మకంతో బొహేమియా నాయకులు స్థానిక వనరులను నిర్లక్ష్యం చేశారు. అయితే వారి అంచనాలు పూర్తిగా తారుమారై తీవ్ర పరాభవానికి గురయ్యారు. ఎలాంటి సహాయం అందక పోవడంతో నిరాశానిస్పృహలకు లోనయ్యారు. వైట్ మౌంటెయిన్ యుద్ధం ప్రారంభం కాక ముందే ఉమ్మడి రాష్ట్రాలకు చెందిన ప్రొటెస్టెంట్ రాకుమారులు తమ సైన్యాలను ఉపసంహరించుకున్నారు. డచ్, ఇంగ్లాండ్ ప్రభుత్వాలు స్పెయిన్ సామ్రాజ్యంతో శతృత్వాన్ని పెంచుకోవడానికి విముఖత వ్యక్తం చేశాయి. ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే బొహేమియా రాజు ఫ్రెడరిక్ ఇంగ్లాండ్ పాలకుడు జేమ్స్-1 కూతురిని వివాహమాడాడు. వాణిజ్య శక్తులుగా ఎదుగుతున్న పై రెండు రాజ్యాలు మతపరమైన విశ్వాసాలకు కట్టుబడి

ఉండడం కంటే వాణిజ్య ప్రయోజనాలకే ప్రాధాన్యతనిచ్చాయి. వాణిజ్యాన్ని విస్తరించడానికి అవసరమైతే యుద్ధం కూడా చేసేవి. బొహేమియా యుద్ధానికి దూరంగా ఉన్నంత మాత్రాన జర్మన్ ప్రొటెస్టెంట్ రాకుమారులు కాని డచ్ పాలకులు కాని యుద్ధ పర్యవసానాల నుండి తప్పించుకోలేకపోయారు. విజయగర్వంతో ఉప్పొంగిపోయిన స్పానిష్ పాలకులు పలాటినేట్ భూభాగాలను కూడా స్వాధీనం చేసుకున్నారు. వారి తదుపరి లక్ష్యమైన నెదర్లాండ్స్‌కు, స్పెయిన్ సామ్రాజ్య సరిహద్దులకు మధ్య ఈ భూభాగాలు విస్తరించి ఉండేవి.

స్పెయిన్ వ్యూహాత్మక లక్ష్యాన్ని వమ్ము చేసేందుకు డచ్, ఇంగ్లాండ్ రాజ్యాలు తమంతకు తాము చర్యలు తీసుకున్నాయి. పలాటినేట్‌లో పోరాడేందుకు వనరులను, సైనికులను సమకూర్చిపెట్టాయి. ఈ పరిణామం ఐరోపాలో సైనిక సమతుల్యాన్ని దెబ్బతీసింది. జర్మన్ రాకుమారులు, ఫ్రాన్స్, స్వీడన్ రాచరిక ప్రభువులిద్దరూ తీవ్ర ముప్పును ఎదుర్కొన్నారు. ఈ కారణంగా 1630 దశకం చివరికల్లా కాథలిక్ ఫ్రాన్స్, లూథర్‌వాద స్వీడన్ కాల్వినిస్టు అయిన హాలెండ్‌కు మిత్రపక్షాలుగా అవతరించాయి. వీరికి పోప్ అండ లభించింది. ఇటలీలో స్పెయిన్ ప్రాబల్యం విస్తరిస్తుండడంతో భవిష్యత్‌లో పోప్ అధికారానికి ముప్పు వాటిల్లగలదన్న ఆందోళనతో చర్చి వ్యవస్థ ఈ కూటమికి మద్దతు పలికింది.

ఒక దశలో సామ్రాజ్యం విజయానికి చేరువలో ఉన్నట్లు కనిపించింది. సామ్రాజ్య సైన్యాలకు బొహేమియా ప్రాంతానికి చెందిన వాలెంస్టైన్ అనే భూస్వామి నాయకత్వం వహించాడు. ఇతడు కాథలిక్ మతాన్ని స్వీకరించాడు. తమకు నమ్మకద్రోహం చేసినందుకు వాలెంస్టైన్‌ను కేవలం బొహేమియా ప్రొటెస్టెంట్లు మాత్రమే ద్వేషించలేదు. జర్మనీకి చెందిన అనేక మంది కాథలిక్ రాకుమారులు కూడా అతడిపై కక్ష పెంచుకున్నారు. రాకుమారుల స్వతంత్ర ప్రాబల్యాన్ని హరించి వేసే విధంగా సామ్రాజ్య విస్తరణకు పూనుకోవడంవల్లే వాలెంస్టైన్ వారి ఆగ్రహానికి గురయ్యాడు. అలాగే సామ్రాజ్యాన్నంతటినీ కాథలిక్ వాదం వైపు నడిపించాలని ప్రతిపాదించిన సిద్ధాంతకర్తలను కూడా అతడు దూరం చేసుకున్నాడు. సుమారు 200 ఏళ్ల క్రితం నాటి సామాజిక పరిస్థితులను పునరుద్ధరించడానికి వాలెంస్టైన్ ఏ మాత్రం అంగీకరించకపోవడంతో కాథలిక్ మత సిద్ధాంతకర్తలు అతడిపై ద్వేషాన్ని పెంచుకున్నారు.

భూస్వామిగా తాను బొహేమియాలో విస్తరించుకున్న జాగీర్లను పకడ్బందీగా నడపడంలో అపారమైన అనుభవం కలిగిన వాలెంస్టైన్ ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేసేందుకు క్రియాశీల సంస్కరణలు తీసుకురావలసిన అవసరముందని గ్రహించాడు. ఆర్థిక సంస్కరణలతోపాటు సమాజంలో పరమత సహనం అన్న భావనను కొంత వరకైనా కలిగించాలని అతడు భావించాడు. మితవాదుల గొంతెమ్మ కోర్కెలను అతడు ప్రతిఘటించినా చిత్తశుద్ధితో వ్యవహరించలేదు. ఛాందసవాదుల ఒత్తిడి కారణంగా వాలెంస్టైన్‌ను సైన్యాధ్యక్ష పదవి నుండి రెండుసార్లు తప్పించారు. చివరగా చక్రవర్తి సూచనల మేరకు కొందరు కిరాయి హంతకులు అతడిని హతమార్చారు. పోలీసెంకి పేర్కొన్నట్లు : "తుది విశ్లేషణ ప్రకారం వ్యక్తిగత కక్షలొక్కటే వాలెంస్టైన్ పతనానికి దారి తీయలేదు. ఇక్కడ మౌలిక అంశం మాత్రం అతడు ప్రతిపాదించిన

ఆర్థిక వ్యవస్థే. భూస్వామ్య నిరంకుశ పాలనను గట్టిగా సమర్థించేవారు వాలెంస్టైన్ ఆర్థిక విధానాలను తీవ్రంగా వ్యతిరేకించారు."

అయితే మితవాదులు అనుసరించిన పద్ధతులు యుద్ధంలో విజయానికి బాటలు వేయలేకపోయాయి. వాలెంస్టైన్ మరణం తర్వాత మరో 14 ఏళ్ల పాటు యుద్ధం కొనసాగింది. ఈ కాలంలో సైనిక సమీకరణలు, సంకీర్ణ కూటములు తరచూ మారాయి. ప్రత్యర్థులైన స్పెయిన్, ఫ్రాన్స్ నిరంకుశ రాజ్యాల చుట్టూ ఈ సమీకరణలు పరిభ్రమించాయి. యుద్ధం ముగిసే నాటికి అందులో క్రియాశీలంగా పాలుపంచుకున్న కొందరు పోరాట వీరులు అసలు యుద్ధం ఎప్పుడు మొదలైందన్న విషయాన్ని కూడా గుర్తుంచుకోలేకపోయారు. అలాగే యుద్ధానికి దారి తీసిన మౌలిక అంశాలను కూడా నెమరు వేసుకోలేకపోయారు.

అయితే ప్రత్యక్ష నిదర్శనాలుగా జర్మనీ విధ్వంసం, ఐరోపాలోని ఇతర ప్రాంతాల్లో యుద్ధం చూపిన ఆర్థిక ప్రభావం చరిత్ర ముంగిట నిలిచాయి. ఎట్టకేలకు యుద్ధం ముగిసి శాంతి ఒప్పందం కుదిరింది. 1648లో వెస్ట్ ఫాలియా సంధి అనంతరం శాంతి నెలకొంది. సామాజిక, రాజకీయ అస్థిరత నేపథ్యంలో ఈ సంధి కుదిరింది. స్పానిష్ సామ్రాజ్యంలో కాటలోనియా, పోర్చుగల్ తిరుగుబాటు చేశాయి. నెదర్లాండ్స్‌లో ఆరెంజ్ రాకుమారుడు, సంపన్న వ్యాపారుల మధ్య ఘర్షణలు చెలరేగాయి. ఫ్రాన్స్‌లో రాజకీయ తిరుగుబాటు ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఈ తిరుగుబాట్లను ఫ్రాన్స్‌లో 'ఫ్రాండే'గా పరిగణించేవారు. ఈ పరిణామాలు వెస్ట్‌ఫాలియా ఒప్పందానికి (సంధి) నేపథ్యంగా ఉండేవి.

యుద్ధానికి తెరలేపిన తొలి ప్రత్యర్థులు పూర్తిగా నష్టపోయారు. బొహేమియాలో నిరంకుశ భూస్వామ్య వ్యవస్థ పాతుకుపోయి ప్రజలు తీవ్ర అణచివేతకు గురయ్యారు. వ్యవసాయ భూములు భూస్వామ్య దొరల వశమయ్యాయి. ఉత్పాదకత విషయం ఎలా ఉన్నా పంట దిగుబడిని సాధ్యమైనంత వరకు దోచుకోవడమే భూస్వాముల విధానంగా మారింది. పదహారవ శతాబ్దంలో కొత్త వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి పరచడానికి రైతులు చూపిన ఉత్సాహం ఈ దశలో పూర్తిగా కొరవడింది. భూస్వాములు రైతుల శ్రమశక్తిని సగానికిపైగా దోచుకోవడం వల్లే ఈ పరిస్థితి ఏర్పడింది. యుద్ధాల కారణంగా జనాభా తగ్గిపోయిన పట్టణాలు భౌతిక విధ్వంసం, రుణభారంతో ఆర్థికంగా మరింత కృంగిపోయాయి. ఒకప్పుడు ఐరోపా సంస్కృతికి కేంద్రాలుగా వెలసిల్లిన నగరాలు ఇప్పుడు వెనుకబడిన రాష్ట్రాలుగా మారాయి.

ఈ సాంస్కృతిక పతనానికి చెక్ భాష చిహ్నంగా ఉండిపోయింది. ఈ భాష సుమారు 200 సంవత్సరాల పాటు అచేతనావస్థలో మురిగిపోయింది. గ్రామీణ ప్రాంతాల్లోని కొన్ని భాగాలకే అది పరిమితమైంది. అదే సమయంలో పట్టణ ప్రాంతాల్లో జర్మన్ ప్రధాన భాషగా అవతరించింది. జీవనోపాధి కొత్త మార్గాలు, పాత సామాజిక సంబంధాల మధ్య జరిగిన ఘర్షణను బొహేమియాలో సుదీర్ఘ రక్తపాతం తర్వాత పరిష్కరించగలిగారు. ఈ పోరాటంలో కొత్త విధానాలు, ఆలోచనలపై పాత భూస్వామ్య సంబంధాలు, విలువలు విజయం సాధించాయి. యుద్ధం మొదలైన తొలి నాళ్లలో విప్లవాత్మకమైన వైఖరి తీసుకోకపోవడంవల్ల ఇంతటి దారుణమైన మూల్యాన్ని చెల్లించాల్సి వచ్చింది.

స్పానిష్ సింహాసనం కూడా తీవ్రంగా నష్టపోయింది. యుద్ధం మొదలుకానప్పుడే కాసిలీలో ఆర్థిక వ్యవస్థ బలహీనపడుతోందన్న సంకేతాలు వెలువడ్డాయి. అయితే సైనిక ప్రాబల్యం ఈ లోపాలను కప్పిపుచ్చింది. 1648 నాటికి పరిస్థితి పూర్తిగా మారిపోయింది. స్పెయిన్ సామ్రాజ్యం పోర్చుగల్‌పై నియంత్రణ కోల్పోయింది. కాటలోనియా, లాటిన్ అమెరికాలోని తన సామ్రాజ్యాన్ని, ఫిలిప్పైన్స్, ఇటలీలోని కొన్ని భాగాలు, దక్షిణ నెదర్లాండ్స్‌ను తన అదుపులో ఉంచుకోగలిగింది కాని సామ్రాజ్యానికి సమకూరే ప్రయోజనాలన్నీ దారి మళ్లాయి. మరోవైపు ఐబేరియా ద్వీపకల్పం ఐరోపాలోనే అత్యంత వెనుకబడిన ప్రాంతంగా రూపాంతరం చెందింది.

యుద్ధంవల్ల ప్రయోజనం పొందిన వారిలో జర్మన్ రాకుమారులు ప్రముఖులు. గతం కంటే తమ అధికారాన్ని వారు మరింత స్వేచ్ఛతో వినియోగించగలిగారు. అయితే సాధారణ జర్మన్లు యుద్ధంలో భారీ మూల్యాన్ని చెల్లించాల్సి వచ్చింది.

జర్మనీలో గ్రామాలు, జాగీర్లు చెల్లాచెదురుగా, ఒక దానితో ఒకటి సంబంధం లేకుండా ఉండడం, పన్ను వసూలు కేంద్రాల వద్ద సరిహద్దుల విభజన, అధికారం కోసం స్థానిక పాలక వంశాలలో కుయుక్తులు తదితర పరిస్థితులు కారణంగా యుద్ధం సృష్టించిన తీవ్రమైన సామాజిక, ఆర్థిక నిర్వాసాన్ని రైతులు, సాధారణ పౌరులు అధిగమించలేకపోయారు. 16వ శతాబ్దం తొలి దశకాల్లో దక్షిణ జర్మనీ ఐరోపాలోనే అత్యంత సంపన్నమైన ప్రాంతంగా, పట్టణీకరణకు కేంద్రంగా ఉండేది. అయితే 17వ శతాబ్దం నాటికి ఈ వైభవం, ప్రగతి కనిపించకుండా పోయాయి.

గత శతాబ్దంలో మత యుద్ధాల తర్వాత బలోపేతమైనట్లే '30 ఏళ్ల' యుద్ధం నుండి కూడా ఫ్రాన్స్ శక్తివంతమైన సామ్రాజ్యంగా ఆవిర్భవించింది. విప్లవాత్మకమైన రాజకీయ ఉద్యమాలు (ఫ్రాండే) బయల్దేరినప్పటికీ ఫ్రాన్స్ తన ప్రాబల్యాన్ని సుస్థిరం చేసుకుంది. కేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ, ఆర్థిక నిర్వహణా స్వరూపాల్లో నత్తనడకన మార్పులు వచ్చాయి. యుద్ధం వల్ల ఫ్రాన్స్ పాలకులు నామమాత్రంగా లాభపడగా, ఫ్రెంచి ప్రజలకు ఎలాంటి ప్రయోజనం చేకూరలేదు.

యుద్ధంవల్ల కలిగిన నిర్దిష్ట ప్రయోజనం ఒక్కటే. స్వతంత్ర డచ్ గణరాజ్యం మనుగడ సాగించడం, క్యాపిటలిస్టు పద్ధతుల ఆధారంగా అక్కడి కొత్త పాలక వర్గం అభ్యున్నతి సాధించడం. సంస్కరణోద్యమం, మత యుద్ధాలు, అంతర్యుద్ధాల కారణంగా సుమారు 125 ఏళ్లపాటు రక్తపాతాన్ని చవి చూసిన ఐరోపాలో ఆర్థిక జీవనానికి అవసరమైన కొత్త నిర్వహణా పద్ధతులు ఆధారంగా ఈ కొత్త రాజ్యం ఏర్పడింది. ఒక వైపు వెస్ట్‌ఫాలియా శాంతి ఒప్పందం కుదరగా మరోవైపు ఉత్తర సముద్రం అవతల పైన పేర్కొనబడిన మార్పు దిశగా హింసాత్మక పద్ధతుల్లో (తక్కువ వ్యయంతో) పయనించడానికి సన్నాహాలు మొదలయ్యాయి.

## ఇంగ్లాండ్ విప్లవం

ఇంగ్లాండ్, స్కాట్లాండ్‌లకు రాజు అయిన చార్ల్స్-1 తలను 1649 జనవరిలో ఒక సైనికుడి గొడ్డలి నరికివేసింది. ఈ సంఘటన ఐరోపాను కుదిపివేసింది. ఖండ వ్యాప్తంగా

విస్తరించి ఉన్న పాలకులు - కాథలిక్, లూథర్‌వాద, కాల్విన్‌వాద రాజులు - ఇంగ్లాండ్ ప్రభుత్వంతో దౌత్య సంబంధాలను పూర్తిగా తెంచుకున్నారు. 'పాలించడం మా జన్మహక్కు' అనే రాచరిక సిద్ధాంతాన్ని భ్రష్టు పట్టించే ధైర్యం చేసినందుకు ఇంగ్లాండ్ ఐరోపాలో బహిష్కరణను ఎదుర్కొంది.

చార్ల్స్ శిరచ్ఛేదాన్ని ఆదేశించిన వారు పూర్తిగా అతివాద రిపబ్లికన్లేమీ కాదు. ఈ సంఘటనకు 20 నెలల ముందు వారి నాయకుడు ఆలివర్ క్రాంవెల్ రాచరిక సిద్ధాంతాన్ని సమర్థించి ఉన్నాడు. "తమ జీవితాలను, జాగీర్లను ఏ వ్యక్తి గుట్టుచప్పుడు కాకుండా అనుభవించడానికి వీల్లేదు. రాజు తన సర్వహక్కులను చాటుకునేంత వరకూ ఎవరూ అలాంటి సాహసం చేయకూడదు" అని క్రాంవెల్ అప్పుడు పేర్కొన్నాడు. అయితే ఇప్పుడు అతడు తన బాణీని మార్చాడు. "కిరీటం పెట్టే అతడి తలను నరికివేస్తాము," అని క్రాంవెల్ ఘంటాపథంగా ప్రకటించాడు. తన ప్రమేయం లేకుండానే అతడో కొత్త శకానికి ద్వారాలు తెరిచాడు. ఇతరులపై నియంత్రణ కలిగి ఉండడం తమకు దేవుడిచ్చిన వరమని కొందరు మానవులు తమకు తాము నిర్ధారించుకోవడాన్ని ఈ కొత్త శకం గట్టిగా ప్రశ్నించడానికి సిద్ధమైంది.

భూస్వామ్య ఉన్నత వర్గంలో అధికారం కోసం సాగిన పోరుగా ఇంగ్లాండ్ విప్లవాన్ని అభివర్ణిస్తూ ఎన్నో కథనాలు వెలువడ్డాయి. ఇలాంటి కథనాలు రాచరిక పోషణను, పాలక వర్గంలోని ప్రముఖుల కుటుంబ సంబంధాలను, యుద్ధాలు, శిరచ్ఛేదాలను కుట్ర, ప్రతీఘాత కుట్రల ప్రక్రియగా వివరిస్తాయి. పై పరిణామక్రమాలు అదుపు తప్పడంవల్లే విప్లవోద్యమం సార్థకమైందని చెబుతాయి.

అయితే ఇలాంటి అన్వయింపు, వక్రీకరణలు 1649 సంఘటన చరిత్రలో ఉన్నట్టుండి జరిగిన పరిణామం ఎంత మాత్రం కాదని గుర్తించడంలో విఫలమయ్యాయి. ఐరోపాలో సుమారు 150 ఏళ్ల నుండి సామాజిక శక్తుల మధ్య జరుగుతూ వచ్చిన పోరాటం నుండే ఈ సంఘటన పుట్టుకొచ్చింది. మార్కెట్ శక్తులు ఎదిగి పాత భూస్వామ్య వ్యవస్థను పూర్తిగా మార్చివేసిన క్రమంలోనే ఇంగ్లాండ్ విప్లవం సంభవించింది. ఇందులో పాలకవంశంలోని ప్రత్యర్థి వర్గాలు, రాజకీయ నాయకులే కాకుండా తమ స్వంత ప్రయోజనాలను కాపాడుకోవడానికి వ్యాపారులు కూడా పాలుపంచుకున్నారు. గతంలో డచ్ విప్లవానికి కూడా వ్యాపార ప్రయోజనాల పరిరక్షణే లక్ష్యంగా ఉండేది. అలాగే ఇంగ్లాండ్ విప్లవంలో వృత్తిదారులు, చిరువ్యాపారులు, రైతులు కూడా క్రియాశీల పాత్ర పోషించారు. 1525లో సంభవించిన జర్మన్ రైతాంగ యుద్ధం స్థాయిలో కాకపోయినా ఇంగ్లాండ్ రైతులు కూడా గ్రామీణ ప్రాంతాల్లో ఉద్యమాలను తీవ్రతరం చేశారు. ఇంగ్లాండ్ అంతర్యుద్ధంలో ఆయా శక్తులను ఐరోపా సంస్కరణోద్యమం ముందుకు తెచ్చిన రెండు పరస్పర విరుద్ధమైన మత సిద్ధాంతాలు తమ చుట్టూ సమీకరించాయి.

## శాంతి నేపథ్యం

జర్మనీలోని కొన్ని ప్రాంతాల్లో చోటు చేసుకున్నట్లే ఇంగ్లాండ్‌లో కూడా సంస్కరణోద్యమాన్ని రాజశాసనం ప్రకారం చేపట్టారు. దౌత్యపరమైన వివాదాల కారణంగా

హెన్రీ-8 రోమన్ కాథలిక్ చర్చితో పూర్తిగా తెగతెంపులు చేసుకున్నాడు. మఠాల ఆధీనంలో ఉన్న భూములను చవక ధరలకు కట్టబెట్టడం ద్వారా ఇంగ్లాండ్ పాలక వర్గంలోని మెజారిటీ సభ్యులను తన వైపు తిప్పుకున్నాడు.

పాలకుల స్వప్రయోజనాలు, ఉన్నత వర్గాల ధనదాహం ఒక్కటే ఇంగ్లాండ్ సంస్కరణోద్యమాన్ని శాసించలేదు. కొత్త సిద్ధాంతాన్ని ఆమోదించడానికి సిద్ధంగా ఉన్న వారందరిలో సంస్కరణోద్యమ భావాలు బలంగా నాటుకుపోయాయి. సమాజాన్ని సమూలంగా సంస్కరించాలన్న ఆకాంక్ష ప్రజల్లో ఎక్కువగా ఉండడంవల్ల వ్యాపార, వృత్తిదార వర్గాలే కాకుండా భూస్వాముల్లోని ఒకవర్గం కూడా సంస్కరణోద్యమానికి మద్దతు తెలిపింది.

సంస్కరణోద్యమాన్ని పైస్థాయి, క్షేత్రస్థాయి పోరాటంగా విభజించిన కొన్ని శక్తులు 16వ శతాబ్దం మలిభాగంలో తమ మధ్య ఉన్న అంతరాలను, వైషమ్యాలను పరిష్కరించుకున్నాయి. మేరీ ట్యూడర్ (ఈమె స్పెయిన్ రాజు ఫిలిప్-2ను వివాహమాడింది) నాయకత్వం పాత కాథలిక్ వాదాన్ని సమాజంపై బలవంతంగా రుద్దాలని జరిగిన ప్రయత్నం నుండి నేర్చుకున్న కొన్ని చేదు అనుభవాలు చర్చి భూముల ద్వారా లాభాలను ఆర్జించే భూస్వాముల్లో అసంతృప్తి జ్వాలలను రేపాయి. ఈ కారణంగా మేరీ ట్యూడర్ వారసురాలు, ప్రొటెస్టెంట్ అయిన మహారాణి ఎలిజిబెత్ పక్షాన భూస్వాములతోపాటు సాంప్రదాయవాద వ్యాపారులు కూడా చేరిపోయారు.

అప్పటికి ఐరోపాలో ఇంగ్లాండ్ ఆర్థికంగా చాలా వెనుకబడి ఉన్నా ఆర్థిక ప్రగతిని నిరంతరంగా, పరిమితంగా చవి చూసింది. పరిస్థితుల్లో మెల్లగా మార్పులు వస్తుండడంతో వ్యాపారులు, భూస్వాములు ఎలిజిబెత్ మహారాణికి అండగా నిలిచారు. 1500 నుండి 1650 మధ్య ఇంగ్లాండ్ జనాభా రెట్టింపయ్యింది. 1650 నాటికి ప్రతి 12 మంది వ్యక్తులలో ఒకరి కంటే ఎక్కువ మంది పట్టణాల్లో నివసించేవారు. చేతివృత్తి పరిశ్రమలు ముఖ్యంగా జౌళి పరిశ్రమ, ఉత్పాదకత పెరిగింది. అలాగే ఖనిజాల తవ్వకం, ఇనుము పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. గ్రామీణ పరిశ్రమల్లో వేలాది మంది వృత్తిదారులు, కార్మికులకు ఉపాధి లభించింది. పట్టణాల్లో కూడా ఉపాధి అవకాశాలు విస్తరించాయి. ఆర్డెన్ ఫారెస్ట్‌లో 60 శాతం కుటుంబాలు చేనేత వస్త్రాల తయారీలో నిమగ్నమయ్యాయి. సుమారు లక్ష మంది గ్రామీణ ప్రజలు వస్త్రాల అల్లికపై ఆధారపడి మనుగడ సాగించారు. మధ్యతరగతి, ధనిక రైతుల యాజమాన్యంలోని భూములు గణనీయంగా విస్తరించాయి. వీరు వేతన కార్మికులతో వ్యవసాయ పనులు చేపట్టి తమ కుటుంబాలకు అదనపు ఆదాయాన్ని సమకూర్చి పెట్టేవారు. బడా భూస్వాములు ధనిక లేదా మధ్యతరగతి రైతులకు భూములను సుదీర్ఘకాలం పాటు అప్పగించడం ద్వారా ఎక్కువ లాభాలను పొందవచ్చనే విషయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోవడం మొదలుపెట్టారు. మధ్యతరగతి రైతులు ఈ భూస్వాముల భూములను అభివృద్ధి పరచడమే కాకుండా దిగుబడిలో నిర్ణీత భాగాన్ని కౌలుగా చెల్లించేవారు. సన్నకారు రైతులకు భూములను అప్పగించి వారిని మరింత దారిద్ర్యంలోకి నెట్టడం కంటే పై మార్గమే ఉత్తమమని బడా భూస్వాములు ఒక నిర్ధారణకు వచ్చారు.

సమాజం అప్పటికి భూస్వామ్య వ్యవస్థ లక్షణాలు ఎన్నింటినో ప్రదర్శించేది. భూస్వామ్య, పాలక వర్గాలు దాదాపు రైతులందరినీ పీల్చిపిప్పి చేసేవి. ప్లేగు సంభవించిన నాటికే కౌలుదారీ వ్యవస్థ దాదాపు అంతరించినా భూస్వాములు రైతుల నుండి కొన్ని ప్రత్యేక పన్నులను (నగదు రూపంలో, శ్రమ రూపంలో) రాబడుతూనే ఉండేవారు. వ్యవసాయ భూములను చాలా వరకు మధ్య, సన్నకారు రైతులే దున్నేవారు. క్యాపిటలిస్టు తరహా వ్యవసాయం (వేతన కార్మికుల సహాయంతో పంటలసాగు) పరిమితంగా ఉండేది. వేతన కార్మికుల కంటే వృత్తిదారులే ఎక్కువగా గ్రామీణ పరిశ్రమలను శాసించేవారు. రాచరిక దర్బారు నుండి అందే నిధులతో తమ ఆదాయాన్ని పెంచుకోవాలని భూస్వాములు ప్రయత్నించేవారు. అలాంటి రాజ్య నిధులు కూడా ప్రజల నుండి వసూలు చేసిన పన్నుల నుండే సమకూరేవి. అదే సమయంలో తమ వ్యవసాయ భూములను అభివృద్ధి పరచి పంట దిగుబడిని పెంచుకోవాలని కృషి చేసేవారు. పాలకుడు తమకు కల్పించే గుత్తాధిపత్య పత్రాలపై సంపన్న వ్యాపారులు ఎక్కువగా ఆధారపడేవారు. వివిధ రకాల ఉత్పత్తులపై వ్యాపారులకు గుత్తాధిపత్యం ఉండడంతో వాటి ధరలు తరచూ పెరిగేవి, ఇతర పరిశ్రమలు తీవ్రంగా నష్టపోయేవి. అయినప్పటికీ 1550 దశకం మలి భాగం నుండి 1610 దశకం మధ్యభాగం వరకు ఆర్థిక వ్యవస్థ మెల్లగా పుంజుకుంది. '30 ఏళ్ల' యుద్ధానికి ముందు బొహేమియాలో ఉన్న ఏర్పాట్లు (వ్యవస్థలు, సామాజిక పరిస్థితులు) పైన పేర్కొన్న కాలంలో కూడా కొనసాగడం వల్లే ఆర్థిక ప్రగతి సాధ్యమైంది. నిరంతరంగా, సుస్థిరంగా వచ్చిన ఈ ప్రగతితోపాటు కొత్త క్యాపిటలిస్టు పద్ధతులు కూడా ఆవిర్భవించాయి.

రాజకీయ రంగు మిళితమైన మత వివాదాలు ఈ కాలంలోనూ కొనసాగాయి. ఎలిజిబెత్ పాలన చివరాంకంలో సాంప్రదాయవాద కాల్వినిస్టుల అణచివేత తీవ్రమైంది. చాలా మంది కాల్వినిస్టులు దేశం వదలి వెళ్లాల్సి వచ్చింది. స్కాట్లాండ్‌కు చెందిన జేమ్స్-6 ఇంగ్లాండ్ సింహాసనాన్ని అధిష్టించాడు. తన పేరును జేమ్స్-1గా మార్చుకున్నాడు. అయితే అతడు సింహాసనాన్ని కైవసం చేసుకోకుండా అడ్డుకునేందుకు కాథలిక్ వర్గానికి చెందిన బడా భూస్వాములు కొందరు కుట్రపన్నారు. దీనిని 'మందుగుండు కుట్ర'గా పరిగణిస్తారు. కాని మొత్తం మీద ఈ కాలంలో రాజ్యం, బడా భూస్వాములు ధనిక రైతులు, వ్యాపారులు, చర్చి పెద్దల మధ్య దాదాపు అన్ని విషయాలపై ఏకాభిప్రాయం హెచ్చు స్థాయిలో ఉండేది. రాజ్యాంగ వ్యవస్థ అందుకు ప్రాతిపదికగా నిలిచింది. రాజ్యాంగం ప్రకారం రాజు మంత్రులను నియమించేవాడు. రాజ్య విధానాలను మంత్రులు రూపొందించేవారు. అయితే రాజ్య విధానాల అమలుకు, కార్యక్రమాలకు నిధులను సమకూర్చేందుకు రాజు పార్లమెంటు ఉభయ సభలపై ఆధారపడేవాడు. పెద్దల సభ (హౌస్ ఆఫ్ లార్డ్స్)లో పాలకవర్గ ముఖ్యులు, బిషప్‌లు సభ్యులుగా ఉండేవారు. సాధారణ సభ (హౌస్ ఆఫ్ కామన్స్)కు ఆయా కౌంటీలకు చెందిన భూస్వాములు, పట్టణాలకు చెందిన వ్యాపారులు సభ్యులుగా ఎన్నికయ్యేవారు.

ఫ్రాన్స్ లేదా కాసిలీలో రాజ్య యంత్రాంగం చాలా బలహీనంగా ఉండేది. సర్వసన్నద్ధమైన సైన్యం కాని జాతీయ పోలీసు వ్యవస్థ కాని ఉండేవి కావు. అక్కడ కేవలం తుప్పు పట్టిన పౌర సేవ వ్యవస్థ మాత్రమే ఉండేది. ప్రతి ప్రాంతంలోనూ నిర్దిష్టమైన అధికారం భూస్వామ్య చేతుల్లోనే ఉండేది. చట్టాలను చాలా వరకు వారే అమలు చేసేవారు. కార్మిక వర్గాలను శిక్షించేవారు. పరిస్థితులకు అనుగుణంగా పన్నులు వసూలు చేసి సైన్యాలను సమీకరించేవారు. తమ విధానాల అమలుకు, స్వప్రయోజనాల పరిరక్షణకు, అలాగే రాజ్య నియంత్రణకు రాజులు భూస్వాములపై ఎక్కువ ఆధారపడేవారు. భూస్వాములను సాధ్యమైనంత వరకు ఒప్పించడమో లేదా మచ్చిక చేసుకోవడమో చేసేవారు. అయితే విధానాల అమలుపై విస్తృతమైన అంగీకారం ఉన్నంత వరకు ఇరు వర్గాల మధ్య ఎలాంటి ఇబ్బందులు ఉండేవి కావు.

## యుద్ధ పథం

జేమ్స్-1 పాలనలో 1610 దశకం చివరలో పరిస్థితులు విషమించి 1620 దశకం నాటికి అతడి వారసుడు చార్ల్స్-1 హయాంలో సంక్షోభ స్థాయికి చేరుకున్నాయి. రాజు, పార్లమెంటు మధ్య పూడ్చలేని అగాథం ఏర్పడింది. ఒక వైపు వనరులను పెంచుకోవాలని పాలకుడు తాపత్రయపడగా మరోవైపు పార్లమెంటులోని భూస్వాములు, వ్యాపార వర్గాలు వాటిని పన్నుల రూపంలో సమకూర్చిపెట్టడానికి విముఖత చూపేవి. పార్లమెంటు అధికారాల పరిధిలో లేని ఆదాయ వనరులను కోరడం ద్వారా పాలకుడు పార్లమెంటు సభ్యులతో మరింత వైరాన్ని పెంచుకున్నాడు. అలాంటి ఆదాయ మార్గాలలో కొత్త పన్నులు, కస్టమ్ సుంకాలు, జాగీర్ల అమ్మకం, వాణిజ్య నిర్వహణలో గుత్తాధిపత్య పత్రాల మంజూరు ప్రధానమైనవి. ఈ ఆదాయ మార్గాలపై తమకు నియంత్రణ కల్పించే వరకు రాజ్యానికి వార్షిక నిధులను సమకూర్చడం సాధ్యం కాదని పార్లమెంటు సభ్యులు పాలకుడిని హెచ్చరించారు. కాని పార్లమెంటు అనుమతి లేకుండానే అధికార యంత్రాంగాన్ని శాసించడానికి రాజు ప్రయత్నించాడు. తన విధానాలను ప్రతిఘటించే వారిని కఠినంగా శిక్షించేందుకు అతడు 'స్టార్ చాంబర్' అనే ప్రత్యేక న్యాయ స్థానాలను ఏర్పాటు చేశాడు. రాజు తీసుకున్న ఈ కఠిన చర్యల కారణంగా అతడిపై అన్ని వర్గాల్లోనూ అపనమ్మకం ఏర్పడింది. ముఖ్యంగా 1610-1620 మధ్య రాజకీయ సలహాదారుగా ఉన్న బకింగ్‌హామ్, 1630లో అదే పాత్రను నిర్వర్తించిన స్ట్రాఫర్డ్‌లపై పార్లమెంటుతోపాటు సమాజంలోని కొన్ని ప్రబలమైన వర్గాలు ద్వేషాన్ని పెంచుకున్నాయి.

ఈ వివాదం మతం రంగు పులుముకుంది. '30 ఏళ్ల' యుద్ధంలో ప్రొటెస్టెంట్ శక్తులతో మమేకం కావడానికే భూస్వాములు, వ్యాపారులు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చారు. లోపభూయిష్టమైన ఆర్థిక అంచనాలు, మూఢమైన మతనమ్మకాల కారణంగా ఈ వర్గాలు అలాంటి వైఖరిని తీసుకున్నాయి. స్పానిష్ ప్రాబల్యం బలహీనపడితే అమెరికా, ఈస్ట్ ఇండియా మార్కెట్లు తమకు అందుబాటులోకి వస్తాయన్న నమ్మకం వ్యాపారుల్లో బలంగా నాటుకుపోయింది.

జేమ్స్, చార్ల్స్‌లు అందుకు భిన్నమైన వైఖరిని తీసుకున్నారు. తమ శక్తియుక్తులను కాథలిక్ పాలకుల కూటమి ఏర్పాటు కోసం ధారపోశారు. ఇందులో భాగంగా చార్ల్స్ ఫ్రాన్స్ పాలకుడి కుమార్తెను వివాహం చేసుకున్నాడు. అప్పటికే ఫ్రాన్స్ పాలకుడు లా రోషేల్ పట్టణంలో ప్రొటెస్టెంట్లపై దాడులను తీవ్రతరం చేసి ఉన్నాడు. చార్ల్స్ నియమించిన కాంటర్‌బరీ ఆర్చ్‌బిషప్ లాడ్ కాల్వినిస్టు మంత్రులను ఏరివేశాడు. మతపరమైన అసమ్మతి వాదులను అణచివేసేందుకు చర్చి న్యాయస్థానాలను ఒక సాధనంగా వాడుకున్నాడు. రాజుకు చెల్లించాల్సిన పన్నులను ఎగవేసే దానిని దైవధిక్కార చర్యగా పరిగణించాలని మత పెద్దలను ఆదేశించాడు. ఆచరణలో చర్చి వ్యవస్థ ఒక పౌరసేవా విభాగాన్ని తలపించింది. రాజు పక్షాన ఒక నైతిక నియంత్రణా శక్తిగా వ్యవహరించింది.

ఐరోపా ఖండాన్ని కుదిపేసిన రాచరిక ప్రతీఘాత సంస్కరణోద్యమంలో ప్రొటెస్టెంట్లకు పట్టిన దుర్గతే తమకు కూడా పడుతుందని వ్యాపారులు, భూస్వాముల్లోని కొన్ని వర్గాలు భయాందోళనలు వ్యక్తం చేశాయి. 1620 దశకం చివరలో రాజుకు, సాధారణ సభకు మధ్య ఘర్షణ చెలరేగిన తర్వాత వారిలో భయం మరింత ఎక్కువైంది. ఆ ఘర్షణ అనంతరం పన్నులు చెల్లించేందుకు నిరాకరించిన ఐదుగురు భూస్వాములను నిర్బంధించి పార్లమెంటు వ్యవస్థను రాజు రద్దు చేశాడు. ఫ్రెంచి అయిన రాజు భార్య, ఆమె జెస్యూట్ సలహాదారు చుట్టూ పోగైన ఒక శక్తివంతమైన కాథలిక్ వర్గం ఇంగ్లాండ్ ఆస్థానంలో ఆవిర్భవించింది. రాజు ప్రీతిపాత్రుడైన స్ట్రాఫర్డ్ కాథలిక్‌లతో కూడిన ఒక శాశ్వతమైన ఐరిష్ సైన్యాన్ని ఏర్పాటు చేశాడు.

రాజు తీసుకున్న కఠిన వైఖరి ఫలితాలనివ్వడం మొదలుపెట్టింది. అపుడు 1637లో అతడు హద్దుమీరి ప్రవర్తించాడు. స్కాట్లాండ్‌లో కాల్విన్ రహిత ప్రార్థన గ్రంథాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడు. స్కాట్లాండ్ ప్రత్యేక దేశంగా అతడు పాలించేవాడు. ఆ దేశానికి స్వంత రాజకీయ వ్యవస్థలు, చట్టాలు, చర్చి ఉండేవి. భూస్వాములు, న్యాయవాదులు,కాల్వినిస్టు మంత్రులు, వ్యాపారులతో కూడిన ఒక స్కాట్లాండ్ మహా సమ్మేళనం తిరుగుబాటు సైన్యాన్ని సమీకరించింది. తిరుగుబాటును అణచివేయగలనన్న ఆత్మవిశ్వాసంతో రాజు బయల్దేరి వెళ్లాడు. అయితే అందుకు అవసరమైన నిధులు మాత్రం అందుబాటులో లేవని తెలుసుకున్నాడు. ఉత్తర ఇంగ్లాండ్‌లోకి స్కాటిష్ సైన్యాలు దూసుకురావడంతో అతడు 11 ఏళ్ల విరామం తర్వాత పార్లమెంటును సమావేశపరిచాడు.

రాజు కోరుకున్న విధంగా నిధులను సమకూర్చడానికి వెస్ట్‌మినిస్టర్‌లో సమావేశమైన భూస్వాములు, దొరలు, వ్యాపార వర్గ ప్రతినిధులు ఏ మాత్రం ఒప్పుకోలేదు. తమకు లాభదాయకమైన విధంగా ఒప్పందాన్ని రూపొందించే వరకు రాజు కోర్కెలను మన్నించడానికి పార్లమెంటు సభ్యులు సంసిద్ధత వ్యక్తం చేయలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే తమ రాజకీయ వైఖరిలో వారు సాంప్రదాయవాదులుగా వ్యవహరించారు. అయితే వారి దృష్టిలో సాంప్రదాయవాదం అంటే తమ స్వంత ప్రాంతాల్లో పాలకులుగా తమ హోదాను కాపాడుకోవడమే. ఆ హోదాకు 11 ఏళ్లుగా రాజు నుండి ముప్పు వాటిల్లింది. పార్లమెంటు సభ్యుల్లో అనేక మంది జాన్ పిమ్ నుండి స్ఫూర్తి పొందారు. జాన్ పిమ్ ఒక సంస్థకు కార్యదర్శిగా

ఉండేవాడు. లాటిన్ అమెరికా, క్యారబియన్‌పై స్పెయిన్‌కు ఉన్న వాణిజ్య నియంత్రణను ఛేదించడమే అతడి లక్ష్యం. కొత్త పన్నుల రద్దు, పన్ను ఎగవేతదారులకు క్షమాభిక్ష, ప్రత్యేక న్యాయస్థానాల రద్దు, సభ్యుల అనుమతి లేకుండానే పార్లమెంటును రద్దు చేసే అధికారాన్ని రాజు వదులుకోవడం, సింహాసనానికి ప్రధాన సలహాదారు అయిన స్ట్రాఫర్డ్ విచారణ, శిక్ష, పెద్దల సభ నుండి బిషప్‌ల తొలగింపు, స్కాట్లాండ్‌కు చెందిన కాల్వినిస్టులతో శాంతి ఒప్పందం తదితర డిమాండ్లను పరిష్కరించాలని వారు రాజుకు విజ్ఞప్తి చేశారు. ఈ డిమాండ్లను పరిష్కరిస్తేనే రాజు అభ్యర్థనల మేరకు నిధులను సమకూర్చి పెట్టగలమని షరతు విధించారు.

రాజు బేరసారాలకు దిగాడు. ఉదాహరణకు, స్ట్రాఫర్డ్ వ్యవహారంపై విచారణకు ఆదేశించాడు. అయితే పార్లమెంటు సభ్యులు ప్రతిపాదించిన అంశాలన్నింటినీ ఏకమొత్తంగా ఆమోదించలేదు. అలా చేసి ఉన్నట్లయితే రాజు తన సర్వాధికారాలను కోల్పోయేవాడు. ఈ అధికారాలను శతాబ్దాల తరబడి పాలకులు అనుభవిస్తూ వచ్చారు. వాటిని వదులుకోవడానికి చార్ల్స్ ఏ మాత్రం అంగీకరించలేదు. అధికారాలను వదలుకుంటే రాజ్యంలో అతడు నామమాత్రపు పాలకుడిగా, రాచరిక చిహ్నంగా మిగిలిపోయేవాడు. అదీగాక ఆ సమయంలో ఐరోపాలోని తన సహచర పాలకులు తమ అధికారాలను పెంచుకుంటూ పోయారే కాని వాటిని తగ్గించుకొనే ఆలోచనే చేయలేదు.

కాలం గడిచిన కొద్దీ తన స్థాయి పెరుగుతోందని రాజు గ్రహించాడు. సాధారణ సభ, పెద్దల సభలో చాలా మంది సభ్యులు రాజుకు వ్యతిరేకంగా కఠిన వైఖరి తీసుకోవడానికి సంకోచించారు. తమ స్వంత అధికారాలకే ప్రజల నుండి ముప్పు వాటిల్లగలదన్న ఆందోళనతో వారు తీవ్ర చర్యలకు పాల్పడలేదు. భూస్వామ్య, పాలకవర్గాల్లోని ఒక భాగం 'రాజు పక్షం'గా ఎదిగింది. ముఖ్యంగా లండన్ మార్కెట్‌కు దూరంగా ఉన్న ఉత్తర, పశ్చిమ ప్రాంతాల్లో ఇలాంటి రాజకీయ పక్షం బలపడింది. ఈ ప్రాంతాల్లో భూస్వామ్య సాంప్రదాయాలు చెక్కు చెదరకుండా ఉండేవి. ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో కూడా రాజు మద్దతును కూడగట్టగలిగాడు. అక్కడి భూస్వాములు, ధనిక వ్యాపారులు, సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన ప్రజలు రాజును సమర్థించారు. భూస్వాములు, వ్యాపారులు రాచరిక విధానాలు, ప్రోత్సాహకాల వల్ల లాభపడితే సమాజంలోని కొన్ని వర్గాలు తరతరాలుగా కొనసాగుతూ వస్తున్న ఆచారాల కారణంగా రాచరిక వ్యవస్థకు అనుకూలంగా వ్యవహరించాయి. రాచరిక వ్యవస్థతో సాన్నిహిత్యంవల్ల బాగా లబ్ది పొందిన వ్యాపార సంస్థల్లో ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రధానమైనది.

1642 జనవరి నాటికి తిరుగుబాటు ద్వారా సకల అధికారాలను హస్తగతం చేసుకోవడానికి రాజు ప్రయత్నించాడు. సుమారు 400 సాయుధ అనుచరులతో అతడు పార్లమెంటుకు వెళ్లాడు. ఐదుగురు ప్రముఖ ఎంపీలను నిర్బంధంలోకి తీసుకోవాలని భావించాడు. అయితే అప్పటికే ఎంపీలందరూ వ్యాపారులు, వాణిజ్యవేత్తలు, లండన్ నగర పాలక సంస్థ సభ్యుల సహాయంతో మైలు దూరంలో ఉన్న సురక్షిత ప్రాంతానికి తరలిపోయారు.

ఎంపీలను వేటాడడానికి ఆ మరుసటి రోజు నగరంలో ప్రవేశించిన రాజుకు (ఒక ప్రత్యక్ష సాక్షి కథనం ప్రకారం) సర్వత్రా నిరసన ధ్వానాలు ఎదురయ్యాయి. లండన్ నగరంలో

అంతటి దుర్దినాన్ని రాజు మునుపు ఎన్నడూ అనుభవించలేదు. వేలాది మంది ప్రజలు వీధుల్లోకి ప్రదర్శనగా వచ్చి "పార్లమెంటు అధికారాలను పరిరక్షించాలి" అంటూ పెద్ద ఎత్తున నినాదాలు చేశారు. వ్యాపారులు దుకాణాలను మూసివేశారు. ప్రజలు తమ ఇంటి ద్వారాల ఎదుట ఆయుధాలు ధరించి రణనినాదాలు చేశారు. రాజు తన కిరాయి సైన్యాలతో నగరంలో ప్రవేశించే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని వదంతులు ముందే వ్యాపించడంతో ప్రజలు తమకు అందుబాటులో ఉన్న ఆయుధాలను ధరించి పురవీధుల్లోకి వేలాదిగా తరలి వచ్చారు. మహిళలు ఆక్రమణదారులపై పోసేందుకు వేడి నీటిని సిద్ధంగా ఉంచుకున్నారు. గుర్రాలను అడ్డుకోవడానికి వీధుల్లో కలప, ఇంటి సామాగ్రిని గుట్టలు గుట్టలూ విసిరారు.

ఈ ఘటనలు తీవ్ర పరిణామాలకు దారి తీశాయి. సాధారణ పోలీసు చర్య ద్వారా నిరంకుశ పాలనకు తెర తీయాలని ప్రయత్నించిన రాజు అందులో విఫలమయ్యాడు. వారం తిరగకముందే అతడు లండన్ వదిలి వెళ్లాడు. సైన్యాన్ని సమీకరించి నగరాన్ని తిరిగి హస్తగతం చేసుకోవాలని భావించాడు. ఈ రాజకీయ వివాదం అంతర్యుద్ధం అంచుకు చేరుకుంది.

## తొలి అంతర్యుద్ధం

సంస్థానాధీశులు, ఉత్తర ప్రాంతానికి చెందిన భూస్వాములు, సైనిక సాహసికులు, నిరుద్యోగ కిరాయిమూకలు, రాచరిక కుటుంబాలకు చెందిన యువకులు, అరాచక శక్తులు, దోపిడీదారులను రాజు తన చుట్టూ చేరదీశాడు. వీరిలో ఆశ్వికులైన దోపిడీదారులు గ్రామీణ ప్రాంతాల్లో తీవ్ర అల్లకల్లోలం సృష్టిస్తూ కరుడుగట్టిన నేరస్తులుగా ప్రజల్లో భయాందోళనలను పుట్టించేవారు. వీరితోపాటు ప్రతీఘాత సంస్కరణోద్యమ నాయకులైన కొందరు కాథలిక్ మతప్రవక్తలు వచ్చి చేరారు. సమాజాన్ని పాలించడానికి స్పెయిన్, ఫ్రాన్స్ తరహా నిరంకుశ రాచరిక వ్యవస్థలు అవసరమని గట్టిగా నమ్మేవారు కూడా జతకలిశారు. పాలకవర్గంలోని పార్లమెంటు సభ్యులకు ఇప్పుడు తమ స్వంత సైన్యాలను ఏర్పాటు చేసుకుంటే కాని ప్రాణ, ఆస్తుల పరిరక్షణ సాధ్యం కాని పరిస్థితి ఏర్పడింది. అయితే అప్పటి వరకు సంభవించిన రాజకీయ పరిణామాల కారణంగా పాలకవర్గానికి ఆమడదూరంలో ఉన్న జనసామాన్యం సైతం పోరాటానికి సిద్ధమైంది.

గుత్తాధిపత్యం కలిగిన వ్యాపారులను తీవ్రంగా నిరసించే ఇతర వ్యాపారులు సాధారణ ప్రజలు, కార్మికులు, వృత్తిదారులను ఉద్యమంలోకి లాగి లండన్ నగరాన్ని తమ నియంత్రణలోకి తెచ్చుకున్నారు. అయితే ప్రజా ఉద్యమాన్ని తమ ఇష్టానుసారంగా మలచడానికి వారు చేసిన ప్రయత్నం విఫలమైంది. కొందరు సైనికాధికారులు ఉద్యమకారులపై దాడి చేసినపుడు వ్యాపారులు ఉద్యమంపై పట్టును కోల్పోయారు. కార్మికులు వందలు, వేల సంఖ్యలో నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. తమ విధులను, వృత్తులను వారంలో కనీసం రెండు నుండి మూడురోజులపాటు విస్మరించాలని కార్మికులకు పిలుపునిచ్చిన కొందరు శ్రామికవర్గ మతబోధకులను వ్యాపారులు నిందించారు. పరిస్థితి అదుపు తప్పడానికి ఇలాంటి పిలుపులే కారణమని వారు విమర్శించారు. ప్రజా ఉద్యమాలు అప్పటికే గ్రామీణ ప్రాంతాల్లో కూడా

విస్తరించాయి. ఆర్థిక మాంద్యం, దారిద్ర్యం తాండవిస్తుండడంతో రైతులు, సాధారణ పౌరులు వీధి పోరాటాలకు దిగారు. భూస్వాములు తమ జాగీర్లను మూసివేయడం, వృత్తి పరిశ్రమలు క్షీణించిపోవడంతో దేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ అరాచక పరిస్థితులు నెలకొన్నాయి.

పాలకవర్గంలోని పార్లమెంటరీ వర్గానికి ప్రజాగ్రహం రెండు వైపులా పదునుగల ఆయుధంగా మారింది. రాచరిక వ్యవస్థ తిరుగుబాటు నుండి ఎంపీలు తమను తాము రక్షించుకోవడానికి ఒక వైపు ప్రజా ఉద్యమం ఉపయోగపడితే మరోవైపు ఆ ఉద్యమం అదుపు తప్పితే తమ వర్గ పాలనకే ముప్పుగా పరిణమించే అవకాశాలు ఎక్కువగా ఉండేవి. పట్టణ ఉద్యమాలు నగర పాలనపై రాజు సమర్థకుల ప్రాబల్యాన్ని క్షీణింపచేశాయో లేదో ఎంపీలు ఆ ఉద్యమాలను అంతటికే పరిమితం చేయడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. ఒక కొత్త మత విధానాన్ని (నైతిక వర్తనకు సంబంధించిన) రూపొందిన కఠినంగా అమలు చేస్తే పీడిత వర్గాల తిరుగుబాటును నిర్వీర్యం చేసి వారిపై నియంత్రణ తెచ్చుకోవడం సాధ్యమవుతుందని చాలా మంది ఎంపీలు అభిప్రాయపడ్డారు. తమ డిమాండ్లను అంగీకరించేలా రాజుపై ఒత్తిడి తీసుకురావాలని వారు కోరుకున్నారు. కాని అంతర్యుద్ధాన్ని ఎంత త్వరగా ముగిస్తే అంత మంచిదని భావించారు.

ఈ వర్గం ఒక ఉదారవాద పార్లమెంటరీ పక్షాన్ని ఏర్పాటు చేసింది. వీరిని ప్రెస్బిటేరియన్లు అని పిలిచేవారు. ఎందుకంటే చర్చి పెద్దలు (ప్రెస్బిటర్లు) కోరుకున్న విధంగా వీరు కూడా ఒక ఉమ్మడి మత సిద్ధాంతాన్ని తమ వర్గం పక్షాన సమాజంలోని ఇతర వర్గాలన్నింటిపై రుద్దాలని భావించేవారు.

అయితే ఆ సమయానికి యుద్ధం అనివార్యమైంది. ఉదారవాద ప్రెస్బిటేరియన్ భూస్వాములు కూడా రాజుకు అపరిమిత అధికారాలు సమకూరితే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి వస్తోందని ఆందోళన చెందారు. ఫలితంగా ప్రతిఘటనకు పిలుపునిచ్చారు. కాని అంతర్యుద్ధం కొనసాగిన మొదటి రెండు సంవత్సరాలలో తమ ప్రతిఘటన స్థాయిని పరిమితం చేశారు. 1619లో కూడా హాబ్స్‌బర్గ్‌లకు వ్యతిరేకంగా బయల్దేరిన ఉద్యమంలో బొహేమియా భూస్వాములు కూడా తమ పోరాట తీవ్రతను ఇలాగే తగ్గించివేశారు. విప్లవాత్మకమైన చర్యల పట్ల వ్యతిరేకత ఉండడంవల్లే ఇంగ్లాండ్ భూస్వాములు అలా వ్యవహరించారు.

నిర్దిష్టమైన జాతీయ వ్యూహానికి అనుగుణంగా వ్యవహరించే పార్లమెంటరీ సైన్యం ఒక్కటి కూడా ఉండేది. కాదు. స్థానిక సైన్యాల సమాహారంలో ప్రతి బలగానికి ఒక భూస్వామి సైనికాధికారిగా (జనరల్), ఇతరులు (ధనిక రైతులు, వ్యాపారులు) అధికారులుగా వ్యవహరించేవారు. ఈ బలగాలకు నిలకడ లోపించడంతో విప్లవాత్మక భావాలు వాటిలో ప్రతిబింబించేవి కావు. తమ ఇష్టానికి వ్యతిరేకంగా సైనికులు పోరాటంలో పాలుపంచుకునేవారు. సైనికావసరాలకు సరిపడ నిధులను సమకూర్చడానికి భూస్వాములు నిరాకరించడంతో పార్లమెంటరీ బలగాలు రాచరిక సైన్యాలవలే పంటలను దోచుకోవడం మొదలు పెట్టాయి. ఈ ప్రక్రియలో అవి గ్రామీణ ప్రాంత రైతులు,పట్టణ ప్రాంత వృత్తిదారులను దూరం చేసుకున్నాయి.

పార్లమెంటేరియన్లు కొన్ని విజయాలను సాధించారు. లండన్‌కు చెందిన వ్యాపారులు, వృత్తిదారుల సైన్యాలు 1642 చివరలో టర్న్‌హామ్ గ్రీన్ వద్ద రాచరిక సైన్యాన్ని నగరంలో ప్రవేశించకుండా అడ్డుకున్నాయి. పార్లమెంటు, స్కాట్లాండ్‌లకు చెందిన ఉమ్మడి సైన్యాలు 1644 వేసవిలో మార్స్టన్ మూర్ వద్ద ఒక రాచరిక సైనిక బలగాన్ని ఓడించాయి. అయితే 1642-44 మధ్య జరిగిన అనేక యుద్ధాలు ఎలాంటి ఫలితం లేకుండానే ముగిశాయి. ఘోరమేమిటంటే 1645ప్రారంభం నాటికి పరిస్థితి పూర్తిగా వినాశకరంగా తయారైంది. లండన్‌కు 50 మైళ్ల దూరంలో ఉన్న ఆక్స్‌ఫర్డ్ వద్ద రాజు సైన్యాలు అప్పటికీ బలంగా పాతుకుపోయి ఉన్నాయి. పార్లమెంటరీ సైన్యాలు అలసిపోయి మానసిక స్థైర్యాన్ని కోల్పోయాయి. జీతాలు అందకపోవడంతో సైనికులు తరచూ తిరుగుబాటు చేసేవారు. సైనికులు పెద్ద సంఖ్యలో సైన్యాలను వదిలి వెళ్లారు. స్కాట్లాండ్ సైన్యం ఇంగ్లాండ్ రాజుతో విడిగా ఒప్పందం కుదుర్చుకునే అవకాశముందని పార్లమెంటరీ బృందాలు ఆందోళన చెందాయి. దిద్దుబాటు చర్యలు వెంటనే తీసుకోకపోతే వైట్ మౌంటెయిన్ యుద్ధ ఫలితం పునరావృతమవుతుందని గ్రహించాయి.

పరిస్థితిలో ఒక ఆశాకిరణం కనిపించింది. ఈస్టర్న్ అసోసియేషన్‌కు చెందిన అశ్వికదళం మార్స్టన్ మూర్ వద్ద రాచరిక సైన్యాన్ని ఓడించడంలో నిర్ణయాత్మకమైన పాత్ర పోషించింది. పార్లమెంటరీ .సైన్యంలోని ఇతర విభాగాలకు భిన్నంగా ఈ అశ్విక దళాన్ని ఏర్పాటు చేశారు. దళ నాయకుడు ఆలివర్ క్రాంవెల్ కాంబ్రిడ్జ్‌షైర్ భూస్వామి, పార్లమెంటు సభ్యుడు. అతడు ఒక తెలివైన నిర్ణయాన్ని తీసుకున్నాడు. దళాధిపతిగా అతడు పాలక వర్గ సభ్యుడిని నియమించలేదు. అలాగే దళంలో ఎవరినీ బలవంతంగా సభ్యులుగా చేర్చుకోలేదు. అందుకు భిన్నంగా అతడు మధ్యతరగతికి చెందిన స్వచ్ఛంద కార్యకర్తలను సైనికులుగా నియమించాడు. వారిలో ఎక్కువ మంది మధ్యతరగతి రైతు కుటుంబాలకు చెందిన వారు. ఈ కుటుంబాలకు గుర్రాలను పోషించే స్థాయిలో సంపద ఉండేది. అయితే కార్యనిర్వహణ విషయంలో అవి చాలా అలసత్వంగా వ్యవహరించేవి. అప్పటి ఒక పరిశీలకుడి ప్రకారం వారిలో చాలా మంది స్వేచ్ఛాజీవులు, వారికి సంతానం ఉండేవారు. మనఃసాక్షి కారణంగా యుద్ధంలో పాలుపంచు కోవడానికి వారు ముందుకు వచ్చారు.

ఇలాంటి సైన్యాలు రాచరిక సైన్యాలకు ధీటుగా పోరాడగలవని క్రాంవెల్ బలంగా నమ్మాడు. అప్పటికీ రాజు పక్షాన భూస్వామ్య సైన్యాలు, కిరాయి సైన్యాలు పోరాడేందుకు సిద్ధంగా ఉన్నాయి. క్రాంవెల్ ఏర్పాటు చేసిన అశ్విక దళం మరో విషయంలో బలంగా ఉండేది. ఆ దళం రాచరిక సైనిక విభాగాల కంటే ఎంతో క్రమశిక్షణతో వ్యవహరించేది. ఆ దళ సభ్యులు పోరాటం నుండి పారిపోయే గుణం కలవారు ఏ మాత్రం కాదు. తొలి పోరాటంలో నిధులు భారీగా సమకూరితే (దోపిడీ ద్వారా) మధ్యలో పారిపోయే కిరాయి మూకలకు భిన్నంగా ఈ దళం వారు చివరికంటూ పోరాడేవారు. "పోరాటం విలువ తెలిసిన వాడు, తాను చేస్తున్న పనేమిటో పూర్తిగా అవగాహన కలిగిన వాడు నాకు అవసరం. పోరాటం తప్ప అన్ని విషయాల్లో ముందుండే 'సంస్కారులు' నాకు అక్కర్లేదు" అని క్రాంవెల్ ఓ సందర్భంలో వ్యాఖ్యానించాడు.

భూస్వామ్య విలువలకు భిన్నంగా ఆలోచనలు, సాంప్రదాయాలు కలిగిన ఈ మధ్య తరగతి సైనికులకు భావ ప్రకటన స్వేచ్ఛ ఇవ్వనిదే వారిని దళంలో సుదీర్ఘ కాలంపాటు కొనసాగించడం కష్టసాధ్యమనికూడా క్రాంవెల్ గుర్తించాడు. మధ్యతరగతి, పేద వర్గాలకు విముక్తి మార్గాన్ని సూచించే ఈ సైనికుల మత భావాలను అణచివేయడానికి ప్రెస్బిటేరియన్లు అయిన ఎంపీలను అతడు ఏ మాత్రం అనుమతించలేదు. విప్లవ సందేశాన్ని ప్రబోధించే మత గురువులు ఈ సైన్యాలతో కలిసి ప్రయాణించారు. వారిలో ప్రముఖుడు హగ్ పీటర్. సమసమాజాన్ని స్థాపించాల్సిన అవసరముందని పీటర్ బలంగా వాదించేవాడు. పేదలు, రోగులకు గౌరవప్రదమైన జీవితం ప్రసాదించే సమాజంలో చట్ట వ్యవస్థను సక్రమంగా నిర్వహించాల్సిన అవసరముందని ప్రచారం చేసేవాడు.

రుణ బకాయిల ఎగవేతకు శిక్షను రద్దు చేయాలని పీటర్ కోరాడు. నాస్తికుడు, విప్లవవాది అయిన జాన్ లల్‌బర్న్‌ను మాంచెస్టర్ ఫ్యూడల్ దొర బారి నుండి క్రాంవెల్ రక్షించాడు. దాంతో క్రాంవెల్ గురించి ఆ దొర రకరకాల వదంతులను వ్యాపింపచేశాడు. ఇంగ్లాండ్‌లో భూస్వామ్య దొరల ఆచూకీ లేకుండా చేయాలని క్రాంవెల్ యోచిస్తున్నాడని, దొరలకు వ్యతిరేకులైన వారందరినీ క్రాంవెల్ వెనకేసుకు వస్తున్నాడని అతడు ఆరోపించాడు. అయితే ఆ సమయంలో క్రాంవెల్‌కు అలాంటి భావాలుండేవని ఖచ్చితంగా చెప్పలేము. కాని ఒక్క విషయం మాత్రం వాస్తవం. కాంబ్రిడ్జ్ షైర్‌లో రైతుల పక్షాన నిలిచిన క్రాంవెల్ ఆ ప్రాంతంలో గట్టి మద్దతును సంపాదించుకున్నాడు. భూస్వామ్య దొరలు వ్యవసాయ కాలువలను మూసివేయడంతో రైతులు తీవ్రంగా నష్టపోయారు. వారి డిమాండ్లకు మద్దతుగా క్రాంవెల్ రాజకీయ పోరాటం నిర్వహించాడు. అలాగే మధ్య తరగతి ప్రజల వర్గ భావాలను ప్రతిబింబించేలా ప్రచారం నిర్వహించాడు. పీడిత ప్రజల ఆగ్రహాన్ని సొమ్ము చేసుకొని (అవసరమైతే) రాజును ఓడించడానికి కూడా సిద్ధమయ్యాడు. ఐరోపా ఖండమంతటా చెలరేగుతున్న పోరాటంలో ఏ ప్రొటెస్టెంట్ నాయకుడూ చూపని తెగువను ప్రదర్శించడానికి క్రాంవెల్ వెనుకాడలేదని దీనిని బట్టి అర్థమవుతుంది.

## నవీన ఆదర్శ సైన్యం

1645 వసంత కాలంలో క్రాంవెల్ ప్రముఖ పార్లమెంటేరియన్‌గా అవతారమెత్తాడు. ఓటమిని తప్పించుకోవాలంటే కేంద్రీకృత శక్తిగా సైన్యాన్ని తీర్చిదిద్దడమే ఏకైక మార్గమని అతడు విశ్వసించాడు. యుద్ధ రంగానికి దూరంగా ఉన్న పాలకవర్గ సభ్యులను సైన్యంలో కీలక బాధ్యతలను అప్పగించరాదని, అలాగే భూస్వామ్య దొరలను కూడా దూరంగా ఉంచాలని నిర్ణయించాడు. అయితే క్రాంవెల్, అతడి సహచర ఎంపీలు సాధారణ, పెద్దల సభ నుండి ఈ ప్రతిపాదనలపై తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొన్నారు. ఫలితంగా లండన్ నగరంలోని విప్లవోద్యమకారులైన వృత్తిదారులు, గుత్తాధిపత్య వాణిజ్యాన్ని వ్యతిరేకించే వ్యాపారుల మద్దతుతో క్రాంవెల్ పాలకవర్గాల వ్యతిరేకతను అధిగమించాడు. విప్లవ విజయానికి ప్రధాన సాధనమైన 'నవీన ఆదర్శ సైన్యం' ఇలాంటి తీవ్ర సంక్షోభ ఘడియలో ఆవిర్భవించింది.

ఈ సైన్యంలో క్షేత్రస్థాయి పోరాట వీరులను (పదాతి దళాలు) పాత పద్ధతుల్లోనే భర్తీ చేశారు. యుద్ధానికి దారి తీసిన మౌలిక అంశాలపట్ల ఎలాంటి చిత్తశుద్ధి లేని వారు సైతం సైనికులుగా నియమితులయ్యారు. అయితే అశ్వికదళం మాత్రం నిర్దిష్టమైన నియమనిబంధనల ప్రకారం ఏర్పాటైంది. ఐరన్‌సైడ్స్ దళం లాగా ఈ కొత్త దళంలో కూడా మత, రాజకీయ సిద్ధాంతాల పట్ల నిబద్ధత ఉన్న వారినే చేర్చుకున్నారు. పదాతి దళాల్లో కూడా నిబద్ధత కలిగిన సైనికులు కొందరు ఉండేవారు. యుద్ధం కీలకదశలో ఉన్నప్పుడు వీరు తమ తోటి సైనికులకు సైద్ధాంతిక మార్గదర్శులుగా వ్యవహరించారు. ఒక విధంగా చెప్పాలంటే విప్లవ సిద్ధాంతం సైన్యానికి వెన్నెముకగా ఉండేది. హుగ్ పీటర్ లాంటి ప్రచారకులు తమ ఉపన్యాసాలు, కరపత్రాలు, రచనల ద్వారా విప్లవ జ్వాలలను రగిల్చారు. సైనికుల్లో స్థైర్యం నింపడానికి దినపత్రికలను కూడా పంపిణీ చేశారు. మత, రాజకీయ వ్యవహారాలపై ప్రచార సామాగ్రిని విస్తృతంగా అందుబాటులోకి తెచ్చారు.

1645 జూన్‌లో నాస్బీ వద్ద జరిగిన యుద్ధంలో ఈ విప్లవ దృక్పథం స్పష్టంగా వెల్లడైంది. తొలి దశలో రాచరిక అశ్విక దళం పై చేయిని సాధించినప్పటికీ పార్లమెంటరీ సైన్యం నిలదొక్కుకోగలిగింది. ద్విగుణీకృత శక్తితో ఎదురుదాడి జరిపి శత్రుసైన్యాన్ని ముట్టబెట్టింది. ఈ యుద్ధం ముగిసిన కొద్ది రోజులకే ఆక్స్‌ఫర్డ్ వద్ద ఉన్న రాజు సైనిక స్థావరం పార్లమెంటరీ సైన్యాల వశమైంది. రాజు అక్కడి నుండి పారిపోయినా నేవార్క్ వద్ద స్కాటిష్ సైన్యానికి లొంగిపోవాల్సి వచ్చింది.

అంతర్యుద్ధంలో ఇదో నిర్ణయాత్మకమైన పోరాటం. అయితే అంతటితోనే ఈ విప్లవం ఆగిపోలేదు.

రాజు నుండి పొంచి ఉన్న ముప్పు తొలగిపోవడంతో భూస్వాములు, పాలకవర్గంలోని మెజారిటీ సభ్యులు ప్రజా ఉద్యమంపై వ్యతిరేక భావనను పెంచుకున్నారు. నవీన ఆదర్శ సైన్యాన్ని వెంటనే రద్దు చేయాలని వారు గట్టిగా డిమాండ్ చేశారు. మతపరమైన స్వేచ్ఛను రద్దు చేయాలని, ప్రత్యర్థి మత సమూహాలను అణచివేయాలని, లౌకికవాద విప్లవకారులను అంతమొందించాలని ఒత్తిడి చేశారు.

అయితే ఈ ప్రక్రియలో మరో ప్రబలమైన శక్తి అవతరించింది. దానిని పార్లమెంటరీ సైన్యం కూడా అడ్డుకోలేకపోయింది. జీతాలు చెల్లించకుండానే సైన్యాన్ని రద్దు చేయాలన్న ప్రతిపాదనను మెజారిటీ సైనికులు నిరసించారు. అలాగే ఐర్లాండ్‌లో మరో భీకర యుద్ధానికి తెర తీయాలన్న ప్రణాళికను కూడా తీవ్రంగా వ్యతిరేకించారు. అశ్వికదళంలోని మధ్యతరగతి సైనికులు మొదటి నుండి విలువల పరిరక్షణ కోసం పోరాడారు. వారు కూడా పై ప్రతిపాదనలను జీర్ణించుకోలేకపోయారు. గతంలో ఎన్నడూ లేని విధంగా వారు కూడా విప్లవాత్మక వైఖరిని తీసుకున్నారు. తమ భవిష్యత్ అంధకారమయం అవుతుందని సాధారణ సైనికులు సైతం ఆవేదన చెందారు. రాచరిక వ్యవస్థ పట్ల వారు తరచూ అనుకూల ధోరణిని ప్రదర్శించినా సైన్యంలోని మైనారిటీ విప్లవకారులు తమ ఉపన్యాసాల ద్వారా వారి ఆలోచనలను మార్చివేశారు.

ఆశ్విక దళంలోని ఎనిమిది భాగాలు తమ తరపున ఇద్దరేసి ప్రతినిధులను ఎన్నుకున్నాయి. సైనికుల అభిప్రాయాలను ఈ ప్రతినిధులు నాయకుల ముందు వ్యక్తం చేసేవారు. సైన్యంలోని ఇతర రెజిమెంట్లు కూడా తమ ప్రతినిధులను ఎన్నుకొని అదే బాటలో నడిచాయి. ఈ ప్రతినిధులు నాయకులు ఎదుట డిమాండ్లను పెట్టడం ప్రారంభించారు. రాజు ప్రాబల్యాన్నే కాకుండా భూస్వాముల నియంత్రణను కూడా సవాలు చేశారు. సాధారణ సభలో భూస్వాములను నిందిస్తూ ఒక ప్రకటనను ముందుంచారు. సార్వభౌమత్వాన్ని ఆస్వాదించిన కొందరు భూస్వాములు నియంతలుగా అవతారమెత్తారని ఆ ప్రకటనలో ఆరోపించారు. రెజిమెంటు సమావేశాలు విద్రోహాన్ని రెచ్చగొట్టే సాధనాలుగా మారాయి. సాధారణ సభకు సభ్యుల ఎన్నిక తీరును (పరిమిత ఓటు హక్కుతో) ఈ సమావేశాలు దుయ్యబట్టాయి. పార్లమెంటును పూర్తిగా రద్దు చేయాలని, ప్రెస్బిటేరియన్ మంత్రులపై కక్ష తీర్చుకోవాలని, న్యాయస్థానాల జుగుప్సాకరమైన వ్యాఖ్యాలను ఖండించాలని పిలుపునిచ్చాయి. సైనిక ప్రతినిధుల సమావేశాలు స్వయం నిర్వహణా వ్యవస్థను ఏర్పాటు చేసే దిశగా పావులు కదిపాయి. సంస్థాగత స్వరూపాన్ని సంతరించుకొని సైనికుల డిమాండ్లను గట్టిగా నొక్కి చెప్పాలని నిర్ణయించాయి. కరపత్రాలను (కోర్కెలకు సంబంధించి) రూపొందించడానికి ఒక రచయితల బృందాన్ని ఏర్పాటు చేశారు. ఉన్నతాధికారులు తమకు ముద్రణా యంత్రాలను సమకూర్చిపెట్టాలని డిమాండ్ చేశారు. ఆదర్శ సైన్యానికి దూరంగా ఉన్న ఇతర సాయుధ బలగాలను రెచ్చగొట్టడానికి కొందరు ప్రతినిధులను పంపారు. దేశవ్యాప్తంగా ఉన్న ఇతర విప్లవ సంఘాలు, ఉద్యమకారులతో సంబంధాలను ఏర్పాటు చేసుకోవడం మొదలుపెట్టారు. వీరంతా అంతర్యుద్ధంవల్ల తీవ్రంగా ప్రభావితమైన వారే కావడం విశేషం.

## లెవలర్స్, విప్లవకారులు

ప్రజాస్వామ్య, విప్లవ పక్షమైన లెవలర్స్ ప్రజల్లో తన పలుకుబడిని బాగా పెంచుకుంది. ఈ పక్షానికి రిచర్డ్ ఓవర్టన్, జాన్ వైల్డ్‌మాన్, విలియం వాల్విన్, జాన్ లిల్‌బర్న్ లాంటి పెద్దలు నాయకత్వం వహించారు. 1647 అక్టోబరులో లెవలర్స్‌కు ప్రజామద్దతు ఉచ్ఛస్థాయికి చేరుకుంది. వీరి ప్రభావంలో విప్లవాత్మక కార్యాచరణకు సిద్ధమైన సైనికులను శాంతింపచేయడానికి క్రాంవెల్, ఇతర సైనికాధికారులు వారితో సమావేశం నిర్వహించాల్సి వచ్చింది. ఈ సమావేశం పట్నీలో జరిగింది. భూస్వామ్య, వ్యాపార వర్గాలకు సమాజంపై నియంత్రణను విప్లవకారుడైన రెయిన్‌బరోవే అనే అధికారి ఈ సమావేశంలోనే ప్రశ్నించాడు. "ఇంగ్లాండ్‌లో సంపన్నుడితో సమానంగా గౌరవప్రదమైన జీవితం గడిపే హక్కు పేదలకూ ఉంది. తన వాణిని ప్రతిబింబించని ప్రభుత్వానికి పేద వాడు కట్టుబడి ఉండాలని ఎక్కడా లేదు." దీనికి ప్రతిస్పందించిన క్రాంవెల్ సమీప సహచరుడు ఐర్టన్ వర్గ దృక్పథాన్ని విడమర్చి చెప్పాడు. అతడి వాదన స్వతంత్రుల్లో (స్వేచ్ఛావాదులు) మరింత ఉత్సాహాన్ని నింపింది. "రాజ్య వ్యవస్థలో శాశ్వతమైన ప్రయోజనాలు కలిగిన వారు తప్ప మరెవ్వరూ రాజ్య నిర్వహణలో తమకు వాటా కావాలని కోరరాదు. భూములన్నీ తమ గుప్పిట్లో ఉంచుకున్న భూస్వాములు కాని, వాణిజ్య కార్యకలాపాలపై

గుత్తాధిపత్యం ఉన్న వ్యాపార సంస్థలు కాని ప్రభుత్వాన్ని నియంత్రించాలని భావించడం శ్రేయస్కరం కాదు.”

తరచూ పేర్కొన్నట్లు లెవలర్స్ ఉద్దేశ్యం సార్వజనీన ఓటు హక్కును (మగవారికి) సాధించడం ఏ మాత్రం కాదు. ఒత్తిడి తీవ్రమైతే తమ విధానాలను కూడా మార్చుకోవడానికి సిద్ధమయ్యేవారు.

ఓటు హక్కును పొందడానికి అర్హులైన వారి జాబితా నుండి సేవకులను (ఇతరుల సేవలో ఉన్నవారు) తొలగించడానికి సంసిద్ధతను వ్యక్తం చేశారు. రాచరిక దొరలు, భూస్వాములు తమ సేవకులను, కార్మికులను, ఇంటి పనివారిని తమకు అనుకూలంగా ఓటు వేసేలా ఒత్తిడి తెస్తారనే భయంతోనే లెవలర్స్ ఈ నిర్ణయం తీసుకొని ఉంటారు. అలాగే సైన్యంలో విప్లవ వర్గానికి ప్రాతినిధ్యం వహించే మధ్యతరగతి ఆశ్వికులు కార్మికులకు ఎలాంటి హక్కు ఉండరాదని వాదించడంతో వారి అభ్యంతరాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవలసి వచ్చింది.

లెవలర్ నాయకుడు లిల్‌బర్న్ ఒక ప్రకటనను విడుదల చేశాడు. ఆస్తులను కనీస స్థాయిలో కలిగి ఉన్న వారికి రాజకీయ హక్కులను కోరినంత మాత్రాన ప్రైవేటు ఆస్తుల వ్యవస్థపై దాడి చేస్తున్నట్లు భావించరాదని ప్రకటించాడు. నీతికి, నిజాయితీకి (ఆస్తులకు కూడా) ఈ వర్గం పెట్టింది పేరని, వారి ప్రకటనల్లో కాని, రచనల్లో కాని అభ్యంతరమైన అంశాలేవీ లేవని లిల్‌బర్న్ పేర్కొన్నాడు.

> “స్వేచ్ఛకు, నిజాయితీకి నిజమైన వారసులైన వీరు వినాశకరమైన పద్ధతులను అనుసరించగలరని భావించడం చాలా తప్పు. సార్వజనీన సముదాయం లేదా అలాంటి వ్యవస్థను ఏర్పాటు చేస్తారన్నది కూడా అపోహ మాత్రమే. అధికార యంత్రాంగాన్ని, ప్రైవేటు ఆస్తులను రద్దు చేస్తారన్న ఆరోపణలో ఎలాంటి తర్కం లేదు. మతిస్థిమితం లేని వారే అలాంటి హాస్యాస్పదమైన సందేహాలను, అభిప్రాయాలను వ్యక్తం చేయగలరు. అసలు అలాంటి సూత్రాన్ని ముందుకు తేవడం అర్థరహితం, అనాలోచితం, ఇవన్నీ ఊహాగానాలు తప్ప మరొకటి కావు” అని లిల్‌బర్న్ రాతపూర్వకంగా వివరణ ఇచ్చాడు.

ఏమైనప్పటికీ సైనిక ప్రతినిధుల ఎన్నిక, సాధారణ పౌరులకు రాజకీయ హక్కులు సమానంగా ఉండాలన్న పిలుపు అప్పటికే ఆందోళన చెందుతున్న ప్రెస్బిటేరియన్ ఉదారవాదులను మరింత కృంగదీసింది. భూస్వామ్య, వ్యాపార వర్గాల ప్రాబల్యానికి సైన్యంలోని మధ్యతరగతి, పేద వర్గాల నుండి ముప్పు ఏర్పడింది. ఈ రెండు వర్గాల ప్రజలు దేశంలోనే అత్యంత విశాలమైన సాయుధ బలగానికి ప్రాతినిధ్యం వహించేవారు. పాలకవర్గంలోని ఒక సమూహానికి, రాజుకు మధ్య ఘర్షణ విప్లవపోరుకు దారి తీసే పరిస్థితులు ఏర్పడ్డాయి.

పార్లమెంటులోని ఉదారవాదులు తమ ఎదుట హాజరు కావాలని ముగ్గురు సైనిక ప్రతినిధులను ఆదేశించారు. వారిని ఎలా శిక్షించాలనే అంశమై తర్జనభర్జన పడ్డారు. డెన్జిల్ హాల్స్ అనే ప్రెస్బిటేరియన్ నాయకుడు కనీసం ఒక్క సైనిక ప్రతినిధికైనా ఉరి శిక్ష విధించడం

ద్వారా ఇతరులకు హెచ్చరిక పంపాలని తర్వాత పేర్కొన్నాడు. అయితే పార్లమెంటు సభ్యులు సైనిక ప్రతినిధులకు ఎలాంటి హాని తలపెట్టకుండా సురక్షితంగా పంపివేశారు. తమకు విధేయత చూపే సైన్యాలను స్వంతంగా ఏర్పాటు చేసుకునేవరకు ఎంపీలు ఎలాంటి తీవ్ర చర్యను తీసుకోలేకపోయారు. లండన్ నగర పాలకుల కోసం సైనిక బలగాలను సమీకరించడానికి వారు ప్రయత్నాలు ప్రారంభించారు. తాము సమకూర్చుకున్న కిరాయి సైన్యాల నుండి విప్లవకారులను ఏరివేయడానికి, రక్షణ బృందాలను ఏర్పాటు చేయడానికి చర్యలు తీసుకున్నారు. ప్రతి కౌంటీలోనూ భూస్వామ్య ప్రయోజనాలను పరిరక్షించడానికి సాయుధ దళాలను ఏర్పాటు చేసే బాధ్యతను ఈ రక్షణ బృందాలకు అప్పగించారు. ఆయుధాలు తమ నియంత్రణలో ఉండేలా చూసేందుకు జాగ్రత్తలు తీసుకున్నారు. స్కాటిష్ సైన్యాన్ని ఇంగ్లాండ్‌కు రప్పించడానికి తమ తోటి ప్రెస్బిటేరియన్లతో చర్చలు జరిపారు. పాత రాచరిక వ్యవస్థ కంటే కొంత మెరుగైన పాలనా వ్యవస్థను ఏర్పాటు చేయాలంటే రాచరిక భూస్వాములతో చేతులు కలపక తప్పదని పార్లమెంటు సభ్యులు బలంగా నమ్మారు.

క్రాంవెల్ చుట్టూ చేరిన స్వతంత్రులు పార్లమెంటులో బలహీనమైన శక్తిగా ఉండేవారు. అయితే తమను తాము రక్షించుకోవడానికి సైనిక ప్రతినిధుల ఉద్యమాన్ని వినియోగించుకోవచ్చని గ్రహించారు. అదే సమయంలో ఉద్యమం అదుపు తప్పకుండా చూడాలని నిర్ణయించారు. సైనిక ప్రతినిధులు, ఉన్నతాధికారులు సమాన సంఖ్యలో ఉన్న సైనిక మండలిని ఏర్పాటు చేశారు. క్షేత్రస్థాయి సైనికులు మధ్యతరగతికి చెందిన అశ్విక దళ సభ్యులను అప్పటికీ వ్యతిరేకించేవారు. సైనికుల్లో గూడు కట్టుకున్న అసంతృప్తిని తమ స్వంత ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి కొందరు ఉన్నతాధికారులు ఒక సాధనంగా వాడుకున్నారు.

రాజు తమతో ఒప్పందానికి వచ్చేలా ఒత్తిడి పెంచాలని స్వతంత్రులు తొలుత నిర్ణయించారు. ప్రెస్బిటేరియన్ పార్టీ చెరలో ఉన్న రాజును విడిపించి తమ నియంత్రణలోకి తెచ్చుకునేందుకు వారు కొన్ని బలగాలను పంపారు. క్రాంవెల్‌తోపాటు అతడి అనుచరులు ఒక విషయాన్ని స్పష్టం చేయదలచుకున్నారు. అంతర్యుద్ధంలో తామే విజయం సాధించామని, కనుక రాజు తాము చెప్పినట్లు నడుచుకోవాలని, పాలనా సంస్కరణలు తీసుకురావాలని వాదించారు. గతంలో వారు ప్రతిపాదించిన సంస్కరణలన్నింటినీ రాజు నిర్ద్వందంగా తిరస్కరించాడు. అయితే స్వతంత్రుల ప్రతిపాదనల్లో ఎలాంటి విప్లవాత్మకమైన సంస్కరణలు కనిపించలేదు. రాచరిక వ్యవస్థను కొనసాగించాలని, పెద్దల సభను రద్దు చేయరాదని (ఈ సభకు పాలక, భూస్వామ్య, చర్చి పెద్దలు పరోక్షంగా ఎన్నికయ్యేవారు), ఓటు హక్కును ఉన్నత వర్గాలకే పరిమితం చేయాలని వారు ప్రతిపాదించారు.

---------

రాచరిక విలువలకు ప్రతికూలమైన ఎంపీల డిమాండ్లను చార్ల్స్ తోసిపుచ్చాడు. 1647 నవంబరులో నిర్బంధం నుండి తప్పించుకున్న తర్వాత అంతర్యుద్ధాన్ని మరో రూపంలో కొనసాగించాలని నిర్ణయించాడు.రాజుతో అధికారం కోసం మంతనాలు జరపడం పొరపాటేనని అపుడు క్రాంవెల్ గ్రహించాడు. యుద్ధ పథంలో ఉన్న తమ రాజకీయ పక్షానికి నిధులు

సమకూర్చేలా పార్లమెంటుపై ఒత్తిడి తేవడానికి అతడు నవీన ఆదర్శ సైనిక బలగాలను వినియోగించాడు. 1648 వేసవిలో రెండవ అంతర్యుద్ధంగా పేర్కొనబడ్డ పోరాటం మొదలైంది. పార్లమెంటు మాజీ సమర్థకులు రాచరిక అశ్వికదళాలతో కలిసి పోరాడారు. సౌత్ వేల్స్, కెంట్, ఎసెక్స్‌లలో రాచరిక ఉద్యమాలు పోటెత్తాయి. స్కాట్లాండ్ నుండి ఆక్రమణ మొదలైంది.

ఈ పోరాటంలో రాచరిక వ్యతిరేక సైన్యం విజయం సాధించింది. యుద్ధం తర్వాత కాలయాపన లేదా రాజుతో మంతనాలు జరిపే విధానాలను మాత్రం ఈ సైన్యం అనుసరించలేదు. క్రాంవెల్ ఇలా ప్రకటించాడు : "తమ విధానాలను మార్చుకోని వారు, గొడవ సృష్టించనిదే దేశాన్ని వదలి వెళ్లని వారిని సాధ్యమైనంత త్వరగా నాశనం చేయాలి." చార్ల్స్, అతడి ప్రధాన సలహాదారులకు మరణ శిక్ష విధిస్తూ ఆదర్శ సైన్యం అధికారులు ఒక తీర్మానం ఆమోదించారు. ఎంపీలలో మెజారిటీ వర్గంగా ఉన్న ప్రెస్బిటేరియన్లు ఈ ప్రతిపాదనను అంగీకరించరని గ్రహించిన ఆదర్శ సైన్యం లండన్ నగరాన్ని స్వాధీనం చేసుకుంది. కల్నల్ ప్రైడ్ నేతృత్వంలోని సైనిక బలగాలు సాధారణ సభ సభ్యులను గృహ నిర్బంధంలో ఉంచాయి. మిగతా బలగాలు లండన్ నగరపాలక సంస్థపై పట్టున్న వ్యాపార, ఉన్నత వర్గాల సభ్యులను అదుపులోకి తీసుకొన్నాయి. జనవరి చివరి నాటికి వైట్‌హాల్‌లో గుమికూడిన ప్రజలు అంతా చూస్తుండగానే ఒక కసాయి చార్ల్స్ తలను నరికి దానిని తన చేతుల్లో తీసుకొని అందరికీ ప్రదర్శించాడు.

చార్ల్స్ బహిరంగ శిక్షకు దారి తీసిన పరిణామాలకు సమాంతరంగా నవీన ఆదర్శ సైన్యంలో కూడా అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి. సైన్యానికి మద్దతు తెలిపిన సాధారణ పౌరులు సైతం సందేహాలను, అపోహలను వ్యక్తం చేయడం మొదలుపెట్టారు. సైన్యంలో విప్లవ భావాలు లోపించి ఉన్నట్లయితే క్రాంవెల్ కాని అతడి సమర్థకులైన స్వతంత్రులు కాని లండన్ నగరాన్ని స్వాధీనం చేసుకోగలిగేవారు కాదు. అలాగే ప్రెస్బిటేరియన్లను, రాజును అణచివేసేవారు కాదు. క్రాంవెల్ స్వయంగా లండన్ సౌధానికి వెళ్లి అక్కడ నిర్బంధంలో ఉన్న లిల్‌బర్న్‌ను పరామర్శించాడు. అతడితో ఒక అవగాహనకు రావడానికి ప్రయత్నించాడు. అయితే రెండవ అంతర్యుద్ధం అనివార్యం కావడంతో అతడు సైనిక బలాన్ని ప్రయోగించడానికి కూడా వెనుకాడలేదు. ప్రతీఘాత విప్లవం బయల్దేరుతుందన్న ఆందోళనతోనే లెవలర్స్‌ను ప్రెస్బిటేరియన్ల అణచివేత నుండి పరిరక్షించడానికి క్రాంవెల్ పైచర్యలు తీసుకోవడానికి సిద్ధమయ్యాడు. యుద్ధాన్ని బూచిగా చూపి అతడు సైన్యం నుండి మితవాదులను ఏరివేశాడు. సైన్యంలో తిరుగుబాటు యత్నాన్ని విఫలం చేశాడు. తిరుగుబాటుకు నాయకత్వం వహించిన రిచర్డ్ ఆర్నాల్డ్ అనే అధికారిని బహిరంగంగా ఉరి తీయించాడు. లండన్ లెవలర్స్‌ను నిర్బంధించాడు. అదే సమయంలో అతడు లెవలర్స్ ప్రభావమున్న సైన్యంపై ఆధారపడి తదుపరి కార్యాచరణను పూర్తి చేశాడు. రాజును బహిరంగంగా హత్య చేసేవరకు, అలాగే తదనంతర పరిణామాల వరకు క్రాంవెల్ ఈ సైన్యంపై పూర్తిగా ఆధారపడ్డాడు. ఆ తర్వాతే వర్గ భావాలను రెచ్చగొట్టే వారిని తుదముట్టించగలనన్న ఆత్మ విశ్వాసాన్ని ప్రదర్శించగలిగాడు. రాష్ట్ర మండలిలోని తన సహచర సభ్యులను క్రాంవెల్ తీవ్రంగా దూషించాడు. "అయ్యా! నేను మీకు విన్నవించుకుంటోంది

ఒక విషయాన్ని మాత్రమే. వర్గ ఆకాంక్షలను రెచ్చగొడుతున్న వారిని అడ్డుకోవాలంటే వారిని అణచివేయడం తప్ప మరో మార్గం లేదు. లేని పక్షంలో వారు మిమ్ములను అణచివేస్తారు."

1649 వసంత కాలంలో లెవలర్ నాయకులు లండన్‌లోని సొధానికే పరిమితం అయ్యారు. మే మాసంలో సుమారు వెయ్యి మంది సైనికులు జరిపిన తిరుగుబాటును అణచివేశారు. విద్రోహానికి నాయకత్వం వహించిన నలుగురిని ఆక్స్‌ఫర్డ్‌షైర్‌లోని బర్‌ఫోర్డ్ చర్చి ప్రాంగణంలోని బహిరంగంగా ఉరి తీశారు.

ఇంగ్లాండ్‌లో రాజును, ప్రెస్బిటేరియన్లను ఓడించడానికి ఆదర్శ సైన్యంలోని విశాలమైన బలగాల అవసరం లేకుండాపోయింది. సైనికుల ప్రతినిధులు మినహా మిగతా వారందరినీ ఐర్లాండ్‌కు తరలించారు. ఒక లెవలర్ కరపత్రం సైనికులను ఉద్దేశించి ఇలా పిలుపునిచ్చింది:

> "ఇంగ్లాండ్‌లో చేసిన విధంగా ఐర్లాండ్‌లో కూడా మీరు నరమేధానికి పాల్పడి మీ అధికారులను నిరంకుశ దొరలుగా, నియంతలుగా మారుస్తారా? ఐరిష్ ప్రజలను పరాధీనులను చేయడమే మీ లక్ష్యమా? అబ్కారీ, సుంకాలు, గుత్తాధిపత్య (వాణిజ్యంలో) హక్కులకే వారి సంతోషాన్ని పరిమితం చేస్తారా? లేదా అక్కడి చెరసాలలను పేదలు, వికలాంగులైన బందీలతో నింపి వేస్తారా? అక్కడి భూమిని భిక్షగాళ్లతో ముంచెత్తుతారా?"

ఇంగ్లాండ్ పాలకవర్గం ఐర్లాండ్‌లో సాధించదలచిన లక్ష్యాలను పై కరపత్రం దూరదృష్టితో గ్రహించి సైనికులకు గట్టి సంకేతాన్ని పంపింది. అయితే పేదలైన సైనికులను ఐర్లాండ్ యాత్ర చేపట్టకుండా ఆ కరపత్రం నిలువరించలేకపోయింది. తమ నాయకులు కాల్చివేయబడిన తర్వాత సైనికులకు సైన్యం తప్ప మరో జీవనోపాధి లేకుండా పోయింది. ఫలితంగా అనేక మంది ఐర్లాండ్‌కు వెళ్లేందుకు స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు.

లెవలర్ల ఉద్యమానికి పేద ప్రజల ఆకలి దప్పులు బాటలు వేయలేదు. అందుకు భిన్నంగా మధ్యతరగతి వర్గమైన వృత్తిదారులు, చిరు వ్యాపారులు, సంపన్న రైతులు, ఈ కుటుంబాల నుండి వచ్చిన సైనికులు ఆ ఉద్యమానికి పునాదులు వేశారు. వీరు అత్యంత సాహసోపేతమైన, విప్లవ కాంక్ష కలిగిన పక్షంగా అవతరించారు. ఒక విప్లవ కార్యాచరణను అమలు పరిచారు. అది పూర్తిగా సఫలమై ఉన్నట్లయితే ఇంగ్లాండ్ సమాజంలో మరింత ప్రబలమైన విప్లవాత్మకమైన మార్పులు వచ్చి ఉండేవి. అయితే వాస్తవ పరిస్థితులు అందుకు భిన్నంగా ఉన్నాయి. క్యాపిటలిస్టు తరహా ఉత్పత్తి మార్గాల ద్వారా అభ్యున్నతి సాధించాలన్న మధ్యతరగతి ప్రజలు, సామాజిక వర్గాల ఆకాంక్షలకు ప్రతిరూపంగా లెవలర్ ఉద్యమం విస్తరించింది. ఉద్యమం ముగిసిన వందేళ్లకు ఈ సామాజిక వర్గాలు స్వయం స్పృహ కలిగిన మధ్యతరగతిగా సమాజంలో నిర్దిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అయితే అలా చేయడం ద్వారా సమాజంలోని ఒక పరిమిత వర్గానికే ఇతరులపై పాలించే హక్కు ఉందన్న సాంప్రదాయ

వాదనను వారు సవాలు చేయగలిగారు. జర్మన్ రైతాంగ యుద్ధంలో ముంజర్, అతడి అనుచరులు వ్యవహరించిన రీతిలోనే వీరు కూడా వర్గపాలనకు ప్రత్యర్థి వర్గ ప్రతిఘటన సాంప్రదాయాన్ని ఏర్పాటు చేశారు.

లెవలర్లు ఓడిపోయినంత మాత్రం వారి ఉద్యమం, సంవత్సరాల తరబడి సాగిన పోరాటం సాధించిందేమీ లేదని భావించడానికి వీల్లేదు. క్రాంవెల్ చుట్టూ చేరిన వర్గం విప్లవాత్మకమైన పద్ధతులను అనుసరించడంతో పరిమితంగానే అయినా విజయాన్ని మాత్రం సాధించగలిగింది. 1649 నుండి ఇంగ్లాండ్ ప్రభుత్వం (అలాగే కొంత కాలం తర్వాత స్కాట్లాండ్ ప్రభుత్వం కూడా) సైనికాధికారుల ఆధ్వర్యంలో నడిచింది. వీరిలో చాలా మంది మధ్యతరగతి కుటుంబాలకు చెందిన వారే కావడం విశేషం.

రెండవ అంతర్యుద్ధం ముగిసిన తర్వాత క్రిస్టోఫర్ హిల్ ఇలా వ్యాఖ్యానించాడు :

> "ఇప్పుడు పరిస్థితులను తమ నియంత్రణలోకి తీసుకుంటున్న వారు లెవలర్లు కాకపోయినప్పటికీ  గతంలో ఎన్నడూ లేని విధంగా సమాజంలోని దిగువశ్రేణి వర్గాలకు చెందిన వారు. గతంలో మాజీ సైనికాధికారి కల్నల్ ఈవర్, రైతు లేదా మాంసం వ్యాపారి కుమారుడైన కల్నల్ థామస్ హారిసన్, మద్యం తయారీ పరిశ్రమలో ఉద్యోగిగా పని చేసిన ప్రైడ్, చర్మ వ్యాపారి కల్నల్ ఓకే, పాదరక్షలను తయారు చేసే హీవ్‌సన్, ఉప్పు వ్యాపారి గాఫే, స్వర్ణకారుడైన బార్క్‌స్టెడ్, ఇనుము పరిశ్రమలో చిరు ఉద్యోగి అయిన బెర్రీ, గుండీలను తయారు చేసే కెలెసీ... వీరంతా మధ్యతరగతి, పేద వర్గాల నుండి వచ్చిన వారే. 1648 డిసెంబరులో అధికారం చేపట్టిన వారు, చార్ల్స్ మరణానికి కారణమైన వారు ఇంగ్లాండ్ సాంప్రదాయబద్ధ పాలకుల కంటే తక్కువ సామాజిక హోదా కలిగిన వ్యక్తులే."

ఇంగ్లాండ్ సమాజాన్ని భూస్వామ్య వ్యవస్థ వైపు శాశ్వతంగా నెట్టివేసి పాలకవర్గంగా ఎదిగిన వారిని కొత్తగా అధికారంలోకి వచ్చిన ఇలాంటి వ్యక్తులు కొన్ని కఠినమైన చర్యలను అమలు చేసి వారి ప్రాబల్యాన్ని చావు దెబ్బ తీశారు. ఈ విధంగా ఇంగ్లాండ్ విప్లవం మార్కెట్ సంబంధాలు, క్యాపిటలిస్టు దోపిడీ పద్ధతులను ఆధారంగా సమాజాభివృద్ధికి రంగాన్ని సిద్ధం చేసింది.

క్రాంవెల్ స్వయానా ఈ కొత్త బూర్జువా దోపిడీ వర్గానికి చెందిన వాడు కాదు. సంపన్న వ్యాపారులతో మాత్రం అతడికి కుటుంబ సంబంధాలు ఉండేవి. అయితే తర్వాతి కాలంలో బూర్జువా వర్గంగా ఎదిగిన మధ్యతరగతి ప్రజలపై ఆధారపడకుండా ఉన్నట్లయితే క్రాంవెల్ తన లక్ష్యాలను సాధించే వాడుకాదు.

కొత్త పద్ధతులు, కొత్త వ్యక్తులపై ఆధారపడనిదే ఇంగ్లాండ్ సమాజం ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని పరిష్కరించలేమన్న వాస్తవాన్ని గ్రహించడంలోనే క్రాంవెల్ నేర్పు బయటపడుతుంది. ఈ మార్గమొక్కటే ఇంగ్లాండ్ విప్లవాన్ని గట్టెక్కించగలదని లేని పక్షంలో ఫ్రెంచి కాల్వినిస్టులు లేదా బొహేమియా జాగీర్లు ఎదుర్కొన్న ఘోర పరాభవాన్ని చవి చూడక తప్పదని అతడు బలంగా నమ్మాడు. భూస్వామ్య కుటుంబానికి చెందిన ఒక సభ్యుడు ఈ విప్లవాన్ని ముందుకు నడిపించాల్సి వచ్చింది. ఫలితంగా సమాజాన్ని ప్రధానంగా బూర్జువా పద్ధతుల్లో నియంత్రించడానికి ఆస్కారం ఏర్పడింది.

ఇంగ్లాండ్‌ను ఆలివర్ క్రాంవెల్ దశాబ్దంపాటు దాదాపుగా నియంతగా పాలించాడు. అతడి ప్రభుత్వం ఎక్కువగా సైనిక బలగంపైనే ఆధారపడింది. అయితే విశాలమైన సామాజిక వర్గాల మద్దతు లేకుండానే అతడి ప్రభుత్వం అప్రతిహతంగా కొనసాగే పరిస్థితిలో లేదు. ఈ విషయాన్ని గ్రహించిన క్రాంవెల్ తనకు మద్దతుగా నిలిచేందుకు పార్లమెంటు సభలను ఏర్పాటు చేయడానికి ప్రయత్నించాడు. 1640 దశకం మధ్యలో ప్రెస్బిటేరియన్లు, స్వతంత్రుల మధ్య తీవ్రమైన రాగద్వేషాలు ఇప్పుడు మళ్లీ చెలరేగాయన్న విషయాన్ని అతడు నిర్ధారించుకున్నాడు. విప్లవోద్యమం తెచ్చిపెట్టిన అస్థిరతను, సంస్కరణలను తీవ్రతరం చేయాలన్న డిమాండ్లను ప్రతి ప్రాంతంలోనూ ఉన్న భూస్వామ్య వర్గం నిరసించింది. ఈ ప్రక్రియకు ముగింపు పలకాలని గట్టిగా వాదించింది. మధ్య తరగతిలో కొన్ని వర్గాలు విప్లవాత్మక సంస్కరణలు తేవాలని పట్టుపట్టాయి. ఈ వర్గాలకు సైన్యంలో ప్రాతినిధ్యం విస్తారంగా ఉండేది.

సమాజంలో అరాచక పరిస్థితులను మరింత తీవ్రతరం చేయగల విప్లవ సంస్కరణలనుముందుకు తీసుకెళ్లడానికి వారు సంసిద్ధత చూపలేదు. ఆ దశాబ్దం గడిచేకొద్దీ భూస్వాములతో జత కట్టారు. అంతర్యుద్ధంలో ప్రత్యక్షంగా తలపడిన ఈ శత్రువర్గంతో చేతులు కలిపారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే సామాజిక నియంత్రణకు రాచరిక వ్యవస్థ తప్పనిసరి అని అప్పటికీ భూస్వామ్య వర్గాలు అభిప్రాయపడేవి. సైనికాధికారులు - భూస్వాముల ఏకీకరణ ప్రక్రియ 1660లో క్రాంవెల్ మరణం తర్వాత ఒక కొలిక్కి వచ్చింది. సైన్యంలోని ఒక వర్గం పార్లమెంటులోని ఉన్నత వర్గాల సభ్యుల ప్రతిపాదనతో ఏకీభవించి మరణశిక్షకు గురైన పాలకుడి (చార్ల్స్) కుమారుడిని రాజుగా తిరిగి ఆహ్వానించడానికి సంసిద్ధతను వ్యక్తం చేసింది.

విప్లవం ముగిసినప్పటికీ దానితోపాటు వచ్చిన మార్పులు మాత్రమే అలాగే కొనసాగాయి. రాజు ప్రాబల్యం ఇప్పుడు ఆస్తులు విస్తారంగా ఉన్న వర్గాల సమ్మతిపై ఆధారపడింది. ఈ ధనిక వర్గాలు తమ ఆకాంక్షలను పార్లమెంటు ద్వారా వ్యక్తం చేసేవి. ఉదాహరణకు 1688లో ఈ వర్గాలు ఎలాంటి రక్తపాతానికి పాల్పడకుండానే తిరుగుబాటు చేయడం ద్వారా రెండవ జేమ్స్ సింహాసనం నుండి తప్పించాయి. మార్కెట్ శక్తులను తమకు అనుకూలంగా మలచుకోవడంపైనే ఈ ధనిక వర్గాల సంపద ఎక్కువగా ఆధారపడి ఉండేది. గతంలో ఎన్నడూ లేని విధంగా సమాజంపై మార్కెట్ శక్తుల ప్రభావం తీవ్రమైంది. బడా

భూస్వాములు కాలం గడిచే కొద్దీ క్యాపిటలిస్టు తరహా వ్యవసాయం వైపు మొగ్గు చూపడం ప్రారంభించారు.

పట్టణాల్లో స్థిరపడిన ప్రజలు ఎక్కువగా ఇతరులను పనిలో నియమించుకునే వారు లేదా తానే స్వయంగా ఇతరుల పరిశ్రమల్లో కార్మికులుగా పని చేసేవారు. ఉత్పత్తిలో సృజనాత్మక పద్ధతులను వ్యాపార, వాణిజ్య మండళ్లు ఇక ఏ మాత్రం అడ్డుకోలేకపోయాయి. 1689 నాటికి ఇంగ్లాండ్‌లోని నాలుగింట మూడొంతుల పట్టణాల్లో వ్యాపార మండళ్ల ఆనవాళ్లే లేకుండా పోయాయి. వాణిజ్యాన్ని విస్తరించాలనే ధ్యేయంతోనే ప్రభుత్వ విధానాలు రూపొందించబడేవి. విధానాల రూపకల్పనలో పాలకుడి కుయుక్తులు ఏ మాత్రం పని చేయలేదు.

స్థూలంగా చెప్పాలంటే ఈ మార్పులన్నీ ప్రపంచ చరిత్రలో ఒక నూతన శకాన్ని సూచిస్తాయి. క్యాపిటలిస్టు పద్ధతులపై నడిచే పరిశ్రమలపై ప్రజల జీవనోపాధి అవకాశాలు ఆధారపడ్డాయి. ఇతర పరిశ్రమల కంటే తక్కువ వ్యయంతో తమ పరిశ్రమను సమర్థవంతంగా నడిపే వ్యక్తులపైనే 'అభివృద్ధి' ఆధారపడి ఉండేది. తక్కువ వ్యయంతో ఉత్పత్తికి కొత్త పద్ధతులను అనుసరించే వారే వ్యాపారంలో నిలదొక్కుకొని జీవనోపాధికి హామీని పొందేవారు. ఇలాంటి వ్యక్తుల్లో బడా భూస్వామితోపాటు మధ్యతరహా కంసాలి, చివరకు చేనేత పనివాడు (వ్యక్తిగత) కూడా ఉండేవారు.

ధనిక లేదా పేద వర్గాల తక్షణ వినియోగ అవసరాల కోసం కాకుండా పోటీ కోసమే పోటీ అన్న విధానం ఆర్థిక కార్యకలాపాలకు చోదకశక్తిగా మారిపోయింది. తదనంతరం వచ్చిన ప్రగతి స్వరూపం అస్థిరంగానూ, ఉత్థానపతనాలుగానూ ఉండేవి. జనాభాలో విశాలంగా ఉన్న కార్మిక వర్గానికి ఇలాంటి ప్రగతివల్ల ఎలాంటి ప్రయోజనాలు సమకూరలేదు. తమ శ్రామికశక్తిని ఇతరులకు కనీస వేతనాలకు అమ్ముకునే సామర్థ్యంపైనే కార్మికుల మనుగడ ఆధారపడి ఉండేది.

అయితే ఈ ప్రగతి ఇంగ్లాండ్ ఆర్థిక వ్యవస్థను, ఆ వ్యవస్థను నియంత్రించే వారి పరిస్థితిని సమూలంగా మార్చివేసింది. ఒకప్పుడు ఐరోపాలోనే అత్యంత వెనుకబడిన, పేద ప్రాంతమైన ఇంగ్లాండ్, స్కాట్లాండ్‌లు ఈ కాలంలో అత్యంత ప్రగతిని సాధించిన దేశాలుగా రూపాంతరం చెందాయి. ఈ ప్రక్రియలో తమ పాలకులకు ప్రపంచ వ్యాప్త సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేసేందుకు సాధనాలను సమకూర్చిపెట్టాయి. ఈ పరిణామక్రమంలో సంభవించిన మరో ముఖ్యమైన మార్పు ఏమిటంటే పాత ఉత్పత్తి స్వరూపాలన్నింటినీ తప్పించి వాటి స్థానాన్ని కొత్త క్యాపిటలిస్టు తరహా ఉత్పత్తి విధానం భర్తీ చేయడమే.

నాల్గవ అధ్యాయం

# ఆసియా సామ్రాజ్యాల తుది వికాసం

పదహారు, పదిహేడవ శతాబ్దాలలో ఐరోపాలో సంభవించిన పరిణామాలను నేడు మనం ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తే అవి ప్రపంచ రూపురేఖలను ఎలా మార్చివేశాయో అవగతమవుతుంది. ఆసియా, ఆఫ్రికా ఖండాలను దాదాపుగా ఆక్రమించిన ఐరోపా ప్రబల శక్తులు అక్కడ కొత్త సామ్రాజ్యాలను ఏర్పాటు చేయగలిగాయి. అందుకు పైన పేర్కొన్నట్లు ఐరోపా ఖండంలో వచ్చిన మార్పులు దోహదపడ్డాయి. అలాగే ప్రపంచ వ్యాప్తంగా ఉత్పత్తి నిర్వహణ పూర్తిగా మారిపోయింది. పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ ఉత్పత్తిని శాసించడం మొదలుపెట్టింది.

అయితే ఆరింట ఐదొంతుల మంది ప్రజలకు చరిత్ర అంతటితో ఆగిపోలేదు. వీరు ప్రపంచంలోని మిగతా ప్రాంతాల్లో నివాసముండేవారు. ఐరోపా వలసదారులకు మెక్సికో, పెరు సామ్రాజ్యాలు రాత్రికి రాత్రే లొంగిపోయి ఉండొచ్చు. కాని అమెరికాలలోని మిగతా ప్రాంతాల్లో ఇలాంటి పరిణామాలు సంభవించలేదు. ఉత్తర భూమండలంలో 17వ శతాబ్దం చివరి నాటికి కేవలం ఈశాన్య తీర ప్రాంతంలోని చిన్న భాగమే వలసదారుల హస్తగతమైంది. ఆఫ్రికా, ఆసియా విషయానికి వస్తే '30 ఏళ్ల' యుద్ధం సంభవించే నాటికి ఈ ఖండాల్లోని ఐరోపా వలసవాద కేంద్రాలు కేవలం వాణిజ్య కేంద్రాలుగా ఉండేవి. తర్వాతి కాలంలో కూడా చాలా వరకు అవి వాణిజ్య కేంద్రాలుగానే వ్యవహరించాయి. ఆఫ్రికా దక్షిణ సరిహద్దులోని ఖోయిసాన్ ప్రజలను (వీరు వేట-సేకరణదారులు) జయించడంలో డచ్ వలసదారులు సఫలమయ్యారు. ఖోయిసాన్ ప్రజలను హాటెన్‌టాట్స్, బుష్‌మెన్ అని కూడా పిలిచేవారు.

అయితే ఉత్తర భూమండలంలో తమ వలసవాద కేంద్రాలను విస్తరించడానికి ఐరోపా పాలకులకు 200 సంవత్సరాలు పట్టింది. ఉత్తర ప్రాంతంలోని వ్యవసాయదారులను ఓడిస్తూ వారు క్రమంగా తమ సామ్రాజ్యాలను విస్తరించుకున్నారు. అప్పటికీ స్టీలు తయారీపై ఆధిపత్యం ఉండడం కారణంగా ఉన్నత ప్రమాణాలు కలిగిన ఆయుధాలను తయారు చేయగలిగారు. పదహారవ శతాబ్దంలో భారత దేశ పశ్చిమ తీరంలోని కోస్తా ప్రాంతమైన గోవాను పోర్చుగీసు నావికాదళం స్వాధీనం చేసుకుంది. అక్కడ ఐరోపా ప్రమాణాలతో సమానంగా ఒక నగరాన్ని నిర్మించింది. దక్షిణ చైనా తీరానికి అవతల ఉన్న మకావో ద్వీపంలో వాణిజ్య కేంద్రాన్ని

ఏర్పాటు చేసింది. అయితే ఈ కేంద్రాల సమీపంలోని గొప్ప రాజ్యాలు, సామ్రాజ్యాలతో పోలిస్తే పోర్చుగీసు వ్యాపారుల ప్రయత్నాలు వెలవెలబోయేవి. 1552లో దక్షిణ భారతంలోని విజయనగర సామ్రాజ్య రాజధానిని సందర్శించిన తొలి పోర్చుగీసు యాత్రికులు ఆ నగరాన్ని రోమ్‌తో పోల్చారు. సుమారు లక్ష నివాస గృహాలతో విజయనగర ప్రపంచంలోనే సౌకర్యవంతమైన నగరంగా, ఆహార సరఫరాలు నిత్యం అందుబాటులో ఉండే ప్రాంతంగా ప్రసిద్ధిగాంచింది. పదహారవ శతాబ్దపు ఐరోపా నగరాల కంటే విశాలమైన ప్రాంతంలో విజయనగర శిథిలాలు విస్తరించి ఉండడం ఇందుకు తార్కాణం. ఉత్తర భారతంలో మొగల్ చక్రవర్తుల ప్రాబల్యం ఉండేది. 1525 నుండి భారత ఉపఖండాన్ని మొగల్ సామ్రాజ్య పరిధిలోకి తెచ్చిన మొగల్ పాలకులు ఎన్నో నగరాలను నిర్మించారు. కొన్నింటిని పునఃనిర్మించారు. ఈ నగరాలు ఐరోపా రాజధానులకు ఎందులోనూ తీసిపోయేవి కావు. ముఖ్యంగా లాహోర్, ఢిల్లీ, ఆగ్రా లాంటి నగరాలు ఎంతో విశాలంగా, అద్భుతమైన కట్టడాలతో ఎంతో వైభవంగా కనిపించేవి.

చైనా చక్రవర్తులు తమ సామ్రాజ్య దక్షిణ తీరంలో తిష్టవేసిన ఐరోపా వాసులను దాదాపు విస్మరించారు. అయితే సామ్రాజ్యానికి ఉత్తర దిశలో ఉన్న వ్యవసాయదార సమాజాల నుండే వారికి ఎక్కువ ముప్పు ఉండేది. ఈలోగా, ఒట్టోమన్ టర్కీ పశ్చిమ ఐరోపా తలుపులు తట్టే స్థాయికి విస్తరించింది. 1453లో కాన్‌స్టంటినోపుల్‌ను స్వాధీనం చేసుకున్న తర్వాత 1517లో అది కాయిరోను ఆక్రమించింది. అలాగే 1528లో అల్జీయర్స్, 1526లో హంగేరీని స్వాధీనం చేసుకుంది. 1529లో వియన్నాను ముట్టడించింది. 1683 అదే నగరాన్ని మరోసారి ఆక్రమించడానికి ప్రయత్నించింది. సంస్కరణవాద ఐరోపాలో దౌత్యపరమైన లావాదేవీలు, సైనిక కూటముల్లో ఒట్టోమన్ సామ్రాజ్యం కీలకపాత్రను పోషించింది. అప్పటి సాహిత్యంలో తుర్కు సంస్కృతిని వేనోళ్లతో పొగిడారు. ఒట్టోమన్ సామ్రాజ్యం, భారతదేశంలోని మొగల్ సామ్రాజ్యం మధ్యలో ఇరానీ సఫావిద్ సామ్రాజ్యం ఉండేది. ఇస్ఫహాన్ ఆ సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది. అప్పటి ఐరోపా యాత్రికులకు ఆ నగర వైభవం మంత్రముగ్ధులను చేసేది. ఆగ్నేయ ఆసియా తీరంలోని జపాన్ ద్వీపాలు చైనా సంస్కృతిని, ఉత్పత్తి పద్ధతులను ఎక్కువగా అనుసరించేవి. వాటి ఆధారంగా ఒక ప్రగతిశీల నాగరికతను నిర్మించాయి. ఐరోపా భూస్వామ్య లక్షణాలు జపాన్ సమాజంలో స్పష్టంగా కనిపించేవి. పాలకవర్గ భూస్వామ్య దొరలు అత్యాధునికమైన ఆయుధాలు, మందుగుండుతో నిరంతరం యుద్ధాలలో మునిగితేలుతూ ఇతరులపై పట్టును సాధించడానికి తహతహలాడేవారు. ఐరోపాలో కూడా పునరుజ్జీవ ఉద్యమం, సంస్కరణోద్యమం, మత యుద్ధాల ప్రభావానికి దూరంగా ఉన్న ప్రాంతంలో ఒక గొప్ప సైనిక శక్తి ఆవిర్భవించింది.

ఈశాన్యంలో వరుసగా వచ్చిన పాలకులు మస్కోవీ సంస్థానాన్ని కేంద్రీకృత రష్యా రాష్ట్రంగా తీర్చిదిద్దడానికి, ఆ తర్వాత ఒక విశాలమైన సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేయడానికి ప్రయత్నించారు. ఈ సామ్రాజ్యం ఉత్తర ఆసియా ప్రాంతమంతటిపాటు పశ్చిమాన పోలెండ్ వరకు విస్తరిస్తూ ఉండేది.

ఐరోపాతో పోలిస్తే ఈ సామ్రాజ్యాలు ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలుగా మనలేదు. అయితే 19వ శతాబ్దం చివరి నాటికి అవి ఆర్థికంగా పతనమయ్యాయి. ఐరోపాను పదవ శతాబ్దపు పాత భూస్వామ్య వ్యవస్థ నుండి పదహారవ శతాబ్దపు ఆధునిక సమాజాలుగా తీర్చిదిద్దిన కొన్ని సాంకేతిక మార్పులు ఈ సామ్రాజ్యాలలో కూడా కనిపించాయి. అవన్నీ ఏదో ఒక తరహా తుపాకులను, ఫిరంగులను వినియోగించాయి. తొలి మొగల్ చక్రవర్తి అయిన బాబర్ 1526లో ఉత్తర భారతానికి చెందిన మహా సైన్యాలను సైతం మట్టుబెట్టాడు. మందుగుండును, ఆశ్విక దళాన్ని సమర్థవంతంగా వినియోగించడం వల్లే అతడు అసాధారణమైన ఫలితాలను సాధించగలిగాడు. ఈ సమాజాలు నిర్మాణ పద్ధతులను, వృత్తి నైపుణ్యాలను పరస్పరం పంచుకొని అభివృద్ధిలోకి వచ్చాయి. ఉదాహరణకు ఆసియా, ఐరోపాలోని అన్ని ప్రాంతాల నుండి వచ్చిన వృత్తికారులు తాజ్‌మహల్ నిర్మాణంలో పాలుపంచుకున్నారు. ఈ అద్భుతమైన కట్టడాన్ని మొగల్ చక్రవర్తి షాజహాన్ నిర్మింపచేశాడు. అమెరికాల నుండి కొత్త వంగడాలు దిగుమతి కావడంతో ఈ సమాజాల్లో వ్యవసాయం, ఆహార అలవాట్లలో గణనీయమైన మార్పులు వచ్చాయి. ముఖ్యంగా మిరప, టమోటా, పొగాకు, మొక్కజొన్న, నారింజ పంటలు భారతదేశంలో విస్తారంగా సాగయ్యేవి. చైనాలో బంగాళాదుంపలు, వేరుశనగ, మొక్కజొన్న, పొగాకు పంటలు ఎక్కువగా పండేవి.

## చైనా అపూర్వ ఘట్టం

14వ శతాబ్దపు సంక్షోభం నుండి చైనా త్వరగా కోలుకుంది. 15వ శతాబ్దంలోకి అడుగుపెట్టే నాటికి ఆర్థికంగా పుంజుకుంది. చైనా నౌకలు చేపట్టిన సుదీర్ఘ సముద్ర యానాలు అందుకో నిదర్శనం. భారతదేశ పశ్చిమతీరం, ఆడెన్, ఈశాన్య ఆఫ్రికాలకు సుమారు 20,000 మంది యాత్రికులు, వ్యాపారులతో కూడిన నౌకల సమూహం ప్రయాణం చేపట్టింది. ఒక సందర్భంలో ఎక్కడా లంగరు వేయకుండా ఏకంగా ఆరు వేల మైళ్లు నిరంతరంగా ప్రయాణం సాగించారు. స్పానిష్ లేదా పోర్చుగీసు నౌకా దళాలు ఇంతటి సుదూర ప్రయాణాలు చేపట్టడానికి 75 సంవత్సరాలు ముందే ఈ సంఘటన జరిగింది.

పదహారవ శతాబ్దాన్ని గెర్నెట్ "నూతన శకానికి నాంది"గా అభివర్ణించాడు. వ్యవసాయ రంగంలో భూములు దున్నడానికి కొత్త యంత్రాలు, నీటిపారుదలకు కొత్త పరికరాలు, విత్తనాలు నాటడంలో కొత్త పద్ధతులు, విత్తన శుద్ధిలో సాంకేతిక నైపుణ్యం, భూమిని అభివృద్ధి పరచడానికి కొత్త మార్గాలు, కొత్త వంగడాల ఎంపిక... తదితర మార్పులు వచ్చాయని గెర్నెట్ పేర్కొన్నాడు. పారిశ్రామిక రంగంలో కూడా అనేక మార్పులు వచ్చాయి. సాంకేతిక నైపుణ్యం పెరిగింది. కొత్త యంత్రాలను ప్రవేశపెట్టారు. నూలు, పట్టును వడకడానికి కొత్త యంత్రాలను అభివృద్ధి పరిచారు. ముద్రణా యంత్రాన్ని మరింత మెరుగుపరిచారు. మూడు లేదానాలుగు రంగులతో కూడిన బ్లాక్ పద్ధతి ముద్రణ అమల్లోకి వచ్చింది. రాగి-సీసంతో కూడిన మిశ్రమలోహాన్ని కనిపెట్టడంతో చలనగుణమున్న అక్షరాల వరుసను అభివృద్ధిపరిచారు. చక్కెర పరిశ్రమలో కూడా ఆధునిక ఉత్పాదనా పద్ధతులను వినియోగించారు.

శాస్త్ర, సాంకేతిక ప్రాధాన్యత ఉన్న అంశాలను పుస్తక రూపంలో ముద్రించారు. పదిహేడవ శతాబ్దం తొలి దశకాల్లో ఇలాంటి సాహిత్యం ఎక్కువగా వెలువడింది. వ్యవసాయ పద్ధతులు, చేనేత, పింగాణీ పాత్రల తయారీ, ఇనుము - స్టీలు, నదీ జలమార్గాల ద్వారా రవాణా, ఆయుధాలు, సిరా, కాగితాలు, హైడ్రాలిక్ పరికరాలు... ఇలా అన్ని అంశాలపై సాంకేతిక కరదీపికలు వెలువడ్డాయి. సాంకేతికాభివృద్ధి ఈ కాలంలో ఎప్పుడూ స్తంభించలేదు. మేధావులు కేవలం ప్రాచీన సిద్ధాంతాలను మాటల గారడీతో ప్రజల ముందు మళ్లీ తీసుకురాలేదు. మాజీ ఉప్పు తయారీదారుడైన వాంగ్ కెన్ అనే గొప్ప చైనా ఆలోచకుడు లాంటి వారి గురించి ప్రస్తావిస్తూ గెర్నెట్ ఇలా వ్యాఖ్యానించాడు :

> "పదహార శతాబ్దపు చివరి దశకాలు, పదిహేడవ శతాబ్ది తొలియార్థంలో కళాసాహిత్యాలు ఎంతో ప్రగతిని సాధించాయి. నాటకం గణనీయంగా విస్తరించింది. నవల, సంక్షిప్త కథానికా రచన ఎక్కువైంది. పాక్షిక విద్యావంతుల సంఖ్యపెరగడం, ప్రజా సంస్కృతి పాక్షికంగా అభివృద్ధి చెందడంతో పట్టణాల్లోని మధ్యతరగతి ప్రజానీకం సాహిత్యం, కళల పట్ల అభిరుచిని పెంచుకుంది. గతంలో ఎన్నడూ లేని విధంగా పుస్తక పరిశ్రమ అభ్యున్నతిని సాధించింది. గ్రంథాల నాణ్యత కూడా బాగా పెరిగింది."

వాంగ్‌కెన్ చారిత్రక పురుషుల అభిప్రాయాలను, ఆలోచనలను సవాలు చేశాడు. అప్పటి సంకుచిత ధోరణులను, సాంప్రదాయక నైతికతను ప్రశ్నించాడు. పీడిత వర్గాలు, మహిళలు, అల్పసంఖ్యాక తెగల హక్కులను వాంగ్‌కెన్ సమర్థించాడు. ప్రాచీన చైనా భాష స్థానంలో ప్రజలు ఎక్కువ మాట్లాడే వాడుక భాషలోనే పుస్తకాలను రచించారు. తక్కువ ఖరీదుగల గ్రంథాలు సామాన్యులకు కూడా అందుబాటులోకి వచ్చాయి. ప్రాచీన విద్యాబోధనా పద్ధతులకు దూరంగా ఉన్న పట్టణ ప్రజానీకానికి, పాక్షికంగా విద్యనభ్యసించిన వారికి, ఎలాంటి ఆలోచనా పరిమితులు లేనివారికి అన్ని రకాల సాహిత్యం అలరించింది. గెర్నెట్ వర్ణన నిజమే అయితే ఐరోపాతో సమాంతరంగా చైనాలో కూడా సాంకేతిక, మేథోపరమైన పునరుజ్జీవ ప్రక్రియ సంభవించిందని మనం భావించాల్సి ఉంటుంది.

ఐరోపాలో వచ్చినట్లే ఈ సామ్రాజ్యాల్లో కూడా కొన్ని సామాజిక మార్పులు వచ్చాయి. రాజ్యాలు రైతులు, వృత్తిదారుల శ్రామిక సేవలను నగదు పన్నులుగా మార్చివేశాయి. వ్యవసాయ రంగం వాణిజ్యపరం కావడంతో పారిశ్రామిక పంటలైన పత్తి, సహజ రంగులు, పొగాకు, నూనెను అందించే పంటలు ఎక్కువగా సాగయ్యాయి. భూస్వాముల అణచివేతకు గురైన పేద రైతులు (వీరు భూముల నుండి గెంటివేయబడ్డారు) జీవనోపాధికి కొత్త మార్గాలను అన్వేషించారు. అందులో భాగంగా హస్తకళాకృతుల వ్యాపారాన్ని చేపట్టారు. కొందరు గని కార్మికులుగా స్థిరపడిపోతే మరికొందరు పట్టణాల్లో ఉపాధిని పొందారు. దక్షిణ, ఈశాన్య చైనాలోని తీరప్రాంతాల్లో వాణిజ్య, హస్తకళాకృతుల కేంద్రాలు వికసించాయి. ఐరోపాలో వలే ఇక్కడ కూడా ఉత్పత్తి ప్రధానంగా వృత్తిదార కర్మాగారాల్లోనే జరిగేది. అయితే పూర్తిస్థాయి పారిశ్రామిక పెట్టుబడిదారీ సంస్థలు కూడా కొన్ని ఉండేవి. చిన్నతరహా పరిశ్రమలు భారీ కర్మాగారాలుగా

రూపాంతరం చెందాయి. ఇలాంటి కొన్ని కర్మాగారాల్లో వందలాది మంది కార్మికులు ఉపాధిని పొందేవారు.

నైరుతి షాంఘైలోని సంగ్‌చియాంగ్ పత్తి శుద్ధి కర్మాగారాల్లో రైతు కుటుంబాలకు చెందిన మహిళలు ఎక్కువగా పని చేసేవారు. పదహార శతాబ్ది చివరి నాటికి యాంగ్జీలోని 30 కాగితపు పరిశ్రమల్లో సుమారు 50,000 మంది కార్మికులు పని చేసేవారు. కొన్ని పారిశ్రామిక సంస్థలు ప్రపంచ మార్కెట్ కోసం సరుకులను ఉత్పత్తి చేసేవి. పట్టు వస్త్రాలు, పింగాణీ పాత్రలను భారీ పరిమాణంలో జపాన్‌కు ఎగుమతి చేసేవారు. క్యోటో నుండి లిమా వరకు చైనా పట్టు వస్త్రాలను ధరించేవారు. చైనాలో తయారైన పత్తి ఫిలిప్పైన్స్, మెక్సికో మార్కెట్లలో ఎక్కువగా అమ్ముడుపోయేది. సకాయి నుండి లండన్ వరకు అన్ని భవంతుల్లోనూ చైనా పింగాణీ పాత్రలు, బొమ్మలు దర్శనమిచ్చేవి.

పీడిత వర్గాలు నిరంతరం పేదరికంలో కొట్టుమిట్టాడినా చైనా ఆర్థిక వ్యవస్థ మాత్రం గణనీయంగా పురోగమించింది. 14వ శతాబ్దంలో చైనా జనాభా సగానికి సగం పడిపోయి ఏడు కోట్లకు చేరుకోగా పదహారవ శతాబ్దం చివరి నాటికి అది 13 కోట్లకు, 1650 నాటికి 17 కోట్లకు పెరిగింది. తర్వాతి కాలంలో నాల్గవ, 14వ శతాబ్దాల్లో ఎదుర్కొన్న సంక్షోభాల తరహాలో చైనా సామ్రాజ్యం పతనావస్థకు చేరుకుంది. 17వ శతాబ్దిలో బయల్దేరిన ఐరోపా సంక్షోభానికి సమాంతరంగా ఈ తిరోగమన ప్రక్రియ సంభవించింది. అంటువ్యాధులు, వరదలు, కరువు, ఇతర ప్రకృతి వైపరీత్యాలు వరుసగా వచ్చాయి. కరువు కారణంగా ప్రాంతాలకు ప్రాంతాలే నాశనమయ్యాయి. జనాభా పెరుగుదల స్తంభించిపోయింది. కొన్ని ప్రాంతాల్లోనైతే జనాభా తగ్గిపోయింది. ఒకప్పుడు లాభాలను గడించిన పరిశ్రమలు మూతపడ్డాయి. 1640 దశకం నాటికి ఉత్తర చేకియాంగ్ (షాంఘై గ్రామీణ ప్రాంతం) నుండి అందిన నివేదికలు ఆకలిచావులు, భిక్షగాళ్ల సమూహాలు, శిశు మరణాలు, నరమాంస భక్షణ గురించి విపులంగా ప్రస్తావించాయి.

> 1642 నాటికి మహానగరమైన సూచవ్ (దిగువ యాంగ్జీ నదిపై నిర్మితమైన) పతనావస్థకు చేరుకుంది. అక్కడి నివాస గృహాలు నిర్మానుష్యమయ్యాయి. కొన్ని గృహాలు శిథిలాలుగా మారాయి. ఒకప్పుడు ఎంతో సంపన్నంగా ఉన్న గ్రామీణ ప్రాంతాలు ఖాళీ అయ్యాయి. సాయుధులు తప్ప మిగతా ఎవ్వరూ గ్రామీణ ప్రాంతాల్లో సంచరించేవారు కాదు.

జనాభా విస్ఫోటనం లేదా ప్రకృతీ వైపరీత్యాల కారణంగా పంటలు విఫలమవడం వల్లే ఈ సంక్షోభం తలెత్తిందని చరిత్రకారులు అనేక సందర్భాల్లో విశ్లేషించారు. అయితే యాంగ్జీ డెల్టా ప్రాంతంలో అప్పటికీ తిండిగింజలు (వరి) లభించేవి. మిగతా ప్రాంతాల్లో ఘోరమైన కరువు సంభవించినా (1640 దశకంలో) ఈ ప్రాంతంలో మాత్రం బియ్యం చాలా వరకు అందుబాటులో ఉండేవి. కాని ఒక్క అంశం మాత్రం ప్రజలను ఇక్కట్లకు గురి చేసేది. తిండిగింజలను కొనుగోలు చేయడానికి ప్రజల వద్ద తగినన్ని నిధులు ఉండేవి కావు.

చైనా సమాజ నిర్వహణలోనే పెనుసంక్షోభాలకు మూలాధారాలు ఉండేవి. సమాజాన్ని శాసించిన రాజ్యం, అధికార యంత్రాంగం 14వ శతాబ్దంలో సంభవించిన సంక్షోభం తర్వాత ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి అనేక విధానాలను, ప్రోత్సాహకాలను అమలు చేశాయి. అయితే ఈ ప్రగతివల్ల కొన్ని దుష్ఫలితాలు కూడా వచ్చే ప్రమాదముందని అవి ఆందోళన చెందాయి. ముఖ్యంగా, పెరుగుతున్న వ్యాపారుల ప్రభావాన్ని అడ్డుకట్ట వేయడానికి అవి ప్రయత్నించాయి. 1433 నాటికి సుదూర సముద్రయానాలకు ఉన్నట్టుండి తెరపడింది. వాణిజ్య ఓడలు భారత్, ఆఫ్రికా తీర ప్రాంతాలకు ప్రయాణం కట్టడం మానివేశాయి. ఫలితంగా ఐరోపా వ్యాపార నౌకలే చైనాను 'కనుగొన్నట్లు' ప్రచారం జరిగింది. కోస్తా వ్యాపారం తమ వ్యవసాయ సమాజాన్ని ఏ విధంగానూ ప్రభావితం చేయరాదని భావించిన మింగ్ సామ్రాజ్యం ఆ దిశగా ఎన్నో చర్యలను తీసుకుంది. అయితే మింగ్ పాలకులు అంతర్జాతీయ వాణిజ్య కార్యకలాపాలను మాత్రం అరికట్టలేకపోయారు. నేటి 'నల్లవ్యాపారం' తరహాలోనే కోస్తా ప్రాంతాల్లో చట్ట వ్యతిరేకమైన ఆర్థిక వ్యవస్థ విస్తరించింది. అలాంటి ప్రాంతాలపై ఆధిపత్యం ఉన్న సముద్ర దొంగల మధ్య తరచూ హింసాత్మకమైన ఘర్షణలు చోటు చేసుకునేవి. మరోవైపు రాజ్య విధానాల కారణంగా ఉత్పత్తి కొత్త స్వరూపాలు అభివృద్ధి చెందలేదు.

ఈలోగా ఆర్థిక వ్యవస్థను రాజ్య నిర్వహణా వ్యయం కృంగదీసింది. చక్రవర్తి వాన్ లీ పాలనలో సుమారు 45 మంది మొదటి శ్రేణి రాకుమారులు ఉండేవారు. వీరికి సాలీనా వ్యక్తిగతంగా 600 టన్నుల ధాన్య గింజలతో సమానమైన ఆదాయం లభించేది. అలాగే తక్కువ హోదా కలిగిన 23,000 భూస్వామ్య దొరలు కూడా ఉండేవారు. షాన్‌షీ, హోనాన్ రాష్ట్రాల నుండి సామ్రాజ్యానికి సమకూరే పన్నుల్లో సగానికి సగం పై పాలకవర్గాలకు జీతాలు చెల్లించడానికే సరిపోయేవి. కొరియాపై నియంత్రణ సాధించేందుకు జపాన్‌తో జరిపిన యుద్ధంలో చైనా సామ్రాజ్య ఖజానా దాదాపు ఖాళీ అయ్యింది.

తీవ్రమైన ఆర్థిక కష్టాలు సమాజంలో అసంతృప్తి జ్వాలలను రగిల్చాయి. 1596 నుండి 1626 వరకు ప్రతి సంవత్సరమూ దేశంలోని అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో కార్మికులు ఘర్షణలకు పాల్పడ్డారు. ఈ ఘర్షణలు ఎక్కువగా పట్టణ ప్రాంతాల్లో జరిగాయి. 1603లో ప్రైవేటు గనుల్లో పని చేసే కార్మికులు బీజింగ్ నగరాన్ని ముట్టడించారు. 1620 దశకంలో దక్షిణ పశ్చిమ చైనాలో విదేశీ ప్రజలు తిరుగుబాటు జరిపారు. 1630 దశకంలో ఉత్తర చైనాలో రైతాంగ ఉద్యమాలు పెద్ద ఎత్తున చోటు చేసుకున్నాయి. సమాజంలోని ఉన్నత వర్గాలలో కూడా ఒక విపక్ష వర్గం ఆవిర్భవించింది. మాజీ మంత్రులు, మేధావుల రాజ్య విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించారు. అయితే ఈ వర్గాన్ని గూఢాచారి పోలీసులు విచ్ఛిన్నం చేశాయి.

1644లో రాజకీయ వ్యవస్థ కుప్పకూలిపోయింది. మింగ్ వంశానికి చెందిన చివరి పాలకుడు ఉరి వేసుకొని ఆత్మహత్యకు పాల్పడ్డాడు. అదే సమయంలో రైతాంగ సైన్యానికి నాయకుడైన ఒక మాజీ పశుకాపరి కొత్త పాలక వంశాన్ని స్థాపిస్తున్నట్లు ప్రకటించాడు. ఈ సంఘటన తర్వాత ఒక నెలలోపు ఉత్తర ప్రాంతం నుండి వచ్చిన మంచూ సాయుధ బలగాలు బీజింగ్ నగరాన్ని స్వాధీనం చేసుకున్నాయి.

చైనా ఆర్థిక, రాజకీయ సంక్షోభానికి, అదే సమయంలో ఐరోపా చవిచూసిన సంక్షోభానికి మధ్య చాలా పోలికలున్నాయి. అయితే కొంత తేడా ఉంది. చైనాలో వ్యాపార, వృత్తిదార వర్గాలు పాత వ్యవస్థకు ప్రత్యామ్నాయ శక్తిగా ఎదగలేకపోయాయి. ఫ్రాన్స్‌లో కాల్వినిస్టులైన వ్యాపారులు, మధ్య తరగతి ప్రజల వలే అవి భూస్వామ్య, పాలక వర్గాల్లోని అసంతృప్తివాదులను ప్రభావితం చేయలేకపోయాయి. సమాజాన్ని స్థూలంగా తమ దృష్టికోణం నుండి ప్రక్షాళన చేయడానికి ఒక కార్యాచరణ ప్రణాళికను రూపొందించలేకపోయాయి. అదే సమయంలో ఉత్తర నెదర్లాండ్స్‌లోని వ్యాపార బూర్జువా వర్గం, ఇంగ్లాండ్‌లో మధ్యతరగతి వర్గం సమాజాన్ని పునర్వ్యవస్థీకరించగలిగాయి. చైనా సమాజం గతంలో ఎదుర్కొన్న పెనుసంక్షోభాల తరహాలోనే వాణిజ్య, వృత్తిదార వర్గాలు ప్రత్యామ్నాయ వ్యవస్థ ఏర్పాటుకు రాజ్య యంత్రాంగంపైనే పూర్తిగా ఆధారపడ్డాయి.

సంక్షోభం తాలుకు అరాచక పరిస్థితులు కేవలం కొద్ది సంవత్సరాలు మాత్రమే కొనసాగాయి. చైనా నాగరికత సాంప్రదాయాలను ఎన్నో తరాల ముందే మంచూ ఆక్రమణదారులు ఆకళింపు చేసుకున్నారు. అంతర్గత భద్రత, ఆర్థిక వ్యవస్థ స్థిరీకరణను పునరుద్ధరించడం ద్వారా కొంత కాలంపాటు ఆర్థిక ప్రగతికి బాటలు వేశారు. అమెరికాల నుండి కొత్త వంగడాలు దిగుమతి కావడంతో వ్యవసాయం గణనీయంగా విస్తరించింది. వాణిజ్య పంటల సాగు పుంజుకుంది.

ఈ కాలంలో లూయీ-15 పాలన కింద ఉన్న ఫ్రెంచి రైతుల కంటే చైనా రైతులు చాలా సంతోషంగా, సంపన్నంగా ఉన్నారు. కొందరు ధనిక రైతులు తమ సంతానానికి విద్యాభ్యాసం ఇప్పించగలిగే స్థోమతను సంపాదించారు. వాణిజ్య కార్యకలాపాలు, హస్తకళాకృతుల ఉత్పత్తి పుంజుకున్నాయి. షాంఘై దక్షిణ పశ్చిమ ప్రాంతంలో సుమారు రెండు లక్షల మంది పూర్తి స్థాయి జౌళి కార్మికులు నివసించేవారు. రాచరిక వినియోగానికి, ఐరోపా లాంటి దూర ప్రాంతాలకు ఎగుమతి చేయడానికి వేలాది మంది కుమ్మరులు పింగాణీ పాత్రలను, బొమ్మలను తయారు చేసేవారు. తేయాకు ఉత్పత్తి తారాస్థాయికి చేరుకుంది. తేయాకు పరిశ్రమలో వేలాది మంది వేతన కార్మికులు పని చేసేవారు. శుద్ధి చేసిన తేయాకును విదేశాలకు ఎక్కువగా ఎగుమతి చేసేవారు. ఒక అంచనా ప్రకారం లాటిన్ అమెరికా నుండి ఐరోపాకు 1571-1821 మధ్య సమకూరిన వెండి నాణేల్లో సగానికి పైగా చైనా ఉత్పత్తుల కొనుగోలుపైనే వెచ్చించారు. భవిష్యత్ ఆశాజనకంగా కనిపించడంతో జనాభా తీవ్రస్థాయిలో పెరిగింది. 1812 నాటికి చైనా జనాభా 26 కోట్లకు చేరుకుందని ఒక అంచనా. చైనా ప్రపంచంలోనే అత్యంత విశాలమైన, సంపన్నమైన రాజ్యంగా అవతరించింది.

సామ్రాజ్య శక్తి సామర్థ్యాలపై అతిగా విశ్వాసం ఉంచడంవల్ల పాలకవర్గాల్లో నిర్లక్ష్య ధోరణి పెరిగిపోయింది. దీని కారణంగా మేధోపరమైన వికాసం కూడా స్తంభించిపోయింది. మంచూ పాలన తొలి సంవత్సరాల్లో మేధోవాద విచారణ, స్వేచ్ఛా సిద్ధాంతాలు, నిర్దిష్టమైన విమర్శ ఎక్కువ పాళ్లలో కనిపించేవి.నిరంకుశ సామ్రాజ్య పునాదులను (మేధోపరమైన), వ్యవస్థలను (సంస్థలు) ప్రశ్నించే గుణం ఉండేది.

కళా, సాహిత్యం, తత్త్వశాస్త్రం, చరిత్ర... ఇలా అన్ని రంగాల్లో నిర్దిష్టమైన అంశాలకు ప్రాధాన్యత లభించింది. ఐరోపా చైతనోద్యమ స్ఫూర్తి ఈ కాలంలో ఇక్కడ స్పష్టంగా కనిపించింది. అందుకు తగిన ఆధారాలు కూడా ఉన్నాయి. అయితే విమర్శించే గుణం అనతి కాలంలోనే ఆవిరైపోయింది. విద్యావంతులు కొత్త పాలకవర్గంతో మమేకమయ్యారు. పట్టణ మధ్యతరగతి వర్గాలలో సాహిత్యంపట్ల అభిరుచి తగ్గిపోయింది. రాజ్యాన్ని విమర్శించే ఎలాంటి సాహిత్యాన్నైనా నిషేధించేవారు. 1774-89 మధ్య సుమారు 10,000 సాహిత్యకృతులను నిషేధించారు. సుమారు 2,320 గ్రంధాలను తగులబెట్టారు. అసమ్మతివాదులైన రచయితలు, వారి కుటుంబ సభ్యులు దేశ బహిష్కారానికి గురయ్యారు. బలవంతపు శ్రమ, ఆస్తుల జప్తు, చివరికి బహిరంగ మరణశిక్షను కూడా కొందరు మేధావులు అనుభవించారు. నిర్దిష్టమైన అంశాల జోలికి వెళ్లనంత వరకు మేధావులు అభ్యున్నతి వైపు పయనించగలిగారు. అప్పటి వరకు వాడుక భాషల్లోనే వచ్చిన సాహిత్యం తన స్వరూపాన్ని పూర్తిగా మార్చుకుంది. రచయితలు ప్రాచీన భాషను మళ్లీ ఉపయోగించడం మొదలుపెట్టారు. గత స్మృతులు, అనుభవాలు, అభూత కల్పనలు సాహిత్య కృతులుగా వెలువడ్డాయి. నవల మనోవిశ్లేషణ లేదా విద్యావంతుల కోణం నుండి తయారయ్యేది. అందులోని అంశాలు కూడా తర్కరహితంగా, పరస్పర విరుద్ధంగా ఉండేవి.

పదిహేడవ శతాబ్దంలో తలెత్తిన సంక్షోభానికి మూల కారణాలేమిటన్న అంశాన్ని ఎవ్వరూ ప్రస్తావించలేదు. అయితే గత సంక్షోభాల లక్షణాలు మాత్రం చాలా వరకు తెరపైకి వచ్చాయి. రాచరిక దర్బారు నిర్వహణా వ్యయం భారీగా పెరగడం, అధికార యంత్రాంగం అవినీతిమయం కావడం, సరిహద్దుల్లో యుద్ధాలపై భారీ వ్యయం, రైతులపై స్థానిక అధికారులు, పన్ను సేకరణదారుల ఆగడాలు మితిమీరడం, వ్యవసాయ కాలువలు, నదీ జలమార్గాల నిర్వహణ లోపించడం, వరదలు, కరవు తరచుగా సంభవించడం తదితర కారణాలు సంక్షోభానికి దారి తీశాయి. 1795లో 'వైట్‌లోటస్' అనే ఉద్యమం బయల్దేరడంతో రైతాంగ తిరుగుబాట్లు వరుసగా వచ్చాయి. తర్వాతి 50 ఏళ్లకు చైనా చరిత్రలోనే అత్యంత విశాలమైన ఉద్యమం ఒకటి ఆవిర్భవించింది.

## మొగల్ భారతదేశం

మొగల్ భారతదేశం చైనాకు చాలా భిన్నమైన సమాజం. అందులో వ్యవసాయ కాలువలు, నీటి పారుదల వ్యవస్థలు అంత విస్తారంగా ఉండేవి కావు. ప్రాచీన సాహిత్య సాంప్రదాయాలతో దగ్గరి సంబంధమున్న కేంద్రీకృత అధికార యంత్రాంగం కాని బడా భూస్వాముల పెద్ద వర్గం కాని, స్థానిక మార్కెట్లలో వ్యాపార లావాదేవీలు నిర్వహించే రైతాంగం కాని భారత సమాజంలో సర్వవ్యాపితంగా ఉండేవి కావు.

పదమూడవ శతాబ్దం మొదలుకొని ఉత్తర భారతం ఇస్లామిక్ పాలకుల దండయాత్రలను వరుసగా చవిచూసింది. మధ్యయుగాల భారతంలోని స్థానిక వ్యవసాయదార ఆర్థిక వ్యవస్థలపై వారు కేంద్రీకృత పాలనా వ్యవస్థలను రుద్దారు. పాలనా వ్యవస్థను మొగల్ చక్రవర్తులు మెరుగుపరిచారు. అధికార యంత్రాంగం ద్వారా దేశాన్ని పాలించారు. అధికారులకు పన్నులు వసూలు చేసే హక్కు ఉండెడి. ఒక పరిమిత ప్రాంతంలో (జాగీరు) వారు పన్నులు

వసూలు చేసి రాజ్య సైనికావసరాల కోసం ఆశ్విక దళాన్ని పోషించేవారు. అయితే ఈ అధికారులు భూస్వాములు మాత్రం కాదు. రైతాంగాన్ని దోపిడీ చేయడం ద్వారా సంపన్నులైనంత మాత్రాన సాంప్రదాయ భూస్వామ్య దొరలతో వారిని పోల్చలేము. ప్రతి ప్రాంతంలోనూ జమీందార్లు అనే మరో భూస్వామ్య వర్గం ఉండేది.

జమీందార్లు దాదాపు అగ్రవర్ణాలకు చెందిన వారే. మొగల్ పాలకుల రాకకు చాలా పూర్వం నుండి వీరు దోపిడీదారీ వర్గాలుగా వ్యవహరించేవారు. మొగల్ పాలనలో అధికార, పాలనా వ్యవస్థ కేంద్రీకృతం కావడంతో జమీందార్లు చక్రవర్తి తరపున రైతుల నుండి పన్నులు వసూలు చేయడం మొదలుపెట్టారు. అలా వసూలు చేసిన పన్నులలో తమ వాటాగా కొంత భాగాన్ని ఉంచుకునేవారు.

గ్రామీణ ప్రజానీకం చాలామటుకు స్వయంపోషక గ్రామాలలో నివసిస్తూనే వచ్చారు. వారసత్వంగా వ్యవసాయం చేస్తూ వచ్చిన కుటుంబాలు గ్రామంలోని ఇతర వృత్తిదారుల (వీరు కూడా వంశపారంపర్యంగా తమ వృత్తులను నిర్వహించేవారు) కోసం ఆహార పంటలను సాగు చేసేవి. కంసాలి, వడ్రంగి, నేత, క్షౌర వృత్తిదారుల మధ్య శ్రమ విభజన ఉండేది. వీరికి వేతనాలు నగదురూపంలో కాకుండా తిండిగింజలు, ఇతర నిత్యావసర సరుకుల రూపంలో లభించేవి. మధ్యయుగాల కుల వ్యవస్థ లక్షణాలు చెక్కుచెదరకుండా కొనసాగాయి.

మారకద్రవ్యం గ్రామీణ ప్రాంతాల్లో అంతగా చెలామణి కాకపోయినా రాజ్యానికి పన్ను చెల్లించడానికి రైతులకు నగదు అవసరమైంది. నగదును సమకూర్చుకోవడం కోసం వారు తమ పంట దిగుబడిలో సగం నుండి మూడొంతుల భాగాన్ని అమ్ముకునేవారు. ఒక పరిశీలకుడు 1620లో నివేదించినట్లు పన్నును సకాలంలో చెల్లించని రైతులను సమీందార్లు అపహరించి తీసుకెళ్లేవారు. రైతులను బరువైన సంకెళ్లలో బంధించి మార్కెట్లకు తరలించేవారు. అక్కడ వారిని బానిసలుగా విక్రయించేవారు. అలాంటి రైతుల వెనుక వారి భార్యలు, పిల్లలు తమకు పట్టిన దుర్గతిని నిరసిస్తూ, ఏడుస్తూ నడిచేవారు.

రైతుల నుండి వసూలు చేసే అదనపు నిల్వల్లో అధిక భాగం రాచరిక దర్బారుకు, రాజ్య యంత్రాంగానికి, దాని సైనిక బలగాలకు దక్కేది. ఇర్ఫాన్ హబీబ్ వివరించినట్లు రాజ్యం దోపిడీదారీ వర్గాలకు రక్షణ కవచంగానే కాకుండా తానే స్వయంగా దోపిడీకి ప్రధాన సాధనంగా వ్యవహరించింది. రాజ్యం వసూలు చేసే పన్నుల్లో కొద్ది శాతం కూడా గ్రామాలకు తిరిగి దక్కేవి కావు. రాజ్యం ఆ నిధులను కేవలం తన సామ్రాజ్య పరిధిలోని పట్టణాలు, నగరాల్లో మాత్రమే వెచ్చించింది.

నిధులు పట్టణ ప్రాంతాలకే పరిమితం కావడంతో వాణిజ్యం, పట్టణ వృత్తిదారుల ఉత్పాదకత పెరిగింది. అయితే ఆర్థిక వ్యవస్థ మాత్రం మౌలికంగా చాలా అస్థిరంగా ఉండేది. పట్టణ ప్రాంతాల విస్తరణను విశ్లేషిస్తే మొగల్ పాలనలో పారిశ్రామిక, వాణిజ్య రంగాల ప్రగతి గణనీయంగా జరిగినట్లు బోధపడుతుంది. వృత్తులు విస్తరించాయి, ఉత్పత్తి కూడా పెరిగింది. చేతివృత్తుల రంగం బహుముఖంగా అభివృద్ధి చెందింది. దేశీయ, అంతర్జాతీయ వాణిజ్యం విపరీతంగా పెరిగింది. మొగల్ పాలనలో సుమారు 120 మహానగరాలుండేవి. లాహోర్, ఆగ్రా, ఢిల్లీలో పెద్ద మొత్తంలో, లక్నో, బనారస్, అలహాబాద్‌లో ఒక మోస్తరుగా

వృత్తిదారులు స్థిరపడ్డారు. సమకాలీన పరిశీలకుల దృష్టిలో లాహోర్ ఈశాన్య ప్రపంచంలోనే అత్యంత విశాలమైన నగరం. ఒక ఐరోపా యాత్రికుడి అంచనా ప్రకారం ఆగ్రా నగర జనాభా సుమారు 6,50,000 వరకు ఉండేది. వైశాల్యంలో ఢిల్లీ ఐరోపా మహానగరమైన పారిస్‌తో సమానంగా ఉండేది.

భారీ పరిశ్రమ అయిన జౌళి పరిశ్రమ ఐరోపాకు 17వ శతాబ్దం నాటికి భారీ పరిమాణంలో పత్తి ఉత్పత్తులను ఎగుమతి చేసేది. సుమారు 32 పట్టణ కేంద్రాల్లో పత్తిని భారీ పరిమాణంలో ఉత్పత్తి చేసేవారు. జౌళి పరిశ్రమలు లేని నగరం, పట్టణం, గ్రామం అంటూ ఒక్కటి కూడా ఉండేది కాదు. గ్రామాల్లోని ప్రతి ఇంటిలోనూ నూలును వడికే రాట్నం దర్శనమిచ్చేది. అదే సమయంలో వాణిజ్యపరమైన రుణాలు, బీమా, ప్రాథమిక బ్యాంకింగ్ సేవలు లాంటి అంశాలు పునరుజ్జీవ ఐరోపా పరిస్థితులను తలపిస్తాయి.

ఈ ఆర్థిక ప్రగతికి సార్థకతను చేకూర్చే ఒక్క అంశం మాత్రం భారతదేశం విషయంలో లోపించింది. పట్టణాలు సాధించిన పారిశ్రామిక ప్రగతి తాలుకు ఫలాలు గ్రామ సీమల్లోకి వ్యాపించలేకపోయాయి. ఒక సమకాలీన ప్రత్యక్షసాక్షి రాసినట్లు "రైతుల నుండి ఉన్నదంతా దోచుకున్నారు. పరిస్థితి ఎంత దిగజారిందంటే రైతులకు చివరగా తినడానికి రొట్టెముక్కలు కూడా అందుబాటులో లేకుండాపోయాయి." రైతులు అధునాతన వ్యవసాయ పనిముట్లను సమకూర్చుకోలేకపోయారు. "పట్టణ పారిశ్రామిక రంగంపై గ్రామసీమలు ఆధారపడ్డాయని చెప్పడానికి ఎలాంటి సాక్ష్యాలు లేవు." ఒకవైపు నగర వాణిజ్యం విస్తరించగా మరోవైపు పల్లె ప్రాంతాలు పేదరికం, ఆకలిదప్పుల్లో కూరుకుపోయాయి. స్థూలంగా చెప్పాలంటే సమాజమంతటికీ ఉపయోగపడే విధంగా నగరాలు ఉత్పత్తి చేయలేదు. అందుకు భిన్నంగా రైతుల దిగుబడిని వినియోగిస్తూ గ్రామాలను నాశనం చేశాయి.

దీర్ఘకాలంలో సామ్రాజ్య రైతాంగ ఉత్పత్తి ఆధారం క్షీణించిపోయింది. లాహోర్, ఢిల్లీ, ఆగ్రాలను సుందర నగరాలుగా తీర్చిదిద్దడానికి, తాజ్‌మహల్ నిర్మాణానికి రాజ్య వనరులను వ్యయం చేసిన షాజహాన్‌కు సమకాలికుడైన ఒక పరిశీలకుడు ఇలా వ్యాఖ్యానించాడు : "లంచగొండితనం, వాణిజ్య వ్యవసాయం కారణంగా భూములు సత్తువను కోల్పోయి బంజరుగా మారాయి. ఫలితంగా రైతులు దోపిడీకి, విధ్వంసానికి గురయ్యారు. "రైతులు తాము సాగు చేసే భూములను వదలి పారిపోవడం మొదలుపెట్టారు. కరువు గ్రామీణ జనాభాను ఏ విధంగా దహించి వేసిందో, భారీ వలసలకు ఎలా దారి తీసిందో ఇర్ఫాన్ హబీబ్ వివరించారు. అయితే కరువు మానవుడు సృష్టించిన వ్యవస్థ. రైతాంగ వలసలకు కరువుకు మించిన ఇతర కారణాలేవీ లేవు.

భూమిలేని నిరుపేద కార్మికులు పెద్ద సంఖ్యలో వలస రావడంతో నగరాలు పాక్షికంగా అభివృద్ధి చెందాయి. అయితే ఈ వలసల పరంపర గ్రామీణ ప్రాంతంపై ఉన్న అదనపు పన్నుల భారానికి పరిష్కారం ఏ మాత్రం చూపలేకపోయింది. సామ్రాజ్య కీర్తి శిఖర స్థాయికి చేరుకుందని అందరూ భావిస్తున్న తరుణంలో అది తిరోగమన దశలో పయనించడం మొదలుపెట్టింది. దీర్ఘకాలంలో ఈ స్థితి విచ్ఛిన్నానికి దారి తీసింది.

షాజహాన్ కుమారుడైన ఔరంగజేబు (ఇతడు తన తండ్రినే నిర్బంధించాడు) హయాంలో ఈ ప్రతికూల ప్రభావాలు ప్రస్ఫుటమయ్యాయి. మొగల్ పాలనపై వెలువడిన అనేక చరిత్ర గ్రంథాలు ఔరంగజేబు పాలనను అక్బర్ పాలనతో పోల్చుతూ విశ్లేషణలు అందిస్తాయి. ఇస్లామిక్ ఛాందసవాదం, హిందు-వ్యతిరేక విధానాలు, నిరంతర యుద్ధాలతో కాలం గడిపిన ఔరంగజేబు పాలనకు (అతడి కంటే వందేళ్ల ముందు పాలించిన) అక్బర్ చైతన్యవంతమైన పాలనను, అతడు అనుసరించిన పరమత సహనం, జాగీర్దారీ విధానాల మధ్య ఉన్న వ్యత్యాసాలను ఈ గ్రంథాలు విపులంగా ప్రస్తావిస్తాయి. ఇద్దరు చక్రవర్తుల పరస్పర విరుద్ధమైన వ్యక్తిత్వాల వల్లే ఈ వ్యత్యాసాలు ఏర్పడ్డాయనడంలో ఎలాంటి సందేహం లేదు. అయితే ఇద్దరి పాలనా కాలాల్లో ఉన్న భిన్నమైన పరిస్థితులు కూడా ఈ వ్యత్యాసాలకు దోహదం చేశాయి. అక్బర్ హయాంలో సామ్రాజ్య వ్యవసాయ ఆధారానికి ఎలాంటి నష్టం కలిగించకుండానే సరిహద్దులను మరింత విస్తరించేందుకు పరిస్థితులు అనుకూలిస్తే, ఔరంగజేబు పాలనలో అలాంటి పరిస్థితులు లోపించి సామ్రాజ్య విస్తరణ ఇక ఏ మాత్రం సాధ్యం కాలేదు. బెంగాల్ మినహా మిగతా రాష్ట్రాల్లో వ్యవసాయ రంగ సంక్షోభం పట్టణ పరిశ్రమలపై కూడా ప్రతికూల ప్రభావం చూపడంతో అవి కూడా నష్టాల బాటలో పయనించడం మొదలుపెట్టాయి. 1712 తర్వాత ఆగ్రాలో "నగర ప్రస్తుత దుర్దశ గురించి, గత వైభవం" గురించే చర్చలు జరిగేవి.

తొలుత, కేవలం కొద్ది మంది రైతులు మాత్రమే మొగల్ పాలనను సవాలు చేయడానికి ధైర్యం చేశారు. 1620 దశకంలో భారతదేశంలో పర్యటించిన ఒక ఐరోపా యాత్రికుడు ఇలా రాశాడు : "ప్రజలు తమ దౌర్భాగ్యాన్ని మౌనంగా సహిస్తున్నారు. భవిష్యత్‌లో తమ జీవన ప్రమాణాల్లో మార్పు వస్తుందన్న కోరికను కూడా వ్యక్తం చేయలేకపోతున్నారు. ప్రజల్లో గూడుకట్టుకున్న అసంతృప్తి కొత్త మత పంథాల ఆవిర్భావం రూపంలో వ్యక్తం అయ్యేది. ఈ మత ఉద్యమాలు ప్రాచీన భాష అయిన సంస్కృతం బదులు స్థానిక భాషలను వినియోగించి ప్రజల్లో పలుకుబడిని పెంచుకున్నాయి. భక్తి ఉద్యమాలకు నాయకత్వం వహించిన వారు ఎక్కువగా నిమ్నకులాలకు చెందిన వారే కావడం విశేషం. వారిలో ఒకరు చేనేత కార్మికుడు, మరొకరు బానిస. అలాగే ఒక పత్తి కార్మికుడు కూడా ఉండేవాడు. ధాన్యం వ్యాపారి అయిన గురునానక్ సిక్కు మతాన్ని స్థాపించాడు. ఈ మతాలు బ్రాహ్మణవాద మత సిద్ధాంతాలను సవాలు చేశాయి. ఏకేశ్వరోపాసనను ప్రచారం చేశాయి. దైవారాధనను శాసించే సాంప్రదాయ ఆచారాలను, స్వరూపాలను వ్యతిరేకించాయి. కుల, మత విభేదాలు వీడి భక్తితో ముక్తి మార్గాన్ని పొందాలని ప్రజలకు పిలుపునిచ్చాయి. అయితే ఈ ఉద్యమాలు ప్రత్యక్ష తిరుగుబాటును రెచ్చగొట్టే భాషను మాత్రం ఏనాడూ ఉపయోగించలేదు. సైనిక లేదా భౌతిక సంఘర్షణ స్థానంలో మానవత్వం, సాత్విక భావాలను, కర్మ సిద్ధాంతాన్ని ప్రబోధించాయి.

అయితే ఈ భక్తి ఉద్యమాల అనుచరుల జీవితం మరింత దుర్భరం కావడంతో శాంతి, మానవత్వం అనే విలువలు తమ ప్రభావాన్ని కోల్పోయాయి. పాత సిద్ధాంతాల పట్ల నిబద్ధత ఆధారంగా భక్తి ఉద్యమాలు ముందుకు సాగలేకపోయాయి. సైనిక సంఘర్షణ తప్పనిసరి అన్న వాదన బలం పుంజుకుంది. ఫలితంగా మొగల్ పాలనకు వ్యతిరేకంగా రెండు శక్తివంతమైన

తిరుగుబాట్లకు సిక్కులు సారథ్యం వహించారు. ఔరంగజేబు పాలన ముగిసే నాటికి లాహోర్ గ్రామీణ ప్రాంతంలో పూర్తిస్థాయిలో అణచివేయబడని సిక్కు తిరుగుబాటుదారులు సామ్రాజ్యానికి పెద్ద తలనొప్పిగా తయారయ్యారు. ఆగ్రా, ఢిల్లీల మధ్య ఉన్న గ్రామీణ ప్రాంతంలో జాట్ రైతులు తిరుగుబాటు చేశారు. అయితే వారి తిరుగుబాటును సామ్రాజ్య సైన్యాలు తీవ్రంగా అణచివేశారు. ఒక రాచరిక చరిత్రకారుని అంచనా ప్రకారం అణచివేత చర్యలవల్ల సుమారు 10,000 'మానవమృగాలు' మృత్యువాత పడ్డాయి. 1709లో సిక్కులు పెద్ద ఎత్తున తిరుగుబాటు చేశారు. తదుపరి కాలంలో మరాఠాలు వరుసగా తిరుగుబాట్లు చేశారు. మొగల్ సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసిన ఏకైక ప్రబలశక్తిగా మరాఠా తిరుగుబాటు చరిత్రలో మిగిలిపోయింది.

తిరుగుబాట్లకు రైతుల విద్వేషం పోరాట సామర్థ్యాన్ని సమకూర్చిపెట్టింది. అయితే నాయకత్వం మాత్రం జమీందార్లు లేదా ఇతర స్థానిక దోపిడీదారి వర్గాల చేతిలోనే ఉండేది. వీరు పన్నుల్లో సింహభాగం సామ్రాజ్య ఖజానాకు దక్కడాన్ని జీర్ణించుకోలేకపోయేవారు. రెండు దోపిడీదారీ వర్గాల మధ్య జరిగిన యుద్ధంలో పీడిత వర్గాల ఉద్యమాలు విలీనమయ్యాయి.

ఈ తిరుగుబాట్లలో వ్యాపారులు, వృత్తిదారులు కీలకపాత్రను పోషించలేదు. మొగల్ పాలకుల విలాస మార్కెట్లపై ఆధారపడి జీవితం సాగించేవారు. స్థానిక మార్కెట్ల సంఘటనం లోపించడంవల్ల ఉద్యమ పక్షంగా రూపాంతరం చెందలేకపోయారు. అందుకు భిన్నంగా మార్కెట్‌పై పట్టు సాధించిన వ్యాపార వర్గాలు ఐరోపాలో రైతాంగాన్ని ప్రభావితం చేయగలిగాయి. భారతదేశంలో పాత సమాజం సంక్షోభంలో ఉన్నా బూర్జువా వర్గం స్వతంత్రంగా పోరాడి సమాజాన్ని పునర్వ్యవస్థీకరించలేకపోయింది. ఫలితంగా జమీందారు నాయకులు ప్రజా ఉద్యమాలను తమ స్వంత ప్రయోజనాల పరిరక్షణకే వినియోగించగలిగారు. భూస్వాముల ప్రయోజనాలు సామాజికాభివృద్ధి ఏ విధంగానూ దోహదపడవన్నది నిర్వివాదాంశం.

ఇర్ఫాన్ హబీబ్ ఈ వ్యాఖ్యలతో తన వాదనను ముగించారు :

> "ఆ విధంగా మొగల్ సామ్రాజ్యం పతనమైంది. సామ్రాజ్య వ్యతిరేక శక్తి ఎలాంటి కొత్త వ్యవస్థనూ సృష్టించలేకపోయింది. కొత్త వ్యవస్థ ఏర్పడనూ లేదు. నిరంతర దోపిడీ, అరాచకం, విదేశీ దండయాత్రలకు భారతదేశ ద్వారాలు బార్లా తెరవబడ్డాయి. అయితే మొగల్ సామ్రాజ్యం తన గోతిని తానే తవ్వుకుంది."

పశ్చిమ ఐరోపాకు చెందిన సైన్యాలు భారత భూభాగంపై తమ స్వంత సామ్రాజ్యాలను ఏర్పాటు చేసుకోవడానికి మార్గం సుగమమైంది. పశ్చిమ సైన్యాలు తమ ప్రణాళికను ఆచరణలో పెట్టినప్పుడు వాటికి భారత వ్యాపార బూర్జువా వర్గంలోని కొన్ని శక్తులు పూర్తి సహకారాన్ని అందించాయి.

# ఘటనాక్రమం

**18వ శతాబ్దం :** అర శతాబ్దం పాటు కోలుకున్న చైనా వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు.

సిక్కులు, మరాఠాల తిరుగుబాట్లతో విచ్ఛిన్నమైన మొగల్ సామ్రాజ్యం.

ఈశాన్య, దక్షిణ ఐరోపా అంతటా ఆర్థిక మాంద్యం.

1703లో సెయింట్ పీటర్స్‌బర్గ్ నగర నిర్మాణాన్ని ప్రారంభించిన పీటర్ ది గ్రేట్. పశ్చిమ ఐరోపా శాస్త్ర సాంకేతిక పద్ధతులను రష్యాలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నం.

1707లో ఏకమైన ఇంగ్లాండ్, స్కాట్లాండ్.

1716లో స్టువార్ట్ పునరుద్ధరణ ప్రయత్నాలు విఫలం. బ్రిటన్‌లో వ్యవసాయ విప్లవం.

ఫ్రాన్స్, తర్వాత హాలెండ్‌ను అధిగమించిన బ్రిటన్ ఆర్థిక వ్యవస్థ.

1734లో తన తాత్విక రచనను తొలిసారిగా ప్రచురించిన వాల్టెయిర్, ఇంగ్లాండ్ వ్యవస్థకు ప్రశంస.

సంగీతంలో కొత్త ధ్వనులు, స్వరాలను అభివృద్ధి పరచిన బాచ్.

కల్లోడెన్ యుద్ధం. బ్రిటన్‌లో స్టువార్ట్ పునరుద్ధరణ చివరి యత్నం విఫలం.

1746లో తుడిచిపెట్టుకుపోయిన హైలాండ్ భూస్వామ్య వ్యవస్థ అవశేషాలు.

1751లో చైతన్య సిద్ధాంతాలను ప్రచారం చేసేందుకు ఎన్‌సైక్లోపీడియాను ప్రచురించిన డిడెరాట్.

1757లో బెంగాల్‌పై నియంత్రణ సాధించిన ఈస్ట్ ఇండియా కంపెనీ.

1755లో ప్రచురితమైన రూసో "అసమానత పుట్టుపూర్వోత్తరాలపై చర్చ".

1762లో ప్రచురితమైన "సామాజిక ఒడంబడిక"

1759లో ఆశావాదంపై వ్యంగ్య నవల "కాండిడ్"ను ప్రచురించిన వాల్టెయిర్. 1759లో నిషేధానికి గురైన ఎన్‌సైక్లోపీడియా.

1761-66 మధ్య ఫ్రాన్స్‌లో ఇద్దరు ప్రొటెస్టెంట్ల సజీవ దహనం.

చైతన్యవంతమైన నిరంకుశత్వం - ప్రష్యా, రష్యా, పోర్చుగల్, ఆస్ట్రియాలలో పాలనా సంస్కరణలు తీసుకురావడానికి విఫలయత్నం చేసిన చక్రవర్తులు.

ప్రధాన వాణిజ్య, పారిశ్రామిక నగరంగా ఎదిగిన గ్లాస్‌గో.

డేవిడ్ హ్యూమ్, ఆడమ్ ఫెర్గూసన్, ఆడమ్ స్మిత్‌లు స్కాటిష్ చైతన్య ఉద్యమం.

1763లో కొత్త వలసవాద కేంద్రాల నియంత్రణకు జరిగిన యుద్ధంలో ఫ్రాన్స్‌ను ఓడించిన బ్రిటన్.

తారాస్థాయికి చేరుకున్న బానిసల వ్యాపారం. బ్రిస్టల్, లివర్‌పూల్, బొర్దియాక్స్, నాంటెస్ నగరాల ప్రగతి.

1770లో 4,00,000కు చేరుకున్న ఉత్తర అమెరికా బానిస జనాభా.

1771లో డెర్బిషైర్‌లోని క్రాంఫర్డ్ వద్ద స్పిన్నింగ్ మిల్లును స్థాపించిన ఆర్క్‌రైట్.

జాత్యాహంకారానికి శాస్త్రీయ ఆధారం ఇవ్వడానికి ప్రయత్నాలు (1774) 'జమైకా చరిత్ర'ను రచించిన లాంగ్.

1775లో ఆచరణాత్మక ఆవిరి యంత్రాలను రూపొందించిన వాట్, బౌల్డన్‌లు.

స్వేచ్ఛా వాణిజ్యం, స్వేచ్ఛా శ్రమ ఆధారంగా కొత్త వ్యవస్థను ఏర్పాటు చేయాలని 'వెల్త్ ఆఫ్ నేషన్స్' అనే గ్రంథం ద్వారా ప్రచారం చేసిన ఆడమ్ స్మిత్ (1776)

బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా ఉద్యమించిన ఉత్తర అమెరికా వలస ప్రాంతాలు.

పునర్వికాస సిద్ధాంతాలను జనబాహుళ్యంలోకి తీసుకెళ్లిన టామ్ పెయిన్ గ్రంథం "కామన్‌సెన్స్".

1776లో వెలువడిన అమెరికా స్వాతంత్ర్య ప్రకటన. మానవులందరూ సమానులేనని ఉల్లేఖించిన స్వాతంత్ర్య ప్రకటన. (కాని బానిసత్వంపై ఈ ప్రకటన ఎలాంటి వ్యాఖ్య చేయలేదు)

1783లో బొగ్గు సహాయంతో పని చేసే ఇనుము తయారీ యంత్రాన్ని అభివృద్ధి పరచిన హెన్రీ కార్ట్.

బ్రిటన్‌లో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం. వ్యవసాయ భూములపై ఏ మాత్రం ఆధారపడని ప్రజల సంఖ్య మొత్తం జనాభాలో 40 శాతానికి చేరుకుంది. మొజార్ట్ సింఫనీలు, ఒపేరాలు. 1786లో 'ది మ్యారేజ్ ఆఫ్ ఫిగారో',

1787లో 'డాన్ గియోవన్నీ'

ఒకటవ అధ్యాయం

# శాంతియుగం

**1650** తర్వాతి 125 ఏళ్లకు ఐరోపాలోని దాదాపు అన్ని ప్రాంతాల్లోనూ పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. 1650 సంవత్సరానికి ముందు గడిచిన 125 ఏళ్లలో రక్తపాతం సర్వవ్యాపితంగా ఉండేది. అయితే 18వ శతాబ్దం చివరి దశకాల్లో శాంతి వెల్లివిరిసింది. మతయుద్ధాలు, రైతాంగ ఉద్యమాలు, అంతర్యుద్ధాలు, విప్లవాలు గత కాలపు సంఘటనలుగా ఉండిపోయాయి.

18వ శతాబ్దం ప్రారంభంలో ఐరోపా రాజ్యాల మధ్య తీవ్రమైన యుద్ధాలు జరిగాయి. ఉదాహరణకు స్పెయిన్ వారసత్వ యుద్ధం, ఈ యుద్ధం కొనసాగుతుండగా మధ్యలో వచ్చిన ఏడేళ్ల యుద్ధం. డెన్మార్క్, స్వీడన్, పోలెండ్, పోర్చుగల్ లాంటి దేశాలలో పాలక వర్గాలలో అంతర్గత పోరు తీవ్రమైంది. రాచరిక కుటుంబం, ఉన్నత వర్గాల మధ్య అధికార వికేంద్రీకరణపై వాదోపవాదాలు పెరిగాయి. బ్రిటన్‌లో ఏర్పాటైన రాజ్యాంగ వ్యవస్థను కూలదోయడానికి స్టువార్ట్ వంశం 1690, 1715, 1745లలో విఫలయత్నం చేసింది. గతంలో అయితే ఐరోపాను కుదిపివేసిన తీవ్ర భావాలు ఇప్పుడు సరిహద్దులకే పరిమితమయ్యాయి. 1750 దశకం మధ్యలో ప్రపంచ గమనాన్ని విశ్లేషించే ఏ వ్యక్తికి అయినా విప్లవ యుగం గడిచిపోయిందన్న విషయం స్పష్టమవుతుంది. ఆ కాలపు వితండవాదాలను, అనాగరిక చర్యలను వ్యంగ్య శైలిలో వర్ణిస్తూ వాల్టెయిర్ 'కాండిడ్' అనే నవల రచించినప్పటికీ విప్లవాలు, సాయుధ ఉద్యమాలు మాత్రం ఎక్కడా సంభవించలేదు.

అయినప్పటికీ పూర్వపు విప్లవ జ్వాలల నుండి ఉదయించిన కొన్ని సిద్ధాంతాలు, ఆచారాలు ఈ కాలంలో ముఖ్య లక్షణాలుగా మారిపోయాయి.

ఒకప్పుడు ప్రతీఘాత విప్లవానికి కీలక కేంద్రంగా ఉన్న హాబ్స్‌బర్గ్ వంశం ఇప్పుడు కేవలం తన స్వంత నీడగా మారిపోయింది. స్పెయిన్ సింహాసనాన్ని బార్‌బాన్‌ల ఒక శాఖకు కోల్పోయింది. అందుకు భిన్నంగా ఒకప్పుడు విప్లవ శక్తుల యుద్ధరంగంగా ఉన్న బ్రిటన్, డచ్ రిపబ్లిక్‌లు తమ ప్రాబల్యాన్ని గణనీయంగా పెంచుకున్నాయి. హాలెండ్ పాత పోర్చుగీసు వలసవాద సామ్రాజ్యాన్ని దాదాపు హస్తగతం చేసుకోగా ఈ కొత్త సామ్రాజ్యానికి తర్వాతి కాలంలో ఇంగ్లాండ్ సవాలు విసిరింది.

పదిహేడవ శతాబ్దం ద్వితీయ భాగాన్ని కొన్ని సార్లు 'డచ్ స్వర్ణయుగంగా పరిగణిస్తారు. సముద్ర కోత నుండి భూములను కాపాడుకోవడంతో వ్యవసాయం బాగా విస్తరించింది. కొత్త వ్యవసాయ పద్ధతులు అమల్లోకి వచ్చాయి. అలాగే కొత్త వంగడాల సాగు కూడా విస్తరించింది. పారిశ్రామిక రంగం సంపదపరంగా ఉన్నత శిఖరానికి చేరుకుంది. ఆంస్టర్‌డామ్‌కు ఉత్తరాన ఉన్న జాన్‌స్ట్రీక్ అనే వెనుకబడిన జిల్లా ఐరోపాలోనే అత్యంత అధునాతమైన పారిశ్రామిక కేంద్రంగా ఆవిర్భవించింది. ఇక్కడ ఏర్పాటు చేసిన 128 పారిశ్రామిక గాలిమరలు పరిశ్రమలను యాంత్రిక కర్మాగారాలుగా మార్చివేశాయి. కాగితం తయారీ నుండి ధాన్యాలు ఒలిచే వరకు ప్రతి పరిశ్రమలో యంత్రాలనే ఎక్కువగా వినియోగించేవారు.

అంతర్యుద్ధం ముగిసిన తర్వాత ఇంగ్లాండ్‌లో వ్యవసాయ విప్లవం మొదలైంది. వ్యవసాయం వాణిజ్యపరమైన వ్యవహారంగా మారుతూ వచ్చింది. కొత్త వంగడాలను ఎక్కువగా ప్రవేశపెట్టారు. ముఖ్యంగా మొక్కజొన్న, ఉల్లిగడ్డ, చామగడ్డ లాంటి పంటలను సాగు చేయడం ప్రారంభించారు. క్యాపిటలిస్టు వ్యవసాయం విస్తరించింది. పచ్చికబయళ్లను మూసివేయడం మొదలుపెట్టారు. భూస్వాములు, క్యాపిటలిస్టు రైతులు తమ భూముల చుట్టూ కంచెలు ఏర్పాటు చేయడంతో అంతవరకు ఉమ్మడి మేత భూములుగా ఉన్న జాగీర్లు పేదరైతులకు అందుబాటులో లేకుండా పోయాయి. వారు చాలా మంది వేతన కార్మికులుగా స్థిరపడాల్సిన దుస్థితి ఏర్పడింది.

పారిశ్రామిక ఉత్పత్తి కూడా పెరిగింది. 1710 నుండి 1760 వరకు సంవత్సరానికి సగటున 0.7 శాతం, 1760-1780 మధ్య 1.3 శాతం, 1780 నుండి 1800 వరకు 2 శాతం మేరకు పారిశ్రామిక ప్రగతి నమోదైంది. 1650లో పట్టణ జనాభా 9 శాతం ఉండగా 1800 నాటికి 20 శాతానికి చేరుకుంది. 1707లో ఇంగ్లాండ్‌తో జరిగిన ఏకీకరణను స్కాట్లాండ్ ప్రజలు తొలుత తీవ్రంగా వ్యతిరేకించారు. అయితే ఏకీకరణవల్ల పారిశ్రామిక, వాణిజ్య రంగాలు నిలకడగా అభివృద్ధి సాధించాయి. ఏకీకరణ జరిగి 15 ఏళ్లు గడిచిన తర్వాత గ్లాస్‌గోను సందర్శించిన డానియల్ డెఫో దానిని 'వాణిజ్య నగరం' గా అభివర్ణించగలిగాడు. "ఇది (గ్లాస్‌గో) దేశీయ, అంతర్జాతీయ వాణిజ్యానికి కీలకమైన నగరం. ఈ రెండు వాణిజ్యాలు పెరుగుతున్నాయి, విస్తరిస్తున్నాయి."

ఇపుడు యునైటెడ్ కింగ్‌డమ్‌గా (ఐక్యరాజ్యం) అవతారమెత్తిన ఇంగ్లాండ్ -స్కాట్లాండ్‌లలో పారిశ్రామిక రంగం స్వంతంగా ఆవిష్కరణ, సృజనాత్మక పద్ధతులను అవలంభించడం మొదలుపెట్టింది. 18వ శతాబ్ది చివరి మూడు దశకాల్లో పారిశ్రామిక విప్లవానికి ఈ ప్రక్రియ బాటలు వేసింది. 1705లో తొలిసారిగా ఆవిరి యంత్రాన్ని ప్రవేశపెట్టారు. అయితే 60 ఏళ్ల తర్వాత జేమ్స్ వాట్ ఆవిరి యంత్రాన్ని పూర్తి స్థాయిలో అభివృద్ధి పరిచేవరకు అది ఆశించిన ఫలితాలనివ్వలేకపోయింది. జేమ్స్ వాట్ తయారు చేసిన ఆవిరి యంత్రం అన్ని రంగాల్లో బాగా ఉపయోగపడినా గనుల్లో మాత్రం అది పని చేయలేకపోయింది. 1709లో ముడిబొగ్గు స్థానంలో శుద్ధిచేసిన బొగ్గు (కోక్)ను వినియోగించి ఇనుము ధాతువును కరగబెట్టారు. అయితే 40 ఏళ్ల తర్వాతే అత్యంత నాణ్యమైన, సాధారణ వినియోగానికి అవసరమైన బొగ్గును ఉత్పత్తి చేయగలిగారు.

1730 నుండి 1760 వరకు శాస్త్రవేత్తలు స్పిన్నింగ్ యంత్రాన్ని అభివృద్ధి పరిచారు. 1766లో హార్‌గ్రీవ్ జిన్నింగ్ యంత్రాన్ని కనిపెట్టాడు. 1769లో ఆర్క్‌రైట్ నీటియంత్రాన్ని,

1779లో కాంప్టన్ మ్యూల్‌ను ఆవిష్కరించారు. ఈ గొప్ప ఆవిష్కరణలతో సమానంగా కొన్ని చిన్న మార్పులు కూడా వచ్చాయి. ఈ మార్పులు ప్రధానంగా పాత వృత్తిదార కర్మాగారాల్లో చోటు చేసుకున్నాయి. చేనేత పరిశ్రమలో యంత్రాల వినియోగం పెరిగింది. ఫలితంగా చేనేతదారుని ఉత్పాదకత పెరిగింది. బొగ్గు గనుల్లో అధునాతనమైన యంత్రాలను వినియోగించడం మొదలుపెట్టారు. 1650లో 5,00,000 టన్నులు ఉన్నా బొగ్గు ఉత్పత్తి 1750 నాటికి 50 లక్షల టన్నులకు 1800 నాటికి 1.5 కోట్ల టన్నులకు చేరుకుంది.

విదేశీ వాణిజ్యం కొరకు తీవ్రమైన పోటీ నెలకొన్న కొత్త వాతావరణంలో సాంకేతిక ప్రగతి విజయానికి ఒక తప్పనిసరి సాధనంగా మారింది. గతంలో సాంకేతిక మార్పులను ఆమోదించడానికి దశాబ్దాలు, కొన్నిసార్లు శతాబ్దాలు పట్టేది. సాంకేతిక ప్రగతి ఈ దశలో ఒక నిరంతర ప్రక్రియగా మారింది.

అయినప్పటికీ హాలెండ్, బ్రిటన్‌లు ఆధునిక పారిశ్రామిక సమాజాలుగా ఎదగలేదు. అప్పటికి కూడా జనాభాలో ఎక్కువ శాతం మంది గ్రామీణ ప్రాంతాల్లోనే నివాసముండేవారు. రహదారులు పక్కాగా లేకపోవడంతో పట్టణాలు, రాజధాని నగరాలకు ప్రయాణం చాలా అసౌకర్యంగా, దుర్భరంగా ఉండేది. అలాగే పై రెండు రాజ్యాలు ఆధునిక ప్రజాస్వామ్య దేశాలను ఏ మాత్రం ప్రతిబింబించలేదు. బ్రిటిష్ ప్రభుత్వాలపై బడా భూస్వాములు, పాలకవర్గాలకే ఎక్కువ పట్టు ఉండేది. సాధారణ రైతులు, వ్యాపారులు పార్లమెంటు సభ్యులను ఎలా ఎన్నుకోవాలో వారే నిర్ణయించేవారు. మరోవైపు హాలెండ్‌లో సంపన్న వ్యాపారులు ప్రభుత్వంపై ఆధిపత్యం వహించేవారు.

ఏమైనప్పటికీ రెండు దేశాలు వందేళ్ల నాటి కంటే గుణాత్మకమైన ప్రగతిని సాధించాయి. తమతోటి ఐరోపా దేశాలకు ఎంతో భిన్నంగా తయారయ్యాయి. వ్యక్తిగత భూస్వాములకు రైతులు చట్టబద్ధంగా ముడిపడి ఉండే వ్యవస్థ పూర్తిగా అంతరించింది. వాస్తవికమైన జాతీయ మార్కెట్లు ఏర్పడ్డాయి. చిన్నాచితక రాజ్యాలు లేదా నగర రాజ్యాల జోక్యం మటుమాయమైంది. గతంలో జర్మనీ, ఇటలీలలో ఇలాంటి రాజ్యాలు వ్యాపారాన్ని శాసించేవి. అలాగే ఫ్రాన్స్ అంతటా వ్యాపించి ఉన్న సుంకం వసూలు కేంద్రాలు కూడా ఇంగ్లాండ్, హాలెండ్‌లలో మూతపడ్డాయి. ఫలితంగా వ్యాపార, వాణిజ్య నిర్వహణలో ఎలాంటి అవాంతరాలనూ వ్యాపారులు ఎదుర్కొనే వారు కాదు. ఈ దశలో పట్టణ జీవన అనుభవం ఉన్న వారి సంఖ్య గణనీయంగా పెరిగింది. పదిహేడవ శతాబ్దం ముగిసేనాటికి ఇంగ్లాండ్ జనాభాలోని ఆరవ వంతు మంది ప్రజలకు లండన్‌లో కొంత కాలం గడిపిన అనుభవం ఉండేది. వ్యవసాయమే ప్రధానవృత్తిగా ఉన్న జిల్లాలలో కూడా గ్రామీణ పరిశ్రమలు విస్తరించి పెద్ద సంఖ్యలో ఉన్న వేతన కార్మికులకు ఉపాధిని కల్పించాయి. ఓడరేవులు, నావికాదళాలు సమాజంలోని అట్టడుగు వర్గాలకు పెద్ద ఎత్తున ఉపాధి కల్పించాయి. పూర్వం ఈ వర్గాలు వ్యవసాయం కంటే వాణిజ్యానికే ఎక్కువ ముడిపడిఉన్న రంగాల్లోనే ఎక్కువగా వృత్తులు నిర్వహించేవారు. ఐరోపాలో లండన్ పారిస్‌ను అధిగమించి మహానగరంగా అభివృద్ధి చెందింది. వ్యక్తిగత వృత్తిదారుల చేతుల్లోనే ఉత్పత్తి ఎక్కువగా కేంద్రీకృతమై ఉన్నా వారి పని తీరును ధనిక వృత్తిదారులు లేదా వ్యాపారులు సమన్వయపరిచేవారు. పశ్చిమ ఇంగ్లాండ్‌లో 'వస్త్ర'

వ్యాపారులు 100, 400 లేదా 1000 మంది చేనేత కార్మికులను నియమించేవారు. వీరి ఆదాయం ఐడా భూస్వాముల కంటే చాలా ఎక్కువగా ఉండేది.

ప్రభుత్వాలపై ఆధిపత్యం కలిగిన ఉన్నత కుటుంబాలు విధానాల రూపకల్పనలో ఎంతో జాగ్రత్తగా వ్యవహరించేవి. మధ్యతరగతి వ్యాపారులు, ఉత్పత్తిదారులు, క్యాపిటలిస్టు రైతులతోపాటు ధనిక వ్యాపారులను కూడా సంతృప్తిపరిచే విధంగా విధానాలను రూపొందించేవి. 1760-70లలో లండన్ నగర వ్యాపారులు భూస్వామ్య, పాలక వర్గాలకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఉద్యమించారు. పై వర్గాల ప్రయోజనాలను కాపాడడానికే పార్లమెంటు ప్రయత్నిస్తోందని, అసలు ఉభయసభలు, ప్రభుత్వం వారి నియంత్రణలోనే నడుస్తాయని వ్యాపారులు ఆరోపించారు. వ్యాపారుల ప్రతినిధి జాన్ వైక్స్ నిర్బంధంలో కాలం గడపాల్సి వచ్చింది. అయితే వారు కొన్ని ఉన్నత కుటుంబాల మద్దతులను కూడ గట్టగలిగారు. చివరకు విప్లవ పంథాను అనుసరించ కుండానే తమ లక్ష్యాన్ని సాధించగలిగారు. సమాజంపై నియంత్రణ తెచ్చుకున్నారు. పదహారు, పదిహేడవ శతాబ్దాల్లో జరిగిన సైద్ధాంతిక, రాజకీయ ఘర్షణలు సామాన్య ప్రజలు అత్యంత ప్రధానమైన యుద్ధాలను ముందే గెలిచారని స్పష్టం చేస్తాయి.

విప్లవ ఉద్యమాలు అణచివేయబడ్డ ఐరోపా దేశాల్లో పరిస్థితులు చాలా భిన్నంగా ఉండేవి. ఈ దేశాలకు 17వ శతాబ్దం ఆర్థిక సంక్షోభ కాలంగా మిగిలిపోయింది. మరణాల రేటు పెరగడంతో జనాభా తగ్గిపోయింది. పట్టణ వృత్తులు నశించిపోయాయి. వ్యవసాయ రంగంలో పెట్టుబడులు తగ్గిపోయాయి. భూస్వాములు, రాజ్యం తమ మధ్య అదనపు నిల్వలను పంచుకోవడంతో రైతులు కటిక దారిద్ర్యంలో కూరుకుపోయారు. కొన్ని ప్రాంతాల్లో కౌలుదారీ వ్యవస్థ పునరుద్ధరించబడింది. 18వ శతాబ్దంలో పోలెండ్, సిసిరీ, కాస్టిలీ తదితర రాజ్యాలలో స్థూల వ్యవసాయ దిగుబడి తగ్గిపోయింది. ఇది రెండు శతాబ్దాల క్రితం సాధించిన దిగుబడి కంటే చాలా తక్కువగా ఉండేది. 1770-72 మధ్య సంభవించిన కరువు కారణంగా బొహేమియాలో ప్రతి పదిమంది వ్యక్తుల్లో ఒకరు ఆకలిచావుకు గురయ్యారు. విప్లవ ప్రతీఘాత శక్తులు సాధించిన విజయం అంతఘనంగా ఉండేది మరి.

ఫ్రాన్స్, దక్షిణ పశ్చిమ జర్మనీ, ఉత్తర ఇటలీ మధ్యేవాద మార్గాన్ని అవలంభించాయి. కాసిలీ, దక్షిణఇటలీ, ఈశాన్యఐరోపా. వలే ఈ రాజ్యాలు ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కోలేదు. అయితే వాటి వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు చాలా వెనుకబడి ఉండేవి. ఇంగ్లాండ్, హాలెండ్‌లతో పోలిస్తే అవి అభివృద్ధి విషయంలో పెద్దగా సాధించేందేమీ లేదు. పెద్దపట్టణాలకు సమీపంలో ఉన్న ప్రాంతాల్లోనే వ్యవసాయ పద్ధతులు, క్యాపిటలిస్టు సంబంధాలు విస్తరించాయి. వృత్తిదారుల ఉత్పాదకత కొంతవరకు పెరిగినా సమాజం స్థూలంగా లాభపడలేదు. భారీ పరిశ్రమలు లేదా గనుల స్థాపన నామమాత్రంగా ఉండేది. మరోవైపు అట్లాంటిక్ వాణిజ్యంపై ఆధారపడ్డ ఓడరేవులు గణనీయంగా అభివృద్ధి చెందాయి. ప్రధానంగా ఫ్రాన్స్ పశ్చిమ తీరంపై వెలసిన ఓడరేవుల్లో వాణిజ్య కార్యకలాపాలు ఎక్కువయ్యాయి. 1780 నాటికి ఫ్రాన్స్ జనాభాలో 20 శాతం మంది చిన్నతరహా పరిశ్రమల్లో ఉపాధిని పొందేవారు. అదే సమయానికి ఇంగ్లాండ్‌లో 40 శాతం మంది ప్రజలు ఈ రంగంలో పని చేసేవారు. ఐరోపాలోని అనేక ప్రాంతాలు పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ వైపు అడుగులు వేసినా అవి భిన్న వేగాలతో పయనించాయి.

రెండవ అధ్యాయం

# మూఢనమ్మకాల నుండి శాస్త్రీయత వైపు

ఐరోపాలోని వివిధ ప్రాంతాల ఆర్థిక ప్రగతిలో కనిపించిన అసమానతలు మేధోపరమైన వికాసంలో కూడా ప్రస్ఫుటమయ్యాయి.

ప్రతి స్థాయిలోనూ మూఢనమ్మకాలు బలంగా నాటుకుపోయి ఉన్న సమాజాన్ని పునరుజ్జీవ, సంస్కరణోద్యమాలు ఒక్క కుదుపు కుదిపాయి. మత విశ్వాసాలు, పురోహితుల ప్రవచనాలు, తాంత్రికుల్లో విశ్వాసం, మంత్రశక్తుల పట్ల నమ్మకం, దైవానుగ్రహం, చేతబడులు, రోగ నిర్మూలనకు రాజు స్పర్శ తప్పనిసరి అన్న భావన తదితర మూఢ విశ్వాసాలు ప్రతి స్థాయిలో బలంగా ఉండేవి. ఇలాంటి నమ్మకాలు కేవలం నిరక్షరాస్యులవరకే పరిమితం కాలేదు. పాలకులతో పాటు రైతుల్లో కూడా ఇలాంటి భావనలు ఉండేవి. పవిత్ర అవశేషాలను సేకరించడానికి పాలకులు ప్రయత్నించేవారు. క్రిస్టోఫర్ కొలంబస్, ఆలివర్ క్రాంవెల్, ఇసాక్ న్యూటన్ లాంటి వేర్వేరు రంగాలకు చెందిన వ్యక్తులు బైబిల్‌లో పేర్కొనబడిన భవిష్యవాణిలను బలంగా నమ్మేవారు. ఒక కార్టెస్ లేదా పిజ్జారో యుద్ధంలో తమ విజయానికి దైవానుగ్రహమే కారణమని ప్రకటించేవారు. ఒక రాజు (స్కాట్లాండ్‌కు చెందిన జేమ్స్-4, తర్వాత ఇతడు జేమ్స్-1 గా ఇంగ్లాండ్‌ను పాలించాడు) చేతబడిపై ఒక గ్రంథాన్నే రచించగలిగాడు.

తమను తీవ్రంగా ఇక్కట్లకు గురి చేసిన సమస్యలకు అసలు కారణాలు తెలుసుకోలేని ప్రజలు మూఢనమ్మకాలను మాత్రం బాగా ఆకళింపు చేసుకున్నారు. జీవిత కాలం చాలా పరిమితంగా ఉండేది. యువకుల మరణాలు సర్వసాధారణంగా ఉండేవి. ప్రజల పరిజ్ఞానం కనీస స్థాయిలో కూడా లేకపోవడం వల్ల ఊహించని విధంగా సంభవిస్తున్న మరణాలకు కారణాలను వెలికి తీయలేకపోయారు. వైద్యులు ఎంత మూర్ఖంగా ప్రవర్తించే వారంటే రోగాన్ని నయం చేయడం బదులు ఒక వ్యక్తిని వారు మరింత అనారోగ్యంలోకి నెట్టేవారు. ప్లేగు మహమ్మారి లేదా స్మాల్‌పాక్స్ పట్టణంలోని జనాభాలో నాలుగో వంతును తుడిచిపెట్టేవి. ఘోరమైన పంట వైఫల్యాలు- దానితో పాటు ఆకలి- దశాబ్దంలో ఒక్కసారైనా సంభవించేవి.

ప్రజలు అలాంటి వైపరీత్యానికి ఎప్పుడూ సన్నద్ధంగా ఉండేవారు. ఒక చిన్న నిప్పురవ్వ మొత్తం వీధినే కాల్చి బూడిద చేసేది. కొన్ని సార్లు నగరాలకు నగరాలే తగులబడిపోయేవి. ఉదాహరణకు 1666లో లండన్ నగరం మొత్తం అగ్నికి ఆహుతి అయ్యింది.

అసహజంగా తోచిన ఇలాంటి సంఘటనలను దీర్ఘకాలంలో నివారించాలంటే ప్రజలు మౌలిక కారణాలను అర్థం చేసుకోవడమే ఏకైక పరిష్కార మార్గంగా ఉండేది. అప్పటికీ శాస్త్రాలు మూఢనమ్మకాల నుండి పూర్తిగా వేరుపడలేదు. రసాయన శాస్త్రంకాని లోహశాస్త్రంకాని పూర్తిగా అభివృద్ధి చెందలేదు. ఖగోళశాస్త్రం సిద్ధాంతాలకు జ్యోతిష్యశాస్త్రమే ఆధారంగా ఉండేది. గణిత శాస్త్రం కూడా అంకెల 'మాయ' లేదా 'గారడి'గా ఉండేది. ఇలాంటి గందరగోళాన్ని నివారించే అవకాశం ఉన్నా ప్రాచీన గ్రీకు, లాటిన్ లేదా అరబిక్ గ్రంథాలను అధ్యయనం చేస్తే శాస్త్రీయ పరిజ్ఞాన్ని పొందవచ్చని ప్రజలు అప్పటికీ నమ్మేవారు.

ఒక విష వలయం ఉండేది. శాస్త్రాలు అభివృద్ధి చెందనిదే మూఢనమ్మకాలను, తంత్రవిద్యలను నిర్మూలించడానికి అవకాశమే ఉండేది కాదు. మరోవైపు శాస్త్రీయ నమ్మకాలకు, మతపరమైన భావనలకు మధ్య నేడు ఉన్నంత స్పష్టమైన తేడా అప్పుడు ఉండేది కాదు. ఉదాహరణకు భూమి చుట్టూ గ్రహాలు, సూర్యుడు, నక్షత్రాలు పరిభ్రమిస్తున్నాయి అన్న నమ్మకాన్ని తీసుకోండి. ఈ నమ్మకం అరిస్టాటిల్ అభిప్రాయాల మీద ఆధారపడి ఉండేది. దీని తర్వాతి కాలంలో టోలెమీ సవరించాడు. సూర్యుడి చుట్టూ భూమి పరిభ్రమిస్తోందన్న వాదన ఎంతో కాలంగా ఉండేది. ప్రాచీన గ్రీకు-రోమను ప్రపంచంలో పాంటస్‌కు చెందిన హెరాక్లిడ్స్, మధ్యయుగాల్లో నికోల్ ఒరాస్మె, నికొలస్ కుసానస్‌లు ఈ సిద్ధాంతాన్ని అభివృద్ధి పరిచారు. అయితే నేడు మనం జీర్ణించుకోలేనంత మూర్ఖంగా అప్పటి విద్యావంతులు, ప్రగతిశీల భావాలు గల మేధావులు ఈ సిద్ధాంతాన్ని సుమారు 1500 సంవత్సరాల పాటు తిరస్కరిస్తూ వచ్చారు. అసలు భూమికి చలనం ఎక్కడ ఉంది? అని ప్రశ్నించేవారు. గ్రహాల చలనంపై అరిస్టాటిల్ వ్యక్తం చేసిన అభిప్రాయాలను, చేసిన వాదనలను ప్రశ్నించడమే నేరమని భావించేవారు. అయితే ఇలాంటి అభ్యంతరాన్ని 1543లో కాపర్నికస్ సిద్ధాంతం అధిగమించలేకపోయింది. పోలిష్ సన్యాసి అయిన కాపర్నికస్ గ్రహాల చలనంపై కొత్త సిద్ధాంతాన్ని రూపొందించాడు. సూర్యుడి చుట్టూ భూమి, ఇతర నక్షత్రాలు, గ్రహాలు పరిభ్రమిస్తున్నాయని అతడు సిద్ధాంతీకరించాడు. కాపర్నికస్ సిద్ధాంతానికి ఆచరణాత్మక ప్రయోజనాలు ఉన్నాయని నమ్మిన మేధావులు, విద్వాంసులు కూడా దానిని ఆమోదించే సాహసం చేయలేదు. ఉదాహరణకు ఫ్రాన్సిస్ బేకన్ కాపర్నికస్ సిద్ధాంతాన్ని ఏకపక్షంగా తిరస్కరించాడు. ఆధునిక అనుభవవాద దృక్పథం ఉన్నా తనలాంటి అధ్యాపకుడు అలాంటి విచ్ఛిన్నకరమైన ఊహాగానాలకు ఊతం ఇవ్వవలసిన అవసరం లేదని అతడు భావించాడు. గ్రహాల చలనంపై కాపర్నికస్ వేసిన

తప్పుడు లెక్కలు మరోమారు సందేహాలను రేకెత్తించాయి. సుమారు 50 ఏళ్ల తర్వాత కెప్లర్ ఈ దోషాలను సవరించే వరకు కాపర్నికస్ సిద్ధాంతం పట్ల ఉన్న వ్యతిరేకత అలాగే కొనసాగింది. అయితే ఇప్పటి ప్రమాణాలతో పోలిస్తే కెప్లర్ నమ్మకాలు కూడా మూఢంగానే తోస్తాయి. సూర్యుడు, గ్రహాల మధ్య, గ్రహాలు-గ్రహాల మధ్య దూరాలు గణాంకాలేనని, భౌతిక శక్తుల ప్రమేయం అందులో ఏ మాత్రం లేదని కెప్లర్ నమ్మాడు. అప్పటివరకు అరిస్టాటిల్ సిద్ధాంతాలపై నడిచిన సమాజాన్ని అతడు ప్లాటో లేదా పైథాగరస్ యుగంలోకి తీసుకెళ్లాడు. ఆ యుగాల్లో ప్రతి అంశం వాస్తవాలకు భిన్నంగా నిర్ధారణ అయ్యేది. కెప్లర్ నమ్మకం (లేదా సిద్ధాంతం) జోతిష్య అంచనాలను సమర్థించేదిగా ఉంది. అందుకు అతడు ఖగోళ గణాంకాలను మాత్రమే జతపరిచాడు. ఒక్క సంఘటన ఏదేని రంగంలో జరిగితే మరో రంగంలో కూడా అది తప్పక సంభవిస్తుందన్న సిద్ధాంతాన్ని అతడు సమర్థించినట్లయింది. ఖగోళ సూచనలు (భవిష్యత్‌కు సంబంధించి) చేసేందుకు కెప్లర్ పూర్తిగా సన్నద్ధమయ్యాడు. 1618లో ప్లాగ్‌లో అతడు ఇలా ప్రకటించాడు: "ఒక పెద్ద సమస్యను ఎదుర్కోనిదే మే మాసం గడవదు." ఆ సూచన వాస్తవమై కూర్చుంది. '30 ఏళ్ల' యుద్ధం ఆ మాసంలో మొదలైంది. అయితే యుద్ధానికి, గ్రహాల కదలికకు ఎలాంటి సంబంధం లేదు.

ఇతరులపై (పృథ్వీవాసులపై) గ్రహాల ప్రభావం ఉందని కేవలం కెప్లర్ మాత్రమే నమ్మేవాడు కాదు. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో నయాప్లాటోవాదం 17వ శతాబ్దం ద్వితీయార్ధం వరకు కూడా ప్రభావం గల శక్తిగా మనగలిగింది. ఆయస్కాంతం దూరంగా ఉన్న ఇనుము పరికరాలను ఆకర్షించినట్లే ఒక వ్యక్తిని గాయపరచిన కత్తిని సరిచేయడం ద్వారా గాయాన్ని మాన్పించవచ్చునని అప్పటి వరకు కూడా ప్రజలు నమ్మేవారు.

కొపర్నికస్ సిద్ధాంతానికి ప్రజామోదం సమకూర్చేందుకు గలీలియో తన శక్తి మేరకు కృషి చేశాడు. 1609 లో ఆవిష్కరించబడిన టెలిస్కోప్‌ను వినియోగించి అతడు చంద్ర మండలంలో ఉన్న గోతులను, పర్వతాలను కనిపెట్టాడు. అరిస్టాటిల్-టోలెమీ ద్వయం వాదించినట్లు చంద్రమండలం భూమికి పూర్తి భిన్నమైన పదార్థంతో నిర్మాణం కాలేదని ఈ కొత్త అధ్యయనం స్పష్టం చేసింది. నవీన భౌతిక శాస్త్ర అంశాలను కూడా గలీలియో అభివృద్ధి పరిచాడు. గ్రహాలు ఎలా పరిభ్రమిస్తాయో అతడు ఖచ్చితంగా నిర్ధారించగలిగాడు. గలీలియో సిద్ధాంతాలు అరిస్టాటిల్ ఆలోచనలను పూర్తి స్థాయిలో సవాలు చేశాయి. అయినప్పటికీ ప్రపంచ దృక్పథాన్ని అతడు వీడలేకపోయాడు. ఉదాహరణకు విశ్వం పరిమితమైనదని గలీలియో అంగీకరించాడు. గ్రహాలు వృత్తాకారంలో కాకుండా దీర్ఘవృత్తాకార కక్ష్యలో పరిభ్రమిస్తాయన్న కెప్లర్ సిద్ధాంతాన్ని అతడు తోసిపుచ్చాడు. ఈ మేరకు అతడు పాత ఆలోచనలకు బందీ అయినట్లు కనిపిస్తాడు. అనతికాలంలో అతడు మరో రూపంలో బందీ అయ్యాడు. విచారణపీఠం వద్ద అతడిపై దైవదూషణ అభియోగాన్ని మోపారు కొపర్నికస్ సిద్ధాంతాన్ని ఖండించేలా అతడిని

బలవంతం చేశారు. తర్వాత గృహనిర్బంధంలో ఉంచారు. మరణించే వరకు అతడు గృహనిర్బంధంలోనే ఉన్నారు.

ఆ కాలపు సైద్ధాంతిక చర్చల్లో భౌతిక, ఖగోళ శాస్త్రాలపై వాదవివాదాలు కూడా అంతర్భాగమయ్యాయి. 1543లో కాథలిక్ చర్చి నుండి అణచివేత తప్పదని గ్రహించి కూడా కొపర్నికస్ తన అభిప్రాయాలను ప్రచురించగలిగాడు. శిక్షకు అతడు ఏమాత్రం భయపడలేదు. ఊహించినట్లుగానే లూథర్ శిష్యుడు మెలాన్చ్‌థన్ అతడిపై పరుషమైన పదజాలంతో విరుచుకుపడ్డాడు. మరోవైపు కాథలిక్ చర్చి కాలసూచికను కొపర్నికస్ సిద్ధాంతం ఆధారంగా తీసిన గణాంకాలతో సవరించింది. అయితే ప్రతీఘాత సంస్కరణోద్యమం బయల్దేరడంతో పరిస్థితులు ఒక్కసారిగా మారిపోయాయి. ఉద్యమ సమర్థకులు 250 ఏళ్ల క్రితం థామస్ అక్వినాస్ ఆమోదించిన అరిస్టాటిల్‌వాదానికి మద్దతుగా ప్రజలను సమీకరించారు. 13వ శతాబ్దంలో తాత్విక వాదనలను తెరదించడానికి కొత్తగా ఏర్పాటైన విచారణపీఠం వద్ద అక్వినాస్ ఆ సిద్ధాంతాన్ని ఆమోదించాడు. ప్రతి వ్యక్తికి, ప్రతి వస్తువుకు ప్రక్రియలో తనకంటూ ఒక స్థానముంటుందని అరిస్టాటిల్‌తోపాటు అక్వినాస్ కూడా ప్రబోధించాడు. గ్రహాలు నిర్దిష్టంగా ఉన్నట్లే భూమి కూడా నిర్దిష్టంగా ఉందని వారు స్పష్టం చేశారు. సంస్కరణోద్యమాన్నే కాకుండా విప్లవ భావాలుగల మధ్యతరగతి, పేద వర్గాలను అణచివేయాలని భావించిన పాలకులకు, భూస్వామ్య వర్గాలకు పై సిద్ధాంతాలు బాగా ఉపయోగపడ్డాయి. వాటిని సాధనాలుగా చేసుకొని సమాజాన్ని మళ్లీ పాత భూస్వామ్య వ్యవస్థ వైపునడపాలని పాలకవర్గాలు యోచించాయి. అలాంటి దృక్పథంకల ఉన్నత సమాజానికి కొపర్నికస్ సిద్ధాంతం లూథర్ లేదా కాల్విన్ ఆలోచనల కంటే విచ్ఛిన్నకరమైనదిగా తోచింది. విశ్వానికి పరిమితులు లేవని, అందులో ఎన్నో ప్రపంచాలు ఇమిడి ఉన్నాయని ప్రకటించినందుకు 1600లో గియోర్దానో బ్రూనోను సజీవంగా దహనం చేశారు. కాథలిక్ రాజ్యాలలో నెలకొన్న సైద్ధాంతిక వాతావరణం శాస్త్రసాంకేతిక ప్రగతికి అవరోధంగా తయారైంది. గలీలియో విచారణ గురించి తెలుసుకున్న తర్వాత ఫ్రెంచి గణితశాస్త్రవేత్త, తత్త్వవేత్త అయిన డెస్కార్టెస్ తన కొత్త అధ్యయన ఫలితాలను తొక్కిపెట్టాడు. అ ఫలితాలు న్యూటన్ సిద్ధాంతాలను అధిగమించే అవకాశం ఉండేది. డచ్ రిపబ్లిక్, విప్లవానంతర ఇంగ్లాండ్‌లకు శాస్త్ర సాంకేతిక అధ్యయన ప్రక్రియ తరలివెళ్లడంలో మనకు ఏమాత్రం ఆశ్చర్యం కనిపించదు. బాయిల్, హుక్, హ్యూజెన్స్, అందరికంటే ఎక్కువగా న్యూటన్ ఈ ప్రక్రియను ముందుకు తీసుకువెళ్లి భౌతిక, ఖగోళ శాస్త్రాలను పరిపూర్ణం చేశారు.

అయితే కాథలిక్‌ల కంటే ప్రొటెస్టెంట్లు ఎంతో చైతన్యవంతులని మాత్రం ఇక్కడ భావించకూడదు. కీత్ థామస్ పేర్కొన్నట్లు ప్రతి మత శాఖకు చెందిన విమోచకులు 'చేతబడి' వాస్తవికమైనదేనని నిర్ధారించారు. అయితే ప్రొటెస్టెంట్‌వాదానికి పునాది సామాజిక వర్గాల్లో ఉండేది. వీరిలో సాధారణ వ్యాపారులు, వృత్తిదారులు ఎక్కువగా ఉండేవారు. వీరు

విద్యాభ్యాసానికై పరితపించారు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో అభ్యున్నతి సాధించడం కంటే బైబిల్‌ను పఠించాలన్న ఆకాంక్ష వారిలో బలంగా ఉండేది. ప్రొటెస్టెంట్‌వాద విస్తరణతోపాటు అక్షరాస్యత కూడా పెరిగింది. ప్రజలు ఒక్కసారి చదవడం, రాయడం నేర్చుకున్న తర్వాత కొత్త ఆలోచనల లోకం వారిముందు సాక్షాత్కరించింది. పాత సనాతనవాదానికి సవాలు ఏర్పడిందన్న భావన వారిలో కలగగానే కొత్త ఆలోచనలకు వారు పదును పెట్టారు. ఇంగ్లాండ్ విప్లవోద్యమంలో ఈ మార్పు స్పష్టంగా గోచరించింది. బిషప్‌లను, రాజును సవాలు చేసిన ప్రెస్బిటేరియన్లు సాహిత్యంపై ఉన్న నిషేధాన్ని ఎత్తివేయకుండానే తమ ఉద్యమంలో విజయం సాధించి ఉండేవారు కాదు. అయితే స్వేచ్ఛావాతావరణంలో ఇతర మత శాఖలు కూడా తమ సిద్ధాంతాలు, ఆలోచనలను తీవ్రంగా ప్రచారం చేయగలిగాయి. మతసిద్ధాంతాల ఈ గోలలో ప్రజలు తమ సందేహాలను స్వేచ్ఛగా వ్యక్తం చేయగలిగారు. నవీన ఆదర్శ సైన్యంలోని ఒక తాగుబోతు సైనికుడు దేవుడి సార్థకతను ప్రశ్నించే ధైర్యం చేయగలిగేవాడు. "దేవుడు అసలు ఉన్నాడు అంటే ఆ బల్లపైన ఉన్న కుండ దేవుడై ఉండొచ్చు కదా!" సాంప్రదాయవాది అయిన థామస్ హాబ్స్ అనే రాజకీయ సిద్ధాంతవేత్త 'లెవియథన్' అనే భౌతికవాద కృతిని ప్రచురించాడు. మతపరమైన అద్భుతాలను ప్రశ్నిస్తూ అతడు ఆ గ్రంథంలో అనేక వాదనలు లేవనెత్తాడు. రాచరిక వర్గాల నుండి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాన్ని ఆదర్శసైన్యం స్వాధీనం చేసుకున్న తర్వాత అక్కడ ఒక అధ్యయన కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దాంతో ఆ కేంద్రం శాస్త్రవేత్తలకు, సాంకేతిక ప్రగతికి నిలయంగా మారింది,

పునరుద్ధరణ సమయంలో దైవ దూషణ నేరంపై తనను సజీవంగా దహనం చేస్తారన్న భయాన్ని హాబ్స్ వ్యక్తం చేశాడు. అయితే అందుకు భిన్నంగా అతడికి రాచరిక పారితోషికం లభించింది. ఆక్స్‌ఫర్డ్‌లో స్థాపించిన అధ్యయన కేంద్రం రాచరిక సంస్థగా (రాయల్ సొసైటీ) రూపాంతరం చెందింది. ప్రకృతిపై నియంత్రణ పెంచుకోవడంలో శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం ఒక నిచ్చెనలా ఉపయోగపడింది. వ్యవసాయం, పరిశ్రమ, వాణిజ్యం, రక్షణ రంగాల్లో అనూహ్యమైన ప్రగతి సాధ్యమైంది.

అయితే ఈ పరిణామాలను బట్టి మూఢనమ్మకాలపై పూర్తిగా విజయం సాధించారని మనం భావించకూడదు. పారిశ్రామికంగా ప్రగతి సాధించిన దేశాల్లో కూడా ప్రజలు ఎక్కువగా జోతిష్యులు, తాంత్రికులను నమ్మేవారు. అలాగే మూఢనమ్మకాలు కేవలం నిరక్షరాస్యుల వరకే పరిమితం కాలేదు. రొనాల్డ్ రీగన్, ఇందిరా గాంధీ, ఫ్రాన్స్ మాజీ ప్రధాని ఎడిత్ క్రెస్సన్ జోతిష్యులను సంప్రదించారు. 18వ శతాబ్దంలో మంత్రవిద్యల ప్రభావం మరీ ఎక్కువగా ఉండేది.

కాని ఒక్క మార్పు మాత్రం వచ్చింది. అంతర్యుద్ధం జరుగుతున్న అరాచక పరిస్థితుల్లో (1640) మాథ్యూ హాప్కిన్స్ అనే నేరనిపుణుడు సుమారు 200 వ్యాజ్యాలను ఇంగ్లాండ్‌లోని

వివిధ న్యాయస్థానాల్లో తీసుకొచ్చి చేతబడి నిర్వహించే వారికి శిక్షలు విధింప చేశాడు. గతంలో అంతమందికి ఎన్నడూ శిక్ష పడలేదు. స్కాట్లాండ్‌ను ఆదర్శసైన్యం స్వాధీనం చేసుకున్న తర్వాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. చేతబడి, తాంత్రికుల అణచివేత ఆగిపోయింది. 1668లో ఒక వ్యాఖ్యాత ఇలా రాశాడు: "ఓడిపోయిన భూస్వాములు, మేధావులమని చెప్పుకున్న వారు తాంత్రిక విద్య పట్ల నమ్మకం ఉన్నవారిని దూషించారు." 1685లో ఇంగ్లాండ్‌లో చివరిసారిగా ఒక తాంత్రికవేత్తను ఉరి తీశారు మరో 50ఏళ్ల పాటు చేతబడిని శిక్షాస్మృతి తీవ్రమైన నేరంగా పరిగణించింది. గత శతాబ్ద కాలంలో చోటు చేసుకున్న రాజకీయ - ఆర్థిక - సామాజిక మార్పుల కారణంగా ప్రజల ఆలోచనాధోరణిలో మార్పు వచ్చింది.

మూడవ అధ్యాయం

# చైతన్యోద్యమం

డచ్, ఇంగ్లాండ్ విప్లవాల తర్వాత సాంప్రదాయ సిద్ధాంతాలకు మేధావుల నుండి విప్లవాత్మకమైన రీతిలో సవాలు ఏర్పడింది. అప్పటికే వర్గ సమాజం పూర్తిగా ఆవిర్భవించింది. మధ్యతరగతి, ఉన్నత లేదా సంపన్నకుటుంబాలకు చెందిన మేధావులు, విద్వాంసులు తమ సమాజాలు లోపభూయిష్టంగా ఉన్నాయని భావించడం మొదలుపెట్టారు. ఐరోపా అంతటా ఇలాంటి భావన పెరిగిపోయింది. సిద్ధాంతాలు, ఆలోచనల్లో మార్పు తేవడం ద్వారా సమాజాన్ని పునర్వ్యవస్థీకరించాలని వారు యోచించారు. ఫలితంగా పునరుజ్జీవ, పునరుద్ధరణ ఉద్యమాలలో కంటే మూఢనమ్మకాలు, స్వార్థ ప్రయోజనాలకు వ్యతిరేకంగా తీవ్రమైన సైద్ధాంతిక ఘర్షణ మొదలైంది. ఈ ఉద్యమంలో అనేక సిద్ధాంతాలు ఉద్భవించాయి. వాటినన్నింటిని ఉమ్మడిగా చైతన్యోద్యమం అని పరిగణిస్తారు.

జీవశాస్త్ర నిపుణులు, తత్త్వవేత్తలు, వ్యంగ్యకారులు, ఆర్థికవేత్తలు, చరిత్రకారులు, వ్యాసకర్తలు, నవలారచయితలు, రాజకీయ సిద్ధాంతవేత్తలు, మొజార్ట్ లాంటి సంగీతకారులు సైతం ఈ ఉద్యమ స్రవంతిలో వచ్చి చేరారు. అయితే అందరి ఆలోచనలు, అభిప్రాయాలు ఒకే రూపంలో ఉండేవి కావు. ప్రధానాంశాలపై వారి మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు ఉండేవి.

అనుభవవాద పరిజ్ఞానం ఆధారంగా లభించే తార్కిక అవగాహన శక్తిపై అందరికీ నమ్మకం ఉండేది. ఇలాంటి శక్తిని సమాజంపై ప్రయోగించాల్సి ఉంది. అవసరమైతే అధికారిక నమ్మకాలను, సిద్ధాంతాలను సవాలు చేసి అయినా సరే సమాజాన్ని సంస్కరించాల్సి ఉంది. ఇలాంటి వైఖరి ఐరోపా సమాజాల్లోని అనేక సంస్థలు, రాజ్య సిద్ధాంతాలకు నేరుగా సవాలు విసిరింది. ఫ్రాన్స్‌లో డెస్కార్టెస్, హాలెండ్‌లో స్పినోజా, దక్షిణ-పశ్చిమ జర్మనీలో లీబ్నిజ్ లాంటి తత్త్వవేత్తలు తీవ్రమైన ప్రభావం చూపాడు. ఆలోచనకు సంబంధించిన కొన్ని ఎదురులేని సూత్రాల ఆధారంగా ప్రపంచాన్ని పూర్తిగా అర్థం చేసుకోవలసిన అవసరం ఉందని వారు ఒక నిర్ధారణకు వచ్చారు. ఈ భావన 18వ శతాబ్దంలో బాగా ప్రబలిపోయింది. భౌతిక శాస్త్ర మూల సిద్ధాంతాలను న్యూటన్ ఆవిష్కరించిన తర్వాత సత్యశోధన, తార్కిక ఆలోచన, విచారణ, విశ్లేషణ, ప్రతిపాదన అనే అంశాలకు ఎనలేని ప్రాధాన్యత ఏర్పడింది. ఈ 'హేతుబద్ధ' తత్త్వవేత్తలు మౌలికంగా విప్లవ రాజకీయవేత్తలు కారు.

విశ్వం పూర్వనిర్ధారిత సమన్వయం ఆధారంగా నడుస్తోందని లీబ్నిజ్ ప్రముఖంగా ప్రస్తావించారు. ఇదే అంశాన్ని వాల్టెయిర్ తన 'కాండిడ్' నవలలో వ్యంగ్య శైలిలో వర్ణించాడు. అయితే

హేతుబద్ధమైన పంథా కొందరికి విప్లవ సాధనంగా కూడా ఉపయోగపడే అవకాశం ఉండేది. ఎందుకంటే ప్రాథమిక సూత్రాల ఆధారంగా నిర్మాణం కాని సంస్థలు లేదా ఆచారాన్ని నిర్ద్వంద్వగా తిరస్కరించాలని విప్లవకారులు కోరుకునేవారు.

మరో ముఖ్యమైన ప్రభావం ఇంగ్లాండ్‌లో లాకే ప్రారంభించిన పూర్తి భిన్నమైన సాంప్రదాయం హేతుబద్ధుల నిగూఢ ఆలోచనల నుండి కాకుండా ముందుగానే ఆచరణలో ఉన్న విషయాల అనుభవవాద పరిశీలన ద్వారానే జ్ఞానం సిద్ధిస్తుందని లాకే వాదించాడు. లీబ్నిజ్ కోవలోనే లాకే కూడా రాజకీయంగా సాంప్రదాయవాది. ఇంగ్లాండ్ భూస్వాములు, వ్యాపారుల దృక్పథాన్ని అతడు ప్రదర్శించాడు. ఉన్నతవర్గాలతో కూడిన పార్లమెంటు ద్వారా పరిపాలించడానికి ఇంగ్లాండ్ రాజులు అంగీకరించడంతో లీబ్నిజ్, లాకేల ఆశయాలు నెరవేరాయి. అయితే 18వ శతాబ్దం గడిచే కొద్దీ ఇంగ్లాండ్ అనుభవవాద పంథా నుండి ఫ్రాన్స్, జర్మనీలలో మరింత విప్లవాత్మకమైన సిద్ధాంతాలను ప్రతిపాదించడం మొదలుపెట్టారు. ఫ్రాన్స్‌లో వాల్టెయిర్, మాంటెస్క్యూలు లాకే అభిమానులుగా మారారు. లాకే రచనలు వారినెంతో ప్రభావితం చేశాయి. ఇంగ్లాండ్ తరహాలో ఐరోపా దేశాలన్నింటినీ సంస్కరించాల్సిన అవసరముందని నిర్ధారణకు వచ్చారు. ఇంగ్లాండ్‌లోని సాంప్రదాయవాద సిద్ధాంతం ఇంగ్లీష్ ఛానల్ అవతల విచ్ఛిన్నకరమైన ఆలోచనగా మారే అవకాశముండేది.

చైతన్యోద్యమ నేతలు ఎవ్వరూ విప్లవకారులు కారు. వారు కేవలం అసమ్మతి మేధావులు, తమ ఉద్యమానికి చేయూతనివ్వాలని వారు ఉన్నతవర్గాలను ఆశ్రయించారు. వ్యవస్థను నిర్మూలించడం కంటే సమాజాన్ని సంస్కరించడంపైనే వారు దృష్టి సారించారు. ఆ లక్ష్యాన్ని సైద్ధాంతిక ఘర్షణ ద్వారా సాధించాలని నిర్ణయించారు. రష్యా మహారాణి కాథరీన్ దిగ్రేట్‌ను సందర్శించడానికి డిడేరాట్ ఏ మాత్రం సంకోచించలేదు. అలాగే ప్రషియారాజు ఫ్రెడరిక్ ది గ్రేట్‌తో చేతులు కలపడానికి వాల్టెయిర్ కూడా వెనుకాడలేదు. వీరి సైద్ధాంతిక నేపథ్యాన్ని చాలా మంది ఆలోచకులు ప్రతిబింబించేవారు. వారానికి రెండుసార్లు జరిగే సాధారణ సమావేశాలకు చాలా మంది హాజరయ్యేవారు. ఈ సమావేశాలను డ'హాల్బాచ్ భార్య నిర్వహించేది. డిడేరాట్, హ్యూమ్, రూసో, బెంజమిన్ ఫ్రాంక్లిన్, జోసెఫ్ ప్రెస్లే, నేపుల్స్ రాయబారి లార్డ్ షెల్‌బోర్న్, ఫ్రాన్స్ రాచకుటుంబానికి చెందిన నెకర్, బ్రన్స్‌విక్ రాకుమారుడు తదితరులు ఈ సమావేశాలకు క్రమం తప్పకుండా హాజరయ్యేవారు. "మనం చైతన్యపరచాల్సింది కార్మికులను కాదు, మంచివారైన (బూర్జువా) వ్యాపారులను," అని వాల్టెయిర్ నొక్కి చెప్పాడు. కొత్త ఆలోచలను బలంగా సమర్ధించే ఫ్రెంచి విద్వాంసులు కూడా కేవలం అధ్యయన గ్రంథాలపైనే దృష్టి సారించారు. సాధారణ పౌరులు, కార్మిక వర్గాలకు ఇలాంటి సాహిత్యం అందుబాటులో ఉండేది. కాదు. (డిడేరాట్ తొలి సంకలనాలు, అలెంబర్ట్ ఎన్‌సైక్లోపీడియా (17 సంపుటాలు) కేవలం 4,000 ప్రతులు మాత్రమే అమ్ముడుపోయాయి.) సన్నిహితులైన పాలకులు లేదా మేసాన్ సమాజ సమావేశాల ద్వారా చైతన్యోద్యమంలోకి మధ్యతరగతి, ఉన్నతవర్గాలకు చెందిన విద్యావంతులు వచ్చారు.

చైతన్యోద్యమ నాయకులు తమ విమర్శలను, కొత్త సిద్ధాంతాలను ప్రజల్లో ఏ మేరకు తీసుకెళ్లాలి అన్న విషయంలో కూడా పరిమితులు ఉండేవి. మత మౌఢ్యంపట్ల వాల్టెయిర్ తీవ్రంగా స్పందించినా హాల్బాచ్ పూర్తిగా నాస్తికవాద దృక్పథంతో రచించిన 'ప్రకృతి వ్యవస్థ' ప్రచురితమైనపుడు అతడు తన నిగ్రహాన్ని కోల్పోయాడు. "ఈ పుస్తకం తత్త్వశాస్త్రాన్ని రాజు, తదితర ఉన్నతవర్గాల దృష్టిలో సహించరాని సాహిత్యంగా మార్చివేసింది." అని వాల్టెయిర్ రాశాడు. క్రైస్తవ చర్చి జోక్యాన్ని తీవ్రంగా విమర్శిస్తూ

ఇంగ్లాండ్‌కు చెందిన గిబ్బన్ "రోమన్ సామ్రాజ్య పతనం" అనే చారిత్రక గ్రంథాన్ని రచించగలిగాడు. అయితే ప్రజల మత విశ్వాసాలకు భంగం కలిగించాలన్నది అతడి లక్ష్యం కాదు. స్కాట్లాండ్‌కు చెందిన డేవిడ్ హ్యూమ్ తాను జీవించి ఉన్నంతవరకు మత వ్యతిరేక సాహిత్యాన్ని ప్రచురించలేదు. 'సామాజిక ఒడంబడిక'లో రూసో లేవనెత్తిన వివాదాస్పద అంశాలను, అతడు తీసుకున్న వైఖరిని వాల్టెయిర్ వ్యతిరేకించాడు. మరోవైపు మతంపట్ల వాల్టెయిర్ అవలంభించిన తప్పుడు వైఖరిని రూసో ఖండించాడు.

అయితే విప్లవ వైఖరిని తీసుకోవడానికి ఎంత సంకోచించినా, చైతన్య ఉద్యమ నాయకులు సమాజ నిర్వహణకు సంబంధించిన కొన్ని మౌలిక సూత్రాలను సవాలు చేశారు. తేలికపాటి సంస్కరణలకు వారు సిద్ధం కాలేదు. మరోవైపు కొన్ని శక్తివంతమైన ప్రయోజనాలు (వర్గాలు) వ్యవస్థను ప్రశ్నించడాన్ని రాజద్రోహంగా పరిగణించేవి. ఫలితంగా అనేక మంది మేధావులు కష్టాలను ఎదుర్కొన్నారు. ఒక పాలకవర్గ సభ్యుడి కిరాయి దుండగులు వాల్టెయిర్‌ను చితకబాదారు. కొంతకాలంపాటు బాసిలీ కారాగారంలో ఖైదు శిక్షను అనుభవించాడు. అవమానభారం భరించలేక అతడు పారిస్ నగరాన్ని వదలి వెళ్లాడు. పారిస్‌కు దూరంగా వాల్టెయిర్ అనేక సంవత్సరాలు గడిపాడు. పారిస్‌కు సమీపంలోని విన్‌సియన్స్ కోటలో డిడేరాట్ కొంత కాలం పాటు ఖైదు అనుభవించాడు. ఫ్రెంచ్ అధికారుల వేట నుండి తప్పించుకొని రూసో తన శేష జీవితాన్ని స్విస్ సరిహద్దు అవతల గడిపాడు. తన యజమాని కుట్రలను వమ్ము చేసే శక్తి సేవకుడికి ఉంటుందని సూచించినందుకు బ్యూమార్చాయిస్ నాటికలను అనేక దేశాల్లో నిషేధించారు. (బ్యూమార్చాయిస్ రచించిన 'మ్యారెజ్ ఆఫ్ ఫిగార్' తర్వాతి కాలంలో మొజార్ట్ ఆపెరాకు కథావస్తువైంది.)

రాజ్యసిద్ధాంతాలను ప్రశ్నించే వారి పట్ల చర్చి కఠిన వైఖరిని అవలంబించేది. ప్రతీఘాత సంస్కరణోద్యమం దక్షిణ ఐరోపా చర్చి వ్యతిరేకులందరినీ అణచివేసింది. ఈ పరిస్థితి 18వ శతాబ్దం ద్వితీయార్థం వరకు కొనసాగింది, 1700-46 మధ్య స్పెయిన్‌లో దైవ దూషణ నేరంపై 700 మందిని సజీవ దహనం చేశారు. ఫ్రాన్స్‌లో అప్పటికీ ప్రొటెస్టెంట్లను బానిసలుగా మార్చేవారు. ఇద్దరు ప్రొటెస్టెంట్లను చక్రానికి కట్టి రెండు ముక్కలుగా విరగొట్టిన తర్వాత (1761లో ఒకరిని టౌలోస్‌లో ఉరి తీశారు, మరొకరిని అబ్బెవిల్లేలో (1766) శిక్ష విధించారు.

ఇలాంటి సంఘటనలను సవాలు చేయడం ద్వారా మేధావులు సమాజ నిర్వహణ ఉండాలనే విషయమై మౌలిక అంశాలను ప్రజల ముందుకు తెచ్చారు. ప్రాథమిక అంశాలను లేవదీసిన వాటికి పరిష్కారం చూపడంలో వారు వెనుకంజ వేశారు. వాల్టెయిర్ రచన కేండిడే కొన్ని తీవ్రమైన విశ్లేషణలు చేసింది. ఐరోపాలోని ఏ రాజ్యమూ ప్రజల అవసరాలను తీర్చే స్థితిలో లేదని ఆ గ్రంథం సూచించింది. "మానవుడు స్వేచ్ఛాజీవిగా పుట్టాడు. అయితే ప్రతిచోటా అతడు బానిస సంకెళ్లలో ఉన్నాడు," అన్న విప్లవ ఆలోచనతో రూసో తన 'సామాజిక ఒడంబడిక' గ్రంథాన్ని ప్రారంభించాడు.

ప్రజలపై పూర్తి విశ్వాసం లేకపోయినా రూసో విప్లవ దృక్పథాన్ని ప్రదర్శించగలిగాడు. హోల్బాచ్, హెల్వేషియస్ లాంటి తత్త్వవేత్తలు సమాజాన్ని, ప్రకృతిని విపులమైన భౌతికవాద దృష్టితో విశ్లేషించిన తర్వాత దైవ సిద్ధాంతాన్ని కొట్టివేయడానికి ప్రయత్నించారు. జీవశాస్త్ర నిపుణుడు బఫాన్ జంతు జాతుల పరిణామవాద సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. తద్వారా మానవజాతి ఐక్యమత్యాన్ని చాటి చెప్పడానికి ప్రయత్నించాడు. వివిధ జాతుల మధ్య భేదాలకు కారణం కేవలం వాతావరణ పరిస్థితులేనని వివరించాడు. స్కాట్లాండ్ దేశస్తులు ఆడమ్ ఫెర్గూసన్, ఆడమ్ స్మిత్‌లు మానవ సమాజ వికాస దశలను వివరించారు. వేట-సేకరణ నుండి గ్రామీణ జీవితం వైపు, వ్యవసాయం నుండి పారిశ్రామిక జీవితంవైపు మానవుడి

ప్రస్థానాన్ని వివరించి సమాజ ప్రగతి భౌతికవాద అవగాహనకు పునాదులు వేశారు. చైతన్యోద్యమ ఆలోచకులు మానవులు, మానవ సంస్థల సార్ధకతను నిరూపించడానికి గతంలో ఎన్నడూలేని విధంగా కృషి చేశారు.

వీరి ఆలోచనలు బలపడిన తీరులో కొంత అర్థం కనిపిస్తుంది. ఐరోపా అంతటా మేధావుల చర్చల్లో ఈ ఆలోచనలే ప్రధానాంశాలుగా మారాయి. ఇతర ఆలోచనలు లేదా అభిప్రాయాలు కలవారు ఆత్మరక్షణలో పడ్డారు. ఆధునికమైన, విజయవంతమైన సమాజ ఇంగ్లాండ్‌లో దర్శించినట్లే తమ దేశాల్లో కూడా అలాంటి వ్యవస్థను నెలకొల్పాలని భావించిన పాలకవర్గాలు కూడా ఈ మేధావుల వాదనలను వినేవారు. అప్పటికే ఐరోపా ఖండంలో బూజుపట్టిన, ఆర్థికంగా పతనమైన సమాజాలు కొనసాగుతూ ఉండేవి.

ఆస్ట్రియా, రష్యా, పోర్చుగల్, పోలెండ్ ప్రభుత్వాలు వివిధ దశలో కొన్ని సంస్కరణలను (చైతన్యోద్యమ సిద్ధాంతాలు) ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాయి. (అందుకే కొందరిని చైతన్యవంతులైన నియంతలుగా కొందరు చరిత్రకారులు పరిగణించారు.) 1759-65 మధ్య పోర్చుగల్, ఫ్రాన్స్, స్పెయిన్, నేపల్స్, పార్మా పాలకులు జెస్యూట్‌లను తమ ప్రాంతాల నుండి బహిష్కరించారు. కాథలిక్ చక్రవర్తుల నుండి ఒత్తిడి రావడంతో పోప్ జెస్యూట్‌ల వ్యవస్థను ఐరోపాలో పూర్తిగా రద్దు చేశాడు. ఫ్రాన్స్‌లో టర్గాట్ అనే చైతన్యోద్యమ ఆర్థికవేత్త 1774లో లూయీ 16 కొలువులో మంత్రి అయ్యాడు. అయితే పాలకవర్గాల సంస్కరణలు చివరికి ప్రతి దేశంలోనూ నిలిపివేశారు. చైతన్యవంతులైన పాలకులు కూడా సంస్కరణలను అమలు చేయలేకపోయారు. పాలకవర్గాల ప్రతిఘటనే అందుకు కారణం. పాత భూస్వామ్య వ్యవస్థ అవశేషాల నుండే తమకు సంపద లభిస్తుండడంతో సమాజాన్ని మరింత ఆధునికంగా తీర్చిదిద్దే ఎలాంటి కార్యక్రమాన్నైనా వారు తీవ్రంగా వ్యతిరేకించేవారు.

ఎన్‌సైక్లోపెడియాలో తన ఉద్దేశం గురించి రాస్తూ డిడేరాట్ ఇలా వ్యాఖ్యానించాడు: "నా లక్ష్యం ప్రజల ఆలోచనా విధానాన్ని మార్చడమే". చైతన్యోద్యమ ఆలోచకులు మేధావుల (వీరి పాలకవర్గ మేధావులు కూడా ఉన్నారు) ఆలోచనలను విజయవంతంగా సవాలు చేయగలిగారు. రెండు శతాబ్దాల క్రితం సంభవించిన సంస్కరణోద్యమం కంటే తీవ్ర స్థాయిలో వారు రాజ్య సిద్ధాంతాలను ప్రశ్నించగలిగారు. 1780 దశకం నాటికి వోల్టెయిర్, రూసో రచనలు జనసామాన్యంతో నేరుగా సంభాషించగలిగాయి. ఎన్‌సైక్లోపెడియా నకలు ప్రతులు స్వయంగా డిడేరాట్ ఊహించని విధంగా పెద్ద సంఖ్యలో అమ్ముడు పోయాయి. చైతన్య భావాలు పాత వ్యవస్థను ఆరాధించే బూర్జువా వర్గాల్లో సైతం వ్యాపించాయి. ప్రగతిశీల భావజాలం సామాజిక స్వరూపంలోని అతి సాంప్రదాయవాద, పీడిత వర్గాల్లో సైతం చొచ్చుకుపోయింది. అయినప్పటికీ సమాజాన్ని సంస్కరించే తమ లక్ష్యంలో చైతన్యోద్యమ ఆలోచకులు అంత సమర్ధవంతంగా వ్యవహరించలేకపోయారు. 1778లో చనిపోయిన వాల్టెయిర్ బహూశా నిరాశతోనే కన్నుమూసి ఉంటాడు.

ఆరేళ్ల తర్వాత కాంట్ ఇలా వ్యాఖ్యానించాడు: "అతడు(వాల్టెయిర్) చైతన్యయుగంలో జీవించినా ఆ యుగమే అంత చైతన్యవంతమైనది కాదు."

అభిప్రాయాలను మార్చుకున్నంత సులభంగా సమాజాన్ని మార్చలేరు, ఆ లక్ష్యాన్ని సాధించడానికి మరో విడత విప్లవాలు, అంతర్యుద్ధాల ప్రక్రియ అవసరం.

నాల్గవ అధ్యాయం

# బానిసత్వం - వేతన బానిసత్వం

కొందరు ఆలోచనాపరులకు ఉన్నట్లుండి తట్టిన ఆలోచనల వల్లే చైతన్యోద్యమ సిద్ధాంతాలు రూపుదాల్చలేదు. మానవ సంబంధాల్లో శతాబ్దాల తరబడి వస్తున్న మార్పుల్లో అంతర్భాగంగా అవి పుట్టుకొచ్చాయి. ఈ మార్పులు బ్రిటన్, హాలెండ్‌లలో తారాస్థాయికి చేరుకున్నాయి.

పదహారవ, పదిహేడవ శతాబ్దాల్లో నెలకొన్న అరాచక పరిస్థితుల్లో వచ్చిన ప్రధాన మార్పు మార్కెట్ శక్తుల ఆవిర్భావమే. ప్రజల జీవనోపాధిని మార్కెట్ శాసించడం మొదలుపెట్టింది. దైవధిక్కార నేరం కింద చర్చి ప్రజలను అగ్నికి ఆహుతి చేసినా, హాప్స్‌బర్గ్ సైన్యాలు తమకు వ్యతిరేకంగా ఉన్న పట్టణాలను నేలమట్టం చేసినా పోప్‌లు, చక్రవర్తులు, రాకుమారులు, భూస్వాములందరికీ తమ రోజువారీ కార్యకలాపాల కోసం నగదు అవసరమయ్యేది. దీనర్థం: పాత భూస్వామ్య వ్యవస్థను పరిరక్షించాలని పాలకవర్గాలు ప్రయత్నించినా మార్కెట్ శక్తుల విస్తరణకు అవి చాలా సహాయపడ్డాయి. చివరగా ఆ మార్కెట్ శక్తులే సాంప్రదాయ పాలకవర్గాల ప్రాబల్యానికి గండి కొట్టాయి.

అమెరికాల స్వాధీనం తర్వాత ఈ మార్పు స్పష్టంగా కనబడింది. ప్రతీఘాత సంస్కరణోద్యమానికి మద్దతుగా నిలిచిన సైన్యాలకు ఆర్థిక వనరులను సమకూర్చడానికి అమెరికా దేశాల గనుల నుండి తవ్వి తీసిన వెండి ప్రధాన ఆధారమయ్యింది. అయితే మార్కెట్ సంబంధాల ఖండాంతర వ్యవస్థే ఇలాంటి ఆదాయానికి వారధిగా ఉండేది. పశ్చిమోత్తర ఐరోపాకు చెందిన మధ్యవర్తుల ద్వారా వెండి లభించేది. విలాస వస్తువుల కొనుగోలు కోసం ఆ ధనాన్ని వెచ్చించేవారు. ఫలితంగా ఆ ధనం చైనా, భారతదేశం, ఆగ్నేయ ఆసియా దేశాలకు తరలిపోయేది. మనీలా నుండి అకాపుల్కో, వెరా క్రజ్ నుండి సెవిల్లేవరకు, ఆంస్టర్‌డామ్ నుండి బటావియా వరకు, ఖటాసియా నుండి కాంటన్ వరకు కొత్త సముద్ర మార్గాలు (అంతర్జాతీయ రవాణా మార్గాలు) ఏర్పడ్డాయి. ఈ కొత్త ఓడ రవాణా మార్గాల ప్రపంచ దేశాల ప్రజల మధ్య సంబంధ బాంధవ్యాలను మరింత పెంచాయి.

ప్రజల సామాజిక స్థాయి ఎంత అసమానంగా ఉన్నప్పటికీ ఒక లావాదేవీని పూర్తిగా ఆమోదించే లేదా తిరస్కరించే హక్కు వారికి సమానంగా ఉంటుందన్న సూత్రంపైనే మార్కెట్

సంబంధాలు ఆధారపడి ఉండేవి. కొనుగోలుదారు ఎంత ధరకైనా బేరమాడవచ్చు. అలాగే అతడి ప్రతిపాదనను అమ్మకందారు తిరస్కరించవచ్చు. మంత్రి - వ్యాపారి, బడాభూస్వామి మధ్యతరగతివాడు, భూస్వామి- కౌలుదారు.... ఇలా అందరికీ ఈ విషయంలో సమాన హక్కులు ఉంటాయి. మార్కెట్ విస్తరించే కొద్దీ ప్రాబల్యం, గౌరవభావం ఆధారంగా అంతవరకూ రాజ్యమేలిన సాంప్రదాయ విలువలు నగదు ఆధారిత గణాంకాల నుండి ముట్టడికి గురయ్యాయి.

ఆలోచనా రంగంలో ఈ మార్పు వాస్తవరూపం దాల్చించిందనడానికి చైతన్యోద్యమం ఒక తార్కాణంగా నిలిచిపోయింది. అయితే చైతన్యోద్యమం ఊహించిన ప్రపంచం మాత్రం పరస్పర విరుద్ధంగా ఉండేది. మానవులందరూ సమానంగా జీవించే ప్రపంచాన్ని మేధావులు కోరుకున్నప్పటికీ ( కొందరు మహిళలకు కూడా సమాన హక్కులు కల్పించాలని వాదించారు) పరిస్థితులు పూర్తి భిన్నంగా ఉండేవి. ఒక ఆలోచనా లేదా సిద్ధాంతాన్ని ఆమోదించే లేదా తిరస్కరించే హక్కు అందరికి సమానంగా ఉన్నట్లే తమ ఆధీనంలోని వస్తువులను విక్రయించడానికి లేదా కొనుగోలు చేయడానికి కూడా సమానంగా హక్కు ఉండేది. సమానత కేవలం ఆలోచనలు, వస్తువుల వరకే పరిమితం కాగా ప్రజల సామాజిక స్థాయి ప్రపంచవ్యాప్తంగా అసమానంగానే ఉండిపోయింది.

ఈ సిద్ధాంతాల ప్రచారం, ఉత్పత్తుల లావాదేవీలు 'హేతుబద్ధ' రాజ్యంలోనే ఎలాంటి ఆటంకం లేకుండా జరిగాయి.

చైతన్యోద్యమ విషయానికి వస్తే రెండు ప్రధానలోపాలు అలాగే మిగిలిపోయాయి. అవి 18వ శతాబ్దానికంతటికి వర్తిస్తాయి. ఐరోపా ఖండంలో వెనుకబడిన ప్రాంతాలైన కాసిలీ, సిసిలీ, ఈశాన్య ఐరోపాలోనే కాకుండా వాల్టెయిర్ ఆదర్శ రాజ్యమైన ఇంగ్లాండ్‌లో కూడా ఆ లోపాలు కొనసాగాయి. మొదటిది అమెరికాలలో కొనసాగించిన రైతాంగ బానిసత్వం (వెట్టి చాకిరి), రెండవది ఐరోపా ఖండంలో ఆస్తులు లేని కార్మికుల వేతన బానిసత్వం.

ఐదవ అధ్యాయం

# బానిసత్వం - జాత్యహంకారం

**18వ** శతాబ్దాపు ఐరోపాకు బలవంతపు బానిసత్వం ద్వారా అపారమైన సంపద దక్కింది. విక్రేత, కొనుగోలుదారుకు సమాన హక్కులు గల వ్యవస్థకు బానిసత్వం పూర్తిగా భిన్నమైంది. ఐరోపాలోని కాఫీ సెంటర్లల్లో తాపీగా కూర్చొని మేధావులు సమాన హక్కుల గురించి ఎడతెగని చర్చలు జరిపేవారు. అయితే వారు తాగే కాఫీ మాత్రం బానిస ప్రజలు ఉత్పత్తి చేసినది. నల్లజాతీయులను తుపాకుల నీడలో పశ్చిమ ఆఫ్రికా తీరం నుండి అట్లాంటిక్ సముద్రాన్ని దాటించి వేలం పాటల్లో బానిసలుగా విక్రయించేవారు. ఇక్కడ ముఖ్యమైన విషయమేమిటంటే సుదీర్ఘ సముద్ర ప్రయాణంలో ప్రతి పదిమందికి ఒకరు చొప్పున అనారోగ్యానికి గురై చనిపోయేవారు. అంతటి దుర్భర పరిస్థితుల్లో వారి ప్రయాణం కొనసాగేది. బానిసలుగా అమ్ముడుపోయిన వారితో రోజూ 16 నుండి 18 గంటల పాటు పని చేయించేవారు. వారితో బలవంతంగా పని చేయించడానికి కొరడాలను ఝళిపించేవారు. బానిసలు అలా చనిపోయే వరకు వెట్టి చాకిరి చేసేవారు.

సుమారు 1.2 కోట్ల మంది ప్రజలు ఈ దురవస్థను ఎదుర్కొన్నారు. సముద్రయానంలో సుమారు 15 లక్షల మంది ప్రాణాలు కోల్పోయారు. తోటల్లో కూడా మరణాల సంఖ్య ఎక్కువగా ఉండేది. ప్రాణాలు పోయేలా బానిసతో పని చేయించి మరో బానిసను కొనుగోలు చేయడం ఎంతో లాభదాయకంగా కనిపించడంతో తోట యజమానులు బానిసలపట్ల కఠినంగా వ్యవహరించేవారు. 18వ శతాబ్దాంలో సుమారు 16 లక్షల మంది బానిసలను బ్రిటిష్ కరేబియన్ దీవులకు తరలించారు. అయితే 18వ శతాబ్దం చివరి నాటికి అక్కడి బానిసల సంఖ్య కేవలం ఆరు లక్షలకు పరిమితమైంది. ఉత్తర అమెరికాలో వాతావరణ పరిస్థితులు అనుకూలంగా ఉండడంతో (తోటల పెంపునకు) బానిస జనాభా గణనీయంగా పెరిగింది. వలసలు, జననాలు రెండూ కలిపి బానిస జనాభా 17వ శతాబ్దంలో ఐదు లక్షల నుండి 1860 నాటికి 60 లక్షలకు చేరుకుంది. అయితే స్వేచ్ఛాపౌరుల కంటే బానిసలలో మరణాలు రేటు చాలా ఎక్కువగా ఉండేది. పాట్రిక్ మానింగ్ పేర్కొన్నట్లు "1820 నాటికి సుమారు కోటి మంది ఆఫ్రికన్లు 'కొత్త

ప్రపంచం' వైపు వలసవెళ్లారు. అదే సమయంలో కేవలం 20 లక్షలమంది ఐరోపావాసులు కొత్త ప్రాంతాలకు వలసపోయారు. కొత్త ప్రపంచానికి చెందిన శ్వేత జాతీయుల జనాభా (1.2 కోట్లు) నల్లజాతీయుల జనాభా కంటే ఇంచుమించు రెండింతలు ఎక్కువగా ఉండేది."

అయితే కేవలం 17,18వ శతాబ్దాల్లోనే బానిసత్వాన్ని కనిపెట్టలేదు. మధ్యయుగాల నుండే ఆ వ్యవస్థ కొనసాగుతూ వచ్చింది. ఐరోపాలోని కొన్ని చిన్న ప్రాంతాలు, పశ్చిమాసియా రాష్ట్రాల్లో బానిసత్వం ఉండేది. ఉదాహరణకు మధ్యధరా రాజ్యాలలో ఓడరేవులను నిర్వహించడానికి బానిసలను ఎక్కువగా వినియోగించేవారు. అయితే బానిసత్వం పరిమితంగానే ఉండేది. కౌలుదారీ వ్యవస్థ ద్వారానే ఐరోపా భూస్వామ్య, పాలకవర్గాలు రైతాంగాన్ని, సాధారణ ప్రజలను దోచుకునేది. బానిస వ్యవస్థ నామమాత్రంగా ఉన్నా బానిసలు మాత్రం ఖచ్చితంగా నల్లజాతీయులు కారు. శ్వేత జాతీయులనే ఓడరేవుల్లో, నౌకల్లో బానిసలుగా పని చేయించేవారు. ఆంగ్లంలో 'స్లేవ్' అన్న పదం 'స్లావ్' జాతీయుడనే అర్థం నుండి పుట్టింది. పాట్రిక్ మానింగ్ ప్రకారం 1500లో ఆఫ్రికాన్లు లేదా ఆఫ్రికా కుటుంబ నేపథ్యం ఉన్నవారు ప్రపంచ బానిస జనాభాలో అల్పసంఖ్యాకంగా ఉండేవారు. కాని 1700 నాటికి బానిస జనాభాలో వారే మెజారిటీ వర్గంగా మారారు.

అమెరికాలను స్పెయిన్ స్వాధీనం చేసుకోవడంతో ఈ మార్పు మొదలైంది. తనకు తొలిగా స్వాగతం పలికిన అరావాక్‌లలో కొందరిని కొలంబస్ బానిసలుగా మార్చి సెవిల్లేకు తరలించాడు. కరేబియన్‌లో అమెరికన్ ఇండియన్లను బానిసలుగా వినియోగించడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. అయితే ఆ ప్రయత్నాలు అంత ఫలప్రదం కాలేదు. స్థానికుల పట్ల వలసదారులు కఠినంగా వ్యవహరించడం, అంటువ్యాధులు ప్రబలడం వల్ల వారి సంఖ్య 90 శాతం వరకు తగ్గిపోయింది. ఇండియన్ల జనాభా పడిపోవడంతో స్పెయిన్ ఆక్రమణదారులు తమ పంథాను మార్చుకున్నారు. ప్రత్యక్ష బానిసత్వం కంటే పరోక్ష బానిసత్వం (బలవంతపు శ్రమ), కప్పం వసూలు చేయడమే లాభదాయకమని గ్రహించారు. ఇండియన్ల జనాభా తుడిచిపెట్టుకుపోతే భూములను, తోటలను సాగుచేయడం కష్టమవుతుందని ఆందోళన చెందిన స్పెయిన్ చక్రవర్తి వలసవాద పాలనాధికారుల ప్రతిపాదనలను ఆమోదించాడు. అలాగే ఇండియన్ బానిస వ్యవస్థను విమర్శించిన మతబోధకుల ఫిర్యాదులను కూడా ఆలకించాడు. ఈ మతబోధకుల ప్రధాన లక్ష్యం స్థానిక ఇండియన్లను క్రైస్తవులుగా మార్చడమే.

స్పెయిన్ చక్రవర్తితో పాటు వలసవాదులు కార్మిక శక్తికి వేరే ఆధారాన్ని ఎంచుకున్నారు. పశ్చిమ ఆఫ్రికా తీరప్రాంతాల నుండి బానిసలను కొనుగోలు చేయడం మొదలుపెట్టారు. ఆఫ్రికన్ బానిసలతో కార్టెస్ ఒక తోటను ప్రారంభించాడు. ఇండియన్ బానిస వ్యవస్థను తీవ్రంగా విమర్శించిన లాస్ కాసాస్ అనే మతబోధకుడు కూడా ఆఫ్రికన్ బానిస వ్యవస్థను సమర్థించాడు. (తర్వాతి కాలంలో అలాంటి సలహా ఇచ్చినందుకు కాసాస్ పశ్చాత్తాపడ్డాడు.)

తమ వలసపాలన కేంద్రాల్లో పొగాకు, చెరకు లాంటి వాణిజ్య పంటల సాగును పోర్చుగల్, హాలెండ్, ఇంగ్లాండ్, ఫ్రాన్స్ లాంటి సామ్రాజ్యవాద దేశాలు చేపట్టడంతో బానిసత్వం అనూహ్యంగా విస్తరించింది. ఈ వాణిజ్య పంటల సాగుకు కార్మికులు పెద్ద సంఖ్యలో అవసరమయ్యేవారు. ఐరోపాకు చెందిన వలసదారులు అలాంటి కఠిన శ్రమ చేపట్టడానికి ముందుకు రాలేదు.

తొలి దశలో తోటల యజమానుల ఐరోపాకు చెందిన వేతన కార్మికులను వినియోగించారు. బకాయిపడ్డ సేవకులతో (వీరు వాస్తవంగా అప్పుకు బానిసలే) మూడు, ఐదు లేదా ఏడేళ్ల పాటు ఎలాంటి వేతనాలు లేకుండా పని చేయించడానికి ఒప్పందం కుదుర్చు కునేవారు. ఒప్పంద కాలం ముగిసిన తర్వాత వారిని ఐరోపాలోని తమ స్వస్థలానికి తిరిగి పంపించేవారు. కొందరు 'పిశాచాల' చేత అపహరణకు గురయ్యేవారు. ఇలా మాయమైన వారు అమెరికాలలో కార్మికులుగా, బానిసలుగా ప్రత్యక్షమయ్యేవారు. ఇంగ్లాండ్‌లో ముఠానాయకులను (దళారులు) 'పిశాచాలు'గా పిలిచేవారు. ఐరోపా అంతర్యుద్ధాలు, మత యుద్ధాల్లో బందీలుగా చిక్కిన వారిని కరేబియన్, తదితర ప్రాంతాలకు తరలించేవారు. బార్బడాస్ చెరకు తోటల్లో 1638 నాటికి 2000 మంది వెట్టి కార్మికులు, 200 మంది ఆఫ్రికన్ బానిసలు పని చేసేవారు. ఒక్కో వెట్టి కార్మికుడి ఖర్చు 12 పౌండ్లుగా, బానిస ఖర్చు 25 పౌండ్లుగా ఉండేది. ఈ వెట్టి కార్మికుడు లేదా బానిస నాలుగు నుండి ఐదు సంవత్సరాలకు మించి బ్రతకడు కనుక తక్కువ ఖర్చుకు లభించే వెట్టి కార్మికుడినే యజమానులు ఎక్కువగా పనిలోకి తీసుకొనేవారు.

వ్యాపారులకు, పాలకులకు బానిస వ్యవస్థ ఒక నైతిక అంశంగా ఉండేది కాదు. ఎంతైనా బ్రిటీషు నావికాదళం కూడా వీధుల నుండి అపహరించబడ్డ పేద కార్మికులను పనిలో పెట్టుకునేది. ఓడరేవు నుండి బయల్దేరే సమయంలో వీరు కూడా నల్లజాతి బానిసల వలే దుర్భర పరిస్థితుల్లో జీవితం గడిపేవారు. ప్రయాణం సమయంలో ఈ కార్మికులు బానిసలకు తీసిపోని విధంగా పెద్ద సంఖ్యలో చనిపోయేవారు. నావికాదళ అధికారులపై చేయి చేసుకుంటే లేదా గస్తీలో ఉండి నిద్రపోతే అలాంటి కార్మికులకు మరణ శిక్ష విధించే అధికారాన్ని కెప్టెన్లకు కల్పిస్తూ పార్లమెంటు ఒక చట్టాన్ని ఆమోదించింది.

అయితే ఐరోపా నుండి తరలించబడే వెట్టి కార్మికులు తోటయజమానుల అవసరాలకు ఏమాత్రం సరిపోయేవారు కాదు. పొగాకు, చక్కెరకు మార్కెట్ విస్తరించిన కొద్దీ ఆఫ్రికా బానిసలపై యజమానులు ఎక్కువగా ఆధారపడసాగారు. 1653 నాటికి వెట్టి కార్మికుల కంటే బానిసలే బార్బడాస్‌లో ఎక్కువగా ఉండేవారు. అక్కడ బానిసల సంఖ్య 20,000 వరకు ఉంటే కార్మికులు కేవలం 8,000 మంది మాత్రమే ఉండేవారు. 1700లో ఉత్తర అమెరికాలోని దక్షిణ వలస కేంద్రాల్లో నల్లజాతీయుల సంఖ్య 22,400 ఉండగా 1770 నాటికి వారి సంఖ్య 4,09,500కు చేరుకుంది. తొలుత వెట్టి కార్మికులను, బానిసలను తోట యజమానులు ఒకే రీతిలో చూసేవారు.

వర్జీనియాలో తోటల నుండి పారిపోయిన వారిని వెతికి పట్టుకువచ్చి ఒప్పంద కాలానికి రెండింతలు ఎక్కువగా పని చేయించేవారు. మళ్లీ అదే నేరానికి పాల్పడితే వారి బుగ్గపై ఆర్ అనే అక్షరాన్ని ముద్రించేవారు. బార్బడాస్‌లోనైతే పని పట్ల శ్రద్ధచూపని వారిని యజమానులు చంపివేసిన సందర్భాలు ఉన్నాయి. కార్మికులు (సేవకులు,) బానిసలు కలిసికట్టుగా పని చేసేవారు. అందులో కనీసం ఒక జాత్యంతర వివాహం జరిగిన ఉదంతం కూడా ఉంది. (ఇలాంటి జాత్యంతర వివాహం గురించి తదుపరి 300 సంవత్సరాల వరకు ఎవరూ ఊహించను కూడా లేదు.)

ఉమ్మడిగా పని చేసి, సామాజికంగా కలిసిపోయిన సేవకులు, బానిసలు ఉమ్మడిగా పోరాడే అవకాశం కూడా ఉండేది. తోటల నుండి తప్పించుకోవడానికి ఇరువురు పరస్పరం సహకరించుకున్న ఉదంతాలు యజమానులకు ఆందోళన కలిగించాయి. 1676లో వర్జీనియాలో 'బేకాన్' తిరుగుబాటు సంభవించడం అందుకో నిదర్శనం. వర్జీనియా గవర్నర్‌కు విరోధులైన కొందరు ధనిక రైతులు సేవకులు, బానిసల సహాయంతో ఆ వలస కేంద్రాన్ని స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించారు. అందుకు బదులుగా వారికి స్వేచ్ఛను ప్రసాదిస్తామని హామీ ఇచ్చారు. తిరుగుబాటుదారుల లక్ష్యాలు పరస్పర విరుద్ధంగా ఉండేవి. వారి ఉద్దేశ్యాల్లో ప్రధానమైనది యుద్ధం ద్వారా ఇండియన్ల నుండి మరింత భూమిని స్వాధీనం చేసుకోవడమే. అయితే వారి చర్యలు భూస్వాములకు వ్యతిరేకంగా పేద శ్వేతజాతీయులు, నల్లజాతీయులు ఎలా ఉమ్మడిగా పోరాడగలరో నిరూపించాయి. తిరుగుబాటుకు ప్రతిస్పందనగా వలసవాద భూస్వాములు ఈ రెండు వర్గాల మధ్య చిచ్చును రేపడానికి అనేక చర్యలు తీసుకున్నారు.

వలసవాద బానిసవ్యవస్థ చరిత్రను రచించిన రాబిన్ బ్లాక్‌బర్న్ ప్రకారం వర్జీనియా శాసనమండలి ఇంగ్లాండ్ సేవకులు, ఆఫ్రికా బానిసల మధ్య జాతివైషమ్యాలను రెచ్చగొట్టడానికి ప్రయత్నించింది.

ఒక నల్లజాతీయుడు లేదా బానిస క్రైస్తవునిపై (శ్వేతజాతీయుడిపై) చేయి చేసుకుంటే అతడికి 30 కొరడా దెబ్బల శిక్షను విధించాలని సూచిస్తూ ఒక చట్టాన్ని 1680లో ఆమోదించారు. 1691లో వెలువడిన మరో చట్టం ప్రకారం తన యజమాని లేదా యజమానురాలి సేవ నుండి ఉద్దేశ్యపూర్వకంగా గైర్హాజరయ్యే బానిసలు, నల్లజాతీయులను చంపివేయవచ్చు. ఒక శ్వేతజాతి మహిళ కాని పురుషుడుకాని నల్లజాతీయులు లేదా ఇండియన్లను వివాహమాడితే అలాంటి వారిని వలసవాద కేంద్రం నుండి బహిష్కరిస్తూ వర్జీనియా శాసనమండలి మరో చట్టాన్ని రూపొందించింది. ఇలాంటి చర్యలను మరో రూపంలో అర్థం చేసుకోవచ్చు. నల్ల, శ్వేతజాతీయులు ఒకరినొకరు ద్వేషించడం పోయి ఇరువర్గాలు తమ సంబంధాలను మరింత సన్నిహితంగా మలచుకొనే అవకాశం ఉందని తోట యజమానులు గ్రహించారు. వలస పాలకులు ఇలాంటి పరిస్థితిని నివారించడానికి తమకు మరణశిక్ష విధించే అధికారం ఇవ్వాల్సి ఉంటుందని నొక్కి చెప్పారు. అప్పటి నుండే జాత్యహంకారం ఒక సిద్ధాంతంగా రూపుదాల్చడం మొదలుపెట్టింది.

జాత్యహంకారం నేటికీ కొనసాగుతుండడం బట్టి ప్రజలకు ఇలాంటి భావన ఎప్పటి నుండో ఉందని, ఒక జాతి ప్రజలు మరో జాతి ప్రజలపట్ల ద్వేషం కలిగి ఉండేవారని ఊహిస్తారు. కనుక జాత్యహంకారం నుండి బానిసత్వం పుట్టుకొచ్చిందని భావిస్తారు. అయితే వాస్తవం అందుకు విరుద్ధంగా ఉంది.

అయితే ప్రాచీన, మధ్య యుగాల్లో ప్రజలు శరీర ఛాయకు పెద్దగా ప్రాధాన్యత ఇచ్చేవారు కాదు. పొడవు జుత్తు రంగు లేదా కనుల రంగు వేర్వేరుగా ఉన్నట్లే శరీర ఛాయ కూడా ఆయా ప్రజల్లో వేరుగా ఉంటుందని భావించేవారు. ఈజిప్టులోని స్థూప చిత్రాల్లో తెలికపాటి, చామనఛాయ, నల్లరంగుతో ఉన్న వ్యక్తులు కనిపిస్తారు. రోమను చరిత్రలో ముఖ్యమైన వ్యక్తులు ఉత్తర ఆఫ్రికా నుండి వచ్చినవారే. వారిలో ఒక చక్రవర్తి కూడా ఉన్నాడు. సమకాలీన గ్రంథాలేవీ చక్రవర్తి శరీర ఛాయ గురించి ప్రస్తావించలేదు.

పదహారవ శతాబ్దపు డచ్ చిత్రాల్లో నల్ల, శ్వేతజాతీయులు చాలా సన్నిహితంగా మెలుగుతున్నట్లు కనిపిస్తారు. ఉదాహరణకు, జార్డెయిన్ కళాఖండం "మోసెస్–జిప్పోరాహ్"లో మోసెస్ భార్యను నల్లజాతీయురాలిగా చూపారు.

మధ్యయుగాల ఐరోపాలో యూదుల పట్ల విద్వేషం చాలా ఎక్కువగా ఉండేది. అయితే ఇది మత విద్వేషం మాత్రమే. ఎందుకంటే క్రైస్తవ సమాజంలో యూదులొక్కరే కాథలిక్‌యేతర వర్గంగా ఉండేవారు. వారి పట్ల విద్వేషానికి భౌతిక లేక మానసిక లక్షణాలు ఒక కారణంగా ఉండేవి. కావు. యూదులు తమ మత విశ్వాసాలను త్యజించినట్లయితే దౌర్జన్యకారులు వారిని క్షమించి వదిలేసేవారు. ఇక్కడ తర్కంలేని మత విద్వేషమే ఉండేది కాని జన్మకు సంబంధించిన జాత్యహంకారం లేదు. బానిసల వ్యాపారంతోనే జాత్యహంకారం పుట్టుకొచ్చింది.

తొలి బానిసల వ్యాపారులు, బానిసల యజమానులు జాతిభేదాలు ఆధారంగా తమ కార్యకలాపాలను సమర్థించుకోలేదు. అందుకు బదులు ప్రాచీన గ్రీకు, రోమను గ్రంథాలను ప్రామాణికంగా తీసుకునేవారు. ఆ ప్రాచీన గ్రంథాలు యుద్ధంలో (న్యాయబద్ధమైన) బందీలుగా చిక్కినవారిని బానిసలుగా మార్చడాన్ని సమర్థించాయి. చట్టబద్ధంగా బానిసలను కొనుగోలు చేసిన యజమానులు వారిని తమ స్వంత ఆస్తిగా పరిగణించవచ్చు. అలాగే తమకు ఇష్టమైన రీతిలో వారిని విక్రయించనూ వచ్చు. వాల్టెయిర్ ఎంతో అభిమానించిన ఇంగ్లాండ్ తత్త్వవేత్త లాకే 1690లో బానిసత్వాన్ని సమర్థించగలిగాడు. అదే సమయంలో ఆఫ్రికన్లు జన్మతః ఐరోపావాసులకు భిన్నమైన వారన్న వాదనను తిరస్కరించాడు. విశేషమేమిటంటే రాయల్ ఆఫ్రికా కంపెనీలో వాటాలు ఉండడం కారణంగా బానిసల వ్యాపారం నుండి లాకే ప్రయోజనం పొందేవాడు.

అయితే 18వ శతాబ్దం మధ్యదశకాల నాటికి పాత వాదనలకు కాలం చెల్లింది. అప్పటికే అట్లాంటిక్ మార్గాన బానిసల వ్యాపారం తారాస్థాయికి చేరుకుంది. బానిసలందరూ న్యాయబద్ధమైన యుద్ధాల్లో బందీలుగా చిక్కిన వారేనని సమర్థించుకోవడం కష్టంగా మారింది.

ఆఫ్రికా నుండి కొనుగోలు చేసిన ప్రజలే బానిసలన్న విషయం ప్రజలకు అవగతమైంది. ఒక్కసారి బానిసగా ముద్రవేసుకున్న వారి సంతానాన్ని కూడా బానిసలుగానే గుర్తించే వారు. శ్వేత జాతీయుల్లో మెజారిటీ ప్రజలు బానిసలను కలిగి ఉండేవారు కాదు. కనుక వారిని ఒప్పించేందుకు బానిసల యజమానులు, వ్యాపారులు కొత్త కొత్త సిద్ధాంతాలతో ముందుకు వచ్చేవారు. వలస వాద కేంద్రాల్లో సన్నకారు రైతులు బానిస వ్యవస్థను తీవ్రంగా నిరసించేవారు. తోటల యజమానులు సారవంతమైన నేలలన్నింటినీ ఆక్రమించుకొని బానిసలతో వ్యవసాయం చేయించడం ద్వారా తమకు తీరని నష్టాన్ని కల్గిస్తున్నారని స్థానిక రైతులు ఫిర్యాదు చేసేవారు. లండన్ లాంటి ఓడరేవుల్లో తప్పించుకుని పారిపోయిన బానిసలు చాలా వరకు వెనుకబడిన మురికివాడల్లో ఆశ్రయం పొందేవారు. వ్యాపారులు, యజమానులు బానిసల పట్ల ప్రజల్లో విద్వేషాన్ని, అపనమ్మకాన్ని, భయాన్ని కలిగించేందుకు కొత్త కొత్త మార్గాలను అన్వేషించే వారు."యుద్ధఖైదీలు" అన్న సిద్ధాంతం అప్పటికే చేవ కోల్పోయింది. అందుకు భిన్నంగా ఆఫ్రికా సంతతికి చెందిన వారు జన్యుపరంగా ఐరోపా సంతతికి చెందిన వారికి లోకువేనన్న సిద్ధాంతం వ్యాపారులు, యజమానుల అవసరాలకు ఖచ్చితంగా సరిపోయింది.

బానిసత్వాన్ని సమర్థించిన క్రైస్తవులు బైబిల్ ప్రస్తావనలను సాకుగా చూపి అన్యాయమైన ఆ వ్యవస్థను వెనుకేసుకువచ్చేవారు. నల్లజాతీయుల నోవా కుమారుల్లో ఒకడైన హామ్ వారసులని వాదించేవారు. అయితే బానిసత్వానికి మద్దతుగా శాస్త్రీయమైన కారణాలను ముందుంచడానికి కూడా ప్రయత్నాలు జరిగాయి. ఉదాహరణకు 1774లో ప్రచురితమైన ఎడ్వార్డ్ లాంగ్ చారిత్రక గ్రంథం "జమైకా చరిత్ర" ఆఫ్రికన్ల మానవతా రాహిత్యాన్ని, పాశవిక గుణాన్ని ఎత్తిచూపింది. ఇలాంటి వాదనల వల్ల కొందరు చైతన్యోద్యమ కార్యకర్తలు (మేధావులు) సైతం బానిసత్వాన్ని సమర్థించడం మొదలుపెట్టారు. "మానవులందరూ సమానంగా సృష్టించబడ్డారు" అని ఎలుగెత్తి చాటుతూనే శ్వేతజాతీయులు కాని వారు మానవులే కారు అని వాదించారు.

జాత్యహంకారం పూర్తిస్థాయి సిద్ధాంతంగా ఆవిర్భవించలేదు. ఒక సిద్ధాంతంగా అది రూపుదాల్చడానికి మూడు శతాబ్దాలు పట్టింది. అందుకే ఉత్తర అమెరికాలో స్థానికుల పట్ల ఐరోపావాసులు తొలుత భిన్నమైన వైఖరిని అవలంబించారు. జీవన స్థితిగతులు వేరుగా ఉండడంవల్లే వారు అలా ప్రవర్తించి ఉంటారు. జేమ్స్‌టౌన్ (వర్జీనియా) గవర్నర్లు ఎదుర్కొన్న సమస్య ఒక్కటే : స్థానిక సంస్కృతి పట్ల శ్వేతజాతీయులు (ఐరోపావాసులు) ఆకర్షితులు కావడం. సమస్య ఎంత తీవ్రంగా ఉండేదంటే కొందరు వలసదారులు ఇండియన్ మహిళలతో పారిపోయి పెళ్లి చేసుకునేవారు. ఈ పరిస్థితిని నివారించడానికి మరణశిక్షను ప్రతిపాదించారు. ఇండియన్ల పెళ్లి చేసుకునే ఐరోపావాసులకు, అలాగే శ్వేతజాతి మహిళలను పెళ్లి చేసుకునే ఇండియన్లకు మరణశిక్ష విధిస్తూ చట్టాన్ని రూపొందించారు. ఇండియన్ జీవనశైలిని వేలాది మంది ఐరోపావాసులు కోరుకునే వారు. వారి భావనలను రూసో రచనలు ప్రతిబింబించేవి. 'ప్రకృతి వ్యవస్థ' అలా ప్రాధాన్యతను సంతరించుకుంది. 18వ శతాబ్దం మధ్యభాగంలో కూడా

'ఎర్ర మనుషులు' అన్న పదం సృష్టించిన ప్రకంపనలు మాయమయ్యాయి. శరీర ఛాయకు ప్రత్యేకత ఏమీ లేదని పరిగణించడం మొదలుపెట్టారు. భూమిపై ఆధిపత్యం కోసం, సాగు కోసం స్థానికులతో వలసదారులు ఘర్షణ పడేకొద్దీ (18వ శతాబ్ది చివరలో) ఐరోపావాసులు తమ వైఖరిని మార్చుకున్నారు. ఇండియన్లను రక్తపిపాసులుగా చిత్రీకరించడం మొదలుపెట్టారు. మతిలేని విగ్రహారాధకులని, ఛాందసవాదులని, రాగి రంగులో ఉన్న పురుషులని, చివరికి ఎర్రతోళ్లు అని వారిని నిందించేవారు. ఆఫ్రికన్ బానిసత్వానికి సాకుగా ప్రారంభమైన జాత్యహంకారం పూర్తిస్థాయి నమ్మకాల పుట్టగా అభివృద్ధి చెందింది. ఆ మత సిద్ధాంతం ప్రకారం ప్రపంచ ప్రజలను 'శ్వేతజాతీయులు', 'నల్లజాతీయులు', 'ఎర్రమనుషులు', 'పసుపురంగు మనుషులు', 'తేలికపాటి రంగు మనుషులు'గా వర్గీకరించారు. అయితే చాలా మంది ఐరోపా వాసులు నీలి - ఎరుపు రంగును కలిగి ఉండేవారు. చాలా మంది ఆఫ్రికన్లు గోధుమరంగులో ఉండేవారు, దక్షిణాసియా ప్రజలు ఐరోపావాసులతో సమానంగా శరీర ఛాయను కలిగి ఉండేవారు. స్థానిక అమెరికన్లందరూ ఎర్రగా ఉండేవారుకాదు. చైనా, జపాన్ ప్రజలఛాయ పసుపు ఎంత మాత్రం కాదు.

జాత్యహంకార సిద్ధాంతాన్ని అభివృద్ధి పరచడంలోనూ, పశ్చిమ దేశాల ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడంలోనూ బానిసత్వం నిర్వహించిన పాత్ర గురించి సుమారు 60 ఏళ్ల కిందటే మార్క్సిస్టు సిద్ధాంతకర్త సి.ఎల్.ఆర్. జేమ్స్, క్యారబియన్ జాతీయవాది ఎరిక్ విలియమ్స్ ఎంతో విపులంగా వివరించారు. తమ వివరణలో వారు 'కొత్త ప్రపంచం'లో రైతాంగ బానిసత్వానికి, పాత ప్రపంచంలోని వేతన బానిసత్వానికి మధ్య ఉన్న సంబంధం గురించి మార్క్స్ చేసిన వాదనను మరింత విశదీకరించారు.

అయితే వారి వాదనపై అప్పటి నుండి విమర్శలు కొనసాగుతూనే ఉన్నాయి. విమర్శకులు అభిప్రాయం ప్రకారం బానిసత్వం నుండి సమకూరిన లాభాలు పారిశ్రామిక రంగంలో పెట్టుబడులుగా ఎన్నడూ ఉపయోగపడలేదు. అందుకు భిన్నంగా తోటల యజమానులు, వ్యాపారులు పాత పాలకవర్గాల తరహాలో విలాసాలు, భోగభాగ్యాలపై ఆ ధనాన్ని వెచ్చించారు. పెద్ద భవంతుల నిర్మాణంపైనే లాభాలను ఎక్కువగా వ్యయం చేశారు. ఒక వేళ పశ్చిమోత్తర ఐరోపా ఆర్థిక వ్యవస్థలు లాభాలు గడించి ఉన్నా అవన్నీ బానిస - ఆధారిత వలసవాద కేంద్రాల వాణిజ్యంపై నియంత్రణ కోసం జరిగిన యుద్ధాల్లో కరిగిపోయి ఉంటాయి. 1960 దశకంలో వెలువడిన ఒక ఆర్థిక చరిత్ర గ్రంథం ఇలా విశ్లేషించింది :

> "పారిశ్రామిక పెట్టుబడుల నిమిత్తం పొదుపు చేసే మొత్తాలకు విదేశీ వాణిజ్య లాభాలు గణనీయమైన తోడ్పాటేమీ అందించలేదు. స్థూలంగా చెప్పాలంటే వాణిజ్యానికి, పెట్టుబడుల ప్రవహానికి సంబంధించి బానిస వ్యవస్థ సమకూర్చిన

లాభాలను అంచనా వేయడానికి జరిగిన ప్రయత్నాలు నిర్దిష్టమైన ఫలితాలనివ్వలేదు."

అయితే పశ్చిమ ఐరోపా ఆర్థిక జీవనంపై బానిస-ఆధారిత ఉత్పత్తి చూపిన ప్రభావాన్ని పై వాదన క్లిష్టంగా మార్చివేస్తుంది. 18వ శతాబ్దంలో బ్రిటన్‌లో బానిస-ఆధారిత ఉత్పత్తి చూపిన ప్రభావాలు చాలానే ఉన్నా అవన్నీ చరిత్రలో మరుగునపడిపోయాయి.

'త్రిభుజాకార వాణిజ్యం' అని పిలవబడ్డ బానిస-ఆధారిత వాణిజ్యం బ్రిటన్‌కు అనేక విధాలుగా లాభాలను సమకూర్చిపెట్టింది. ఇంగ్లాండ్‌లో గణనీయంగా విస్తరించిన హస్తకళాకృతుల పరిశ్రమకు ఈ వాణిజ్యం మార్కెట్లను సృష్టించింది. కొత్త మార్కెట్లు కూడా విస్తరించాయి. అదే సమయంలో పరిశ్రమలు మూతపడ్డాయి. ఇనుము పరికరాలు, తుపాకులు, ఫిరంగులు, జౌళి ఉత్పత్తుల అమ్మకం ద్వారా ఐరోపా దేశాలు ఆఫ్రికా తీరప్రాంతాల్లోని వ్యాపారుల నుండి బానిసలను కొనుగోలు చేసేవి. ఆఫ్రికా తీరం నుండి లాటిన్ అమెరికా, కారేబియన్‌లకు బానిసలను దుర్భరమైన పరిస్థితుల్లో రవాణా చేసేవారు. రవాణా సమయంలో సుమారు 10 శాతం మంది బానిసలు మరణించడం ఐరోపా వ్యాపారులకు ఎంతో లాభదాయకంగా ఉండేది. ఫలితంగా ఓడలలో పశువుల కంటే హీనంగా బానిసలను కుక్కి సరఫరా చేసేవారు. అలా తీసుకెళ్లిన బానిసలను అమెరికాలో విక్రయించేవారు. తద్వారా సమకూరే డబ్బుతో చక్కెర, పొగాకు, ముడి పత్తిని కొనుగోలు చేసి ఐరోపాలో మరలా అమ్మేవారు.

చెరుకు తోటలకు అత్యాధునికమైన పరికరాలు అవసరమయ్యేవి. ముఖ్యంగా చెరుకునుదంచడానికి, చెరుకు రసాన్ని శుద్ధి చేయడానికి అవసరమైన యంత్రాలను ఐరోపా ఉత్పత్తిదారుల నుండి సమకూర్చుకునేవారు. వాణిజ్యంవల్ల ఓడ రవాణా, ఓడ నిర్మాణ పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. వాటిలో ఉద్యోగాల సంఖ్య కూడా పెరిగింది. లివర్‌పూల్, బ్రిస్టల్, గ్లాస్‌గో లాంటి వాణిజ్య ఓడరేవుల ద్వారా సమకూరిన లాభాలను పారిశ్రామిక ప్రక్రియలలో పెట్టుబడిగా పెట్టారు. అలాగే రవాణా (జల) మార్గాలను అభివృద్ధి పరిచారు. కాలువలు, అంతర్గత రహదారుల నిర్మాణంతో బ్రిటన్ జాతీయ మార్కెట్ విస్తరించింది.

బానిస వ్యవస్థ క్యాపిటలిస్టు వ్యవస్థ పెరుగుదలకు పునాదులు వేయలేదు. అందుకు భిన్నంగా క్యాపిటలిస్టు వ్యవస్థే బానిసత్వాన్ని సృష్టించింది. 17వ శతాబ్ది చివరి నాటికే ఇంగ్లాండ్ వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు క్రియాశీలంగా వ్యవహరించడం మొదలు పెట్టాయి. ఆ సమయంలో ఉత్తర అమెరికా, వెస్ట్ ఇండీస్ తోట యజమానులు ఇంకా పిండ దశలోనే ఉన్నారు.

ఇలాంటి క్రియాశీలత వల్లే బానిసల వ్యాపారం విస్తృతమైంది. ప్రగతి పథంలో ఉన్న ఇంగ్లాండ్ ఆర్థిక వ్యవస్థ పొగాకు, చక్కెర వినియోగాన్ని ఉన్నత వర్గాల నుండి పట్టణ, గ్రామీణ వర్గాల కూడా విస్తరింపచేయడంవల్లే వలసవాద కేంద్రాల ఉత్పత్తులకు డిమాండ్

ఉండేది. వలసవాద కేంద్రాల దోపిడీ, స్థానికులను బానిసలుగా మార్చివేయడం ఒక్కటే ఆర్థిక ప్రగతికి ఊతమివ్వలేదు. స్పెయిన్, పోర్చుగల్ ఆర్థిక వ్యవస్థలు వలసవాద సామ్రాజ్యాలున్నప్పటికీ స్తంభించిపోయాయి. దేశంలో స్వేచ్ఛా శ్రమశక్తి లభించడంలో అమెరికాలతో బానిస శ్రమను కొత్త పద్ధతిలో దోపిడీ చేయడానికి ఆస్కారమేర్పడి బ్రిటిషు ఆర్థిక వ్యవస్థ విస్తరించింది.

అలాగే వేతన కార్మికుల ఆధారంగా స్థానిక ఆర్థిక వ్యవస్థ క్రియాశీలంగా మారడంతో బ్రిటీషు (కొద్ది వరకు ఫ్రెంచి) వ్యాపారులు ఆఫ్రికా నుండి బానిసలను సమకూర్చుకోగలిగారు. ఆఫ్రికా తీర రాజ్యాలకు చెందిన పాలకవర్గాల నుండే బానిసలను ఎక్కువగా కొనుగోలు చేశారు. ఎందుకంటే బానిసల వ్యాపారులకు ఆఫ్రికా భౌగోళిక పరిస్థితుల గురించి నామమాత్రపు పరిజ్ఞానం కూడా ఉండేది కాదు. ప్రధాన భూభాగంలో ప్రజలను లక్షల సంఖ్యలో అపహరించి వారిని వేలాది మైళ్ల దూరంలో సముద్ర మార్గాన తరలించడమూ అంత సులభంకాదు. ఆ పని చేయడానికి వారు ఆఫ్రికా వ్యాపారులు, పాలకులను వినియోగించుకున్నారు. అందుకు బదులుగా ఉన్నతమైన నాణ్యత కలిగిన సరుకులను అందించేవారు. జాత్యాహంకార సిద్ధాంతం చిత్రీకరించినట్లు ఆఫ్రికా అనాగరికులంతా అమాయకులేమీ కాదు. ఎంతో ప్రగతి సాధించిన, విద్యావంతమైన సమాజాల్లో వారు నివసించారు. వారి స్థాయి మధ్యయుగాల (చివరి దశ) ఐరోపా సమాజాలతో సమానంగా ఉండేది. క్యాపిటలిజం తొలి అడుగులువేయడంవల్లే బ్రిటన్ ఆర్థిక వ్యవస్థ ఆ స్థాయిని అధిగమించగలిగింది. ఫలితంగా 18వ శతాబ్దంలో వాణిజ్యం విశాల స్వరూపాన్ని సంతరించుకుంది. అయితే (16వ శతాబ్దంలో) లియో ఆఫ్రికానస్ కాలంలో ఇలాంటి ప్రక్రియ సంభవించలేదు. అప్పుడు ఆర్థిక ప్రగతి విషయంలో ఆఫ్రికా, పశ్చిమ ఐరోపా రాజ్యాలు ఇంచుమించు సమాన స్థాయిలో ఉండేవి.

క్యాపిటలిస్టు విస్తరణ పథంలో ఇంగ్లాండ్, హాలెండ్ పయనించడం వల్లే తోట బానిసత్వం ఉద్భవించింది. అయితే అదే బానిసత్వ వ్యవస్థ క్యాపిటలిజానికి వెన్నుదన్నుగా నిలిచి ఒక చోదక శక్తిగా మారింది. ఆ విధంగా బానిస వ్యవస్థ ప్రపంచ వ్యవస్థను మార్చడంలో కీలక పాత్రను పోషించింది. ఆ వ్యవస్థలో క్యాపిటలిజం పరిణతి చెందింది. ఆ కొత్త ప్రపంచ వ్యవస్థ స్కాట్లాండ్‌ను స్వాధీనం చేసుకోవడానికి ఇంగ్లాండ్‌కు చేయూతనిచ్చింది. (ఇంగ్లాండ్ దండయాత్రకు ముందు పనామాలో వలసవాద కేంద్రాన్ని స్థాపించాలన్న స్కాటిష్ పాలకవర్గ ప్రయత్నం విఫలమైంది. దానిని డేరియన్ ప్రణాళిక అంటారు.) అలాగే 18వ శతాబ్దం ద్వితీయార్థంలో ఈస్ట్ ఇండియా కంపెనీ ద్వారా బెంగాల్‌ను స్వాధీనం చేసుకున్న తర్వాత తూర్పున కొత్త సామ్రాజ్యాన్ని స్థాపించడంలోనూ ఇంగ్లాండ్‌కు సహాయపడింది.

ఒక వైపు బ్రిటన్ పాలకవర్గం విస్తరించగా మరోవైపు ఆఫ్రికా చాలా వరకు దోపిడీకి గురైంది. తీరప్రాంత వ్యాపారులు, పాలకులకు బానిసల వ్యాపారం అత్యాధునిక వినియోగ వస్తువులను, ఆయుధాలను సమకూర్చిపెట్టింది. ఈ కారణంగా స్వంత పరిశ్రమలను అభివృద్ధి పరచాల్సిన అవసరం వారికి తప్పింది. ఒక్క విషయం స్పష్టం: దిగుమతులు ఆఫ్రికా పరిశ్రమను

నిలువునా ముంచేశాయి. ఇతరులపై యుద్ధం చేసి అక్కడి ప్రజలను బానిసలుగా మార్చే సత్తా ఉన్న రాజ్యమే విజయవంతమైన రాజ్యంగా పరిగణించబడేది. శాంతిని కోరుకున్న పాలకవర్గాలు సైతం తమ మనుగడకు సైనికీకరణపై ఆధారపడ్డాయి. జొలాఫ్, బెనిన్, కాంగో లాంటి రాజ్యాలు ఎప్పుడైతే తమ వ్యాపారులు బానిసలను సరఫరా చేయకుండా అడ్డుకోవడానికి ప్రయత్నించాయో అప్పుడు బానిసల వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్న రాజ్యాల పాలకవర్గాల ధన, అధికార బలం పెరగడాన్ని గమనించాయి. మరోవైపు వర్గరహిత సమాజాలు విధ్వంసాన్ని చవిచూసే స్థాయికి దిగజారాయి. అలాంటి పరిస్థితిని నివారించడానికి కొత్త సైనిక పాలక వర్గాల ఆవిర్భావం తప్పనిసరి అయింది. తీరప్రాంత వాసులు ప్రధాన భూభాగంలో నివసించే ప్రజలను దోచుకుంటూ సంపదను కూడగట్టుకున్నారు.

ఈ పరిస్థితులలో ఆవిర్భవించిన 'కేంద్రీకృత' ఆఫ్రికా రాజ్యాలు ప్రగతికి నిదర్శనాలని కొందరు చరిత్రకారులు వాదించారు. అయితే కేంద్రీకృత రాజ్యాల ఆవిర్భావంతో సమాంతరంగా సమాజ భౌతిక పునాదులు బలహీనమయ్యాయి. ఐరోపా, ఉత్తర అమెరికాలలో జనాభా పెరగ్గా అదే సమయంలో ఆఫ్రికా జనాభా పెరుగుదల స్తంభించిపోయింది. 1750-1850 మధ్య పశ్చిమాఫ్రికాలో జనాభా క్షీణించిపోయింది. ఫలితంగా ఆఫ్రికా రాజ్యాలు 19వ శతాబ్ది చివరిలో ఐరోపా వలసవాద ఆక్రమణను అడ్డుకోలేకపోయాయి. ఆర్థికపరంగా పశ్చిమ ఐరోపా ముందుడుగు వేయగా ఆఫ్రికా మాత్రం అక్కడే నిలిచిపోయింది.

ఆరవ అధ్యాయం

# 'స్వేచ్ఛా శ్రమ' ఆర్థిక సూత్రాలు

**1771లో** మాజీ క్షురకుడైన రిచర్డ్ ఆర్క్‌రైట్ డెర్బిషైర్‌లోని క్రాంఫర్డ్ వద్ద ప్రపంచంలోనే తొలిసారిగా నీటిశక్తిపై నడిచే స్పిన్నింగ్ మిల్లును ప్రారంభించాడు. అతడు 600 మందిని పనిలో పెట్టుకున్నాడు. అందులో బాలబాలికల సంఖ్య చాలా ఎక్కువ. రాట్నం తిప్పేవారి కంటే వీరు పదింతలు ఎక్కువగా పని చేసేవారు. 1775లో స్కాట్లాండ్‌కు చెందిన గణిత పరికరాల ఉత్పత్తిదారుడు జేమ్స్ వాట్ బర్మింగామ్ ఇంజినీరు మాథ్యూ బౌల్టన్‌తో కలిసి ఆవిరి యంత్రాల ఉత్పత్తిని ప్రారంభించాడు. ఈ యంత్రాలు పారిశ్రామిక, రవాణా రంగాల్లో పని వేగాన్ని గతంలో ఎన్నడూ లేని విధంగా పెంచాయి. 1783-84లో హెన్రీ కార్ట్ ఇనుము తయారీకి కొత్తయంత్రాలు, కొత్త పద్ధతులను రూపొందించాడు.

ఈ ఆవిష్కరణలను ఇతర కొత్త పద్ధతులతో మేళవించి ఉత్పత్తికి కొత్త మార్గాన్ని సృష్టించడానికి రంగం సిద్ధమైంది. ఈ ప్రక్రియకు ఆవిరి యంత్రాలు ఆధారమయ్యాయి. ఆవిరి యంత్రాలతో నడిచే కర్మాగారాలకు వందలు లేదా వేల సంఖ్యలో కార్మికులకు ఉపాధి కల్పించే సామర్థ్యం ఉండేది. 18వ శతాబ్ది చివరి నాటికి ఒక్క మాంచెస్టర్‌లోనే అలాంటి పరిశ్రమలు 50కి పైగా ఉండేవి. ఐరోపాలోని ఇతర ప్రాంతాలు, అట్లాంటిక్ అవతలి తీరంపై ఉన్న పారిశ్రామికవేత్తలు ఈ కొత్త పద్ధతులను అనుసరించడానికి ఎంతో కాలం పట్టలేదు. పట్టణ చేతివృత్తిదారులు, గ్రామీణ పారిశ్రామిక వ్యవస్థలతో తలతూగిన ప్రపంచం, పారిశ్రామిక కేంద్రాల (నగరాల)కు జన్మనిచ్చే దిశగా కదిలింది.

ఈ మార్పులు కార్యరూపం దాలుస్తుండగానే ఒక స్కాటిష్ ప్రొఫెసర్ కొత్త ఆర్థిక వ్యవస్థకు మౌలిక సూత్రాలను ప్రతిపాదించాడు. నేడు ఆడమ్ స్మిత్ రచించిన 'దేశాల సంపద'ను సాంప్రదాయవాదానికి ప్రామాణిక గ్రంథంగా పరిగణిస్తారు. అయితే ఆ గ్రంథం తొలిసారిగా ప్రచురితమైనపుడు ఇంగ్లాండ్‌లో కొనసాగుతున్న వ్యవస్థను తీవ్రంగా సవాలు చేసింది. ఇంగ్లాండ్ వ్యవస్థను తమ దేశాలలో కూడా నెలకొల్పడానికి అప్పటికీ కొందరు పాలకులు, మేధావులు తహతహలాడేవారు.

స్కాట్లాండ్ చైతన్యోద్యమంలో ఆడమ్ స్మిత్ భాగస్వామిగా ఉండేవాడు. ఆ ఉద్యమంలో ఆడమ్ ఫెర్గూసన్, డేవిడ్ హ్యూమ్ లాంటి మేధావులు, సిద్ధాంతకర్తలు కూడా క్రియాశీలంగా వ్యవహరించేవారు. స్కాటిష్ హైలాండ్స్‌ను వినియోగించి ఇంగ్లాండ్‌లో నిరంకుశ రాచరిక వ్యవస్థను నెలకొల్పడానికి స్టువార్ట్‌లు చేసిన ప్రయత్నాలు వారిని భయోత్పానికి గురి చేశాయి. స్వార్థ ప్రయోజనాల ఆధారంగా పాత భూస్వామ్య వ్యవస్థను మళ్లీ పునరుద్ధించాలన్న స్టువార్ట్‌ల సంకల్పం మేధావులను ఆందోళనకు గురి చేసింది. దానితో వారు ఐరోపా చైతన్యోద్యమంతో సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకున్నారు. ఆ కాలపు ఇంగ్లాండ్ మేధావుల కంటే ఎంతో నిబద్ధతతో వ్యవహరించారు. ఎన్‌సైక్లోపీడెను స్మిత్ అభిమానించేవాడు. వాల్టెయిర్, హోల్బాచ్, హెల్వేషియస్, రూసోలతో స్నేహపూర్వకంగా మెలిగేవాడు. ప్రపంచాన్ని భూస్వామ్య వ్యవస్థ (తర్కరహితమైన) నుండి విముక్తి చేయాలన్న చైతన్యోద్యమ ప్రయత్నంలో భాగంగా "దేశాల సంపద" వెలువడింది.

ప్రజల జీవితాన్ని మెరుగుపరిచేందుకు అవసరమైన ఆధునిక ఉత్పత్తి మార్గాలను పాత సంస్థలు, పద్ధతులతో పోల్చిన ఆ గ్రంథం పాత వ్యవస్థలోని లోపాలను వెలికి తీసింది. భూస్వామ్య పాలన కొనసాగిన ఐరోపాను ఆధునిక, సంపన్నమైన ఐరోపా సమాజాలతో పోల్చి కొత్త సమాజ లక్షణాలను విశదీకరించింది. ఆధునిక సూది పరిశ్రమ వర్ణనతో ఆ గ్రంథం మొదలవుతుంది. శ్రమ విభజన విస్పష్టంగా ఉన్న ఆ పరిశ్రమలో శ్రమ ఉత్పాదకత గణనీయంగా పెరిగిందని, అందులో ప్రతి కార్మికుడు ఒక చిన్న కార్యాన్ని మాత్రమే నిర్వహిస్తున్నాడని వివరిస్తుంది. సంపద సృష్టిపై ఉన్న సాంప్రదాయ ఆలోచనలను స్మిత్ తలకిందులు చేశాడు. మధ్యయుగాల తొలిదశలో వ్యవసాయ భూములే సంపదగా ఉండేవి. 1500 నుండి వ్యాపార భావనలు ప్రజలలో నాటుకుపోయాయి. బంగారు, వెండిని సంపదగా భావించడం మొదలుపెట్టారు. స్మిత్‌పై రెండు భావనలను సవాలు చేశాడు. మానవ శ్రమే సంపదకు మూలమని వాదించాడు. "ప్రతి దేశానికి చెందిన వార్షిక కార్మిక శక్తి ఒక నిధిలాంటిది. దాని నుండే జీవితానికి అవసరమైన సరుకులు, సౌలభ్యాలు సమకూరుతాయి," అని స్మిత్ రాశాడు. "అన్ని సరుకుల మారక విలువకు శ్రమ ఒక్కటే నిజమైన కొలబద్ద."

శ్రమను రెండు విధాలుగా ఉపయోగించవచ్చు. ఉత్పాదక లేదా అనుత్పాదక ప్రయోజనాల కోసం శ్రమను వెచ్చించవచ్చు. ఉత్పాదక శ్రమ నిర్దిష్టమైన, విలువకలిగిన ఉత్పత్తులను అందిస్తుంది. అలాంటి ఉత్పత్తులను విక్రయించవచ్చు లేదా స్వంతంగా వినియోగించవచ్చు. అలాగే మరిన్ని సరుకులను ఉత్పత్తి చేయడానికి వాటిని పెట్టుబడిగా పెట్టవచ్చు. అవసరం ఏదైనా ఉత్పాదక శ్రమ ఫలితంగా ఉత్పాదకత మరింతపెరిగి 'దేశ సంపదను' సృష్టిస్తుంది.

అనుత్పాదక శ్రమ అంటే ఉత్పత్తిని వెంటనే వినియోగించడం, కొత్త ఉత్పత్తుల తయారీకి ఎలాంటి అవకాశం ఇవ్వకపోవడం. అధమస్థాయి సేవకుల శ్రమ ఇలాంటిదే. వీరు తమ యజమానుల ఆదేశాల కోసం ఎప్పుడూ ఎదురుచూసేవారు. కార్యనిర్వహణ ఒక్కసారి జరిగిన తర్వాత వారి శ్రమ అట్టే మాయమయ్యేది. ఉత్పాదక కార్మికులను పనిలో పెట్టుకోవడం

ద్వారా ఒక వ్యక్తి సంపన్నుడిగా ఎదగవచ్చు. అనుత్పాదక సేవకులను పెద్ద సంఖ్యలో నియమించే వ్యక్తి పేదవాడిగా మారవచ్చు. అనుత్పాదక శ్రమ గురించి స్మిత్ మరింత విస్తారంగా చర్చించాడు.

> "సమాజంలోని కొన్ని గౌరవప్రదమైన వ్యవస్థలు కూడా అనుత్పాదక శ్రమను ప్రతిబింబిస్తాయి. ఉదాహరణకు చక్రవర్తి శ్రమ. విశాలమైన పరిపాలనా యంత్రాంగం, భారీసైన్యం, నావికాదళం..... ఇవన్నీ అనుత్పాదక శ్రమ కిందికే వస్తాయి. వాటి నిర్వహణకు అయ్యే వ్యయాన్ని ఇతరులు ఉత్పత్తి చేసే వార్షిక దిగుబడితో భరిస్తారు. అనుత్పాదక శ్రమ శీర్షికన కొన్ని ముఖ్యమైన, కఠినమైన వృత్తులు, కొన్ని వ్యర్థమైన వృత్తులు కూడా వస్తాయి. వాటిలో ప్రధానమైనవారు: చర్చిపెద్దలు, న్యాయవాదులు, శస్త్రచికిత్స నిపుణులు, కవులు, కళాకారులు, హాస్యగాళ్లు, సంగీతకారులు."

18వ శతాబ్దంలో ఐరోపా అంతటా విస్తరించి ఉన్న రాజ్యాలు గౌరవ హోదాలను సృష్టించాయి. ఎలాంటి నిర్దిష్టమైన బాధ్యతలు లేని ఆ హోదాలకు గౌరవ వేతనం మాత్రం హెచ్చుగా ఉండేది. ఫలితంగా రాచరిక సంస్థానాల్లో, ప్రభుత్వాల్లో వందిమాగధులు విలాసవంతంగా జీవిస్తూ కాలాన్ని వెళ్లదీసేవారు. స్మిత్ సిద్ధాంతం ఇలాంటి వారికి అశనిపాతంలా మారింది. అలాగే భూస్వాములను కూడా సవాలు చేసింది. భూస్వాములు ఎలాంటి శ్రమ చేయకుండా, వ్యవసాయంలో పెట్టుబడి పెట్టకుండా కౌలుపై ఆధారపడి విలాసంగా జీవించేవారు. పాత భూస్వామ్య విలువల నుండి అప్పుడే ఉద్భవిస్తున్న మార్కెట్ వ్యవస్థను విముక్తి కల్పించాల్సిన అవసరం ఉందని స్మిత్ రచన నొక్కి చెప్పింది. బ్రిటన్‌లో సంస్కరణకు అది ఒక కార్యాచరణ ప్రణాళికగా ఉండేది. ఒక విధంగా చెప్పాలంటే స్మిత్ సిద్ధాంతం ఐరోపాలో విప్లవానికి బాటలు వేసేదిగా ఉందని స్పష్టంగా అర్థమవుతుంది.

రాజ్యం వాణిజ్య నియంత్రణ, ఇతర రాజ్యాల ఆక్రమణకు ప్రయత్నించడం మానుకోవాలని స్మిత్ సూచించాడు. ప్రజలకు నిర్ణయాధికారం ఇస్తే (రాజ్య యంత్రాంగం జోక్యం నుండి విముక్తి) తాము ఉత్పత్తి చేసిన సరుకులను ఇతరులు ఉత్పత్తి చేసే నాణ్యమైన, చవకైన వస్తువులతో మార్పిడి చేసుకోవడానికి ఎల్లప్పుడూ అవకాశం ఉంటుందని స్మిత్ పేర్కొన్నాడు. తమకు ప్రవేశం ఉన్న లేదా నైపుణ్యం ఉన్న వృత్తుల్లో రాణించడానికి ప్రజలు. తమ శక్తిసామర్థ్యాలను ఎక్కువగా కేంద్రీకరిస్తారు. పనులను సాధ్యమైనంత సమర్థవంతంగా పూర్తిచేయడానికి ప్రాధాన్యతనిస్తారు. ఇతరులకు అవసరం లేని సరుకులను ఉత్పత్తి చేయడానికి ఎవరూ ఆసక్తి చూపరు. ప్రజల కార్యకలాపాలను మార్కెట్ సాధ్యమైనంత మెరుగ్గా సమన్వయం చేయడానికి ప్రయత్నించగలదు.

తమ స్వంత ఉత్పత్తిదారుల పట్ల రాజ్యాలు పక్షపాతం చూపితే ప్రజలు అవసరానికి మించి శ్రమపడే అవకాశం ఉంటుంది. రాజ్య నియంత్రణ కొన్ని వర్గాలకు మాత్రమే ప్రయోజనం కలిగించవచ్చు కాని జాతీయ సంపదను అలాంటి చర్యలు కుదించివేయగలవని స్మిత్ వాదించాడు. స్వేచ్ఛావాణిజ్యం ఒక్కటే తరుణోపాయం అని అతడు సిద్ధాంతీకరించాడు.

అలాగే 'స్వేచ్ఛా'శ్రమ లాభాలను కూడా స్మిత్ ముందుంచాడు. లాభాలు గడించడానికి బానిసత్వం ఒక సులువైన సాధనమే అయినా దీర్ఘకాలంలో అది స్వేచ్ఛాశ్రమ కంటే వ్యయభరితంగా మారగలదు. ఆస్తులను కూడబెట్టని వాడికి ఇతర ప్రయోజనాల గురించి ఏ మాత్రం పట్టదు. సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించడం, సాధ్యమైనంత తక్కువగా శ్రమ పడడం మాత్రమే అతడి వ్యవహారమని స్మిత్ పేర్కొన్నాడు.

స్వచ్ఛమైన మార్కెట్ వ్యవస్థ సద్గుణాలను స్మిత్ ఎలుగెత్తి చాటాడు. భూస్వామ్య, నిరంకుశ సంస్థల ప్రాబల్యాన్ని ఛేదిస్తూ అప్పుడప్పుడే మార్కెట్ వ్యవస్థ ఆవిర్భవించింది. ఎరిక్ రాల్ వివరించినట్లు స్మిత్ రచనలు ఒక వర్గ ప్రయోజనాలను మాత్రమే ప్రతిబింబించాయి. పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ విస్తరణకు అడ్డంకిగా ఉన్న పాలకవర్గాలకు వ్యతిరేకంగానే తాను ప్రధానంగా పోరాడుతున్న విషయంలో స్మిత్‌కు ఎలాంటి భ్రమలు ఉండేవి కావని రాల్ పేర్కొన్నాడు.

స్మిత్ ప్రతిపాదించిన కొత్త వ్యవస్థ ఏకపక్షంగా ఉండేది. బ్రిటిష్ క్యాపిటలిజం మార్కెట్ కోసం శాంతియుతంగా పోటీపడి ఐరోపా అంతటా విస్తరించలేదు. బానిసత్వం కొంత పెట్టుబడిని సమకూర్చింది. వలస కేంద్రాలు మార్కెట్లను కల్పించాయి. 18వ శతాబ్దమంతా రాజ్య వ్యయం భారీగా ఉండేది. పారిశ్రామికరంగ అభివృద్ధిని రాజ్యాలు ప్రోత్సహించాయి. అలా జరగకుండా ఉన్నట్లయితే లాభదాయకమైన, పోటీ సామర్థ్యం ఉన్న పరిశ్రమలు స్థాపించబడేవి కావు. వలస వాద కేంద్రాల స్థాపన, బానిసత్వం, వాణిజ్యం, పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ కీలకంగా ఉండేవి. వాటి అవసరం లేదని కొత్త వ్యవస్థ భావించడం మొదలుపెట్టినప్పటికీ పరిస్థితి అలాగే కొనసాగింది.

వలస కేంద్రాలు, బానిసత్వం, వాణిజ్యం లాంటి సాధనాలను సమకూర్చలేని రాజ్యాలున్న దేశాలు మాత్రం తీవ్రంగా నష్టపోయాయి. ఐర్లాండ్ అందుకో చక్కటి ఉదాహరణ. ఇంగ్లాండ్ పార్లమెంటు తమ వ్యాపారంపై విధించిన పరిమితుల వల్ల అక్కడి స్థానిక పెట్టుబడిదారులు బాగా నష్టపోయారు. భారతదేశం విషయంలో కూడా అలాగే జరిగింది. బ్రిటీషు ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు బెంగాల్‌ను పూర్తిగా దోచుకున్నారు. కాని స్థానిక వ్యాపారులు, ఉత్పత్తిదారులకు ఎలాంటి ప్రతిఫలం చెల్లించలేదు. బ్రిటీషు క్యాపిటలిజం తన స్థానాన్ని పదిలపర్చుకున్న తర్వాత మిగతా ప్రాంతాల్లోని పెట్టుబడిదారీ వర్గాలు రాజ్య సహకారంపై ఆధారపడడం ప్రారంభించాయి. అలా పరిశ్రమలు శైశవ దశలోనే మూతపడకుండా జాగ్రత్త పడ్డాయి.

పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ శైశవ దశలో ఉండగా ఆర్థిక సిద్ధాంతాలను రూపొందించిన ఆడమ్‌స్మిత్ స్వచ్ఛమైన మార్కెట్ వ్యవస్థ ప్రదర్శించే వివేచనారాహిత్యాన్ని (అంతర్గతమైన) ఊహించలేకపోయాడు. ఉత్పత్తిదారులు మార్కెట్ కోసం తీవ్రంగా పోటీపడితే డిమాండ్‌కు అనుగుణంగా ఉత్పత్తి దానికంతట అదే సర్దుకోదు. అందుకు భిన్నంగా ఉత్పత్తిఊహించని రీతిలో పెరిగేది లేదా గణనీయంగా పడిపోయేది. తమ ఉత్పత్తులను లాభదాయకంగా అమ్ముకోవడం సాధ్యం కాదని వ్యాపారులు (ఉత్పత్తిదారులు) ఆందోళన

చెందడంవల్లే ఇలాంటి ఉత్థానపతనాలు సంభవించేవి. సుమారు 45 ఏళ్ల తర్వాతే స్మిత్ ప్రధాన వారసుడు డేవిడ్ రికార్డో అతడి "రాజకీయ అర్థశాస్త్ర సిద్ధాంతాలు" అనే గ్రంథానికి అదనపు అధ్యాయాన్ని జోడించాడు. యంత్రాల వినియోగంవల్ల కార్మికుల జీవన స్థితిగతులు దిగజారగలవని రికార్డో ఆ అధ్యాయంలో పేర్కొన్నాడు. స్మిత్ అలా ప్రతిపాదించి ఉంటే అతడు సమకాలీన పరిస్థితులను దాటి ఊహాగానాలు చేసి ఉన్నట్లయ్యేది. అయితే క్యాపిటలిజంపై స్మిత్ రచనలదే చివరి మాట అని పేర్కొనే వారికి నేడు అలాంటి సాకు ఏదీ అందుబాటులో లేదు.

ముఖ్యమైన పర్యవసనాలు కలిగిన శ్రమ, విలువ అనే అంశాలపై స్మిత్ చేసిన వాదనలో వైరుధ్యం కనిపిస్తుంది. చైతన్యోద్యమ ఆలోచకులందరి లాగే స్మిత్ కూడా సంపదలో తేడాలున్న ప్రజలను సైతం సమానంగా చూశాడు. అలాంటి సమానత్వం మార్కెట్‌లో పోటీపడే వరకే పరిమితమైంది. అయినప్పటికీ స్మిత్ చేసిన కొన్ని వాదనలు ఈ సిద్ధాంతాన్ని (సమానత్వం) సవాలు చేయడం మొదలుపెట్టాయి. బానిస శ్రమ కంటే స్వేచ్ఛా శ్రమ ఏ స్థాయిలో స్వేచ్ఛాయుతమైనది? అన్న ప్రశ్న కూడా ఉదయించింది.

'విలువ'కు శ్రమే ఆధారమని నొక్కి చెప్పిన స్మిత్ ఒక నిర్ధారణకు వచ్చాడు : 'కౌలు', 'లాభం' అన్నవి ప్రత్యక్ష ఉత్పత్తిదారుడి నుండి భూస్వామి లేదా ఫ్యాక్టరీ యజమాని రాబట్టే 'శ్రమ'.

> భూమి ప్రైవేటు ఆస్తిగా మారగానే భూస్వామి వ్యవసాయదారుని నుండి మొత్తం దిగుబడిని డిమాండ్ చేస్తాడు. భూమిపై వ్యవసాయ పనుల నిర్వహణ కోసం నియమించే కార్మికుల ఉత్పత్తి నుండి అతడి 'కౌలు' తొలి మినహాయింపు అవుతుంది. ఈ లాభాన్ని పక్కన పెట్టడంపైనే ఇతర కార్మికుల ఉత్పత్తి ఆధారపడి ఉంటుంది. ప్రతి చేతివృత్తిలోనూ,పరిశ్రమలోనూ కార్మికులు అధునాతనమైన పనిముట్ల కోసం తమ యజమానిపై ఆధారపడతారు. ఆ పని పూర్తయ్యే వరకు వారికి జీతభత్యాలు అవసరం. కార్మికుల ఉత్పత్తిలో యజమాని వాటా తీసుకుంటాడు. ఆ వాటాలోనే అతడి 'లాభం' కూడా ఉంటుంది.'

ఇక్కడ ప్రయోజనాల సామరస్యత లేదు. యజమానులు, కార్మికుల ప్రయోజనాల మధ్య ఘర్షణ ఇక్కడ స్పష్టంగా కనబడుతుంది.

> "ఈ రెండు వర్గాల ప్రయోజనాలు ఏ విధంగానూ సమానమైనవి కావు. కార్మికులు సాధ్యమైనంత ఎక్కువ ప్రయోజనాన్ని ఆశిస్తారు. యజమానులు సాధ్యమైనంత తక్కువగా ఇవ్వడానికి ప్రయత్నిస్తారు. వేతనాల పెంపు కోసం కార్మికులు సంఘటితమవుతారు. కాని వేతనాలను తగ్గించడానికే యజమానులు మొగ్గు చూపుతారు. అయితే ఇరువర్గాల్లో సాధారణంగా పై చేయి ఎవరిదవుతుందో

ఊహించడం అంత కష్టమేమీ కాదు. స్వల్ప సంఖ్యలో ఉండే యజమానులు సంఘటితం కావడం చాలా సులభం. చట్టాలు కూడా వారికి అనుకూలంగా ఉంటాయి. మరోవైపు కార్మికులపై చట్టాలు కఠినంగా వ్యవహరిస్తాయి. అన్ని వివాదాల్లోనూ యజమాని తన నిర్ణయాన్ని తాత్సారం చేయడానికి అవకాశం ఉంటుంది. సాధారణంగా అయితే తాము పోగు చేసుకున్న ధనధాన్యాల ఆధారంగా భూస్వామి, రైతు, వ్యాపారి లేదా ఉత్పత్తిదారుడు ఒకటి రెండు సంవత్సరాలు మనుగడ సాగించగలరు. అయితే చాలా మంది కార్మికులు ఉపాధి లేకుండా ఒక వారం రోజులు కూడా మనుగడ సాగించలేరు."

భూస్వామ్య వ్యవస్థ అవశేషాలైన అనుత్పాదక శ్రమపై విమర్శకు ఆమడదూరంలో జరగడమే స్మిత్ వాదన తర్కంగా కనిపిస్తుంది. పారిశ్రామిక పెట్టుబడిదారుల దృష్టికోణం నుండి అతడు వాదించాడు. చివరకు పెట్టుబడిదారులనే విమర్శించాడు. వారిని అనుత్పాదక పరాన్నజీవులుగా, కార్మికుల శ్రమ నుండి సమకూరే లాభాలపై బతికేవారిగా చిత్రీకరించాడు. ఈ తర్కం రికార్డో రచనల ద్వారా ప్రచారమైంది. 1820-30 దశకాల్లోని సోషలిస్టు ఆర్థికవేత్తల నుండి కారల్ మార్క్స్ వరకు ఆ తర్కం అందరినీ ప్రభావితం చేసింది. పాత వ్యవస్థతో పోరాడడానికి చైతన్యోద్యమ రాజకీయ ఆర్థికవేత్త ఉపయోగించిన ఆయుధాలను తదుపరి శకంలో కొత్త వ్యవస్థతో పోరాడేందుకు వినియోగించారు.

నిర్దిష్టమైన నిర్ధారణలకు రావడానికి స్మిత్ సాహసించలేదు. 'విలువ' అన్నది శ్రమ ద్వారా సమకూరుతుందన్న భావనను మరో విరుద్ధమైన సిద్ధాంతంతో మేళవించడం ద్వారా వాస్తవ పరిస్థితుల నుండి దూరంగా జరగడానికి ప్రయత్నించాడు.

ఆ సిద్ధాంతంలో అతడు ఒక వస్తువు విలువ భూస్వామి, పెట్టుబడిదారు, కార్మికుల ఉమ్మడి ఆదాయాలపై ఆధారపడి ఉంటుందని పేర్కొన్నాడు. ఆ వాదనలో స్పష్టత లేకపోయినా మాల్థస్, జీన్ బాప్టిస్ట్ సే దానిని అభివృద్ధి పరిచారు. రికార్డో మరణం తర్వాత ఆ వాదన ప్రధాన స్రవంతి ఆర్థిక శాస్త్రంలో సాంప్రదాయ సిద్ధాంతంగా మారింది.

ఏమైనప్పటికీ కొత్త ఆర్థిక వ్యవస్థ ముఖ్య లక్షణాలను ప్రతిపాదించిన తొలి వ్యక్తి మాత్రం ఆడమ్ స్మితే. బ్రిటీషు పెట్టుబడిదారులకు స్మిత్ సిద్ధాంతం మార్గదర్శిగా మారింది. ఇతర దేశాల పెట్టుబడిదారులకు ఆదర్శమైంది. సుమారు 125 ఏళ్లపాటు కొనసాగిన సామాజిక శాంతి విప్లవ యుగానికి బాటలు వేస్తున్న సమయంలో 'దేశాల సంపద' ప్రచురితమైంది. ఆ గ్రంథం ఆలోచనలు కొత్త శకంలోని ప్రధాన పాత్రధారుల వైఖరులను నిర్ధారించాయి.

# పరిణామక్రమం

1773 : బోస్టన్ టీ పార్టీ
1775 : లెగ్జింటన్, బంకర్ హిల్ వద్ద సైనిక ఘర్షణ
1776 : అమెరికా స్వాతంత్ర్య ప్రకటన
1781 : యార్క్‌టౌన్ వద్ద బ్రిటీషు దళాల ఓటమి
1780–1830 : బ్రిటన్‌లో విస్తరించిన ఫ్యాక్టరీ వ్యవస్థ, గనుల తవ్వకం
1789 : బాస్టిల్ కారాగార ముట్టడి, ఫ్రెంచి విప్లవం ఆరంభం
1791 : సెయింట్ డొమింగోలో బానిస తిరుగుబాటు
1792 : ఫ్రెంచి విప్లవ యుద్ధం, వాల్మీ యుద్ధం, రాజుకు బహిరంగ ఉరిశిక్ష
1793–94 : ఫ్రాన్స్‌లో జాకోబిన్ల పాలన, అంతరించిన భూస్వామ్య వ్యవస్థ, అరాచకం
1794 : జాకోబిన్ల పతనం, థెర్మిడార్
1793–98 : సెయింట్ డొమింగోను స్వాధీనం చేసుకున్న బ్రిటీషు దళాలు, మాజీ బానిసల సైన్యం చేతిలో ఓటమి
1797 : బ్రిటీషు నౌకాదళంలో తిరుగుబాట్లు
1798 : ఐర్లాండ్‌లో – బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా ఉద్యమం ఉద్యమాన్ని అణచివేయడానికి ఆరెంజ్ ఆర్డర్ (వ్యవస్థ) ఏర్పాటు
1799 : బ్రిటన్‌లో కార్మిక సంఘాలను నిషేధించిన ఉమ్మడి చట్టాలు. ఫ్రాన్స్‌లో అధికారాన్ని సంపూర్ణంగా హస్తగతం చేసుకున్న నెపోలియన్.
1801–03 : హైతీలో బానిస వ్యవస్థను పునరుద్ధరించడానికి ప్రయత్నించిన నెపోలియన్, తౌస్సెయింట్ నిర్బంధం, మరణం; మాజీ బానిసలు సైన్యాన్ని విజయం వైపు నడిపించిన డెస్సాలైన్స్
1804 : 'ఎరోయికా' సింఫనీని సృష్టించిన బీథోవెన్
1805 : చక్రవర్తిగా నెపోలియన్
1807 : హెగెల్ 'మానసిక పరిణామశాస్త్రం'
1807 : బానిసల వ్యాపారాన్ని నిషేధించిన బ్రిటన్

**1810** : మెక్సికో, వెనిజులాలో స్పానిష్ పాలనకు వ్యతిరేకంగా మొదలైన తిరుగుబాట్లు.
**1810-16** : ఉత్తర ఇంగ్లాండ్‌లో యంత్రాలను ధ్వంసం చేసిన లుడ్డయిట్లు.
**1814-15** : నెపోలియన్ ఓటమి; పాత రాచరిక వ్యవస్థ పునరుద్ధరణ, వాటర్‌లూ
**1811-18** : జేన్ ఆస్టన్, వాల్టర్ స్కాట్ నవలల ప్రచురణ.
**1819** : శ్రామిక వర్గ ప్రదర్శనకారుల 'పీటర్‌లూ' ఊచకోత.
**1830** : పారిస్‌లో విప్లవం; పాత చక్రవర్తి స్థానంలో కొత్త పాలకుడు.
**1830 దశకం** : స్టెండ్‌హాల్, బల్జాక్ నవలల ప్రచురణ
**1830** : ప్రపంచంలో తొలి ప్యాసింజర్ రైల్వే స్థాపన
**1831** : విద్యుత్ ఉత్ప్రేరకాన్ని కనుగొన్న ఫారడే
**1832** : బ్రిటీషు మధ్యతరగతికి ఓటు హక్కు
**1834** : బ్రిటన్‌లో కర్మాగారాల స్థాపనకు దారి తీసిన పేద కార్మికుల (సవరణ) చట్టం.
**1838-39** : కార్మికులకు ఓటు హక్కును డిమాండ్ చేసిన చార్టిస్ట్ ఉద్యమం.
**1839-42** : చైనాకు వ్యతిరేకంగా నల్లమందు యుద్ధం.
**1842** : లంకషైర్‌లో సార్వత్రిక సమ్మె
**1840-60** : చార్ల్స్ డికెన్స్, జార్జ్ ఇలియాట్, బ్రాంట్స్‌ల నవలలు.
**1840 మధ్య దశకం**: చైనాలో నగ భూభాగంపై నియంత్రణ సాధించిన తైపింగ్ తిరుగుబాటుదారులు.
**1846-49** : ఐర్లాండ్‌లో మహాకరువు
**1848 వసంతకాలం** : ఐరోపా అంతటా విప్లవాలు, ఐర్లాండ్‌లో విఫలమైన ఉద్యమం, లండన్‌లో చార్టిస్ట్ ఉద్యమ చివరి మహా ప్రదర్శన.
**1848 జూన్** : కార్మికుల ఉద్యమాన్ని అణచివేసిన ఫ్రెంచి బూర్జువా వర్గం.
**1848-49** : ఐరోపా అంతటా పాత రాచరిక వ్యవస్థల పునరుద్ధరణ
**1850-60** : జర్మనీ, ఫ్రాన్స్‌లకు విస్తరించిన పరిశ్రమలు
**1843-56** : ఉత్తర భారతంపై పూర్తిగా పట్టు సాధించిన ఆంగ్లేయులు
**1857** : భారత సిపాయిల తిరుగుబాటు
**1857-60** : రెండవ ఓపియం యుద్ధం (నల్లమందు యుద్ధం); చైనా నగరాల్లో వలసవాదపాలకులకు 'రాయితీలు'
**1859** : జాతుల ఆవిర్భావ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన డార్విన్
**1859-71** : రాజు నేతృత్వంలో ఇటలీ ఏకీకరణ
**1861** : ప్రారంభమైన అమెరికా అంతర్యుద్ధం; రష్యాలో కౌలుదారీ వ్యవస్థను రద్దు చేసిన జార్ (చక్రవర్తి)
**1863** : బానిసత్వం ముగిసిందని ప్రకటించిన లింకన్
**1865** : దక్షిణ అమెరికా ఓటమి
**1864** : తైపింగ్ తిరుగుబాటుదారులను అణచివేసిన బ్రిటీషు నేతృత్వంలోని దళాలు.

1866 : డైనమైట్‌ను కనుగొన్న ఆల్ఫ్రెడ్ నోబెల్

1867 : జపాన్‌లో తోకుగావా భూస్వామ్య పాలనకు చరమగీతం పాడిన మీజీ విప్లవం (రాచరిక వ్యవస్థ ప్రోత్సహించిన విప్లవం ఇది)

1867 : 'క్యాపిటల్'ను ప్రచురించిన మార్క్స్

1870 : ఫ్రాంకో-ప్రషియన్ యుద్ధం, పతనమైన లూయిా బోనాపార్టేపాలన.

1871 : పారిస్ కమ్యూన్, కార్మికుల నియంత్రణలోకి వచ్చిన నగరం;నగరంపై రిపబ్లికన్ ప్రభుత్వ దాడి; వేలాది మంది ప్రజలు హతం.

1871 : ప్రష్యయన్ రాచరిక వ్యవస్థ నేతృత్వంలో జర్మన్ సామ్రాజ్యాన్ని స్థాపించిన బిస్మార్క్

1873 : తొలి విద్యుత్‌యంత్రం

1870 మధ్య దశకం: అమెరికా దక్షిణ రాష్ట్రాల నుండి సైనిక బలగాలు ఉపసంహరణ, జిమ్ క్రో 'విభజిత' ఉద్యమ ఆవిర్భావం

## ఒకటవ అధ్యాయం

# అమెరికా తొలిబాట

1781లో యార్క్‌టౌన్ నుండి బ్రిటీషు దళాలు ఉపసంహరిస్తూ ఉంటే సైనిక బ్యాండు "ప్రపంచం తలకిందులైంది" అన్న స్వరాన్ని సృష్టించింది. కింగ్ జార్జ్‌కు అత్యంత విశ్వాసపాత్రులైన టోరీలకు కూడా అలాంటి భావనే కలిగి ఉంటుంది. తమ దళాలతోపాటు వేలాది మంది టోరీలు తమ స్వదేశానికి తిరుగుముఖం పట్టారు. సమాజం తమ ఆధిపత్యానికి అనుగుణంగా సహజసిద్ధంగా వ్యవస్థీకరించబడిందన్న భావనతో పెరిగిన వీరు విజయవంతమైన తిరుగుబాటు రావడంతో తమ కలలన్ని స్వంత కళ్ల ముందే కరిగిపోవడం చూశారు. అయితే 99 శాతం మంది తిరుగుబాటుదారులు అలాంటి భావనలను కేవలం ఎనిమిదేళ్ల క్రితమే పెంచుకున్నారు.

తిరుగుబాటుదారుల్లో ప్రముఖుడైన బెంజమిన్ ఫ్రాంక్లిన్ 1760 దశకంలో ఇలా రాసి ఉన్నారు : "ఉత్తములైన రాజుల పాలన కింద ఇప్పుడు మేము సంతోషంగా ఉన్నాము." దిన పత్రికల్లో వచ్చిన ఫ్రాంక్లిన్ వ్యాసాలను, భవిష్యత్ సూచికలను వేలాది మంది అమెరికన్లు 1774 వరకూ నమ్మారు, వాటితో ఏకీభవించారు. ఫ్రాంక్లిన్ స్వంత కాలనీ అయిన పెన్సిల్వేనియాలో చైతన్యవంతమైన విప్లవ సాంప్రదాయం ఉండేది కాదు. వర్జీనియా నాయకుడు థామస్ జెఫర్సన్ 1766 ప్రారంభంలో కూడా "రాచరిక వ్యవస్థ నుండి వేరు పడటానికి అమెరికన్లు కోరుకోవడం లేదు, ఈ విషయంలో వారికి ఆసక్తి కూడా లేదు" అని వాదించేవాడు.

అయితే 1776 వేసవిలోనే అలాంటి ఆలోచన (ఆకాంక్ష) ఎలా కలిగింది? ఖండ వ్యాప్త సమావేశం వద్ద గుమికూడిన 13 కాలనీలకు చెందిన ప్రతినిధులు 'స్వాతంత్ర్య ప్రకటన'ను ఆమోదించారు. ప్రకటనను జెఫర్సన్ స్వయంగా రూపొందించాడు. "ప్రతి మనిషీ సమానంగా సృష్టించబడ్డాడు" అన్న వొక్కాణింపుతో ఆ ప్రకటన మొదలవుతుంది. ఐరోపాలో రాజులు, సామంతులు పట్ల గౌరవాభిమానాలు సర్వవ్యాపితంగా ఉన్న సమయంలో వెలువడిన ఆ ప్రకటన నిజంగా విప్లవాత్మకమైనదే.

బ్రిటీషు సింహాసనం ప్రోద్బలంతో సుమారు 150 ఏళ్ల క్రితం ఈ వలస వాద కేంద్రాలను స్థాపించారు. లండన్‌లో నియమితులైన గవర్నర్ల చేతిలో నిర్దిష్టమైన రాజకీయ

అధికారం ఉండేది. అయితే ఆచరణాత్మకమైన అధికారమంతా ప్రతి కాలనీలోని వివిధ వర్గాల చెప్పుచేతల్లో ఉండేది. న్యూ ఇంగ్లాండ్ గ్రామీణ ప్రాంతంలో స్వతంత్రులైన రైతులు, న్యూ ఇంగ్లాండ్ తీర పట్టణాల్లో వ్యాపారులు, వృత్తిదారులు, న్యూయార్క్ రాష్ట్రంలో విరోధులైన బడా భూస్వాములు, న్యూయార్క్ నగరంలో బ్రిటన్ ఆధ్వర్యంలోని అట్లాంటిక్ వాణిజ్యంతో ముడిపడిన వ్యాపారులు, పెన్సిల్వేనియాలో పెన్ కుటుంబం, మరికొన్ని ధనిక క్వేకర్ కుటుంబాలు, వర్జీనియా, ఉత్తర-దక్షిణ కారోలీనాలలో తోట యజమానులు (వీరు బానిసలను పెద్ద సంఖ్యలో కలిగి ఉండేవారు) అధికారాన్ని చెలాయించేవారు. ఆయా కాలనీల్లో తీవ్రమైన సామాజిక ఘర్షణలు కూడా చోటు చేసుకునేవి. ముఖ్యంగా భూస్వాములు, కౌలుదారుల మధ్య హింసాత్మకమైన ఘర్షణలు జరిగేవి. 1766లో న్యూయార్క్‌కు చెందిన హడ్సన్ లోయలో కౌలుదారులు తిరుగుబాటు చేశారు. పెన్సిల్వేనియాలో ఫిలడల్ఫియా ఉన్నత వర్గాలు, పశ్చిమ వలసవాదుల మధ్య ఘర్షణలు జరిగేవి. కారోలీనా రాష్ట్రాలలో 'నియంత్రిత' సన్నకారు రైతులు, 'బడా' తోట యజమానుల మధ్య వైషమ్యాలు ఉండేవి. వీటికితోడు దక్షిణ రాష్ట్రాల్లో బానిస తిరుగుబాట్లపై తోట యజమానులు నిత్యం ఆందోళన చెందేవారు. ముఖ్యంగా 1739లో దక్షిణ కారోలీనాలో బానిస తిరుగుబాటు సంభవించిన తర్వాత అలాంటి భయాందోళనలు నెలకొన్నాయి. ఇలాంటి ప్రయోజనాల ఘర్షణవల్లే 1750 దశకం మొదట్లో ఆయా కాలనీల మధ్య ఐక్యతను నెలకొల్పడానికి జరిగిన ప్రయత్నం విఫలమైంది.

ప్రతి కాలనీలోనూ ప్రజలు తమను తాము 'అమెరికన్లు'గా కంటే 'బ్రిటీషు' వారిగానే భావించే వారు. ఎంతైనా కాలనీలన్నీ బ్రిటీషు ఆధ్వర్యంలోని అట్లాంటిక్ వాణిజ్యంతోనే పురోభివృద్ధిచెందాయి. వారి ఉమ్మడి జనాభా స్థిరంగా పెరిగింది. ఈ జనాభా 30 లక్షలకు చేరుకున్న నాటికీ బ్రిటన్ జనాభాలో మూడో వంతుతో సమానంగా ఉండేది. కాలనీల వ్యాపారులు భూస్వాములు సిరిసంపదలను గణనీయంగా అనుభవించారు. రైతులు, వృత్తిదారులు తమ పూర్వీకుల కంటే ఉన్నతమైన జీవితాన్ని గడిపారు. వ్యవస్థను నిర్మూలించడం ఏ వర్గానికి ప్రయోజనకరంగా ఉండేది కాదని బోధపడుతోంది.

## చిన్న పగులు నుండి వైరుధ్యం వరకు

అయితే ఆర్థిక పురోగతి సంభవించే కొద్దీ అట్లాంటిక్ ఇరువైపులా ఉన్న వ్యాపారులు, భూస్వాములు, ఉత్పత్తిదారులు ప్రత్యేక ప్రయోజనాలను, పరస్పర విరుద్ధమైన వైఖరులను అవలంబించడం మొదలుపెట్టారు. బ్రిటిషు వాణిజ్య ప్రయోజనాలను దెబ్బతీసే విధంగా కాలనీలు తమ స్వంత విధానాలను అనుసరించగలవన్న ఆందోళన లండన్‌లో రోజురోజుకూ పెరుగుతూ పోయింది. అదే సమయంలో తమ అవసరాలను బ్రిటీషు ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోందన్న అనుమానం కాలనీల్లో బలపడుతూ పోయింది. లండన్‌లో ఆయా కాలనీల ప్రతినిధిగా వ్యవహరించిన ఫ్రాంక్లిన్ లాంటి వ్యక్తులు 1770 మధ్యదశకం వరకూ ఇలాంటి ఆందోళనలు, అనుమానాలు కేవలం అవగాహన లోపం వల్లే తలెత్తాయని భావించేవారు. అయితే ఇరు

వర్గాలు వాటిని తీవ్రంగానే పరిగణించాయి. ఏదో ఒక దశలో కాలనీలు, బ్రిటన్ మధ్య ఘర్షణ అనివార్యంగా తయారైంది.

ఆడమ్‌స్మిత్, అతడి శిష్యులు వాదించినట్లు రాజ్యానికి ఆర్థికపరమైన పాత్ర లేని మార్కెట్ వ్యవస్థ ఆవిర్భవించలేదు. మొత్తం వ్యవస్థ అంతటిలో వ్యాపార కూటములు విస్తరించాయి. కాని వ్యాపారులు, పెట్టుబడిదారులు, ఉత్పత్తిదారులు నివసించే కొన్ని నగరాల చుట్టే అవి కేంద్రీకృతమయ్యాయి. నగరాల్లో సరుకుల క్రయవిక్రయాలతోపాటు రాజకీయ నియంత్రణపై సామాజిక, ప్రయోగాత్మక ఒత్తిడి పెరిగింది. వ్యాపార, ఉత్పత్తిదార, పెట్టుబడిదార ప్రయోజనాలు వైరి జాతీయ రాజ్యాల ఆవిర్భావంతో మరింత బలపడ్డాయి. భూస్వామ్య వ్యవస్థ కంటే తీవ్రమైన రాజకీయ నియంత్రణ కలిగిన నిర్మాణాలతో ఈ రాజ్యాలు ఆవిర్భవించాయి. వాటికి ప్రత్యేకమైన జాతీయ భాషలు కూడా జతయ్యాయి. తమ స్వంత ప్రయోజనాల పరిరక్షణ కోసమే పార్లమెంటును నిర్వహిస్తున్న భూస్వామ్య వర్గాలపై బ్రిటన్ పెట్టుబడిదారులు ఒత్తిడి తీసుకురారని భావించడానికి ఎలాంటి ఆధారం లేదు. అలాగే అమెరికన్ కాలనీలలో పెట్టుబడిదారులు తమ స్వంత రాజకీయ ప్రతిచర్యలతో స్పందించలేరని కూడా భావించలేము.

రాజకీయ, ఆర్థిక రంగాలు రెండింటిలోనూ కొన్ని ప్రత్యేక ఘటనలు దీర్ఘకాలిక ఒరవడులను తెరపైకి ప్రస్ఫుటంగా తీసుకువస్తాయి. ఆ విధంగా 1760, 1770 దశకాల్లో కొన్ని పరిణామాలు సంభవించాయి. బ్రిటన్, ఫ్రాన్స్‌ల మధ్య జరిగిన ఏడేళ్ల యుద్ధం (1756-63) కాలనీలపై నియంత్రణ ఉద్దేశించబడినది. ముఖ్యంగా ఉత్తర అమెరికా కాలనీల స్వాధీనం కోసమే అవి సుదీర్ఘ యుద్ధం చేశాయి. ఆ కాలనీలతో ఉన్న వాణిజ్యాన్ని హస్తగతం చేసుకోవడమూ ఇరుదేశాల లక్ష్యంగా ఉండేది. వెస్ట్ ఇండీస్‌లో బ్రిటన్ ఫ్రాన్స్‌ను ఓడించింది. బెంగాల్‌పై నియంత్రణ సాధించింది. కెనడాను ఆక్రమించింది. అలా ప్రపంచ సామ్రాజ్యానికి పునాదులు వేసింది. అయితే అలా చేయడంవల్ల భారీ మూల్యాన్ని చెల్లించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

యుద్ధ వ్యయంలో కొంత భాగాన్ని అమెరికన్ వలసవాద పాలకులు సమకూర్చి పెట్టడం సమంజసంగా ఉంటుందని బ్రిటీషు మంత్రులు భావించారు. మిస్సిసిప్పి లోయపై నియంత్రణకు, పశ్చిమంవైపు కాలనీలు విస్తరించకుండా అడ్డుకునేందుకు ఫ్రాన్స్ వేసిన పథకాన్ని వమ్ము చేసినందుకుగాను బ్రిటీషు దళాలకు అమెరికన్ వలసదారులు బాసటగా నిలవడం ఎంతైనా భావ్యమని వారు తర్కించారు.

ఆ భావనతోనే బ్రిటన్ వలసదారులపై వివిధ రకాల పన్నులను విధించింది. 1764లో ముడి చక్కెరపై పన్ను, 1765లో వ్యాపార లావాదేవీలపై స్టాంప్ పన్ను 1767లో దిగుమతులపై పన్నును విధించింది. అలాగే అమెరికాలో బ్రిటీషు దళాలను మోహరించేందుకు అయ్యే వ్యయాన్ని సమీకరించేందుకు త్రైమాసిక వ్యయ చట్టాన్ని ఆమోదించింది. ఆ చట్టం మేరకు వ్యయ లోటును వలసదారులు స్వంతంగా భర్తీ చేయాల్సి ఉంటుంది.

ఈ పన్నులు, చట్టాలు తీవ్ర నిరసనను కల్గించాయి. ఆర్థిక సంక్షోభం కారణంగా ఆ సమయంలో ప్రజల వద్ద నగదు సరిపడినంత స్థాయిలో లేదు. పన్నులు కొన్ని పరిశ్రమల మనుగడకే సవాలుగా మారాయి. ఫ్రాన్స్ నుండి సైనికపరమైన ముప్పు తొలగిపోయింది. కాని బ్రిటన్‌లోని బడా భూస్వాములపై పన్నులు తగ్గించేందుకు ప్రభుత్వానికి అదనపు ఆదాయం అవసరమైంది. మరీముఖ్యంగా తమకు భాగస్వామ్యం లేని విధానాలకు వలసదారులు పన్నులు సమకూర్చాల్సిన దుస్థితి ఏర్పడింది.

బ్రిటన్‌లో ఆదాయ వనరులను రాబట్టుకునేందుకు ప్రభుత్వం చేసే ఏ ప్రతిపాదననైనా సాధారణ సభ తిరస్కరించే అవకాశముందని వలసవాదులు వాదించారు. అమెరికాలోని వివిధ కాలనీల శాసనమండళ్లకు కూడా అలాంటి అధికారం ఉండాలని కోరుకున్నారు. లేనిపక్షంలో తమ మౌలికమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను తొక్కిపెట్టడమే అవుతుందని స్పష్టం చేశారు. నిరసన తెలపడానికి ఉపయోగించిన భాష అప్పటికీ విప్లవ స్వరూపాన్ని సంతరించుకోలేదు. బ్రిటన్లలాగే తాము కూడా తమ హక్కులను పరిరక్షించుకుంటున్నామని ప్రజలు భావించారు. అయితే ఆ భావన ప్రజలను బ్రిటన్‌కు వ్యతిరేకంగా తొలిసారిగా సమైక్యపరిచింది, సమీకరించింది.

సమాజంలో వివిధ స్థాయిలో ఈ సమీకరణ జరిగింది. ఉన్నత స్థాయిలో ఖండవ్యాప్త సమావేశానికి హాజరైన వివిధ కాలనీల ప్రతినిధులు పన్నులు ఉపసంహరించే వరకు బ్రిటన్‌తో వ్యాపార లావాదేవీలను బహిష్కరించాలని పిలుపునిచ్చారు. ఫలితంగా వ్యాపారులపైనే ప్రతిఘటనా చర్యలు ఆధారపడ్డాయి.

అయితే ఇతర శక్తులు కూడా సమీకృతమయ్యాయి. 1765-66 మధ్య అన్ని కాలనీల్లోనూ తమను తాము 'విముక్తి పుత్రులు'గా ప్రకటించుకున్న బృందాలు ఏర్పడ్డాయి. ఈ బృందాల్లో ధనిక తోట యజమానులు, బడా భూస్వాములు, లేదా సంపన్న వ్యాపారులు సభ్యులుగా ఉండేవారు కాదు. వాటిలో ప్రధానంగా ఉన్నత, కార్మిక వర్గాల మధ్యన ఉండే వ్యక్తులే ఎక్కువగా చేరారు. అసమ్మతి మేధావులు, స్థానిక వ్యాపారులు, వృత్తిదారులు ఈ కోవలోకి వస్తారు. ఇంగ్లాండ్‌లో విప్లవాన్ని తీసుకువచ్చిన నవీన ఆదర్శ సైన్యంలో ప్రధాన పాత్రపోషించిన మధ్యతరగతి వర్గాన్ని వారు పోలి ఉండేవారు. వలసవాద పట్టణాలలో ప్రజా ఉద్యమాలు, ఘర్షణల సాంప్రదాయం ఉండేది. 'విముక్తి పుత్రులు' దాదాపు ఒక రాజకీయ పక్షంవలే వ్యవహరించారు. బ్రిటీషు అంశంపై వారు ప్రజలను, ప్రజా ఉద్యమాలను సమీకరించారు. పెద్ద సంఖ్యలో ఉన్న సాధారణ అమెరికన్లలో సరికొత్త రాజకీయ చైతన్యాన్ని కల్గించేందుకు కృషి చేశారు.

ప్రజా నిరసన పరోక్ష చర్య అయిన వ్యాపార బహిష్కరణను మించిపోయింది. బోస్టన్‌లో ప్రజలు స్టాంపులు అమ్మే కార్యాలయ భవనాన్ని ధ్వంసం చేశారు. స్టాంపుల పంపిణీదారుల గృహంపై దాడి చేశారు. న్యూయార్క్‌లో నమ్మకద్రోహులుగా పరిగణించిన వ్యక్తుల ఇళ్లను ప్రజలు నేలమట్టం చేశారు. నగరంలో స్థావరాలు ఏర్పాటు చేసుకొని ఉన్న బ్రిటీషు సైనికులతో

ఘర్షణ పడ్డారు. బ్రిటన్ పట్ల ఉన్న కోపం, స్థానిక ఉన్నత వర్గాలపై ఉన్న వ్యతిరేకతతో జతయ్యింది. అంతటా దుర్భరపరిస్థితులు నెలకొన్న సమయంలో తన సంపదను భోగభాగ్యాలపై వెచ్చించిన ఉన్నత వర్గాలపై ప్రజలకు ఎనలేని ఆగ్రహం ఉండేది. ధనికులు సందర్శించే నాట్యశాలలపై ప్రజలు దాడి చేశారు. బ్రిటీషు అంశాన్ని విప్లవాత్మకమైన 'న్యూయార్క్ జర్నల్' అనే పత్రిక నాటకీయంగా మలచింది. కానీ విపరీతమైన అద్దెలు, పెరుగుతున్న ధరలు, నిరుద్యోగం తదితర అంశాలను ఎత్తిచూపుతూ విమర్శనాత్మక వ్యాసాలను వరుసగా ప్రచురించింది.

ఏదైన నిరసన ఉద్యమం తలెత్తితే ప్రత్యక్ష చర్య ప్రజల ఆలోచనలను మార్చివేసేది. ఆలోచనల్లో వచ్చే మార్పు మరింత కార్యాచరణకు దారి తీసేది. 1760 దశకంలో బోస్టన్, న్యూయార్క్‌లలో సరిగ్గా ఇలాగే జరిగింది. న్యూయార్క్‌లో ప్రజలు విముక్తి స్థూపాలను స్థాపించారు. బ్రిటీషు చర్యలకు వ్యతిరేకంగా వాటిని లేవనెత్తారు. ఈ స్తంభాలను బ్రిటీషు సైనికులు కూల్చివేసిన ప్రతిసారి కొత్త స్తంభాలను నిర్మించేవారు. పన్ను సేకరణదారుల కొత్త వ్యవస్థను ఏర్పాటు చేయాలన్న బ్రిటీషు ప్రభుత్వ ప్రయత్నాలు ప్రజల భావాలను మరింత బలోపేతం చేశాయి. బయటి నుండి తమపై పన్ను సేకరణ అధికారులను రుద్దుతున్నారన్న భావన ప్రజల్లో నాటుకుపోయింది. 1770 మార్చిలో బోస్టన్ ప్రజల అసంతృప్తి తీవ్రస్థాయికి చేరుకుంది. ఆ సంఘటనలో తమపై మంచు బంతులు విసిరిన ఐదుగురు పౌరులను బ్రిటీషు సైనికులు కాల్చి చంపారు. 'బోస్టన్ ఊచకోత'గా ఆ సంఘటన ప్రాముఖ్యతను సంతరించుకుంది.

లండన్ నగర వ్యాపారుల ఒత్తిడి, జాన్ వైక్స్ నేతృత్వంలోని అల్లరి మూకలు నగరంలో సృష్టించిన అలజడికారణంగా బ్రిటీషు ప్రభుత్వం కొంతకాలంపాటు వెనక్కి తగ్గింది. కొత్త పన్నులన్నింటిని రద్దు చేసింది. ఒక్క తేయాకుపైనే పన్నును కొనసాగించింది. ఫలితంగా అమెరికాలో ఉద్యమం సద్దుమణిగింది.

అయితే విషయం అంతటితోనే ముగియలేదు. బోస్టన్, తదితర చోట్ల అణచివేతకు గురైన ప్రజల్లో కొత్త పన్నుల వడ్డనకు వ్యతిరేకంగా నిరసన ఎన్నడూలేని స్థాయికి చేరుకుంది. బ్రిటన్‌తో నిమిత్తం లేకుండా కాలనీలు తమ స్వంత ప్రయోజనాల సాధన కోసం స్వతంత్ర విధానాలను అనుసరించగలవన్న ఆందోళన బ్రిటన్ పాలకవర్గాలను పట్టి పీడించింది. వారి ఆందోళన రోజురోజుకు పెరుగుతూనే పోయింది. కాలనీ ప్రజలకు గుణపాఠం నేర్పకుంటే అవిధేయత మార్చుకోలేని అలవాటుగా తయారై కాలనీలను నిర్వహించాలన్న అసలు ఉద్దేశ్యమే దెబ్బతింటుందన్న భావన వారిలో నాటుకుపోయింది.

## మంచు బంతుల నుండి మందుగుండు బంతుల వరకు

ఒక చిన్న సంఘటన విస్ఫోటక పరిస్థితులకు దారి తీసిన సందర్భాలు చరిత్రలో చాలా ఉన్నాయి. అలాంటి ఒక చిన్న సంఘటన 1773 నవంబరులో బోస్టన్ ఓడరేవు వద్ద సంభవించింది. ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన ఒక సరుకు రవాణా ఓడ అక్కడ తేయాకును

దించడానికి సిద్ధంగా ఉంది. ఆ సమయంలో స్థానిక గవర్నర్ కుమారులు తేయాకు దిగుమతిని చేపట్టడం ద్వారా వ్యాపారంపై ఉన్న నిషేధాన్ని నీరుగార్చాలని ప్రయత్నించారు. వేలాది మంది ప్రజలు ఒడ్డున నిలబడి నిరసన తెలుపుతుండగానే సుమారు వంద మంది ప్రదర్శనకారులు స్థానిక అమెరికన్లుగా వేషాన్ని ధరించి ఓడపైకి చేరుకున్నారు. అందులోని తేయాకును సముద్రంలో పడవేశారు.

గౌరవప్రదమైన కాలనీ నాయకులు ఈ సంఘటనతో బిత్తరపోయారు. "ఇదో అన్యాయమైన హింసాత్మక సంఘటన" అని బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఆగ్రహం వ్యక్తం చేశాడు. అయితే అప్పటికే బ్రిటీషు ప్రభుత్వం పట్ల తీవ్ర అసంతృప్తిలో ఉన్న కాలనీ వాసులలో ఆ సంఘటన కొత్త ఉత్సాహాన్ని నింపింది. బ్రిటీషు ప్రాబల్యానికి అది మరణమృదంగం మోగించింది. కాలనీని దారిలో పెట్టడానికి బ్రిటీషు ప్రభుత్వం జనరల్ గేజ్‌ను మసాచ్యుసెట్స్ గవర్నర్‌గా నియమించింది. బోస్టన్‌కు సైనిక బలగాలను పంపింది. చట్ట వ్యతిరేక కార్యకలాపాలను నిషేధిస్తూ అనేక చట్టాలను ఆమోదించింది. వాటి ప్రకారం ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడే వారిని బ్రిటన్‌కు తరలించి విచారణ జరుపుతారు.

ఇప్పుడు పన్నుల వద్దన ఒక్కటే ప్రధానాంశంగా మిగల్లేదు. తాము పాటించాల్సిన చట్టాలు, విధానాల రూపకల్పనలో తమకూ భాగస్వామ్యం ఉండాలని కాలనీ ప్రజలు డిమాండ్ చేయడం ప్రారంభించారు. ఆ సందర్భంలో జెఫర్సన్ ఇలా వ్యాఖ్యానించారు : "గ్రేట్ బ్రిటన్ దీవిలోని 1,60,000 మంది ఓటర్లకు అమెరికా రాష్ట్రాల్లోని 40 లక్షల మంది ప్రజల భవితవ్యాన్ని నిర్ధారించే హక్కు ఉందా?" (అయితే తన స్వంత ప్రాంతమైన వర్జీనియాలో నల్లజాతి బానిసలు, పేద శ్వేత జాతీయులకు ఎలాంటి ఓటు హక్కు లేదన్న విషయాన్ని జెఫర్సన్ చాలా తేలికగా మరచిపోయారు) అన్ని కాలనీలు బెదిరింపులకు గురయ్యాయి. అన్ని ప్రాంతాల్లోనూ తీవ్ర నిరసన బయల్దేరింది. నిరసనకు ఒక స్వరూపం ఇవ్వడానికి కమిటీలు ఏర్పడ్డాయి. తేయాకు బహిష్కరణ అన్ని ప్రాంతాలకు విస్తరించింది. మరో ఖండవ్యాప్త సమావేశానికి ప్రతినిధులను పంపడానికి 13 కాలనీల శాసనమండళ్లు అంగీకరించాయి.

కాంగ్రెస్‌కు హాజరైన ప్రతినిధుల్లో చాలా వరకు గౌరవప్రదమైన ఆస్తి యజమానులే. బ్రిటీష్ సామ్రాజ్య వ్యవస్థల్లో అంతర్భాగంగానే వారు పైస్థాయికి చేరుకున్నారు. సామ్రాజ్యాన్ని కూలదోయాలన్న ఆకాంక్ష వారిలో ఉండేది కాదు. అవకాశమే కనక ఉండి ఉంటే వారు పాత వ్యవస్థనే కొనసాగించాలని కోరుకునే వారు. కాకపోతే ఇప్పుడు అలాంటి అవకాశమే లేకుండాపోయింది. సమావేశానికి హాజరైన వారు వ్యాపారాన్ని బహిష్కరించాలని కొత్తగా పిలుపునిచ్చారు. అయితే బ్రిటీషు ప్రభుత్వం తీసుకుంటున్న కఠిన చర్యల కారణంగా బహిష్కరణ అమలు బాధ్యతను వ్యాపారులకే వదిలిపెట్టలేకపోయారు. ప్రజా ప్రతిఘటనను నిర్వహించే సంస్థకు ఆ బాధ్యతను అప్పగించారు. ప్రతి నగరం, పట్టణంలో ప్రజలు కమిటీలను ఎన్నుకొని వాటి ద్వారా బ్రిటీషు సరుకుల క్రయవిక్రయాలపై నిషేధం విధించాలని ఉద్యమించారు.

వర్జీనియా తోట యజమానులకు అదో పెద్ద సమస్యగా కనిపించలేదు. బహిష్కరణకు మద్దతుగా వారు మసాచ్యుసెట్స్‌తో చేతులు కలిపారు. గవర్నర్‌తో సహా కాలనీ పాలనా వ్యవస్థలన్నీ వారి నియంత్రణలోనే ఉండేవి. ఎలాంటి గొడవ లేకుండా వారు తమ నిర్ణయాన్ని అమలు చేసేవారు. అయితే ఇతర ప్రాంతాల్లో ఇలాంటి నియంత్రణపై వెయ్యినొక్క ప్రశ్నలు ఉదయించాయి.

బ్రిటీషు చర్యలకు వ్యతిరేకంగా మసాచ్యుయెట్స్‌లో ప్రజాభిప్రాయం దాదాపు ఏకగ్రీవంగా ఉండేది. కాని వార్సెస్టర్ కౌంటీ లాంటి ప్రాంతాల్లో జడ్జీలు కొత్త చట్టాలను అమలు చేయాలని నిర్ణయించారు. ఈ పరిస్థితుల్లో ఏమి చేయాలి? న్యూయార్క్‌లో ధనిక వ్యాపారులు చాలా మంది బ్రిటన్ సామ్రాజ్యవాద వాణిజ్యంవల్ల బాగా లాభపడ్డారు. బహిష్కరణను పాటించడానికి వారు ఇష్టపడలేదు. అలాగే శక్తివంతమైన భూస్వామ్య కుటుంబాలు ఎప్పుడూ బ్రిటీషు గవర్నర్‌నే అనుసరించేవి. మళ్లీ ఏమిచేయాలన్న ప్రశ్న తలెత్తింది. తమతోటికాలనీ వాసుల అభిప్రాయానికి భిన్నంగా పెన్సిల్వేనియాకు చెందిన క్వేకర్ వ్యాపార ఉన్నత వర్గం బ్రిటన్ పట్ల విధేయతను కొనసాగించింది. అక్కడ ఏమి చేయాలి?

ఖండవ్యాప్త సమావేశం గుర్తించినా గుర్తించకపోయినా బహిష్కరణను అమలు చేయాలని ఆయా కమిటీలు ఇచ్చిన పిలుపు “పాత సంస్థల స్థానంలో విప్లవాత్మకమైన రీతిలో కొత్త సంస్థలు ముందుకొచ్చాయని” ప్రతిధ్వనించింది.

## వర్గం - సంఘర్షణ

వార్సెస్టర్ కౌంటీలో సాయుధ రైతులు కోర్టులు తమ విధులను నిర్వహించడానికి అడ్డుకోవలసి వచ్చింది. జడ్జీలు స్థానికులే అయినప్పటికీ తమ పదవులను విజయవంతంగా నిర్వహించడానికి కంకణం కట్టుకున్నందున వారిని ప్రజలు బలవంతంగా అడ్డుకోవలసి వచ్చింది. న్యూయార్క్ నగరంలో స్వతంత్ర నిర్ణయాలను అమలు చేయడమంటే పాత అధికారిక వ్యవస్థలను నిర్మూలించడమే కాకుండా పార్లమెంటు, రాజు నుండి విడిపోయినట్లే. అలా వ్యవహరించడానికి కావలసిన శక్తి ప్రజల నుండే వచ్చింది. సామాన్యప్రజలు, విప్లవ కమిటీల సభ్యులు ఈ శక్తిని అందించారు. వారాంతపు ప్లీనరీలు నిర్వహించే మెకానిక్‌లు ‘అధికారిక’ కమిటీని స్థాపించాలని ఒత్తిడి తెచ్చారు.

ఆ తర్వాత కమిటీల నుండి రాచరిక సభ్యులను తొలగించి మెకానిక్‌లు, వ్యాపారులు, ఇతర వృత్తి నిపుణులను నియమించాలని డిమాండ్ చేశారు. ఫిలడల్ఫియాలో సమావేశమైన 1,200 మంది మెకానిక్‌లు తమలోని యువమేధావులతో కమిటీని ఏర్పాటు చేశారు. వేలాది మందితో వీధి ప్రదర్శనలకు దిగాలని ఆ కమిటీ పిలుపునిచ్చింది.

‘శాంతియుతమైన’ బహిష్కరణ నుండి యుద్ధ పథానికి ఉద్యమం జరగడంతో క్షేత్రస్థాయి నుండి ప్రత్యక్ష చర్య మొదలైంది. మసాచ్యుసెట్స్‌లోని లెగ్జింటన్‌లో సాయుధ ప్రదర్శనకారులను బ్రిటీషుదళాలు కాల్చి చంపిన తర్వాత పౌల్ రిపియర్ అనే వృత్తిదారుడే

చరిత్రలోనే ప్రముఖమైన స్వారీని చేపట్టాడు. గుర్రంపై స్వారీచేస్తూ స్థానిక సాయుధ రైతుల వద్దకు చేరుకొని బ్రిటీషు దళాలు బోస్టన్ సమీపంలోని కాంకర్డ్ వద్ద దాచిన ఆయుధాలను స్వాధీనం చేసుకోవడానికి బయల్దేరాయని హెచ్చరించాడు. ఆ సాయుధ రైతులే లెగ్జింటన్ వద్ద బ్రిటిష్ దళాలతో తలపడ్డారు. తర్వాత బోస్టన్ చేరుకొని బంకర్ హిల్‌వద్ద గల బ్రిటీషుగ్యారిసన్‌ను (సైనిక స్థావరం) స్వాధీనం చేసుకున్నారు. పై ప్రతి ఉదంతంలోనూ మధ్యతరగతి, పేదవర్గాలకు చెందిన ప్రజలు బ్రిటీషు ప్రభుత్వంతో సంబంధం ఉన్న ఉన్నత, ధనిక వర్గాలను పక్కకు నెట్టేశారు. ధనిక వర్గాలు ఉద్యమంలో చేరడానికి లేదా మద్దతునివ్వడానికి అప్పటికీ సంశయిస్తూనే ఉండేవి.

అమెరికా విప్లవంపై రెండు ఉన్నతమైన గ్రంథాలను రచించిన ఎడ్వార్డ్ కంట్రీమాన్ సరిగ్గా విశ్లేషించినట్లు ఈ సంఘర్షణ ప్రజలు నెలకొల్పిన కొత్తసంస్థల వల్లే పుంజుకుంది. 1774-76 మధ్య ఈ కమిటీలు న్యూయార్క్‌లో వ్యవహరించినట్లే 1789-92 మధ్య పారిస్‌లోని కమిటీలు కూడా విప్లవ చర్యలను తీసుకున్నాయి. 1917లో రష్యాలో కూడా అలాగే జరిగింది.

అలాంటి ఉద్యమం 1776లో సంభవించిన ఘటనలకు కీలకమైంది. న్యూయార్క్‌లో బ్రిటన్‌కు వ్యతిరేకంగా చేపట్టే ఎలాంటి చర్యనైనా ధనిక వ్యాపారులు తీవ్రంగా ప్రతిఘటించేవారు. గవర్నర్‌పై ఆధారపడ్డ అధికారులు, కొందరు బడా భూస్వాములు కూడా ఉద్యమాన్ని వ్యతిరేకించారు. ఫిలడల్ఫియాలో పెన్సిల్వేనియా శాసనమండలికి చెందిన మెజారిటీ సభ్యులు స్వాతంత్ర్యాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ రెండు ప్రధాన నగరాల మద్దతులేనిదే బ్రిటన్‌తో యుద్ధంలో విజయం సాధించడం కష్టం. అయితే పాత ఆర్థిక, రాజకీయ ఉన్నత వర్గాలకు సవాళ్లు ఎదురైన కారణంగానే అలాంటి మద్దతును కూడగట్టగలిగారు. వృత్తిదార, సాధారణ వ్యాపార కుటుంబాల నుండి వచ్చినకొత్త, విప్లవకారులైన ప్రజలు కమిటీలపై నియంత్రణ సాధించడం అనివార్యమైంది. ఈ కమిటీలు ఎలాంటి సరుకులు దిగుమతి చేయాలో ఏ ఉత్పత్తులు ఎగుమతి చేయాలో నిర్ణయిస్తూ నగర జీవనంపై తీవ్రమైన ప్రభావం చూపాయి.

## ఆయుధాలుగా కరపత్రాలు

పాత ఉన్నత వర్గ రాజకీయ వ్యవస్థలు అట్టే మాయం కాలేదు. తమ పాలనపట్ల విధేయత చూపుతూ వచ్చిన పాత తరాల మానసిక అలవాట్లను ఆధారంగా చేసుకొని బ్రిటన్‌కు వ్యతిరేకంగా బయల్దేరిన ప్రతిఘటనను నీరుగార్చాలని అవి ప్రయత్నించాయి.

అలాంటి అలవాట్లను, పాలన పట్ల విధేయతను రూపుమాపడానికి విశాలమైన ఉద్యమంతోపాటు విస్తృతమైన ప్రచారం కూడా అవసరం. ప్రజా ఉద్యమం బహిష్కరణను అమలు చేయడానికి వాదన స్వరూపాన్ని సంతరించుకుంది. బహిష్కరణను ఉల్లంఘించే వారికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరపడంతోపాటు గవర్నర్లు, బ్రిటీషు మంత్రుల దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు. ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేశారు.

పాత ఆలోచనలను రూపుమాపేందుకు వాద ప్రతివాదనలతో ప్రచారం సాగింది. ఒక్క 1776లోనే 400 కంటే ఎక్కువ కరపత్రాలు వెలువడ్డాయి. అలాగే వందలాది దినపత్రికలు, వారపత్రికలు ప్రారంభమయ్యాయి. అయితే బ్రిటీషు వలసదారుడైన టామ్ పేయిన్ రాసిన 40 పేజీల కరపత్రం నిర్ణయాత్మకమైన పాత్రను పోషించింది.

1775 ప్రారంభంలో పేయిన్ ఫిలడల్ఫియాకు వచ్చాడు. తనతోపాటు బెంజమిన్ ఫ్రాంక్లిన్ నుండి సిఫార్సు పత్రాన్ని తీసుకొచ్చాడు. అతడు మధ్యతరగతి వర్గం నుండి వచ్చినవాడు. అప్పటికే ఆ వర్గం (చిన్న వ్యాపారులు, వృత్తిదారులు) రాజకీయ రంగంలో ప్రముఖ పాత్రను పోషించడం మొదలుపెట్టింది. ఇంగ్లాండ్‌లో టామ్‌పేయిన్ నావికాదళంలో పని చేశాడు. ఆబ్కారీ శాఖలోను, ఒకహోటల్‌లోను పని చేశాడు. అంతకుముందు అతడు వస్త్రాలను తయారు చేసేవాడు. నలభై ఏళ్ల ప్రాయంలో అతడు అమెరికాలో అడుగుపెట్టాడు. కొత్తగా ప్రారంభమైన వారపత్రికలో ఉద్యోగం సంపాదించాడు. సమానమైన రాజకీయ ఆలోచనలు గల వారికే ఆ పత్రిక వెళ్లేది. తన పాఠకుల వలే పేయిన్ కూడా బహిష్కరణను ఉత్సాహంగా సమర్థించాడు. కాని విప్లవ భావనతో కాదు "బ్రిటన్ పట్ల విధేయత సహజమైనది. ఆ సమయంలో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా గళం విప్పడం రాజద్రోహంతో సమానం" అని పేయిన్ తన స్మృతుల్లో రాసుకున్నాడు. 1775లో సంభవించిన సంఘటనలు – ముఖ్యంగా బ్రిటన్ అణచివేత చర్యలు తీవ్రం కావడం – పేయిన్ ఆలోచనాధోరణిని మార్చివేశాయి. స్వతంత్ర గణరాజ్యం ఏర్పడాల్సిన అవసరం ఉందని అతడు ఒక అభిప్రాయానికి వచ్చాడు. ఈ వైఖరి 1776 తొలినాళ్లలో ప్రచురితమైన 'కామన్‌సెన్స్' అనే కరపత్రంలో ప్రతిబింబిస్తుంది.

ప్రజారంజకమైన శైలిలో ఆ కరపత్రాన్ని పేయిన్ రచించాడు. వృత్తిదారుడు, సాధారణ వ్యాపారి భాష అందులో కనిపిస్తుంది. అయితే ఉద్యమ సాధనకే ఆ కరపత్రం పరిమితం కాలేదు.

ఉద్యమ డిమాండ్లను సమర్థించే విధంగా అందులో వాదనలను పొందుపరిచారు. హాబ్స్, లాకే, వాల్టెయిర్, రూసో ఆలోచనలను, సిద్ధాంతాలను ప్రస్తావించడం ద్వారా రాజకీయ, ఆర్థిక కార్యాచరణను పటిష్టం చేయడానికి పేయిన్ ప్రయత్నించాడు. సామాన్య జనానికి అర్థమయ్యే భాషలో వాదనలు, సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. ఇంగ్లాండ్‌లో శాస్త్రీయ ప్రసంగాలు, వాద ప్రతివాదనలకు హాజరైన సమయంలో చైతన్యోద్యమ ఆలోచనలు కొన్నింటిని పేయిన్ అవగతం చేసుకొని ఉండొచ్చు. ఈ దశలో అలాంటి ఆలోచనలు, భావాలను వాక్య రూపం ఇచ్చాడు. "రాజ మహారాజుల కంటే సమాజానికి నిజాయితీ గల మనిషి చాలా అవసరం," అని నొక్కిచెప్పాడు. పాలించే హక్కు తమకు దేవుడు ప్రసాదించాడని జార్జి-3 చేసిన వాదనను అతడు వెక్కిరించాడు. బందిపోటు ముఠా నాయకుడైన ఒక ఫ్రెంచి వ్యక్తి (పుట్టుక తెలియని) వారసత్వం నుండి జార్జి-3 పాలించే హక్కును పొందాడని ఎగతాళి చేశాడు.

పేయిన్ వేసిన కరపత్రం తీవ్రమైన ప్రభావం చూపింది. సుమారు 1,50,000 ప్రతులు అమ్ముడుపోయాయి. పెన్సిల్వేనియా రాజకీయ నాయకుడు బెంజమిన్ రష్ తర్వాత ఇలా రాశాడు :

> "కరపత్రం చూపిన ప్రభావం తక్షణమైనది, విశాలమైనది. అమెరికన్ ఆలోచనా ధోరణిని అది మార్చివేసింది. ప్రతి రంగంలో ఉన్న వారు దానిని చదివారు. క్లబ్బుల్లో, స్కూళ్లలో వాటిని చదివి వినిపించారు. ఒక ఉదంతంలో మత ప్రవచనం బదులు పురోహితుడు ఆ కరపత్రాన్ని చదివి వినిపించాడు."

వాదనలు ప్రజల వైఖరిని పూర్తిగా మార్చివేసిన చారిత్రక సందర్భాల్లో ఆ కరపత్రం వెలువడింది. పెన్సిల్వేనియాలోని ఉద్యమం తీవ్రతరమై విప్లవ చర్యలను తీసుకోవడానికి సంసిద్ధమైంది.

అనేక మంది ధనిక వ్యాపారులు, బడా భూస్వాములు బ్రిటీషు రాచరిక వ్యవస్థకు విధేయులుగానే ఉండిపోయారు. గత రెండేళ్లకాలంలో ఉద్యమంపట్ల ఆకర్షితులు కాని ప్రజలపై వారికి బాగా పట్టు ఉండేది. శాసనమండలిలో మెజారిటీ సాధించడానికి కీలకమైన నాలుగు స్థానాల్లో మూడింటిని వారే గెల్చుకున్నారు. స్వాతంత్ర్య ప్రకటనకు పెన్సిల్వేనియా శాసనమండలి మద్దతును కూడగట్టడం దాదాపు అసాధ్యంగా తోచింది. అలాంటి మద్దతు లేకుంటే ఇతర కాలనీల్లో కూడా పరిస్థితులు ప్రతికూలంగా మారే ప్రమాదం ఉండేది.

స్వాతంత్ర్యాన్ని గట్టిగా సమర్థించే వారి ముందు ఒకే ఒక్క మార్గం మిగిలింది. ఇంగ్లాండ్ విప్లవం సమయంలో నవీన ఆదర్శసైన్యం ఎంచుకున్న పంథా ఒక్కటే ప్రత్యామ్నాయ మార్గంగా తోచింది. ఇదే పంథాను 150 ఏళ్ల తర్వాత రష్యన్ విప్లవంలో కూడా అనుసరించారు. శాసనమండలి నిర్ణయాన్ని తోసిపుచ్చేందుకు విశాలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాల్సి వచ్చింది. కాలనీ భవిష్యత్‌ను నిర్ధారించేందుకు ప్రతినిధుల సమావేశాన్ని నిర్వహించాలని నాలుగు వేల మంది హాజరైన ఒక బహిరంగ సభ తీర్మానించింది. ఈ తీర్మానానికి కాలనీలోని సాయుధ కార్యకర్తల బృందం మద్దతు లభించింది. ఈ బృందం 'కమిటీ ఆఫ్ ప్రైవేట్స్'గా పిలవబడేది. పాత శాసనమండలి ఉన్నట్లుండి తన ప్రాబల్యాన్ని కోల్పోయింది. తన నిర్ణయాలను అమలుచేయడానికి దానికి సైనిక బలగాలు అందుబాటులో లేకుండా పోవడంతో నిరర్థకంగా మారిపోయింది. జూన్ 14న వాయిదా పడిన సభ మళ్లీ ఎప్పుడూ సమావేశంకాలేదు. జూన్ 18న జరిగిన సార్వత్రిక సభ ఎక్కడా లేని విధంగా అత్యంత విప్లవాత్మకమైన రాజ్యాంగాన్ని రూపొందించింది. జనాభాలోని 90 శాతం పురుషులకు ఓటు హక్కును రాజ్యాంగం ప్రసాదించింది. అయితే రాజుపట్ల విధేయతను త్యజించడానికి సిద్ధపడని వారికి ఓటు హక్కును నిరాకరించింది. కొద్ది రోజుల తర్వాత ఖండవ్యాప్త సమావేశం స్వాతంత్ర్య ప్రకటనను విడుదల

చేయడానికి రంగం సిద్ధమైంది. స్వాతంత్ర్యాన్ని గట్టిగా సమర్థించిన పెన్సిల్వేనియా జనాభాలోని ఒక వర్గం రాచరిక వ్యవస్థ సమర్థకులపై నిరంకుశ చర్యలు తీసుకోవడంవల్లే సంయుక్త రాష్ట్రాలు ఏర్పడగలిగాయి.

## విప్లవంలోనే అంతర్యుద్ధం

అమెరికా విప్లవం చాలా వరకు రక్తపాతానికి దూరంగా ఉందనే పరిగణిస్తారు. ఇరుదేశాల అధికార సైన్యాల మధ్య కేవలం కొద్దిపాటి ఘర్షణలే జరిగాయి. అయితే వాస్తవాలను పరిగణనలోకి తీసుకుంటే విప్లవంలో అంతర్యుద్ధం భాగం కావడంతో కొన్ని చోట్ల హింసాత్మక సంఘటనలు చోటు చేసుకున్నాయి. న్యూయార్క్‌లోని ట్రెయూన్ లోయపై రాచరిక భూస్వామ్య కుటుంబానికి చెందిన జాన్సన్‌లకు నియంత్రణ ఉండేది. విపక్షాన్ని, అసమ్మతిని తీవ్రంగా అణచి వేసేవారు. కొన్ని అంచనాల ప్రకారం యుద్ధం ముగిసే సమయానికి 700 భవనాలు అగ్నికి ఆహుతయ్యాయి. 12,000 వ్యవసాయక్షేత్రాలు ఖాళీ అయ్యాయి. వేలాది టన్నుల ధాన్యగింజలు నాశనమయ్యాయి. సుమారు 400 తిరుగుబాటు మహిళలు భర్తలను కోల్పోయారు. విప్లవకారుల సంతానమైన 2,000 మంది పిల్లలు అనాధలుగా మిగిలారు. తిరుగుబాటు వర్గం బలంగా ఉన్న ప్రాంతాల్లో బ్రిటీషు దళాలకు రాచరిక మద్దతుదారులు ఎలాంటి సహాయం అందించకుండా అడ్డుకోవడానికి తీసుకున్న కఠిన చర్యలవల్ల సాధారణ పౌరుల హక్కులు కాలరాయబడ్డాయి. అందుకే ఆయా కమిటీలు రాచరిక ప్రచురణలను సెన్సార్ చేశాయి. రాచరిక సైన్యంలో చేరిన వారి వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకున్నాయి. రాచరిక జడ్జీలకు ప్రజలు మసిబూసి అవమానించారు. టోరీలను నగ్నంగా వీధుల్లో పరుగెత్తించారు. యుద్ధం సమయంలో చాలా వరకు న్యూయార్క్ నగరం బ్రిటీషు సైన్యాల అధీనంలో ఉండేది. తిరుగుబాటుదారులు తిరిగి వచ్చిన తర్వాత ప్రజలను సమీకరించి బ్రిటీషు సమర్థకుల పట్ల వ్యతిరేక భావనను రగిల్చారు. 1783 సుమారు 20,000 మంది రాచరిక మద్దతుదారులు బ్రిటీషు ఓడల్లో నగరాన్ని వదలివెళ్లారు. టీపార్టీగా సంఘర్షణ ప్రారంభమైనా టీ పార్టీగానే ముగియలేదు.

యుద్ధం చాలా కాలం కొనసాగడం, ఆహార కొరత ఎక్కువ కావడంతో కమిటీలు రాచరిక ప్రాంతాలకు తిండి గింజలను ఎగుమతి చేయకుండా వ్యాపారులను అడ్డుకున్నాయి. ఉద్యమానికి మద్దతుగా నిలిచిన ప్రజలకు సరిపడా తిండిగింజలు లభించేలా చూశాయి. ధనికులపై పన్నుల శాతాన్ని పెంచాయి. ధరలను నియంత్రించి ఉద్యమ ద్రోహుల భూములను స్వాధీనం చేసుకున్నాయి. యుద్ధంలో విజయం సాధించాలంటే ఇలాంటి చర్యలు తీసుకోక తప్పలేదు. అయితే ఈ చర్యలు పేదలకు చాలా సహాయపడ్డాయి. ధనికుల సంపద పేదలకు ఉపయోగపడింది. ఈ తిరుగుబాటుకు సామాజిక స్వరూపమే కాకుండా జాతీయభావం కూడా తోడైంది.

వేరే మార్గంలో ఉద్యమం విజయవంతమై ఉండేది కాదు. న్యూయార్క్‌ను ముట్టడించి కాలనీలను వేరు చేయాలన్నదే బ్రిటీషు పాలకుల వ్యూహం. తీరప్రాంత వ్యాపారాన్ని అడ్డుకోవడం ద్వారా ప్రజలను కష్టాలకు గురి చేసి తదనంతరం బలమైన సైన్యాలతో కీలకమైన స్థావరాలు, పట్టణాలను స్వాధీనం చేసుకోవాలని యోచించారు. తమ కిరాయి సైన్యాలు అనుభవం లేని సాయుధ విప్లవకారులను తుదముట్టించగలవని విశ్వసించారు. అలా ఉద్యమాన్ని ఆదిలోనే నీరుగార్చి ప్రజల మనోబలాన్ని దెబ్బతీయాలని భావించారు. ఉద్యమం నుండి బడా భూస్వాములు, వ్యాపారులు వైదొలగాలని ఆశించారు. తమ సైన్యాలు వరుసగా విజయాలు సాధిస్తూ ఉంటే ఈ వర్గాలు బ్రిటీషుపాలనకు తలొగ్గుతారని ఊహించారు.

బ్రిటీషు వ్యూహం పూర్తిగా ఆచరణసాధ్యం కానిదేమీ కాదు. కష్టాలు ఎక్కువయ్యే కొద్దీ తిరుగుబాటు దళాలలో ఉత్సాహం తగ్గింది. న్యూయార్క్‌లో బ్రిటీషు పాలనతో అనేక మంది కుమ్మక్కయ్యారు. ఫిలడల్ఫియాను స్వాధీనం చేసుకోవడంలో కూడా కొందరు బ్రిటీషు దళాలకు సహకరించారు. అయితే బ్రిటీషు వ్యూహం ఒక్క కారణం చేత చతికిలబడింది. తిరుగుబాటు ఉద్యమానికి ప్రతిఘటన ప్రజాపునాదిని కమిటీలు బలంగా నిర్మించడంతో బ్రిటీషు పాలకుల పాచిక పారలేదు. ప్రజా ప్రతిఘటన కొనసాగినంత కాలం తిరుగుబాటు సైన్యం రాచరిక దళాలను నిర్వీర్యం చేయగలిగాయి. గెరిల్లా యుద్ధతంత్రాన్ని అవలంబించి శత్రు సైన్యాల ఆట కట్టించాయి.

వర్గ సమస్యలకే యుద్ధం పరిమితం కాలేదు. వర్జీనియాలో అత్యంత సంపన్నులైన తోట యజమానులు ఉద్యమంలో పాలుపంచుకోవడానికి సంతోషంగా అంగీకరించారు. తోట యజమాని అయిన జార్జ్ వాషింగ్‌టన్ అమెరికా సైన్యానికి కమాండర్‌గా వ్యవహరించాడు. బానిసల యజమాని అయిన జెఫర్సన్ 'స్వాతంత్ర్య ప్రకటన'ను రూపొందించాడు. న్యూయార్క్‌లో కొందరు భూస్వాములు, వ్యాపారులు బ్రిటీషు పాలనను సమర్థించారు. అయితే ఇతరులు ప్రతిఘటనలో చేరారు. పెన్సిల్వేనియాలో కూడా బెంజమిన్ ఫ్రాంక్లిన్ లాంటి సంపన్న వ్యక్తి తన పాత మిత్రులతో వేరుపడి స్వాతంత్ర్యాన్ని ఉత్సాహంగా సమర్థించాడు.

అంతకంటే ముఖ్యమైన విషయం నిర్ధారిత విజయం ఇలాంటి వ్యక్తుల శక్తియుక్తులపై వ్యూహరచనపై ఆధారపడింది. వీరు బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఫ్రెంచి రాచరిక వ్యవస్థతో జతకట్టారు. తిరుగుబాటు సైన్యాన్ని నడిపించడంలో ఫ్రెంచి సలహాదారులు వాషింగ్‌టన్‌కు సహాయపడ్డారు. ఫ్రెంచి నావికాదళం ఆయుధాలను సమకూర్చింది. ఫలితంగా బ్రిటీషు వ్యాపార నిర్బంధం పట్టు సడలిపోయింది.

తిరుగుబాటును కొన్ని ఉన్నతవర్గాలు సమర్థించినట్లే స్వాతంత్ర్య సమరంలో పాలుపంచుకోని మధ్యతరగతి, పేదవర్గాల ప్రజలు అనేకమంది ఉన్నారు. తమ ప్రయోజనాలను బ్రిటీషు పన్నులు ఏ విధంగానూ దెబ్బతీయడం లేదని ఈ వర్గాలు కొన్నిసార్లు భావించాయి. కనుక ఎంతో పవిత్రంగా భావించిన తమ విధేయతలను మార్చుకోలేకపోయాయి. అయితే

కొన్ని సార్లు తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వారి పట్ల వ్యతిరేకత కారణంగానే ఈ వర్గాలు ఉద్యమానికి దూరంగా ఉన్నాయి. గతంలో అలాంటి నాయకుల చేతిలోనే ప్రజలు అణచివేతకు, దోపిడీకి గురయ్యారు. ఆ విధంగా న్యూయార్క్ రాష్ట్రంలో అనేక మంది కౌలుదారులు బ్రిటీషు పాలనకు మద్దతునిచ్చారు. తాము ద్వేషించే భూస్వామి ఉద్యమానికి నాయకత్వం వహిస్తూ ఉండడమే అందుకు కారణం. అలాగే ఉత్తర, దక్షిణ కారోలీనా రాష్ట్రాలలోని కొన్ని ప్రాంతాల్లో పేద రైతులు టోరీ గెరిల్లాలుగా అవతారమెత్తి ఆయుధాలను చేతపట్టారు. స్వాతంత్ర్యాన్ని కోరుకున్న తోటయజమానుల పట్ల ఉన్న రాగద్వేషాల వల్లే వారు అలా వ్యవహరించారు. ఈ పరిస్థితి వల్ల ఇరుపక్షాలు హింసకు, రక్తపాతానికి పాల్పడ్డాయి. ఉత్తర అమెరికాలో తీవ్ర అణచివేతకు గురైన రెండు వర్గాల – నల్లజాతి బానిసలు, స్థానిక అమెరికన్లు– మద్దతును బ్రిటీషు పాలకులు విప్లవసైన్యాల కంటే ఎక్కువ స్థాయిలో కూడగట్టగలిగారు. వర్జీనియాకు చెందిన రాచరిక గవర్నర్ బ్రిటీషు సైన్యం పక్షాన పోరాడే బానిసలకు విముక్తిని ప్రసాదిస్తామని హామీ ఇచ్చాడు. ఫలితంగా బానిసలు గణనీయమైన సంఖ్యలో బ్రిటీషు దళాల్లో చేరారు. యుద్ధం ముగిసిన తర్వాత సైన్యం వదలి వెళ్లారు. అందుకు విరుద్ధంగా, 1779లో తిరుగుబాటు సైన్యంలో చేరితే కారోలీనా, జార్జియా బానిసలకు విముక్తి కల్పిస్తామని కాంగ్రెస్ చేసిన సూచనను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు కనీసం పరిగణనలోకి కూడా తీసుకోలేదు. అయితే దీనర్థం స్వాతంత్ర్యోద్యమమంతా బానిసత్వానికి అనుకూలంగా ఉందని కాదు. న్యూ ఇంగ్లాండ్‌లో అనేక మంది తిరుగుబాటుదారులు బానిసత్వాన్ని శాపంగా పరిగణించారు. అనేక మంది వ్యక్తిగతంగా నల్లజాతీయులు శ్వేతజాతీయులతో భుజం కలిపి స్థానిక తిరుగుబాటు దళాలలో పని చేశారు. 1780లో మసాచ్యుసెట్స్, వెర్మోంట్ రాష్ట్రాలు బానిసత్వాన్ని రద్దు చేశాయి. దశల వారీగా బానిసత్వాన్ని నిర్మూలించాలని ఫిలడల్ఫియా నిర్ణయించింది. మారిలాండ్‌లో పేద శ్వేతజాతీయులు, నల్లజాతీయులు ఉమ్మడి ప్రయోజనాల సాధనకు పోరాడాలని యోచించారు. చివరికి వర్జీనియాలో కూడా తోట యజమానులు బానిస వ్యవస్థ లేకుండానే మనుగడ సాగించగలమని ఆలోచించడం మొదలు పెట్టారు.

వలసదారుల కంటే ఇండియన్ల మద్దతును కూడగట్టడంలో బ్రిటీషు సమర్థకులు ఎక్కువ విజయాన్ని సాధించారు. ఎందుకుంటే వలసదారులు, దళారులు స్థానికుల భూములను కబ్జా చేయడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు. బ్రిటీషు పాలనను తీవ్రంగా వ్యతిరేకించిన వారు కూడా స్థానిక ప్రజల పట్ల శత్రుభావంతో వ్యవహరించారు.

బ్రిటన్ నుండి కాలనీలు రాజకీయంగా వేరుపడడమే అమెరికా విప్లవమని భావించకూడదు. యుద్ధ బీభత్సకాండ నుండి కొత్త సమాజం ఆవిర్భవించింది. క్యాపిటలిస్టు యుగం ఏర్పడక ముందు ఉండే గతానికి తీసుకెళ్లే లక్షణాలను సమాజం పూర్తిగా రూపుమాపింది.

న్యూయార్క్‌లో బడా భూస్వాములకు ఉండే ఫ్యూడల్ హక్కులు అంతరించాయి. గొప్ప కుటుంబాల' పట్ల ప్రజల్లో గౌరవాభిమానాలు సన్నగిల్లాయి. ఉత్తర, మధ్య అమెరికా

కాలనీల్లోని వేలాది మంది ప్రజలు సమానత్వం, స్వేచ్ఛ అనే ఆలోచనలను పుణికిపుచ్చుకున్నారు. అణచివేత నుండి బయటపడ్డారు. పై సిద్ధాంతాలు నల్లజాతీయులు, శ్వేతజాతీయులిద్దరికీ సమానంగా వర్తించాలని కోరుకున్నారు. ఐరోపా చైతన్యోద్యమ కార్యకర్తలకు 'స్వాతంత్ర్య ప్రకటన'లో ఉపయోగించిన భాష తమ జీవితాశయాలను పరిపూర్ణం చేసినదిగా తోచింది.

విప్లవాన్ని బలోపేతం చేయడానికి అహర్నిశలు కృషి చేసిన తిరుగుబాటు దళాలు అధికారాన్ని ఎక్కడా తమ చేతుల్లోనే ఉంచుకోలేదు. పెన్సిల్వేనియా లాంటి ప్రాంతాల్లో కొంత కాలం పాటు మధ్యతరగతి, పేదవర్గాలకు నిర్దిష్టంగా లబ్ది కలిగించే చర్యలన్నెంటినో తీసుకున్నాయి. రాష్ట్రాల రాజ్యాంగాలు ప్రతి పురుషునికి ఓటు హక్కును ప్రసాదించాయి. వార్షిక సమావేశాలు, ధరల నియంత్రణ, రైతులకు రుణభారం నుండి రక్షణకు హామీ ఇచ్చాయి. అయితే 1788లో ఫెడరల్ రాజ్యాంగాన్ని రాష్ట్రాలు అంగీకరించేనాటికి అమెరికా వ్యాప్తంగా స్వేచ్ఛా మార్కెట్‌ను ఏర్పాటు చేయడానికి కంకణం కట్టుకున్న శక్తులు రాష్ట్ర శాసన మండళ్లపై ఆధిపత్యాన్ని సాధించాయి. ఫలితంగా ఎన్నడూ లేని విధంగా ఆర్థిక వ్యవస్థలో మార్పు తీసుకురావడానికి మార్గం సుగమమైంది. కాని అదే సమయంలో అణచివేత, దోపిడీ పాత, కొత్త స్వరూపాలు విస్తరించాయి, మరింత తీవ్రమయ్యాయి.

రెండవ అధ్యాయం

# ఫ్రెంచి విప్లవం

"ఈ రోజు ఇక్కడ ప్రపంచ చరిత్రలో కొత్త యుగం ప్రారంభమైంది", అని 1792 వేసవిలో జర్మన్ చైతన్యోద్యమ అగ్రనాయకుడు గోథే రాశాడు.

ఆ సంవత్సరానికి ముందు డచ్ సాంప్రదాయవాద నాయకుడు వాన్ హోజెన్‌డార్ప్ తన చుట్టూ సంభవిస్తున్న పరిణామాలను వీక్షించాడు. " అన్ని దేశాల్లోనూ రెండు గొప్ప పక్షాలు ఏర్పడుతున్నాయి. ఒకటి, చర్చి- రాజ్యానికి చెందిన పార్టీ. జనబాహుళ్యంపై ఒకరికి లేదా ఒక చిన్న సమూహానికి పాలించే హక్కు దైవసంభూతమైనదని, దానికి చర్చి మద్దతు ఉంటుందని ఈ పక్షం బలంగా నమ్ముతుంది. రెండవది, పాలించే ఎలాంటి హక్కు ఇవ్వని పక్షం. ప్రజలు ఐచ్ఛికంగా పాలనకు కట్టుబడి ఉంటామని అంగీకరిస్తే తప్ప ఎలాంటి ప్రభుత్వం ఉండలేదని నమ్మిన పక్షమది. ప్రభుత్వ పాలనలో పాలుపంచుకునే వ్యక్తులందరూ తమ చర్యలకు బాధ్యత వహించాలని అది కోరుకుంటుంది," అని వాన్ హోజెన్‌డార్ప్ రాశాడు.

ఈ రెండు మహాపక్షాలు ఉత్తర ఫ్రాన్స్‌లోని వాల్మీ వద్ద కురుక్షేత్రంలో తలపడినప్పుడు రెండవ పక్షం విజయం సాధించడం గోథేను ఉత్సాహపరచింది. ఫ్రెంచి విప్లవ శక్తులు ఐరోపాలోని సగం రాచరిక సైన్యాలను ఓడించి ఉన్నాయి.

పదేళ్ల తర్వాత ఫ్రాన్స్‌లో విప్లవమనే ఆలోచన అనేకమంది మేధావులకు వ్యర్థమైనదిగా తోచింది. ఐరోపా అంతటిని చుట్టుముట్టే విప్లవం ఒకటి వస్తుందన్న ఆలోచన వారి దరిదాపుల్లోకి కూడా రాలేదు. ఫ్రెంచి రాచరిక వ్యవస్థ సుమారు వెయ్యేళ్ల నుండి పాలిస్తోంది. సుమారు 140 ఏళ్ల పాటు దాని ప్రాబల్యానికి ఎలాంటి సవాలు ఎదురు కాలేదు. 'రవిరాజు' అయిన లూయీ 14 వర్సెయిల్స్‌లోని అతడి మహాసంస్థానం నిరంతర నిరంకుశత్వానికి చిహ్నంగా ఉండేది. అలాంటి నిరంకుశత్వం ఫ్రాన్స్‌ను ఐరోపాలో గొప్ప శక్తిగా నిలబెట్టింది. అలాంటి గొప్ప వారసత్వాన్ని రవిరాజు వారసులు లూయీ 15, లూయీ 14 పొందారు.

అయినప్పటికీ 1789 వేసవిలో అలాంటి అధికారం ఉన్నట్లుండి క్షీణించడం మొదలు పెట్టింది. ఫ్రెంచి సమాజంలో మూడు ప్రధానమైన అధికార కేంద్రాల ప్రతినిధుల సమావేశాన్ని రాజు ఏర్పాటు చేశారు. పురోహితులు, సంస్థానాధీశులు, ప్రజాప్రతి నిధులు హాజరయ్యారు. పన్నుల రాబట్టుకునే మార్గాల గురించి చర్చించారు. అయితే ప్రజాప్రతినిధులు మాత్రం సంస్థానాధీశుల ప్రతిపాదనలను

అంగీకరించేందుకు నిరాకరించారు. రాజు చెప్పిందే వేదమన్న సూత్రాన్ని కూడా తిరస్కరించారు. తమను తాము జాతీయ అసెంబ్లీగా ప్రకటించు కున్నారు. టెన్నిస్ కోర్టులో సమావేశమయ్యారు. అంతకుముందు రాజు వారిని సమావేశ మందిరం నుండి గెంటివేసి తలుపులు మూసేశాడు. రాజు తమకు రాజ్యాంగం ప్రకటించే వరకు కదిలేది లేదని ప్రతిజ్ఞ చేశారు. సుమారు 20,000 మంది సైనికులను రప్పించడం ద్వారా రాజు తన ప్రతిస్పందనను తెలియజేశాడు. పాలనా సంస్కరణ పట్ల అనుకూల వైఖరిని ప్రదర్శించిన తన మహామంత్రి నెకర్‌ను పదవి నుండి తొలగించాడు.

ప్రజాప్రతినిధులందరూ మధ్యతరగతికి చెందినవారే. వారిలో అనేకమంది సంపన్న కుటుంబాల నుండి వచ్చిన వారూ ఉన్నారు. సగం మంది వరకు న్యాయవాదులు ఉండగా, మిగతా వ్యాపారులు, బ్యాంకర్లు, ఉత్పత్తిదారులు, సంపన్నమైన మధ్యతరగతి రైతులు. ప్రజాప్రతినిధుల్లో కనీసం ఒక్క వృత్తిదారుడు కాని సామాన్యరైతు కాని ఉండేవారు కాదు. రాచరిక వ్యవస్థ ఉండాలని వారు కోరుకున్న రాజ్యాంగబద్ధమైన పాలన ఉండాలని డిమాండ్ చేశారు. ఎన్నికల రంగంలో 'ఆస్తి అర్హతలను నిర్దిష్టంగా నిర్ధారించాలని కోరారు. అణచివేతకు లొంగిపోవడానికి వారు సిద్ధపడలేదు. వర్సెయిల్స్‌లో చోటు చేసుకున్న వాద ప్రతివాదనలు పారిస్ ప్రజల్లో ఉద్యమ జ్వాలలను రగిల్చాయి. అప్పటి వరకు వారు రాజకీయాల గురించి ఏ మాత్రం ఆలోచించలేదు. క్లబ్బులు ఏర్పడ్డాయి. తొలుత మధ్యతరగతి వారే వాటిలో సభ్యులుగా చేరారు. రాజకీయ పరిణామాలపై క్లబ్బుల్లో చర్చలు జరిగాయి. లెక్కలేనన్ని వార్తాపత్రికలు, కరపత్రాలు వెలువడ్డాయి. పారిస్ మధ్యతరగతికి చెందిన 400 మంది ప్రతినిధులు సిటీహాల్‌లో సమావేశమై తమను తాము నగర పాలకమండలిగా లేదా కమ్యూన్‌గా ప్రకటించుకున్నారు.

## ఫ్రెంచి విప్లవ పరిణామక్రమం

| | | |
|---|---|---|
| **1787-88** | : | పెద్ద వ్యవసాయ క్షేత్రాలపై పన్నును వ్యతిరేకించిన సంస్థానా ధీశులు. సంస్థానాధీశుల సమావేశాన్ని ఏర్పాటు చేయడానికి అంగీకరించిన రాజు. |
| **ఏప్రిల్ 1789** | : | వర్సెయిల్స్‌లో ఎస్టేట్స్ జనరల్ సమావేశం |
| **జూన్ 1789** | : | మూడవ ఎస్టేట్ ప్రతినిధులు (ప్రజాప్రతినిధులు) జాతీయ అసెంబ్లీని ప్రకటించారు. |
| **జూలై 1789** | : | బాస్టిల్ కారాగారాన్ని ముట్టడించిన పారిస్ ప్రజలు |
| **అక్టోబరు 1789** | : | వర్సెయిల్స్‌కు మహిళల ప్రస్థానం. రాజును పారిస్‌కు మళ్లీ ఈడ్చుకొచ్చిన ప్రజలు లఫాయెట్ జాతీయ భద్రతా సిబ్బంది నియంత్రణలో నగరం రాజ్యాంగ రాచరిక వ్యవస్థ ఏర్పాటు. |
| **జులై 1790** | : | పారిస్‌లో ఫెడరేషన్ విందు రాజు, ప్రజల మధ్య సామర్యతను వేడుకలా జరుపుకున్న ప్రజలు. |
| **1791 వసంతం** | : | పారిస్ నుండి పారిపోవడానికి ప్రయత్నించిన రాజు. |
| **జులై 1791** | : | చాంప్స్‌డి మార్స్‌లో ప్రజలను ఊచకోత కోసిన భద్రత సిబ్బంది. |
| **ఆగస్టు 1791** | : | సెయింట్ డొమింగో (హైతీ) లో ప్రారంభమైన బానిసల తిరుగుబాటు |

| | | |
|---|---|---|
| **సెప్టెంబరు 1791** | : | ఆస్తి అర్హతలతో రాజ్యాంగం |
| **జనవరి 1792** | : | పారిస్‌లో ఆహార లూటీలు |
| **ఏప్రిల్ 1792** | : | ఆస్ట్రియా, ప్రష్యాలపై యుద్ధం ప్రకటించిన గిరోన్డిన్ ప్రభుత్వం, తీవ్రమైన సైనిక పరాభవం |
| **అగస్టు 1792** | : | పారిస్‌లో వేర్పాటువాద యాత్ర, నిర్బంధంలోరాజు. ప్రభుత్వంలో చేరిన డాంటన్. |
| **సెప్టెంబరు 1792** | : | వాల్మీలో విజయం, పురుష ఓటు హక్కుతో కన్వెన్షన్ ఎన్నిక |
| **జనవరి 1793** | : | రాజుకు బహిరంగ మరణశిక్ష |
| **ఫిబ్రవరి 1793** | : | యుద్ధంలో చేరిన బ్రిటన్ |
| **1793 వసంతం** | : | పారిస్ వైపు కదలిన దురాక్రమణ సైన్యాలు. పశ్చిమ ఫ్రాన్స్‌లో రాచరిక ఉద్యమాలు. |
| **మే-జూన్ 1793** | : | పారిస్‌లో ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమం; రోబెస్పియర్, డాంటన్ నేతృత్వంలో జాకోబిన్ ప్రభుత్వం; అంతర్యుద్ధం |
| **1793 వేసవి** | : | మారత్ హత్య, భూస్వామ్య చెల్లింపుల నిలిపివేత, తూలాన్‌ను బ్రిటీషు దళాలకు అప్పగించిన రాచరికవాదులు. |
| **సెప్టెంబరు 1793** | : | పారిస్‌లో యాత్ర, గరిష్ట ధరలను నిర్ధారిస్తూ చట్టం, అరాచకం మొదలు. |
| **అక్టోబరు - డిసెంబరు1793** | : | రాచరికవాద, గిర్దోనిస్టు తిరుగుబాట్లు అణచివేత |
| **ఫిబ్రవరి 1794** | : | ఫ్రెంచి సామ్రాజ్యమంతటా బానిస వ్యవస్థను రద్దు చేసిన జాకోబిన్లు |
| **మార్చి- ఏప్రిల్ 1794** | : | తొలుత హెబర్ట్, తర్వాత డాంటన్‌ను ఉరి తీసిన జాకోబిన్లు, అన్ని ప్రాంతాల్లోనూ విజయం సాధించిన విప్లవసైన్యాలు. |
| **జూన్- జులై 1794** | : | మహా అరాచకం |
| **జులై 1794** | : | రోబెస్పియర్, ఇతర జాకోబిన్లకు ఉరి తీయించిన థెర్మిడార్ |
| **నవంబరు-డిసెంబరు1794** | : | జాకోబిన్ క్లబ్ మూసివేత; గరిష్టధరల చట్టం రద్దు |
| **మార్చి -మే 1795** | : | చివరి ప్రజా ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేసిన ప్రభుత్వం, 1200 మంది నిర్బంధం, 36 మందికి ఉరి. |
| **సెప్టెంబరు 1795** | : | పరిమిత ఓటు హక్కుతో కొత్త రాజ్యాంగం; రాచరికవాద ఉద్యమాన్ని అణచివేయడానికి బోనాపార్టేపై ఆధారపడ్డ ప్రభుత్వం; ఐదుగురు సభ్యులు గల డైరెక్టరీ చేతిలో సంపూర్ణ అధికారం |
| **నవంబరు 1799** | : | అధికారాన్ని హస్తగతం చేసుకున్న బోనాపార్టే, తొలి మంత్రిగా ప్రమాణం |
| **1804** | : | తనను తాను నెపోలియన్-1 చక్రవర్తిగా ప్రకటించుకున్న బోనాపార్టే |

## బాసిలీ పతనం - తదనంతర పరిస్థితి

గతంలో ఎన్నడూ లేని విధంగా సైనిక తిరుగుబాటు రావడం తథ్యమని వదంతులు వ్యాపించడంతో పారిస్ నగర ప్రజలు అప్రమత్తమయ్యారు. జులై 12న మురికివాడలకు చెందిన పేద ప్రజలు నగరంలో ప్రదర్శన నిర్వహించి అందుబాటులో ఉన్న ప్రతి తుపాకీని హస్తగతం చేసుకున్నారు. రెండు రోజుల తర్వాత అంత కంటే ఎక్కువ జనం ప్రదర్శన జరిపింది. నగరంపై రాచరిక నియంత్రణకు చిహ్నంగా ఉన్న బాస్టిల్ కారాగారం వైపు కదిలింది. వంద అడుగుల ఎత్తయిన ప్రాకారంతో 80 అడుగుల వంతెనతో ఆ కారాగారం దుర్భేద్యంగా ఉండేది. ఇదో నిరసన ప్రదర్శనగా ముగియలేదు. తుపాకీల కోసం మందుగుండును అక్కడ భద్రపరిచారు. ప్రభుత్వానికి వ్యతిరేకులైన అనేకమంది అక్కడ నిర్బంధించి ఉన్నారు. కారాగారాన్ని స్వాధీనం చేసుకొని తీరాలని ప్రజలు తీర్మానించుకున్నారు. కారాగార పరిరక్షకులు ఫిరంగులతో కాల్పులు మొదలుపెట్టారు. కాల్పులు మూడు గంటల పాటు కొనసాగాయి. అందులో 83 మంది మృతి చెందారు. హోటల్ డెస్ ఇన్వాలిడ్స్ నుండి స్వాధీనం చేసుకున్న ఫిరంగులను ప్రజలు స్వయంగా ఈడ్చుకొచ్చారు. కారాగారాన్ని, దాని చుట్టూ ఉన్న నివాస ప్రాంతాన్ని పేల్చి వేస్తామని హెచ్చరించిన తర్వాత కమాండర్ బాస్టిల్‌ని ప్రజలకు అప్పగించాడు. విప్లవం నగరంపై పట్టును సాధించింది. ఇదే ఉదాహరణను దేశవ్యాప్తంగా ఉన్న పట్టణాల్లో వరుసగా అనుసరించారు.

బాస్టిల్ పతనం ఫ్రెంచి విప్లవంలో తొలి కీలక మలుపు. పారిస్ ప్రజల చర్య జాతీయ అసెంబ్లీని ఉత్తేజపరిచింది. భూస్వామ్య వ్యవస్థను రద్దు చేస్తూ అది ఒక చట్టాన్ని జారీ చేసింది (ఫ్యూడల్ బకాయిలను నిలిపివేయడానికి రైతులు నష్టపరిహారం చెల్లించాలని అసెంబ్లీ కోరుకుంది) ప్రజల హక్కులు (పురుషుల) పత్రాన్ని జారీ చేసింది. అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో వాడిన పదజాలాన్ని అందులో పొందు పరిచింది. సైనిక తిరుగుబాటుకు మరోసారి ప్రయత్నించిన రాజు ప్రజా ఉద్యమం రావడంతో విఫలమయ్యాడు. పారిస్ మురికి వాడలకు చెందిన పేద ప్రజలు వర్సెయిల్స్ వైపు కదిలారు. తమ వెనుక 20,000 మంది సాయుధులను సమీకరించారు. రాజభవనంలోకి చొరబడి తరుతో పాటు రాజు పారిస్‌కు తిరిగి వచ్చేలా ఒత్తిడి చేశారు. పారిస్‌లో రాజును ప్రజల పర్యవేక్షణలో ఉంచారు.

అయితే రాచరిక వ్యవస్థను పూర్తిగా నిర్మూలించే దశకు ఈ చర్య చాలా దూరంగా ఉంది బాసిలీని ముట్టడించిన ప్రజలు, వర్సెయిల్స్‌కు ప్రదర్శనగా వెళ్లిన మహిళలు తమ స్వంత చొరవ మేరకు అలా చేశారు. పేద ప్రాంతాలను తీవ్ర ఇక్కట్లకు గురిచేసిన ఆహార కొరతలు, రాజు వందిమాగధులపట్ల ప్రజల్లో ఉన్న శత్రుభావం ఈ చర్యలకు దారి తీశాయి. అయినప్పటికీ ప్రజలు మూడవ ఎస్టేట్ ప్రతినిధుల నాయకత్వాన్ని అంగీకరించారు. ఉన్నత, మధ్యతరగతి వర్గాలకు చెందిన ప్రజాప్రతినిధులు కేవలం పరిమిత మార్పునే కోరుకున్నారు. ఈ వర్గాలు జాతీయ భద్రతా దళానికి సైనిక అధికారాలను సంపూర్ణంగా అప్పగించాయి. ఈ దళంలో మధ్యతరగతికి చెందిన సంపన్నులే ఎక్కువగా చేరారు. దళానికి లఫాయెట్ నాయకత్వం వహించాడు. ఇతడు మాజీ సంస్థానాధీశుడు, సైనికాధికారి. అమెరికా స్వాతంత్ర పోరాటంలో రాజకీయ సలహాదారునిగా వ్యవహరించడం వల్ల అతడికి ప్రజాస్వామ్యవాదిగా గుర్తింపు వచ్చింది. అతడి నాయకత్వంలో జాతీయ అసెంబ్లీ రాజ్యాంగ రూపకల్పనకు పూనుకుంది. అయితే ఓటు హక్కుకు పరిమితులు విధించింది. ఆస్తులను కొలబద్దగా తీసుకొని ఓటు హక్కును ప్రసాదించింది. అంటే పన్నులు చెల్లిస్తూ

సమాజంలో క్రియాశీల పాత్రపోషించే వారికే ఓటు హక్కు పరిమితమైంది. కొత్త చట్టాన్ని రెండేళ్ల వరకు వాయిదా వేసే అధికారాన్ని రాజుకు అప్పగించింది. రాజు, అసెంబ్లీల మధ్య ఐక్యతను సాధించి కొత్తగా సృష్టించబడిన వ్యవస్థతో ప్రజలు సంతోషిస్తారని ఆశించారు. అధికారంలో ధనికులు, పేదలకు సమానంగా వాటా ఉండగలదని హామీ ఇచ్చారు. తొలుత అనేకమంది ఈ ఏర్పాటుపై హర్షం వ్యక్తం చేశారు. విముక్తి, సంతృప్తి భావన సర్వత్ర ఉండేది. బాసిలీ ముట్టడి తొలి వార్షికోత్సవాన్ని రాజు, మాజీ సంస్థానాధీశులు, మధ్యతరగతి వర్గాలు, పారిస్ వాసులు సంయుక్తంగా జరుపుకున్నారు. ఈ ఉత్సవాన్ని 'ఫెడరల్ విందు' గా చరిత్రలో పరిగణిస్తారు.

సమైక్యతాభావన ఎంతో కాలం నిలవలేదు. తమ పాత ప్రయోజనాలు కోల్పోయామన్న కోపంతో సంస్థానాధీశులు ఉండేవారు. తమ సంపదకు ఎలాంటి ముప్పు లేనప్పటికీ అధికారం, పరపతి క్షీణించడం వారిలో అసంతృప్తి జ్వాలలను రేపింది. అనేక మంది విదేశాలకు తరలివెళ్లారు. అక్కడి నుండి స్వదేశంలో ఉన్న తమ తోటి సంస్థానాధీశులతో చేతులు కలిపి విప్లవాన్ని కూల్చివేయాలని కుట్ర పన్నారు. విదేశీ దండయాత్రను ఆహ్వానిస్తూ ఫ్రాన్స్ రాజు, రాణిలు ఇతర రాచరిక కుటుంబాలకు లేఖలను రహస్యంగా పంపారు.

అదే సమయంలో తమ జీవన ప్రమాణాలు ఏ మాత్రం మెరుగుపడలేదన్న అసంతృప్తి గ్రామీణ, పట్టణ ప్రజానీకంలో పెరిగింది. అంతకుముందు 1789 వేసవిలో రైతులలో ఆగ్రహజ్వాలలు చెలరేగాయి. తీవ్ర భయోత్పాతాన్ని సృష్టించారు. సంస్థానాధీశుల వ్యవసాయ క్షేత్రాలను ఆక్రమించారు. భూస్వామ్య రుణ పత్రాలను కాల్చివేశారు. నగరాలలో, వ్యాపార కేంద్రాలైన పట్టణాలలో ఆహారకొరతలు, అధికధరలు, నిరుద్యోగం తదితర అంశాలపై వరుసగా ఉద్యమాలు జరిగాయి. పర్యవసానంగా సంస్థానాధీశులు, పెట్టుబడిదారుల పట్ల ప్రజల్లో తీవ్ర ద్వేషభావం పెరిగింది. ఆలోచనలు, సిద్ధాంతాలు వెల్లువలా వచ్చి పడ్డాయి. దినపత్రికల స్థాపన అందులో కీలక పాత్ర పోషించింది. ఒక్క 1789లోనే చివరి ఆరు మాసాల్లో 250 పత్రికలు ప్రచురణ ప్రారంభించాయి. సమాజంలో జరుగుతున్న సంఘటనలను చర్చించడానికి సమావేశమయ్యే రాజకీయ మండళ్ల ప్రభావం కూడా గణనీయంగా విస్తరించింది. ఆ సమయంలో పారిస్‌లో అత్యంత ప్రముఖమైన మండళ్లలో జాకొబిన్ మండలి అగ్రభాగాన ఉండేది. ఉత్తర ప్రాంత పట్టణమైన అర్రాస్ నుండి వచ్చిన న్యాయవాది రోబెస్పియర్ దానికి సంచాలకునిగా వ్యవహరించాడు. దేశంలో ఉన్న ఇతర రాజకీయ మండళ్లతో అతడుసమన్వయం సాధించాడు. డాంటన్ అనే మరో న్యాయవాది కార్డెలియర్ మండలిని నిర్వహించేవాడు. సభ్యులకు అది బాగా అందుబాటులో ఉండేది. మండలి సభ్యత్వ రుసుము తక్కువగా ఉండడంతో సాధారణ పౌరులు అనేక మంది అందులో చేరారు. జీన్ పాల్ మరాత్ ప్రచురించే ల అమీదుపీపుల్ (ప్రజాగళం) అనే దినపత్రిక ఈ మండలి సభ్యులను తీవ్రంగా ప్రభావితం చేసేది. అయితే రెండేళ్ళ వరకు లఫాయెట్ నెలకొల్పిన రాజ్యాంగ రాచరిక వ్యవస్థ రాజకీయ రంగాన్ని శాసించింది. సరిహద్దు వెంబడి పోగువుతున్న విప్లవ ప్రతీఘాత సైన్యాలతో చేతులు కలిపేందుకు 1791 జూన్‌లో పారిస్‌నుండి పారిపోవడానికి ప్రయత్నించిన రాజు అందులో విఫలమయ్యాడు. స్థానిక సాయుధ దళాలను అప్రమత్తం చేయడంలో ఒక గ్రామీణ తపాలా ఉద్యోగి చూపిన తెగువ కారణంగా రాజు సరిహద్దుకు చేరుకోలేకపోయాడు. జాతీయ అసెంబ్లీలోని ఒక ప్రబలమైన వర్గం రాచరిక వ్యవస్థకు ఎలాంటి సవాలు ఎదురైనా దానిని తిరస్కరించేవారు. "విప్లవం ఇక

ముగిసింది," అని వారు ప్రకటించారు. రాజు అపహరణకు గురయ్యాడని వదంతులను సృష్టించారు."రాచరిక వ్యవస్థ కూల్చివేతే మన ముందున్న ప్రధాన ముప్పు. అదే జరిగితే ఆస్తి అనే సిద్ధాంతం పతనమవుతుంది," అని బార్నేవ్ అనే నాయకుడు ప్రకటించాడు. జీన్ పాల్ మరాత్ అజ్ఞాతవాసంలో వెళ్లాల్సి వచ్చింది. బ్రిటన్‌లో కొంతకాలం పాటు ఆయన రహస్య జీవితాన్ని గడిపాడు. లి చాపెలియర్ చట్టాలు కార్మిక సంఘాలు, సమ్మెలను నిషేధించాయి. జాతీయ భద్రతాదళం చాంప్ డిమార్స్ వద్ద గణరాజ్యం కోసం వినతి పత్రంపై సంతకం చేయడానికి గుమికూడిన వేలాది మంది ప్రజలపై కాల్పులు జరిపింది. సరిగ్గా 12 నెలల క్రితం అదే వేదికలో ఫెడరల్ విందును ఘనంగా నిర్వహించి ఉన్నారు. కాల్పుల సంఘటనలో 50 మంది వరకు మరణించారు. ఈ విషయాన్ని చాలా తక్కువగా ప్రస్తావించారు. అందుకు భిన్నంగా రాణి మారీ ఆంటోయినెట్ అనుభవించిన శిక్షకు ఎనలేని ప్రాధాన్యత ఇచ్చారు.

అయితే అణచివేత చర్యలు ఉప్పొంగుతున్న ప్రజా ఉద్యమాన్ని ఆపలేకపోయాయి. ఆహార సరఫరాల కొరత, అధిక ధరలు, నిరుద్యోగం కారణంగా వృత్తిదారులు, వ్యాపారులు,(సాధారణ వ్యాపారులు, వీరిని సాన్స్-క్యులోట్స్ అని పిలిచేవారు. ధనిక వర్గాలు ధరించే పొడవాటి వస్త్రాల స్థానంలో ట్రౌజర్లు ధరించడం వల్లే వారికి ఆ పేరు వచ్చింది), చివరికి కార్మికులు కూడా దిక్కుతోచని స్థితికి చేరుకున్నారు. 1792 జనవరి, ఫిబ్రవరి నెలల్లో పారిస్‌లో ఆహార లూటీలు మధేచ్ఛగా జరిగాయి. అలాగే గ్రామీణ ప్రాంతాల్లో పేద రైతులు మార్కెట్లను ముట్టడించి మొక్కజొన్న, రొట్టె ధరలను తగ్గించేలా ఒత్తిడి చేశారు. జాకోబిన్లలో ఒకడైన హెబర్ట్ వ్యాపారుల కోసం 'లి' పియర్ దుషెస్న్' అనే దినపత్రికను ప్రారంభించాడు. జాక్స్ రౌక్స్ అనే జనప్రియ పురోహితుడు అనుచర బృందాన్ని ఏర్పాటు చేశాడు. శత్రువులు వారిని'మతిస్థిమితం లేని వ్యక్తులు' గా వర్ణించేవారు. సంస్థానాధీశులు, ధనికుల పట్ల పేదల్లో ఉన్న మౌలిక ద్వేషాన్ని రౌక్స్ సంస్థాగతంగా ప్రతిబింబింపచేశాడు. వ్యాపారులు అధిక సంఖ్యలో రాజకీయ మండళ్లలో చేరారు. పారిస్‌లోని ప్రతి ప్రాంతంలోనూ నిర్వహించే'శాఖ' సమావేశాలకు క్రమం తప్పకుండా హాజరయ్యేవారు. మాజీనటి క్లెయిర్ లాకోంబ్ నేతృత్వంలోని ఒక విప్లవ మహిళా సంఘం ఆహార ఉద్యమాలు, వర్సెయిల్స్ యాత్రలో పాల్గొన్న మహిళల చుట్టూ బలమైన పునాదిని నిర్మించుకుంది.

సమాజంలోని ఉన్నతవర్గాల్లో చీలికలను కూడా అణచివేత దాచలేకపోయింది. విదేశాలలో ఉన్న విప్లవ ప్రతీఘాత సైన్యాలతోకలిపి అప్పటికీ రాజు, రాణిలు కుట్రను రూపొందిస్తున్నారు. ప్రభుత్వ పగ్గాలను చేపట్టిన సంస్కరణవాదుల మధ్య విభేదాలు తలెత్తాయి. ప్రతీఘాత కుట్రలు ఒకవైపు, పేద వర్గాల నుండి ముప్పు మరో వైపు ఉండడంతో వారు రెండు వర్గాలుగా చీలిపోయారు. జాకోబిన్ మండలిలో ముఠాతత్వం పెరిగిపోయింది. బ్రిస్సోటిన్లు లేదా గిరోనిన్‌లు అనే ముఠాలు ప్రభుత్వం నుండి లఫాయెట్‌ను తొలగించడానికి పావులు కదిపాయి.

ఈ వైరి ముఠాలన్నీ తమ సమస్యలకు ఒక సులభమైన పరిష్కారం ఉందని నమ్మాయి. ఫ్రాన్స్ ఉత్తర సరిహద్దుల్లో పొగైన విదేశీ సైన్యాలపై యుద్ధం ప్రకటించడమే ఏకైక మార్గమని భావించాయి. యుద్ధమే కనక జరిగితే విదేశీ సైన్యాల చేతిలో ఫ్రెంచి సైన్యం ఓటమి పాలై, తనకు సంపూర్ణ అధికారాలు దక్కగలవని రాజు నమ్మాడు. యుద్ధానంతరం తాను నియంతగా మారడానికి అవకాశం లభించగలదని లఫాయెట్ భావించాడు. జాతీయవాద స్ఫూర్తి వల్ల తమకు ప్రయోజనం కలగగలదని గిరోండిన్లు ఆశించారు. యుద్ధానికి వ్యతిరేకంగా దృఢవైఖరిని రోబెస్పియర్ ఒక్కడే తీసుకున్నారు. అలాంటి వ్యక్తిని చరిత్రకారులు,

నవలా రచయితలు రక్తపిపాసిగా వర్ణించారు.

యుద్ధం ప్రతీఘాత విప్లవానికి ద్వారాలు తెరవగలదని అతడు జాకోబిన్ మండలిలో వాదించాడు. అయితే ప్రభుత్వం ఏర్పాటు చేసిన తర్వాత యుద్ధానికి సిద్ధం కావడానికి గిరోండిన్లు రాజుతో ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. వారిని నిలువరించడంలో రోబెస్పియర్ విఫలమయ్యాడు. చివరికి 1792 ఏప్రిల్‌లో ఆస్ట్రియా, ప్రష్యాలపై ఫ్రాన్స్ యుద్ధం ప్రకటించింది.

## విప్లవ యుద్ధం

యుద్ధం చాలా దారుణంగా మొదలైంది. ఫ్రెంచి సైన్యం తీవ్రమైన పరాభవాలను ఎదుర్కొంది. ఫ్రెంచి జనరళ్లు శత్రు పక్షానికి శిబిరం మార్చడంలో సిద్ధహస్తులు కావడం అందుకు కొంత కారణం కావచ్చు. మరో వైపు రాజు యుద్ధం వల్ల నెలకొన్న అస్థిర పరిస్థితులను సద్వినియోగం చేసుకొని గిరోండిన్లను వదిలించుకోవాలని ప్రయత్నించాడు. దండయాత్రపై వచ్చిన సైన్యం పక్షాన డ్యూక్ ఆఫ్ బ్రన్స్‌విక్ ఒక ప్రకటన చేశాడు. యుద్ధంలో విజయం సాధిస్తే శత్రువులకు తీవ్రమైన శిక్ష విధిస్తామని, పారిస్ నగరాన్ని సైనికులకు అప్పగిస్తామని, తిరుగుబాటు దారులకు తగిన శిక్ష వేస్తామని ప్రకటించాడు.

ప్రతీఘాత విప్లవం నుండి ముప్పు పొంచి ఉందన్న వాదన ప్రతికూల ఫలితాలకు దారి తీసింది. క్షేత్రస్థాయిలో కొత్తగా ఉద్యమం బయల్దేరింది. గత మూడేళ్లుగా తాము సాధించుకున్న ప్రతి విజయం విదేశీ దండయాత్ర వల్ల దెబ్బతినగలదన్న భావన సామాన్య ప్రజల్లో నాటుకుపోయింది. 'ప్రేక్షక పౌరులు' అని భావించిన వేలాది మంది ప్రజలు (వీరిని అధికారికంగా ఓటు హక్కుకు అనర్హులని గుర్తించారు) 'శాఖ' సమావేశాల్లో పాలుపంచుకున్నారు. పారిస్‌లోని ప్రతి ప్రాంతంలోనూ శాఖ సమావేశాలు సాధారణ ప్రజలతో నిండిపోయాయి.

విప్లవ ప్రతీఘాత దండయాత్రను అడ్డుకోవడానికి పౌరులు స్వచ్ఛందంగా సైన్యంలో చేరాలని జాతీయ అసెంబ్లీ పిలుపునిచ్చింది. అందుకు స్పందించిన ప్రజలు ఒక్క పారిస్‌లోనే 15,000 మందికి పైగా ఉన్నారు. విప్లవ సమర్థకులైన 'ఫెడెరస్' ప్రాంతీయ పట్టణాల నుండి పారిస్‌కు యాత్రను ప్రారంభించారు. మార్సెయిల్స్ నుండి వచ్చిన బృందం అందులో ప్రాముఖ్యాన్ని సాధించింది. దాని కవాతు స్వరం విప్లవ గీతంగా మారింది. 48 శాఖ సమావేశాల్లో ఒకటి మినహా అన్నీ గణరాజ్యాన్ని స్థాపించాలని డిమాండ్ చేశాయి. పేద ప్రాంతాల్లో గస్తీ కాసే భద్రతా దళాలు విప్లవ వైఖరిని అలవర్చుకున్నాయి.

ప్రతీఘాత విప్లవం వస్తోందన్న భయాందోళనలు ఒక్క పేదవర్గాలకే పరిమితం కాలేదు. రోబెస్పియర్, డాంటన్, మారత్ నేతృత్వంలోని మధ్యతరగతి వర్గ విప్లవకారులు కూడా ఆందోళన చెందారు. పరాజయం తమ ముఖాల్లో తొంగి చూస్తోందని, విప్లవాన్ని మరింత ముందుకు తీసుకెళ్లాల్సిన అవసరం ఉందని వారు గ్రహించారు. 1792 ఆగస్టు 10న అలాగే చేశారు. విప్లవంలో రెండవ అతిపెద్ద మలుపును తీసుకొచ్చారు. శాఖలకు చెందిన లక్షలాది మంది వ్యాపారులు ఫెడెరస్‌లతో చేతులు కలిపి తుయిలేరిస్ రాజభవనానికి యాత్ర నిర్వహించారు. రాజును కాపాడాల్సిన జాతీయ భద్రతదళ సభ్యులు తిరుగుబాటులో చేరారు. తిరుగుబాటు సైన్యం రాచరిక దళాలను యుద్ధంలో ఓడించాయి. పోరాటంలో 600 మంది

రాచరికవాదులు, 370 మంది తిరుగుబాటుదారులు మరణించారు.

పారిస్ నగరం మరోసారి సాధారణ ప్రజల నియంత్రణలోకి వచ్చింది. కొత్త శక్తి ముందు జాతీయ అసెంబ్లీ తలవంచింది. రాజును బహిష్కరించాలని నిర్ణయించింది. పారిస్ శాఖల ఆధారంగా రూపొందించబడిన కొత్త విప్లవ కమ్యూన్‌ను గుర్తించింది. సార్వజనిక ఓటు హక్కుతో కొత్తగా ఎన్నికలు నిర్వహించాలని నిర్ణయించింది. ప్రభుత్వంలోకి గిరోండిన్లు మళ్లీ వచ్చారు. అయితే మూడు కీలక పదవులను జాకోబిన్లకు ఇవ్వడానికి ఒప్పుకున్నారు. జాకోబిన్లలో ప్రముఖుడైన దాంటన్ న్యాయశాఖ మంత్రి అయ్యాడు.

బయటి నుండి పొంచి ఉన్న ముప్పును తొలగించడానికి ఈ మార్పులు ఒక్కటే సరిపోవు. ఫ్రెంచి సైన్యం తీవ్రంగా నష్టపోయింది. విదేశీసైన్యాలు పారిస్ వైపు కదలసాగాయి. వాటికి లఫాయెట్ తదితరుల బలగాలు తోడయ్యాయి. రాజధాని నగరంలో వందలమంది సంస్థానాధీశులు, రాచరికవాదులు ఉన్నారు. వీరంతా భద్రత కట్టుదిట్టంగా లేని కారాగారాల్లో మగ్గుతున్నారు. గత మూడేళ్లుగా తాము భరించిన అవమానాలకు ప్రతీకారం తీర్చుకోవడానికి తగిన అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. సైన్యం, ప్రభుత్వ యంత్రాంగంలో రాచరికవాద సమర్థకులు అనేకమంది చొచ్చుకుపోయి ఉన్నారు.

విప్లవానికి ముప్పును తప్పించాలంటే రెండే మార్గాలు మిగిలాయి. ఒకటి విప్లవకారులను అధిక సంఖ్యలో యుద్ధ రంగానికి పంపడం, రెండవది అంతర్గతంగా రాచరికవాదులు, సంస్థానాధీశులు తిరుగుబాటు చేయకుండా నిర్ణయాత్మకమైన చర్య తీసుకోవడం. ఈ రెండు కార్యాలను సాధించడానికి గిరోండిన్లకు అంత సామర్థ్యం లేదు. అయితే దాంటన్ అవసరమైన చొరవను తీసుకున్నాడు. ప్రజల మనోభావాలను గుర్తించి వారిని సమీకరించాడు.

“ధైర్యం, ధైర్యం, మరింత ధైర్యం” అన్నది అతడి నినాదంగా మారింది. యుద్ధరంగంలో ఉన్న సైన్యాలలో కొత్త ఊపిరిని ఊదడానికి అతడు పారిస్ మురికివాడలకు చెందిన విప్లవకారులను వినియోగించాడు.

పారిస్‌లో కూడా జనాలు నిర్ణయాత్మకమైన చొరవను తీసుకున్నారు. మారత్ ప్రోద్బలంతో వారు స్థానిక ప్రతీఘాత విప్లవాన్ని అణచివేసే బాధ్యతను తమ చేతుల్లో తీసుకున్నారు. కారాగారాలకు చేరుకొని రాచరికవాదులుగా భావించబడిన వారినందరినీ హత్య చేశారు. వీటిని 'సెప్టెంబరు ఊచకోతలు'గా పరిగణిస్తారు.

పారిస్‌ను శత్రువు స్వాధీనం చేసుకుంటే తాము ఖడ్గాలను, ఫిరంగులను ఎదుర్కోవలసి వస్తుందని గ్రహించిన ప్రజలు అందుకు ప్రతిస్పందనగా పై చర్య తీసుకున్నారు. శత్రువుకు సాయం అందించడానికి ఉన్నత పదవుల్లో ఉన్న అనేక మంది సిద్ధంగా ఉన్నారన్న విషయం కూడా వారికి బాగా తెలుసు. చాంప్ డి మార్స్ వద్ద తమ బంధువులు, సన్నిహితులు అణచివేతకు గురి కావడం వారు కళ్లారా చూసి ఉన్నారు. ఆ ఊచకోత సమయంలో అధికారులు శత్రువుతో చేతులు కలిపిన విషయం వారికి తెలుసు. రొట్టె సరఫరాల కొరత కారణంగా ఆకలిని భరించిన అనుభవం వారికి ఉంది. వారు ఏదో ఒకటి చేయాల్సి వచ్చింది. దురదృష్టవశాత్తు సంస్థాగత ఏర్పాట్లు లేకపోవడం, గందరగోళం మధ్య జనసమూహాలు కారాగారాల్లో నిర్దాక్షిణ్యంగా వ్యవహరించాయి. శత్రువులు, సాధారణ ఖైదీలంటూ వర్గీకరించకుండా అందరినీ హత్య చేశారు.అయినప్పటికీ ఈ సంఘటనలు నగరంలోని రాచరికవాద ఐదర సైనిక దళాన్ని

తీవ్రంగా ప్రభావితం చేశాయి. భయాందోళనల మధ్య ఆ దళం అచేతనంగా మారింది.

సెప్టెంబరు 20న విప్లవ సైన్యం వాల్మీ వద్ద శత్రుసైన్యాలను నిలిపివేసింది. మరుసటి రోజు కొత్తగా ఎన్నికైన శాసనమండలి (చరిత్రలో సార్వజనిక ఓటు హక్కుతో (పురుషుల) ఎన్నికైన తొలి చట్టసభ ఇదే) రాచరిక వ్యవస్థను రద్దు చేసింది. ఫ్రాన్స్‌ను 'సమైక్య, అవిభాజిత గణరాజ్యం'గా ప్రకటించింది.

రాజు ఒక్కడే కాకుండా రాచరిక లక్షణాలన్నీ మటు మాయమయ్యాయి. భూస్వామ్య వ్యవస్థ అవశేషాలు కూడా సిద్ధాంతపరంగా, ఆచరణ పరంగా పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. బిషప్‌లు, మతనిర్వాహకులు విలాసవంతంగా జీవించడానికి ఇంతకాలం ప్రజలు చెల్లించాల్సిన విరాళాలు కూడా రద్దయ్యాయి. చర్చి మూఢనమ్మకాలు రాజ్య మద్దతును కోల్పోయాయి. విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించడానికి, శాస్త్రీయ పరిజ్ఞానాన్ని అందించడానికి, ప్రజలరోజువారి జీవితంలో చైతన్యోద్యమ ఆలోచనలను ప్రవేశపెట్టడానికి ప్రణాళికలు రూపొందించబడ్డాయి. స్థానిక భూస్వాములకు ఆదాయవనరులుగా ఉన్న సుంకం వసూలు కేంద్రాలు (వ్యాపారానికి ఇవి చాలా ప్రతిబంధకంగా ఉండేవి) కూడా రద్దయ్యాయి. స్వచ్ఛంద సైనిక దళాల్లోని సాధారణ సైనికులు తమ తోటి సైనికులు అధికారులుగా పదోన్నతి సాధించడంలో సహకరించారు.

కొత్త యుగం ప్రారంభమైందని గోథే నమ్మడంలో ఎలాంటి ఆశ్చర్యం కనిపించదు. అయినప్పటికీ విప్లవం సంపూర్ణం కాలేదు. తర్వాతి రెండు సంవత్సరాలలో ప్రభుత్వంలోనూ, సమాజం అట్టడుగున విప్లవ దృక్పథం బలపడింది. తర్వాత 1794 వేసవిలో విప్లవ కెరటం ఉన్నట్లుండి తగ్గడం ప్రారంభించింది. కొత్త అసమానతలు, పాత హక్కులు మళ్లీ తెరపైకి వచ్చాయి. కొత్త రాచరిక వ్యవస్థ ఏర్పాటుకు ఈ పరిణామాలు దారి తీశాయి. ఈ ప్రక్రియలో గుర్తించదగ్గ అరాచకం (ఉగ్రవాదం) బయల్దేరింది. విప్లవం పట్ల ప్రజలకు ఉన్న అవగాహన, సానుభూతి అరాచకంగా గంతులు వేసింది. చట్టసభలో నామమాత్రపు మెజారిటీతో నిర్ణయించబడిన ఉరిశిక్షను రాజుపై అమలు చేసిన తర్వాత ఇతర సంస్థానాధీశులు, రాణిని కూడా బహిరంగంగా ఉరి తీశారు లేదా కాల్చి చంపారు. తర్వాత జాకోబిన్లు గిరోండిన్ నాయకులను జీవిత ఖైదుకు పంపారు. రోబెస్పియర్, సెయింట్ జస్ట్‌లు డాంటన్, హెబర్ట్‌ను కారాగారానికి పంపారు. చివరగా థెర్మిడోరియన్లు రోబెస్పియర్, సెయింట్ జస్ట్‌లను కాలకూటానికి పంపారు. గిరోండిన్లు, డాంటన్, హెబర్ట్ మాజీ సమర్ధకుల కూటమే థెర్మిడోరియన్లు. ఇలాంటి హింసాత్మక ప్రక్రియవల్లే ఒక ప్రముఖ నానుడి ఆవిర్భవించింది : "విప్లవాలు ఎప్పుడూ తమ స్వంత పిల్లలనే మింగేస్తాయి." విప్లవాలు ఎప్పుడూ నిరర్ధకమైనవి, హింసాత్మకమైనన్న భావన ఆ విధంగా ఏర్పడింది.

అయితే అది తప్పుడు విశ్లేషణ. దానిని సార్వజనిక వ్యాఖ్యానంగా అంగీకరించలేము. ఇంగ్లాండ్ విప్లవం తన నాయకుల ప్రాణాలను బలిగొనలేదు. ఆ కార్యాన్ని పునరుద్ధరణ శిక్షకులకు వదలి వేశారు. అమెరికా విప్లవం కూడా ఎవరికీ హాని తలపెట్టలేదు. ఫ్రాన్స్‌లో చురుకైన పాత్రను పోషించిన నిజమైన శక్తులను అర్థం చేసుకోవడంలో ఘోరంగా విఫలమయ్యారని కూడా పై వ్యాఖ్యానం సూచిస్తుంది.

## విప్లవ పునాదులు

విప్లవ సంఘటనల క్లుప్త వివరణ సాధారణంగా దృశ్యకరమైన ఘటనలు, బాగా తెలిసిన వ్యక్తిత్వాలపై కేంద్రీకృతమవుతుంది. అయితే విప్లవం అంతకంటే విస్తారమైనది. సామాజిక శక్తుల మధ్య

సమతుల్యంలో అనూహ్యంగా చోటు చేసుకునే మార్పులు అందులో అంతర్భాగం. ఈ మార్పులు నెమ్మదిగా సుదీర్ఘకాలంపాటు సంభవించే పరిణామాల నుండి పుట్టుకొస్తాయి. అలాంటి పరిణామాలను విశ్లేషించడం ద్వారానే విప్లవాన్ని అర్థం చేసుకోగలము.

పాత సమాజం అగ్రభాగాన రాచరిక వ్యవస్థ, సంస్థానాధీశులు ఉండేవారు. సాంప్రదాయబద్ధమైన భూస్వామ్య ఉన్నతవర్గం ఫ్రాన్స్‌లో ఉన్నతస్థానాన్ని ఆక్రమించింది. బ్రిటన్‌లో ఎప్పుడో అంతరించిన భూస్వామ్య దొరల వ్యవస్థ ఫ్రాన్స్‌లో చాలా కాలం పాటు కొనసాగింది. అనేక శతాబ్దాల కాలంలో ఫ్రెంచి రాచరిక వ్యవస్థ ఫ్యూడల్ దొరల స్వతంత్ర ప్రాబల్యాన్ని కొంత వరకు తగ్గించగలిగింది. పట్టణాలు, కొత్తగా పుట్టుకొచ్చిన సంపన్న బూర్జువా వర్గాలను బడా భూస్వాములకు వ్యతిరేకంగా సమ ఉజ్జీలుగా వినియోగించడం ద్వారా రాచరికం భూస్వాముల ప్రాబల్యాన్ని గండి కొట్టగలిగింది. 16, 17వ శతాబ్దపు రాజులు ఈ ప్రక్రియకు వ్యవస్థాగత స్వరూపాన్ని ఇచ్చారు. ధనిక వర్గాల సంతానానికి రాజ్యయంత్రాంగంలో పదవులను అమ్మడం ద్వారా భూస్వాముల అధికారాలకు పరిమితులు విధించారు. ఈ కొత్త అధికార గణం అనతి కాలంలోనే కొత్త వారసత్వ ఉన్నత వర్గంగా ఆవిర్భవించింది (రాచరిక ఉన్నతవర్గంగా అది పిలవబడేది). ఈ వర్గం న్యాయస్థానాలపై (పార్లమెంట్లు)పట్టు సాధించింది. న్యాయస్థానాలు రాచరిక ఉత్తర్వులు (శాసనాలు)ను అమలు చేసేవి.

చివరగా మరో రకమైన ఉన్నత వర్గం ఉండేది. అందులో చర్చికి చెందిన గొప్ప రాకుమారులు - బిషప్‌లు, అబ్బాట్‌లు - అంతర్భాగంగా ఉండేవారు. వీరు బడా భూస్వాములతో సమానంగా విలాసవంతవమైన జీవితాన్ని, సంపదను అనుభవించేవారు. అదే సమయంలో సాధారణ పురోహితులు రైతులతో సమానంగా జీవన ప్రమాణాలు కలిగి ఉండేవారు.

చర్చిలో ఉన్నత పదవులు రాచరిక పోషణపై ఆధారపడి ఉండేవి. దర్బారులో తన పరపతిని నిలుపుకోవడానికి చర్చి పెద్దలు ప్రయత్నించేవారు. ఆ విధంగా రాజ్యం, చర్చి మధ్య ఉమ్మడి సహకారం ఉండేది. పాత భూస్వామ్య కుటుంబానికి చెందిన చార్ల్స్ మారీస్ డి టాల్లీరాండ్ లాంటి భ్రష్టుపట్టిన వ్యక్తులు (ఎలాంటి సాంప్రదాయ, మత విలువలు లేనివారు), పవిత్ర కార్యాలను పూర్తి చేయని వారు కూడా 21 ఏళ్ల ప్రాయంలోనే అబ్బాట్‌గా నియమితులయ్యే అవకాశం ఉండేది. భూస్వాముల్లాగే చర్చి పెద్దలు కూడా ఎలాంటి పన్నులను చెల్లించేవారు కాదు. పైపెచ్చు చర్చి ఆధీనంలోని విశాలమైన భూములు, ఆస్తుల నుండి అద్దెలు, ప్రజల నుండి చర్చి విరాళాలను పొందేవారు.

భూస్వామ్య పాలకవర్గంలోని మెజారిటీ వర్గం తన ప్రత్యేక హక్కులను, ప్రయోజనాలను వదులుకోవాలని భావించలేదు. నిజానికి విలాసవంతమైన జీవితం గడిపేందుకు, సంబంధిత ఖర్చును రాబట్టుకునేందుకు వారు రైతులు, వృత్తిదారులపై అణచివేతను, దోపిడీని తీవ్రతరం చేశారు. భూస్వామ్య బకాయిల వసూలులో కిరాతకంగా వ్యవహరించారు. రైతాంగ గ్రామాల్లోని ఉమ్మడి ఆస్తిలో కొన్ని భాగాలను హస్తగతం చేసుకున్నారు. రాజ్యయంత్రాంగం, సైన్యం, చర్చిలలో పదవులపై గుత్తాధిపత్యం సాధించారు. ఒక్కమాటలో చెప్పాలంటే తమ ప్రత్యేక ప్రయోజనాల పరిరక్షణకు భూస్వామ్య పాలకవర్గం 'హింసాత్మక ప్రతిచర్య'కు పాల్పడింది.

ఫ్రాన్స్‌లో గణనీయమైన పారిశ్రామిక ప్రగతి జరుగుతున్న సమయంలో ఇలాంటి పరిస్థితులు నెలకొని ఉండేవి. ముఖ్యంగా గ్రామీణ వృత్తిదార ఉత్పత్తి పతాక స్థాయికి చేరుకున్న సమయంలో కూడా

భూస్వాముల పెత్తనం కొనసాగింది. ఇటీవలి అంచనాల మేరకు 18వ శతాబ్దంలో ఫ్రాన్స్ ఆర్థిక వ్యవస్థ వార్షికంగా 1.9 శాతం మేరకు అభివృద్ధి చెందింది. వస్త్రాల ఉత్పత్తి 250 శాతం, బొగ్గు ఉత్పత్తి ఏడు లేదా ఎనిమిదింతలు, ఉక్కు ఉత్పత్తి 40,000 టన్నుల నుండి 1,40,000 టన్నుల వరకు పెరిగింది. 1789 నాటికల్లా ఫ్రాన్స్ జనాభాలో ఐదో వంతు మంది ప్రజలు పరిశ్రమ లేదా చేతివృత్తుల్లో ఉపాధి పొంది ఉన్నారు.

బడా వ్యాపారుల, దళారుల, ఉత్పత్తిదారుల సంపన్న వర్గం పరిమాణంలోనూ, సంపదలోనూ విస్తరించింది. ముఖ్యంగా అట్లాంటిక్ ఓడరేవులను కేంద్రంగా చేసుకొని వెస్ట్ ఇండియన్ చక్కెర కాలనీలతో వ్యాపార, వాణిజ్య లావాదేవీలు నిర్వహించేవారు అపరకుబేరులయ్యారు. ప్రచురణ పరిశ్రమను కొద్ది మంది గుత్తాధిపతులు నియంత్రించేవారు. ధనిక బూర్జువా వర్గం స్థాయి సమాజంలో నిర్దిష్టంగా నిర్ధారించబడలేదు. సాధారణ, న్యాయపరమైన పరిభాషలో చెప్పాలంటే వారు భూస్వామ్య పాలకవర్గ సభ్యుల కంటే తక్కువ స్థాయిలో ఉండేవారు. అయితే చాలా సందర్భాల్లో తమ ధనబలం వల్ల రాచరిక వ్యవస్థపై తీవ్ర ప్రభావం చూపేవారు. అన్నింటి కంటే మించి వారు భూములను, వ్యవసాయ క్షేత్రాలను కొనుగోలు చేశారు. వాటి ద్వారా కౌలును పొందారు. రాచరికం పక్షాన పన్ను చెల్లించే రైతులుగా వారు లాభాలను గడించారు. తక్కువ స్థాయి బూర్జువా వర్గాన్ని పాలనా వ్యవహారాలకు చాలా దూరంగా ఉంచారు. అయితే వీరు కూడా ఆయా సమయాల్లో తమ కుటుంబాలు వాణిజ్యం, దుకాణాల నిర్వహణ లేదా విలాస వస్తువుల అమ్మకం ద్వారా కూడగట్టిన సంపదను వ్యవసాయంలో పెట్టుబడిగా పెట్టారు. లేదా కొన్ని రాజ్య పదవులను కొనుగోలు చేశారు. బూర్జువా వర్గంలోని ఈ రెండు వర్గాలు భూస్వాములు తమ పట్ల చూపుతున్న వివక్షను నిరసించేవి. కాని నిరంకుశ రాచరిక పాలనకు వ్యతిరేకంగా విప్లవాత్మకమైన విపక్షంగా అవి వ్యవహరించలేదు. నిజానికి భూస్వామ్య వర్గం నుండి రక్షణ కోసం ఈ వర్గాలు రాచరిక వ్యవస్థ వైపు చూసేవి.

బూర్జువా వర్గం, పట్టణ పేదల మధ్య చిన్న వ్యాపారులు, వృత్తిదారులు ఒక పెద్ద వర్గం ఉండేది. సాంప్రదాయంగా ఈ వర్గం రాజ్యం నెలకొల్పిన వ్యాపార మండళ్లపై ఆధారపడి ధరలను నియంత్రించేది, తన ఆదాయాన్ని కాపాడుకునేది. అయితే మార్కెట్ గణనీయంగా విస్తరించడంతో వ్యాపార మండళ్లు వారికి రక్షణ కల్పించడంలో క్రమంగా నిర్వీర్యం అయ్యాయి. మార్కెట్ పరిస్థితుల్లో ఊహించని మార్పు వస్తే వారి ఆదాయం పూర్తిగా నశించిపోయేది. పంట వైఫల్యాల తర్వాత రొట్టె ధరలు పెరిగితే వారు దాదాపు ఆకలితో పస్తులుండేవారు. 1780 చివర్లో, 1790 దశకం మొదట్లో ఇలాంటి పరిస్థితిని ఎదుర్కొన్నారు. వృత్తిదార, వ్యాపార వర్గంలో మెజారిటీ సభ్యులు సంచార జీవితం గడుపుతూ వ్యాపారం నిర్వహించేవారు. ఈ యాత్రికులు తమ స్వంత వ్యాపారాన్ని నెలకొల్పడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. అలాంటి ఆశయాన్ని కూడా ప్రదర్శించలేదు. మండళ్ల చుట్టూ జీవిస్తూ సనాతన జీవితాన్ని గడిపే ఇతర వ్యాపారులు, వృత్తిదారులతో వారికి ఎలాంటి ఉమ్మడి విలువలు ఉండేవి కావు.

అవకాశవాదులు కూడా ఎక్కువ సంఖ్యలో ఉండేవారు. వీరు జీవితంలో పైకి రావడానికి ఎలాంటి అవకాశాన్నైనా సద్వినియోగం చేసుకోవడానికి సిద్ధంగా ఉండేవారు. రాజకీయ సేవలకుగాను ఆర్థిక ప్రయోజనాలను పొందేవారు. లేదా కొత్త ఉత్పాదక పద్ధతిని కనిపెట్టి ధనాన్ని ఆర్జించేవారు. అలాంటి వ్యక్తులు పాత వ్యవస్థ తర్కరాహిత్యాన్ని నిరసించినా వారు విప్లవకారులు ఏ మాత్రం కాదు.

చైతన్యోద్యమ ఆలోచనను వారు తరచూ దుయ్యబట్టేవారు.

ఫ్రెంచి సమాజంలో రైతాంగ జనాభా ఎక్కువగా ఉండేది. ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతంలో వారి సామాజిక కూర్పులో మార్పులు ఉండేవి. కొన్ని ప్రాంతాల్లో ఇంగ్లాండ్ తరహాలో రైతాంగ స్వరూపంలో మార్పులు వచ్చాయి. ముఖ్యంగా క్యాపిటలిస్టు రైతులు అవతరించి కొత్త వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టారు. మార్కెట్ డిమాండ్లపై ఆధారపడి వ్యవసాయం చేసే వారి సంఖ్య గణనీయంగా ఉండేది. ముఖ్యంగా మద్యం తయారీకి ద్రాక్ష తోటలను, వ్యవసాయంతోపాటు నేత పనిని చేసేవారు. అయితే వారి భూములు చాలా పరిమితంగా ఉండేవి. భూస్వాముల నుండి భూమిని గుత్తకు తీసుకున్న వారు లేదా పంట దిగుబడిని భూస్వామితో పంచుకునే రైతుల సంఖ్య కూడా ఎక్కువగానే ఉండేది. ఫలితంగా వ్యవసాయాన్ని అభివృద్ధి పరచడానికి వారి వద్ద ఎలాంటి నిధులు మిగిలేవి కావు. కొందరు రైతులు వ్యవసాయ కార్మికులను నియమించుకోగలిగినా వ్యవసాయాభివృద్ధికి నిధులను మాత్రం సమీకరించలేక పోయారు. చివరగా మధ్యయుగాల జీవన ప్రమాణాలను సూచించే పరిస్థితుల్లో అనేక మంది ఉండేవారు. అప్పుడు నిర్దిష్టమైన కౌలుదారీ వ్యవస్థ ఉండేది కాదు.

అయినప్పటికీ రైతాంగంలో అన్ని వర్గాలకు కొన్ని ఉమ్మడి లక్షణాలు ఉండేవి. భూమి తమకే స్వంతమని వారు నిజంగానే భావించారు. కాని భూస్వాములకు బకాయిలను చెల్లించాల్సి వచ్చింది. పంట దిగుబడిలో తొమ్మిది శాతాన్ని చర్చికి విరాళంగా ఇవ్వడంతోపాటు కౌలును కూడా అందించాల్సిన దుస్థితి ఉండేది. అన్నింటి కంటే మించి ప్రభుత్వానికి వారు పన్నులను చెల్లించాల్సి వచ్చింది. అధిక మోతాదులో ఉండే ఇలాంటి పన్నుల నుండి భూస్వాములను, చర్చి పెద్దలను రాజ్యం మినహాయించింది. ఈ పన్నుల భారం కారణంగా పంటలు విఫలమైనపుడు రైతులు తీవ్ర ఇక్కట్లకు గురయ్యేవారు. లేదా నిత్యావసర వస్తువుల ధరలు పెరిగినప్పుడు తల్లడిల్లిపోయేవారు.

రాచరిక వ్యవస్థ, భూస్వామ్య వ్యవస్థ, బూర్జువాల్లోని వివిధ వర్గాలు, రైతాంగంలోని విభిన్న సమూహాల మధ్య ఉన్నక్లిష్టమైన పరస్పర సంబంధం కారణంగా కొందరు 'రివిజనిస్టు' చరిత్రకారులు విప్లవాన్ని వర్గ అంశాల ఆధారంగా వివరించలేమని వాదించారు. వారి దృష్టిలో బూర్జువా వర్గం ప్రభుత్వ పదవులు, భూయాజమాన్యం లేదా భూస్వామ్య బకాయిల ద్వారానే ఎక్కువ ఆదాయాన్ని గడించగలదు కాని ఆధునిక పరిశ్రమల ద్వారా కాదు. కనుక అది సరికొత్త, క్యాపిటలిస్టు ఉత్పత్తి విధానాలను సమర్థించే వర్గం కాదు. భూస్వామ్య వ్యవస్థపై ఆధారపడ్డ రాచరికాన్ని, ఉన్నత వర్గాన్ని (పాలకవర్గం) వ్యతిరేకించే శక్తికాదు. విప్లవం వైపు కొద్ది మంది బడా పారిశ్రామికవేత్తలు నిలబడడం, అదేసమయంలో రాజు పక్షాన మెజారిటీ వ్యాపారులు ఉండడం తమ వాదనను బలపరుస్తుందని ఈ చరిత్రకారులు ఘోషిస్తున్నారు.

వారు పేర్కొన్న కొన్ని విషయాలు, వాదనలు నిస్సందేహంగా నిజమే కావచ్చు. బూర్జువాలు ఒక వర్గంగా పాత వ్యవస్థను వ్యతిరేకంగా నిరంతర విప్లవ విపక్షంగా నిలబడలేదు. వందలాది సంవత్సరాల కాలంతో పాత వ్యవస్థతోనే ఆ వర్గం అభివృద్ధిలోకి వచ్చింది, దానితో ముడిపడి పోయింది.

సైద్ధాంతికంగానూ, ఆర్థికంగానూ అనేక విధాలుగా బూర్జువా వర్గం పాత వ్యవస్థతో ముడిపడి ఉండేది. విప్లవ నాయకులుపెట్టుబడిదారులు కాదు, పారిశ్రామిక క్యాపిటలిస్టులు అసలు కారు. డాంటన్, రోబెస్పియర్ లాంటి న్యాయవాదులు, డెస్మోలిన్స్ లాంటి జర్నలిస్టులు, మారత్ విషయంలో ఉన్నత వర్గాలకు చెందిన వైద్యులు కూడా వారిలో ఎక్కువ ఉండేవారు. అయితే రివిజనిస్టు చరిత్రకారులు తీసిన నిర్ధారణలు

మౌలికంగా లోపభూయిష్టమైనవి. భూస్వాములు, బూర్జువాల ప్రయోజనాలు పరస్పరం ముడిపడి ఉన్నాఫ్రెంచి సమాజ ప్రక్షాళనపై ఉన్న రెండు పరస్పర విరుద్ధమైన ఆలోచనలపట్ల ఆకర్షితులు కాకుండా ఉండలేకపోయారు. ఒక వర్గం గతంవైపు చూస్తే మరోవర్గం మార్కెట్ వ్యవస్థ వైపు దృష్టి సారించింది. భూస్వామ్య పాలకవర్గం పాత సమాజంలో మార్పులను ఎట్టి పరిస్థితుల్లోనూ అంగీకరించకూడదని, తమ ప్రత్యేక ప్రయోజనాలు, హక్కులకు ఎలాంటి భంగం కలగకూడదని కోరుకుంది. మరోవైపు బూర్జువా వర్గం పోటీ ఆధారంగా విస్తరించే మార్కెట్ వ్యవస్థను కోరుకుంది. ప్రగతిలోకి రాదలచుకున్న వ్యక్తిని కేవలం వారసత్వ అర్హతే అడ్డుకోజాలదని భావించింది. అయితే అలాంటి సమాజాన్ని స్థాపించడం వైపు చర్యలు తీసుకోవడానికి బూర్జువా వర్గం అనేక సందర్భాల్లో ఊగిసలాట ధోరణిని ప్రదర్శించింది. కాని నిస్సహాయతను వ్యక్తం చేస్తూ అజ్ఞాతంలోకి మాత్రం పోలేదు. పాలకవర్గంలోని మెజారిటీ సభ్యులు కూడా అలా వ్యవహరించలేదు.

సమాజం ఈ రెండు విభిన్న ధృవాలుగా చీలిపోవడానికి బూర్జువా వర్గం ఏ మాత్రం కారణం కాదు. భూస్వామ్య పాలకవర్గ ప్రతిస్పందనే (హింసాత్మకమైన రీతిలో) చీలికకు దారి తీసింది. ఇంగ్లాండ్, అమెరికా విప్లవాల వలే ఇక్కడ జనబాహుళ్యం కొత్త వ్యవస్థ కావాలని పట్టుబట్టలేదు. విప్లవ శంఖాన్ని పూరించలేదు. కాని పాత వ్యవస్థ సమాజాన్ని ఇంకా వెనక్కి తీసుకువెళ్లాలని చేసిన ప్రయత్నాలే సమాజంలో కదలికను తెచ్చాయి.

1780 దశకంలో ఆదాయాన్ని గడించడమే ఫ్రెంచి రాచరిక వ్యవస్థ వ్యాపకమై కూర్చుంది. బ్రిటన్, ప్రష్యాలతో జరిగిన ఏడేళ్ల యుద్ధంలో అది నిధులను భారీగా ఖర్చు చేసింది. అలాగే బ్రిటనతో జరిగిన అమెరికా యుద్ధంలో అంతకంటే ఎక్కువగా వ్యయం చేసింది. పన్నుల రాబడిని పెంచడానికి కొత్తగా మార్గాలను అన్వేషించకపోతే దివాళా తీసే పరిస్థితికి అది చేరుకుంది. అయితే రాబడిని పెంచడమే అసాధ్యమని గ్రహించింది. పన్నుల నుండి భూస్వాములు, చర్చి పెద్దలను మినహాయించడంతో భారమంతా అట్టడుగు వర్గాలపై పడుతుంది. కాని అప్పటికే పరిస్థితి చేయి దాటి పోయింది. ప్రజలు అధిక పన్నులను చెల్లించే స్థితిలో ఏ మాత్రం లేరు. గ్రామీణ ప్రాంతాల్లో సగటున జీవన ప్రమాణాలు పడిపోతూ ఉన్నాయి. పట్టణాల్లో వేతనాలు 22 శాతం మేరకు పెరిగినా ధరలు మాత్రం 65 శాతం పెరిగాయి. మరో విషయం ఏమిటంటే పన్నులను పెంచే విధానం చాలా అసమర్థంగా ఉండేది. పన్నులను వసూలు చేసే భూస్వాములు లేదా ఇతర అధికారులు వాటిలో చాలా భాగాన్ని తమ స్వంత విలాసానికి దారి మళ్ళించేవారు.

పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో రాజు తెలుసుకున్నారు. 1786లో సంస్కరణవాద మంత్రివర్గాన్ని నియమించాడు. పన్నుల వ్యవస్థను సంస్కరించేందుకు, పన్నుల పరిధిని భూస్వాములు, చర్చికి వర్తింపచేసేందుకు ఉద్దేశించిన ఒక కార్యాచరణ ప్రణాళికను మంత్రివర్గం రాజుకు సమర్పించింది. భూస్వామ్య పాలకవర్గం ఈ ప్రతిపాదనలపట్ల తీవ్రంగా విరుచుకుపడింది. రాజు నియమించిన భూస్వాముల శాసనమండలి కొత్త ప్రతిపాదనలను నిర్ద్వందంగా తిరస్కరించింది. తదుపరి సంస్కరణలను ప్రవేశపెట్టినపుడు వాటిని అమలు చేయడానికి ప్రాంతీయ పార్లమెంట్లు నిరాకరించాయి. పార్లమెంట్లతో నిమిత్తం లేకుండా ముందుకు పోవాలని మంత్రివర్గం ప్రయత్నించినపుడు భూస్వాములు బహిరంగ నిరసన ప్రదర్శనలను నిర్వహించారు. కొన్ని చోట్ల నిరసన ప్రదర్శనలు హింసాత్మకంగా మారాయి. ఈ ప్రదర్శనల్లో ఇతర వర్గాలకు చెందిన అనేక మంది సభ్యుల మద్దతును కూడగట్టడంలో భూస్వామ్య వర్గం

సఫలమైంది. ఎంతైనా పన్నుల భారం బూర్జువా, రైతాంగ వర్గాలకు తీవ్ర ముప్పుగా కనిపించింది.

సమాజానికి తాను సహజసిద్ధమైన నాయకులమని భావించిన భూస్వాములు ప్రజా మద్దతుతో ప్రభుత్వాన్ని తమ ఇష్టానికి అనుగుణంగా మెడలు వంచవచ్చనే భ్రమలు పెంచుకున్నారు. ఎస్టేట్స్ జనరల్‌ను సమావేశపరచాలని డిమాండ్ చేశారు. 1614లో అది చివరగా సమావేశమైంది. 1789 మేలో ఈ డిమాండ్‌ను అంగీకరించడం ద్వారా భూస్వామ్య పాలక వర్గాల తిరోగమన డిమాండ్లకు తలొగ్గాడు. బూర్జువా లేదా పేద వర్గాల ప్రగతిశీల ఉద్యమాన్ని గుర్తించలేకపోయాడు.

అయినప్పటికీ పాలకవర్గానికి ఇచ్చిన ఈ రాయితీ ఇతర వర్గాలు సమీకృతం కావడానికి దారి తీసింది. వీరు మూడవ ఎస్టేట్ ప్రతినిధులను ఎన్నుకోవలసి వచ్చింది. పట్టణాలలో అసెంబ్లీ ఓటర్లను ఎన్నుకుంటారు. ఈ ఓటర్లు ప్రతినిధులను ఎన్నుకుంటారు. గ్రామీణ ప్రాంతాల్లో ప్రాంతీయ సమావేశానికి ఒక ప్రతినిధిని గ్రామ ప్రజలు ఎన్నుకుంటారు. ప్రాంతీయ సమావేశాలు తగు నిర్ణయాలను తీసుకుంటాయి. ఇలాంటి వ్యవహారాలపై మెజారిటీ ప్రజలకు పెద్దగా అనుభవం ఉండేది కాదు. తమ పక్షాన బాగా వాదించగలిగేవారిపై వారు విశ్వాసం చూపేవారు. ఫలితంగా మూడవ ఎస్టేట్ మండలిపై న్యాయవాదులు, మధ్యతరగతికి చెందిన సంపన్నులకు నియంత్రణ దక్కింది. కాని ప్రతినిధులను ఎన్నుకునే ప్రక్రియ సమాజం నుండి తాముకోరుకుంటున్నదేమిటో ఆలోచించడానికి లక్షలాది మంది ప్రజలను ప్రోత్సహించింది. దేశవ్యాప్తంగా ఉన్న పట్టణాలు, గ్రామాలు డిమాండ్ల జాబితాను రూపొందించాయి. వాటిని అమలు చేయాలని ఎస్టేట్స్ జనరల్‌ను కోరాయి. రాజకీయ చర్చలు క్రియాశీల సంఘాల ఏర్పాటుకు దారి తీశాయి. ముఖ్యంగా పారిస్ మురికివాడల్లో ఇలాంటి సంఘాలు ఏర్పడ్డాయి. ఈ సంఘాలే జులైలో బాస్టిల్ ముట్టడికి, అక్టోబర్‌లో వర్సైయిల్స్ యాత్రకు ప్రజలను సమీకరించాయి. రైతులు కూడా చైతన్యవంతులయ్యారు. 1789 వేసవిలో స్థానిక భూస్వాములకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు.

పాలకవర్గ మితవాదదాడి మధ్యతరగతిని రెచ్చగొట్టింది. ఈ వర్గం ప్రతినిధుల్లో ఆత్మవిశ్వాసం తొణికిసలాడింది. ఎస్టేట్స్ జనరల్ సమావేశానికి వారు పూర్తిగా సన్నద్ధమయ్యారు. విప్లవాత్మకంగా వ్యవహరించాలన్న భావన వారిలో కొరవడింది. రాచరిక వ్యవస్థ పట్ల అప్పటికీ వారు అనుకూలంగా ఉన్నారు. దానిని రద్దు చేయడం కన్నా పాలకవర్గాన్ని కుదించడానికే వారు ప్రాధాన్యతనిచ్చారు. అలా పాలకవర్గాల ప్రత్యేక హక్కులను (ఏకపక్షంగా ఉన్న), దౌర్జన్యాన్ని నిర్మూలించాలని భావించారు. కాని తమపై ఇతరులు పెత్తనం చేయడం వారికి ఇష్టం లేదు. సమాజంలో పెరుగుతున్న చైతన్యం వారిలో ఉత్సాహాన్ని, ధైర్యాన్ని పెంచింది. ఫలితంగా వారి తిరుగుబాటు చర్యలు తర్వాతి కాలంలో రాజుతో రాజీకి దారి తీశాయి. ఈ ప్రక్రియలో రాజు చాలా వరకు బలపడ్డాడు. పాలకవర్గం తన ఆస్తులను గణనీయంగా పెంచుకుంది. మానవ హక్కులను తమకు సమానంగా వర్తింప చేయాలని, భూస్వామ్య వ్యవస్థ అంతరిస్తుందని వారు చేసిన ప్రకటనలు ఆయా పాలకవర్గాల మధ్య బేరసారాలకు దారి తీసి చివరకు రాజు అత్యంత శక్తిమంతునిగా ఆవిర్భవించాడు.

అయితే పాలకవర్గ ప్రతిస్పందనను అంత త్వరగా తెరవేయడం సాధ్యమయ్యే పనికాదు. తమ భవితపై పాలకవర్గాలకు నియంత్రణ ఉన్నంత వరకు గ్రామీణ వ్యవసాయ క్షేత్రాలు, సైనిక బలగాలపై పట్టు ఉన్నంత వరకు భూస్వాములు తమ పాత ప్రయోజనాల హోదాలను తిరిగి నిలబెట్టుకోవడానికి

ప్రయత్నిస్తారు.

## సంస్కరణవాదులు, విప్లవకారులు, వ్యాపారులు

1789 వేసవిలో మధ్యతరగతి ప్రతినిధి వర్గాన్ని సమర్థించిన ప్రజా ఉద్యమాలు పేద వర్గాలను చైతన్యపరిచాయి. మొట్టమొదటిసారిగా వారు తమ దుస్థితిని ఎలుగెత్తి చాటారు. వ్యవస్థను సవాలు చేశారు. కొద్ది మందికే సంపద దక్కడం, అత్యధికులు పేదరికంలో మగ్గుతుండడం ఒకే నాణానికి ఇరువైపులా ఉన్న పరిస్థితిని సూచిస్తోందని వారు గ్రహించడం మొదలుపెట్టారు. తొలుత సంపద పాలకవర్గానికి పరిమితమని వారు భావించారు. అయితే పాలకవర్గాన్ని అనుకరించే బూర్జువా వర్గంలోని కొన్ని సంపన్న వర్గాల వైపు దృష్టి సారించడానికి వారికి ఎంతో కాలం పట్టలేదు. ఈ వర్గాలు పన్ను సేకరణ రైతులుగా, భూముల యజమానులుగా, పెట్టుబడిదారులుగా తమను తాము సంపన్నులు చేసుకున్నారు.

1789లో బయల్దేరిన ఉద్యమం మధ్యతరగతి వర్గాల నుండి వేలాది మంది రాజకీయ కార్యకర్తలను సృష్టించింది. వీరే రాజకీయ మండళ్లకు ఎక్కువగా హాజరయ్యేవారు. కరపత్రాలను, దినపత్రికలను ఎక్కువగా చదివింది కూడా వారే. ఎన్నికల సభల్లోనూ అధిక సంఖ్యలో పాల్గొన్నారు. తొలుత వారు చాలా ఉత్సాహంగా వ్యవహరించారు. చైతనోద్యమ లక్ష్యాలను సాధించడానికి చరిత్ర తమకు సువర్ణావకాశాన్ని కల్పించిందని భావించారు. వాల్టెయిర్ విమర్శించిన తప్పులను ఒప్పులుగా చేయడానికి, రూసో ఊహించినట్లు సమాజాన్ని సంస్కరించడానికి ముందుకు వచ్చారు. వీరోచిత వైఖరిని అవలంబిస్తూ తమను తాము బ్రూటస్ లాంటి (ప్రాచీన రోమ్) చారిత్రక పురుషులకు వారసులుగా ఊహించుకున్నారు.

అయితే ఒకవైపు పాలకవర్గాల ప్రతీకారం, మరోవైపుప్రజా ఆగ్రహం మధ్య వారు నలిగిపోయే ప్రమాదం ఉండేది. ప్రజా ఉద్యమం పాలకవర్గాన్ని ఓడించగలదని 1789 ఉద్యమం నిరూపించినా రైతులు మాత్రం బూర్జువా వర్గానికి చెందిన భూమి యజమానులపట్టాలను తగులబెట్టడం ఆపలేదు. బూర్జువా నేపథ్యం ఉన్న వ్యాపారులు ఆహార సరఫరాల కొరతను కృత్రిమంగా సృష్టించిన కారణంగా పట్టణ ప్రజలు వారిపై దాడులను ఆపలేదు.

ఈ సంఘటనల కారణంగా మధ్యతరగతికి చెందిన రాజకీయ కార్యకర్తల్లో వరుసగా చీలికలు వచ్చాయి. సహజంగానే అత్యధికులు భద్రతను, ఆస్తిని, రాజు పాలకవర్గంలో రాజీని కోరుకున్నారు. ప్రజలను సమీకరించాలని కేవలం మైనారిటీ వర్గమే సిద్ధమైంది. అయితే పాలకవర్గాల దాడి, తదనంతరం దానికిచ్చిన రాయితీలు మెజారిటీ ప్రజలను దెబ్బతీసి వారిని విప్లవకారుల వైపు మళ్లిస్తుంది. అయితే ప్రజల్లోని ఒక వర్గం చీలిపోయి ప్రతీఘాత విప్లవంలో చేరిపోతుంది.

1791, 92లో సరిగ్గా ఇదే జరిగింది. 1793లో మరోసారి అలాంటి పరిణామమే సంభవించింది. గణరాజ్య స్థాపనకు, రాజు మరణశిక్షకు దారి తీసిన 1792 సంక్షోభంలో జాకోబిన్లు లఫాయెట్‌ను పదవి నుండి తప్పించారు. శాఖల ద్వారా పారిస్ ప్రజలు సమీకృతమయ్యారు. గిరోండిన్లు కూడా ఈ కార్యక్రమంలో పాలుపంచుకున్నారు. అయితే ఇంకా ముందుకు వెళ్లడానికి సంకోచించారు. రాజుకు మరణశిక్షను విధించడాన్ని సమర్థించలేక పోయారు. బ్రిస్సాట్ పేర్కొన్నట్లు 'జనాల' పట్ల వారు ఆందోళన చెందారు. అరాచకానికి జనాలే పునాదులని భయపడ్డారు. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో ఆకలి

సర్వత్రా వ్యాపించిన నేపథ్యంలో ధరల నియంత్రణకు పారిస్ శాఖలు తెస్తున్న ఒత్తిళ్లను వారు ప్రతిఘటించారు. ప్రజలకు తిండి గింజలను సరఫరా చేయాలని, ధాన్యాలను దాచిపెట్టేవారిపై, దళారులపై కఠిన చర్యలు తీసుకోవాలని శాఖలు డిమాండ్ చేశాయి.

గత ప్రభుత్వం వలే గిరోండిన్లు ప్రజలపై దాడులను ముమ్మరం చేశారు. సంపన్న బూర్జువా వర్గాన్ని ఉద్దేశించి ఒక గిరోండిన్ నాయకుడు ఇలా హెచ్చరించాడు : "మీ ఆస్తులకు ముప్పు ఉంది. పొంచుకొని ఉన్న ప్రమాదాన్ని మీరు గుర్తించడం లేదు. ఈ విషపూరితమైన కీటకాలను వారి నివాస ప్రాంతాలను వెనక్కి నెట్టండి." రాజద్రోహం అభియోగంపై విప్లవ ట్రిబ్యునల్‌కు మారత్‌ను పంపాలని శాసనమండలి నిర్ణయించింది. అయితే ట్రిబ్యునల్ మారత్‌ను నిర్దోషిగా ప్రకటించి విడుదల చేసింది. తర్వాత హెబర్ట్‌ను నిర్బంధంలోకి తీసుకున్నారు. శాసనమండలి అధ్యక్షుడు నగరంలో వరుసగా వస్తున్న ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలను అణచివేయకపోతే పారిస్ సర్వనాశనం అవుతుందని హెచ్చరించాడు. ఆ ప్రకటనలో అతడు వాడిన భాష డ్యూక్ ఆఫ్ బ్రన్స్‌విక్ భాషతో పోలి ఉండేది. సైనిక కమాండర్ డుమోరిజ్ శత్రు శిబిరానికి ఫిరాయించడంతో ఫ్రెంచి సైన్యం కొత్తగా వరుస పరాజయాలను చవి చూసింది. పశ్చిమ ఫ్రాన్స్‌లోని వెండే ప్రాంత రైతులు అసంతృప్తితో హింసాత్మకమైన రాచరికవాద ఉద్యమంలో చేరిపోయాడు.

ఎట్టకేలకు మే 29న రాచరికవాదులు, మధ్యేవాదులు ఉమ్మడిగా పోరాడి లాయన్స్ ప్రాంతాన్ని నియంత్రణలోకి తీసుకున్నారు. అక్కడి జాకోబిన్ మేయర్ అయిన చాలియర్‌ను నిర్బంధించి జులైలో మరణశిక్ష విధించారు.

గిరోండిన్లలాగా రోబెస్పియర్ అనుచరులైన జాకోబిన్లు కూడా మధ్యతరగతికి చెందిన వారే. అయితే అనేక మంది చరిత్రకారులు జాకోబిన్లు ఎక్కువగా మధ్య తరగతిలోని దిగువశ్రేణి నుండి వచ్చిన వారేనని వాదించారు. వీరంతా ఆస్తి హక్కుల పరిరక్షణకు కట్టుబడి ఉండేవారు. బహిరంగ వ్యాఖ్యానాల్లో వారి వైఖరిని అనేకసార్లు స్పష్టం చేశారు. వ్యక్తిగతంగా రోబెస్పియర్ నిజాయితీపరుడు. కాని అతడి అనుచరుల్లో అనేక మంది విప్లవం ద్వారా ఆర్థిక లబ్దిని పొందడానికి ప్రయత్నించారు. ఎంతైనా బూర్జువావర్గంలో చేరిపోవాలన్నదే వారి ఆకాంక్ష. డాంటన్ కూడా వ్యక్తిగతంగా ఆస్తులను కూడబెట్టాడు. ఒక దశలో రాజు నుండి డబ్బు తీసుకున్నాడు. మారత్, హెబర్ట్‌లు ప్రజలతో కలిసి ఉద్యమించారు. అయితే లాభాలను ఆర్జించడంలో ఎలాంటి తప్పు లేదన్న వ్యాపారులు లేదా వృత్తిదారుల దృష్టికోణంతో వారు వ్యవహరించారు.

కాని 1793 వేసవి తొలినాళ్లలో నాయకులంతా ఒక్క విషయాన్ని బాగా గ్రహించారు. విప్లవానికి ప్రత్యామ్నాయం తిరోగమన శక్తుల ప్రతి క్రియ మాత్రమేనని, దానివల్ల తాము, గత నాలుగేళ్లలో సాధించిన విజయాలు మనుగడ సాగించడం అసాధ్యమని విశ్లేషించారు. విప్లవాన్ని ముందుకు తీసుకెళ్లాలంటే మరోసారి పారిస్ ప్రజలతో జతకట్టి, రైతుల డిమాండ్లను పరిష్కరించాలని, అవసరమైతే బూర్జువా వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకంగా చర్యలు తీసుకోవాలని నిర్ణయించారు. రోబెస్పియర్ తన డైరీలో ఇలా రాసుకున్నాడు : "మధ్యతరగతి నుండి ప్రమాదాలు ఎదురుకాగలవు. వారిని ఓడించాలంటే మనం ప్రజలను సమీకరించాల్సి ఉంటుంది" మరో మాటలో చెప్పాలంటే జాకోబిన్ మండలిలోని విప్లవ బూర్జువా వర్గం విప్లవకారులైన పారిస్ ప్రజలతో చేతులు కలిపి మధ్యేవాదులైన గిరోండిన్ బూర్జువా వర్గాన్ని ఓడించాల్సి ఉంటుంది. విప్లవంలో మూడో ముఖ్యమైన దశ ప్రారంభం కావడానికి రంగం సిద్ధమైంది.

1793 మే 26న రోబెస్పియర్ తిరుగుబాటు చేయాలని ప్రజలకు పిలుపునిచ్చాడు. మే 21న 33 పారిస్ శాఖలు ఉమ్మడి సమావేశం నిర్వహించి తిరుగుబాటు కమిటీని ఎన్నుకుంది. కొత్తగా ఉద్యమం తీసుకురావడానికి తొమ్మిది మంది సభ్యులతో ఆ కమిటీని ఏర్పాటు చేశారు. మే 31, జూన్ 2న ప్రమాద ఘంటికలు, ఫిరంగి కాల్పులు ప్రజలను వీధుల్లోకి రప్పించాయి. శాసనమండలి భవనాన్ని 80,000 మంది సాయుధులు చుట్టుముట్టారు. ఇరవై తొమ్మిది మంది గిరోండిన్ ప్రతినిధులను నిర్బంధించేలా ఆదేశాలు జారీ చేయాలని ఒత్తిడి చేశారు. ఇప్పుడు నగరంలో పారిస్ శాఖలు అధికార కేంద్రంగా మారాయి. జాకోబిన్ నాయకత్వం ఆచరణలో ఫ్రాన్స్ ప్రభుత్వంగా వ్యవహరించింది.

పరాజితులైన గిరోండిన్లు నగరం వదలి పారిపోయారు. ప్రాంతీయ కేంద్రాల్లో తిరుగుబాటు తీసుకురావడానికి ప్రయత్నాలు మొదలుపెట్టారు. సైన్యంలో వారికి కొందరు అధికారులతో స్నేహ సంబంధాలు ఉన్నాయి. బడా వ్యాపారుల్లో మద్దతుదారులు ఉన్నారు. మధ్యతరగతి రైతులలో వారిపట్ల సానుభూతి ఉంది. జనాన్ని ముప్పుగా భావించిన వారందరూ గిరోండిన్లకు మద్దతుగా నిలిచారు. అందరికంటే మించి పాలకవర్గ సభ్యులు వారికి వెన్నుదన్నుగా నిలిచారు. విప్లవంపై విజయం సాధిస్తే మొదట హర్షించేది భూస్వామ్య పాలకవర్గమే కాబట్టి వారు గిరోండిన్లకు సంపూర్ణ సహకారాన్ని అందించారు. కొన్ని వారాల వ్యవధిలోనే ఫ్రాన్స్‌లోని దక్షిణ, పశ్చిమ ప్రాంతాలు గిరోండిన్ల వశమయ్యాయి. వెండే ప్రాంతాన్ని రాచరికవాదులు హస్తగతం చేసుకున్నారు. జాకోబిన్ వ్యతిరేక వర్గం దక్షిణ ప్రాంత ఓడరేవైన తౌలాన్‌ను, మధ్యధర నావికాదళానికి చెందిన యుద్ధ నౌకలను బ్రిటీషు సైన్యానికి అప్పగించింది. విదేశీ సైన్యాలు అప్పటికీ పారిస్ వైపు కదులుతూ ఉన్నాయి. అవసరమైతే పారిస్ నగరంలో కూడా దాడులు నిర్వహించగలనని ప్రతీఘాత విప్లవం నిరూపించింది. గిరోండిన్ నగరమైన కేన్ నుండి చార్లోట్‌కార్డే అనే మహిళ సహాయాన్ని కోరుతూ మారత్‌ను ఆశ్రయించింది. మారత్ స్నానం చేస్తుండగా అతడిని పొడిచి చంపింది. వ్యవస్థ కుళ్లిపోకముందే మరిన్ని విప్లవ చర్యలు తీసుకోవాలని పారిస్ ప్రజలు జాకోబిన్ నాయకులను కోరారు. నాయకత్వానికి కూడా మరో దారి కనిపించలేదు. ప్రజాభద్రతకమిటీకి అత్యవసర చర్యలు తీసుకునే అధికారాన్ని అప్పగించారు. ఆహార పదార్థాల ధరలను నియంత్రిస్తూ చట్టాన్ని ఆమోదించారు. ప్రజల ఆకలితో వ్యాపారం చేసే వారికి మరణ దండన తప్పదని హెచ్చరిక జారీ చేశారు. యుద్ధం కోసం అయ్యే వ్యయాన్ని ధనికుల నుండి రుణాల రూపంలో బలవంతంగా వసూలు చేశారు. అలాగే కుటుంబ ఆదాయంపై 10 నుండి 50 శాతం వరకు ప్రగతిశీల పన్నును విధించారు. ఆర్థిక వ్యవస్థ కేంద్రీకృతమైంది. ఒక ముఖ్యమైన ప్రభుత్వరంగ సంస్థ యుద్ధ సరఫరాలను ఉత్పత్తి చేయడం ప్రారంభించింది. వలసదారులు, చర్చిల నుండి స్వాధీనం చేసుకున్న భూములను చిన్న ప్లాట్లుగా విభజించి అసంతృప్తితో ఉన్న రైతులకు పంపిణీ చేశారు. స్వచ్ఛంద విప్లవ బలగాలు, పాత సైనిక బలగాలను యుద్ధరంగంలో విలీనం చేశారు. ఆ విధంగా క్రమబద్ధ సైనికులను ఉత్సాహపరిచేందుకు, వారి నుండి యుద్ధతంత్ర కిటుకులను నేర్చుకునేందుకు స్వచ్ఛంద విప్లవకారులకు అవకాశం కల్పించారు. వీరిద్దరూ కలిసి అధికారులను ఎన్నుకున్నారు. ప్రభుత్వ శాఖల నుండి అనుమానితులను ఏరి వేశారు. గ్రామీణ ప్రాంతంలో ప్రతీఘాత విప్లవాన్ని అణచివేయడానికి సంపూర్ణ అధికారులు కలిగిన విప్లవ కమీషనర్లను నియమించారు. 18-25 సంవత్సరాల మధ్య ఉన్న అవివాహితులందరూ తప్పనిసరిగా సైనిక సేవలు అందించాలని ఆదేశించారు. తమకు బదులు వేరే వారిని సైన్యానికి పంపే వెసులుబాటు ఉన్న ధనిక వర్గాలకు కూడా సైనిక నిబంధనను వర్తింపచేశారు. చివరిగా సెప్టెంబరులో మరిన్ని విప్లవ ఉద్యమాలు

నిర్వహించిన తర్వాత శాసనమండలి, ప్రజాభద్రతా మండలి తీవ్ర అణచివేత విధానాన్ని ఆమోదించాయి. దానినే విప్లవ ఉగ్రవాదం అని చరిత్రకారులు అభివర్ణించారు.

## జాకోబిన్లు - ఉగ్రవాదం

ఉగ్రవాదానికి స్ఫూర్తి, ఉత్తేజం క్షేత్రస్థాయి నుండి వచ్చింది. ప్రతీఘాత విప్లవ శక్తులు మళ్లీ అధికారంలోకి వస్తే మనుగడే కష్టమవుతుందన్న నిర్ధారణకు పాత ప్రభుత్వంలో తీవ్ర అణచివేత, దోపిడీకి గురైన ప్రజలు వచ్చారు. ద్రోహం, అవినీతి కారణంగా తమ బంధువులు, స్నేహితులు యుద్ధరంగంలో ప్రాణాలు కోల్పోతుండడం కూడా వారిని తీవ్ర ఆగ్రహానికి గురి చేసింది. ప్రతీకారం తీర్చుకోవాలన్న మానసిక ఆలోచన తాత్విక అవగాహనతో జతైంది. అంతర్యుద్ధం కొనసాగుతున్న పరిస్థితిల్లో విప్లవ ప్రతీఘాతశక్తులు విప్లవాన్ని నాశనం చేయడానికి ఎలాంటి అవకాశాన్ని కూడా వదులుకోవన్న విషయం ప్రజలకు బాగా అర్థమైంది. కారాగార శిక్ష కూడా వారికి పెద్ద అవరోధం కాదని, తమ కుట్రలు ఫలిస్తే విముక్తి లభించడం తథ్యమని ప్రజలు నిర్ధారించుకున్నారు. జాకోబిన్లలోని తీవ్రవాద వర్గానికి చెందిన హెబర్ట్ ప్రజల్లో ఇలాంటి భావనలను రెచ్చగొట్టాడు.అయితే తీవ్ర చర్యలకు ఇచ్చిన పిలుపును అందుకోవడంలో ప్రధాన స్రవంతి జాకోబిన్లు తాత్సారం చేశారు. 'మానవత్వంలేని కిరాతకుని'గా అభివర్ణించబడ్డ రోబెస్పియర్ విప్లవం తొలినాళ్లలో మరణశిక్షను రద్దు చేయాలని డిమాండ్ చేసిన ఏకైక వ్యక్తి. అందుకు భిన్నంగా గిరోండిన్లు అట్టడుగు వర్గాలకు చెందిన సాధారణ నేరస్తులను శిక్షించడానికి మరణ శాసనాన్ని వినియోగించుకోవడాన్ని సమర్థించుకుంది. అయితే రాజు విషయానికి వచ్చేసరికి అభ్యంతరం తెలిపారు.

1793 సెప్టెంబరుకు ముందు విప్లవ ట్రిబ్యునల్ ముందు హాజరు పరిచిన 260 వ్యక్తుల్లో కేవలం 66 మందికే మరణశిక్ష విధించారు. కాని అక్టోబరు నుండి మరణశిక్షల సంఖ్య పుంజుకుంది. రాణి మారీ ఆంటోయినెట్‌కు బహిరంగ మరణశిక్ష విధించిన తర్వాత గిరోండిన్లను, డ్యూక్ ఆఫ్ ఆర్లియన్స్‌ను (ఇతడు తన స్వంత ప్రయోజనాలను కాపాడుకోవడానికి, ఆశయాలను సాధించడానికి జాకోబిన్‌లా వ్యవహరించాడు) ఉరి తీశారు. 1793 సంవత్సరం చివరి మూడు మాసాల్లో నేరారోపణలు ఎదుర్కొన్న 395 మందిలో 177 మందికి మరణశిక్ష విధించారు. అదే సంవత్సరం డిసెంబరు నాటికి పారిస్ కారాగారాల్లో శిక్షను అనుభవిస్తున్న ఖైదీల సంఖ్య 4,525కు చేరుకుంది. ఆగస్టులో ఈ సంఖ్య 1,500 గా ఉండేది. ఏమైనప్పటికీ ఈ దశలో మరణశిక్షల సంఖ్య చాలా తక్కువగా ఉండేది. నవలల్లో, చలనచిత్రాల్లో చిత్రీకరించినట్లు ప్రతి రోజు వందలాది మందిని కారాగారానికో, ఉరికంబానికో పంపలేదు.

భూస్వామ్య పాలకవర్గాలు, రాచరికవాదులు అమలు చేసిన మరణశిక్షలపై 200 ఏళ్లుగా ఉన్న ఫిర్యాదులను పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. పాత ప్రభుత్వంలో ఉరిశిక్షలు నిరంతర ప్రక్రియగా ఉండేవి. ఒక చిన్న వస్త్రాన్ని తస్కరించినందుకు కూడా పేద ప్రజలను ఉరి తీసేవారు. మార్క్ ట్వెయిన్ ఒకసారి వ్యాఖ్యానించినట్లు : " నిరంకుశ భయోత్పాత (ఉగ్రవాద) పాలనలు రెండు సందర్భాల్లో కొనసాగాయి : ఒకటి కొద్ది నెలలపాటు కొనసాగితే మరొకటి వెయ్యేళ్లు కొనసాగింది." ఉత్తర దశ నుండి పారిస్ వైపు దూసుకువస్తున్న దురాక్రమణ సైన్యం తన స్వంత శైలిలో భయోత్పాతాన్ని జాకోబిన్ల కంటే తీవ్రంగా సృష్టించే అవకాశం ఉండేది. కాని పారిస్ నగరం దాని చేతిలో లేకపోవడంతో ఏమీ

చేయలేకపోయింది. విప్లవ నాయకులను తక్షణమే హత్య చేసేందుకు విదేశీ సైన్యం రాచరికవాదులను, బడా భూస్వాములను వినియోగించుకునేది. కాని అలాంటి పరిస్థితి ఏర్పడలేదు. మధ్యేవాదులు, రాచరికవాదులు లయన్స్, మార్సెయిల్స్, తౌలాన్‌లపై నియంత్రణ సాధించి జాతీయవాదులను ఉరికంబానికి లేదా కారాగారానికి పంపే ట్రిబ్యునళ్లను స్థాపించారు.

తదనంతరం పరిణామాలు చాలా ఘోరంగా ఉన్నాయి. ఒక్క లయన్స్‌లోనే 800 మందికి మరణశిక్ష విధించారు. వెండే ప్రాంతంలో ఒక రాచరిక పురోహితుడు "ప్రతి రోజు గణరాజ్య సమర్ధకులపై రక్తసిక్తమైన దాడులు జరిగాయి," అని నివేదించాడు.

గణరాజ్యం గురించి మాట్లాడేవారిని నిర్బంధించి తర్వాత హత్యచేయడాన్ని ఒక మత పెద్ద తన ప్రసంగంలో సమర్ధించినట్లు కూడా ఆ పురోహితుడు తెలియజేశాడు కారాగారాలు ఖైదీలతో నిండిపోయి ఉన్నాయన్న సాకు చూపి విప్లవ సమర్ధకులను హత్య చేసేవారు లేదా బయటికి తీసుకువచ్చి కాల్చి చంపేవారు. మాషికౌర్‌లో 524మంది రిపబ్లికన్లను (గణరాజ్య సమర్ధకులు) కాల్చి చంపారు. అందుకుతోడు ఫ్రాన్స్ ఉత్తర సరిహద్దుల్లో భీకరంగా సాగుతున్న యుద్ధంలో వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు. ఆ యుద్ధాన్ని రాచరికవాదులు, గిరోండిన్లు మొదలుపెడితే విప్లవ విరోధులు ఉత్సాహంగా పాలుపంచుకున్నారు. సరిహద్దుల్లోనూ, అంతర్గతంగానూ యుద్ధాన్ని ప్రారంభించారు. ఈ యుద్ధంలో శత్రుసైన్యాల పట్ల సానుభూతి కలిగిన ఫ్రెంచి సైనికాధికారులు ఉద్దేశ్యపూర్వకంగా సైనికులను వేలాది సంఖ్యలో మృత్యువు వైపు నడిపించారు.

యుద్ధం, ప్రతీఘాత విప్లవ బాధితులు విప్లవంపై వచ్చిన భయానక కథనాల్లో ఎక్కడా కనిపించరు. చివరికి చార్ల్స్ డికెన్స్ రాసిన 'ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్'లో కూడా వారి గురించిన ప్రస్తావనే లేదు. అలాంటి రచయితలకు బడా భూస్వామి లేదా ఉన్నత వర్గ మహిళ మరణం ఒక పెద్ద విషాదంగానూ, రిపబ్లికన్ వృత్తిదారుడు లేదా సాధారణ మహిళ మరణం అంత ప్రాధాన్యత లేనిదిగాను తోచింది.

ఇదే వాదనను 1793 సెప్టెంబరులో రోబెస్పియర్ శాసనమండలి ఎదుట ఉంచాడు. హౌషార్డ్ అనే సైనికాధికారి అనవసరంగా సైన్యాన్ని ఉపసంహరించి వేలాది మంది సైనికుల ప్రాణాలు బలిగొన్నందుకుగాను అతడిపై కఠిన చర్యలు తీసుకోవడాన్ని అతడు సమర్ధిస్తూ మాట్లాడాడు. "కేవలం రెండేళ్ల వ్యవధిలో ద్రోహం, బలహీనత కారణంగా 1,00,000 మంది సైనికులు ఊచకోతకు గురయ్యారు" అని రోబెస్పియర్ వ్యాఖ్యానించాడు. "ద్రోహుల పట్ల మనం చూపుతున్న బలహీనత మనల్ని నాశనం చేస్తోంది," అని వాదించాడు. ఈ వాదన శాసనమండలి సభ్యులెందరినో ఆకట్టుకుంది. అంతవరకు వారు జాకోబిన్ చర్యలను సమర్ధించడానికి సంకోచించారు.

విప్లవం సందర్భంగా ఘోరమైన రక్తపాతం పారిస్‌లో మాత్రం సంభవించలేదు. ఆ నగరంపై విప్లవకారుల పట్టు ఎప్పుడూ సడలలేదు. కాని ప్రత్యర్ధుల నియంత్రణలో ఉన్న ప్రాంతాలను చేజిక్కించుకోవడానికి జరిగిన ప్రయత్నాల్లోనే రక్తం ఏరులై పారింది. రిపబ్లికన్ సైన్యాలు హింసాత్మకంగా ప్రతీకారం తీర్చుకున్న ఉదంతాలు కొన్ని జరిగాయి. లయన్స్‌లో విప్లవ కమిషన్ 1,667 మరణశిక్షలను ఆమోదించింది. వెండేలో నిర్బంధంలోకి తీసుకున్న తిరుగుబాటుదారులను విచక్షణారహితంగా హత్య చేశారు. నాంటెస్‌లో 2,000 నుండి 3,000 మంది తిరుగుబాటు సమర్ధకులను లాయర్ నదిలో ముంచి చంపారు. తౌలాన్‌లో బ్రిటన్‌కు ఆ నగరాన్ని అప్పగించారన్న ఆరోపణలు ఎదుర్కొన్న వారిని సామూహికంగా హత్య చేశారు.

ఈ భయోత్పాతానికి లేదా ఉగ్రవాదానికి గల మరో కోణాన్ని కూడా పరిశీలించాల్సి ఉంటుంది. ఈ అణచివేతను విప్లవ నాయకులు 1793-94 మధ్య ఒకరిపై ఒకరు ప్రయోగించారు. జాకోబిన్లు, గిరోండిన్ల మధ్య భేదాభిప్రాయాలతో ఈ పరంపర మొదలైంది. మారత్‌పై తాముచేసిన అభియోగాల ద్వారా గిరోండిన్లు అణచివేతకు పాల్పడటానికి తామూ సిద్ధంగా ఉన్నామని నిరూపించారు. ఆ విషయం ఎలా ఉన్నప్పటికీ జాకోబిన్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత నిర్బంధానికి గురైన తొలి గిరోండిన్ నాయకులను కేవలం గృహ నిర్బంధంలో మాత్రమే ఉంచారు. పారిస్‌ను వదలి వెళ్లి గ్రామీణ ప్రాంతాల్లో తిరుగుబాటు తీసుకురావడానికి వారు చర్యలు తీసుకోవడంతో ఈ వ్యవహారం వాద ప్రతివాదనలతో కొలిక్కి రాదన్న విషయం స్పష్టమైపోయింది. ఏ ఒక్క గిరోండిన్ నాయకుణ్ణి స్వేచ్ఛగా తిరగనిచ్చినా అతడు కూడా అలాగే ప్రవర్తిస్తాడన్న భావన రోబెస్పియర్, డాంటన్‌లలో ఏర్పడింది. తీవ్ర అణచివేత -అంతర్యుద్ధ పరిస్థితుల్లో దానర్థం మరణదండన - గిరోండిన్‌ల తిరుగుబాటును నిరోధించడానికి ఏకైక మార్గంగా మిగిలింది.

అయితే మధ్యతరగతి జాకోబిన్ల దృష్టిలో గిరోండిన్ల పట్ల అనుసరించిన వైఖరి అంతర్యుద్ధం నేపథ్యంలో రిపబ్లికన్లలో కొన్ని ఇతరవర్గాలకు కూడా వర్తిస్తుంది. రోబెస్పియర్ విషయానికి వస్తే అతడి గట్టిమద్దతుదారులైన పారిస్ ప్రజలే ఒక పెద్ద సమస్యగా మారడం మొదలుపెట్టారు. వీధుల్లో విప్లవానికి విశాలమైన ప్రజా మద్దతును కూడగట్టడంలో పారిస్ ప్రజలు అద్భుతాలు సృష్టించి ఉన్నారు. అయితే రోబెస్పియర్, ఇతర జాకోబిన్ నాయకుల నేపథ్యమైన మధ్యతరగతి వర్గాన్ని వారు ఇబ్బందులను సృష్టించడం మొదలుపెట్టారు. జాకోబిన్ నాయకులు ఎక్కువగా ఆస్తులుకలవారే. వారిలో అనేక మంది గణరాజ్య స్థాపనపై ఊగిసలాట ధోరణిని ప్రదర్శించారు. పారిస్ శాఖల పిలుపు మేరకు తీవ్ర అణచివేతకు అనుమతినిచ్చిన రోబెస్పియర్ మరో వైపు ప్రజా సంఘాలపై దాడులను ముమ్మరం చేశాడు. సెప్టెంబరు మధ్యలో జాక్స్ రౌక్స్‌ను నిర్బంధంలోకి తీసుకున్నారు. అక్టోబరులో క్లెయిర్ లాకోంబ్ స్థాపించిన గణరాజ్య మహిళావిప్లవ సమాజాన్ని రద్దు చేశారు. చివరగా మార్చిలో హెబెర్ట్‌తోపాటు మరెందరో నాయకులను జీవితఖైదుకు పంపారు.

గౌరవప్రదమైన, సంపన్నమైన మధ్యతరగతి కుటుంబాలను భయభ్రాంతులకు గురి చేసిన 'అతివాదుల' డిమాండ్లు ఒక్కటే రోబెస్పియర్‌కు సమస్యగా ఉండేది కాదు. వ్యక్తిగత ప్రయోజనాలు, ఆకాంక్షలకు ప్రాధాన్యతనిచ్చే వారివల్ల విప్లవోద్యమం నాశనమవుతుందని కూడా అతడు ఆందోళన చెందాడు. డాంటన్ చుట్టూ ఉన్న సమూహానికి ఈ రెండవ సమస్య వర్తిస్తుంది. డాంటన్ విప్లవ చొరవ అసాధారణంగానూ, ఉత్తేజకరమైనదిగానూ ఉండేది. అయితే సందేహాస్పదమైన ధనికులతో సాన్నిహిత్యం కారణంగా లభించే వ్యక్తిగత పారితోషికాలపట్ల కూడా అతడు, అతడి అనుచరగణం ఆకర్షితులయ్యే ప్రమాదం ఉండేది. ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీకి సంబంధించిన ఒక భారీ అవినీతి కేసులో డాంటన్ స్నేహితులు దోషులుగా తేలడంలో ఎలాంటి ఆశ్చర్యం కనిపించదు.

1794 జనవరి, ఫిబ్రవరి మాసాల్లో తన చుట్టూ వందిమాగధుల బృందాన్ని చేరదీయడానికి డాంటన్ ప్రయత్నించినపుడు రోబెస్పియర్ అతడిపై అనుమానాలను పెంచుకున్నాడు. తొమ్మిది నెలల క్రితం గిరోండిన్లు వ్యవహరించినట్లే డాంటన్ బృందం కూడా అదే పంథాను అనుసరించగలదని భయపడ్డాడు. హెబర్ట్‌కు ఉరిశిక్ష పడిన ఐదు రోజులకు డాంటన్, డెస్మోలిన్స్ తదితరుల వంతు వచ్చింది. వారిని నిర్బంధంలోకి తీసుకున్నారు. ట్రిబ్యునల్ ఎదుట హాజరు పరిచిన తర్వాత వారికి మరణశిక్ష

విధించారు.

రోబెస్పియర్, అతడి సన్నిహితులు సందిగ్ధావస్థలో పడిపోయారు. తమ స్వంత వర్గమే ప్రతీఘాతవిప్లవ శక్తులపట్ల అయిష్టంగానే మొగ్గుచూపడం మొదలుపెట్టింది. లాభార్జనపై ఆధారపడ్డ ఆ వర్గం అవినీతి, లంచం పట్ల ఆకర్షితమైంది. కఠిన చర్యలు తప్పవన్న భయమే మధ్యతరగతిని విజయపథంపై నిలపగలిగింది. కొత్త స్వరూపం గల సమాజాన్ని స్థాపించాలన్నదే తన ధ్యేయమని రోబెస్పియర్ భావించాడు. అలాంటి సమాజంలో మధ్యతరగతి విలువలు సాకారమవుతాయని విశ్వసించాడు. తన లక్ష్యాన్ని ఒక 'పవిత్ర కార్యం'గా గుర్తించడం ద్వారా తన ఆంతరంగిక భావాలకు రోబెస్పియర్ ఒక రూపం ఇచ్చాడు. అయితే మధ్యతరగతిని క్రమశిక్షణలో పెట్టకుండానే ఆ లక్ష్యాన్ని సాధించలేదు. అందుకే కొన్ని సందర్భాల్లో కఠినంగా కూడా వ్యవహరించాడు. 1794 ఫిబ్రవరిలో రోబెస్పియర్ పేర్కొన్నట్లు, "పవిత్ర కార్యం లేనిదే అణచివేత నిరర్థకమవుతుంది. అణచివేత లేకుంటే పవిత్ర కార్యం బలహీనమవుతుంది."

అంతకంటే ప్రాధాన్యత కలిగిన విషయమేమిటంటే అణచివేత చర్యలు రాజ్యాన్ని విప్లవ భావనలు, చర్యలకు కేంద్రబిందువుగా మార్చివేశాయి. ఈ విధానంవల్ల మధ్యతరగతికి సాధారణ ప్రజల నుండి ముప్పు తప్పింది. ప్రజల ఆగ్రహం ప్రతీఘాత విప్లవాన్ని అడ్డుకోవడంపై కేంద్రీకృతమైంది. విప్లవాన్ని దిగువ తరగతుల చేతిలో ఎక్కువగా కేంద్రీకృతం కాకుండా ఈ అణచివేత అడ్డుకుంది. ప్రజలు వీధుల్లో తిరుగుతూ (దీనిని ఫ్రెంచిలో కార్మార్నోల్ అంటారు) రాజ్యం తీసుకునే అణచివేత చర్యలను వీక్షించడమే మధ్యతరగతి రాజకీయ నాయకులకు సముచితంగా తోచింది. ప్రజలే వాద ప్రతివాదనలకు దిగి స్వంతంగా చొరవ తీసుకొని వ్యవహరించడం వారికి ఇష్టం లేదు. విప్లవ పరిరక్షణే కాకుండా రాజ్యాధికారాలను కేంద్రీకరించడంలో అణచివేత కీలకపాత్రను పోషించింది. అధికారం ఒక రాజకీయ వర్గం చేతిలో కేంద్రీకృతమైంది. ఈ రాజకీయ వర్గం ప్రజలు, మధ్యతరగతిలోని (బూర్జువావర్గం) కొన్ని అనుకూల వర్గాల మధ్య సమతుల్యాన్ని పాటించింది.

1794 వసంతం నాటికి రోబెస్పియర్ చుట్టూ చేరిన జాకోబిన్లు ఒక్కరే పరిపాలించారు. పారిస్‌లోని ప్రజా సంఘాలను రద్దు చేశారు. కమ్యూన్‌లో అతివాదులను ఏరివేశారు. శాఖలను రద్దు చేశారు. ఆహార నిల్వలపై నిఘా కోసం నియమించిన కమిషనర్లను పదవి నుండి తొలిగించారు. గతంలో ఎన్నడూ లేనివిధంగా ప్రభుత్వ అధికారం కేంద్రీకృతమైంది. ప్రభుత్వంలో అతివాదులు, మితవాదుల మధ్య ముఠాకక్షలు సమసిపోయాయి. అయితే ఇలాంటి కేంద్రీకృత అధికారం మరింత అణచివేత ద్వారానే మనుగడ సాగించగలదు.

సబౌల్ వివరించినట్లు :

> "గతంలో అణచివేతను విప్లవ ద్రోహులపైనే ప్రయోగించేవారు. కాని ఇప్పుడు దానిని ప్రభుత్వ కమిటీలను వ్యతిరేకించే వారికి కూడా విస్తరించారు. ఈ విధంగా ప్రభుత్వ కమిటీలు అణచివేతను రాజకీయ జీవనంపై తమ పట్టును పదిలపరచుకోవడానికి ఒక ఆయుధంగా వాడుకున్నాయి."

అణచివేత కేంద్రీకృతం కావడంవల్ల ఒక కొత్త శక్తి ఆవిర్భవించింది. జాకోబిన్ కేంద్రనాయకత్వం తమతో ఏకీభవించని వారిని శత్రువులుగా పరిగణించడం మొదలుపెట్టింది. ఇలాంటి భావన కొంత వరకు న్యాయసమ్మతంగా ఉంది. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై పరిమితులు విధించడంతో పాలక మధ్య తరగతి వర్గంలోనే అసంతృప్తి బయల్దేరింది. రౌక్స్, హెబర్ట్ అనుచరులైన పారిస్ సమూహాలు కూడా నిరసన గళం విప్పాయి.

ఇలాంటి వ్యతిరేకతను అణచివేత ద్వారా రూపుమాపడానికి జరిగిన ప్రయత్నాలు జాకోబిన్ కేంద్ర నాయకత్వానికి ప్రజలకు మధ్య మరింత దూరం పెరిగింది. అయితే అణచివేతను నిలిపివేస్తే జాకోబిన్ నాయకత్వంపై పగ పెంచుకున్న వారికి పూర్తి స్వేచ్ఛను కల్పించే ప్రమాదం ఉండేది.

తదుపరి చర్యలు ఎలా తీసుకోవాలో తెలియక రోబెస్పియర్ అవస్థపడ్డాడు. కొన్ని రాష్ట్రాల్లో అణచివేతను కట్టడి చేయడానికి ప్రయత్నించాడు. ఉదాహరణకు నాంటెస్‌లో ప్రజలను (విప్లవ విరోధులను) నదిలో సామూహికంగా జలసమాధి చేసిన అధికారిని పారిస్‌కు వెనక్కి పిలిపించాడు. అయితే 1794 మేలో పారిస్ నగరంలో అణచివేత చర్యలను తీవ్రతరం చేయడానికి అనుమతించాడు. ఆ తదుపరి మూడు నెలల్లో విధించిన మరణశిక్షల సంఖ్య 1793 సంవత్సర కాలంలో అమలు జరిపిన ఉరిశిక్షల సంఖ్యతో సమానంగా నిలిచింది. తొట్టతొలిసారిగా దోషులకు వాదించే హక్కును నిరాకరించారు. 'నైతిక బాధ్యత' సాకుతో న్యాయమూర్తులకు ఎవరినైనా శిక్షించే అధికారం ఇచ్చారు. ఏ మాత్రం సంబంధం లేని వ్యక్తులను సైతం ఒక సమూహంగా ఏర్పరచి కారాగారంలో కుట్ర పన్నారనే నెపంతో విచారణకు హాజరు పరిచారు. ఈ సమయంలోనే బ్రిటీషు కార్మికవర్గ విప్లవ ప్రతినిధి, అమెరికా విప్లవ మహాకరపత్ర రచయిత అయిన టామ్ పేయిన్ తృటిలో మరణశిక్షను తప్పించుకున్నారు. విదేశీయుడు కావడమే అతడి నేరం. అలాగే కొందరు గిరోండిన్లతో అతడికి స్నేహ సంబంధాలు ఉండేవి. (గతంలో జాకోబిన్ నాయకత్వానికి కూడా గిరోండిన్లతో మంచి సంబంధాలు ఉండేవి)

## థెర్మిడార్ - ఆ తర్వాత

విప్లవ పాలనను పరిరక్షించడంలో జాకోబిన్ పద్ధతులు గిరోండిన్ల కంటే విజయవంతంగా నిలిచాయి. 1794 వేసవి నాటికి విప్లవ సైన్యం ఐరోపాలోనే అత్యంత సమర్థవంతమైన పోరాటం బలంగా రూపుదిద్దుకుంది. రాష్ట్రాలలోని తిరుగుబాట్లు అణచివేయబడ్డాయి. బ్రసెల్స్‌ను ఫ్రెంచి సైన్యం స్వాధీనం చేసుకుంది. ఉత్తర దిశగా పయనించసాగింది. గణరాజ్యం అప్పుడు 'సమైక్యంగా, అవిభాజితం'గా తొలిసారి దర్శనమిచ్చింది.

అయినప్పటికీ ఈ విజయాలు జాకోబిన్లకు ఒక పెద్ద సమస్యను సృష్టించిపెట్టాయి. మితవాద, అతివాద శక్తుల మధ్య సమతుల్యం పాటిస్తూ వారు అధికారంలో ఒక్కో మెట్టు పైకి ఎక్కగలిగారు. ఈ ప్రక్రియలో తమ స్వంత మధ్యతరగతిలోని కొన్ని వర్గాలపై కఠిన చర్యలు తీసుకున్నారు. మధ్యతరగతిలోని అత్యధిక శాతం వర్గాలకు కొద్దినెలల ముందు ఇలాంటి ప్రత్యామ్నాయం కనిపించలేదు. అందుకే శాసనమండలి ఒక నెల తర్వాత మరో నెలలో సమావేశమవుతూ ప్రజా భద్రత కమిటీ అధికారాలను గణనీయంగా పెంచింది. కాని ఈ విజయాలు నియంతృత్వ పాలన ఇక ఎంత మాత్రం అవసరం లేదన్న భావనను ప్రజల్లో కలిగించింది.

అంతకుముందు గడచిన నెలల్లో రోబెస్పియర్ ఎందరో శత్రువులను తయారు చేసుకున్నాడు. డాంటన్ వందిమాగాధులు, అణచివేతను రాష్ట్రాలలో చాలా దూరం తీసుకెళ్లారన్న కారణంగా పారిస్‌కు వెనక్కి రప్పించబడిన ప్రతినిధులు,హెబర్ట్ పూర్వపు సమర్థకులు, గిరోండిన్లతో సంబంధాలను పూర్తిగా తెంచుకోని వారు... ఇలా అందరూ రోబెస్పియర్‌కు శత్రువులుగా తయారయ్యారు. 1794 జులై 27న వారందరూ శాసనమండలిలో చర్చ జరుగుతుండగానే రోబెస్పియర్‌పై దాడి చేశారు. ఒక ప్రతినిధి రోబెస్పియర్‌ను, అతడి అనుచరులను అరెస్టు చేయడానికి వారెంట్లను జారీ చేయాలని మండలి ఎదుట ప్రతిపాదన ఉంచాడు. ఆ ప్రతిపాదన మండలి ఏకగ్రీవంగా ఆమోదించింది.

విప్లవోద్యమం తీవ్రతరం చేయాలని ప్రజలకు పిలుపునివ్వడం ద్వారా జాకోబిన్లు తమను తాము కాపాడుకోవడానికి చివరి ప్రయత్నం చేశారు. అయితే స్వయంగా వారే కమిటీలను, శాఖలను, దినపత్రికలను మూసివేశారు. ఆ కారణంగా ప్రజలను విప్లవోద్యమానికి సమీకరించే సాధనాలు, సంఘాలు కొరవడ్డాయి. ఆహార నిల్వలపై నిఘాను వారే ఎత్తివేశారు. నాలుగు రోజుల ముందు గరిష్ట వేతన రేట్లను నిర్ధారించారు. వాటివల్ల ఎందరో వృత్తిదారులు తమ వేతనాల్లో కోతను ఎదుర్కొన్నారు. పారిస్‌లోని 48 శాఖల్లో కేవలం 16 శాఖలే ఉద్యమానికి ప్రజలను సమీకరించాయి. అయితే సరైన నాయకత్వం లేకపోవడంతో ప్రజలు గంటల తరబడి నిరీక్షించాల్సి వచ్చింది. చివరగా వారు కూడా ఎవరి దారిన వారు వెళ్లిపోయారు. జులై 28న రోబెస్పియర్‌తోపాటు అతడి అనుచరులైన 21 మందిని ఉరి తీశారు. మరుసటి రోజు మరో 71 మందిని ఉరి తీశారు. విప్లవ చరిత్రలో అతిపెద్ద సామూహిక మరణదండన ఇదే.

శాసనమండలిలో రోబెస్పియర్ ఇలా గట్టిగా అరిచాడు : "గణరాజ్యం సాధించలేని లక్ష్యమైపోయింది. ఇప్పుడు దోపిడీదారులు విజయం సాధించారు." అతడు చెప్పింది నిజమే.గత ఐదేళ్లుగా సాగిన మహోన్నత విప్లవోద్యమం ముగింపు దశకు చేరుకుంది. థెర్మిడార్ అన్నది రోబెస్పియర్ పదవీచ్యుతుడైన మాసం పేరు. అతి అంతర్గత ప్రతీఘాత విప్లవానికి చిహ్నంగా మారిపోయింది.

రోబెస్పియర్‌ను అధికారం నుండి తొలగించిన భాగస్వామ్య పక్షాలు కూడా అధికారాన్ని ఎంతో కాలం నిలబెట్టుకోలేకపోయాయి. తదుపరి నెలల్లో విప్లవద్రోహులు కొత్తగా ఆత్మవిశ్వాసాన్ని పొందారు. ధనిక కుటుంబాలకు చెందిన అల్లరి మూకలు (యువకులు) విప్లవ సిద్ధాంతాలను సమర్థించే వారిపై దాడులు చేశాయి. తమ వర్గంపట్ల గౌరవ భావం చూపని వారిని సైతం శిక్షించాయి.ఒక అల్లరిమూక జాకోబిన్ మండలిని బలవంతంగా మూసివేసింది. ఓటు హక్కు కోసం కొత్తగా ఆస్తి అర్హతలను నిర్ధారిస్తూ శాసనమండలి చట్టాన్ని ఆమోదించింది. మాజీ విప్లవవాదులను ఒక శ్వేత అణచివేత ఉద్యమం ఉరికంబానికి ఎక్కించింది. మరెందరినో పీడించింది. 1795 ఏప్రిల్, మేలలో వచ్చిన స్వల్పకాలిక ఉద్యమాలు పేదలకు అవకాశమిస్తే మధ్యతరగతికి ఏ మాత్రం తీసిపోరని నిరూపించాయి. అయితే థెర్మిడారియన్లకు విధేయులైన శక్తులు ఆ ఉద్యమాలను అణచివేశాయి. వలసదారులు దేశానికి తిరిగి రావడం మొదలుపెట్టారు. రాచరిక వ్యవస్థ త్వరలో తిరిగి వస్తుందని బీరాలుపలికారు. సింహాసనానికి పోటీదారుడైన లూయీ–18 అజ్ఞాతవాసం నుండి ఒక ప్రకటన చేస్తూ తాను పాత వ్యవస్థను తిరిగి తీసుకురావాలని కోరుకుంటున్నట్లు నొక్కి చెప్పాడు. మూడు ఎస్టేట్‌లను పునరుద్ధరించి, థెర్మిడారియన్లతో సహా విప్లవంలో పాలుపంచుకున్న వారినందరినీ శిక్షిస్తానని పేర్కొన్నాడు.

ఆ తర్వాత 1795 అక్టోబరులో రాచరికవాదులు పారిస్‌లో స్వంత ఉద్యమాన్ని ప్రారంభించారు. భయభ్రాంతులకు గురైన థెర్మిడారియన్లు జాకోబిన్లను మరలా సాయుధులను చేశారు. గతంలో జాకోబిన్‌గా వ్యవహరించిన నెపోలియన్ బోనపార్టే అనే సైనికాధికారి నేతృత్వంలోని సైన్యం తమకు అండగా తరలిరాకముందే ప్రజలు ప్రభుత్వాన్ని పరిరక్షించడానికి తోడ్పడాలని పిలుపునిచ్చారు. రాచరిక వ్యవస్థ పూర్తిస్థాయిలో పునరుద్ధరించబడుతుందని భయపడిన థెర్మిడారియన్లు ఐదుగురు సభ్యులతో కూడిన నిర్దేశక మండలికి అధికారాన్ని అప్పగించడానికి అంగీకరించారు. నాలుగేళ్లపాటు ఆ నిర్దేశక మండలి ఒకే దిశలో పయనించలేకపోయింది. ఆటుపోట్ల మధ్య సాగిన ఆ పాలనాకాలంలో నెపోలియన్ మరింత బలోపేతమయ్యాడు. సైన్యంలో మంచి పట్టు ఉండడంతో అతడు రాచరికవాదులు, జాకోబిన్ల పునరుద్ధరణకు అడ్డుగోడగా నిలిచాడు. చివరికి 1799లో నెపోలియన్ తిరుగుబాటు చేసి నియంతృత్వ పాలనకు తెర తీశాడు. 1804లో అతడు పోప్‌ద్వారా చక్రవర్తిగా పట్టాభిషేకం పొందాడు. మాజీ జాకోబిన్లు, బడా భూస్వాముల (వీరు అజ్ఞాతవాసం నుండి తిరిగి వచ్చారు) ఉమ్మడి సహకారంతో పాలించాడు. చివరగా, 1814,1815లలో అతడి సైన్యాలు వరుసగా పరాజయాలను ఎదుర్కోవడంతో ఇతర ఐరోపా శక్తులకు బౌర్‌బన్ రాచరిక వ్యవస్థను పునరుద్ధరించే అవకాశం లభించింది. రోబెస్పియర్ చివరగా ఎంతో ఆందోళనతో చేసిన హెచ్చరిక వాస్తవ రూపం దాల్చింది.

అయితే రెండు విషయాల్లో మాత్రం అతడు తప్పుగా ఆలోచించాడు. 1794 థెర్మిడార్ తర్వాత విప్లవం ముగిసింది. కాని విప్లవం తీసుకువచ్చిన అనేక మార్పులు అలాగే కొనసాగాయి. ఈ మార్పులను స్థిరీకరించడం ద్వారా నెపోలియన్ తన ప్రభుత్వాన్ని నిర్మించాడు. భూస్వామ్య బకాయిల రద్దు, స్వతంత్ర రైతాంగ వర్గం ఏర్పాటు సుంకం కేంద్రాల ఎత్తివేత, క్రమబద్ధమైన జాతీయ పరిపాలనా యంత్రాంగం అన్నింటికంటే ముఖ్యంగా, బూర్జువా ఆశయాలను ప్రతిబింబించే ప్రభుత్వ విధానాలు (ఇందులో వారసత్వ, ఉన్నత వర్గ ప్రయోజనాలను పూర్తిగా పక్కన పెట్టారు) లాంటి విప్లవ విజయాలు అలాగే కొనసాగాయి.

కొంతకాలంపాటు ఐరోపాలోని చాలా భూభాగాన్ని నెపోలియన్ సైన్యం తన ఆధీనంలో ఉంచుకోగలిగింది. ఎందుకంటే ఆ సైన్యం పాత వ్యవస్థకు చెందినది కాదు. విప్లవం సందర్భంగా కనిపించిన విధంగా సమీకరణ, సంఘటన ఈ సైన్యం విషయంలో కూడా జరిగాయి. ముఖ్యంగా జాకోబిన్ దశ నాటి పరిస్థితులను సైన్యం తలపించింది. విప్లవవాద కాలంలో సామర్థ్యం ఆధారంగా పైకి వచ్చిన సైనికాధికారులు దానికి నేతృత్వం వహించారు. చివరికి మాజీ జాకోబిన్ అతివాదిపై ఆధారపడి నెపోలియన్ తన పోలీసు బలగాలను నడిపించాడు.

డచ్, ఇంగ్లాండ్, అమెరికా విప్లవాల వలే ఫ్రెంచి విప్లవం కూడా పూర్తిస్థాయి మార్కెట్ ఆధారిత సమాజ స్థాపనకు అడ్డంకిగా ఉన్నపాత వ్యవస్థలను నిర్మూలించింది. 1792-94 సంఘటనల తర్వాత భూస్వామ్య పాలకవర్గాలకు సమాజంపై తమ ఆధిపత్యాన్ని పునరుద్ధరించడానికి ఎలాంటి మార్గం మిగల్లేదు.

ఇరవై ఏళ్ల తర్వాత విప్లవాన్ని విశ్లేషించిన సెండ్‌హోల్ అనే నవలా రచయిత ఇలా వ్యాఖ్యానించాడు : "2,000 సంవత్సరాల ప్రపంచ చరిత్రలో ఎన్నడూ లేని విధంగా సాంప్రదాయాలు, ఆలోచనలు, నమ్మకాలలో తీవ్రమైన విప్లవం వచ్చింది." విప్లవవాదులు ఓడిపోయి ఉండొచ్చు కాని విప్లవవారసత్వం చాలా వరకు మనుగడ సాగించి ఆధునిక ప్రపంచానికి ఒక స్వరూపాన్ని ఇచ్చింది.

రెండో విషయంలో కూడా రోబెస్పియర్ తప్పుగా విశ్లేషించాడు. అందుకు కారణం విప్లవం కేవలం మధ్యతరగతి రాజకీయ వర్గాలకే పరిమితం కాకపోవడం. ఈ రాజకీయ వర్గాలు కూడా గతంలో ఉన్న వాటికంటే అతివాద ధోరణిని ప్రదర్శించాయి. కీలకమైన విషయమేమిటంటే విప్లవం కారణంగా పట్టణ, గ్రామీణ ప్రాంతాలకు చెందిన లక్షలాది మంది ప్రజలు తొలిసారిగా రాజకీయ జీవితంలోకి అడుగుపెట్టారు. చరిత్రను రూపుదిద్దడానికి ప్రజలకు ఇలాంటి అవకాశం గతంలో ఎన్నడూ రాలేదు. తమ స్వంత ప్రయోజనాల కోసం పోరాడడం వారు నేర్చుకున్నారు. ఆ ప్రయోజనాలు ఏమిటో నిర్ధారించడానికి వాద ప్రతివాదనలకు దిగేవారు.

1789-92 మధ్య బడా భూస్వాముల వ్యవసాయ క్షేత్రాలను అగ్నికి ఆహుతి చేసిన రైతులు తదుపరి ప్రభుత్వాలు తమ నుండి భూమిని స్వాధీనం చేసుకోవడానికి అనుమతినిచ్చే పరిస్థితిలో లేరు. పారిస్, తదితర నగరాలలో అట్టడుగు వర్గాలు తమ స్వంత ప్రయోజనాల కోసం చరిత్రలో ఎన్నడూ లేని స్థాయిలో ఉద్యమించారు. 1830, 1848, 1871 తర్వాత 1936, 1968లో కూడా అదే స్థాయిలో ఉద్యమించారు.

ప్రపంచ చరిత్ర ఫ్రెంచి విప్లవం చూపిన విశాల ప్రభావాన్ని దాదాపు వాస్తవికంగా అంచనా వేసే వర్ణనలు క్షేత్రస్థాయి సంఘటనలను, పారిస్‌లోని ఇరుకైన సందుల్లో, జనసాంద్రత ఎక్కువ కలిగిన మురికివాడల్లో చోటు చేసుకున్న ఉద్యమాలను తక్కువ చేసి చూపే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది. ఈ ప్రాంతాల్లోనే ప్రజలు మారత్, హెబర్ట్ రచనలను చదివారు, వాటి గురించి చర్చించారు. శాఖా సమావేశాల్లో గంటల తరబడి గడిపారు. ఆహార నిల్వదారులను బయటికి లాక్కొచ్చారు. రాచరికవాద దళారుల కోసం అన్వేషించారు. కత్తులు, ఈటెలను నూరి బాసిలీకి ప్రదర్శనగా వెళ్లారు. రాజ్యాంగ రాచరిక వ్యవస్థ స్థానంలో గిరోండిన్లు, గిరోండిన్ల స్థానంలో జాకోబిన్లు అధికారాన్ని చేపట్టడానికి సహకరించిన తిరుగుబాట్లను నిర్వహించారు. విప్లవాన్ని గ్రామీణ ప్రాంతానికి విస్తరింపచేయడానికి లేదా యుద్ధరంగంలో శత్రువును ఎదుర్కోవడానికి వేలాది మంది ప్రజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు.

నగరాలలో ప్రజా ఉద్యమాలకు కొన్ని పరిమితులు ఉండేవి. ఆ కాలంలో ఉన్న ఫ్రెంచి సమాజ నిర్మాణాల కారణంగానే పరిమితులు పుట్టుకొచ్చాయి. పట్టణ జనాభాలో అత్యధిక భాగం అప్పటికీ చిన్న కర్మాగారాలలో పని చేస్తూ ఉండేది. అలాంటి కర్మాగారాల్లో యజమాని, అతడి కుటుంబ సభ్యులు ఇద్దరో ముగ్గురో కార్మికులతో కలిసి పని చేసేవారు. ఇరువురి జీవన ప్రమాణాల్లో పెద్దగా తేడా ఉండేది కాదు. వీరు ఉమ్మడిగా కలిసి వీధుల్లో ప్రదర్శనలు నిర్వహించేవారు లేదా శాఖ సమావేశాలు, రాజకీయ మండళ్లకు హాజరయ్యేవారు. అయితే వారు సమయాన్ని ఎక్కువగా వెచ్చించే ఉత్పత్తి ప్రక్రియలో వర్గపరంగా మమేకం కాలేకపోయారు. వారి ఆశయం వ్యక్తిగత కుటుంబాన్ని పరిరక్షించడం. కుటుంబానికి తండ్రే పెద్ద దిక్కు. సమాజాన్ని ఉమ్మడిగా పునరుద్ధరించాలన్న ఆలోచన వారికి ఉండేది కాదు.

గతంలో తమను అవమానానికి గురి చేసిన భూస్వాములపై, తమను ఆకలికి గురిచేసిన బడా వ్యాపారులపై తిరగబడే సాహసం చేసేవారు. విప్లవంపై క్రొపోట్కిన్, గ్యారిన్ రచించిన చరిత్ర గ్రంథాలు ప్రజల అసాధారణ సాహసాన్ని, చొరవను విపులంగా వివరిస్తాయి. ప్రజలు తిరగబడినప్పుడు

తమ స్వార్థ ప్రయోజనాలను కూడా త్యాగం చేయడం మొదలుపెట్టారు. నిరసన ప్రదర్శనలకు మహిళల నాయకత్వం వహించడం అందుకు తార్కాణం. కొందరు విప్లవవాదులు ఇచ్చిన పిలుపు మేరకు మహిళలు పెద్ద సంఖ్యలో వీధుల్లోకి వచ్చారు. తమకూ ఓటు హక్కు కల్పించాలని డిమాండ్ చేశారు. విప్లవ మహిళా మండళ్లు కూడా ఆవిర్భవించాయి. అయినప్పటికీ 1793-94 మధ్య విప్లవం ఎదుర్కొన్న మహాసంక్షోభంలో ప్రజలు తమ స్వంత కార్యాచరణను రూపొందించడంలో, ఆ కార్యక్రమంతో విజయం వైపు పయనించడంలో విఫలమయ్యారు.

అల్బర్ట్ సబౌల్ నిరూపించినట్లు ప్రజలు తమ జీవన స్థితిగతుల నేపథ్యంలో అవసరమైన విప్లవ చర్యలు తీసుకునేలా జాకోబిన్లపై ఒత్తిడి తెచ్చే అవకాశముండేది. అయితే వారు విప్లవ సమస్యలను పరిష్కరించే దిశగా స్పష్టమైన, ఉమ్మడి ప్రతిస్పందనను స్వంతంగా రూపొందించలేకపోయారు. గరిష్ట ధరలకోసం పోరాడగలిగారు కాని నిర్ణయాత్మకమైన ఉత్పత్తి ప్రక్రియలను తమ నియంత్రణలోకి తీసుకునే పరిస్థితులోలేరు. అణచివేతపై (ప్రతీఘాత విప్లవశక్తుల ఏరివేత) వారు చూపిన ఆసక్తి కూడా వారి బలహీనతను సూచించింది. విప్లవాన్ని ధ్వంసం చేయకుండా ఇతర వర్గాలను అడ్డుకోవడంపై వారు దృష్టి సారించాల్సి వచ్చింది. ఎందుకంటే తమ భవితపై తామే స్వయంగా ప్రత్యక్ష, ఉమ్మడి నియంత్రణ సాధించే పరిస్థితిలో వారు లేరు.

అయినప్పటికీ వారి చర్య, చొరవ, డాంటన్ స్ఫూర్తిదాయక ప్రవచనాలు, రోబెస్పియర్ ఉక్కులాంటి పట్టుదల ఫ్రాన్స్‌లో పాత వ్యవస్థను కూలదోసాయి. తదుపరి వందేళ్లు వరకు ఐరోపా, ఇతర దేశాలకు స్ఫూర్తిదాయకంగానూ, భయంగొలిపే సంఘటనలుగా ఫ్రెంచి విప్లవం నిలిచింది. ప్రజా ఉద్యమం అణచివేయబడిన తర్వాత ప్రజల నుండే గ్రాఖ్యూస్ బాబ్యూఫ్ చుట్టూ చేరిన విప్లవవాదుల వర్గం ఒకటి ఆవిర్భవించింది. (గ్రాఖ్యూస్‌ను 1796లో ఉరి తీశారు) ఈ వర్గం సామాజిక, రాజకీయ సమానత్వం కోసం పోరాడుతూ 19, 20 శతాబ్దాలలో వచ్చిన సోషలిస్టు ఉద్యమాలకు రంగాన్ని సిద్ధం చేసింది.

మూడవ అధ్యాయం

# ఫ్రాన్స్ వెలుపల జాకోబిన్‌వాదం

"తమ స్వేచ్ఛను తిరిగి పొందాలనుకుంటున్న ప్రజలందరికీ ఊరటనిస్తాయి", అన్నది 1792లో గిరోండిన్ నేతృత్వంలోని శాసనమండలి ఇచ్చిన హామీ. ఐరోపా చక్రవర్తులపై బ్రిస్సాట్ ప్రకటించిన యుద్ధం పాతతరహా దురాక్రమణ యుద్ధం కాదు. అది విముక్తి యుద్ధమని బ్రిస్సాట్ వాదించాడు. విప్లవ ప్రగతిని హర్షించే ప్రజలు ఫ్రాన్స్ వెలుపల కూడా పెద్ద సంఖ్యలో ఉన్నారన్నది నిర్వివాదాంశం.

> "ఇదో మహోన్నతమైన చైతన్యోద్యమం. ఆలోచించే ప్రతివారూ ఈ కాలపు సమరోత్సాహాన్ని పంచుకున్నారు. ఒక ఉదాత్త వ్యక్తి భావనలు ప్రజల ఆలోచనలను తట్టి లేపాయి. ప్రపంచమంతటా ఆధ్యాత్మిక ఉత్సాహం వెల్లివిరిసింది."

అలా ప్రపంచయువతపై ఫ్రాన్స్‌లో జరిగిన సంఘటనలు చూపిన ప్రభావాన్ని జర్మన్ తత్త్వవేత్త హెగెల్ వర్ణించాడు. అతడి జ్ఞాపకశక్తి అతడిపై ఎలాంటి కుయుక్తులు పన్నలేదు. ప్రజలను చైతన్యోద్యమం ప్రభావితం చేసిన ప్రతిచోటా విప్లవ సందేశం మారుమ్రోగింది.

ఆంగ్లకవులు వర్డ్స్‌వర్త్, సౌథే, కాలెరిడ్జ్ బాస్టిల్ ముట్టడి పట్ల తీవ్రంగా ఆకర్షితులయ్యారు. "మానవాళి సాధారణ హృదయం నుండి పూర్తిస్థాయిలో జన్మించిన దేవతలాగా 'ఆశ' ఉప్పొంగుతుంది," అని కాలెరిడ్జ్‌రాశాడు. ఒక సైనికుడితో జరిగిన వాదనలో విప్లవ విలువలను సమర్థించినందుకు కవి, శిల్పి అయిన విలియం బ్లేక్‌ను దాదాపు నిర్బంధంలోకి తీసుకునే పరిస్థితి ఏర్పడింది. రసాయన శాస్త్ర నిపుణుడు జోసెఫ్ ప్రెస్లీ నివాస గృహంపై రాచరికవాద మూక దాడి చేసింది. యువకుడైన హెగెల్ లాగా జర్మన్ తత్త్వవేత్తలు కాంట్, ఫిషే కూడా విప్లవం పట్ల అమితాసక్తిని ప్రదర్శించారు.

థెర్మిడార్ సంభవించిన తర్వాత కూడా కాంట్ ఇలా పేర్కొనగలిగాడు : "జాకోబిన్లు చేసిన తప్పులు గత కాలపు నియంతల అకృత్యాలతో పోలిస్తే ఎందులోనూ సాటిరావు."

విప్లవ గీతాల ధ్వనులను గోథే తన సంగీతంలో చొప్పించాడు. తన మూడవ సింఫనీ అయిన 'ఎరాయికా'లో విప్లవ సైన్యం స్ఫూర్తిని ప్రతిబింబించాడు (అయితే నెపోలియన్ తనను తాను చక్రవర్తిగా ప్రకటించుకున్న తర్వాత అసహనంతో ఊగిపోయిన గోథే సింఫనీనిఅతడికి అంకితం చేయడాన్ని ఉపసంహరించుకున్నాడు) ఐర్లాండ్ నుండి బెల్ఫాస్ట్ మధ్యతరగతికి చెందిన వోల్ఫ్‌టోన్, రాచరిక కుటుంబానికి చెందిన లార్డ్ ఎడ్వార్డ్ ఫిజ్‌గెరాల్డ్‌లు విప్లవ ప్రభుత్వంతో సంబంధాలన స్థాపించడానికి పారిస్ వెళ్లారు. లాటిన్ అమెరికాలో కరాకస్‌కు చెందిన 16 ఏళ్ల సైమన్ బొలీవర్ (ఇతడు కూడా ఉన్నత కుటుంబానికి చెందిన వాడే) 1799లో పనామాలో స్పానిష్ వైస్రాయితో జరిగిన వాదనలో విప్లవాన్ని పూర్తిగా సమర్థించాడు. మరో వైపు మెక్సికన్ పురోహితుడు మైగువెర్ హిడాల్గో విప్లవ సిద్ధాంతాలపట్ల జోస్ మారియా మోరెలాస్ లాంటి విద్యార్థులను ఆకర్షితులను చేశాడు.

## ఉప్పొంగిన విప్లవ కెరటం

విప్లవం పట్ల ప్రజలు చూపిన అమితోత్సాహం కారణంగా ఫ్రెంచి సైన్యాలు తొలుత స్థానిక భాగస్వాములను ఎందరినో కూడగట్టుకోగలిగింది. ఫ్రాన్స్ సరిహద్దులను దాటుకొని బెల్జియం, హాలెండ్, ఉత్తర ఇటలీ, దక్షిణ జర్మనీలోకి ప్రవేశించింది. రాచరిక లేదా నియంతృత్వ పాలనను వ్యతిరేకించిన మధ్యతరగతి ప్రజలు, నాయకులు తమను తాము జాకోబిన్లుగా ప్రకటించుకున్నారు. ఫ్రాన్స్‌లో జాకోబిన్లు అధికారం కోల్పోయిన తర్వాత కూడా విప్లవ శక్తుల మద్దతుదారులకు ఆ పేరు స్థిరపడిపోయింది. ఫ్రెంచి సైన్యం దూసుకొచ్చిన ప్రతిసారి ఈ శక్తులు దానితో కలిసి పని చేస్తూ పై స్థాయి నుండి సంస్కరణలను సమాజంపై రుద్దడానికి ప్రయత్నించాయి. ఫ్రాన్స్‌లో క్షేత్రస్థాయి నుండి పుట్టుకొచ్చిన సంస్కరణలతో వాటికి పోలికలు ఉన్నాయి. ముఖ్యంగా కౌలుదారీ, భూస్వామ్య బకాయిల రద్దు, రాజ్యం, చర్చి మధ్య విభజన, చర్చి భూముల స్వాధీనం, అంతర్గత సుంకం వసూలు కేంద్రాల రద్దు, ప్రజాస్వామ్యయుతమైన శాసనమండళ్ల ఏర్పాటు ప్రధాన సంస్కరణలుగా ముందుకు వచ్చాయి. అయితే అనతికాలంలోనే సమస్యలు పుట్టుకొచ్చాయి.

ఎంతటి నిస్వార్థ ఉద్దేశ్యాలు కలిగి ఉన్నా ఇతర దేశాలప్రజలు విదేశీ ఆక్రమణదారులను స్వాగతించరన్నది బ్రిస్సాట్‌కు వ్యతిరేకంగా రోబెస్పియర్ చేసిన వాదనల్లో ఒకటి. అతడి వాదనే నిజమని త్వరలోనే తేలిపోయింది. విప్లవ సైన్యంపట్ల తొలుత మేధావులు, మధ్యతరగతిలోని కొన్ని వర్గాలు చూపిన ఉత్సాహం ఆవిరైపోయింది. విజయవంతమైన ఫ్రెంచిసైన్యం మనుగడ కోసం దోపిడీ, తాము స్వాధీనం చేసుకున్న దేశాల నుండి వసూలు చేసే కప్పంపై ఆధారపడక తప్పలేదు. విముక్తి పోరాటంగా ప్రారంభమైన ఈ యుద్ధం విప్లవ సంరక్షణ పోరాటంగా కొంత కాలం కొనసాగి చివరకు సామ్రాజ్యవాద ఆక్రమణ పర్వంగా ముగిసింది. బెల్జియం, సవాయ్, రైన్ నదికి దక్షిణాన ఉన్న జర్మన్ చిరురాజ్యాలను స్వాధీనం చేసుకోవడం, ప్రజాతంత్ర శాసనమండళ్ల స్థానంలో రాచరిక వ్యవస్థను ప్రవేశపెట్టడం, తన

సోదరులను ఇటలీ, వెస్ట్‌ఫాలియా, హాలెండ్, స్పెయిన్ రాజులుగా నియమించడం ద్వారా నెపోలియన్ ఈ ప్రక్రియకు తుది రూపం ఇచ్చాడు.

నెపోలియన్ నేతృత్వంలో కూడా ఫ్రెంచి సైన్యం భూస్వామ్య వ్యవస్థ అవశేషాలను నిర్మూలించింది. కొన్ని సందర్భాల్లో క్యాపిటలిస్టు ఉత్పత్తి విస్తరణకు రంగం సిద్ధం చేసింది. అయితే ఫ్రాన్స్‌లో వలె పేద వర్గాలు, రైతాంగ ఉద్యమాలు లేకపోవడంతో ఫ్రెంచి విప్లవ సైన్యం స్థానిక భాగస్వాములకు జనబాహుళ్యంలో సరైన పునాది కొరవడింది. రైతులు, పట్టణ పేద వర్గాలకు ఫ్రెంచి ఆక్రమణవల్ల ఎలాంటి ప్రయోజనం కలగలేదు. ఫలితంగా కొత్త వ్యవస్థను వారు గుర్తించలేకపోయారు. ఫ్రాన్స్‌కు చెల్లించాల్సిన కప్పం, ఫ్రెంచి సైనిక వ్యయాన్ని భరించాల్సి రావడంతో వారిపై పాత భూస్వామ్య బకాయిల (చెల్లింపులు) కంటే ఎక్కువ భారం పడింది. ఫ్రెంచి సైన్యం ఉపసంహరించుకునేలా ఒత్తిడి పెరిగినప్పుడల్లా స్థానిక జాకోబిన్లు దిక్కుతోచని స్థితిలో పడిపోయేవారు. 1812-14 మధ్య అలాగే జరిగింది. రెండు భిన్నమైన సరిహద్దుల్లో నెపోలియన్ తన సామ్రాజ్యాన్ని అవసరానికి మించి విస్తరించాడు. తొలుత స్పెయిన్ గద్దెపై తన సోదరుడిని ప్రతిష్ఠింపచేయడానికి ప్రయత్నించాడు. అనంతరం తన సైన్యాలను ఉత్తర ఐరోపా మైదాన ప్రాంతాలను దాటుకొని మాస్కో వైపు తరలించాడు. అది చాలా ఘోరమైన వ్యూహం. మాడ్రిడ్‌లో ప్రజా ఉద్యమాన్ని అణచివేయడంలో అతడి సైన్యాలు విజయం సాధించాయి. కాని తర్వాతి కాలంలో గెరిల్లా యోధుల నుండి ముప్పుతిప్పలను ఎదుర్కొన్నాయి. మరోవైపు వెల్లింగ్‌టన్ నేతృత్వంలోని బ్రిటీషు దళాలు ఐబేరియా ద్వీపకల్పంలో దాడులను విస్తృతం చేశాయి. ఈలోగా నిర్మానుష్యమైన మాస్కోను స్వాధీనం చేసుకోవడం ఘోరమైన వైఫల్యంగా పరిణమించింది. శత్రుసైన్యాలు, తీవ్రమైన శీతాకాల పరిస్థితి వెయ్యిమైళ్ల పొడవున ఉన్న నెపోలియన్ సైనిక సరఫరాలను విచ్ఛిన్నం చేశాయి. ఆక్రమిత ప్రాంతాల్లో ఫ్రెంచి సైన్యాలు ఎంత అప్రతిష్ఠను మూటగట్టుకున్నాయంటే చివరికి స్పెయిన్, ప్రష్యాలకు చెందిన ప్రగతిశీల శక్తులు రాచరిక శక్తులతో చేతులు కలిపి వాటిని తరిమి కొట్టడానికి 'జాతివిముక్తి' యుద్ధాలను పోలినటువంటి పోరాటాలను ప్రారంభించాయి. అయితే ఒక్కసారి విజయం దక్కగానే రాజులు ప్రగతిశీల శక్తులను నట్టేటా ముంచారు. వాటిపై అణచివేతను తీవ్రతరం చేశారు. 'చీకటియుగం' శీర్షిక గోయా గీసిన చిత్రాల్లో ఈ అణచివేత, నిస్సహాయత ప్రతిబింబిస్తాయి.

నెపోలియన్ ఓటమి (ఇక్కడ రెండు ఓటములని చెప్పాలి. ఎందుకంటే వాటర్‌లూ యుద్ధంలో తుది ఓటమిని పొందే ముందు 1815లో అతడు వంద రోజులపాటు ఆశ్చర్యకరమైన రీతిలో పుంజుకున్నాడు) కారణంగా రాజులు, రాకుమారులు, పాలకవర్గ సభ్యులు తమదైన శైలిలో అధికారానికి మళ్లీ వచ్చారు. 18వ శతాబ్దానికి చెందిన పాత పాలన ఉన్నత నిర్మాణాలను సామాజిక నిర్మాణాలపై మళ్లీ రుద్దారు.

ఈ సామాజిక నిర్మాణాలు కనీసం ఫ్రాన్స్, ఉత్తర ఇటలీ, పశ్చిమ జర్మనీలలో రూపాంతరం చెంది ఉండేవి. కాని మళ్లీ వాటిపై పాత సామ్రాజ్యపు ఛాయలు అలుముకున్నాయి. ఇలాంటి ప్రపంచాన్ని "ది రెడ్ అండ్ ది బ్లాక్," "ది చార్టర్ హౌస్ ఆఫ్ పార్మా" అనే నవలలో

సెండ్‌హాల్ అద్భుతంగా వర్ణించాడు (నెపోలియన్ సైన్యంలో సెండ్‌హాల్ కమీసరీగా పని చేసి ఉన్నాడు). అలాగే అలెగ్జాండ్ డ్యూమాస్ రచించిన "ది కౌంట్ ఆఫ్ మాంటె క్రిస్టో"లో కూడా అప్పటి పరిస్థితులను చక్కగా ప్రతిబింబించాడు. (డ్యూమాస్ తండ్రి ఒక నల్లజాతి బానిసకు పుట్టిన వాడు. అతడు నెపోలియన్ నాయకత్వంలో జనరల్‌గా వ్యవహరించాడు)

## బ్రిటన్ - కొత్తగా వచ్చిన సాంప్రదాయం

రాజకీయ జీవితంపై విప్లవం చూపిన ప్రభావం కేవలం ఐరోపా ఖండానికే పరిమితం కాలేదు. బ్రిటన్‌పై కూడా తీవ్ర ప్రభావం చూపింది. బూర్జువాలోని అత్యంత ముఖ్యమైన వర్గాలు 1789కు పూర్వమే రాజకీయ వ్యవహారాల్లో గణనీయమైన పట్టును సాధించి ఉన్నాయి. విప్లవాన్ని ప్రయోగించకూడదని వారికి ఎలాంటి కారణం కనిపించలేదు. అయితే ఫ్రెంచి సంఘటనలు (పరిణామాలు) గణనీయంగా విస్తరిస్తున్న నగరాలు, పట్టణాల్లో విశాలమైన ప్రజానీకాన్ని కదిలించాయి. వృత్తిదారులు, సంచార వ్యాపారులు, చిన్న దుకాణాదారులు, వీరితోపాటు ఫ్యాక్టరీలలో పని చేసే కొత్త పారిశ్రామిక కార్మికులు పెద్ద సంఖ్యలో ఈ ప్రజానీకానికి జత కడుతూనే ఉన్నారు.

విప్లవం, విప్లవ రాజ్యాంగ సూత్రాలను బ్రిటన్‌లో కూడా ప్రవేశపెట్టాలని ప్రబోధిస్తూ టామ్ పేయిన్ రచించిన "ది రైట్స్ ఆఫ్ మ్యాన్" (మానవుని హక్కులు) అనే రెండు సంపుటాల గ్రంథం 1,00,000 ప్రతులు అమ్ముడుపోయింది. 1791 చివరిలో షెఫ్ఫీల్డ్‌లో ఐదుగురు లేదా ఆరుగురు యంత్ర మరమ్మతుదారులు (మెకానిక్‌లు) పెరుగుతున్న నిత్యావసర సరుకుల ధరలు, ప్రభుత్వ అకృత్యాలను చర్చిస్తూనే షెఫ్ఫీల్డ్ రాజ్యాంగ సమాజాన్ని స్థాపించారు. సార్వజనిక ఓటు హక్కు, వార్షిక కాలపరిమితి కలిగిన పార్లమెంట్లను సాధించడమే ఈ సమాజం లక్ష్యం. 1792 మార్చి నాటికి దాని సభ్యత్వం రెండు వేలకు చేరుకుంది. వాల్మీ వద్ద విప్లవ సైన్యం విజయం సాధించడాన్ని ఈ సమాజం ఒక వేడుకలా జరిపింది. వీధుల్లో జరిగిన ఆ వేడుకలో ఆరు వేల మంది వరకు పాల్గొన్నారు. ఇలాంటి సమాజాలు మాంచెస్టర్, స్టాక్ పోర్ట్, బర్మింగ్‌హామ్, కొవెంట్రీ, నార్విచ్‌లలో కూడా ఏర్పడ్డాయి. అవన్నీ వేర్వేరు స్థాయిలలో విజయవంతమయ్యాయి. పాదరక్షల తయారీదారుడు థామస్ హార్డీ 1792లో స్థాపించిన లండన్ సంప్రదింపుల మండలి అనతికాలంలో పెద్ద సంస్థగా అవతరించింది. మండలిలోని 48 శాఖల్లో సుమారు 5,000 సభ్యులు క్రియాశీలంగా వ్యవహరించారు. ప్రాంతీయ సమాజాలతో సమన్వయం సాధిస్తూ ఈ మండలి ఒక జాతీయస్థాయి వ్యవస్థను ఏర్పాటు చేసింది.

బ్రిటీషు ప్రభుత్వానికి ఆందోళన కలిగించే స్థాయిలో ఉద్యమం విస్తరించింది. 1792 చివరిలో ఫ్రెంచి విప్లవానికి వ్యతిరేకంగా అది యుద్ధ సన్నాహాలను ప్రారంభించింది. బర్మింగ్‌హామ్‌లోని బడా భూస్వాములు అల్లరిమూకలను రెచ్చగొట్టి బాస్టిల్ ముట్టడి వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని స్థానిక సంస్కరణవాదులు ఏర్పాటు చేసుకున్న విందుపై దాడి చేయించారు. గృహాలను, సమావేశ మందిరాలను ధ్వంసం చేయించారు. నగరం నుండి జోసెఫ్ ప్రీస్ట్లీ

లాంటి మేధావులను తరిమికొట్టారు. ఇప్పుడు ప్రభుత్వం కూడా దేశవ్యాప్తంగా జాకోబిన్ వ్యతిరేక ఉద్యమాన్ని ప్రోత్సహించింది. యుద్ధానికి అనుకూలంగా జాతీయవాదభావనలను రెచ్చగొట్టడానికి ప్రతి ప్రాంతంలోనూ విధేయ సమాజాలను (మండళ్లు) ఏర్పాటు చేశారు.

ప్రజాతంత్ర భావాలను ప్రచారం చేయడానికి జరిగే ప్రయత్నాలపై కూడా విషపూరితమైన అణచివేతను చేపట్టారు. 'మానవుని హక్కులు' అనే గ్రంథాన్ని రచించినందుకు పామ్‌పేయిన్ రాజద్రోహం అనే అభియోగాన్ని మోపి దేశం విడిచి వెళ్లేలా బలవంతం చేశారు. స్కాట్లాండ్ ప్రజామిత్ర మండలికి చెందిన ఇద్దరు నాయకులు - యువ న్యాయవాది థామస్ మయిర్, ఆంగ్లేయ ఐక్యతావాద ప్రచారకుడు థామస్ పామెర్ - సుదీర్ఘమైన విచారణ తర్వాత దేశం నుండి తరలించబడ్డారు.

అలాగే స్కాట్లాండ్ రాజ్యాంగ మండలికి చెందిన ముగ్గురు ప్రతినిధులను కూడా దేశం నుండి బయటికి తరలించారు. రాజద్రోహం నేరం కింద థామస్ హార్డీ, మరోడజను మంది లండన్ నాయకులపై విచారణ ప్రారంభించారు. రాచరికవాద శక్తులు హార్డీ నివాస గృహంపై జరిపిన దాడిలో అతడి భార్య ప్రాణాలుకోల్పోయింది. సానుభూతిపరులైన న్యాయమూర్తులు ముద్దాయిలను విడుదల చేసినప్పుడు పార్లమెంటు హెబియస్ కార్పస్ నిబంధనను సస్పెండ్ చేసింది. అలా విచారణ లేకుండానే క్రియాశీల కార్యకర్తలను నిర్బంధించడానికి మార్గాన్ని సుగమం చేసింది.

కొన్ని దశల్లో ఇంగ్లాండ్, స్కాట్లాండ్ జాకోబిన్ల ఉద్యమానికి పట్టణ ప్రజల నుండి విశాలమైన స్పందన లభించింది. బహిరంగ సభల్లో వేలాది మంది పోగయ్యేవారు. నావికాదళ తిరుగుబాటు నాయకులు కొందరు (1797లో నౌకాదళం వచ్చిన తిరుగుబాట్లు బ్రిటీషు ప్రభుత్వాన్ని గడగడలాడించాయి) జాకోబిన్ ఉద్యమ సిద్ధాంతాలతో పూర్తిగా ప్రభావితమయ్యారు. అయితే మధ్యతరగతిలోని బలమైన వర్గాలు భూస్వాములతో చేతులు కలిపి వ్యవస్థను పరిరక్షించడానికి సిద్ధపడ్డాయి. ప్రస్తుత వ్యవస్థ వారికెంతో లాభదాయకంగా ఉండేది. ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేయడానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలను సమర్థించారు. 1790 దశకం చివరి నాటికి విప్లవ సిద్ధాంతాల పట్ల సానుభూతిని ప్రదర్శించడం ప్రజలకు చాలా కష్టంగా మారింది.

అయినప్పటికీ షెఫ్ఫీల్డ్ రాజ్యాంగ మండలి, లండన్ సంప్రదింపుల మండలి, స్కాట్లాండ్ ప్రజామిత్ర మండలి తదితర సంస్థలు చేపట్టిన ఉద్యమం ఒక ప్రధానమైన మార్పును తీసుకువచ్చింది. ఎడ్వార్డ్ థామ్సన్ తన "ఇంగ్లాండ్ కార్మిక వర్గ ఆవిర్భావం" అనే గ్రంథంలో వివరించినట్లు ఆ ఉద్యమం ఒక కొత్త సాంప్రదాయాన్ని సృష్టించడంలో సహాయపడింది. 1815-48 మధ్య కాలంలో ఆ సాంప్రదాయం తీవ్రమైన ప్రభావం చూపింది.

## ఐర్లాండ్ రిపబ్లికన్ ఉద్యమం

బ్రిటన్ పాత వలసవాద కేంద్రమైన ఐర్లాండ్‌పై ఫ్రెంచి విప్లవం ఐరోపాలో ఎక్కడా లేని విధంగా ప్రభావం చూపింది. విప్లవ జాతీయవాద సాంప్రదాయానికి పురుడు పోసింది. ఆ సాంప్రదాయం నేటికీ కొనసాగుతోంది.

1650 దశకంలో ప్రొటెస్టెంటు రైతులను (ఎక్కువగా స్కాట్లాండ్‌కు చెందిన వారు) స్థిరపరచడం ద్వారా ప్రజా ప్రతిఘటనను అణచివేసిన తర్వాత బ్రిటీషు ప్రభుత్వాలు ఈ ద్వీపంపై తమ పట్టును పదిలపరచుకున్నాయి. ముఖ్యంగా అల్స్టర్ ప్రాంతంలో స్థానిక కాథలిక్‌ల నుండి స్వాధీనం చేసుకున్న భూములపై వలసదారులను స్థిరపరిచారు. ఈ వలసవాద రైతుల వారసులు కాథలిక్ ఉద్యమం నీడలో భయాందోళనల మధ్య కాలం గడిపారు. కాథలిక్‌లు తమను భూముల నుండి వెళ్లగొడతారన్న భయం వారిని నిత్యం వెంటాడేది. ఫలితంగా వారు ప్రొటెస్టెంట్ వర్గానికే చెందిన ఆంగ్లో–ఐరిష్ భూస్వామ్య దొరలతో ఉమ్మడి ప్రయోజనాలు కలిగిన సముదాయాన్ని ఏర్పరచుకున్నారు. నిర్వాసితులైన కాథలిక్‌లకు ఊతమిచ్చే విధంగా బ్రిటీషు ప్రభుత్వ విధానాలను బహిరంగంగా సవాలు చేయడానికి వలసవాద రైతులు సాహసం చేయలేక పోయారు. 1770 దశకం వరకు డబ్లిన్‌లోని ప్రొటెస్టెంటు పార్లమెంటు లండన్‌లో ఆమోదించిన విధానాలకు ముద్రవేసే సంస్థగా వ్యవహరించింది.

18వ శతాబ్దపు చివరి పాతికేళ్లలో వైఖరులు మారడం ప్రారంభించాయి. అమెరికా స్వాతంత్ర్య సమరం డబ్లిన్ పార్లమెంటుకు స్ఫూర్తినిచ్చింది. దాని బేరసారాలాడే శక్తి పెరిగింది. ఎందుకంటే ఫ్రెంచి సైన్యం దాడిని తిప్పికొట్టేందుకు బ్రిటీషు ప్రభుత్వాలకు ఐర్లాండ్ కిరాయి సైన్యాల అవసరం ఎక్కువగా ఉండేది. ఒక దశలో ఐర్లాండ్ పార్లమెంటు ద్వీపంలోని బడా భూస్వాములు, వ్యాపారుల ప్రయోజనాలను పరిరక్షించే విధంగా వ్యవహరించగలదని పరిస్థితులు సూచించాయి. కాని యుద్ధం ముగియగానే ఈ ఆశలన్నీ నేలరాలాయి. బ్రిటన్ వ్యతిరేక భావన పెరిగింది. ముఖ్యంగా బెల్ఫాస్ట్ నగరంలో విస్తరిస్తున్న మధ్యతరగతి వ్యాపార వర్గం (ప్రొటెస్టంట్లు)లో అసంతృప్తి జ్వాలలు చెలరేగాయి.

ఇలాంటి భావనలు ఫ్రెంచి విప్లవంపట్ల ఉత్సాహభరితమైన ప్రతిస్పందనగా రూపుదాల్చాయి. స్వచ్ఛంద కార్యకర్తలు కవాతులు నిర్వహించడం మొదలుపెట్టారు. రాజ్యాంగ పరమైన శాసనమండలిని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. కాథలిక్ విముక్తి ఉద్యమానికి మద్దతునిచ్చారు. 1792లో బెల్ఫాస్ట్ పట్టణం – నేడు ఈ నగరం ప్రజాతంత్ర పోరాటంలో అగ్రభాగాన ఉంది – ఫ్రెంచి విప్లవ వార్షికోత్సవాన్ని భారీ ప్రదర్శన, వేడుక రూపంలో జరుపుకుంది. వాతావరణమంతా రిపబ్లికన్ స్ఫూర్తితో నిండిపోయింది. మత వైషమ్యాలను వ్యతిరేకిస్తూ గోడలపై పోస్టర్లు వెలిశాయి. “మూఢమైన వైషమ్యం ఐరిష్ బాస్టిల్‌కి ప్రతిరూపం : రండి, మనమందరం కలిసి దానిని నాశనం చేద్దాం” అంటూ పోస్టర్లలో పిలుపు ఇచ్చారు. ఈ కార్యక్రమ నిర్వాహకుల్లో ఒకరైన ప్రొటెస్టెంట్ న్యాయవాది వోల్ఫ్‌టోన్ ‘యునైటెడ్ ఐరిష్‌మెన్’ అనే కొత్త అతివాద సంఘాన్ని ప్రారంభించాడు. బెల్ఫాస్ట్‌లో జరిగిన విందుకు హాజరైన డజను మంది వ్యాపారులు ఈ కొత్త సంఘాన్ని స్థాపించాలని నిర్ణయించారు.

బ్రిటన్‌లో లాగే ఐర్లాండ్‌లో కూడా అణచివేత ద్వారా నయా జాకోబిన్ వాదాన్ని తుడిచిపెట్టే ప్రయత్నం జరిగింది. ఇంగ్లాండ్ ఆదేశాల మేరకు ఐరిష్ ఉన్నత వర్గం ఆమోదించిన చట్టాలు ఆయుధధారణను నిషేధించాయి. యునైటెడ్ ఐరిష్‌మెన్ సంస్థను చట్టవ్యతిరేకమైన

సంస్థగా ప్రకటించాయి. అజ్ఞాతవాసంలోకి వెళ్లడంతో ఈ సంస్థ విప్లవశక్తిగా బలపడింది. బ్రిటీషు పాలనను అంతం చేయడమే దాని ప్రధాన లక్ష్యంగా మారింది. బ్రిటీషు పాలన కారణంగానే ఐర్లాండ్ ఆర్థికంగా వెనుకబడింది. మత వైషమ్యాలతో సతమతమైంది. ఫ్రాన్స్ తరహాలో ఆధునిక దేశాన్ని స్థాపించడానికి విప్లవోద్యమం అవసరం. అలాంటి ఆధునిక దేశం క్యాపిటలిస్టు రాజ్యంగా వ్యవహరించగలదని యునైటెడ్ ఐరిష్‌మెన్ సంస్థ ఏకపక్షంగా తీర్మానించుకుంది. కాకపోతే దోపిడీదారి విదేశీ పాలన, స్థానిక పాలకవర్గం మోయలేని భారం తొలిగిపోతుందని భావించింది. ఈ లక్ష్యాన్ని సాధించాలంటే మధ్యతరగతి ప్రొటెస్టెంట్‌వర్గాలు కాథలిక్ రైతాంగాన్ని ఉద్యమంలోకి తీసుకురావడం తప్పనిసరి అని వోల్ఫ్‌టోన్ గ్రహించాడు. అయితే కాథలిక్ రైతాంగానికి సాయుధ, అజ్ఞాత పరిరక్షణ దళాల ద్వారా భూస్వామ్య వ్యతిరేక పోరాటం జరిపిన సుదీర్ఘ చరిత్ర ఉంది.

ప్రతిఘటనకు మద్దతు ఇవ్వడానికి సిద్ధమైన ప్రజల సంఖ్య బ్రిటీషు దళాల కంటే అధికంగా ఉండేది. సుమారు లక్ష మంది ప్రజలు సాయుధ విప్లవానికి సిద్ధంగా ఉండగా బ్రిటీషు ప్రభుత్వం వద్ద 65,000 మంది సైనికులు అందుబాటులో ఉన్నారు. అయితే ప్రజల వద్ద సరైన ఆయుధాలు కాని, తగిన సైనిక శిక్షణ కాని లేవు. ఫ్రాన్స్ నుండి సైనిక సహాయం పొందడంపైనే విప్లవ విజయం ఆధారపడి ఉన్నట్లు తోచింది.

1798లో సాయుధ ప్రతిఘటన మొదలైంది. అయితే ఫ్రెంచి సైనిక సహాయం చాలా తక్కువగాను, ఆలస్యంగాను అందింది. ఆగస్టులో మాయో వద్ద కేవలం 1,100 మంది ఫ్రెంచి సైనికులే అడుగుపెట్టారు. అప్పటికి అధికారులు ఉద్యమ నాయకులను నిర్బంధించడంలో సఫలమయ్యారు. సాయుధ తిరుగుబాటుదారులను ముందుగానే దాడి మొదలుపెట్టేలా ఒత్తిడి చేశారు. వెక్స్‌ఫర్డ్, ఆంట్రిమ్‌లలో ప్రతిఘటనను అణచివేశారు. తదనంతరం వచ్చిన అణచివేత ముందు ఫ్రెంచి అణచివేత ఉద్యమం చిన్నారుల ఆటగా మిగిలిపోయింది. ఉద్యమ సమర్థకులని భావించిన వారిపై తీసుకున్న కఠిన చర్యలు 30,000 మంది ప్రాణాలను బలిగొన్నాయి.

కథ అంతటితో ముగియలేదు. తిరుగుబాటుకు మూడేళ్ల ముందు నెలకొన్న ఉద్రిక్తత కారణంగా అధికారులు ఉద్దేశపూర్వకంగా కాథలిక్‌లకు వ్యతిరేకంగా విషపూరితమైన ప్రచారం చేపట్టేలా ప్రొటెస్టెంటు బృందాలను రెచ్చగొట్టారు. 1795లో ఆంట్రిమ్‌లోని డయమండ్ అనే గ్రామంలో స్థానిక ప్రొటెస్టెంటు, కాథలిక్ రైతుల మధ్య ఘర్షణలు జరిగిన తర్వాత ఆరెంజ్ ఆర్డర్ అనే పాక్షిక రహస్య ప్రొటెస్టెంట్ సంస్థ ఆవిర్భవించింది. అన్ని వర్గాల రైతులను సమానంగా ద్వేషించే ఆంగ్లో-ఐరిష్ భూస్వాములు తొలుత ఈ సంస్థకు దూరంగా ఉన్నారు. అయితే తిరుగుబాటు ముప్పును నివారించడానికి అది విలువైన సాధనంగా ఉపయోగపడగలదని త్వరగా గ్రహించారు.

1796 నుండి 1797 వరకు అరెంజ్ ఆర్డర్ ఒక చిన్న, విచ్ఛిన్నమైన, సామాజిక మద్దతులేని సంస్థ నుండి (పాలకవర్గం కూడా దానిని ద్వేషించేది) బలమైన రాష్ట్ర

వ్యాప్త సమాజంగా క్రమంగా రూపాంతరం చెందింది. బ్రిటన్, ఐర్లాండ్‌లలో ఉన్నత స్థానాల్లో ఉన్న వ్యక్తుల ఆమోదాన్ని, క్రియాశీల మద్దతును పొందింది.

సాయుధబలగాల కమాండర్ అయిన జనరల్ లేక్ ఆరెంజ్ వర్గీయుల ప్రదర్శనలకు నాయకత్వం వహించాడు. సాయుధులైన ఆరెంజ్ వర్గీయులు ప్రభుత్వ బలగాలు, కిరాయి సైన్యాలతో చేతులు కలిపి యునైటెడ్ ఐరిష్‌మెన్ మద్దతుదారులను శిక్షించారు. తిరుగుబాటు దారులైన ప్రొటెస్టెంట్లకు వారు రెండు అవకాశాలు ఇచ్చారు. – ఒకటి : కొరడా దెబ్బలు లేదా చిత్రహింసలను భరించడం, రెండు : ఆరెంజ్ ఆర్డర్‌లో చేరి ఇతర వర్గాల తిరుగుబాటుదారులను హింసించడం. ఆ విధంగా బ్రిటీషు అధికారులు, ఆంగ్లో–ఐరిష్ భూస్వాములు ఉద్యమాన్ని అణచివేయడమే కాకుండా మతవైషమ్యాలకు సంస్థాగత రూపం ఇచ్చారు

ఐరోపా వ్యాప్తంగా విప్లవ, ప్రతీఘాత విప్లవ పోరాటాల నుండే ఐర్లాండ్ రాజకీయాల్లో రిపబ్లికన్ వాదం ఆరెంజ్ వాదం పుట్టుకొచ్చాయి. ఈ సాంప్రదాయానికి నేడు 200 ఏళ్ల చరిత్ర ఉంది.

అయితే ప్రస్తుతానికి ఈ వాదాలు బ్రిటీషు ప్రభుత్వంలోని 'నాగరిక' రాజనీతిజ్ఞులకు అంత తీవ్రమైన అంశంగా కనిపించలేదు. యునైటెడ్ ఐరిష్‌మెన్ సంస్థకు వ్యతిరేకంగా 'విభజించు–పాలించు' అనే విధానాన్ని సమర్థవంతంగా అమలు చేసిన తర్వాత రెండేళ్లకు వారు ఐరిష్ పార్లమెంటును ఒప్పించిదానిని రద్దు చేయించారు. బ్రిటీషు నియంత్రిత మార్కెట్ల నుండి దూరంగా ఉంచడంవల్ల గతంలో ఐర్లాండ్ వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. ఇప్పుడు వారికి రాజకీయ సంరక్షణ కూడా కరువైంది మరో వైపు భూస్వాములు దోపిడీని ముమ్మరం చేశారు. కౌలు, బకాయిలను హెచ్చుగా వసూలు చేస్తూ ఇంగ్లాండ్‌లో విలాసవంతమైన జీవితం గడిపారు. సంపదంతా అనుత్పాదక సోమరితనంపైనే కరిగిపోయింది. 'ఐర్లాండ్ అంశం' పరిష్కారమైనట్లు బ్రిటీషు ప్రభుత్వం భావించింది. అలాంటి భావన ప్రతి 30 లేదా 40 ఏళ్లకోసారి పైకి వస్తూనే ఉంది. నేడు కూడా అలాంటి భావనే కొనసాగుతోంది.

## హైతీ నల్లజాతి జాకోబిన్లు

ప్రతీఘాత విప్లవం ప్రతిచోటా విజయవంతం కాలేదు. అట్లాంటిక్ తీరానికి 3,000 మైళ్ల దూరంలో ఉన్న హైతీ (దీవి)లో ఫలితం ఐర్లాండ్‌కు చాలా భిన్నంగా వచ్చింది. అయితే ఆ ఫలితాన్ని సాధించడానికి దశాబ్దంపాటు తీవ్రమైన ఉద్యమాలు, యుద్ధాలు, అంతర్యుద్ధాలను చేపట్టాల్సి వచ్చింది.

హిస్పానియోలా దీవి పశ్చిమ భాగమైన సెయింట్ డొమింగో ఫ్రెంచి చక్రవర్తి వలసవాద సామ్రాజ్యంలో కలికితురాయిగాఉండేది. ఐరోపాలోని ఇతర శక్తుల నియంత్రణలో ఉన్న కరేబియన్, అమెరికన్ కాలనీల కంటే ఈ ప్రాంత చెరుకు తోటలు చక్కెరను ఎక్కువగా పండించేవి. చక్కెర వ్యాపారం ద్వారా తోటల యజమానులు, నాంటెస్, బోర్డియాక్స్ లాంటి

ఫ్రెంచి ఓడరేవు కేంద్రాలకు చెందిన వాణిజ్య పెట్టుబడిదారులు ఇద్దరూ అపారమైన సంపదను కూడబెట్టుకున్నారు.

ఈ సంపదకు మూల కారణం 5,00,000 మంది నల్లజాతి బానిసల నిరంతర శ్రమే. విపరీతంగా శ్రమ పడడంవల్ల వారి జనాభా క్రమంగా తగ్గిపోయింది. ఆఫ్రికా నుండి కొత్త బానిసలను దిగుమతి చేసుకోవడంతో వారి జనాభా కుదుటపడింది. వీరిపై సుమారు 30,000 మంది శ్వేతజాతీయులు పెత్తనం చెలాయించేవారు. బానిసల యజమానుల జనాభా ఇతర ఉత్తర అమెరికా దేశాల కంటే ఇక్కడ చాలా తక్కువగా ఉండేది. ఈ రెండు వర్గాల మధ్య మిశ్రమ జాతికి చెందిన ములాత్తోలు సహజీవనం చేసేవారు. కాలక్రమంలో వీరిలో కొందరు సంపన్నులయ్యారు. బానిసలను కూడా కొనుగోలు చేశారు.

తాము తక్కువ సంఖ్యలో ఉన్నప్పటికీ శ్వేత జాతీయులు తమ అహంకారాన్ని, దర్పాన్ని మాత్రం వీడలేదు. తమ వల్లే ద్వీపంలో సంపద సృష్టించబడిందని భావించారు. ఫ్రెంచి వ్యాపార వ్యవస్థ తమపై విధించిన పరిమితులను వారు తీవ్రంగా నిరసించారు. 1789లో తమ స్వదేశంలో మధ్యతరగతి వర్గాలు ఉద్యమ పథంలో పయనించడంతో వారు కూడా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం డిమాండ్ చేయడం ప్రారంభించారు. బాస్టిల్ కారాగారం ముట్టడికి గురైందని వార్తలు రాగానే హైతీలో వారు రాచరిక గవర్నర్‌కు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటనను మొదలుపెట్టారు. అయితే ఈ వలసవాద తిరుగుబాటుదారులు. విప్లవ సిద్ధాంతాలైన విముక్తి, సమానత్వాన్ని నల్లజాతి బానిసలకు లేదా స్వేచ్ఛాజీవులైన ములాత్తోలకు వర్తింపచేయలేదు. హైతీ జనాభాలో శ్వేతజాతీయుల సంఖ్య ఏడు శాతమే అయినా వారిలో అంతర్గత విభేదాలు ఎక్కువగా ఉండేవి. సామాన్య శ్వేతజాతీయులు (వీరికి బహుశా ముగ్గురు లేదా నలుగురు బానిసలు ఉండేవారు) బడా భూస్వాములను బాగా ద్వేషించేవారు. రాచరికంపట్ల ఫ్రెంచి మధ్యతరగతి ఉన్న వ్యతిరేకతతో సమానంగా హైతీ భూస్వాములను (తోట యజమానులు) సాధారణ శ్వేతజాతీయులు నిరసించేవారు. ఎవరితో వ్యాపారం చేయాలో నిర్ణయించే హక్కును తమకే వదిలివేయాలని కోరుకున్న తోట యజమానులు రాజకీయ నియంత్రణను మాత్రం సాధారణ శ్వేత జాతీయులకు కట్టబెట్టడానికి ఇష్టపడలేదు. విప్లవ స్ఫూర్తితో ఫ్రెంచి శాసనమండలి ప్రజలందరికీ సమాన హక్కులు కల్పిస్తూ చట్టాన్ని ఆమోదించినప్పుడు ఇరువర్గాలు తీవ్ర వ్యతిరేకతను తెలిపాయి. సమాన హక్కులను నల్లజాతి బానిసలు, స్వేచ్ఛాపౌరులైన ములాత్తోలకు కూడా వర్తింపచేయడాన్ని వారు వ్యతిరేకించారు. (ఫ్రెంచి శాసనం బానిసత్వం గురించి ఎక్కడా ప్రస్తావించకుండా జాగ్రత్తలు తీసుకుంది) హైతీలోని నాలుగు స్వేచ్ఛావర్గాల మధ్య దాదాపు అంతర్యుద్ధం చెలరేగే పరిస్థితి ఏర్పడింది. గవర్నర్ మద్దతుదారులు, బడా భూస్వాములు, సాధారణ శ్వేతజాతీయులు, ములాత్తోల మధ్య కలహం ప్రారంభమైంది.

ఈ నాలుగు వర్గాలు నల్లజాతి బానిసలను కొనసాగించాలని కోరుకున్నాయి. వారితో పని చేయించుకుంటూ, హింస పెడుతూ, బాధలకు గురి చేస్తూ, చనిపోయే వరకు శ్రమ దోపిడీ చేయాలని భావించారు. మారిన పరిస్థితులను వారు ఏ మాత్రం గమనంలోకి తీసుకోలేదు.

అయితే వారు చాలా తప్పుగా ఊహించారు. తిరుగుబాటు చేయడానికి లభించిన సువర్ణావకాశాన్ని బానిసలు చేజిక్కించుకున్నారు. తోటలకు నిప్పంటించారు. తమ యజమానులను హత్య చేశారు. సాయుధ బృందాలను ఏర్పాటు చేసి శ్వేతజాతి బలగాలను ఎదుర్కొన్నారు. విప్లవాన్ని విస్తృతం చేసి తమ స్వంత నాయకులను ఎన్నుకున్నారు.

ఆ ప్రాంత ప్రముఖుడైన తౌస్సెయింత్ ల'ఔర్‌త్యూర్ సమన్వయకర్తగా వ్యవహరిస్తూ పరస్పర విరోధులైన శ్వేతజాతి వర్గాలను, ములాత్తోలను, ద్వీపంలోని మరో భాగం నుండి ఆక్రమణకు వచ్చిన స్పానిష్ సైన్యాన్ని, ఫ్రాన్స్ నుండి వరుసగా వచ్చిన ప్రతినిధులను శాంతింపచేశాడు. తర్వాత ఒక బ్రిటీషు సైనిక దళం సెయింట్ డొమింగోలో అడుగు పెట్టింది. అదే సమయానికి ప్రజా విప్లవం ఫ్రాన్స్‌లో జాకోబిన్లకు అధికారాన్ని కట్టబెట్టింది.

తర్వాత జరిగిన పరిణామాలు విస్తృతమైన పర్యవసానాలు కలవి. సెయింట్ డొమింగో భవిత ఒక్కటే ఇక్కడ అంశం కాదు. బ్రిటీషు పాలకవర్గంలోని ముఖ్యమైన వర్గాలు ఆడమ్‌స్మిత్ వాదనల ప్రభావంలో బానిసత్వం ఇక గడిచిన అధ్యాయమనే నిర్ధారణకు వచ్చాయి. అప్పటికే వారు ఉత్తర అమెరికాలోని తమ చెరుకు తోటలను కోల్పోయి ఉన్నారు. ఫ్రాన్స్ నియంత్రణలోని చెరుకు తోటలకు వారి కారేబియన్ తోటలు ఏ మాత్రం సాటిరావు. విలియమ్ పిట్‌ప్రభుత్వం విలియమ్ విల్బర్‌ఫోర్స్ చేపట్టిన బానిస నిర్మూలన ఉద్యమాన్ని కొంత వరకు ప్రోత్సహించింది. బానిస ఆర్థిక వ్యవస్థల్లో అత్యంత ప్రధానమైన సెయింట్ డొమింగోను నియంత్రణలోకి తీసుకోవాలన్న వ్యూహం ప్రభుత్వ ఆలోచనాధోరణిని మార్చివేసింది. బానిసత్వాన్ని ఉత్సాహంగా ఆమోదించడానికి అది సిద్ధమైంది. ఈ ప్రయత్నంలో బ్రిటీషు ప్రభుత్వం సఫలమై ఉన్నట్లయితే ప్రపంచ వ్యాప్తంగా బానిసత్వానికి మరింత బలం చేకూరి ఉండేది.

ఫ్రాన్స్‌లో విప్లవం తీవ్రతరమై జాకోబిన్లను అధికారంలోకి తీసుకురావడం కూడా బానిస తిరుగుబాటుకు ఊతం ఇచ్చింది. అనేక మంది గిరోండిన్ నాయకులు వ్యక్తిగతంగా బానిసత్వాన్ని వ్యతిరేకించారు. 1788లో నల్లజాతీయుల మిత్ర మండలి ఏర్పాటైంది. మండలి సభ్యులు ప్రధానంగా విలేకరులు లేదా న్యాయవాదులు వీరు చైతన్యోద్యమ సిద్ధాంతాలతో స్ఫూర్తి పొందిన వారు. అయితే వారి ముఖ్యమైన రాజకీయ పునాది అంతా పశ్చిమఫ్రాన్స్ ఓడరేవు ప్రాంతాల్లో నివసించే వాణిజ్యపరమైన బూర్జువా వర్గంలో ఉండేది. ఆ వ్యాపారులు తమ లాభాలను దెబ్బతీసే ఎలాంటి చర్యలనైనా తీవ్రంగా వ్యతిరేకించే వారు. బానిసత్వానికి వ్యతిరేకంగా తమ వాదనను విస్తృతంగా ప్రచారం చేసిన గిరోండిన్లు దానిని ఆచరణలో పెట్టడానికి ముందుకు రాలేదు. అందుకు భిన్నంగా జాకోబిన్లకు అధికారాన్ని కట్టబెట్టిన ప్రజాశక్తులు బానిసత్వంలో ఎలాంటి భౌతిక ప్రయోజనాన్ని చూపలేదు. బానిసల అగచాట్లను తమ స్వంత కష్టాలతో పోల్చుకున్నాయి. అదే సమయంలో మధ్యతరగతి జాకోబిన్ నాయకత్వం బ్రిటన్ భాగస్వామిగా ఉన్న సంకీర్ణ సైనిక కూటమి చేతిలో ఓటమి చవిచూడాల్సి వస్తోందన్న ఆందోళనతో బ్రిటన్ ఆధీనంలోని కరేబియన్ దీవులలో బానిస తిరుగుబాట్లను ప్రోత్సహించింది.

1794 ఫిబ్రవరి 4న జాకోబిన్‌ల నియంత్రణలోని శాసనమండలి ఫ్రెంచి భూభాగాలన్నింటిలో బానిసత్వాన్ని రద్దు చేస్తూ శాసనాన్ని జారీ చేసింది. మండలి అధ్యక్షుడు సెయింట్ డొమింగో నుండి వచ్చిన నల్లజాతి, ములాత్తో ప్రతినిధులను తండ్రిభావంతో ముద్దాడాడు. రెండు విప్లవాల మధ్య భాగస్వామ్యం కుదిరింది. ఫలితంగా బానిసత్వంలో బ్రిటీషు క్యాపిటలిజం వాటాను విస్తరించాలన్న పిట్ (బ్రిటన్ ప్రధాని) ఆశలు అడియాసలుగా మిగిలిపోయాయి. సెయింట్ డొమింగోలో అడుగుపెట్టిన 60,000 సైనికులు గల బ్రిటీషు దళాలు తీవ్రంగా నష్టపోయాయి.ఒక దశాబ్దం తర్వాత వెల్లింగ్‌టన్ నేతృత్వంలోని ద్వీపకల్ప సైన్యం చవిచూసిన నష్టాల కంటే అవి ఎక్కువగా వున్నాయి. బ్రిటీషు పార్లమెంటులో భౌతికవాద మూల్యాంకణ సమతుల్యంలో మరోసారి మార్పు వచ్చింది. ఫలితంగా బానిస వ్యాపార వ్యతిరేకులకు తమ వాదనను వినిపించే అవకాశం లభించింది. 1807లో బానిసల వ్యాపారాన్ని నిషేధిస్తూ పార్లమెంటు ఒక చట్టాన్ని ఆమోదించింది.

దురదృష్టవశాత్తు సెయింట్ డొమింగోకు చెందిన మాజీ బానిసలకు ఆ విషయం అంతటితోముగియలేదు. థెర్మిడార్ తర్వాత ఫ్రాన్స్‌లో అధికారం మితవాదుల చేతికి చిక్కడంతో పాత బానిస యజమానులకు సరికొత్త ప్రభావం, ప్రాబల్యం దక్కాయి. వారి వాణిజ్య భాగస్వాములు కూడా బలోపేతమయ్యారు. చక్రవర్తిగా కిరీటం ధరించడానికి నెపోలియన్ సిద్ధమవుతూనే వలసవాద సామ్రాజ్యంలో బానిసత్వాన్ని పునరుద్ధరించాలని కుట్ర పన్నాడు.

తౌస్సెయింత్ ల'ఔర్త్యూర్ బలగాల ఆధీనంలో ఉన్న సెయింట్ డొమింగోను హస్తగతం చేసుకోవడానికి అతడు 12,000 మంది సైనికులతో కూడిన నావికాదళాన్ని పంపాడు. అక్కడ జరిగిన యుద్ధం బ్రిటన్‌తో జరిగిన యుద్ధం లాగా చాలా హింసాత్మకంగా సాగింది. ఒక దశలో ఫ్రెంచి సైన్యం విజయం సాధించినట్లే కనబడింది. చర్చలకు రావాలని శత్రు శిబిరం నుండి ఆహ్వానం అందడంతో తౌస్సెయింత్ పొరపాటు చేశాడు. అక్కడికి వెళ్లిన తర్వాత అతడిని అపహరించి కారాగారంలో పడవేశారు. తౌస్సెయింత్ నిర్బంధంలోనే మరణించాడు. దీంతో ఫ్రెంచి దళాల విజయం నిశ్చయమనే భావన కలిగింది. అయితే తౌస్సెయింత్ సహచరుడు డెస్సాలీన్స్ నాయకత్వ బాధ్యతలను స్వీకరించి ప్రతిఘటనను మళ్లీ తీవ్రతరం చేశాడు. చివరకు నెపోలియన్ సైన్యాన్ని ఓడించాడు.

సెయింట్ డొమింగో సర్వస్వతంత్రమైన నల్లజాతి హైతీ రాజ్యంగా ఆవిర్భవించింది. అది చాలా వెనుకబడిన రాజ్యం. సుమారు 15 ఏళ్లపాటు నిరంతరంగా యుద్ధం జరగడంవల్ల అది తీవ్రంగా నష్టపోయింది. కొందరికే అపార సంపదను సమకూర్చిన చక్కెర వ్యాపారాన్ని బానిసత్వం లేకుండా పునరుద్ధరించడం కష్టసాధ్యంగా మారింది. డెస్సాలీన్ వారసుడు క్రిస్టోఫ్ బానిసత్వాన్ని తిరిగి ప్రవేశపెట్టాలని ప్రయత్నించినా ప్రజలు అందుకు సమ్మతించలేదు. వారు పేదరికాన్ని అనుభవిస్తున్నప్పటికీ జమైకా, క్యూబా, బ్రెజిల్ లేదా ఉత్తర అమెరికాలలో జీవిస్తున్న తమ తోటి నల్లజాతీయుల కంటే ఎంతో స్వేచ్ఛగా వ్యవహరించేవారు.

# లాటిన్ అమెరికా తొలి విప్లవాలు

హైతీ స్వాతంత్ర్యం వెనిజులాకు చెందిన సైమన్ బొలీవర్‌ను బాగా ఆకర్షించింది. అతడు 16 ఏళ్ల ప్రాయంలోనే విప్లవ సిద్ధాంతాలను గట్టిగా సమర్థించి ఉన్నాడు. 1815లో అతడు హైతీని సందర్శించాడు. అపుడు బొలీవర్ లాటిన్ అమెరికా అంతటా స్పానిష్ పాలనను సవాలు చేస్తున్న విప్లవ నాయకులలో అగ్రగణ్యుడు.

హైతీలాగే లాటిన్ అమెరికా తిరుగుబాటు కూడా ఐరోపాలో సంభవించిన పరిణామాల కారణంగానే పుట్టుకొచ్చింది. 1808లో బలహీనుడైన బౌర్బన్ రాజు చార్ల్-4ను సింహాసనం నుండి తొలగించిన తర్వాత నెపోలియన్ తన సోదరుడు జోసెఫ్‌ను స్పెయిన్ పీఠంపై కూర్చోబెట్టాడు. దాంతో స్పెయిన్ పాలిత భూభాగాలన్నింటిలో తిరుగుబాటు బయల్దేరింది.

మాడ్రిడ్‌లో ప్రజా ఉద్యమం తీవ్రతరమైంది. గ్రామీణ ప్రాంతాల్లో గెరిల్లా యుద్ధం విస్తృతమైంది. స్పెయిన్ రాచరిక సైన్యం అవశేషాలు బ్రిటీషు సహాయంతో పోరాటాన్ని ముమ్మరం చేశాయి. తిరుగుబాటుకు పురోహితుల నేతృత్వంలోని సనాతనవాద రైతుల మద్దతు విస్తారంగా లభించింది. భూస్వామ్య సాంప్రదాయాలు, చర్చి నియంత్రణకు ముప్పు వాటిల్లగలదని ఆందోళన చెందిన మతపెద్దలు నిరంకుశ రాచరిక వ్యవస్థను పునరుద్ధరించడానికి, కంకణం కట్టుకున్నారు. చార్ల్స్ కుమారుడైన ఫెర్డినాండ్ నేతృత్వంలో రాచరికాన్ని నిలబెట్టాలని, అందులో విచారణ పీఠాన్ని కూడా కొనసాగించాలని నిర్ణయించారు. అయితే కొంత కాలంపాటు తిరుగుబాటుకు జాతీయ కేంద్రంగా కాడిజ్‌కు చెందిన స్వేచ్ఛావాద బూర్జువా వర్గ మండలి వ్యవహరించగలిగింది. దేశంలోని చాలా భాగాల్లో పోరాడుతున్న తిరుగుబాటు దళాలకు ఈ మండలి సిద్ధాంతాలు పూర్తిగా వ్యతిరేకమైనప్పటికీ నెపోలియన్ ఉమ్మడి శత్రువు కావడంతో కొంత కాలంపాటు సర్దుకుపోయారు.

తిరుగుబాటు కారణంగా స్పెయిన్‌లోనే కాకుండా దాని సామ్రాజ్యమంతటా ఆరేళ్లపాటు ఒక నిర్దిష్టమైన ప్రభుత్వమంటూ లేకుండాపోయింది. అమెరికాలలో కాలిఫోర్నియా నుండి కేప్ హార్న్ వరకు అధికార శూన్యత ఉన్నట్లుండి ఏర్పడింది. ఆ లోటును భర్తీ చేయడానికి విభిన్న రాజకీయ శక్తులు ప్రయత్నించాయి. చివరికి అందరూ ఊహించినట్లు అంతర్యుద్ధానికి దిగాయి.

గత 300 సంవత్సరాలుగా తొలి స్పానిష్ వలసదారులు, వారి వారసులు తమ స్వంత ప్రయోజనాలను పెంచుకోవడం మొదలుపెట్టారు. ఆ ప్రయోజనాలు సామ్రాజ్య పాలకులు ప్రయోజనాలతో ఘర్షణ పడేవి. స్పెయిన్‌లో ఏర్పడిన రాజకీయ సంక్షోభం అలాంటి ప్రయోజనాలను బలంగా చాటుకోవడానికి మంచి అవకాశాన్ని కల్పించింది.

అలాంటి డిమాండ్లను ప్రతిఘటించడానికి వలసవాద వైస్రాయ్‌లు సన్నద్ధమయ్యారు. వారి వద్ద సాయుధ బలగాలు తగిన సంఖ్యలో ఉండేవి. మరింత మద్దతు కోసం వారు చర్చిపై ఆధారపడే అవకాశం కూడా ఉండేది. అయితే వైస్రాయ్‌లు కూడా ఊహించని మార్పులు

అక్కడి వలస వాద సమాజంలో చోటుచేసుకోవడం మొదలు పెట్టాయి. ఉత్తర అమెరికాలో సంభవిస్తున్న మార్పుల కంటే అవి భారీగా వున్నాయి. లాటిన్ అమెరికాలో విశాలమైన భూభాగాలపై బడా భూస్వాముల పట్టు ఉండేది. స్థానిక ప్రజలను నియంత్రించడానికి వారు భూస్వామ్య స్వరూపాలను (వ్యవస్థలు) ఏర్పాటు చేసి ఉన్నారు.

ఈలోగా నగరాల్లోని వ్యాపారులు, మధ్యతరగతి, వృత్తిదారులు, కార్మికులు, కొన్ని ప్రాంతాల్లో నల్లజాతి బానిసల ఆలోచనల్లో మార్పు వచ్చింది. రాచరిక వ్యవస్థ, భూస్వామ్య వర్గం ఆర్థికాభివృద్ధికి, తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఆటంకంగా మారాయని, వాటిని నిర్మూలించాల్సిన అవసరం ఉందన్న భావన వారిలో పెరిగింది.

పరిస్థితి ఎంత తీవ్రంగా మారిందంటే బడా భూస్వామ్య కుటుంబానికి చెందిన బొలీవర్ స్వయంగా స్పానిష్ పాలనకు వ్యతిరేకంగా 1810లో తొలి సాయుధ తిరుగుబాటును జరిపాడు. అదే సమయంలో 2,000 మైళ్ల దూరంలో ఉన్న గువాదలాజార అనే మెక్సికన్ పట్టణంలో విప్లవ పురోహితుడైన హిడాల్గో తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్నాడు. తొలుత ఈ తిరుగుబాటు కొంత విజయం సాధించినప్పటికీ అంతిమంగా అణచివేయబడింది. హిడాల్గోలకు ఉరిశిక్ష విధించగా బొలీవర్ తన ప్రాణాలు కాపాడుకోవడానికి పారిపోవాల్సి వచ్చింది. ఇదే ఘటనా క్రమం మరోసారి సంభవించింది. కరాకస్‌లో మరో తిరుగుబాటును బొలీవర్ లేవదీశాడు కాని ఓడిపోయాడు. మద్దతు కూడగట్టడానికి హైతీవెళ్లాడు. మరోవైపు హిడాల్గో వారసత్వాన్ని మొరెలాస్ అందిపుచ్చుకున్నాడు. అయితే అతడిని కూడా ఉరి తీశారు. తన మూడవ ప్రయత్నంలో బొలీవర్ సఫలమయ్యాడు. వెనిజులా నుండి న్యూవా గ్రనాడా గుండా బొలీవియాలోకి చొచ్చుకువచ్చిన బొలీవర్ అర్జెంటీనా విముక్తిప్రదాత సాన్ మార్టిన్‌తో సమావేశమయ్యాడు. తర్వాత చిలీ విముక్తి పోరాట నాయకుడు ఓ'హిగ్గిన్స్‌తో చేతులు కలిపి పెరూ నుండి స్పానిష్ దళాలను తరిమికొట్టాడు.

ఈలోగా మెక్సికోలో మూడోసారి వచ్చిన తిరుగుబాటు ఆ దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించేలా స్పెయిన్‌పై ఒత్తిడి తెచ్చింది, స్వాతంత్ర్యాన్ని సాధించుకుంది. అయినప్పటికీ ఈ విజయాలు బొలీవర్, హిడాల్గో ఆలోచనలతో ప్రభావితులైన వారికి చేదుగానే మిగిలాయి. ఆ ఇద్దరు నాయకులు ఫ్రెంచి విప్లవ విలువలను అందింపుచ్చుకున్నారు. రాచరిక వ్యవస్థను నిర్మూలించడమే కాకుండా భూస్వామ్య వ్యవస్థను కూడా అంతం చేయాలన్నదే ఆ విలువల లక్ష్యం. బానిసలకు విముక్తి కల్గించి పూర్తిస్థాయి బూర్జువా గణరాజ్యాన్ని స్థాపించాలని వారు ధ్యేయంగా పెట్టుకున్నారు.

హిడాల్గో ఒక అడుగు ముందుకు వేసి భూపంపిణీ చేపడతామని కూడా వాగ్దానం చేసి రైతులలో విప్లవ భావాలను రేకెత్తించాడు. వరుస విజయాల తర్వాత బొలీవర్ పనామాలో ఖండవ్యాప్త సమావేశాన్ని నిర్వహించి లాటిన్ అమెరికా 'సంయుక్త రాష్ట్రా'లను ఏర్పాటు చేయడానికి ప్రయత్నించాడు.

ఖండంలో పలుకుబడి, ప్రభావం కలిగిన బడా భూస్వాములు బొలీవర్ ప్రతిపాదన పట్ల ఆసక్తి చూపలేదు. అతివాద ధోరణులను వీరు వ్యతిరేకించడం వల్లే తొలిదశలో బొలీవర్ పరాజయాలను ఎదుర్కోవలసి వచ్చింది. అలాగే హిడాల్గో మరణశిక్షకు గురి కావాల్సి వచ్చింది. బొలీవర్, హిడాల్గో వారసులను విముక్తి ప్రదాతలుగా భూస్వాములు చివరికి కొనియాడినప్పటికీ స్వాతంత్ర్యం తాము సూచించే షరతులపై ఆధారపడేలా చేయగలిగారు. భూసంస్కరణల అంశం ఎప్పుడూ ముందుకు రాలేదు. ప్రాంతీయ భూస్వామ్య కుటుంబాల చేతిలోనే అధికారం ఉండిపోయింది. సంయుక్త రాష్ట్రాలకు పోటీగా సమైక్య లాటిన్ అమెరికా రిపబ్లిక్‌ను స్థాపించాలన్న ప్రణాళికలు ప్రసవ దశలోనే అంతరించాయి. ఎన్నో విజయాలను సాధించినప్పటికీ, తన విగ్రహాలను వెనిజులాలోని ప్రతిపట్టణంలోనూ ఏర్పాటు చేసినప్పటికీ బొలీవర్ తన కల నెరవేరకుండానే చనిపోయాడు.

లాటిన్ అమెరికా స్వాతంత్ర్యానికి పూర్వం ఎలా ఉండేదో అలాగే ఉండిపోయింది. ఐరోపాతో సమానంగా 17, 18వ శతాబ్దపు అద్భుత కట్టడాలతో నిండిన కొన్ని నగరాలు ఈ ఖండంలో మిగిలిపోయాయి. ఈ నగరాలు చుట్టూ విశాలమైన వ్యవసాయ క్షేత్రాలు ఉన్నాయి. సమీప గ్రామాల నుండి వచ్చే కౌలుదారులు వాటిని సాగు చేస్తారు. ఇక్కడి దేశాలు స్పానిష్ పాలన నుండి విముక్తి పొందినా వివిధ స్థాయిలలో విదేశీ శక్తులపైనే ఆధారపడి ఉన్నాయి. మెక్సికోను 19వ శతాబ్దంలో అమెరికా, ఫ్రాన్స్‌లు ఆక్రమించాయి. మరోవైపు అర్జెంటీనా, చిలీ లాంటి దేశాలపై బ్రిటన్ తీవ్ర ప్రభావం చూపింది. ప్రతి లాటిన్ అమెరికా దేశంలోనూ భూస్వామ్య పాలకవర్గాలు ఒకరిపై ఒకరు కుట్రలు పన్నారు. సైనిక తిరుగుబాట్లు జరిపారు. ప్రగతిశీల, సాంప్రదాయవాద రాజకీయ పక్షాలకు నేతృత్వం వహించారు. పాత భూస్వామ్య వ్యవస్థ స్వరూపాలెన్నింటినో పరిరక్షించారు. ఫలితంగా ఒకవైపు విపరీతమైన సంపద కేంద్రీకృతం కాగా మరోవైపు విశాలమైన ప్రజానీకం పేదరికంలో మగ్గిపోతోంది.

నాల్గవ అధ్యాయం

# హేతుబద్ధ ఆలోచనల వెనకపట్టు

చైతన్యోద్యమంతో ప్రభావితమైన మేధావుల మండళ్లు ఎన్నో 1789లో విప్లవం పట్ల అమితాసక్తిని చూపాయి. అయితే విప్లవ భావన సర్వవ్యాపితంగా ప్రబలలేదు. విప్లవ ప్రక్రియ లేదా ఉద్యమం నాగరికతపై దాడిని ప్రతిబింబిస్తోందన్న విమర్శలు చెలరేగసాగాయి. ఈ పరిణామం చాలా తక్కువ కాలంలో చోటు చేసుకుంది. విమర్శకులు భయోత్పాతం గురించి ఎలాంటి ప్రతికూల వ్యాఖ్య చేయలేదు. అలాంటి పరిస్థితులు మూడేళ్ల క్రితమే సమసిపోయాయి. పారిస్ నగరంపై అప్పటికీ లఫాయెత్ నేతృత్వంలోని జాతీయ భద్రతా దళానికి పూర్తి పట్టు ఉండేది. ప్రభుత్వాలు కేవలం జాతీయ శాసనమండలికే బాధ్యత వహించాల్సి ఉన్నా రాజు వాటిని క్రమం తప్పకుండా నియమించేవాడు. మరణశిక్షను అప్పటికీ రోబెస్పియర్ వ్యతిరేకించేవాడు. రాజ్య వ్యవహారాలలో ప్రజలకూ భాగస్వామ్యం ఉండాలన్న సూచనకే తీవ్రమైన వ్యతిరేకత వ్యక్తమయ్యేది.

బ్రిటన్‌కు చెందిన ఎడ్మండ్ బర్కే ప్రకారం "సాధారణ ప్రజలు" నాగరికత అనవాళ్లకే సవాలు విసిరారు. ఈ విషయంపై అతడు రాసిన గ్రంథం అప్పటికీ ఇప్పటికీ ప్రతీఘాత విప్లవానికి ప్రామాణికంగా ఉంది.

> "ఐరోపా మహత్తర చరిత్రను భూస్థాపితం చేశారు. హోదా కోసమో, భౌతికానందం కోసమో మన విశాల హృదయాన్ని తాకట్టుపెట్టకూడదు. అది ఎన్నడూ జరగకూడదు. అణిగిమణిగి ఉండే విధేయతకు మన గర్వం కారణంగా దాసోహం కాకూడదు. బానిసత్వంలో కూడా అమితమైన స్వేచ్ఛాభావాన్ని ప్రదర్శించే హృదయాన్ని ఇతరుల పరం చేయకూడదు."

అంతకు ముందు కరుడుగట్టిన సాంప్రదాయవాదిగా బర్కేను ఎవరూ పరిగణించలేదు. అమెరికాలో బ్రిటీష్ విధానాన్ని, బెంగాల్‌ను ఆక్రమించిన బ్రిటీషు అధికారుల ప్రవర్తనను అతడు తీవ్రంగా వ్యతిరేకించి ఉన్నాడు.

1780 దశకం చివరలో అమెరికా నుండి లండన్‌కు తిరిగి వచ్చిన టామ్ పేయిన్ అతడిని స్నేహితునిగా భావించాడు. అయితే రాజకీయ జీవితంలో ప్రజలు పాలు పంచుకోవాలన్న

కొద్దిపాటి సూచనను కూడా బర్కే భరించేవాడు కాదు. విప్లవాన్ని తీవ్రంగా విమర్శిస్తూ అతడు రాసిన "ఫ్రెంచి విప్లవం అనుభూతులు" 1790లో ప్రచురితమైంది. భూస్వామ్య, వ్యాపార, 'నాగరిక' వర్గాలను విప్లవానికి వ్యతిరేకంగా సమీకృతం చేయడానికి ఆ గ్రంథం ఒక గతితార్కిక సిద్ధాంతంగా ఉపయోగపడింది. రైతులు, వృత్తిదారులు అధికారం చేపట్టగలరన్న ఆలోచనే అతడికి ఆందోళన కలిగించింది. సేవకులు, కార్మికుల విప్లవం ఇక ఎంత ప్రమాదకరంగా ఉండేదో ఊహించగలము. ఉదారవాద సిద్ధాంతాలకు ఏ ఒక్క రాయితీని ఇవ్వకూడదన్నదే ఆ గ్రంథంలోని వాదన. బానిసత్వాన్ని రద్దు చేయాలని ఒకప్పుడు సమర్థించిన బర్కే ఇప్పుడు 'నిర్మూలనావాదాన్ని' జాకోబిన్‌వాద అవశేషంగా నిందించాడు. తన తర్వాతి రచనలో టామ్ పేయిన్ "నేరస్తునిగా న్యాయస్థానాన్ని ఎదుర్కోవడానికి అర్హుడు" అని బర్కే సూచించాడు.

"ఫ్రెంచి విప్లవ అనుభూతులు" ఉన్నత వర్గాలలో తక్షణ విజయం సాధించింది. ఇంగ్లాండ్‌లో 50,000 ప్రతులు అమ్ముడుపోయాయి. తర్వాతి కొన్నేళ్లకు విదేశీ భాషల్లో దానిని అనువాదం చేసి ఐరోపా అంతటా విక్రయించారు. మూడవ జార్జ్ ఆ గ్రంథాన్ని మెచ్చుకున్నాడు. క్యాథరీన్ ద గ్రేట్ ఎంతో ఉత్సాహం చూపాడు. పోలెండ్ చివరి పాలకుడు స్టానిస్లావ్ దానిని పొగడ్తలతో ముంచెత్తాడు. అయితే వీరిలో ఒక్కరికి కూడా 'విధేయత' (లొంగుబాటు) అనుభవం లేదు. "అమితమైన స్వేచ్ఛాస్ఫూర్తి"ని ఏ ఒక్కరూ పెంపొందించలేదు.

ఇంగ్లాండ్‌లో బర్కే రచనలకు ధీటుగా ఐరోపా గడ్డపై డి మాయిస్ట్రే రచనలు వెలువడ్డాయి. "పాలకులు తమ పుట్టుక రీత్యా లేదా ఐశ్వర్యం రీత్యా ప్రజలకు దూరంగా ఉండాలి. ఎందుకంటే ప్రజలు ఒక్కసారి పాలకుల ఆధిపత్యంపై గౌరవం కోల్పోతే ప్రభుత్వమంతా పతనమవుతుంది," అని మాయిస్ట్రే వాదించడమే కాకుండా తన వాదనను పొడిగించి చైతన్యోద్యమ స్థూల ప్రాతిపదికపై కూడా దాడి ప్రారంభించాడు. "ఉన్నత వర్గానికి చెందిన వ్యక్తి చేసే మహాపరాధం ఏమైనా ఉందంటే అది క్రైస్తవ మత సిద్ధాంతాలను విమర్శించడమే" అని కూడా రాశాడు.

పాత సాంప్రదాయాలకు సవాళ్లు ఎదురైతే యజమానులకు పీడిత వర్గాల నుండి ముప్పు ఏర్పడగలదని హెచ్చరించిన వారిలో మాయిస్ట్రే ఒంటరిగా మిగలలేదు. ఇప్పుడు గిబ్బన్ కూడా నిరర్థకమైన క్రైస్తవ మత భావనలకు ప్రాధాన్యత ఉందని గ్రహించాడు. విశేషమేమిటంటే తను పూర్వం రచించిన "రోమన్ సామ్రాజ్య ఉత్థానపతనం" అనే గ్రంథంలో అతడు మత విశ్వాసాలను చీల్చి చెండాడు. "విచక్షణ లేని అమాయకపు ప్రజానీకం ఉల్లంఘించే విధంగా పాత మూఢ నమ్మకాలను బహిర్గతం చేస్తే ప్రమాదం ఏర్పడగలదు," అని అతడు రాశాడు.

కేవలం ఒక్క విప్లవమే కాకుండా చైతన్యోద్యమ మౌలిక పునాదులు కూడా విమర్శకుల దాడికి గురయ్యాయి. విప్లవ సైన్యాల వరుస విజయాలు ఐరోపాలోని కిరీటధారులు, పాలక వర్గాలను వణికించే కొద్దీ ఈ సైద్ధాంతిక దాడి కూడా ఉధృతమైంది. ప్రజానీకంలో చైతన్యం పెరగకుండా నిరోధించేందుకు వారు సనాతనవాద నమ్మకాలను ప్రచారం చేయడం

ప్రారంభించారు. చైతన్యోద్యమ సాంప్రదాయాన్ని ముందుకు తీసుకెళ్లాలని ప్రయత్నించిన ప్రతి ఒక్కరిపై పోలీసుల ద్వారా తీవ్రమైన అణచివేత చర్యలు తీసుకున్నారు.

1789 పరిమాణాలపై ఎంతో ఆశలు పెట్టుకున్న వారిలో నిరాశ నిస్పృహలు చోటు చేసుకోవడంతో తిరోగమన ఆలోచనల కెరటం మరింత బలపడింది. 1789 తర్వాత రెండవసారి ఉధృతంగా కొనసాగిన భయానక రాజ్యం, థెర్మిడార్, నెపోలియన్ పట్టాభిషేకం ప్రజల విప్లవ ఆకాంక్షలపై నీళ్లు చెల్లాయి. వారి మదిలో సందేహాలు తలెత్తాయి. కొందరైతే అభివృద్ధి నిరోధక శక్తులుగా కూడా మారిపోయారు. "అన్ని యుగాల్లోనూ అన్ని రూపాల్లోనూ (ప్రభుత్వపరమైన నిర్మాణాలు) పాలకులందరూ ఒకే విధంగా వ్యవహరించారు." అని కాలెంజ్ 1797లో రాశాడు. మరో ప్రపంచం సాధ్యమన్న ఆశే ఒక దుష్టశక్తి అని జర్మన్ కవి హోల్డర్లిన్ సూచించాడు. "రాజ్యాన్ని స్వర్గధామంగా మార్చాలని ప్రయత్నించిన వ్యక్తులే దానిని నరకంగా మార్చివేశారు" అని రాశాడు.

1789 రేపిన ఆశలను వదులుకోవడానికి సిద్ధంగా లేని వారు సైతం పాత వ్యవస్థతో ప్రత్యక్ష పోరాట మార్గాన్ని ఎంచుకోలేదు. మత విశ్వాసాలు, సామ్రాజ్యవాద సిద్ధాంతాల పట్ల గుడ్డి నమ్మకాన్ని ప్రచారం చేసే వారితో రంగమంతా నిండిపోయింది.

అదే 50 ఏళ్ల క్రితం హ్యూమ్ తన సందేహాలను, అభిప్రాయాలను బహిరంగంగా వ్యక్తం చేయగల పరిస్థితులున్నా ఇప్పుడు షెల్లీని 18 ఏళ్ల ప్రాయంలో ఆక్స్‌ఫర్డ్ నుండి బహిష్కరించారు. అతడు చేసిన నేరం నాస్తికవాదాన్ని సమర్థించడమే. పాత నిబంధనల్లో నిరర్థక సిద్ధాంతాలను వాల్టెయిర్ బహిర్గతం చేసినా 1840లో డేవిడ్ స్ట్రాస్ లాంటి వ్యక్తులు బైబిల్‌పై దాడిని ప్రారంభించే వరకు ఎదురు చూడక తప్పలేదు. ఆయా జాతులు (పశు పక్ష్యాది) కాలక్రమంలో పరిణామం చెందగలవనే భావనను 18వ శతాబ్దంలో బఫ్ఫాన్, లామార్క్ (ఫ్రాన్స్), ఎరాస్‌మస్‌డార్విన్ (ఇంగ్లాండ్) లాంటి వ్యక్తులు ప్రచారం చేయగలిగారు. అయితే 1830-40 మధ్యకాలంలో కూడా బ్రిటన్‌లో పరిస్థితులు ఎలా ఉండేవంటే ఎరాస్‌మస్ మనవడైన చార్లెస్ డార్విన్ కూడా తన పరిణామ క్రమ సిద్ధాంతాన్ని 20 ఏళ్లపాటు గోప్యంగా ఉంచాల్సి వచ్చింది. స్కాట్లండ్ చైతన్యోద్యమ నాయకులు ఆడమ్‌స్మిత్, ఆడమ్ ఫర్గ్యూసన్‌లు మానవజాతి అభివృద్ధిపై కొన్ని సిద్ధాంతాలను వెలువరించారు. ఆహార సేకరణ - వేటకారుల స్థాయి నుండి ప్రస్తుత ఆధునిక యుగానికి మానవ సమాజం ఎలా అభివృద్ధిలోకి వచ్చిందో వారు వివరించారు. అయితే 'దేశాల సంపద'లోని వ్యాఖ్యలను తరచూ వల్లె వేసే వారు ఈ విషయాన్ని మరిచారు. "సమాజం దేవుడిచ్చిన వరం" అని నమ్మారు. దాదాపు అర శతాబ్దం పాటు ప్రజల ఆలోచనా శక్తిని నిర్వీర్యం చేసే ప్రయత్నాలు జరిగాయి.

చైతన్యం నుండి సనాతనవాదానికి మొగ్గు పూర్తి స్థాయిలో జరగలేదు. గణితం, భౌతిక, రసాయన శాస్త్రాలలో పురోగతిని కొనసాగించారు. యుద్ధ అవసరాలు, పరిశ్రమల విస్తరణ అందుకు ప్రోత్సాహాన్ని అందించాయి. లాభాలను కోరే పారిశ్రామికవేత్తలు, ఎక్కువ కౌలును ఆశించే భూస్వాముల మధ్య విధానపరమైన సంఘర్షణలు తీవ్రం కావడంతో ఇంగ్లాండ్‌లో డేవిడ్ రికార్డో క్యాపిటలిజంపై స్మిత్ అవగాహనను మరింత అభివృద్ధి పరిచాడు.

మానవ అవగాహన అభివృద్ధి స్థూల వీక్షణంలో జర్మన్ తత్త్వవేత్త హెగెల్ చైతన్యోద్యమం సిద్ధాంతాలెన్నింటినో జోడించాడు. అయితే ఈ అభివృద్ధిని భౌతికవాద అంశాలతో నిమిత్తం లేకుండా విశ్లేషించాడు. వాల్టర్‌స్కాట్, హానర్ డి బల్జాక్, స్టెండ్‌హాల్, జేన్ ఆస్టెన్ లాంటి రచయితలు మధ్య తరగతి వర్గాల నిరాశ నిస్పృహలకు సాహిత్యపరమైన రూపం ఇచ్చే వినూత్నమైన మార్గంగా నవలను అభివృద్ధి పరిచారు. అప్పటికే క్యాపిటలిస్టుయుగం ఆవిర్భవిస్తూ ఉంది.

సంగీత, సాహిత్య, కళారంగాలలో 'ప్రణయవాద' ఆలోచనల కంటే మానసిక భావాలను, ఆందోళనలను ప్రతిబింబించింది. ఫలితంగా చాలా ఉదంతాల్లో సనాతనవాద యుగాన్ని 'స్వర్ణయుగం'గా కీర్తించారు. కాని భూస్వామ్య వ్యవస్థ అవశేషాలు మిగిలి ఉన్న సమాజాల్లో నిరంకుశత్వం, అణచివేతపట్ల ప్రజా తిరుగుబాటు సాంప్రదాయాలను కూడా కీర్తించారు. సెయింట్ సైమన్, ఫొరియర్ లాంటి సమసమాజ సిద్ధాంతకర్తలు, బ్రిటన్‌కు చెందిన రాబర్ట్ ఓవెన్ అనే పరిశ్రమల మేనేజరు సమాజ నిర్వహణపై కొన్ని ప్రణాళికలను రూపొందించారు. అయితే తమ ప్రతిపాదనలను ఆచరణలో పెట్టగల అధికార కేంద్రాన్ని మాత్రం వారు గుర్తించలేకపోయారు. అందుకు ఒక కొత్త తరం అవసరమైంది. అది 1810 దశకం చివరలో, 1820 దశకం తొలి సంవత్సరాలలో ఆవిర్భవించింది. చైతన్యోద్యమ వారసత్వాన్ని, తొలి విప్లవ కెరటాల విజయాలను ముందుకు తీసుకెళ్లింది. ఈలోగా ప్రపంచం నాటకీయ పరిణామాలను చవిచూసింది. 18వ శతాబ్దపు జీవనశైలిని సమాజంపై మోపాలని 'పునరుద్ధరణ' రాచరికాలు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ అనూహ్యమైన మార్పులు చోటు చేసుకున్నాయి.

ఐదవ అధ్యాయం

# పారిశ్రామిక విప్లవం

"న్యూ లానార్క్‌లోని నా కర్మాగారంలో 2,000 మంది వ్యక్తులు, వయోజనులు యాంత్రిక శక్తిని వినియోగిస్తూ కార్యకలాపాలను నిర్వహిస్తున్నారు. వీరు ఇప్పుడు చేపడుతున్న ఉత్పత్తికి 60 ఏళ్ల క్రితం స్కాట్లాండ్ జనాభా మొత్తం అవసరమయ్యేది," అని పారిశ్రామికవేత్త, భవిష్యత్తు సోషలిస్టు నాయకుడు రాబర్ట్ ఓవెన్ 1815లో పేర్కొన్నారు.

ఆయన కొంత వరకు ఎక్కువ చేసి చెప్పి ఉండవచ్చు కాని ఆయన ఒక ముఖ్యమైన సత్యాన్ని బల్ల గుద్ది చెప్పారు. వేట సేకరణదార సమాజాలు 10,000 ఏళ్ల క్రితం చేపట్టిన కార్యకలాపాల తర్వాత మానవులు ఇప్పుడు ఎన్నడూ ఎరుగని విధంగా విభిన్నమైన మార్గాలలో ఉత్పత్తులను పెద్ద ఎత్తున సృష్టించడం మొదలుపెట్టారు. తొలుత ఈ మార్పులు ఉత్తర ఇంగ్లాండ్, స్కాట్లండ్ దిగువ భాగాలు, బెల్జియంలోని కొన్ని ప్రాంతాలకే పరిమితమయ్యాయి. కాని అనతి కాలంలో ఇతర ప్రదేశాలలో కూడా మార్పులకు దోహదం చేశాయి.

పరస్పర సంబంధాలున్న కొత్త ఉత్పత్తి మార్గాలను వారు కనిపెట్టారు. భారీ యంత్రాల వినియోగం, కలప స్థానంలో ఘనీకృతమైన స్టీలుతో పరికరాల తయారీ, తేలిగ్గా వంచదగ్గ కంచు లేదా ముడి ఇనుము వినియోగం, బొగ్గు బట్టీలలో స్టీలు తయారీ, ఆవిరి యంత్రం ద్వారా కొత్త చాలక శక్తిని ఉత్పత్తి చేసి యంత్రాలను నడపడం వంటి మార్పులు ఉత్పాదనా రంగంలో వరుసగా చోటు చేసుకున్నాయి.

కొత్త యంత్రాలు, కొత్త లోహశాస్త్రం, కొత్త ఇంధన వనరుల కలయిక ప్రజల ఉత్పాదక శక్తిని గణనీయంగా పెంచాయి. అలాగే ఉత్పత్తులను ఒక చోట నుండి మరో చోటికి తరలించేందుకు ప్రజలకు పట్టే సమయం కూడా గణనీయంగా తగ్గిపోయింది.

18వ శతాబ్దం చివరలో బోస్టన్ నుండి ఫిలడల్ఫియా వెళ్లేందుకు రెండు వారాల సమయం పట్టేది. ఓడరేవులో దాదాపు పక్షం రోజులపాటు ఓడ ఇరుక్కుపోయేది లేదా సముద్ర గాలుల దిశ మారేంత వరకు వేచి చూసేది. ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి ఆహార పదార్థాల రవాణాలో ఎదురయ్యే ఆటంకాలవల్ల కరువు తరచుగా సంభవించేది.

గత 3,000 సంవత్సరాల నుండి చక్రాల వాహనాల గురించి యురేషియా, ఆఫ్రికాలలో బాగా పరిచయమున్నా వాటిని పర్వత ప్రాంతాలు, గ్రామీణ ప్రాంతాలలో వినియోగించలేకపోయారు. కంచర గాడిదలు లాగే బండ్లనే ఎక్కువగా వాడేవారు. తోపుడు

బండి కంటే అవి ఎంతో అనుకూలంగా ఉండేవి. సరుకులను ఎక్కువగా వాటిలోనే రవాణా చేసేవారు. ఐరోపాలోని మట్టి రహదారులలో పెద్ద బండరాళ్లు పెద్ద సంఖ్యలో ఉండడంవల్ల కేవలం గుర్రాలు, గాడిదలు మాత్రమే ఎలాంటి ఆటంకం లేకుండా ముందుకు కదిలేవి. అయితే వాహనాల రాకపోకలు మాత్రం కష్టంగా ఉండేది. మొగల్ భారతంలో భూమార్గాన సరుకుల భారీ రవాణా కోసం ఎద్దులపైనే ఎక్కువగా ఆధారపడేవారు. ప్రతి ఎద్దు సరుకుల మూటలను మోసుకెళ్లేది. అలా వేలాది ఎద్దులను రవాణా కోసం వినియోగించేవారు.

ఇప్పుడు పెద్ద సంఖ్యలో ఉన్న కార్మికులు పలుగు పారా చేతపట్టి కాలువల నిర్మాణాన్ని, రహదారుల నిర్మాణాన్ని కొనసాగించారు. ప్రధాన పట్టణాల మధ్య రహదారులను ఏర్పరిచారు. ఫలితంగా సరుకుల రవాణాకు ఉన్న ఆటంకాలు తొలిగాయి. రైలుపట్టాలు వేసి చక్రాలతో కూడిన తొట్ల ద్వారా బొగ్గును అత్యంత వేగంగా రవాణా చేసే మార్గాన్ని గని యజమానులు కనుగొన్నారు. తొలుత తొట్లను కలపతో తయారు చేసినా అనతి కాలంలోనే ఇనుప తొట్లను ప్రవేశపెట్టారు. ఓడలు, రైలు వాహనాలు, చివరకు కర్మాగారాలను నడిపేందుకు కూడా ఇంజినీర్లు ఆవిరి యంత్రాన్ని వినియోగించారు. 1830లో మాంచెస్టర్ నుండి లివర్‌పూల్ వరకు తొలి ప్యాసింజర్ రైలును నడిపారు. తాము ఎన్నడూ ఊహించనంత వేగంగా మానవులు ప్రయాణం చేయగలిగారు. ఒక నగరంలో తయారైన ఉత్పత్తులు రోజులకు బదులు కొన్ని గంటల్లోనే ఇతర నగరాలలో లభ్యమయ్యేవి. దేశంలోని ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి రాత్రికి రాత్రే చేరుకొనే సామర్థ్యాన్ని సైన్యాలు సాధించాయి.

వ్యవసాయ రంగంలో కూడా మార్పులు వేగంగా చోటు చేసుకున్నాయి. రైతుల భూములను కలుపుకోవడం ద్వారా వ్యవసాయ క్షేత్రాల విస్తరించాయి. బ్రిటన్‌లో వ్యవసాయం పుంజుకుంది. గత శతాబ్దపు కొత్త పంటలను, కొత్త వ్యవసాయ పద్ధతులను దేశమంతటా దాదాపు సమానంగా ఆమోదించారు. బార్లీ స్థానంలో ఉల్లిగడ్డ, చామగడ్డ, గోధుమలను సాగు చేశారు. అధునాతమైన నాగలిని వినియోగించి పంట మార్పిడి విధానాన్ని అభివృద్ధి పరిచారు. ఆహారోత్పత్తిని పెంచడమే లక్ష్యమైనా దానితోపాటు క్యాపిటలిస్టు వ్యవసాయ క్షేత్రాలు లేదా కొత్త పరిశ్రమలలో వేతన కార్మికులుగా చేరేలా లక్షలాది మంది ప్రజలను బలవంతం చేశారు.

## ఒక కొత్త రకమైన వర్గం

కోట్లాది ప్రజల పని విధానంలో, జీవన స్థితిగతులలో చాలా మార్పు వచ్చింది. చరిత్రలో ఎన్నడూ ఎరుగని విధంగా వారు పట్టణాలు, నగరాలలో పోగవడం మొదలు పెట్టారు. ముడి బొగ్గును ఇంధనంగా, నీరు, వాయువును శక్తిగా పరిశ్రమ వినియోగించినంత కాలం అది చాలా వరకు గ్రామీణ ప్రాంతాలకే పరిమితమై ఉండేది. లాంకషైర్‌లోని మాంచెస్టర్, స్కాట్లండ్‌లోని గ్లాస్గో చుట్టూ ఆధునిక పరిశ్రమ తన భారీ పొగ గొట్టాలతో నగర భూతలాన్ని ఆక్రమించడం మొదలుపెట్టింది. 1830 దశకం నాటికి బ్రిటన్ మానవాళి చరిత్ర ఎన్నడూ ఎరుగని విధంగా అత్యంత పట్టణీకరణ చెందిన సమాజంగా ఎదిగింది. 1750లో 50,000 కంటే ఎక్కువ జనాభా కలిగిన నగరాలు ఇంగ్లాండ్‌లో రెండే రెండు ఉండేవి. అవి లండన్, ఎడింబర్గ్. 1851 నాటికి అలాంటి నగరాల సంఖ్య 29కి చేరుకుంది. అలాగే మెజారిటీ ప్రజలు పట్టణాలలో నివసించడం మొదలుపెట్టారు.

ఆధునిక పారిశ్రామిక ఉత్పత్తికి ఈ పరివర్తన అనతి కాలంలోనే సంభవించలేదు. నేటి తృతీయ ప్రపంచపు దేశాలలో వలె భారీ పరిశ్రమల అభివృద్ధి శారీరక శ్రమపై ఆధారపడ్డ లఘు పరిశ్రమల విస్తారమైన అభివృద్ధితోపాటు సంభవించింది. ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవం తొలుత జౌళి, గనుల రంగంలో పునాదులు వేసుకుంది. కాని జౌళి రంగంలో కేవలం పత్తి వడకడమే ఫ్యాక్టరీలలో కేంద్రీకృతమైంది. నేత పనిని అప్పటికి కూడా గ్రామీణ ప్రాంతాలలోని చేనేత కార్మికులే చేసేవారు. వారి సంఖ్య భారీగా పెరిగింది. అలాగే గని కార్మికుల సంఖ్య కూడా విపరీతంగా పెరిగింది. వీరుపట్టణాల కంటే గ్రామాలలోనే ఎక్కువగా నివసించేవారు. అయితే వారి గ్రామీణ ప్రాంతాలన్నీ నదులు, కాలువలు, రైల్వేల ద్వారా అనుసంధానమై ఉండేవి.

జీవనోపాధి కోసం క్యాపిటలిస్టు వర్గంతో నగదుపరమైన సంబంధాలను పెంచుకొని వాటిపైనే ఆధారపడ్డ ప్రజలు తమ జీవితాన్ని చాలా వరకు మార్చుకున్నారు. 1790 దశకంలో స్వతంత్రులైన చేనేత కార్మికుల సంఖ్య భారీగా పెరిగింది. కాని 1840 నాటికి పవర్‌లూమ్ వినియోగించే కొత్త ఫ్యాక్టరీల నుండి పోటీ విపరీతంగా రావడంతో వారు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. రెండు పూటలా భోజనం దొరకడమే గగనంగా మారింది.

'జీవన ప్రమాణం' అనే అంశంపై ఆర్థిక చరిత్రకారుల్లో సుదీర్ఘమైన చర్చ జరిగింది. పరిశ్రమలు, నగరాలలో ప్రవేశించడంవల్ల ప్రజల జీవన ప్రమాణాలు పడిపోయాయా లేదా అన్న విషయమై అనేక వాదోపవాదాలు జరిగాయి. అయితేచర్చ చాలా వరకు అసలు అంశాన్ని పక్కనపెట్టింది. నేడు బొంబాయి లేదా జకార్తాకు తృతీయ ప్రపంచ దేశాల ప్రజలు వలస వెళుతున్నట్లే అప్పుడు కూడా ప్రజలు నగరానికి మకాం మార్చారు. ఎందుకంటే గ్రామీణ ప్రాంతంలో దుర్భర పరిస్థితుల నుండి తప్పించుకోవడానికి అదొక్కటే ప్రత్యామ్నాయ మార్గం గా ఉండేది. అయితే నగరం కూడా స్థిరమైన, సౌకర్యవంతమైన భవిష్యత్తును అందించలేదు. తమ కార్మికశక్తిని అమ్ముకునేందుకు తగిన సామర్థ్యాన్ని ఏదో ఒక రోజు ప్రదర్శించే అవకాశం ప్రజలకు ఉండేది. కాని మరుసటి రోజు ఈ సామర్థ్యం ఎందుకూ పనికి రాకుండా పోయేది. ఇందుకు చేనేత కార్మికులే మంచి ఉదాహరణ. మార్పు చాలా వరకు నెమ్మదిగానే సంభవించింది. 18వ శతాబ్దపు తొలి దశకాలలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ప్రగతి అనేక ఇబ్బందుల తర్వాత సాధ్యమైంది. 19వ శతాబ్దపు పట్టణ ఆర్థిక వ్యవస్థలో మార్పు త్వరగా వచ్చినా ప్రజలు తీవ్రమైన పరిణామాలను ఎదుర్కోవలసి వచ్చింది. మార్కెట్ల కోసం ఉత్పత్తి జరిగేది. మార్కెట్లు అత్యంత వేగంగా విస్తరించేవి లేదా కుదించుకుపోయేవి. ఆర్థికాభివృద్ధి వేగంగా చోటుచేసుకున్న సమయాల్లో ప్రజలు తమ పాత వృత్తులను, గ్రామీణ ప్రాంతాలలోని నివాసాలను వదిలి నగరంలో మకాం పెట్టేవారు. త్వరగా డబ్బు సంపాదించాలన్న ఆశే వారిని నగరాలకు రప్పించేది.

మార్కెట్ సంక్షోభం తలెత్తినప్పుడు సర్వం కోల్పోయి వీధిన పడేవారు. ఉద్యోగాలు కోల్పోయినప్పుడు మనుగడ కోసం కనీసం వ్యవసాయ భూమి కూడా వారికి అందుబాటులో ఉండేది కాదు. భూమి కనుక ఉంటే కొద్దోగొప్పో ఆహార ధాన్యాలను సంపాదించే అవకాశం ఉండేది. కాని భూములను, ఇళ్లను పూర్తిగా అమ్ముకొని నగరానికి తరలివచ్చిన వారు దాదాపు ఆకలితో అలమటించేవారు.

కొత్త కార్మికుల్లోని కొన్ని వర్గాలు నైపుణ్యాన్ని సాధించి కొంత కాలంపాటు మనుగడ సాగించినా తమ యజమానులతో పని వాతావరణం గురించి తీవ్రంగా ఘర్షణ పడాల్సి

వచ్చింది. యజమానులు కార్మికుల జీవితాలను దుర్భరం చేసేందుకు ప్రయత్నించేవారు. ముఖ్యంగా మార్కెట్ పడిపోయినప్పుడు కాని కొత్త సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చినప్పుడు కాని అలా వ్యవహరించేవారు. అలాగే దారిద్ర్యంలో మగ్గుతూ జీవించే పట్టణ జనాభా కూడా గణనీయంగా ఉండేది. పాక్షిక పనులు కూడా చేయలేనంత బలహీనంగా, ఎలాంటి నైపుణ్యం లేకుండా వయోభారంతో ఈ వర్గం కుమిలిపోయేది.

ఈ కొత్త కార్మిక శక్తి అపారమైన సంపదకు మూలాధారమైంది. కాని సంపదను ఇతరులు దక్కించుకునేవారు. శ్రామిక వర్గంలోని మెజారిటీ భాగం తన జీవన ప్రమాణాలను మెరుగుపరుచుకుందని వాదించే గణాంకవేత్తలు కూడా ఒక విషయాన్ని అంగీకరిస్తారు. ఉత్పాదకతతో సమానంగానే కార్మికుల జీవన స్థితిగతులు మెరుగుపడ్డాయని చెబుతారు. కొత్త శ్రామిక వర్గం ఒక మోస్తరుగా బతకగలిగినా ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసి వచ్చింది. ఒక జేన్ ఆస్టెన్ నవలలో కనిపించే పాత్రధారులు విందులు, వినోదాలు, వేట, సాంగత్యం కొనసాగించి అందమైన పరిసరాలలో తేనీరు సేవించినట్లుగా ఈ వర్గం ప్రజలు తమ జీవితాన్ని గడిపేవారు. 1815 తర్వాతి ఆకలి సంవత్సరాలలో జాతీయ ఉత్పత్తిలో సుమారు 12 శాతాన్ని జాతీయ రుణానికి వడ్డీగా చెల్లించాల్సి వచ్చింది.

కొత్త కార్మిక శక్తి చెమటపై బతికిన వారు దానిని నిరంతర సమస్యగా పరిగణించడం మొదలుపెట్టారు. తమకు నచ్చిన రీతిలో వారితో ఎలా పని చేయించాలి? అని తీవ్రంగా ఆలోచించేవారు.

గ్రామీణ ప్రాంతాలలో పుట్టి పెరిగిన కార్మికులు వాతావరణ మార్పులకు అలవాటు పడ్డారు. స్వల్ప కాలంలో తీవ్రమైన శ్రమ తర్వాత సుదీర్ఘకాలంపాటు విశ్రాంతికి అవకాశాలు కల్పించే పరిస్థితులు వారికి అలవాటయ్యాయి. ఆదివారం సెలవు తీసుకోవడంతోపాటు అవకాశం ఉంటే సోమవారం కూడా విశ్రాంతి తీసుకునేవారు (ఇంగ్లాండ్‌లో 'సెయింట్ మండే,' జర్మనీలో 'బ్లూమండే' అని సోమవారాన్ని పరిగణించేవారు). అలాంటి అలవాట్లను నిర్మూలించడం ఫ్యాక్టరీ యజమానుల ప్రవృత్తిగా మారిపోయింది. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు యంత్రాలు నడిచేవి. గ్యాస్ లైట్లను కనుగొన్న తర్వాత పని దినం మరింత పెరిగింది. రాత్రిళ్లు కూడా కర్మాగారాలు నడిచేవి. "సమయమే డబ్బు" అనే కొత్త ప్రవచనాన్ని సూచిస్తున్నట్లుగా ఫ్యాక్టరీలలో గడియారాలను అమర్చారు. మానవ స్వభావాన్నే మార్చివేయాలని యజమానులు సంకల్పించారు. సూర్యుడిని, చెట్లను, పుష్పాలను చూడకుండా లేదా పక్షుల కిలకిలరావాలు వినకుండా పగలంతా నాలుగు గోడల మధ్య శ్రమ చేయడం వింతేమీ కాదని భావించేలా కార్మికుల స్వభావాన్ని తీర్చిదిద్దాలని నిర్ణయించారు.

పేదరికాన్ని నిర్మూలించడానికి ఎలాంటి ప్రయత్నం జరిగినా అది కొత్తగా నెలకొల్పిన క్రమశిక్షణను బలహీనపరుస్తుందని ధనిక వర్గాలు భావించాయి. పని చేయకుండానే పేద ప్రజలు కొంత ఆదాయాన్ని సమకూర్చుకోగలిగితే వారు సోమరులుగా, దద్దమ్మలుగా, మోసగాళ్లుగా మారి వివేచనా, ఆత్మగౌరవం, స్వీయ నియంత్రణ (సంయమనం) లాంటి అన్ని అలవాట్లు కోల్పోతారని, "సోమరితనం, ధిక్కారం" ప్రతిబింబించే స్ఫూర్తిని అలవర్చుకుంటారని ఆందోళన చెందాయి.

పేదల జీవన ప్రమాణాలను పెంచలేమని థామస్ మాల్థస్ స్పష్టం చేశాడు. తన వాదనకు మద్దతుగా ఒక ప్రమాణ పత్రాన్ని అందించాడు. తమ బతుకులు మరింత దుర్భరమయ్యే

వరకు వారు పిల్లలను కంటారని అతడు చెప్పాడు. ఆడమ్ స్మిత్ సిద్ధాంతాలను ప్రచారం చేసే జీన్-బాప్టిస్ట్ సే కూడా ఒక నిజమైన స్వేచ్ఛా మార్కెట్‌లో నిరుద్యోగం అసాధ్యమని నిరూపించే పత్రాన్ని ప్రవేశపెట్టాడు.

ఒక వేళ ప్రజలు ఉపాధిని పొందకపోతే దానికి కారణం అధిక వేతనాలను డిమాండ్ చేయడమేనని, భారీ వేతనాలను భరించే స్థితిలో మార్కెట్ లేదని చెప్పాడు. సహాయక చర్యల ద్వారా పేదలను ఆదుకుంటే ఇలాంటి వినాశకరమైన సాంప్రదాయాన్ని ప్రోత్సహించినట్లే అవుతుందని హెచ్చరించాడు. పేదరికాన్ని పరిష్కరించాలంటే పేదలను మరింత పేదలుగా మార్చడమే ఏకైక మార్గం ! శారీరక సౌష్టవం ఉన్న వారు సహాయం అర్థించకుండా ఏ పనైనా చేయడానికి సిద్ధపడేలా పరిస్థితులను సృష్టించాలి. 1834లో బ్రిటన్ ఆమోదించిన పేదల చట్ట సవరణ ఇలాంటి పరిస్థితులను సృష్టించే దిశలో పయనించింది. చెరసాలను పోలి ఉండే కర్మాగారాల్లో పని చేయడానికి సిద్ధపడే వారికి సహాయాన్ని కుదించింది. ఉన్నత వర్గాలు అలాంటి కర్మాగారాలను 'బాస్టిల్' అనే మారుపేరుతో పిలిచేవి. తమకు పేద వర్గాల నుండి ఎన్నటికైనా ముప్పు ఏర్పడగలదని ఆందోళన చెందేవి.

పారిశ్రామికీకరణ వల్ల కార్మిక వర్గ భౌతిక జీవితాలొక్కటే మారలేదు. వారి మనస్తత్వంలో కూడా మార్పు వచ్చింది. జనసాంద్రత ఎక్కువగా ఉన్న నివాస ప్రాంతాల్లో జీవితం సరికొత్త వైఖరులకు దారి తీసింది. ఇవి గ్రామీణ జీవిత వైఖరులకు చాలా భిన్నంగా ఉండేవి. ఒంటరితనం, నైరాశ్యంతోపాటు పేదరికానికి కూడా అలాంటి వైఖరులు దారి తీసేవి. కాని అదే సమయంలో వర్గ సముదాయ భావాలను కొత్తగా రేకెత్తించేవి. ప్రజలు పెద్ద సంఖ్యలో ఒకే చోట పని చేయడం, ఒకే రకమైన కష్టాలను అనుభవించడం, ఒకే రకమైన పరిస్థితుల్లో జీవించడంవల్ల వర్గ భావన పెంపొందింది. ఇంకా చెప్పాలంటే వర్గభావన ప్రజల్లో మరింత చైతన్యం కలిగించింది. గ్రామీణ జీవితంలో అలాంటి చైతన్యం పూర్తిగా కొరవడి ఉండేది. తమ పూర్వీకులైన రైతుల కంటే కార్మికులు బాగా చదవగలిగారు. చదువు, వ్రాతలవల్ల సుదూర ప్రాంతాల గురించి, అక్కడ సంభవిస్తున్న పరిణామాల గురించి తెలుసుకోగలిగారు.

శ్రమ అనే కొత్త ప్రపంచం తనతోపాటు కొత్త కుటుంబ స్వరూపాన్ని తీసుకువచ్చింది. మహిళల స్థాయిలో కూడా విప్లవాత్మకమైన మార్పును తెచ్చింది. రైతు భార్య ఎప్పుడూ ఉత్పాదక పాత్రనే పోషించింది. కాని భర్తకు అణిగిమణిగి ఉండేది. కుటుంబానికి బయటి ప్రపంచంతో భర్తే వారధిగా ఉండేవాడు. అలాగే కుటుంబ వ్యవహారాలలో కూడా ప్రధాన పాత్ర పోషించేవాడు. అందుకు భిన్నంగా పారిశ్రామిక విప్లవం తొలి వరదలో మహిళలే (పిల్లలతోపాటు) వేలాది సంఖ్యలో కర్మాగారాలలో కేంద్రీకృతమయ్యారు. పరిస్థితులు చాలా ఘోరంగా ఉండేవి. ఎంత ఘోరంగా ఉండేవంటే తమను నిరంతర పరిశ్రమ నుండి, పిల్లల పోషణాభారం నుండి విముక్తి చేయగల పురుషుని కోసం మహిళలు కలలు కనేవారు. కాని తొలిసారిగా వారు ఆర్థికంగా స్వతంత్రులయ్యారు. మనుగడ కోసం భర్త లేదా ప్రియునిపై ఆధారపడే అవసరం లేకుండా పోయింది. తమ స్వంత కాళ్లపై నిలబడ్డ లాంకషైర్ "మిల్లు ఆడపిల్లలు" ఎంతో ఖ్యాతిని ఆర్జించారు. అలాగే ఈశాన్య పారిస్‌లో పోలీసులకు చివాట్లు పెట్టి సైనికులకు సవాలు విసిరిన మహిళా కార్మికులు కూడా (గ్రిస్సెట్లు) వార్తల్లోకి వచ్చారు. ఉత్పత్తిని విప్లవ రీతిలో తీర్చిదిద్దడంతో క్యాపిటలిజం కూడా మహిళలను వేలాది సంవత్సరాలపాటు అణచివేతకు గురి చేసిన పాత వైఖరులను రూపుమాపడం మొదలుపెట్టింది.

## సాధనాలు - పోరులు

పారిశ్రామిక కార్మికుల కొత్త వర్గం బాధలను అట్టే భరించలేదు. తానూ తిరుగుబాటు చేయగలనని అది నిరూపించింది. 17, 18వ శతాబ్దాలలో పట్టణాలు, నగరాలలో కేంద్రీకృతమైన వృత్తిదారులు, వ్యాపారులు ఇంగ్లాండ్ విప్లవంలో కీలకమైన పాత్రను పోషించారు. అమెరికా విప్లవంలో న్యూయార్క్, పెన్సిల్వేనియాలకు చెందిన మెకానిక్‌లు, ఫ్రెంచి విప్లవంలో సాధారణ వ్యాపారులు అలాంటి పాత్రనే పోషించారు. ఇప్పుడు ప్రజలు పెద్ద సంఖ్యలో కేంద్రీకృతమై ఉన్నారు. విశాలమైన కర్మాగారాల్లో, క్రిక్కిరిసే నివాస ప్రాంతాల్లో అనూహ్యమైన పరిమాణంలో కలిసి ఉండేవారు. ప్రతిఘటనకు ఇలాంటి పరిస్థితులు అనుకూల వాతావరణాన్ని సృష్టించాయి. గతంలో పీడిత వర్గాలకు ఎన్నడూ ఇంతటి విశాలమైన అవకాశాలు లభించలేదు. ప్రతిఘటన కారణంగానే ఆలోచనల ఆవిర్భావానికి ప్రోత్సాహం లభించింది. ఈ ఆలోచనలు స్థూలంగా సామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా ఉండేవి.

అతివాద ఉద్యమకారుడు జాన్ థెల్‌వెల్ 1796లో భవిష్యత్‌లో సంభవించగల పరిణామాల గురించి ఇలా వ్యాఖ్యానించాడు :

> "గుత్తాధిపత్యం, సంపద కొందరి చేతుల్లోనే కేంద్రీకృతం కావడం... ఇవి విషబీజాలను స్థూలంగా సృష్టిస్తాయి. మానవాళిని ఏది తొందరపెట్టినా అది విజ్ఞాన వ్యాప్తికి అనుకూలంగా ఉంటుంది. స్వేచ్ఛను అంతిమంగా విస్తరిస్తుంది. అయితే కొన్ని దుష్పరిణామాలు లేకపోలేదు. కనక ప్రతిభారీ కర్మాగారం, ఉత్పాదనా కేంద్రం ఒక రకంగా రాజకీయ సమాజమే. ఈ సమాజాన్ని పార్లమెంటు ఆమోదించే ఏ చట్టమూ నోరు నొక్కలేదు, ఏ న్యాయమూర్తి రద్దు చేయలేదు."

అతడి జోస్యం రెండు దశాబ్దాలలోనే నిజమైంది. నెపోలియన్ యుద్ధాలు ముగుస్తున్న దశలో బ్రిటన్‌లో ఒక కొత్త ఉద్యమకెరటం ఉవ్వెత్తున ఎగిసింది. అది క్రమంగా మరింత తీవ్రతను సంతరించుకుంది. గత నిరసనలతో పోలిస్తే ఈ ఉద్యమం సుదీర్ఘంగా కొనసాగింది. ఉద్యమంలో సమాజంలోని వివిధ వర్గాలకు చెందిన ప్రజలు పాలు పంచుకున్నారు. ముఖ్యంగా 1790 దశకంలో చెలరేగిన ఉద్యమానికి వారసులైన లండన్ వృత్తిదారులు అతివాద ధోరణిని ప్రదర్శించారు. యంత్రాలను ప్రవేశపెట్టడంవల్ల తమ వేతనాల్లో భారీ కోతను ఎదుర్కొన్న లుడ్డయిట్ చేనేత కార్మికులు, నిపుణులైన కార్మికుల సంఘాలు (వీటిని చట్ట వ్యతిరేకమైనవిగా తీర్మానించారు) పత్తి తయారీదారులు, వ్యవసాయ కార్మికులు (వీరిలో 'టాల్పుడల్ అమరవీర' నాయకులను ఆస్ట్రేలియాకు తరలించారు)...... ఇలా అందరూ ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్నారు.

ఈ పోరాటం వివిధ దశల్లో కొనసాగింది. యంత్రాల ధ్వంసం, భారీ ప్రదర్శనలు (ఇలాంటి ఒక ప్రదర్శనపై భూస్వామ్య కిరాయి మూకలు మాంచెస్టర్‌లోని పీటర్‌లూ వద్ద 1819లో దాడి చేశాయి), భారీ సమ్మెలు, మధ్యతరగతి వర్గంతో సమానంగా ఓటు హక్కు కల్పించాలని డిమాండ్ చేస్తూ సాగించిన ఉద్యమం (1830-32), 1834 తర్వాత కర్మాగారాలపై దాడులు, శ్రామిక వర్గ నివాస ప్రాంతాల వద్ద పోలీసు బలగాల మోహరింపును వ్యతిరేకిస్తూ

చేపట్టిన నిరసన ప్రదర్శనలతో ఇంగ్లాండ్ దద్దరిల్లిపోయింది. ఈ పోరాటాలు నాయక గణాన్ని నిర్ధారించాయి. నాయకులు కార్మికులను సమీకరించి ఉద్యమాలు నిర్వహించారు. పెద్ద ఎత్తున ప్రచారం చేపట్టారు. కొన్ని సందర్భాల్లో ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డో సిద్ధాంతాలనే క్యాపిటలిస్టులకు వ్యతిరేకంగా ప్రయోగించారు. ఉద్యమానికి స్వంత దినపత్రికలు కూడా సమకూరాయి. బ్లాక్ డ్వార్ఫ్, పూర్‌మాన్స్ గార్డియన్ వాటిలో ప్రముఖమైనవి. ఉద్యమం గురించి ప్రచురించినందుకు, క్యాపిటలిస్టులు, భూస్వాములను సమానంగా సవాలు చేసినందుకు ఈ దినపత్రికల యజమానులను చీటికీమాటికి నిర్బంధించేవారు.

## చార్టిస్టులు

1830 దశకం చివరలో కార్మిక ఉద్యమాలన్నీ కలిసి చార్టిస్టు ఉద్యమంగా ఆవిర్భవించాయి. ఇలాంటి పరిణామం మానవాళి చరిత్రలో ఎన్నడూ సంభవించలేదు. సమాజాన్ని సజీవంగా ఉంచిన శ్రామికులు (తమ శ్రమ ద్వారా) క్షేత్రస్థాయి నుండి ఉద్యమించారు. వీధి ఘర్షణ లేదా తిరుగుబాటులా కాకుండా శాశ్వతమైన సంఘాన్ని ఏర్పాటు చేసుకొని మరీ పోరాడారు. ప్రజాస్వామిక నిర్మాణాలతో కూడిన కార్మిక సంఘం ఎంతో విశాలంగా ఉండేది. ఈ సంఘం ప్రధాన పత్రిక అయిన 'నార్తన్ స్టార్' (దీనిని 1837లో లీడ్స్‌లో స్థాపించారు) అనతి కాలంలోనే ప్రధాన స్రవంతి దినపత్రిక అయిన 'టైమ్స్'తో సమానంగా చందాదారులను సంపాదించుకుంది. పత్రికలో వచ్చే వ్యాసాలను ప్రతి పారిశ్రామిక ప్రాంతంలోని కర్మాగారాలు, మద్యపాన కేంద్రాల వద్ద నిరక్షరాస్యుల కోసం గట్టిగా చదివి వినిపించేవారు.

బ్రిటీషు పాఠశాలల్లో బోధించే చరిత్రలో చార్టిస్టువాదాన్ని ఒక చిన్న ఉద్యమంగా తరచూ పరిగణిస్తారు. అది ఘోరంగా విఫలమైందని నిందిస్తారు. అయితే 19వ శతాబ్దంలో బ్రిటన్‌లో చోటు చేసుకున్న అత్యంత భారీ ఉద్యమం చార్టిస్టు ఉద్యమమే. పాలక వర్గాన్ని అది కనీసం మూడు సందర్భాల్లో తీవ్ర ఆందోళనకు గురి చేసింది. 1938-39లో లక్షలాది మంది కార్మికులు బహిరంగ సభలకు హాజరయ్యారు. ఆ సభల్లోనే చార్టిస్టు కార్యక్రమ లక్ష్యాలను ప్రతిపాదించి, చర్చించారు. ప్రజా ఉద్యమం (తిరుగుబాటు) తప్పకుండా వస్తుందన్న ఆశతో వేలాది మంది కార్మికులు కవాతులు నిర్వహించడం మొదలుపెట్టారు. ప్రభుత్వం ఎంత ఆందోళన చెందిందంటే పారిశ్రామిక ప్రాంతాలకు సైనిక బలగాలను సైతం పంపింది. దక్షిణ వేల్స్‌లోని న్యూపోర్ట్‌లో సాయుధ తిరుగుబాటుకు ప్రయత్నించారు. తర్వాత 1842లో చరిత్రలో తొలిసారిగా సార్వత్రిక సమ్మె జరిగింది. లాంకషైర్ అందుకు కేంద్రమైంది. కార్మికులు ఒక ఫ్యాక్టరీ నుండి మరో ఫ్యాక్టరీకి కవాతు నిర్వహిస్తూ, బట్టీలను ఆర్పి వేస్తూ తమ ఉద్యమాన్ని విస్తరింప చేశారు.

చివరగా 1848లో కార్మికులు మరోసారి సంఘర్షణకు సిద్ధమయ్యారు. బ్రిటన్‌లో పారిశ్రామిక సంక్షోభం, ఐర్లాండ్‌లో కరువు, ఐరోపాలో వరుసగా వస్తున్న విప్లవాలతో తీవ్రంగా ప్రభావితులైన కార్మికులు పోరాటానికి సన్నద్ధులయ్యారు. అయితే వారి ఆశలు నెరవేరలేదు. రాజ్యం పటిష్టమైన చర్యలు తీసుకుంది. దానికి మధ్యతరగతి వర్గంలోని దిగువ శ్రేణి ప్రజలు మద్దతునిచ్చారు. అదే సమయంలో చార్టిస్టు నాయకులు ఊగిసలాట ధోరణిని ప్రదర్శించారు. దక్షిణ లండన్‌లోని కాన్నింగ్‌టన్‌లో లక్ష మంది కార్మికులను సమీకరించిన 'ఆగ్రహం' చల్లారిపోయింది. కాని అంతకు ముందు ప్రభుత్వం లండన్ నగరంలోని సగానికి పైగా ప్రాంతాన్ని సైనిక గుడారంగా మార్చివేసింది.

సజీవంగా ఉన్న ప్రతి ఉద్యమంలాగా చార్టిస్టువాదం కూడా విభిన్న ఆలోచనలు కలిగిన వివిధ వర్గాలను తసలో ఇముడ్చుకుంది. ఉద్యమ కార్యక్రమం (పాయింట్స్ ఆఫ్ చార్టర్) విశాలమైన ప్రజాస్వామిక సంస్కరణను ప్రతిబింబించింది. సార్వజనిక ఓటు హక్కు (పురుషులకు), వార్షిక పార్లమెంట్లను అది ప్రతిపాదించింది. ఆర్థిక వ్యవస్థను సామ్యవాద సిద్ధాంతాలకు అనుగుణంగా ప్రక్షాళన చేయాలని అది కోరుకోలేదు. 'నైతిక శక్తి', 'భౌతికశక్తి' అన్న సిద్ధాంతాల మధ్య ఉద్యమ నాయకులు చీలిపోయారు. నైతిక శక్తికి ప్రాధాన్యతను ఇచ్చిన వారు పాలకులను మచ్చిక చేసుకోగలమని భావిస్తే భౌతికశక్తికి అత్యంత విలువనిచ్చిన వారు మాత్రం పాలకులను పదవీచ్యుతులను చేయడమే ఏకైక మార్గమని నమ్మారు. అయితే భౌతికశక్తి పక్షం వహించిన వారికి సైతం తమ లక్ష్యాన్ని ఎలా సాధించాలన్న విషయమై ఒక నిర్దిష్టమైన ఆలోచన ఉండేదికాదు. అయినప్పటికీ చార్టిస్టువాదం బలంగా ఉన్న 12 ఏళ్ల పై చిలుకు కాలంలో కొన్ని నాటకీయ పరిణామాలు సంభవించాయి. ఐరోపాలో చాలా వరకు భూస్వామ్య వ్యవస్థ అవశేషాలను నిర్మూలించే పోరాటాలను బూర్జువా వర్గం ఇంకా పూర్తి చేయలేదు. కాని ఒక కొత్త పీడిత వర్గాన్ని సృష్టించడానికి అది సిద్ధమైంది. ఈ పీడిత వర్గానికి ఫ్రెంచి విప్లవం యొక్క విప్లవ భాష్యాన్ని బూర్జువా వర్గంపైనే ఎక్కుపెట్టే సామర్థ్యం ఉంది.

ఫ్రెంచి విప్లవం, పారిశ్రామిక విప్లవంలాగే ఈ ఉద్యమం (చార్టిస్టు) కూడా ప్రపంచ చరిత్రలో ప్రధానమైనది. పారిశ్రామికీకరణలో బ్రిటన్ పెట్టుబడిదారులు సాధించిన విజయం ఇతరులను ప్రోత్సహించింది. 1789కు ముందే ఫ్రాన్స్, దక్షిణ జర్మనీలో కొన్ని ఫ్యాక్టరీలు ఉండేవి. ఇప్పుడు ఈ దేశాలలోనే కాకుండా ఉత్తర ఇటలీ, కాటలోనియా, బొహేమియా, ఉత్తర సంయుక్త రాష్ట్రాలు, చివరకు రష్యన్ ఊరల్స్, నైలు పరివాహక ప్రాంతంలో కూడా పారిశ్రామిక వాడలు ఆవిర్భవించాయి.

ప్రతిచోట కొత్త ఫ్యాక్టరీలు నుండి వెలువడే పొగ ఆకాశాన్ని అలుముకుంది. అలాగే అందులో కష్టపడే కార్మికులు కూడా తమ ఆగ్రహానికి, ధిక్కారానికి తక్షణమే ఒక రూపం ఇచ్చేవారు.

1830లో పారిస్ నగర వాసులు 1795 తర్వాత తొలిసారిగా వీధులకెక్కారు. బౌర్బన్ రాజు పదవ చార్లెస్ సలహాదారులు విప్లవాన్ని ఆపే ఒకే ఒక్క మార్గాన్ని ఆలోచించారు : నేరుగా అజ్ఞాత వాసంలోకి వెళ్లేలా చార్లెస్‌ను ఒప్పించి అతడి స్థానంలో బూర్జువా చక్రవర్తి అయిన లూయీ ఫిలిప్ (ఆర్లియాన్స్)ను గద్దెనెక్కించడం. ఈ ఎత్తుగడ ఫలించింది. అయితే దిగువ శ్రేణి ప్రజల వర్గశక్తి బహిర్గతం కావడంతో ఐరోపాలోని ఇతర ప్రాంతాల్లో కూడా తిరుగుబాట్లు వరుసగా సంభవించాయి. ఈ ప్రజా ఉద్యమాలన్నీ విఫలమయ్యాయి. హాలెండ్ నుండి బెల్జియంను వేరు చేసిన ఉద్యమం ఒక్కటే కొంత వరకు సఫలమైంది. బ్రిటీషు దళాల రక్షణలో బెల్జియం ఒక స్వతంత్ర రాజ్యంగా ఆవిర్భవించింది.

ఫ్రెంచి కవి, చరిత్రకారుడైన లామార్టిన్ ఇలా వ్యాఖ్యానించాడు : "కార్మికవర్గ సమస్యను అర్థం చేసుకోవడంలో పరిష్కరించడంలో సమాజం, ప్రభుత్వాలు విఫలమైతే అది ప్రస్తుత సమాజంలో భయంకరమైన విస్ఫోటనాన్ని కలిగిస్తుంది." సుమారు 18 ఏళ్ల తర్వాత అతడి జోస్యం నిజమైంది. అప్పుడు ఐరోపా యావత్తు విప్లవంతో దద్దరిల్లిపోయింది. స్వయంగా లామార్టిన్ స్వల్పకాలంపాటు తనకు దక్కిన ఖ్యాతిని ఆనందించాడు.

ఆరవ అధ్యాయం

# మార్క్సిజం

"ఐరోపాను ఒక భూతం ఆవహిస్తోంది - అది కమ్యూనిజం అనే భూతం" అనే పదాలతో ఆధునిక ప్రపంచ చరిత్రను తీవ్రంగా ప్రభావితం చేసిన ఒక సైద్ధాంతిక కరపత్రం మొదలవుతుంది. పారిస్‌లో అజ్ఞాతవాసం గడిపిన ఇద్దరు జర్మన్లు ఆ కరపత్రాన్ని 1847 చివరల్లో పూర్తి చేశారు. విప్లవం తప్పదని అది జోస్యం చెప్పింది. తొలిగా అచ్చైన కరపత్రాలపై సిరా ఆరకముందే విప్లవం బయల్దేరింది. అయితే ఈ ఒక్క ఉదంతమే ఆ కరపత్రానికి ఉన్న విశాలమైన ప్రభావశక్తిని వివరించజాలదు. అనతి కాలంలోనే దానిని ప్రతి ఐరోపా భాషలోకి అనువదించి ప్రచురించారు. మానవాళి స్థూల చరిత్రలో నూతన పారిశ్రామిక పెట్టుబడిదారీ సమాజ ఆవిర్భావాన్ని 40 లేదా అంతకంటే ఎక్కువ పేజీలలో వివరించగలిగిన ఆ కరపత్రం అప్పటి పాఠకులను రంజింపచేసింది. ఇప్పటికీ ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తోంది. క్యాపిటలిస్టు సమాజం కూడా పూర్వ సమాజాల వలె పరిణామవాద స్వరూపం కలిగి ఉందని ఆ కరపత్రం వివరించే ప్రయత్నం చేసింది. కొత్త సమాజాన్ని పట్టి పీడిస్తున్న తీవ్ర వర్గ పోరాటాలను వివరించింది. అప్పటికీ సమాజం పాత ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలను పూర్తిగా నిర్మూలించలేకపోయింది.

కరపత్ర రచయితలు ఫ్రెడెరిక్ ఎంగెల్స్, కారల్ మార్క్స్‌లు విశేషమైన ప్రతిభా సామర్థ్యాలు కలిగిన వ్యక్తులు. కేవలం వారి వ్యక్తిగత మేధస్సే అంత తీవ్రమైన ప్రభావం చూపలేదు. మరో మాటలో చెప్పాలంటే ప్లేటో లేదా అరిస్టాటిల్, కన్ఫూషియస్ లేదా బుద్ధుడు, సోల్ ఆఫ్ టార్సస్ లేదా మహమ్మద్ ప్రవక్తలను చారిత్రక పురుషులుగా నిలిపిన వారి వ్యక్తిగత మేధస్సుకు పై రచయితల మేధస్సు ఏ మాత్రం తీసిపోదు. ఒక యుగంలోని వైరుధ్యాలన్నీ మూకుమ్మడిగా ప్రస్ఫుటమైన ప్రదేశంలో, కాలంలో వారు జీవించారు. ఇతరులకు అందుబాటులోలేని మేధోపరమైన సాంప్రదాయాలు, శాస్త్రీయ ప్రగతులు వారికి సమాజంలోని వైరుధ్యాలను గ్రహించే సామర్థ్యాన్నే కాక వాటిని వివరించే ప్రతిభను కూడా కట్టబెట్టాయి.

ప్రష్యా ఆధీనంలోని రైన్‌లాండ్‌కు చెందిన మధ్యతరగతి కుటుంబాల నుండే ఇరువురూ వచ్చారు. మార్క్స్ తండ్రి ఒక ప్రభుత్వ ఉద్యోగి. అన్ని సౌకర్యాలు ఉన్న కుటుంబం వారిది.

ప్రొటెస్టెంట్ మతానికి చెందిన వారే అయినప్పటికీ యూదుల పెంపకం, వారసత్వంతో పైకి వచ్చారు. ఏంగెల్స్ తండ్రి సంపన్నుడైన పారిశ్రామికవేత్త. అతడికి రైన్‌లాండ్, మాంచెస్టర్‌లలో ఫ్యాక్టరీలు ఉండేవి. 1830, 40 దశకాలలో అలాంటి సామాజిక నేపథ్యాలు రైన్‌లాండ్‌లో ఖచ్చితంగా ఏకాభిప్రాయానికి దారి తీస్తాయన్న వాతావరణం ఏదీ లేదు. జర్మనీలోని ఇతర ప్రాంతాల కంటే రైన్‌లాండ్‌లోనే క్యాపిటలిజం ఎంతో అభివృద్ధి చెందింది. కొన్ని సంవత్సరాల క్రితం ఆ ప్రాంతాన్ని ఫ్రెంచి సైన్యాలు ఆక్రమించడంతో భూస్వామ్య సమాజ అవశేషాలన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. అయితే ఆ ప్రాంతాన్ని పాలించే ప్రష్యన్ రాచరిక దర్బారులో ఆ అవశేషాలను అప్పటికీ బలంగా ఉండేవి. మధ్యతరగతిలోని వృద్ధతరంలో కూడా భూస్వామ్య వ్యవస్థ భారం నుండి విముక్తి కల్పించే 'సంస్కరణల'పట్ల ఆకాంక్ష వ్యక్తమయ్యేది. యువతరంలో ఈ భావన విప్లవ స్ఫూర్తిని సంతరించుకుంది.

ఐరోపాలోని మిగతా ప్రాంతాల లాగా మొత్తం జర్మనీ కూడా శతాబ్దంలోని తొలి దశకాలలో 'మేధో ప్రతిస్పందనా కాలాన్ని' చవి చూసింది. దేశానికి చెందిన ప్రముఖ తత్త్వవేత్త హెగెల్ ఇప్పుడు పాత విశ్వాసాలను తన చుట్టూ కప్పుకున్నాడు. మానవాళి ప్రగతి మత, ఆధ్యాత్మిక చరిత్రవల్లే సాధ్యమవుతుందని నమ్మాడు. అలాగే ప్రష్యన్ రాజ్య గుణగణాలను కీర్తించాడు (లేదా కనీసం 1820 దశకంలో తయారైన దాని ఎస్టేట్ల - ఆధారిత రాజ్యాంగాన్ని ప్రస్తుతించాడు) అయితే 1830 దశకం చివర్లో, 1840 దశకం తొలి సంవత్సరాలలో విశ్వవిద్యాలయాల్లో అడుగుపెట్టిన యువతరం చైతన్యోద్యమ సిద్ధాంతాలు, చివరకు ఫ్రెంచి విప్లవ తొలి సంవత్సరాలవైపు ఎక్కువగా ఆకర్షితులయ్యారు.

వైరుధ్యం ద్వారా ప్రతి సిద్ధాంతమూ మారి అంతిమంగా జర్మన్ సమాజంపై ఉదారవాద విమర్శగా మిగిలిపోతుందన్న హెగెల్ సూత్రీకరణను యువ హెగెలియన్లు అయిన బ్రూనే బాలిర్ లాంటి వారు సమర్థించారు. పాత నిబంధనలపై వాల్టెయిర్ చేసిన విమర్శను డేవిడ్ స్ట్రాస్ మరింత పొడిగించి కొత్త నిబంధనలను ప్రశ్నించాడు. సుమారు 80 ఏళ్లక్రితం డ'హాల్బాచ్, హెల్వేషియస్‌లు రూపొందించిన భౌతికవాద తత్త్వశాస్త్రాన్ని లుడ్విగ్ ఫుయర్‌బా ముందుకు తీసుకెళ్లాడు. నిజమైన సామ్యవాద పిలుపునివ్వడం ద్వారా కార్ల్ గ్రున్ పెద్ద అనుచర వర్గాన్ని సంపాదించుకున్నాడు. భూస్వామ్య వ్యవస్థ లేదా క్యాపిటలిజం కంటే ఉన్నతమైన సమాజాన్ని నిర్మించడానికి అన్ని వర్గాలకు చెందిన చైతన్యవంతులు ముందుకు రావాలని గ్రున్ పిలుపునిచ్చాడు.

ఈ యువతరంలో మార్క్స్,ఏంగెల్స్‌లు అంతర్భాగంగా ఉండేవారు. గత, వర్తమానాల మధ్య చిక్కుకుపోయిన సమాజం పట్ల అవగాహన పెంచుకునేందుకు ఈ తరం తీవ్రంగా ప్రయత్నించింది. వీరు హెగెల్‌ను అధ్యయనం చేశారు. ఫుయర్‌బా వాదనలను చర్చించారు. హెల్వేషియస్, డహాల్‌బాచ్ ఆలోచనల లోతుకు వెళ్లారు. మతంపై స్ట్రాస్ చేసిన విమర్శను అనుసరించారు. కాని వీరు అంతకంటే ఎక్కువ చేశారు. అప్పుడే పరిమితంగా విస్తరిస్తున్న నూతన పారిశ్రామిక క్యాపిటలిజాన్ని కూడా ఎదుర్కొన్నారు. మాంచెస్టర్‌లోని ఒక ఫ్యాక్టరీని నిర్వహించేందుకు ఏంగెల్స్‌ను అతడి తండ్రి పంపించాడు. జర్మనీలో ఉదారవాద సిద్ధాంతాలు

ప్రతిపాదిస్తున్న ఉజ్వలమైన భవిష్యత్తుకు భిన్నంగా బ్రిటన్ పారిశ్రామిక విప్లవంలో కార్మికులు ఎదుర్కొంటున్న దుర్భరమైన జీవితాన్ని అక్కడే అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. ఈ అనుభవాలను "బ్రిటన్ కార్మిక వర్గ స్థితిగతులు" అనే గ్రంథంలో వివరించాడు. కఠినమైన ఈ వాస్తవానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కార్మికులను కూడా కలిసాడు. 1842 సార్వత్రిక సమ్మె నేపథ్యంలో మాంచెస్టర్‌లో అడుగుపెట్టిన ఏంగెల్స్ చార్టిస్టు ఉద్యమంలో చేరాడు. ఈ కారణంగా అతడు క్యాపిటలిజంపై రాబర్ట్ ఓవెన్ రచనల్లోని విమర్శలను అందిపుచ్చుకున్నాడు. ఈ విమర్శలకు ఊహాజనిత సోషలిస్టు లక్షణం ఉండేది. అలాగే ప్రస్తుత వ్యవస్థను సమర్థించేందుకు ఉపయోగించే రాజకీయ అర్థశాస్త్రాన్ని విమర్శనాత్మకంగా అధ్యయనం చేశాడు. గ్రీకు పరమాణువు సిద్ధాంతంపై డాక్టరేట్ పూర్తి చేసిన తర్వాత మార్క్స్ రీన్షే జైతుంగ్ అనే ఉదారవాద పత్రికకు సంపాదకునిగా నియమితుడయ్యాడు. అప్పటికి అతని వయస్సు 24 సంవత్సరాలు. ఈ నియామకం ప్రష్యా పాటించిన సెన్సార్ విధానాలతో ఘర్షణకు దారి తీసింది. ఆరు నెలల తర్వాత ఆ పత్రికపై నిషేధం విధించారు. తర్వాత మార్క్స్ వివరించినట్లు ఈ సంఘటన అతడిని తొలిసారిగా "భౌతికవాద అంశాల'ను నేరుగా అనుభవంలోకి తెచ్చింది. అతడు ఎన్నో రచనలను చేపట్టాడు. రైతులు అడవి నుండి కలపను సేకరించే సాంప్రదాయాన్ని భూస్వామ్య దొరలు "దొంగతనం"గా పరిగణించడానికి చేసిన ప్రయత్నాల గురించి రాశాడు. 'ఆస్తి' అంటే ఏమిటి? అది ఎలా సమకూరుతుంది? అనే అంశాలను అధ్యయనం చేయడం మొదలుపెట్టాడు. అనంతరం పారిస్‌లో అజ్ఞాతవాసం గడిపాడు. ఈ కాలంలోనే హెగెల్ "హక్కు" సిద్ధాంతాన్ని విమర్శనాత్మకంగా అధ్యయనం చేశాడు. చీలిపోయిన సమాజాన్ని ఒక్కటిగా ఉంచాలంటే రాచరిక నిరంకుశత్వమే ఏకైక మార్గమని హెగెల్ తన సిద్ధాంతంలో పేర్కొన్నాడు. అయితే కేవలం ఉదారవాద రాజ్యాంగం ఉన్నంత మాత్రాన ప్రజలకు నిజమైన స్వేచ్ఛ సమకూరదని మార్క్స్ ఒక నిర్ధారణకు వచ్చాడు. స్మిత్, రికార్డో లాంటి రాజకీయ అర్థశాస్త్రవేత్తల రచనలను తీవ్రంగా అధ్యయనం చేయడం మొదలుపెట్టాడు. క్యాపిటలిజం స్వభావం గురించి తన నిర్ధారణలను ప్రచురితం కాని ఒక పత్రంలో రాశాడు.

## పరాయీకరణ

స్మిత్, రికార్డో వారి శిష్యులు వివరించిన వ్యవస్థ ప్రజల జీవితాలను మార్కెట్ కార్యకలాపాలపై ఆధారపడేలా చేసిందని మార్క్స్ వ్యాఖ్యానించాడు. కాని మార్కెట్ అన్నది ప్రజల శ్రమ నుండి ఉత్పత్తయ్యే సరుకులకు పరిచయ వేదిక మాత్రమే తప్ప మరొకటి కాదు. మరో మాటలో చెప్పాలంటే ప్రజలు తమ పూర్వపు స్వంత కార్యకలాపాలకు బందీలుగా మారిపోయారు. తాము స్వంతంగా సృష్టించిన దేవుళ్లను ప్రజలు పూజించిన విధానాన్ని "వేర్పాటు"గా ఫుయర్‌బా అభివర్ణించి ఉన్నాడు. అలాంటి పదాన్నే ఇపుడు మార్క్స్ క్యాపిటలిస్టు మార్కెట్‌కు వర్తింపచేశాడు.

> "శ్రమ ఫలమైన 'ఉత్పత్తి' శ్రమను బయటి శక్తిగా ఎదుర్కొంటుంది. అది ఉత్పత్తిదారునికి స్వతంత్రంగా వ్యవహరిస్తుంది. శ్రమ 'సరుకు' స్వరూపాన్ని

సంతరించుకొని స్వయంగా ఒక సరుకుగా మారిపోతుంది. రాజకీయ అర్థశాస్త్రంలో శ్రమను ఈ విధంగా గ్రహించడం కార్మికునికి సాధ్యం కాదని బోధపడుతుంది. ఈ నిర్దిష్టమైన వాస్తవాన్ని గ్రహించక అతడు తన స్వంత ఉత్పత్తులకు బానిసగా మారిపోతాడు."

"కార్మికుడు ఎంత ఎక్కువగా ఉత్పత్తి చేస్తాడో అంత తక్కువగా వినియోగించాలి. విలువలను ఎంత ఎక్కువగా సృష్టిస్తాడో అంత ఎక్కువగా విలువను కోల్పోతాడు. నిరర్ధకమై పోతాడు. వ్యవస్థ భౌతిక శ్రమను తప్పించి యంత్రాలను ప్రవేశపెడుతుంది. కాని అది కార్మికుల్లోని ఒక వర్గాన్ని పాశవికమైన శ్రమ వైపు వెనక్కి నెడుతుంది. మరో వర్గాన్ని యంత్రంగా మార్చివేస్తుంది. అది తెలివిని సృష్టిస్తుంది. కాని కార్మికునికి బుద్ధిహీనతను కలిగిస్తుంది. శ్రమ ధనికులకు అద్భుతమైన వస్తువులను సృష్టిస్తుందనడం వాస్తవం కాని కార్మికుడికి అది లోటును మిగుల్చుతుంది. అది అద్భుతమైన భవంతులను నిర్మిస్తుంది కాని కార్మికుడికి గుడిసెలను అందిస్తుంది. అది సౌందర్యాన్ని సృష్టిస్తుంది. కాని కార్మికుడికి అంగవైకల్యం కలిగిస్తుంది. శ్రమ నుండి దూరంగా ఉన్నప్పుడే కార్మికునికి తాను ఒక మనిషినన్న భావన కలుగుతుంది. శ్రమలో అతడు తనను తానూ బయటి వ్యక్తిగా భావిస్తాడు. పని చేయనప్పుడు మాత్రమే అతడు సహజ సిద్ధంగా ఉంటాడు. పనిలో మాత్రం యంత్రంగా మారిపోతాడు."

మార్క్స్ నిర్ధారించిందేమిటంటే కార్మికులు ఉత్పత్తి ప్రక్రియను ఉమ్మడిగా నియంత్రణలోకి తీసుకోవడం ద్వారానే ఇలాంటి నిర్దాక్షిణ్యాన్ని అధిగమించగలరు. అదే 'కమ్యూనిజం'. ఉదారవాద ప్రజాస్వామ్యవాదులు పేర్కొన్నట్లు మానవాళి విముక్తి కేవలం భూస్వామ్య వ్యవస్థ అవశేషాలను నిర్మూలించేందుకు చేపట్టే రాజకీయ విప్లవంలోనే దాగి లేదు. అది కమ్యూనిస్టు సమాజాన్ని స్థాపించే సామాజిక విప్లవంపై ఆధారపడి ఉంది.

మార్క్స్, ఏంగెల్స్‌లిద్దరూ కలిసి పని చేశారు. తమ కొత్త సిద్ధాంతాలకు ఆచరణ రూపమివ్వడానికి పారిస్, బ్రస్సెల్స్‌లలో అజ్ఞాతవాసం గడుపుతున్న ఇతర జర్మన్ సోషలిస్టు బృందాలలో పాలుపంచుకున్నారు. అజ్ఞాతవాసంలో ఉన్న వృత్తిదారులు 'ది లీగ్ ఆఫ్ ది జస్ట్' (న్యాయవేదిక)ను స్థాపించారు. అందులో మార్క్స్, ఏంగెల్స్ చేరారు. అనతి కాలంలోనే లీగ్ పేరును 'కమ్యూనిస్టు లీగ్'గా మార్చారు. "కమ్యూనిస్టు మానిఫెస్టో" రచనా బాధ్యతను లీగ్ ఆ ఇద్దరికి అప్పగించింది.

ఈలోగా వారు తమ సిద్ధాంతాలను అభివృద్ధిపరిచారు. 'పవిత్ర కుటుంబం' అనే గ్రంథంలో, 'జర్మన్ భావజాలం' అనే చేతిప్రతిలో (ప్రచురితం కాని) వారు 'వామపక్ష' హెగెలియన్లను విమర్శించారు. అలాగే చైతన్యోద్యమం సృష్టించిన భావనను కూడా మార్చివేశారు. కేవలం మూఢనమ్మకాలను ఆలోచనలతో జయించడం ద్వారా సమాజాన్ని మార్చవచ్చన్న

చైతన్యోద్యమ సాంప్రదాయాన్ని వారు పటాపంచలు చేశారు. అందుకు ఫుయర్‌బా భౌతికవాద సిద్ధాంతాన్ని వాడుకున్నారు. కాని ఈ ప్రక్రియలో ఆయన కంటే ఎంతో పరిణతితో వ్యవహరించారు. మతాన్ని మానవాళి వేర్పాటువాద చిహ్నంగా ఫుయర్‌బా పరిగణించాడు. కాని అతడు అలాంటి వేర్పాటువాదం ఎందుకు తలెత్తిందో ప్రశ్నించలేకపోయాడు.

ప్రకృతి నుండి జీవనోపాధిని పొందడానికి మానవాళి తరతరాలుగా చేసిన ప్రయత్నాల్లోనే ఈ వేర్పాటుకు పునాదులు ఉన్నాయని మార్క్స్, హెగెల్ గుర్తించారు. ఈ కారణంగానే ప్రజల మధ్య భిన్నమైన సంబంధాలు ఏర్పడ్డాయని నిర్ధారించారు. ఫుయర్‌బా భౌతికవాదం బయటి ప్రపంచాన్ని మార్చడంలో మానవులు నిర్వహించిన పాత్రను, బయటి ప్రపంచం మానవాళిని మార్చడంలో చూపిన ప్రభావాన్ని విస్మరించిందని వారు నొక్కి చెప్పారు. "గతితార్కిక" సమ్మేళనం చరిత్రను భౌతికవాద దృక్పథంలో విశ్లేషించడానికి ఆస్కారం కల్పించిందని వాదించారు. ఈ వాదనను రాజకీయ శాస్త్రంపై తమ విమర్శతో జతచేసి 'కమ్యూనిస్టు మానిఫెస్టో'లో చరిత్ర, సమాజంపై స్థూల వీక్షణాన్ని అందించారు.

ఆ వీక్షణ వివరాల్లోకి వెళ్లేందుకు ఇది సరైన చోటు కాదు. ముఖ్యంగా ఈ గ్రంథమంతా చరిత్రను మార్క్సిజం ఆధారంగానే అన్వయించే ప్రయత్నం చేస్తున్నందున ప్రత్యేకంగా ఆ వివరాలను పొందుపరచాల్సిన అవసరం లేదు. కాని కొన్ని ముఖ్యమైన అంశాలను తప్పనిసరిగా ప్రస్తావించాల్సి ఉంటుంది.

## నూతన ప్రపంచ వ్యవస్థ

దాదాపు 150 ఏళ్ల క్రితం రచించబడ్డాయి కనుక మార్క్స్ సిద్ధాంతాలకు ఎలాంటి ప్రాధాన్యత లేదని కొందరు తరచూ కొట్టిపారేస్తుంటారు. ముఖ్యంగా ఆడమ్ స్మిత్ రచించిన "దేశాల సంపద" గ్రంథాన్ని (మార్క్స్ పుట్టుకకు 40 ఏళ్ల ముందే ఈ గ్రంథం వెలువడింది) ప్రామాణికంగా తీసుకునేవారు ఈ కోవకు చెందుతారు. అయినప్పటికీ, పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం యురేషియాలోని పశ్చిమ ప్రాంతాలకే పరిమితమై ఉన్న సమయంలో రచించబడిన మానిఫెస్టో క్యాపిటలిజం ప్రపంచాన్ని ఏ విధంగా ఆవహించగలదో ఖచ్చితంగా జోస్యం చెప్పింది. ఈ ప్రక్రియనే మనం నేడు 'ప్రపంచీకరణ' అని పిలుస్తున్నాము. ఆ విధంగా చూస్తే కమ్యూనిస్టు మానిఫెస్టో దూరదృష్టి గలది. ప్రపంచ పరిణామాలను నిర్దిష్టంగా అంచనా వేసింది.

> తాము ఉత్పత్తి చేసే సరుకులకు మార్కెట్‌ను నిరంతరం విస్తరించాల్సిన అవసరం బూర్జువా వర్గాన్ని భూగోళమంతటా వెంటాడుతూనే ఉంటుంది. ఆ వర్గం ఎక్కడైనా గూడు కట్టుకోవాల్సిందే, ఏ ప్రదేశంలోనైనా స్థిరపడాల్సిందే. ప్రపంచ మార్కెట్‌ను తమ స్వంత ప్రయోజనాలకు అనుకూలంగా వినియోగించుకోవడం ద్వారా ఉత్పాదనకు, వినియోగానికి ప్రతిదేశంలోనూ మిశ్రమ సంస్కృతి లక్షణాన్ని బూర్జువా వర్గం సృష్టిస్తుంది. తిరోగమన శక్తులకు ఆందోళన కలిగించే విధంగా బూర్జువా వర్గం పారిశ్రామిక రంగంతో దేశ అధికార వ్యవస్థలో పటిష్టమైన స్థానాన్ని

సంపాదించుకుంది. గత కాలపు స్థానిక, జాతీయ స్వావలంబన, స్వయం సమృద్ధి స్థానంలో ఇప్పుడు ప్రతి దిశలోనూ సమ్మేళనం ఉంది. ప్రపంచ వ్యాప్తంగా దేశాలు పరస్పరం ఆధారపడుతున్నాయి.

ఉత్పత్తి సాధనాలన్నింటినీ గణనీయంగా మెరుగుపరచడం ద్వారా బూర్జువా వర్గం అన్ని దేశాలను ఒకే నాగరికత ఛత్రం కింద చేర్చుతుంది. ఇందులో సమాచార, రవాణా సాధనాలు ఎంతో సహకరిస్తాయి. ఈ వర్గం ఉత్పత్తుల తక్కువ ధర భారీ ఫిరంగిగా ఉపయోగపడి చైనా మహా ప్రకారాలన్నింటినీ ధ్వంసం చేస్తుంది. బూర్జువా ఉత్పాదనా పద్ధతిని అనుసరించేలా అన్ని దేశాలపై ఒత్తిడిని తెస్తుంది. లేని పక్షంలో ఆయా దేశాల తెరమరుగు కాగలవని హెచ్చరిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే అది తన "స్వంత వ్యక్తిత్వానికి అనుగుణంగా ప్రపంచాన్ని సృష్టిస్తుంది."

ఇలాంటి వ్యాఖ్యానాలను విమర్శిస్తే అందుకు కారణం అవి నేటి పరిస్థితులకు వర్తించవని కాదు. మరోవైపు మార్క్స్ వివరించిన ప్రక్రియలు అతడు రచనలు చేపట్టే సమయానికి ఇంకా పిండ దశలోనే ఉండేవి. 1847 నాటి ప్రపంచం కంటే నేటి ప్రపంచమే మార్క్స్ ప్రతిపాదించిన దృశ్యాన్ని ఎక్కువగా పోలి ఉంది.

పరాయీకరణ అంశాన్ని ఎంచుకున్న మార్క్స్, ఏంగెల్స్‌లు దానిని మరింత సరళమైన భాషలో సూత్రీకరించారు.

"బూర్జువా సమాజంలో సజీవ శ్రమ కేంద్రీకృత శ్రమను పెంచే మార్గమే తప్ప మరొకటి కాదు. వర్తమానాన్ని గతం ఆవహిస్తుంది. పెట్టుబడి స్వతంత్రమైనది. దానికో వ్యక్తిత్వం ఉంటుంది. కాని సజీవ వ్యక్తి మాత్రం పరాధీనుడై ఉంటాడు. అతడికో వ్యక్తిత్వమంటూ ఉండదు."

ఈ వ్యాఖ్యానం మొత్తం బూర్జువా సమాజాన్నే ఖండిస్తుంది :

"ఉత్పాదనకు భారీ సాధనాలను, మారకానికి తగిన వ్యవస్థలను సమకూర్చుకున్న బూర్జువా సమాజం తాంత్రికుడితో సమానమైనది. ఈ తాంత్రికుడు తన చీకటి ప్రపంచమంత్ర శక్తులను నియంత్రించే సామర్థ్యాన్ని ఏ మాత్రం ప్రదర్శించలేకపోతున్నాడు. చీకటి ప్రపంచాన్ని అతడు తన పిలుపుల ద్వారా నిద్రలేపాడు. చరిత్రలోని వివిధ ఘట్టాల్లో పుట్టుకొచ్చే భారీ వాణిజ్య సంక్షోభాలు బూర్జువా సమాజం ఉనికినే స్థూలంగా పరీక్షిస్తాయన్న విషయాన్ని మనం ఇక్కడ గుర్తు చేసుకుంటే చాలు. సంక్షోభం ప్రతిసారి మరింత తీవ్రమైన సవాలునే విసురుతుంది. ఈ సంక్షోభాలలో అధికోత్పత్తి అనే అంటువ్యాధి ప్రబలంగా

బయల్దేరుతుంది. గత యుగాలలో ఇలాంటి దుష్పరిణామం హాస్యాస్పదంగా తోచి ఉండొచ్చు. ఒక కరువో, ఒక ప్రపంచ యుద్ధమో మనుగడకు అవసరమైన ఉత్పత్తుల సరఫరాను తెంచివేసినట్లుగా ఈ అంటువ్యాధి ప్రత్యక్షమవుతుంది. పరిశ్రమ, వాణిజ్యాన్ని తుడిచిపెడుతుంది. ఎందుకూ? ఎందుకంటే మనుగడకు ఎన్నో మార్గాలున్నాయి. పరిశ్రమ మరీ విస్తారంగా ఉంది, వాణిజ్యం సర్వవ్యాపితంగా ఉంది. ఇలాంటి సంక్షోభాల నుండి బూర్జువా వర్గం ఎలా బయటపడుతుంది? ఒకవైపు ఉత్పాదక శక్తులను భారీగా నాశనం చేయడం ద్వారా, మరోవైపు కొత్త మార్కెట్లను ఆక్రమించడం ద్వారా, పాత మార్కెట్లను సంపూర్ణంగా దోచుకోవడం ద్వారా సంక్షోభాల నుండి గట్టెక్కడానికి అది ప్రయత్నిస్తుంది. అంటే మరింత విశాలమైన, వినాశకరమైన సంక్షోభాలకు బాటలు వేయడం ద్వారా, అలాంటి సంక్షోభాలను నివారించే సాధనాలను (మార్గాలను) మూసివేయడం ద్వారా బూర్జువా వర్గం సంక్షోభాన్ని తాత్కాలికంగా అధిగమిస్తుంది."

సంక్షోభంపై కేవలం క్లుప్తంగా వీక్షించేందుకే మార్క్స్, ఏంగెల్స్‌లకు చోటు ఉండేది (పత్రంలో). అలాగే క్యాపిటలిజం దీర్ఘకాలిక భవితవ్యాన్ని కూడా సంక్షిప్తంగానే 'మానిఫెస్టో'లో చేర్చారు. మార్క్స్ మిగతా జీవితమంతా ఎక్కువగా క్యాపిటలిజం తర్కాన్ని వివరించేందుకు అంకితమైంది. సంపదను కూడగట్టి, పరాయీకరించబడిన శ్రమను చెలామణి చేయడం ద్వారా నిర్మించబడే ప్రపంచం క్యాపిటలిజం తర్కంతో ఎలా పని చేస్తుందో ఆయన వివరించాడు. ఈ కృషిలో భాగంగా మార్క్స్ బూర్జువా వర్గ రాజకీయ అర్థశాస్త్ర గ్రంథాలను దీర్ఘంగా అధ్యయనం చేశాడు. అలాగే ప్రపంచంలోని మొట్టమొదటి పారిశ్రామిక క్యాపిటలిస్టు సమాజమైన బ్రిటన్‌పై అనుభవవాద అధ్యయనాన్ని విస్తారంగా జరిపాడు.

మార్క్స్, ఏంగెల్స్‌లు క్యాపిటలిజం, వర్గ సమాజపు గత స్వరూపాలు మధ్య ఉన్న ముఖ్యమైన వైరుధ్యాన్ని గుర్తించారు. పూర్వపు పాలకవర్గాలు తమ పాలనను సుస్థిరం చేసుకునేందుకు సాంప్రదాయవాదాన్ని ఒక సాధనంగా వాడుకున్నాయి. అయితే ఈ అంశాన్ని "రాజకీయ, సైద్ధాంతిక అవకాశం"గా క్యాపిటలిస్టులు ఎంతగా పరిగణించినప్పటికీ వారి స్వంత సమాజం యొక్క ఆర్థిక గమనం దానిని నిరంతరం నీరుగారుస్తూనే ఉంటుంది.

"ఉత్పత్తి సాధనాలను అనునిత్యం మెరుగుపరచనిదే బూర్జువా వర్గం మనుగడ సాగించజాలదు. అలాగే ఉత్పత్తి సాధనాలతోపాటు సమాజంలోని స్థూల సంబంధాలను కూడా విప్లవాత్మక రీతిలో మెరుగుపరుస్తూ ఉండాలి. ఉత్పత్తిని నిత్యం మెరుగుపరచడం, అన్ని సామాజిక పరిస్థితులను నిర్విరామంగా కుదిపివేయడం, దీర్ఘకాలిక అనిశ్చితి, సంఘర్షణ బూర్జువా యుగాన్ని గత యుగాలన్నింటితో వేరుగా నిలబెడుతుంది. నిర్ధారితమైన, ఘనీకృతమైన అన్ని సంబంధాలు (ప్రాచీన, గౌరవనీయమైన అభిప్రాయాలు, భావనలు కల)

కొట్టుకుపోతాయి. కొత్తగా ఏర్పడే అన్ని సంబంధాలు అవశేషంగా మారకముందే తమ సార్థకతను కోల్పోతాయి. ఘనీకృతమైనదంతా గాలిలో కరిగిపోతుంది. పవిత్రమైనదంతా దైవధిక్కారంగా మారిపోతుంది. తమ వాస్తవిక జీవన స్థితిగతులు, తోటి మానవులతో ఉన్న తమ సంబంధాలను చైతన్యంతో ఎదుర్కోవడానికి మానవులు చివరగా సన్నద్ధమవుతారు."

## కార్మికులు - నూతన వ్యవస్థ

క్యాపిటలిజం గురించి, అందులో నుండి ఉద్భవించే కార్మిక వర్గం గురించి మానిఫెస్టో నొక్కి చెప్పింది :

"బూర్జువా నిష్పత్తిలో పెట్టుబడిని అభివృద్ధి పరిస్తే అంతే నిష్పత్తిలో కార్మికవర్గం పుట్టుకువస్తుంది. అదే ఆధునిక కార్మికవర్గం. ఈ వర్గం తనకు పని లభించినంత కాలం మనుగడ సాధిస్తుంది. తమ శ్రమ పెట్టుబడిని అభివృద్ధి పరచినంత కాలమే వారికి ఉపాధి లభిస్తుంది. తమను తాము చవకగా అమ్ముకునే ఈ కార్మికులు వాణిజ్యానికి అర్హమైన ఇతర సరుకుల వలె ఒక సరుకుగా మిగిలిపోతారు. ఫలితంగా పోటీవల్ల ఏర్పడే అన్ని రకాల ఇబ్బందులను ఎదుర్కోవలసి ఉంటుంది, మార్కెట్ ఉత్థాన పతనాలను భరించాల్సి ఉంటుంది."

క్యాపిటలిజం అభివృద్ధి నుండే స్వయంగా ఒక శక్తిగా కేంద్రీకృతమయ్యే కార్మికవర్గం క్యాపిటలిజానికి వ్యతిరేకంగా పోరాడే సామర్థ్యాన్ని సమకూర్చుకుంటుంది.

"పరిశ్రమల అభివృద్ధితో కార్మిక వర్గం కేవలం సంఖ్యాపరంగానే పెరగదు. అది విశాలమైన ప్రజానీకంలో కేంద్రీకృతమవుతుంది. దాని శక్తి పెరుగుతుంది. తన శక్తిని మరింత ఎక్కువగా గ్రహించగలుగుతుంది. విభిన్న ప్రయోజనాలు, కార్మికవర్గంలోని వివిధ శ్రేణుల జీవన స్థితిగతులు మరింత సమానమవుతాయి. అదే స్థాయిలో యంత్రాలు కార్మికుల్లో ఉన్న స్థాయిలన్నింటినీ నిర్మూలిస్తుంది. అలాగే ప్రతిచోటా సమాన కనిష్ట స్థాయికి వేతనాలు తగ్గిపోతాయి. వాణిజ్యపరమైన సంక్షోభాలు కార్మికుల వేతనాలను మరింత అస్థిరంగా మారుస్తాయి. యంత్రాల నిరంతర మెరుగుదల, గణనీయమైన అభివృద్ధి వారి జీవనోపాధిని కాలక్రమంలో మరింత అనిశ్చితంగా మార్చివేస్తాయి."

ఈ పరిస్థితి నుండే విలీనాలు అభివృద్ధి చెందుతాయి. ముఖ్యంగా కార్మిక సంఘాలు. ఇవి కార్మికులను ఒక వర్గంగా సమీకృతం చేసే పనిని మొదలు పెడతాయి.

"కార్మికుల్లోనే పోటీ ఏర్పడడంవల్ల ఈ ప్రక్రియకు నిరంతరం విఘాతం కలిగినా సమీకరణ కొనసాగుతూనే ఉంటుంది. బూర్జువా వర్గ మనుగడకు, ప్రాబల్యానికి పెట్టుబడి సృష్టి, దాని అభివృద్ధే కీలకమైనది. పెట్టుబడికి వేతన కార్మికులు కీలకం. బూర్జువా వర్గం తెర వెనుక ఉండి ప్రోత్సహించే పారిశ్రామికాభివృద్ధి పోటీ కారణంగా ఏర్పడే కార్మికుల పరాయీకరణను విప్లవాత్మక కలయిక అయిన సంఘం ద్వారా రూపుమాపుతుంది. కనుక ఆధునిక పరిశ్రమ అభివృద్ధి తన స్వంత కాళ్ల కింద నుండి బూర్జువా ఉత్పత్తి ఆధారాన్ని కుదించివేస్తుంది. అలాంటపుడు బూర్జువా వర్గం ఉత్పత్తి చేసేది స్థూలంగా స్వంత గోతిని తవ్వుకునే సాధనాలే."

ఈ పుటలు (వ్యాఖ్యానాలు) భారీ పరిశ్రమలు, ప్రపంచ మార్కెట్ అభివృద్ధిపై ఉన్న వ్యాసాలవలే భవిష్యత్తు అభివృద్ధి మార్గాలపై దృష్టి సారించాయి. 1847 నాటి ఐరోపా (ఆఫ్రికా, ఆసియా, అమెరికాలను పక్కనపెడితే) స్థితిగతులపై నిర్దిష్టమైన అనుభవవాద వర్ణన కంటే భవిష్యత్ సూచికలను అవి ప్రతిపాదించాయి. ఫ్రాన్స్, జర్మనీలలో పారిశ్రామిక కార్మికవర్గం అప్పటికీ స్థూల జనాభాలో ఒక సూక్ష్మ భాగంగా ఉండేది. మరో వ్యాఖ్యానం వివరించినట్లు కార్మికవర్గం విశాలమైన ప్రజానీకం ప్రయోజనాల కోసం పోరాడుతున్న విశాలమైన ప్రజావర్గంగా ఎదగలేదు. జర్మనీలో 1870 నాటికి కూడా ఫ్యాక్టరీ కార్మికులు మొత్తం శ్రామిక జనాభాలో పది శాతంగానే ఉండేవారు. 1848లో బ్రిటన్‌లో ఇంతకంటే ఎక్కువ సంఖ్యలో కార్మికులు ఉన్నారు. కార్మికులు వ్యవసాయం, చిన్నతరహా కర్మాగారాల్లో పని చేసే వారు లేదా సేవకులుగా ఉండేవారు. అయితే మార్క్స్, ఏంగెల్స్ స్పష్టంగా చూసిన దృశ్యం ఏమిటంటే పెట్టుబడి భూగోళాన్ని జయించే కొద్దీ కార్మిక వర్గం అభివృద్ధి చెందుతుంది.

ఈ విశాలమైన దృశాన్ని కొన్నిసార్లు విమర్శిస్తారు. ఎందుకంటే భారీ పరిశ్రమలో ఒకే స్వభావంగల కార్మికులు అభివృద్ధి చెందుతారని అది ఊహించింది. ఈ అంశాన్ని తర్వాత చర్చిద్దాము. ముఖ్యంగా 20వ శతాబ్దపు చివరి పాతికేళ్ల చరిత్రను వివరించే సమయంలో ఈ అంశం గురించి ప్రస్తావిస్తాను. ఇక్కడ చెప్పాల్సిన విషయమేమిటంటే అది వారి భావన అయినప్పటికీ (మాంచెస్టర్, చార్టిస్టువాదంపై ఏంగెల్స్‌కు ఉన్న అనుభవం ఆధారంగా) అది వారి వాదనా తర్కంలో కనిపించదు. రైతాంగ లేదా వృత్తిదార ఉత్పత్తి స్థానంలో వేతన కార్మికుల అభివృద్ధి ఒక ప్రత్యేకమైన వేతన కార్మిక స్వరూపం అభివృద్ధికి దారి తీయాలన్న నిబంధన ఏదీ లేదు. దాని సారం ఏమిటంటే సామాజిక కార్మిక శక్తిలోని మెజారిటీ భాగం జీవనోపాధి కోసం తమ శ్రమను అమ్ముకునే సామర్థ్యంపైనే ఆధారపడుతుంది. (ఈ సామర్థ్యాన్నే తర్వాతి కాలంలో "శ్రమశక్తి"గా మార్క్స్ అభివర్ణించాడు) కార్మికుల శ్రమకు అవసరమైన పరిస్థితులను, తగిన వేతనాలను ఒక వైపు పెట్టుబడి యొక్క పోటీతత్వం, మరోవైపు పెట్టుబడి వ్యతిరేకంగా పోరాడగల కార్మికుల స్థాయి నిర్ధారిస్తాయి. వారు ఫ్యాక్టరీలు, కార్యాలయాలు లేదా కాల్ సెంటర్లలో పని చేస్తారా అన్నది వేరే విషయం. వారు ఏకవస్త్రాన్ని ధరిస్తారా లేదా వైట్

కాలర్లు, జీన్స్ ధరిస్తారా అన్నది కూడా అప్రస్తుతం. ఈ అంశాలపరంగా చూస్తే మార్క్స్, ఏంగెల్స్‌ల వాదనా తర్కాన్ని తప్పుపట్టడం కష్టమవుతుంది. మరీ ముఖ్యంగా జీవనోపాధులు ప్రపంచ వ్యాప్త పోటీలో పరిశ్రమలు లేదా దేశాల విజయంపై ఆధారపడి ఉన్నాయని కార్మికులకు (అన్ని రకాల) ప్రబోధిస్తున్న ఈ తరుణంలో మార్క్స్, ఏంగెల్స్‌ల వాదనను తప్పుపట్టడం అసాధ్యం.

మానిఫెస్టో రూపకల్పనలో చివరికి వచ్చే సమయానికి ప్రపంచ వ్యాప్తంగా అప్పటికీ అభివృద్ధి చెందని క్యాపిటలిజం స్వభావాన్ని సగం మాత్రమే గ్రహించగలిగారు. "కమ్యూనిస్టులు ప్రధానంగా జర్మనీ వైపే దృష్టి సారిస్తారు. ఎందుకంటే ఆ దేశం బూర్జువా విప్లవం అంచున ఉంది," అని వారిద్దరూ రాశారు. "ఈ విప్లవాన్ని ఐరోపా నాగరికతకు చెందిన అత్యంత అభ్యుదయ పరిస్థితుల ఆధారంగా చేపట్టడం తథ్యం. 17వ శతాబ్ది బ్రిటన్, 18వ శతాబ్ది ఫ్రాన్స్‌లోని కార్మికవర్గం కంటే ఎంతో అభివృద్ధి చెందిన కార్మికవర్గం దీనికి ప్రాతినిధ్యం వహిస్తుంది. అనతి కాలంలో సంభవించే కార్మికవర్గ విప్లవానికి ఇది తొలిఘట్టం మాత్రమే."

విప్లవం తథ్యం అన్న విషయంలో వారి వాదన నిజమేనని నిరూపణ అయ్యింది. పూర్వపు విప్లవాల కంటే ఈ విప్లవంలో కార్మికుల పాత్ర చాలా ఎక్కువని కూడా నిర్ధారణ అయ్యింది. కార్మికుల ఈ విశాలమైన పాత్రకు బూర్జువా వర్గం ఎలా ప్రతిస్పందిస్తుందనే విషయాన్ని మాత్రం ఇద్దరు సరిగ్గా అంచనా వేయలేకపోయారు.

# ఏడవ అధ్యాయం

# 1848

"పారిస్ నగర వీధుల్లో నడుస్తూ నేను మధ్యాహ్నమంతా గడిపాను. నన్ను రెండు విషయాలు ఆకట్టుకున్నాయి. మొదటిది, ఇటీవల సంభవించిన విప్లవానికి ఉన్న వినూత్నమైన, ప్రత్యేకమైన ప్రజా లక్షణం. తమ స్వంత హస్తాలతో పని చేసే కార్మిక వర్గాలకు అది అన్ని చోట్లా ప్రాతినిధ్యం కల్పించింది. మిగతా వర్గాల కంటే శ్రామిక వర్గానికి ఎనలేని ప్రాధాన్యత లభించింది. రెండవది, విప్లవ విజయం సాధించిన మరుక్షణం సాధారణ ప్రజలు ఇతర వర్గాల పట్ల నామమాత్రపు ద్వేషాన్ని ప్రదర్శించారు. అప్పటికే కార్మికవర్గం అధికారానికి ఏకైక పరిరక్షకులుగా ఉన్నారు.

పారిస్‌లో ఆ రోజంతా నేను గత వ్యవస్థకు సంబంధించిన ఏ ఒక్క అధికార ప్రతినిధిని చూడలేదు. ఒక సైనికుడుకాని, ఒక గూఢచారి కాని, ఒక పోలీసు కాని, చివరికి జాతీయ భద్రతాదళం కాని ఎక్కడా కనిపించలేదు. వీరందరూ ఉన్నట్లుండి తెరమరుగయ్యారు. ప్రజలొక్కరే ఆయుధాలను ధరించి సార్వజనిక భవనాలకు కాపలా కాశారు. పరిస్థితులపై కన్నేసి ఉంచారు. అవసరమైన ఆదేశాలు జారీ చేస్తూ విప్లవ వ్యతిరేకులను శిక్షించారు. ఎలాంటి ఆస్తి, ధనం లేని ప్రజల చేతుల్లో ఈ మహానగరమంతా ఉండడం అనితరసాధ్యమైన, భీతావహ దృశ్యాన్ని తలపించింది."

'25 ఫిబ్రవరి 1848' గురించి రాస్తూ చరిత్రకారుడు అలెక్సిస్‌డి తోక్‌విల్ పై వ్యాఖ్యలను చేశాడు. ఫ్రెంచి రాజు లూయీ ఫిలిప్ అప్పుడే తన బాధ్యతలను త్యజించి దేశాన్ని వదలి పారిపోయాడు. విదేశీ వ్యవహారాలమంత్రిత్వ శాఖ భవనం ఎదుట నిరసన ప్రదర్శనగా వచ్చిన రిపబ్లికన్ విద్యార్థులు, మధ్యతరగతిలోని కొన్ని వర్గాలు పోలీసులతో ఘర్షణ పడ్డారు. ఈ సంఘటన కారణంగా పేదలు ఎక్కువగా నివసించే ఈశాన్య పారిస్‌లో తిరుగుబాటు రాజుకుంది. అర్ధశతాబ్ది ముందు కూడా ఈ ప్రాంతం సాధారణ వ్యాపారులకు విప్లవ కేంద్రంగా ఉండేది. 'సంస్కరణ వర్ధిల్లాలి' అంటూ పెద్ద ఎత్తున నినాదాలు చేస్తూ ప్రజలు రక్షణ వలయాలను ...లు, శాసనమండలి భవనాల్లోకి చొచ్చుకు వచ్చారు. ప్రతిపక్ష నాయకులంతా

కలిసి లామార్టిన్ నేతృత్వంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. కొత్త ప్రభుత్వానికి ప్రజా మద్దతును కూడగట్టేందుకు సోషలిస్టు సంస్కర్త లూయీ బ్లాంక్‌ను మంత్రివర్గంలోకి తీసుకున్నారు. అలాగే చరిత్రలో తొలిసారిగా కార్మికుడైన అల్బర్ట్‌ను ప్రభుత్వంలో చేర్చుకున్నారు.

ఫ్రాన్స్‌లో విప్లవం ఐరోపాలోని ప్రతి సింహాసనం కింద ఒక బాంబులాగా పరిణమించింది. అప్పటికే (గత డిసెంబరులో) స్విట్జర్లాండ్‌లో స్వల్పకాలిక అంతర్యుద్ధం జరిగి ఉంది. జనవరిలో సిసిలీ తిరుగుబాటును చవి చూసి ఉంది. ఇపుడు వియన్నా, మిలాన్, వెనిస్, ప్రేగ్, బెర్లిన్‌తోపాటు అన్ని జర్మన్ పారిశ్రామిక కేంద్రాల్లో, ప్రాంతీయ రాజధానుల్లో తిరుగుబాట్లు విజయవంతంగా సంభవించాయి. ప్రతి నగరంలోనూ ఉదారవాద మధ్యతరగతి వర్గాలు నిరసన ప్రదర్శనలకు నాయకత్వం వహించాయి. చివరికి ఈ నిరసనలు ప్రజా ప్రవాహం లా మారి సైన్యం, పోలీసుల దాడులను తిప్పికొట్టాయి. రాజభవనాలు, ప్రభుత్వ కార్యాలయాలను ఆక్రమించుకున్నారు. మెట్టర్‌నిక్ లాంటి విప్లవ ప్రతీఘాత రాజకీయ నాయకులు ఇప్పుడు తమ ప్రాణాలను కాపాడుకునేందుకు దేశం వదలిపారిపోయారు. 1814-15లలో ప్రతీఘాత విప్లవానికి మెట్టర్‌నిక్ ప్రధాన సూత్రధారిగా వ్యవహరించాడు. రాజులు, పాలకవర్గాలు తెరవెనుక ఉండిపోయారు. కాని ఉదారవాద రాజ్యాంగాలతో తాము ఏకీభవిస్తున్నట్లు ప్రకటించి తమ స్థానాలను దక్కించుకున్నారు. నిరంకుశత్వం ప్రతిచోటా అంతరించింది. విప్లవాత్మకమైన ప్రజాస్వామిక సంస్కరణలను సాధించారు. పురుషులకు సార్వజనిక ఓటుహక్కు, పత్రికా స్వేచ్ఛ, న్యాయమూర్తితో విచారణను ఎదుర్కొనే హక్కు, పాలకవర్గాల ప్రత్యేక ప్రయోజనాలు, భూస్వామ్య చెల్లింపుల రద్దు...... ఇలా విప్లవాత్మకమైన సంస్కరణలను విజయవంతగా చేపట్టినట్లు తోచింది.

కాని ఆచరణలో అవి వాస్తవరూపం దాల్చలేదు. వేసవి నాటికి రాజులు, పాలకవర్గాలు తమ ఆత్మవిశ్వాసాన్ని తిరిగి దక్కించుకున్నారు. ప్రజాతంత్ర ఉద్యమాల ముందు తలవంచడం మాని వాటిపై దాడులను మొదలుపెట్టారు. వర్షాకాలం చివరలో బెర్లిన్, వియన్నా, మిలాన్ లాంటి కీలక కేంద్రాల్లో ఉద్యమాన్ని అణచివేశారు. 1849 వేసవి నాటికి ఖండవ్యాప్తంగా ప్రతీఘాత విప్లవం మరోసారి విజయదుందుభి మోగించింది.

చిన్నవ్యాపారులు, వృత్తిదారులు, కార్మికులు పెద్ద సంఖ్యలో ఉద్యమించడం వల్లే ఫిబ్రవరి, మార్చి నెలల్లో విప్లవాలు విజయవంతమయ్యాయి. ఈ వర్గాలు రాజులు, పాలకవర్గాల నేతృత్వంలోని సైన్యాలు, పోలీసు దళాల దాడులను ఉమ్మడిగా తిప్పికొట్టగలిగాయి. కాని వారు ఏర్పరచిన ప్రభుత్వాలు, పార్లమెంట్లు ప్రధానంగా ధనికులైన మధ్యతరగతి వర్గాలతో నిండిపోయాయి. ఫలితంగా జర్మనీ అంతటికీ ఎన్నుకున్న పార్లమెంటు (జర్మను భాష మాట్లాడే ఆస్ట్రియాతో సహా) మే నెలలో ఫ్రాంక్‌ఫర్ట్‌లో సమావేశమైనప్పుడు అందులో దాదాపు 436 మంది ప్రభుత్వ ఉద్యోగులు (పరిపాలనా, న్యాయశాఖ అధికారులు), 100 మంది వ్యాపారులు, భూస్వాములు, 100 మంది న్యాయవాదులు, 50 మంది పురోహితులు ఉన్నారు. అలాంటి వ్యక్తులు తమ ప్రాణాలను, కనీసం తమ పదవులను పాత పాలకవర్గాలకు వ్యతిరేకంగా విప్లవ చర్యకు పణంగా పెట్టడానికి సిద్ధపడలేదు. అంతకంటే మించి వారు తమను అధికారంలోకి తీసుకువచ్చిన ప్రజలను 'అస్థిరశక్తులుగా', పాత పాలకవర్గం కంటే భయంకరమైన, ప్రమాదకరమైన శక్తులుగా పరిగణించారు.

ఇంగ్లాండ్ విప్లవంలో ప్రెస్బీటేరియన్లను, అమెరికా విప్లవంలో న్యూయార్క్, పెన్సిల్వేనియా ఉదారవాదులను, ఫ్రెంచి విప్లవంలో గిరోండిన్లను ఆవహించిన భయమే ఇప్పుడు కొత్త ప్రభుత్వాలు, పార్లమెంటేరియన్లను పట్టి పీడించింది. కాని దాని స్థాయి మరీ తీవ్రంగా ఉండేది. 'స్వతంత్రులు' లేదా జాకోబిన్లతో సమానంగా మధ్యతరగతి నుండి ఏ ఒక్క విప్లవశక్తి ఎదగలేదు, సమాజంపై తన ఆధిపత్యాన్ని స్థాపించలేదు.

పశ్చిమ ఐరోపా అంతటా విస్తరించిన పారిశ్రామిక కేంద్రాలు క్యాపిటలిస్టు వర్గ విస్తరణను సూచించాయి. ఫ్రెంచి విప్లవం నాటి కంటే 1848లో క్యాపిటలిస్టులు ఒక పెద్ద వర్గంగా ఎదిగారు. వారి ధన, రాజకీయ బలం కూడా అమితంగా పెరిగింది. ఈ వర్గం పక్కనే మేధావులు, ఆచార్యులు, ఉపాధ్యాయులు, ప్రభుత్వ ఉద్యోగులతో కూడిన విశాలమైన మధ్యతరగతి వర్గం ఆవిర్భవించింది. వీరంతా ఇంగ్లాండ్‌ను ఆర్థిక వ్యవహారాలలో ఆదర్శంగా తీసుకున్నారు. ఫ్రెంచి విప్లవం ఏర్పాటు చేసిన సమైక్య జాతీయ రాజ్యాన్ని రాజకీయ ఆదర్శంగా తీసుకున్నారు. చివరకు హాలెండ్, పోలెండ్‌లలో ఉన్నత వర్గాలలోని కొన్ని వర్గాలు కూడా ఆస్ట్రియా, రష్యాల నుండి తమకు జాతీయ స్వాతంత్ర్యం కావాలని ఉద్యమించాయి.

రాజ్యాంగబద్ధులైన రిపబ్లికన్ లేదా మధ్యతరగతి ఎదుగుదలకు అవతల కార్మికవర్గం కూడా విస్తరించింది. అప్పటికీ ఉత్పత్తి చాలా వరకు చిన్న కర్మాగారాల్లోనే జరిగేది. వీటిలో వృత్తిదారులు కొందరు సంచార వ్యాపారులను ఉద్యోగంలో నియమించారు. అలాగే నేత, నూలు వడికే గృహాల్లో కొందరిని పనిలోకి తీసుకున్నారు. నేత పని వారు ఒక పెద్ద వ్యాపారి కోసం ఉత్పత్తి చేసేవారు. ఏదేమైనా, సామాజిక పరిస్థితులు ఎక్కువగా అస్థిరమైన, సమైక్యవాద ప్రభావం కలిగిన క్యాపిటలిస్టు మార్కెట్‌పై ఆధారపడి ఉండేవి.

ఉదాహరణకు పారిస్‌లో :

> "వృత్తిదార ఉత్పత్తి కేంద్రాలు చాలా వాటిలో ఉత్పత్తిపై స్థూల నియంత్రణ వ్యాపారుల చేతికే దక్కింది. వీరు విక్రయాలను నిర్వహించేవారు, బకాయిలను నియంత్రించేవారు. ఈ వృత్తుల్లోని కార్మికులు, చివరకు ప్రధాన వృత్తిదారులు (వీరే కార్మికులను నియమిస్తారు) అలాగే ఫ్యాక్టరీ కార్మికులు తమ జీవితాలను శాసిస్తున్న బయటి శక్తులపట్ల ఎంతో అవగాహన పెంచుకున్నారు. ఈ శక్తులన్నీ తమను ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థవంతంగా తీర్చిదిద్దేందుకు కృషి చేస్తున్నాయని తెలుసుకున్నారు. ఈ శక్తులను సాధారణంగా 'క్యాపిటలిజం' లేదా "ఆర్థికపరమైన భూస్వామ్య వ్యవస్థ"తో గుర్తించేవారు. బెర్లిన్, వియన్నా, రైన్‌లాండ్‌లోని పారిశ్రామిక పట్టణాల్లో దాదాపు ఇలాంటి పరిస్థితులే నెలకొని ఉండేవి.

1845 తర్వాత పంట వైఫల్యాలు మార్కెట్ ఉత్థాన పతనాలతో మమేకం కావడంతో సమాజంలో వైషమ్యాలు పెరిగాయి. పశ్చిమంలో ఐర్లాండ్ నుండి తూర్పు ప్రష్యా వరకు ఆర్థిక సంక్షోభం బయల్దేరింది. (అద్దెలు చెల్లించేందుకు ధాన్యాన్ని ఎగుమతి చేయాల్సి రావడంతో ఐర్లాండ్‌లో సుమారు పది లక్షల మంది ఆకలి చావులకు గురయ్యారు) ఆకలి, పెరుగుతున్న ధరలు, నిరుద్యోగం తీవ్రంగా ప్రబలడంతో ప్రజాగ్రహం తీవ్రస్థాయికి చేరుకుంది. 1848 ఫిబ్రవరి, మార్చిలలో ప్రజాగ్రహం విప్లవ రూపాన్ని సంతరించుకుంది. వృత్తిదారులు, కార్మికుల

చేరికతో మధ్యతరగతి రాజ్యాంగవాదులు నిర్వహించిన వీధి ప్రదర్శనల స్వరూపం మారిపోయింది. ఈ ప్రదర్శనలలో రిపబ్లికన్లు కూడా ఎద్ద ఎత్తున పాల్గొన్నారు. బ్లాక్ ఫారెస్ట్ లాంటి ప్రాంతాల్లో రైతులు భూస్వామ్య చెల్లింపులు, పాలకవర్గ భూస్వాములకు వ్యతిరేకంగా ఉద్యమించారు. 1525లో జరిగిన రైతాంగ పోరాటం తర్వాత రైతులు ఇంత పెద్ద ఎత్తున ఉద్యమించడం ఇదే మొదటిసారి.

అసంతృప్తి జ్వాలల స్థాయి ప్రతి క్యాపిటలిస్టు (చిన్న పెద్ద తేడా లేకుండా) వెన్నులో చలిపుట్టించింది. ఎందుకంటే రైతులు, కార్మికులు కేవలం ప్రజాస్వామిక రాజ్యాంగాలు లేదా భూస్వామ్య ప్రత్యేక ప్రయోజనాలపైనే ఆందోళన వ్యక్తం చేయలేదు. వారు క్యాపిటలిస్టు లాభాలు, క్యాపిటలిస్టు ఆస్తిని సవాలు చేసే జీవన ప్రమాణాలు, స్థితిగతులను డిమాండ్ చేయడం మొదలుపెట్టారు. ఆస్తులు కలిగిన ఉదారవాదులు తమ సాంప్రదాయ విరోధులైన ధనిక ఉన్నత వర్గాలు, రాజులతో చేతులు కలిపి కార్మికవర్గ డిమాండ్లను వ్యతిరేకించారు.

మార్చి పోరాటంలో చిందిన రక్తం ఆరకముందే జర్మనీ, ఆస్ట్రియాలలో ఇలాంటి పరిస్థితులు ముందుగానే నెలకొన్నాయి. కొత్త ప్రభుత్వాలు జాతీయ భద్రతా దళ సభ్యత్వాన్ని మధ్యతరగతికి పరిమితం చేశాయి. పాత సైన్యాలు ఉన్నతాధికారులకు ఎలాంటి హాని తలపెట్టకుండా వదిలేశాయి. పాత రాచరిక రాజ్య అధికార స్వామ్యాలతో రాజీపడ్డాయి. భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటాలను నిలిపివేయాలని రైతులను ఆదేశించాయి.

బెర్లిన్‌లోని ప్రష్యన్ పార్లమెంటు ప్రష్యన్ రాజుతో రాజ్యాంగపరమైన ఒప్పందం కుదుర్చుకోవడంపై సుదీర్ఘ మంతనాలు జరిపింది. తదుపరి ఒక ఒప్పంద పత్రాన్ని తయారు చేసింది. ఫ్రాంక్‌ఫర్ట్‌లోని ప్రత్యేక జర్మన్ పార్లమెంటు తన స్వంత నియమనిబంధనలపై వాదనలతోనే సరిపెట్టుకుంది. ప్రజల విప్లవ ఆకాంక్షలను ప్రతిబింబించడంలో కాని పాలకవర్గాల పునఃసమీకరణ, సైన్యాల ఆయుధీకరణను అడ్డుకోవడంలో కాని రెండు పార్లమెంట్లు ఎలాంటి చర్యలు తీసుకోలేకపోయాయి.

## జూన్ పోరాటం

అయితే, పారిస్‌లోనే నిర్ణయాత్మక మలుపు వచ్చింది. దాని తర్వాతే పరిణామాలు ఒక్కొక్కటిగా సంభవించాయి.

ఫిబ్రవరిలో పాత వ్యవస్థను కూల్చివేయడంలో నిర్ణయాత్మక పాత్రను పోషించిన వృత్తిదారులు, కార్మికులకు ఆర్థికపరమైన, సామాజికపరమైన ఫిర్యాదులు ఎన్నో ఉండేవి. ప్రభుత్వ ఉదారవాద – ప్రజాస్వామ్య కార్యాచరణ స్థాయికి మించి వారి సమస్యలు ఉండేవి. ముఖ్యంగా మనుగడకు సరిపడ వేతనం ఇవ్వగలిగే ఉపాధి కావాలని ఈ వర్గాలు డిమాండ్ చేశాయి.

వీరు ఎలాంటి స్వరూపంలేని ప్రజానీకం కాదు. 1830 తర్వాతి సంవత్సరాలలో సామాజిక సంస్కరణకు కట్టుబడిన మండళ్లు (లూయీ బ్లాంక్ లాంటి వ్యక్తులు వీటికి నేతృత్వం వహించారు) రహస్య సమాజాలు (ఇవి సామాజిక డిమాండ్లను జాకోబిన్ విద్రోహవాదంతో జత చేశాయి. అగస్త్ బ్లాంకీ లాంటి వ్యక్తులు వీటికి నాయకత్వం వహించారు) ప్రజా మద్దతును కూడగట్టాయి. వీటి సిద్ధాంతాలు, ఆలోచనలను కాఫీ విక్రయ కేంద్రాలు, కర్మాగారాలలో

చర్చించే వారు. ప్రజా ప్రాతినిధ్యం ఉండే ప్రభుత్వం అభద్రత, పేదరికాన్ని, అంతమొందించేందుకు ఏకైక సాధనమని గట్టిగా వాదించిన రిపబ్లికన్, సోషలిస్టు దినపత్రికలు ఆకర్షణీయంగా మారాయి. 1840 దశకం తొలినాళ్లలో వెల్లివిరిసిన సంపన్నత క్రమంగా తీవ్రమైన సంక్షోభానికి దారి తీసింది.

సాయుధ ప్రజల మధ్య 24-25 ఫిబ్రవరిన ఏర్పడిన ప్రభుత్వం వారి డిమాండ్లను విస్మరించే పరిస్థితిలో లేదు. ప్రజల ఒత్తిడి మేరకు వారి కళ్లెదుటే అది సమావేశమైంది. ప్రదర్శనలు, పర్యటనలు, పునరుద్ఘాటనలు నిరంతరంగా కొనసాగాయి. ఆ విధంగా ప్రభుత్వం పని దినంలో ఒకటిన్నర గంటల కోతను విధిస్తూ శాసనం జారీ చేసింది. పౌరులందరికీ ఉపాధి కల్పిస్తామని హామీ ఇచ్చింది. నిరుద్యోగులకు ఉపాధి కల్పించడం కోసం జాతీయ కర్మాగారాలను స్థాపించింది. కార్మిక మంత్రి లూయీ బ్లాంక్ కార్మిక కమీషన్‌ను ఏర్పాటు చేశాడు. దానికి లగ్జెంబర్గ్ రాజభవనం కార్యాలయంగా మారింది. అక్కడ సుమారు 600 మంది సభ్యులు (పారిశ్రామికవేత్తల ప్రతినిధులు, కార్మికుల ప్రతినిధులు, అన్ని ఆలోచనాధోరణులకు చెందిన ఆర్థికవేత్తలు) సమాంతర పార్లమెంటుగా తయారయ్యారు.

తొలుత ధనికవర్గాలు ఈ అంశంపై ఫిర్యాదు చేయడానికి సాహసం చూపలేక పోయాయి. ఫిబ్రవరి 24-25 కుదిపిన కుదుపు స్థిరపడటంతో వారి గళంలో మార్పు వచ్చింది. వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు, పెట్టుబడిదారులు సోషలిస్టు గణరాజ్యానికి వ్యతిరేకంగా మధ్యతరగతి అభిప్రాయాన్ని తీర్చిదిద్దేందుకు నడుం బిగించారు. కార్మికులు, జాతీయ కర్మాగారాలకు ఇస్తున్న రాయితీల వల్లే ఆర్థిక సంక్షోభం తీవ్ర రూపం దాలుస్తోందని నిందించారు. (ఇంగ్లాండ్ కర్మాగారాల కంటే ఫ్రెంచి కర్మాగారాలు కొంత వరకు మెరుగ్గా ఉండేవి).

ప్రభుత్వంలోని బూర్జువా రిపబ్లికన్లు ధనిక వర్గాల అభిప్రాయాలతో ఏకీభవించారు. పాత వ్యవస్థ బకాయిలను గుర్తించడం ద్వారా పెట్టుబడిదారులను మచ్చిక చేసుకోవడానికి సత్వర చర్యలు తీసుకున్నారు. బడ్జెట్‌లో సమతూకం పాటించేందుకు రైతులపై పన్ను విధించారు. మధ్యతరగతి వర్గాలకు జాతీయ భద్రతా దళంపై ఆధిపత్యం ఉండేలా జాగ్రత్తలు తీసుకున్నారు. సాయుధ బలగాల్లోకి వేలాది మంది నిరుద్యోగ యువకులను తీసుకున్నారు. సంచార దళాలలైన వీటిపై సంపూర్ణ నియంత్రణ సాధించారు. ఏప్రిల్ చివరలో రాజ్యాంగ సభకు ఎన్నికలను కూడా ప్రకటించారు. ఫలితంగా తమ విప్లవ భావాలను పారిస్ నగరం బయట ప్రచారం చేసేందుకు పారిస్ వృత్తిదారులు, కార్మికులను తగిన సమయం లభించలేదు. రైతాంగంలో ఎన్నికల ప్రచారం భూస్వాములు, న్యాయవాదులు, పురోహితుల ఆధిపత్యంలో జరిగింది. వీరు కొత్త పన్నులకు వామపక్ష పారిస్‌ను దోషిగా నిలబెట్టారు. కొత్త సభ వైరి వర్గమైన రాచరిక కుటుంబాల రహస్య సమర్థకులతో నిండిపోయింది. వీరి ముసుగు కూడా అంత దట్టంగా ఉండేది కాదు. అధికారంలోకి రాగానే వీరు ఇద్దరు సోషలిస్టు మంత్రులను తొలగించారు.

తర్వాత జూన్ 21న ప్రభుత్వం జాతీయ కర్మాగారాలను మూసివేస్తున్నట్లు ప్రకటించింది. నిరుద్యోగులకు రెండు అవకాశాలను ఇచ్చింది. తమ ప్రాంతీయ పాలనా కేంద్రాలకు వెళ్లిపోవడమో లేదా సైన్యంలో భర్తీ కావడమో తేల్చుకోవాలని తొలగింపునకు గురైన కార్మికులకు సూచించింది.

ఫిబ్రవరిలో వృత్తిదారులు, కార్మికులు సాధించుకున్న ప్రతి డిమాండ్‌ను వారి నుండి ఉపసంహరించారు. ఆయుధాలను చేతపట్టడం తప్ప మరో మార్గంలేదని వారు గ్రహించారు. తర్వాతి రోజు ఈశాన్య పారిస్ అంతటా బారికేడ్లను నిర్మించారు. అధికార కేంద్రానికి చేరుకోవడానికి ప్రతి ప్రయత్నమూ చేశారు. రిపబ్లికన్ ప్రభుత్వం వారిపై తను పూర్తి బలంతో విరుచుకుపడింది. సుమారు 30,000 మంది సైనికులు, 60,000-80,000 మంది జాతీయ భద్రతా దళ సిబ్బంది, సుమారు 25,000 మంది సంచార దళాలు జనరల్ కవాయినాక్ కమాండ్‌లో అణచివేత చర్యలను చేపట్టాయి. నగరమంతటా అంతర్యుద్ధం చెలరేగింది. దాదాపు నాలుగు రోజులపాటు వీధి పోరాటాలు జరిగాయి. సంపన్నమైన పశ్చిమ ప్రాంతాలు వెనుకబడిన ఈశాన్య జిల్లాలపై విరుచుకుపడ్డాయి.

ఒకవైపు ఇరు పాలకవంశాలకు చెందిన రాజులు, భూస్వాములు, వ్యాపారులు, బ్యాంకర్లు, న్యాయవాదులు, మధ్యతరగతి రిపబ్లికన్ విద్యార్థులు ప్రభుత్వాన్ని మద్దతునివ్వగా మరోవైపు సుమారు 40,000 మంది విద్రోహులు(వీరు ఎక్కువగా నగరంలోని చిన్న తరహా వృత్తిదార కుటుంబాలకు చెందినవారు), పారిశ్రామిక కార్మికులు, నైపుణ్యం లేని కార్మికులు, అసంఖ్యాకమైన చిన్న వ్యాపారులు ప్రజల పక్షాన వ్యవస్థకు వ్యతిరేకంగా సమీకృతమయ్యారు. ఒక్కో ప్రతిఘటనా కేంద్రంపై ఒక్కో వృత్తికి ఆధిపత్యం ఉండేది. ఒకచోట వాహనదారులు, మరోచోట ఓడరేవు కార్మికులు, మూడోచోట కర్మాగార కార్మికులు... ఇలా ప్రతిఘటనకు విభిన్నమైన నేపథ్యం, నేతృత్వం ఉండేది.

ఏంగెల్స్ పేర్కొన్నట్లు పురుషులొక్కరే ఈ పోరాటంలో పాల్గొనలేదు. రూ డి క్లెరి వద్ద గల బ్యారికేడ్‌లో ఏడుగురు రక్షణ సిబ్బందిలో ఇద్దరు అందమైన యువతులు కూడా ఉన్నారు. వారిలో ఒక యువతి ఎర్రజెండా చేతబూని ప్రభుత్వ భద్రతా దళం వైపు అడుగులు వేస్తుండగా కాల్చి చంపివేయబడింది.

తిరుగుబాటును అత్యంత దారుణంగా అణచివేశారు. ఒక జాతీయ భద్రతా దళ అధికారి, చిత్రకారుడైన మెస్సోనియర్ ఇలా నివేదించాడు :

"రూ డి లా మార్టెల్లరీ వద్ద ఉన్న బ్యారికేడ్‌ను స్వాధీనం చేసుకున్నప్పుడు నేను అలాంటి యుద్ధతంత్రం కరాళనృత్యాన్ని గ్రహించాను. లొంగిపోతున్న వారిని కాల్చి చంపడం నేనుచూశాను. కొందరిని కిటికీల నుండి విసిరివేశారు. నేలపై శవాలు గుట్టలు గుట్టలుగా పేరుకుపోయాయి. భూమంతా రక్తంతో తడిసిపోయింది."

చనిపోయిన వారి సంఖ్య ఖచ్చితంగా తెలియలేదు కాని, 12,000 మందిని నిర్బంధించారు. వేలాది మందిని ఫ్రెంచ్ గయానాకు తరలించారు.

## పాత వ్యవస్థ పునరాగమనం

పారిస్ కార్మికుల పరాజయం అన్ని చోట్ల ఉన్న విప్లవ వ్యతిరేకులకు మనోధైర్యాన్ని ఇచ్చింది. జర్మన్ ఉన్నత వర్గానికి చెందిన బిస్మార్క్ ప్రష్యన్ జాతీయ అసెంబ్లీలో మాట్లాడుతూ ఇలా అన్నాడు : "ఈ పోరాటం ఐరోపా ఖండమంతటా జరిగిన అత్యంత అదృష్టకరమైన పరిణామాల్లో ఒకటి." జర్మన్ రాజ్యాలు, ప్రాంతాలలో అధికారులు వామపక్ష రిపబ్లికన్ మందల్లను [illegible]స్ట చేయడం మొదలుపెట్టారు. దినపత్రికలపై విచారణ జరిపించారు. ఉద్యమకారులను

నిర్బంధించారు. ఇటలీలో ఆస్ట్రియన్లు పైడ్మాంట్ సైన్యాన్ని ఓడించి మిలాన్‌పై మళ్లీ నియంత్రణ సాధించారు. మరోవైపు నేపుల్స్‌రాజు సైనిక పాలనను స్థాపించాడు. ఆస్ట్రియన్ జనరల్ విండీష్‌గ్రేట్జ్ చౌక్ మధ్యతరగతి కార్మికులు, విద్యార్థులతో ఐదు రోజులు పోరాడిన తర్వాత ప్రేగ్ నగరాన్ని అన్ని వైపుల నుండి ముట్టడించాడు. ముట్టడి చాలా రోజులు కొనసాగింది. అక్టోబరు చివరిలో అతడు తీవ్రమైన ప్రజా ప్రతిఘటనను అధిగమిస్తూ వియన్నాను స్వాధీనం చేసుకున్నాడు. ఈ పోరాటంలో సుమారు రెండు వేల మంది పౌరులు మరణించారు. తర్వాత అతడు హంగేరి వైపు కదిలాడు.

ఒక వారం తర్వాత ప్రష్యన్ రాజు బెర్లిన్‌లోని రాజ్యాంగ సభను రద్దు చేశాడు. ఇంతటి బహిరంగమైన విప్లవ ప్రతీఘాత చర్యకు ప్రతిస్పందనగా ఫ్రాంక్‌ఫర్ట్ పార్లమెంటులోని మెజారిటీ ఉదారవాదులు అతడిని జర్మనీకి చక్రవర్తిగా ఉండమని మార్చిలో ప్రతిపాదించారు. తన సైన్యాన్ని దక్షిణ జర్మనీకి పంపే ముందు ప్రష్యన్ రాజు ఆ ప్రతిపాదనను తిరస్కరించాడు. తదుపరి విప్లవ ఎత్తుగడలను భూస్థాపితం చేసేందుకు అతడు సైన్యాన్ని పంపాడు.

1848 వసంతకాలం రేపిన భారీ ఆకాంక్షలు 1849 తొలి నాటికి అసహనానికి దారితీసాయి. కాని అప్పటికీ విప్లవ కెరటం పూర్తిగా పడిపోలేదు. ప్రజాతంత్ర సంఘాలు, కార్మికుల మండళ్లు అప్పటికీ పెద్ద ఎత్తున సభ్యత్వం కలిగి ఉండేవి. సాంప్రదాయవాద, ఉదారవాద సంఘాల సభ్యుల కంటే పై మండళ్ల సభ్యులు క్రియాశీలంగా ఉండేవారు. వసంతకాలంలో రైన్‌లాండ్‌లోని కొన్ని భాగాలు, పలాటినేట్, డ్రెస్డెన్, బాడెన్, వర్టెంబర్గ్‌లలో తిరుగుబాట్లు విజయవంతమయ్యాయి. గత మార్చిలో వలె ఇక్కడి పాలకులు కూడా తమ ప్రాంతాలను వదలి పారిపోయారు. కాని అనేక మంది ప్రజలు అప్పటికీ నాయకత్వం కోసం ఫ్రాంక్‌ఫర్ట్ పార్లమెంటు వైపు చూశారు. అయితే నాయకత్వ బాధ్యతలను చేపట్టేందుకు పార్లమెంటు సిద్ధపడలేదు. దక్షిణంలో సమీకరించిన విప్లవ సైన్యం (ఫ్రెడెరిక్ ఏంగెల్స్ ఈ సైన్యానికి సలహాదారుల్లో ఒకడు) ఆత్మరక్షణలో పడిపోయింది. ప్రష్యన్ సైన్యంతో యుద్ధంలో ఓడిపోయిన తర్వాత విప్లవ సైన్యం సరిహద్దును దాటుకొని స్విట్జర్లాండ్‌లో తలదాచుకోవలసి వచ్చింది. రష్యన్ జార్ నుండి సైనిక సహాయం అందడంతో ఆస్ట్రియన్ చక్రవర్తి చివరకు కొస్సుత్ నాయకత్వంలోని హంగేరియన్లను అణచివేశాడు. మే నెలలో నేపల్స్ రాజు సిసిలీ నగరాన్ని తిరిగి హస్తగతం చేసుకున్నాడు. రోమ్ నగరాన్ని నియంత్రణలోకి తీసుకొని పోప్‌ను తరిమికొట్టిన విప్లవ జాతీయవాదులు ఫ్రెంచ్ గణరాజ్య సైన్యాల ముట్టడి కారణంగా నగరం నుండి నిష్క్రమించాల్సి వచ్చింది. ఫ్రెంచి సైన్యాలు రోమ్‌ను మూడు నెలల పాటు ముట్టడించాయి.

విప్లవ ప్రక్రియ స్థూలంగా ప్రారంభమైన ఫ్రాన్స్‌లో కార్మికులను ఓడించిన తర్వాత తమను రాచరికవాదుల నుండి కాపాడే వారు ఎవరూ లేరని మధ్యతరగతి రిపబ్లికన్లు గ్రహించారు. అయితే రాచరికవాదులు బేర్బోన్ వారసులు, లూయీఫిలిప్ వారసుల మధ్య చీలిపోయి రాజుగా ఎవరిని నియమించాలనే విషయాన్ని నిర్ధారించడంలో విఫలమయ్యారు. ఈ స్థానాన్ని నెపోలియన్‌కు సోదర వరుసవాడైన లూయీ బొనాపార్ట్ భర్తీచేశారు. 1848 చివరలో అతడు అధ్యక్ష స్థానాన్ని 55 లక్షల ఓట్లతో గెలుపొందాడు. అతడికి వ్యతిరేకంగా పోటీ చేసిన మధ్యతరగతి రిపబ్లికన్ నాయకుడు లెడ్రూ రాల్లిన్‌కు కేవలం నాలుగు లక్షల ఓట్లు లభించాయి. అలాగే స్వతంత్రంగా బరిలోకి దిగిన వామపక్ష విప్లవవాది రాస్పెయిల్‌కు 40,000 ఓట్లు మాత్రమే

దక్కాయి. 1851లో తదుపరి ఎన్నికలలో ఓటమి తప్పదని ఆందోళన చెందిన బొనాపార్ట్ సైనిక తిరుగుబాటును జరిపాడు. మరుసటి సంవత్సరంలో తనను తాను చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు.

1851చివరల్లో కార్ల్ మార్క్స్ ఈ కింది నిర్ధారణకు వచ్చాడు:

"మార్చి నుండి డిసెంబరు వరకు గల జర్మన్ బూర్జువావర్గ స్థూల చరిత్ర జర్మనీలో కేవలం బూర్జువావర్గంతో కూడిన విప్లవం అసాధ్యమని నిరూపించింది. భూస్వామ్య, నిరంకుశ ప్రతీఘాత విప్లవం లేదా సోషలిస్టు రిపబ్లికన్ విప్లవం ఒక్కటే సాధ్యం కాగలదు."

## దొడ్డిదారి పట్టిన బూర్జువా వర్గం

అయితే విప్లవాలు ఐరోపాను పూర్తిగా ఎలాంటి మార్పులు లేకుండా వదలలేదు. జర్మనీ, ఆస్ట్రియాలలో అవి భూస్వామ్య చెల్లింపులు, కౌలుదారీ వ్యవస్థను ఎట్టకేలకు భూస్థాపితం చేశాయి. (ఈ పరిణామం భూస్వాములను వ్యవసాయ రంగ క్యాపిటలిస్టులుగా మార్చి వేసినా వారు రైతాంగం కోసం ఏ విధంగానూ పాటుపడలేదు) జర్మనీ రాజ్యాల పాలకులు రాజ్యాంగాలను ఆమోదించారు. కొత్త రాజ్యాంగాల ప్రకారం ప్రభుత్వాలను నియమించే అధికారం పాలకులకు ఉంటుంది. కాని ధనికవర్గాలకు, కొంతమేరకు రైతాంగం, కార్మిక వర్గానికి పార్లమెంటులో ప్రాతినిధ్యం ఉంటుంది. క్యాపిటలిస్టు ప్రగతికి మార్గం సుగమం అయ్యింది. రాచరిక వ్యవస్థల కింద క్యాపిటలిస్టు ప్రగతి బూర్జువా వర్గానికి రాజ్య వ్యవహారాల్లో ప్రత్యక్ష నియంత్రణను నిరాకరించినా క్యాపిటలిస్టులకు అన్ని అడ్డంకులు తొలగిపోయాయి.

జర్మనీ తన స్వంత పారిశ్రామిక విప్లవాన్ని చవి చూసింది. పారిశ్రామిక ప్రగతివార్షిక సగటు 4.8 శాతంగా నమోదైంది. రైల్వేలు 14 శాతం అభివృద్ధిని చవిచూశాయి. 1850 తర్వాతి 30 ఏళ్లలో పెట్టుబడులు అంతకుముందు గడచిన 30 ఏళ్ల కంటే నాలుగు రెట్లు పెరిగాయి. ప్రష్యాలో పాతికేళ్ల కాలంలో బొగ్గు ఉత్పత్తి నాలుగింతలు పెరిగింది. ముడి ఇనుము ఉత్పత్తి 14 రెట్లు, స్టీలు ఉత్పత్తి 54 రెట్లు పెరిగాయి. ఆవిరిశక్తితో నడిచేయంత్రాల సంఖ్య 1,800 శాతం పెరిగింది. 1836 లో ఆల్ఫ్రెడ్ క్రప్ కేవలం 60 మంది కార్మికులనే ఉద్యోగంలో నియమించినా 1873 నాటికి అతడు 16,000 మందిని పనిలోకి చేర్చుకున్నాడు. బ్రిటన్ పారిశ్రామిక విప్లవం తర్వాత 60 ఏళ్లకు జర్మనీలో పారిశ్రామికీకరణ మొదలైనా అది అనతి కాలంతో బ్రిటన్ పారిశ్రామిక రంగం స్థాయికి చేరుకుంది. రూర్హ్‌లోని బొగ్గుగనులు దక్షిణ వేల్స్ గనులకంటే విశాలమైనవి, ఘనీకృతమైనవి. బ్రిటన్ పరిశ్రమల కంటే ఎంతో ముందు జర్మన్ రసాయన పరిశ్రమలు సింథటిక్ రంగులను ఉత్పత్తి చేశాయి.

ఈ సంవత్సరాలో ఫ్రాన్స్‌లో కూడా భారీ పరిశ్రమలు వేగంగా అభివృద్ధి చెందాయి. ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యంలోని కొన్ని భాగాలలో కూడా పారిశ్రామిక ప్రగతి నెమ్మదిగా సంభవించింది. బుర్జువావర్గం 1860 దశకంలోకి తొంగి చూస్తూ తాను 1848లో రాజకీయ పోరాటాన్ని కోల్పోయానని విశ్లేషించగలిగింది. అయితే ఈ వర్గం ఆర్థిక పోరాటంలో మాత్రం

విజయవంతమైంది. ఫ్రాన్స్‌లో ఈ వర్గాల లూయీ బొనాపార్ట్‌లో విశ్వాసం ఉంచింది. జర్మనీలో ప్రష్యన్ రాచరిక కుటుంబ అధికారాలను దాదాపు నిరంకుశంగా వినియోగించి పశ్చిమ ఐరోపాలో ఒక కొత్త, సమైక్య జర్మన్ సామ్రాజ్యాన్ని స్థాపించేందుకు డెన్మార్క్, ఆస్ట్రియా, ఫ్రాన్స్‌లపై యుద్ధం ప్రకటించిన బిస్మార్క్‌ను బూర్జువా వర్గం పూర్తిగా సమర్థించింది. పరిణామాల పట్ల హర్షం వ్యక్తం చేసింది.

1848-49లో జరిగిన జాతీయ విముక్తి ఉద్యమాలలో ఓటమిని చవిచూసిన ఇటలీ, హంగేరీ బూర్జువాలు కూడా కోలుకున్నారు. తొలుత ఆస్ట్రియా రాచరికం మిలాన్, వెనీస్ బుడాపెస్ట్‌లతోపాటు ప్రేగ్, క్రాకోవ్, జాగ్రేబ్‌లపై కూడా పాలనను కొనసాగించింది. కాని జాతి విముక్తి ఉద్యమాలు పూర్తిగా సమసిపోలేదు. ఇటలీ మధ్యతరగతిలోని కొన్ని వర్గాలలో జాతీయ సమైక్యత పట్ల ఎనలేని ఉత్సాహం ఉండేది. రైతాంగం, పట్టణ పేదలలోని కొన్ని వర్గాలు జాతీయ భావనను వ్యక్తం చేసినా (కేవలం నాలుగు శాతం జనాభా మాత్రం టుస్కన్ మాండలికాన్ని మాట్లాడేది. తర్వాతి కాలంలో అది ఇటాలియన్ భాషగా మారింది). నేపుల్స్ రాజు, లొంబార్డీకి చెందిన ఆస్ట్రియన్ పాలకుల పట్ల తీవ్రమైన ద్వేషం ఉండేది. 1850 దశకం చివరలో పైడ్మాంట్ రాజు కొలువులో మంత్రి అయిన కావూర్ ఇలాంటి భావనలను సొమ్ము చేసుకోవాలని ప్రయత్నించాడు. అతడు అతివాద జాతీయవాది అయిన మాజిని, రిపబ్లికన్ విప్లవవాది గారిబాల్డీతో ఒకవైపు, బ్రిటన్, ఫ్రాన్స్ ప్రభుత్వాలతో మరో వైపు ఒప్పందాలు కుదుర్చుకున్నాడు. సిసిలీ నగరానికి సుమారు వెయ్యి మంది విప్లవ యోధులతో (రెడ్‌షర్ట్స్) చేరుకున్న గారిబాల్డీ నేపుల్స్ రాజుకు వ్యతిరేకంగా ఆ దీవిలో తిరుగుబాటును ప్రకటించాడు. తర్వాత ఉత్తర దిశగా కదిలాడు. పైడ్మాంట్ రాజు దక్షిణ ప్రాంతానికి ఒక సైన్యాన్ని పంపాడు. ఈ సైన్యంతోపాటు విప్లవ సైన్యంతో పోరాడుతూ నేపల్స్ సైన్యం తుడిచిపెట్టుకుపోయింది. మరోవైపు ఫ్రెంచి సైన్యాలు ఆస్ట్రియన్లను లొంబార్డీ నుండి ఉపసంహరించుకునేలా ఒత్తిడి పెంచాయి. తదనంతరం కావూర్, పైడ్మాంట్ రాజు గారిబాల్డీ సైన్యాన్ని నిరాయుధం చేయడం ద్వారా తమ ఎత్తుగడను పూర్తి చేశాడు. గారిబాల్డీ అజ్ఞాత వాసంలోకి వెళ్లాల్సి వచ్చింది. అతడు దక్షిణ ఇటలీ పాలకవర్గం మద్దతును కూడగట్టాడు. ఆ పాలకవర్గం సంశయిస్తూనే మద్దతు ప్రకటించింది. తమ ప్రాబల్యం నిలవాలంటే పరిస్థితులలో మార్పు రావాల్సిన అవసరం ఉందని అది గ్రహించింది. పైడ్మాంట్ రాజులు ఇటలీ మొత్తానికి రాజులయ్యారు. అయినప్పటికీ సమైక్య దేశం ఆధునిక క్యాపిటలిస్టు ఉత్తర ప్రాంతం, వెనుకబడిన దక్షిణ ప్రాంతంగా చాలా కాలం పాటు చీలి ఉండేది. దక్షిణ ప్రాంతంలో భూస్వాములు రైతులపట్ల దాదాపు ఫ్యూడల్ పద్ధతిలో వ్యవహరించేవారు. ఆ ప్రాంతంలో మాఫియా బందిపోటుతనం రాజ్యమేలేది. అలాగే ఉన్నత స్థాయి ఎత్తుగడల ద్వారా హంగేరి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంది. క్షేత్రస్థాయి తిరుగుబాటు శక్తులను భాగస్వాములుగా తీసుకోవడం వల్లే ఈ లక్ష్యం సిద్ధించింది. 1860 దశకంలో ఆస్ట్రియన్ రాచరిక వ్యవస్థ ఫ్రాన్స్, ప్రష్యాతో యుద్ధాలు ముగిసిన తర్వాత తనను తాను ప్రక్షాళన చేసుకుంది. రెండు సమాంతర పాలనా వ్యవస్థలను ఏర్పాటు చేసింది. మొదటి వ్యవస్థను జర్మన్ భాష మాట్లాడే ప్రభుత్వం నిర్మాణం పాలించింది. అది వియన్నా పార్లమెంటుకు పాక్షికంగా బాధ్యత వహించేది. ఆస్ట్రియా, చెక్ భూభాగాలు, క్రాకోవ్ చుట్టూ ఉన్న పోలిష్ ప్రాంతాన్ని, స్లావ్‌భాష మాట్లాడే స్లోవేకియా రాష్ట్రాన్ని ఈ ప్రభుత్వం పాలించింది. రెండవ

వ్యవస్థను హంగేరియన్ భాష మాట్లాడే ప్రభుత్వనిర్మాణం బుడాపెస్ట్ కేంద్రంగా హంగేరి, స్లోవేకియా, రోమన్‌భాష పాక్షికంగా మాట్లాడే ట్రాన్సిల్వేనియా, సెర్బో-క్రొయేషియన్ రాష్ట్రాలైన క్రొయేషియా, (టర్కీతో ఘర్షణలఅనంతరం) బోస్నియాలను పాలించింది.

అయితే ఐరోపాలోని రెండు పాత జాతి విముక్తి ఉద్యమాలు పూర్తి అసంతృప్తితో మిగిలిపోయాయి. ఐర్లాండ్‌లో 1840 దశకం చివరలో ఫ్రెంచి విప్లవ కాలం నాటి జాతీయవాదం మళ్లీ చిగురించింది. అప్పట్లో జాతీయవాదాన్ని 1798లో తీవ్రంగా అణచి వేశారు. ఆ కాలంలో సంభవించిన భయంకరమైన కరువు ఐర్లాండ్ ఆర్థిక వ్యవస్థకు మానవులు కలిగించిన తీవ్రమైన నష్టాన్ని ప్రతిబింబించింది. సంక్షోభం కారణంగా ఐర్లాండ్ బ్రిటీషు పాలకవర్గానికి పూర్తిగా దాసోహమైంది. కరువు కారణంగా సుమారు పది లక్షల మంది మరణించారు. మరో పది లక్షల మంది వలసపోయారు. జనాభా సగానికి సగం పడిపోయింది. చివరకు ప్రాబల్యం ఉన్న రాజ్యాంగ బద్ధుడైన రాజకీయనాయకుడు డానియల్ ఓ కానెల్ ఇతడు సమైక్య రాజ్యం (యునైటెడ్ కింగ్‌డమ్) పరిధిలో ఉంటూ జీవితాంతం ఐరిష్ కాథలిక్‌ల హక్కుల కోసం పోరాడాడు) కూడా స్వాతంత్ర్యం అంశాన్ని లేవనెత్తాల్సి వచ్చింది.

అయితే మధ్యతరగతికి చెందిన అతివాదులతరం ఇంకా ముందుకు వెళ్లి గణరాజ్యంకోసం పోరాడాల్సిన అవసరం ఉందని భావించింది. 1848లో తిరుగుబాటు జరపడానికి వారుచేసిన ప్రయత్నాన్ని విచ్ఛిన్నం చేశారు. కాని అప్పటి నుండి బ్రిటీషు రాజకీయ జీవితానికి 'ఐరిష్ సమస్య' కీలకంగా మారింది.

ఐరోపాలోని ఒక దిశలో ఐరిష్ అంశాన్ని పరిష్కరించడంలో చవి చూసిన వైఫల్యం మరో దిశలో పోలిష్ జాతీయవాదం కొనసాగించిన నిరంతర సంఘర్షణతో సరితూగింది. పోలెండ్ రాజ్యాన్ని రష్యా, ప్రష్యా, ఆస్ట్రియాల మధ్య విభజించే (1790 దశకంలో) ఆలోచనతో పోలిష్ పాలకవర్గం ఎన్నడూ ఏకీభవించలేదు. 1830 దశకంలో, 1860 దశకంలో మరోసారి వారు రష్యన్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు జరిపారు. పోలిష్ పాలకవర్గం భూస్వాములతో నిండి ఉండేది. వారు పోలిష్ ప్రజలపైనే కాకుండా బైలోరష్యన్, యుక్రెనియన్, యూదు దిగువ శ్రేణి వర్గాలపైన కూడా ఆధిపత్యం చెలాయించేవారు. అయినప్పటికీ రష్యన్ జార్‌కు వ్యతిరేకంగా వారు చేపట్టిన పోరాటం వారిని 1814, 1848ల తర్వాత ఐరోపా అంతటిపై మోపిన ప్రతీఘాత విప్లవ నిర్మాణంతో ఘర్షణలోకి లాగింది. ఫలితంగా ఐరోపా అంతటా విస్తరించి ఉన్న విప్లవవాదులు, ప్రజాతంత్ర సమర్థకులతో ఉమ్మడి లక్ష్యాన్ని నిర్ధారించారు. బ్రిటీషు చార్టిస్టువాదులు. ఫ్రెంచి రిపబ్లికన్లు, జర్మన్ కమ్యూనిస్టులకు పోలిష్ పోరాటం స్వంత పోరాటంగా మారింది. అజ్ఞాతంలో ఉన్న పోలిష్ పాలకవర్గ సభ్యులు ఇటలీ, దక్షిణ జర్మనీ, హంగేరీ, పారిస్‌లలో విప్లవ శక్తుల పక్షాన పోరాడుతూ కనిపించారు.

## ఎనిమిదవ అధ్యాయం

# అమెరికా అంతర్యుద్ధం

ఏప్రిల్ 12, 1861న దక్షిణ కారోలీనా స్వచ్ఛంద సైనికులు ఫోర్ట్ సమ్టర్‌లో అమెరికా సంయుక్త రాష్ట్రాల ఫెడరల్ బలగాలపై కాల్పులు జరిపారు. చార్ల్స్‌టన్ ఓడరేవుకు అభిముఖంగా ఫోర్ట్ సమ్టర్ ఉంది. కాల్పులు జరపడం ద్వారా స్వచ్ఛంద సైనికులు నాటకీయమైన పద్ధతిలో అబ్రహామ్ లింకన్ ఆధిపత్యాన్ని, అప్పుడే స్థాపించబడిన రిపబ్లికన్ పార్టీని వ్యతిరేకించారు. వీరంతా బానిసలు కలిగిన దక్షిణ రాష్ట్రాల అభిమతాన్ని వ్యక్తం చేశారు.

ఆ క్షణం వరకు అభిప్రాయ భేదాలు (బానిస వ్యవస్థ కొనసాగింపుపై) సాయుధ ఘర్షణకు దారి తీయగలదని కేవలం కొద్ది మంది ప్రజలు మాత్రమే భావించారు. ఒక నెల ముందు లింకన్ అధ్యక్ష పదవిని చేపట్టారు. తన ఏకైక కర్తవ్యం కొత్తగా ఏర్పరచిన పశ్చిమోత్తర ప్రాంతాలలో 'స్వేచ్ఛాశ్రమ'ను పరిరక్షించడమేనని ఆయన పలు మార్లు ఉద్ఘాటించారు. ఆయన బానిస వ్యవస్థను వ్యతిరేకించినప్పటికీ దక్షిణ రాష్ట్రాలలో బానిసత్వాన్ని రద్దు చేయాలని కోరుకోలేదు. 1858లో ఒక చర్చ సందర్భంగా లింకన్ ఇలా వాదించారు : "బానిస వ్యవస్థలు అమల్లో ఉన్న రాష్ట్రాలలో జోక్యం చేసుకోవాల్సిన అవసరం నాకు ఏ మాత్రం లేదు." 1861లో ఎన్నికల ప్రచారం సందర్భంగా కూడా ఆయన ఈ విషయాన్ని నొక్కి చెప్పారు. ఒకవైపు సంయుక్త రాష్ట్రాల నుండి వేరు కావాలని దక్షిణ రాష్ట్రాల సమాయత్తం అవుతుండగా మరోవైపు కాంగ్రెస్ దక్షిణంలో బానిస వ్యవస్థకు ఎలాంటి భంగం వాటిల్లకుండా మధ్యేమార్గాన్ని అన్వేషించడంలో మునిగిపోయింది. బానిస వ్యవస్థను రద్దు చేయాలని డిమాండ్ చేసిన వారు కాంగ్రెస్‌లోనూ, ఉత్తర ప్రాంత ప్రజానీకంలోనూ స్వల్ప సంఖ్యలో ఉండేవారు. చివరకు వారికి ప్రాబల్యం ఉన్న బోస్టన్‌లో కూడా ప్రత్యర్థి సమూహాలు వారి సమావేశాలను అడ్డుకొని రభస సృష్టించేవి.

ఫోర్ట్ సమ్టర్‌పై బాంబుల వర్షం కురిపించడానికి మూడు రోజుల ముందు బానిస వ్యతిరేక నాయకులు అంతర్యుద్ధం అసాధ్యమని ధృవపర్చుకున్నారు. బానిసలు కలిగి ఉన్న రాష్ట్రాల డిమాండ్లకు ఫెడరల్ ప్రభుత్వం తలొగ్గుతుందని భావించారు. నల్లజాతీయుడైన ఫ్రెడరిక్ డగ్లస్ ఇలా రాశాడు : "విద్రోహ, తిరుగుబాటు చర్యలను బలంతో అణచివేయగలమన్న డాంబికాలన్నీ చేతకానివి, నిరర్ధకమైనవి. గోతిలో పడిపోయిన తాగుబోతు ప్రగల్భాలను అవి

గుర్తుకు తెస్తాయి. మన ప్రభుత్వాన్ని బానిసత్వం ఆవహించింది." అయినప్పటికీ ఫోర్ట్ సమ్టర్ వద్ద జరిగిన కాల్పులు సంయుక్త రాష్ట్రాల చరిత్రలోనే అత్యంత రక్తసిక్తమైన యుద్ధానికి నాందిపలికాయి. ఈ అంతర్యుద్ధంలో ఎక్కువ మంది పౌరులు ప్రాణాలు కోల్పోయారు. మృతుల సంఖ్య అమెరికా స్వాతంత్ర్య పోరాటం, ప్రథమ ప్రపంచ యుద్ధం, ద్వితీయ ప్రపంచ యుద్ధం, కొరియన్ యుద్ధం,వియత్నాం యుద్ధంలో చనిపోయిన మొత్తం అమెరికన్ పౌరులు, సైనికుల కంటే చాలా ఎక్కువగా ఉంది.

## పూడ్చలేని అగాధం

సాధారణ పొరపచ్చాల కంటే ఇక్కడ మరెంతోలోతైన విషయం దాగి ఉండేది. సమాజాన్ని నిర్వహించే మౌలికమైన పద్ధతులపై తీవ్రమైన అభిప్రాయ భేదాలు ఉండేవి.

బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా చేపట్టిన విప్లవం నుండి సంయుక్త రాష్ట్రాలు ఉద్భవించాయి. కొత్త సమాజంలో ఆర్థిక నిర్వహణకు రెండు విభిన్నమైన స్వరూపాలు ఉండేవి. అవి రెండు విస్తరిస్తున్న ప్రపంచ మార్కెట్‌కు అనుగుణంగా చర్యలు తీసుకునేవి. ఉత్తర ప్రాంతంలో సన్నకారు రైతులు, వృత్తిదారులు, వేతనకార్మికుల (చిన్న కర్మాగారాలలో పని చేసే) "స్వేచ్ఛాశ్రమ" అమలులో ఉండేది. దక్షిణప్రాంతంలో బానిసలు కలిగిన తోట యజమానుల ఆధిపత్యం ఉండేది. అయితే మెజారిటీ శ్వేతజాతీయులు సన్నకారురైతులు, వృత్తిదారులు, బానిసల యాజమాన్యం లేని కార్మికులుగా ఉండేవారు.

బానిస వ్యవస్థ, స్వేచ్ఛాశ్రమ కలిగిన ఈ రెండు ప్రాంతాల మధ్య ఈ వైరుధ్యం తొలి నాళ్లలో రాజకీయ నాయకులకు ఒక తీవ్రమైన సమస్యగా కనిపించలేదు.

ఆయా ప్రాంతాలు భౌగోళికంగా విభజించబడి ఉండేవి. చివరకు జెఫర్‌సన్ లాంటి దక్షిణ ప్రాంత వాసులు (బానిసలు కలిగిన ఈ వ్యక్తి ఎలాంటి సంకోచం లేకుండా స్వాతంత్ర్య ప్రకటనను రూపొందించాడు, 1800లో అధ్యక్ష పదవిని చేపట్టాడు) కూడా బానిస వ్యవస్థకు కాలం చెల్లిందని భావించారు. ఎంతైనా బానిస శ్రమ కంటే స్వేచ్ఛాశ్రమ ఎప్పుడూ ప్రభావవంతంగా, లాభదాయకంగా ఉండగలదని ఆడమ్‌స్మిత్ నిరూపించి ఉన్నాడు.

అయితే ఈ భావన లాంకషైర్ కాటన్ మిల్లుల దాహాన్ని తీర్చేందుకు విశాలమైన పత్తి క్షేత్రాలు ఏర్పడక ముందు ఉండేది. 1790లో దక్షిణ ప్రాంతంలో సంవత్సరానికి కేవలం 1,000 టన్నుల పత్తిని మాత్రమే పండించేవారు. 1860 నాటికి ఈ సంఖ్య 10 లక్షల టన్నులకు చేరుకుంది. ముఠామేస్త్రీల ఆధ్వర్యంలో పని చేసే బానిస బృందాలు సాగుకు అనువైన సాధనంగా ఉండేవి. వీరు పత్తిని పెద్ద ఎత్తున ఉత్పత్తి చేసేవారు, మంచి దిగుబడిని సాధించేవారు. 1860 నాటికి సుమారు 40 లక్షల మంది బానిసలు ఉండేవారు.

కాని తోట యజమానులు కేవలం బానిసలను మాత్రమే కోరుకోలేదు. పత్తి కోసం ఉన్న భారీ విదేశీ డిమాండ్‌కు అనుగుణంగా మరింత భూమిని కావాలని కోరుకున్నారు. అమెరికా ప్రభుత్వం స్పెయిన్ నుండి ఫ్లోరిడాను, ఫ్రాన్స్ నుండి లూసియానాను కొనుగోలు చేసినప్పుడు వీరికి కొంత భూమి లభించింది. కొన్ని ఇండియన్ దేశాలకు కేటాయించిన భూమిని బలవంతంగా స్వాధీనం చేసుకున్నారు (ఈ ఇండియన్ దేశాలు పశ్చిమానికి వెయ్యి మైళ్ల దూరంలో దుర్భరమైన, తీవ్రమైన కష్టాలను అనుభవించేవి). మెక్సికోతో జరిగిన యుద్ధంలో

భూస్వాములు విశాలమైన భూములను హస్తగతం చేసుకున్నారు. అది కూడా చాలలేదు. ఇప్పుడు వారు మిస్సిసిపి, పసిఫిక్‌ల మధ్య నిర్మానుష్యంగా ఉన్న ప్రాంతంపై దృష్టి సారించారు. ఈ ప్రాంతం అప్పటి రాష్ట్రాల ఉమ్మడి విస్తీర్ణం కంటే ఎంతో విశాలంగా ఉండేది.

19వ శతాబ్దం మధ్య దశకాల నాటికి ఉత్తర రాష్ట్రాలు కూడా భారీగా మార్పులను చవిచూశాయి. ఐరోపాలోని పేద, వెనుకబడిన ప్రాంతాల నుండి వలసదారులు వరుసగా వచ్చి చేరడంతో ఉత్తర రాష్ట్రాల జనాభా మళ్లీ మళ్లీ పెరిగింది. వలసవాదులు సన్నకారు రైతులగానో, మంచి వేతనాలు లభిస్తే కార్మికులుగానో స్థిరపడాలనే ఆశతో వచ్చారు. మరోవైపు జనాభా పెరుగుదల ఉత్పత్తిదారులు, వ్యాపారులకు ఒక కొత్త, విశాలమైన మార్కెట్‌ను సృష్టించింది. న్యూ ఇంగ్లాండ్ జౌళి ఉత్పత్తులు 40 లక్షల గజాల నుండి (1817లో) 3080 లక్షల గజాలకు (1837) చేరుకుంది. 1860 నాటికి జౌళి ఉత్పత్తిలో అమెరికా రెండవ స్థానాన్ని ఆక్రమించింది. బ్రిటన్‌తో పోలిస్తే వెనుకబడి ఉన్నప్పటికీ దానితో సరిసమానంగా ఎదిగింది. ఉత్తర రాష్ట్రాలకు చెందిన స్వేచ్ఛా పౌరులు భూమి కోసం తను కలలను నిజం చేసుకోవడానికి పశ్చిమ ప్రాంతంపై దృష్టి సారించారు. మరోవైపు ఉత్తర ప్రాంత క్యాపిటలిస్టులు ఆ ప్రాంతాన్ని లాభార్జనకు అనువైన స్థావరంగా పరిగణించారు.

"రవాణా రంగ విప్లవం" తీవ్ర ప్రభావాన్ని చూపింది. న్యూయార్క్‌ను గ్రేట్ లేక్స్, మిడ్‌వెస్ట్‌లతో కాలువలు అనుసంధానం చేశాయి. మరోవైపు మిడ్‌వెస్ట్ మెక్సికన్ ఎడారితో అనుసంధానమై ఉండేది. ఈ రెండుప్రాంతాల మధ్య ఒహాయో, మిస్సిసిపి, మిస్సోరిలు కీలక ఓడరేవులుగా ఉండేవి. ఆవిరితో నడిచే నావలు ఈ ప్రాంతంలో పెద్ద ఎత్తున రాకపోకలు సాగించేవి. 1860 నాటికి 30,000 మైళ్ల పొడవున రైల్వేలు విస్తరించాయి. ప్రపంచంలోనే అతిపెద్ద రైల్వే వ్యవస్థ సంయుక్త రాష్ట్రాలలో ఏర్పాటైంది. మనుగడ కోసం వ్యవసాయం చేసిన సముదాయాలు ప్రతిచోటా మార్కెట్‌తో అనుసంధానమయ్యాయి. రాష్ట్రాల మధ్య, దక్షిణ, ఉత్తర ప్రాంతాల మధ్య ఉన్న ఎడబాటు గత చరిత్రగా మిగిలిపోయింది.

మిస్సిసిపికి పశ్చిమాన ఉన్న ప్రాంతాన్ని నియంత్రించే అంశాన్ని నిరంతరం వాయిదా వేయడం కుదరలేదు. ఎందుకంటే మరెన్నో అంశాలు దానితో ముడిపడి ఉండేవి. ఉత్తర ప్రాంత క్యాపిటలిస్టుల్లోని కొన్ని ముఖ్యమైన వర్గాలు తమ ఉత్పత్తులు, మార్కెట్లను బ్రిటీషు క్యాపిటలిస్టుల నుండి కాపాడుకోవడానికి ఎగుమతులపై పన్నులు విధించాలని ప్రభుత్వాన్ని కోరాయి. అయితే దక్షిణ ప్రాంత పత్తి ఆర్థిక వ్యవస్థ బ్రిటీషు పత్తి పరిశ్రమతో చాలా దగ్గరగా ముడిపడి ఉండేది. స్వేచ్ఛా వాణిజ్యానికి ఎలాంటి ముప్పు తెచ్చినా సహించేది లేదని ఆ ప్రాంతం స్పష్టం చేసింది. ఈ పరిస్థితుల్లో ఎవరి ప్రయోజనాలను ఫెడరల్ ప్రభుత్వ విదేశాంగ విధానం పరిరక్షించాలి?

సుమారు అరశతాబ్దంపాటు తోట యజమానులు తమ మాటను నెగ్గించుకున్నారు. 1820లో మిస్సోరి, 1840లో టెక్సాస్ ఫెడరల్ యూనియన్‌లో బానిస రాష్ట్రాలుగా చేరాయి. 1850 దశకంలో ఫెడరల్ సైనికులు పారిపోయిన బానిసలకు వ్యతిరేకంగా కొత్త చట్టాన్ని తీసుకు వచ్చారు. బోస్టన్ లాంటి ఉత్తర నగరాలలో ప్రజలను పట్టుకొని దక్షిణంలోని వారి యజమానులకు అప్పగించారు. ఆ తర్వాత 1854లో డెమోక్రటిక్ పార్టీ అధ్యక్షుడు, కాంగ్రెస్‌లు,

కాన్సాస్, ఇతర పశ్చిమ ప్రాంతాలలో బానిస వ్యవస్థను కొనసాగించాలని నిర్ణయించారు. అయితే మెజారిటీ శ్వేతజాతీయులు అందుకు అంగీకరించాల్సి ఉంటుందని చెప్పారు. అంటే పశ్చిమ ప్రాంతాల్లో ఉత్తర రాష్ట్రాలకు చెందిన స్వేచ్ఛా వలసవాదులు వచ్చి స్థిరపడకముందే బానిస వ్యవస్థను సమర్థించే దక్షిణ ప్రాంత యజమానులు తమ ధనబలాన్ని వినియోగించి అక్కడ పట్టును సాధించాల్సి ఉంటుంది.

ఈ వ్యవహారం బానిస వ్యవస్థ వ్యతిరేక ఉద్యమానికి తీవ్ర ఆగ్రహాన్ని కలిగించింది. బానిస వ్యవస్థ వ్యతిరేకులలో మానవీయ విలువలున్న శ్వేతజాతీయులతోపాటు స్వేచ్ఛను కోరుకునే నల్లజాతీయులు కూడా ఉండేవారు. ఈ ఉద్యమం న్యూ ఇంగ్లాండ్‌లో గణనీయమైన పట్టును సంపాదించుకుంది. ఈ ప్రాంతంలో బానిసత్వం ఏ స్థాయిలోనూ ఎన్నడూ కొనసాగలేదు. 'స్వేచ్ఛాభూమి'ని సమర్థించే మిగతా ఉత్తర ప్రాంతీయులను కూడా ఫెడరల్ ప్రభుత్వ చర్య రెచ్చగొట్టింది (వీరిలో జాత్యహంకార భావన కలిగిన వారు అనేక మంది ఉన్నా అదే పెద్ద సమస్య కాలేదు). పశ్చిమ భూభాగాన్ని కొత్త వలసవాదుల కోసం చిన్న చిన్న వ్యవసాయ క్షేత్రాలుగా విభజించడాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకించారు. అధ్యక్ష పీఠం, కాంగ్రెస్, సుప్రీం కోర్టులపై నియంత్రణ కలిగిన తోట యజమానులు పశ్చిమ భూభాగాన్ని పూర్తిగా హస్తగతం చేసుకోగలరని పై రెండు వర్గాలు ఆందోళన చెందాయి. రైతులుగా స్థిరపడాలని కలలు గన్న వారికి ఇలాంటి పరిణామం శరాఘాతంగా మారగలదు. పారిశ్రామిక పెట్టుబడి కేవలం కొన్నిరాష్ట్రాల (ఈశాన్య)కే పరిమితం కాగలదు. తోట యజమానులు సమీప భవిష్యత్తులో ప్రభుత్వంపై పూర్తి ఆధిపత్యం సాధించగలదు.

'స్వేచ్ఛాశ్రమ' వలసవాదులు, బానిస వ్యవస్థ సమర్ధకుల మధ్య తీవ్రమైన అంతర్యుద్ధానికి కాన్సాస్ వేదికగా మారింది. బానిస వ్యవస్థ సమర్ధకుల మిస్సోరి సరిహద్దును దాటుకొని వచ్చి మరీ పోరాడారు.దేశమంతటా ప్రజాభిప్రాయం చీలిపోయింది. ఉత్తర ప్రాంతంలో ఇది ఒక కొత్త రాజకీయ పక్షం ఏర్పడడానికి దారి తీసింది. అదే రిపబ్లికన్ పార్టీ. 1860 అధ్యక్ష ఎన్నికల్లో ఆ పార్టీ అభ్యర్థిగా అబ్రహామ్ లింకన్ బరిలోకి దిగాడు.

వర్గాలకు అతీతంగా ఆ పార్టీ ప్రజల మద్దతును కూడగట్టింది. బడా వ్యాపారులలో కొన్ని వర్గాలు, రైతులు, వృత్తిదారులు, కార్మికులు ఒకే తాటిపై నిలిచి పశ్చిమ ప్రాంతాలను స్వేచ్ఛాశ్రమ కోసం పరిరక్షించాలని కంకణం కట్టుకున్నారు. దీని అర్థం జాత్యాహంకారానికి ఉమ్మడి వ్యతిరేకత అని భావించరాదు. బానిస వ్యవస్థను రద్దు చేయాలని డిమాండ్ చేసేవారి సంఖ్య బలంగానే ఉండేది.వారిలో జాన్‌బ్రౌన్‌ను బహిరంగంగా ప్రశంసించేవారు కూడా ఉన్నారు. 1859లో (డిసెంబరు) వర్జీనియాలోని హార్పర్స్ ఫెర్రీ వద్ద ఫెడరల్ ఆయుధాగారాన్ని నల్ల, శ్వేతజాతీయులతో కలిసి ముట్టడించినందుకు జాన్‌బ్రౌన్‌ను ఉరి తీశారు. ఆ ముట్టడి లక్ష్యం స్థానిక బానిసలకు విముక్తి కల్పించడమే. కాని జాత్యహంకార భావనలను ఆమోదించే వారి సంఖ్య కూడా ఎక్కువగా ఉండేది. కొన్ని స్వేచ్ఛాశ్రమ రాష్ట్రాలు కూడా నల్లజాతీయులకు ఓటు హక్కును నిరాకరించాయి. మరికొన్ని రాష్ట్రాలు నల్లజాతీయులకు తమ భూభాగాల్లో జీవించే హక్కునే రద్దు చేశాయి. 1860 కాలం నాటి న్యూయార్క్ శ్వేతజాతీయులకు ఏ ప్రాతిపదికన అయితే ఓటు హక్కును కల్పించారో అదే ప్రాతిపదికన నల్లజాతీయులకు కూడా ఓటు హక్కును

ప్రసాదించడానికి నిరాకరించింది. ఈ అంశంపై జరిగిన ప్రజాభిప్రాయ సేకరణ (రెఫరండం)లో ప్రతి ఒక్కరికి ఇద్దరు చొప్పున వ్యతిరేక ఓటు వేశారు. ఇదే ప్రాంతం లింకన్‌కు స్పష్టమైన మెజారిటీ ఇచ్చిన విషయాన్ని మరచిపోకూడదు.

జాత్యహంకారం కంటే స్వేచ్ఛాశ్రమకు ప్రాధాన్యతనిచ్చి దానిని ఎన్నికల అంశంగా మార్చడంవల్లే రిపబ్లికన్ పార్టీకి ఉత్తర రాష్ట్రాలలో విపరీతమైన ప్రజాస్పందన లభించింది. ఎన్నికల ప్రచారం సందర్భంగా బానిస వ్యవస్థ అంశాన్ని పెద్దగా లేవనెత్తకపోవడం కూడా ఆ పార్టీకి లాభించింది. ఈ వైఖరిని లింకన్ వ్యక్తీకరించాడు. దాని ఆధారంగానే అతడు ఉత్తర రాష్ట్రాలలో 54 శాతం ఓట్లను, దేశ వ్యాప్తంగా 40 శాతం ఓట్లను సాధించాడు. కాన్సాస్ అంశంపై డెమోక్రటిక్ పార్టీలో ఉత్తర, దక్షిణ విభాగాల మధ్య చీలిక రావడంతో లింకన్ అధ్యక్ష పదవిని చేపట్టగలిగాడు.

అయితే లింకన్ ఉదారవాద వైఖరి ఎలా ఉన్నప్పటికీ తోట యజమానులు అతడి ఎన్నికను ప్రమాదంగా భావించారు. అందుకు అనుగుణంగా ప్రతిస్పందించారు. వారి విషయానికి వస్తే మొత్తం సమాజ మనుగడకే ముప్పు పొంచి ఉంది. తాము విస్తరించకపోతే సమాజం పతనమవుతుంది. మరోవైపు లింకన్ అధ్యక్ష పదవీకాలం ఆ విస్తరణను అడ్డుకుంటుంది. తాము విధ్వంసం సృష్టించకపోతే దక్షిణ ప్రాంతంపై తమకు ఉన్న పట్టు సన్నగిల్లగలదని కొందరు భయపడ్డారు. ఎందుకంటే మూడింట రెండొంతుల మంది శ్వేతజాతీయులు ఒక్క బానిసను కూడా కలిగి లేరు. వీరు ఉత్తరంలో ఆవిర్భవించిన ఆలోచనలపట్ల ఆకర్షితులయ్యే ప్రమాదం ఉండేది.

పత్తిని విస్తారంగా పండించే ఏడు దక్షిణ రాష్ట్రాలు - ఈ రాష్ట్రాలలో బానిసలు జనాభాలో సుమారు 50 శాతం ఉండేవారు- సంయుక్త రాష్ట్రాల నుండి వేరుపడుతున్నట్లు ప్రకటించి ఆయుధాలను సమకూర్చుకోవడం మొదలుపెట్టాయి. ఏప్రిల్‌లో అవి చొరవ తీసుకొని ఫోర్ట్ సమ్టర్‌పై దాడి చేశాయి. ఒక్కసారి సాయుధ సంఘర్షణలు చెలరేగితే మిగతా బానిస రాష్ట్రాలు కూడా తమతో జత కట్టగలవని అవి 200 సరిగ్గా అంచనా వేశాయి. (మిగతా ఏడు రాష్ట్రాలలో నాలుగు వారితో చేరాయి) కాని 16,000 మంది సైనికులను మాత్రమే కలిగి ఉన్న లింకన్ ప్రభుత్వం తమ డిమాండ్లకు తలొగ్గక తప్పదన్న తప్పుడు భావనతో వ్యవహరించాయి.

## సుదీర్ఘమైన సందిగ్ధత

క్రమబద్ధంకాని బలగాల మధ్య చిన్న స్థాయి ఘర్షణలతో మొదలయ్యే అలవాటు అంతర్యుద్ధాలకు ఉంది. క్రమంగా అవి భారీ ఘర్షణల స్వరూపాన్ని సంతరించుకుంటాయి. ఈ అంతర్యుద్ధం అందుకు మినహాయింపు కాదు.

ఫోర్ట్ సమ్టర్‌పై దాడి జరిగిన వెంటనే ఆ సంఘటన ఉత్తర ప్రాంతంలో దేశభక్తి భావన తీవ్ర రూపం దాల్చింది. ప్రతి గ్రామంలోనూ యుద్ధ సభ జరిగింది. రాష్ట్రాలు ఫెడరల్ ప్రభుత్వానికి కిరాయి సైన్యాలను సమకూర్చడానికి పోటీ పడ్డాయి. కొత్త సైన్యంలో చేరడానికి యువకులు స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు. బానిస వ్యవస్థ రద్దు కోసం ఉద్యమిస్తున్న

కార్యకర్తలు ఉన్నట్లుండి తమ సమావేశాలకు విపరీతమైన స్పందన లభించడాన్ని గమనించారు. ప్రజలు ఎంతో ఆసక్తితో వారి సమావేశాలకు హాజరయ్యారు. ఒక బోస్టన్ కార్యకర్త ఇలా నివేదించాడు? "ఉత్తర ప్రాంతం మొత్తం ఒక యూనిట్‌గా ఏర్పడింది. యువకులు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, బాలలు, బాలికలు దేశభక్తితో ఉరకలేస్తున్నారు. బానిస రాష్ట్రాలలోకి విముక్తి సైన్యాన్ని పంపేందుకు సమయం ఆసన్నమైంది." విప్లవాలలో కనిపించే ఏదో ఒక భావన ఈ ప్రాంతంలో ఉండేది. ఉన్నట్లుండి ప్రజలు కొత్త ఆలోచనల పట్ల ఆసక్తిని పెంచుకున్నారు. బానిస వ్యవస్థ వ్యతిరేక ప్రచారకుడు వెండెల్ ఫిలిప్స్ ప్రకటనను అచ్చు వేసిన దిన పత్రికలు రెండు లక్షల కాపీలు అమ్ముడుపోయాయి. ఫ్రెడంక్ డగ్లస్ లాంటి ఉపన్యాసకులు ఎక్కడికి వెళ్లినా ప్రజలు ఘనంగా స్వాగతం పలికారు. మహిళలు రాజకీయాలలో పాలుపంచుకోవడాన్ని తీవ్రంగా వ్యతిరేకించే వారు కూడా బానిస వ్యతిరేక కార్యకర్త, 18 ఏళ్ల యువతి అయిన అన్నా డికిన్‌సన్ ప్రసంగాన్ని శ్రద్ధగా ఆలకించారు. ఇలాంటి సభలకు ప్రజలు భారీ సంఖ్యలో హాజరయ్యేవారు.

అయినప్పటికీ 18నెలలపాటు ఉత్తర రాష్ట్రాలు కొనసాగించిన యుద్ధం ఈ విప్లవ భావనకు పూర్తి విరుద్ధంగా జరిగింది. యుద్ధం పక్షాన ఉత్తర ప్రాంతాన్ని గట్టిగా నిలబెట్టడానికి ఏదో ఒక విధంగా ఉదారవాద అభిప్రాయంతో రాజీ పడడమే ఏకైక మార్గమని లింకన్ నమ్మాడు. అతడి నమ్మకం సరైనది కావచ్చు లేదా తప్పైనా కావచ్చు. ఉత్తరప్రాంత డెమోక్రాట్లతో అతడు రాజీపడ్డాడు. వీరికి బానిస వ్యవస్థ పట్ల ఎలాంటి అభ్యంతరం లేకున్నా దేశాన్ని సమైక్యంగా ఉంచాలని కోరుకున్నారు. సరిహద్దు రాష్ట్రాలైన మేరీలాండ్, డెలావరె, కెంటకీల నాయకులు యూనియన్‌లోనే ఉండాలని నిర్ణయించారు. పై మూడు రాష్ట్రాలలో బానిస యాజమాన్యం చాలా తక్కువ స్థాయిలో ఉండేది. ప్రభుత్వంలోని కీలక పదవులలో ఉదారవాదులను నియమించిన లింకన్ ఉత్తర సైన్యం కమాండ్‌ను కూడా డెమోక్రాట్, దక్షిణ బానిస వ్యవస్థ సమర్థకుడు మెక్‌క్లెల్లాన్‌కు అప్పగించాడు. అప్పటికే ఉత్తర సైన్యం బుల్‌రన్ వద్ద జరిగిన యుద్ధంలో తీవ్రమైన పరాభవాన్ని ఎదుర్కొంది. మిస్సోరీలో బానిసలందరికీ విముక్తి కల్పిస్తూ పశ్చిమ సరిహద్దు కమాండర్ ఫ్రెమాంట్ జారీ చేసిన ఉత్తర్వును మెక్‌క్లెల్లాన్ రద్దు చేశాడు. పారిపోయి వచ్చి యూనియన్ సైన్యాలలో చేరిన బానిసలను వారి యజమానులకు తిరిగి అప్పగించాలని కూడా సూచించాడు.

ఉదారవాద విధానం యుద్ధాన్ని గెలిపించదని అనతి కాలంలోనే స్పష్టమైంది. మెక్‌క్లెల్లాన్ అత్యంత పకడ్బందీ విధానాన్ని అనుసరించాడు. వాషింగ్టన్ ప్రాంతంలో భారీ సైన్యాన్ని నిర్మించి ఆ తర్వాత దగ్గరలో ఉన్న రిక్‌మండ్ రాష్ట్ర రాజధానిలోకి చొచ్చుకుపోవాలని వ్యూహం పన్నాడు. తమ సామాజిక వ్యవస్థను మార్చకుండా కేవలం రాష్ట్రాలను యూనియన్ పరిధిలో ఉంచాలని కోరుకున్న నాయకుల రాజకీయాలతో క్లెల్లాన్ విధానం బాగా ఇమిడిపోయింది. అయితే సైనిక విధానంగా అది పూర్తిగా విఫలమైంది. యుద్ధం మొదలై 18 నెలలు దాటినా పోరాట సీమలు ప్రారంభ దిశలో ఎలా ఉండేవో అలాగే ఉండిపోయాయి. మిస్సిసిపి వెంట ఉత్తర సైన్యాలు సాధించిన విజయాలు తప్ప ఎలాంటి పురోగతి కనిపించలేదు. ఫ్రాన్స్ వైశాల్యంతో పోల్చదగిన ప్రాంతం అప్పటికీ దక్షిణ రాష్ట్రాల నియంత్రణలోనే ఉంది.

ఉత్తర ప్రాంతంలో సైనికుల మనోధైర్యం క్షీణిస్తూ వచ్చింది. యుద్ధాన్ని పూర్తిగా సమర్థించిన వారిలోకూడా విజయం అసాధ్యమనే భావన పెరిగిపోయింది.

అయితే యుద్ధం ఏ ఫలితానికీ దారి తీయడం లేదన్న భావన బానిస వ్యతిరేక ఉద్యమకారులకు కొత్త ప్రజాపునాదిని సృష్టించింది. శారీరక శ్రమ చేయడానికి 40 లక్షల మంది బానిసలు అందుబాటులో ఉండడంవల్లే దక్షిణ ప్రాంతం ఇతర స్వేచ్ఛా పౌరులను యుద్ధం కోసం సమీకరించగలిగిందని ఉద్యమకారులు గుర్తు చేశారు. అందుకు భిన్నంగా సైన్యంలో ఖాళీలను భర్తీ చేయడానికి ఉత్తర ప్రాంతం తీవ్రమైన సమస్యలను ఎదుర్కొంది. బానిసలకు స్వాతంత్ర్యాన్ని కల్పిస్తూ ప్రకటన జారీ చేయడం ద్వారా లింకన్ దక్షిణ రాష్ట్రాల ఆర్థిక వ్యవస్థను కృంగదీయాలని, నల్లజాతి సైనికులను భర్తీ చేయడం ద్వారా ఉత్తర సైన్యాలను బలోపేతం చేయాలని ఉద్యమకారులు డిమాండ్ చేశారు.

ఉద్యమనేత వెండేల్ ఫిలిప్స్ లింకన్ విధానాన్ని ఒక ప్రముఖ ప్రసంగంలో తీవ్రంగా విమర్శించాడు :

> "మెక్‌క్లెల్లాన్ ద్రోహి అని నేను చెప్పడం లేదు. కాని అతడు ద్రోహి అయినట్లయితే అతడు కూడా అతడు చేసినట్లే ప్రవర్తించేవాడు. రిక్‌మండ్ గురించి బెంగ పెట్టుకోవద్దు. మెక్‌క్లెల్లాన్ దానిని స్వాధీనం చేసుకోడు. ఈ విధంగా యుద్ధాన్ని కొనసాగిస్తే, ఎలాంటి హేతుబద్ధమైన లక్ష్యం లేకపోతే ధనాన్ని, రక్తాన్ని ధారపోయడం అనవసరం. లింకన్ ప్రథమశ్రేణి 'ద్వితీయశ్రేణి' వ్యక్తి."

## సంశయించిన విప్లవాదులు

వెండేల్ ఫిలిప్స్ ప్రసంగం రభసను సృష్టించింది. అతడిపై తీవ్ర విమర్శలకు దారి తీసింది. కాని విప్లవాత్మకమైన పద్ధతులే పని చేయగలవన్న భావనను అది బలోపేతం చేసింది. మెక్‌క్లెల్లాన్ సాంప్రదాయవాదం ఎలా ఉన్నప్పటికీ అతివాద సైనిక కమాండర్లు విప్లవ పద్ధతులను అనుసరించడం మొదలుపెట్టారు. ముఖ్యంగా పారిపోయిన బానిసలను తమ శిబిరాల్లోకి ఆహ్వానించారు. ఉత్తర సైన్యాలు ఆక్రమించిన ప్రాంతాల్లో విద్రోహుల ఆస్తులను (బానిసలతోసహా) తీసుకెళ్లారు. తర్వాత ఒక కీలకమైన దశలో స్వయంగా లింకన్ కొన్ని విప్లవ చర్యలను తీసుకున్నాడు. తొలి నల్లజాతి సైనికుల రెజిమెంట్‌ను ఏర్పాటు చేశాడు. తిరుగుబాటు పథంలో ఉన్న రాష్ట్రాలలో బానిసలందరికీ స్వేచ్ఛను ప్రకటించాడు. మెక్‌క్లెల్లాన్‌ను పదవి నుండి తొలగించాడు.

కొత్త వైఖరికి మార్గం సుగమమైంది. అది విజయానికి దారి తీసింది. అయితే విజయం మరో రెండేళ్లు పట్టింది. 1863 వేసవిలో గెట్టిస్‌బర్గ్ వద్ద ఓటమి పాలైనా దక్షిణ రాష్ట్రాలకు విశాలమైన భూభాగం అప్పటికీ ఉండేది. యూనియనిస్టు జనరళ్లు గ్రాంట్, షెర్మాన్ లాంటి వ్యక్తులు దక్షిణ సైన్యాలపైనే కాకుండా వాటిని పోషిస్తున్న సామాజిక నిర్మాణంపై పూర్తిస్థాయి యుద్ధంతోనే ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకోగలమని అంచనా వేశారు. దక్షిణ రాష్ట్రాల

కాన్ఫెడరేషన్ తుది ఓటమి షెర్మాన్ నేతృత్వంలోని సైన్యాలు జార్జియాపై దాడి జరిపి తోటలను దోచుకొని వాటిని తగులబెట్టి బానిసలను విముక్తి చేసిన తర్వాతే సాధ్యమైంది.

యుద్ధం తొలి ఒకటిన్నర సంవత్సరాలలో మెక్‌క్లెల్లాన్ వైఖరి నుండి తుది దశలో గ్రాంట్, షెర్మాన్‌ల వైఖరిలో వచ్చిన మార్పు ప్రబలమైనది. ఫ్రాన్స్‌లో తొలుత గిరోండిన్లు అనుసరించిన పద్ధతుల నుండి జాకోబిన్ల పాటించిన పద్ధతుల వరకు చోటు చేసుకున్న మార్పుతో సమానంగా సంయుక్త రాష్ట్రాలలో గణనీయమైన మార్పు వచ్చింది. రోబెస్పియర్‌కు భిన్నంగా లింకన్ వ్యక్తిత్వం, వైఖరి ఉండేవి. గ్రాంట్, షెర్మాన్‌లు సాంప్రదాయ భావాలుగల వృత్తిపరమైన సైనికులు. అయితే వీరు ఉత్తర ప్రాంతంలోని సామాజిక పరిస్థితులను దక్షిణంలో కూడా నెలకొల్పాలంటే ఆ ప్రాంతంపై విప్లవాన్ని రుద్దక తప్పదని గ్రహించారు.

తాను తీసుకునే చర్యలకు విప్లవ లక్షణం ఉందన్న విషయాన్ని గ్రహించకుండానే లింకన్ అలాంటి చర్యలను ఎలా తీసుకున్నాడో కార్ల్ మార్క్స్ వివరించారు.

> "చరిత్ర పుటల్లో లింకన్ ఒక అరుదైన వ్యక్తి. అతడికి ఎలాంటి చొరవ లేదు. సిద్ధాంత స్ఫూర్తి, చారిత్రక నేపథ్యమూ లేవు. తన ముఖ్యమైన అభివ్యక్తీకరణలకు అతడు సాధ్యమైనంత సాధారణ స్వరూపం ఇస్తాడు. కొందరు 'సిద్ధాంతం' కోసం పోరాడుతున్నామని వాదిస్తారు. అలాంటి వ్యక్తుల స్వంత విషయానికి వచ్చేసరికి వారు ఒక గజం స్థలం కోసం పోరాడుతుంటారు. లింకన్ ప్రజా విప్లవం నుండి ఉద్భవించిన వ్యక్తేమీ కాదు. ఈ సగటు సజ్జనుడిని సార్వజనీన ఓటు హక్కు ద్వారా ఆయా సామాజిక శక్తులు అత్యున్నత స్థానంలో నిలబెట్టాయి. వాటికి వాస్తవిక సవాళ్ల గురించి ఎలాంటి అవగాహన లేదు. సదుద్దేశ్యం గల సాధారణ ప్రజలు సామాజిక, రాజకీయ సంఘటనం అందుబాటులో ఉన్నట్లయితే గొప్ప విజయాలను సాధించగలరని నూతన ప్రపంచంలో సాధించిన ఈ ఘనవిజయం నిరూపించడం ఇలాంటి గొప్ప కార్యాలను పాత ప్రపంచంలో కేవలం వీరులే సాధించగలిగేవారు," అని మార్క్స్ అమెరికా అంతర్యుద్ధం గురించి విశ్లేషించారు.

## పునఃనిర్మాణం - వంచన

అయినప్పటికీ ఉత్తర ప్రాంత బూర్జువా సమాజంలో ఒక వైరుధ్యం ఉండేది. తీవ్రమైన వర్గ కలహాలు ఉన్నప్పటికీ ఈ వర్గం దక్షిణంపై విప్లవాత్మకమైన మార్పును రుద్దింది. సమాజంలోని ఆ వైరుధ్యం ఉత్తర సైన్యాల విజయం, లింకన్ హత్య తర్వాత వెలుగులోకి వచ్చింది. 1865 వసంత కాలంలో రాజకీయ వ్యవస్థలో చీలిక వచ్చింది. లింకన్ ఉపాధ్యక్షుడు, అతడి వారసుడైన అండ్ర్యూ జాన్సన్ ఓడిపోయిన రాష్ట్రాల పట్ల సామరస్య విధానాన్ని అనుసరించాడు. వాటిని యూనియన్‌లోకి మళ్లీ చేర్చుకోవాలని ఒత్తిడి చేశాడు. కాంగ్రెస్‌లో పెద్ద పీట వేయాలని సంకల్పించాడు. బానిస వ్యవస్థ రద్దు తప్పదని భావించాడు. తోట యజమానులు తమ అపారమైన సంపదను నిలుపుకోవడం, మాజీ బానిసలకు ఎలాంటి భూమి లేని నేపథ్యంలో పై ప్రతిపాదనల ఫలితం సామాజిక పరిస్థితులను యుద్ధానికి పూర్వం ఉన్న పరిస్థితులకు తీసుకెళ్లడమే అవుతుంది.

అనతి కాలంలోనే జాన్సన్ ఉత్తర ప్రాంత నల్లజాతీయులు, బానిస వ్యతిరేక ఉద్యమకర్తల నుండి వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. యుద్ధం సృష్టించిన ప్రజాతంత్ర విప్లవ స్ఫూర్తితో ప్రభావితులైన అతివాద రిపబ్లికన్ కాంగ్రెస్ సభ్యులు, దక్షిణ రాష్ట్రాల ఆక్రమణలో ఉన్న కొందరు సైనికాధికారులు కూడా జాన్సన్ విధానాన్ని వ్యతిరేకించారు. క్రమంగా ప్రధాన స్రవంతి రిపబ్లికన్ రాజకీయ నాయకులు కూడా వ్యతిరేకించడం మొదలుపెట్టారు. వాస్తవం ఏమిటంటే నూటికి నూరు పాళ్లు డెమోక్రాట్ పార్టీని సమర్థించే దక్షిణ రాష్ట్రాలు కాంగ్రెస్‌లో తిరిగి చేరడం వారికి ఇష్టం లేదు. అలాగే పారిశ్రామిక పెట్టుబడిదారులు పశ్చిమ ప్రాంతాలపై ఆధిపత్యం సాధించాలని గట్టి పట్టుదలతో వ్యవహరించారు. ఉత్తర సైన్యాల (వీటిని 'కార్పెట్ బ్యాగర్లు'గా పరిగణిస్తారు)తోపాటు దక్షిణ ప్రాంతంలో స్థిరపడిన వ్యాపారులు రాత్రికి రాత్రే కోట్లకు పడగలెత్తాలని కోరుకున్నారు. వీరంతా ఒక కూటమిగా తయారయ్యారు. ఈ కూటమి ఎంత బలంగా ఉండేదంటే జాన్సన్ కార్యక్రమాలన్నింటినీ ఓడించే సామర్థ్యాన్ని సంపాదించు కుంది. (కాంగ్రెస్‌లో ఈ కూటమికి ఒక్క ఓటు తక్కువ కావడంతో అధ్యక్షుడిని అభిశంసించడంలో విఫలమైంది) 1868లో రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి గ్రాంట్‌ను అధ్యక్షునిగా గెలిపించుకుంది. ఆ దశాబ్దాలలో చాలా వరకు దక్షిణ రాష్ట్రాలపై పునఃనిర్మాణ కార్యక్రమాన్ని రుద్దింది.

ఈ సంవత్సరాలలో ఉత్తర ప్రాంత ఆయుధాలు పాత తోట యజమానులను రాష్ట్ర లేదా స్థానిక ప్రభుత్వాలను నియంత్రించకుండా దూరంగా పెట్టాయి. వీరి స్థానాన్ని దక్షిణ రిపబ్లికన్లు (నల్ల, శ్వేతజాతీయులు) భర్తీ చేశారు. విముక్తి అయిన బానిసలకు ఓటు హక్కును ప్రసాదించారు. వారు ఆ హక్కును వినియోగించుకున్నారు. న్యాయమూర్తులుగా రాష్ట్ర ప్రభుత్వాలలో కీలక అధికారులుగా నల్లజాతీయులు ఉన్నత పదవులను నిర్వహించారు. ఫెడరల్ కాంగ్రెస్‌లో 20 మంది, సెనేట్‌లో ఇద్దరు నల్లజాతీయులు సభ్యులుగా ఉండేవారు. తొలిసారిగా విద్యను దక్షిణ శాసనమండళ్లు తీవ్రంగా పరిగణించడం మొదలుపెట్టాయి. పేదలైన శ్వేత, నల్లజాతీయుల పిల్లల కోసం పాఠశాలల వ్యవస్థను ప్రారంభించాయి.

తోట యజమానులు ఎదురు దాడిని ప్రారంభించారు. తమకు కొత్తగా అంది వచ్చిన హక్కులను వినియోగించుకుంటూ అభ్యున్నతి వైపు ప్రస్థానం సాగిస్తున్న నల్లజాతీయులు, వారిని ప్రోత్సహిస్తున్న శ్వేతజాతీయులను భయభ్రాంతులకు గురి చేస్తున్న కూ క్లక్సక్లాన్ ముఠాలను భూస్వాములు వెనకేసుకు వచ్చారు. హత్యలు సర్వత్రా జరిగాయి. ఉదాహరణకు మే 1866లో టెన్నిస్‌లోని మెంఫిస్ వద్ద 46 మంది నల్లజాతీయులు, ఇద్దరు శ్వేత జాతి సానుభూతిపరుల ఊచకోత జరిగింది. అయితే ఉత్తర సైన్యాలు తిష్టవేసినంత కాలం నల్లజాతీయులు సాధించుకున్న హక్కులను, విజయాలను వారు నాశనం చేయలేకపోయారు. అదీగాక సుమారు రెండు లక్షల మంది నల్లజాతీయులు యూనియన్ సైన్యంలో ఉండేవారు. శత్రువులతో ఎలా పోరాడాలో వారికి బాగా తెలుసు.

అయితే ఆక్రమణదారీ సైన్యం బూర్జువా స్వభావం కలది కావడంతో ఒక పనిని అది చేయలేకపోయింది - భూములను స్వాధీనం చేసుకొని నల్లజాతీయులకు పంపిణీ చేయలేకపోయింది. ఆ విధంగా తమ పాత యజమానులకు స్వతంత్రంగా జీవించే అవకాశాన్ని నల్లజాతీయులకు కల్పించలేకపోయింది. అలాంటి సంస్కరణను షెర్మాన్ స్వల్ప కాలంపాటు కొనసాగించాడు. మాజీ బానిసలకు (40,000 మందికి) భూమిని పంచిపెట్టారు. కాని అతడి

నిర్ణయాన్ని జాన్సన్ వెనక్కి తీసుకున్నాడు. అప్పటి నుండి మాజీ బానిసలకు కేవలం ప్రభుత్వ భూమే అందుబాటులో ఉండిపోయింది. ఆ భూమి కూడా నిసత్తువగా, నాణ్యత లేనిదిగా ఉండేది. అనేక మంది నల్లజాతీయులు పాత బానిస యజమానులపై ఆధారపడాల్సి వచ్చింది. వ్యవసాయ భాగస్వాములుగానో, కార్మికులుగానో వారి వద్ద పని చేసే వారు. అంతకు ముందు పీడిత బానిస వర్గంగా ఉన్న వారు పీడిత రైతాంగ, కార్మిక వర్గంగా అవతారమెత్తారు.

ఘోరం ఇంతటితో ఆగిపోలేదు. 1870 మధ్య దశకం నాటికి దక్షిణంలో తమ లక్ష్యాన్ని సాధించగలిగామని ఉత్తర ప్రాంత క్యాపిటలిస్టులు భావించారు. విప్లవ సంస్కరణలు తోట యజమానులను వైరి వర్గంగా ఎదగకుండా అడ్డుకున్నాయి. వారి పరిశ్రమలు ఎంత వేగంగా విస్తరించాయంటే కొన్నేళ్ల వ్యవధిలోనే వారు బ్రిటన్‌ను అధిగమించారు. వారి రైల్వేలు ఇప్పుడు పసిఫిక్ సముద్ర తీరం వరకు విస్తరించాయి. పశ్చిమ ప్రాంతాలపై దక్షిణ రాష్ట్రాలు ఆధిపత్యం వహించే పరిస్థితులు తెరమరుగయ్యాయి. ఆక్రమణదార సైన్యం అవసరం లేదన్న భావనకు వచ్చారు. ఎందుకంటే దక్షిణాన్ని ఎవరు పాలించినా తమ జూనియర్ భాగస్వాములుగా వ్యవహరించాల్సిందేనని నిర్ధారించారు.

ఉత్తర సైన్యం ఉపసంహరించుకోవడంతో క్లాన్, తదితర జాత్యహంకార శక్తులకు అడ్డూ అదుపు లేకుండా పోయింది. ఒకవైపు జాత్యాహంకార దాడులు, మరోవైపు ఆర్థిక బలం బడా భూస్వాములకు తమ రాజకీయ నియంత్రణను పునఃస్థాపించడానికి అవకాశం కల్పించాయి. తొలుత కొన్ని పరిమితులు విధించి, తర్వాత క్రమంగా నల్లజాతీయుల ఓటు హక్కును రద్దు చేశారు. సామాజిక జీవితంలోని ప్రతి రంగంలోనూ వివక్షను ప్రవేశపెట్టారు. జాత్యాహంకార భావన ప్రబలడంతో పేద శ్వేతజాతీయులు తమ తోటి నల్లజాతీయులతో రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాల్లో భాగస్వామ్యాన్ని ఏర్పాటు చేయలేకపోయారు. అప్పుడప్పుడు వ్యవస్థపై ఉన్న అసంతృప్తి ప్రతిఘటన స్వరూపం దాలిస్తే పేద శ్వేతజాతీయులు జాత్యహంకార సిద్ధాంత పరిధిని ఛేదించి ముందుకు వచ్చేవారు. 1880, 90 దశకాలలో కొనసాగిన ప్రజా ఉద్యమం, 1930, 40 దశకాలలో పెల్లుబికిన కార్మికోద్యమం ఇందుకు ఉదాహరణలు. అయితే ఉద్యమాలు బయల్దేరిన ప్రతిసారి జాత్యహంకార విద్వేషాన్ని ఎలా రెచ్చగొట్టాలో, సమాజంలో చీలికలు ఎలా తీసుకురావాలో శ్వేతజాతి పాలకవర్గానికి బాగా తెలుసు. జనవరి 1863 విముక్తి ప్రకటన వెలువడి 90 ఏళ్లు గడిచినా నల్లజాతీయులు తమ పౌర హక్కులను వినియోగించుకోకుండా అడ్డుకున్నారు. వాషింగ్‌టన్‌లోని ఫెడరల్ ప్రభుత్వం ఈ వ్యవహారంలో అప్పటికీ ఎలాంటి శ్రద్ధ చూపలేదు.

అంతర్యుద్ధం వల్ల ఉత్తర ప్రాంత పెట్టుబడి అమితంగా లాభపడింది. కొంత కాలం పాటు మాజీ బానిసలు కూడా దాని వల్ల ప్రయోజనం పొందగలరన్న భావన ఉండేది. అయితే ఒక రకమైన అణచివేతను నిర్మూలించడానికి సహకరించిన తర్వాత ఆధునిక పారిశ్రామిక క్యాపిటలిజం మరో దోపిడి నిర్మాణాన్ని స్థాపించడంలో ప్రయోజనం ఉందని నిరూపించింది. దాని కార్యకలాపాలలో జాత్యహంకారం అంతర్భాగంగా ఉండేది. పాత బానిసల యజమానులు కూడా వారి బాటలోనే నడిచారు. పారిశ్రామిక పెట్టుబడికి వెన్నుదన్నుగా నిలిచిన రిపబ్లికన్ పార్టీ 1860 దశకంలో తానిచ్చిన నినాదాలను స్వల్పకాలంలోనే మరచిపోయింది.

తొమ్మిదవ అధ్యాయం

# తూర్పు దేశాల ఆక్రమణ

ప్రాచ్య దేశాల సిరిసంపదలు 1776లో కూడా పశ్చిమ ఐరోపా వాసులను ఎంతో ఊరించాయి. అప్పుడు ఆడమ్‌స్మిత్ తన "దేశాల సంపద" గ్రంథాన్ని ప్రచురించాడు. భారత్, చైనాల నుండి ఎగుమతి అయ్యే జౌళి, పింగాణీ ఉత్పత్తులు, తేయాకుకు పాశ్చాత్య దేశాలలో విపరీతమైన డిమాండ్ ఉండేది. ఓల్టేయిర్ లాంటి మేధావులు ప్రాచ్య సంస్కృతులు, నాగరికతలను బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ నాగరికులతో సమానంగా పోల్చారు. ప్రపంచంలో చైనా ఒక సంపన్నమైన, నాగరికమైన, అత్యంత పారిశ్రామిక దేశమని ఆడమ్‌స్మిత్ పేర్కొన్నాడు. ఎలాంటి ప్రగతి లేకుండా ఆ దేశం స్తంభించిపోయినా అది వెనక్కి మాత్రం వెళ్లదని కూడా చెప్పాడు. ఒక శతాబ్దం తర్వాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఆఫ్రికా, ఉత్తర అమెరికా స్థానిక ప్రజలకు అంటగట్టిన జాత్యహంకార మూస ధోరణులను ఇప్పుడు భారత్, చైనా పశ్చిమాసియా ప్రజలకు కూడా వర్తింపచేశారు. ఈ అంతరాల కాలంలో బ్రిటన్ భారతదేశాన్ని దాదాపు వలసవాద కేంద్రంగా చేజిక్కించుకుంది. చైనాను రెండు యుద్ధాలలో తీవ్ర పరాభవానికి గురి చేసింది. ఫ్రాన్స్ అల్జీరియాను ఆక్రమించింది. రష్యా, ఆస్ట్రియా - హంగేరిలు ఒట్టోమన్ సామ్రాజ్యాన్ని తమ మధ్య పంచుకున్నాయి. పశ్చిమ ఐరోపా, సంయుక్త రాష్ట్రాల సమాజాలను తలకిందులు చేసిన క్యాపిటలిజం ప్రగతి ఆ సమాజాల పాలకులకు మిగతా ప్రపంచంపై నియంత్రణ సాధించేందుకు అవకాశం కల్పించింది.

## బ్రిటన్ భారత సామ్రాజ్యం

పాశ్చాత్య పాలకుల చేతికి దక్కిన మహా సామ్రాజ్యాలలో భారతదేశం మొదటిది. ఈ పరిణామం రాత్రికిరాత్రే సంభవించలేదు. అంటే ప్రత్యక్ష సైనిక ఆక్రమణ జరగలేదు. అలాగే సాంకేతికపరమైన ఆధిపత్యం కారణంగా దేశం బ్రిటీషు వారికి దాసోహం కాలేదు.

మార్క్సుతో సహా 19వ శతాబ్దపు పాశ్చాత్య వ్యాఖ్యాతలు భారతదేశం ప్రాచీన విలువలతో స్తంభించిపోయిందని తప్పుగా భావించారు. మొగల్ సామ్రాజ్యం పతనమైన తర్వాత

కూడా ఆర్థిక ప్రగతి కొనసాగింది. వ్యాపారులు, బ్యాంకర్లు, పన్నులు వసూలు చేసే రైతుల సంపద పెరిగింది.

అయితే వీరు పరస్పరం కలహించుకుంటున్న ఆరు రాజ్యాల నీడలో బతికేవారు. ఏ ఒక్క రాజ్యమూ వీరికి రాజకీయ, ఆర్థిక విధానాలపై కాని, వారి ఆస్తుల సంరక్షణలో కాని ఎలాంటి నిర్ణయాత్మక పాత్రను కల్పించలేదు. ఈ పరిస్థితి బ్రిటీషు ఈస్ట్ ఇండియా కంపెనీ జోక్యానికి ద్వారాలు తెరిచింది. కంపెనీ తన సైన్యాలు, ఆయుధాలతో ఆయా రాజ్యాల మధ్య అంతర్గత సంఘర్షణలలో జోక్యం చేసుకోవడం ప్రారంభించింది. భారత పాలకులు తమ ప్రయోజనాలను కాపాడలేకపోతున్నారని భావించిన వ్యాపారులు కంపెనీ జోక్యమే సరైన మార్గమని నిర్ధారించుకున్నారు.

18వ శతాబ్ది ఆరంభంలో ఈస్ట్ ఇండియా కంపెనీ భారత ఉపఖండంలో బలహీనమైన శక్తిగానే ఉండేది. భారత తీరం వెంబడి నెలకొల్పిన తమ వ్యాపార కేంద్రాలకు భారత పాలకుల నుండి మరిన్ని రాయితీలను పొందడంపైనే ఎక్కువగా ఆధారపడింది. కాని కాలం గడిచే కొద్దీ అది భారత వ్యాపారులతో బలమైన సంబంధాలను ఏర్పాటు చేసుకుంది. ఈ వ్యాపారులు కంపెనీకి దేశీయంగా ఉత్పత్తయ్యే వస్త్రాలు, ఇతర సరుకులను అమ్మేవారు. తర్వాత 1750 దశకంలో రాబర్ట్ క్లైవ్ అనే కంపెనీ అధికారి బెంగాల్ పాలకవంశం వారసుల మధ్య చిచ్చుపెట్టి ఒక వారసుడికి మద్దతునిచ్చాడు. ఫ్రెంచి బలగాలను ఓడించి ఆ రాజ్యంపై నియంత్రణ సాధించాడు. మొగల్ సామ్రాజ్యంలో అత్యంత సంపన్నమైన రాజ్యంగా బెంగాల్ అంతవరకు ఉండేది. కంపెనీ పన్నులు వసూలు చేసేది, ప్రభుత్వ పాలనను నిర్వహించేది. మరోవైపు భారతీయ నవాబు రాజ్యాధిపతిగా నామమాత్రపు అధికారాలతో కొనసాగాడు. ఉత్తర అమెరికాలో తన పాత సామ్రాజ్యాన్ని కోల్పోతున్న దశలోనే బ్రిటన్ భారతదేశంలో కొత్త సామ్రాజ్యాన్ని నిర్మించడం మొదలుపెట్టింది. ఈ కొత్త సామ్రాజ్య నిర్మాణానికి అది నామమాత్రపు వ్యయాన్ని భరించింది. కంపెనీ తన యుద్ధ వ్యయాన్ని భారత ప్రజానీకంపై పన్నులు విధించడం ద్వారా పూడ్చుకుంది. సిపాయిలనబడే భారత బలగాలపైనే (సైన్యం) కంపెనీ ఎక్కువగా ఆధారపడింది.

బెంగాల్‌లో సాధించిన విజయం మరోచోట కూడా విజయానికి దారి తీసింది. మిగతా పాలకులు (భారత) కంపెనీని నమ్మకమైన మిత్రపక్షంగా భావించారు. తమ స్వంత సైన్యాలకు శిక్షణ ఇప్పించేందుకు, పాలనా వ్యవస్థను క్రమబద్ధం చేసేందుకు కంపెనీ సేవలను వినియోగించుకున్నారు. పెరుగుతున్న కంపెనీ ప్రాబల్యాన్ని భారత వ్యాపారులు స్వాగతించారు. ఎందుకంటే అది వారి నుండి భారీ పరిమాణంలో వస్త్రాలను కొనుగోలు చేసేది. స్థానిక పాలకులు వ్యాపారుల సంపదను దోచుకోకుండా రక్షణ కల్పించేది. పాత జమీందార్ల నుండి ఒక బడా భూస్వామ్య వర్గాన్ని సృష్టించడం ద్వారా కంపెనీ తన పట్టును మరింత పెంచుకుంది.

అవసరమైనప్పుడు తన ప్రాబల్యాన్ని మరింత సుస్థిరం చేసుకోవడంలో బ్రిటీషు వారికి ఎలాంటి ఇబ్బందులు ఎదురు కాలేదు. అవసరమైతే సనాతనవాద విలువలు కలిగిన స్థానిక పాలకులను తప్పించి కంపెనీ ప్రత్యక్ష పాలనను స్థాపించేవారు.

1850 నాటికి కొందరు పాలకులను ఆక్రమిస్తూ మరికొందరికి లొంగదీసుకుంటూ (ధనాశ చూపి) ఉపఖండం అంతటిపై బ్రిటీషు ప్రాబల్యాన్ని విస్తరించారు. 1898లో మరాఠాలను జయించారు, 1843లో సింధ్, 1849లో సిక్కులు, 1856లో అవధ్‌ను ఓడించారు. 'విభజించు–పాలించు' అనే రోమను విధానాన్ని తాము అనుసరించామని బ్రిటీషు మంత్రులు గొప్పలు చెప్పుకునేవారు. కొన్ని సందర్భాల్లో లంచాలు, మరికొన్ని సందర్భాల్లో హింసను వినియోగిస్తూ పాలకుల మధ్య, రాజ్యాల మధ్య, ఉన్నత వర్గాల మధ్య, కులాలు, మతాల మధ్య చిచ్చురేపారు. ఎక్కడికి వెళ్లినా స్థానిక పెత్తందార్లను సమకూర్చుకున్నారు. ఫలితంగా 20 కోట్ల మంది జనాభా గల సామ్రాజ్యాన్ని కేవలం రెండు లక్షల మంది గల స్థానిక సైన్యంతో ఆక్రమించగలిగారు. స్థానిక సైన్యంపై బ్రిటీషు సైనికాధికారులకే ఆధిపత్యం ఉండేది. వారి సంఖ్య 40,000 మించకపోయినా స్థానిక సైన్యాన్ని అదుపులో ఉంచగలిగారు.

కంపెనీ ఏజెంట్లకు అపారమైన సంపద సమకూరింది. సుమారు 2,34,000 పౌండ్లను దోచుకొని క్లైవ్ భారతదేశాన్ని విడిచివెళ్లాడు. ఈ సొమ్ము నేడు కోట్లాది పౌండ్లతో సమానం. వారెన్ హేస్టింగ్స్ అనే గవర్నర్ జనరల్ లంచాలు తీసుకోవడంలో పేరు మోసిన వాడు. విశాలమైన రైతాంగం సంపదను సృష్టించేది. బీహార్, బెంగాల్‌కు చెందిన రైతులు సాలీనా 20 లక్షల పౌండ్ల మేరకు పన్నులు చెల్లించేవారు. కంపెనీ తన అధికారులను 'కలెక్టర్లు' అని పిలిచేది. మొగల్ పాలకులు అనుసరించిన దోపిడీ విధానాలనే మరింత ప్రభావవంతంగా, మరింత నిర్దాక్షిణ్యంగా అమలు చేసింది. ఈ విధానాలకు తీవ్రమైన పర్యవసానాలు ఉండేవి.

మొగల్ పాలన తుది ఘట్టంలో ప్రజలను తీవ్ర ఇబ్బందులకు గురి చేసిన దారిద్ర్యం కంపెనీ విధానాల కారణంగా ఇప్పుడు మరింత దారుణంగా పెరిగింది. 1769లో పంట వైఫల్యాల తర్వాత కరువులు, అంటువ్యాధులు ప్రబలాయి. వీటి వల్ల సుమారు కోటి మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. యాభై ఏళ్ల క్రితం తన సంపదతో ఐరోపా వాసులను ఆశ్చర్యానికి గురి చేసిన ప్రాంతం ఇప్పుడు ప్రపంచంలోనే అత్యంత పేద ప్రాంతంగా తన ప్రస్థానాన్ని ప్రారంభించింది.

ఈ అంశాలేవీ నవాబులను, మహారాజులను, వ్యాపారులు లేదా జమీందార్లను ఆందోళనకు గురి చేయలేదు. వీరంతా కంపెనీ బోర్డులో ఉండేవారు. కంపెనీ లావయ్యే కొద్దీ వారు కూడా లావయ్యారు. కాని అనతి కాలంలోనే బ్రిటీషు వారితో తమకున్న భాగస్వామ్యం

సమానమైనది కాదని గుర్తించారు. స్థానిక పాలకులను అందలం ఎక్కించే కంపెనీ వారిని రెండో ఆలోచన లేకుండా తొలగించేది కూడా.

కంపెనీ నియంత్రణ బ్రిటన్‌లో ఉండేది. భారత వ్యాపారులు కంపెనీతో వాణిజ్య సంబంధాలవల్ల ఎంత లాభపడినప్పటికీ నిర్ణయాలన్నీ లండన్‌లో జరిగేవి. 19వ శతాబ్దం తొలి దశకాల్లో ఈ పరిణామం నాటకీయమైన పద్ధతుల్లో వెలుగులోకి వచ్చింది. లాంకషైర్ కాటన్ మిల్లుల యాంత్రీకరణ కారణంగా స్వల్పకాలంలోనే బ్రిటీషు పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు భారతదేశంలో వృత్తిదారులు ఉత్పత్తి చేసే వస్త్రాల కంటే చవకైన వస్త్రాలను ఉత్పత్తి చేయడం ప్రారంభించారు.

బ్రిటీషు మార్కెట్లలో భారతీయ ఉత్పత్తులు కీలక పాత్రను పోషించే బదులు భారతీయ మార్కెట్లను బ్రిటీషు వస్త్రాలు ముంచెత్తాయి. భారతీయ జౌళి పరిశ్రమ చాలా వరకు నాశనమయ్యింది. లక్షలాది మంది మిల్లు కార్మికులు వీధిన పడ్డారు. భారతీయ వ్యాపారుల లాభాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. తమ స్వంత ప్రభుత్వమంటూ లేకపోవడంతో వ్యాపార ప్రయోజనాలను కాపాడుకోవడానికి వారికి వేరే మార్గాలు లేకుండా పోయాయి. మరోవైపు దేశ వ్యాప్తంగా పరిశ్రమలు మూతపడ్డాయి. బ్రిటీషు క్యాపిటలిస్టులు ఓడ నిర్మాణం, బ్యాంకింగ్ లాంటి లాభదాయకమైన రంగాల నుండి భారతీయ పారిశ్రామికవేత్తలు, పెట్టుబడిదారులను తప్పించారు. ఈలోగా సూక్ష్మమైన, ఉన్నతస్థాయి ప్రయోజనాలు కలిగిన బ్రిటీషు అధికారవర్గం మరింత అహంకారంగా, దౌర్జన్యంగా, ఏకపక్షంగా, జాత్యాహంకార భావనతో వ్యవహరించడం మొదలుపెట్టింది.

తమ ప్రవర్తనకు 1857లో వారు తగిన మూల్యాన్ని చెల్లించుకున్నారు. కంపెనీకి చెందిన సిపాయిలు తమ ఉన్నతాధికారులపై తిరగబడ్డారు. తమ మత భావనలను కించపరిచే విధంగా బ్రిటీషు అధికారులు తమను ఆవు మాంసం కొవ్వుతో (హిందువులకు అపవిత్రమైన), పంది మాసం కొవ్వుతో (ముస్లింలకు అపవిత్రమైన) తయారు చేసిన తూటాలను వినియోగించాలని ఆదేశించడం, అందుకు సిపాయిలు అభ్యంతరం తెలపడం, వారి అభ్యంతరాలను అధికారులు తోసిపుచ్చడంతో సైన్యంలో తిరుగుబాటు భావన ప్రబలింది. తెల్లదొరల ప్రవర్తనపై దేశ వ్యాప్తంగా నెలకొన్న ద్వేషభావానికి ఈ సమస్య కేంద్ర బిందువైంది. కొన్ని వారాల లోపే తిరుగుబాటుదారులు ఉత్తర భారతంలోని విశాలమైన ప్రాంతంపై నియంత్రణ సాధించారు. తమకు అడ్డు వచ్చిన బ్రిటీషు సైనికాధికారులు, ఉన్నతాధికారులందరినీ హత్య చేసి మిగతా వారిని కొన్ని సైనిక స్థావరాలలో ముట్టడించారు. హిందువులు, సిక్కులు ముస్లిం పట్ల తమకున్న ద్వేషాన్ని మరిచిపోయి మొగల్ పాలకవంశానికి చెందిన వారసుడిని చారిత్రక నగరమైన ఢిల్లీలో చక్రవర్తిగా ప్రతిష్టింపచేశారు.

సిపాయిల తిరుగుబాటును ఎట్టకేలకు అణచివేశారు. ఎంతో కలవరపడిన ప్రభుత్వం బ్రిటీషు దళాలను దక్షిణాసియా ఖండానికి ఆగమేఘాలపై పంపింది. మద్రాసు, బొంబాయి రెజిమెంట్లకు చెందిన భారతీయ సైనికులను ఉత్తర భారతంలో తిరుగుబాటుదారులను అణచివేసేలా బ్రిటీషు అధికారులు ఒప్పించగలిగారు. తర్వాత అత్యంత పాశవికమైన చర్యలు చేపట్టి భవిష్యత్‌లో ఎవరూ తిరుగుబాటు చేయకుండా గట్టి హెచ్చరికను జారీ చేశారు.

అయితే అణచివేత ఒక్కటే భారతదేశాన్ని శాంతింపచేయలేదని ప్రభుత్వం గ్రహించింది. బ్రిటీషు వాణిజ్య విపరీత పోకడలపై కొంత నియంత్రణ ఉండాలని, అలాగైతేనే బంగారు గుడ్లు పెట్టే బాతును పరిరక్షించగలమని పాలకులు నిర్ధారణకు వచ్చారు. "విభజించు - పాలించు" సిద్ధాంతాన్ని మరింత విస్తారంగా అమలు చేశారు. సముదాయ, మతపరమైన విద్వేషాలను వ్యవస్థీకరించారు. బూర్జువా పద్ధతులకు అనుగుణంగా భారత సమాజాన్ని తీర్చిదిద్దకపోయినా కుల, మత వివక్షలను మాత్రం పెంచి పోషించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ స్థానంలో బ్రిటన్ ప్రత్యక్ష పాలన అమల్లోకి వచ్చింది. మహారాణి విక్టోరియాను భారతదేశ మహారాణిగా ప్రకటించారు. సామ్రాజ్యవాద వ్యవస్థలోకి స్థానిక పాలకులు, భూస్వాములను ఇమడ్చడానికి ప్రతి ప్రయత్నమూ చేశారు.

ఒకవైపు పాలనను క్రమబద్ధం చేస్తే మరో వైపు విశాలమైన ప్రజానీకం పేదరికంలో మగ్గిపోయింది. ఈ పరిస్థితి నిరంతరంగా కొనసాగింది. మనుగడ కోసం వ్యవసాయంపై ఆధారపడే జనాభా శాతం 50 నుండి 75కు పెరిగింది. పన్నుల ఆదాయంలో 25 శాతం సైనిక అవసరాలకు పోగా, విద్య, ప్రజారోగ్యం, వ్యవసాయ రంగాలకు కేవలం ఒక్కో శాతం నిధులను వ్యయం చేసేవారు. దేశవ్యాప్తంగా కరువులు సంభవించాయి. 1860 దశకంలో 10 లక్షల కంటే ఎక్కువ మంది ప్రజలు ఆకలిచావుకు గురయ్యారు. 1870 దశకంలో 5 లక్షల మంది, 1890లలో దాదాపు కోటి మంది ప్రాణాలు కోల్పోయారు.

ఈలోపు బ్రిటీషు ఉన్నత మధ్యతరగతి వారికి భద్రమైన, సౌకర్యవంతమైన పదవులను కట్టబెట్టారు. వీరి జీతభత్యాలను సామాన్య రైతులపై పన్నులు మోపడం ద్వారా సమకూర్చుకునేవారు. సైనిక, పౌర సేవ రంగాలలో ఉన్నత పదవులన్నీ బ్రిటీషు వారికే లభించాయి.

ఈ అధికారులు తమ సతులను దేశానికి తీసుకువచ్చి జాత్యహంకార నివాసఘట్టాలను ఏర్పాటు చేసుకున్నారు. జాతి విద్వేషాలు ప్రస్ఫుటంగా దర్శనమిచ్చే ఇలాంటి నివాస ఘట్టాల గురించి క్లిప్పింగ్ తన నవల 'ప్లెయిన్ టేల్స్ ఫ్రమ్ ది హిల్స్', ఫోస్టర్ రచించిన "పాసేజ్ టు ఇండియా," ఆర్వెల్ "బర్మీస్ డేస్", పాల్ స్కాట్ నవల "జ్యువెల్ ఇన్ ది క్రౌన్"లో విస్తారంగా వివరించారు.

తెల్లదొరలు 'స్థానికుల'ను తీవ్రంగా ద్వేషించేవారు. కాని వారిలోని కొందరు ఉన్నత వర్గాలపై ఆధారపడి జనబాహుళ్యాన్ని నియంత్రించే వారు. పాత రాజులు, మహారాజులు తమ రాజభవనాల్లో ఉండిపోయారు. పాత భవనాలను మరింత విలాసవంతంగా పునర్నిర్మించారు. వీరికి ఎంతో మంది రాణులు, సేవకులు, గుర్రాలు, ఏనుగులు, వేటకుక్కలు ఉండేవి. కొందరు పాలకులు నామమాత్రంగానైనా అధికారం చెలాయించేవారు. ముఖ్యంగా హైదరాబాద్ సంస్థానాధీశులు ఈ కోవ కిందికి వస్తారు. కాని ఆచరణలో వారు తమ బ్రిటీష సలహాదారులను ఆదేశాలను అందుకునేవారు. ఉత్తర భారత గ్రామీణ ప్రాంతంలో జమీందార్లు తమ స్థాయిలో కొంత వరకు విలాసవంతంగానే జీవించేవారు. వీరు రైతాంగంపై పెత్తనం చెలాయిస్తే బ్రిటీష అధికారులు దయాదాక్షిణ్యాలపై ఆధారపడేవారు. తమ హోదా గురించి అసంతృప్తితో ఉన్నప్పటికీ మౌనంగా ఉండిపోయారు. వీరి తర్వాతి స్థాయిలో గ్రామ పెద్దలు, పురోహితులు ఉండేవారు. వీరి పన్నుల వసూలులో బ్రిటీష వారికి సహాయపడేవారు. అలాగే జమీందార్లకు కౌలు వసూలు చేసి పెట్టే వారు. వీరంతా పాత కుల విభజనలను తమ స్వంత లబ్దికోసం, వెనుకబడిన వర్గాల దోపిడీ కోసం వాడుకున్నారు. ఆ విధంగా 19వ శతాబ్దం చివరి నాటికి కుల సంబంధాలు మొదటి కంటే వ్యవస్థాగత స్వరూపాన్ని సంతరించుకున్నాయి. అదే సమయంలో ఒక కొత్త మధ్యతరగతి వర్గం ఆవిర్భవించడం మొదలుపెట్టింది. ఈ వర్గ సభ్యులు న్యాయవాదులు, ప్రభుత్వ ఉద్యోగులు, పౌరసేవ అధికారులుగా (బ్రిటీష పరిపాలన వ్యవస్థ పరిధిలో) రాణించాలని కలలు కనేవారు. అయితే జాతిపరమైన పరిమితుల కారణంగా తమ ఆకాంక్షలు నెరవేరకపోవడంతో క్రమంగా కృంగిపోయారు.

## చైనా లొంగుబాటు

ఐరోపా సామ్రాజ్యంలో భారతదేశంలా అంతర్భాగం కావడాన్ని చైనా నివారించింది. అయినప్పటికీ సమాజ స్థితిగతులు ఈర్ష్య పడేంత స్థాయిలో ఉండేవి కావు.

13వ శతాబ్దంలో మార్కోపోలో మొదలుకొని పాశ్చాత్య వ్యాపారులందరూ చైనా సంపద పట్ల ఎనలేని మక్కువను పెంచుకున్నారు. కాని వారికో సమస్య ఎదురైంది. ఐరోపా వాసులకు అవసరమైన ఉత్పత్తులెన్నింటిలో చైనా అందించినా, చైనా ప్రజలకు అవసరమైన ఉత్పత్తులను మాత్రం ఐరోపా ఉత్పత్తి చేయలేదు. బ్రిటీష ఈస్ట్ ఇండియా కంపెనీ ఈ సమస్య పరిష్కారానికి నడుం బిగించింది. భారతదేశంలో కొత్తగా స్వాధీనం చేసుకున్న విశాలమైన భూభాగాలను వ్యవసాయం కోసం అభివృద్ధి చేసి చైనాలో అత్యంత డిమాండ్ కలిగిన నల్లమందును సాగు చేయడం మొదలుపెట్టారు. 1810 నాటికి కంపెనీ ఆ మాదకద్రవ్యాన్ని కాంటన్ ద్వారా సంవత్సరానికి 3,25,000 కిలోల చొప్పున తరలించేది. ఆ విధంగా అనతి

కాలంలోనే చైనాకు ఉన్న వాణిజ్య మిగులను లోటుగా మార్చి వేసింది. నల్లమందు ప్రవాహాన్ని చైనా. అధికారులు అడ్డుకోవడానికి ప్రయత్నించినప్పుడు బ్రిటన్ 1839లో యుద్ధానికి బయల్దేరింది. నల్లమందు పట్ల వ్యసనాన్ని సృష్టించే హక్కు తనకు ఉందని వాదిస్తూ యుద్ధం మొదలుపెట్టింది.

ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైన, మిక్కిలి జనాభా కలిగిన సామ్రాజ్యంపై చైనా అధికారగణం పరిపాలన సాగించేది. ఆ దేశాన్ని కేవలం ఉత్తరం వైపు నుండి వచ్చిన సంచార యుద్ధ తెగలే అంత వరకు ఆక్రమించగలిగాయి. సుమారు 7,000 మైళ్ల దూరంలో ఉన్న శత్రు దేశ నావికా దళాన్ని అవలీలగా ఓడించగలమని చైనా పాలకులు ఆశించారు. యురేషియా మరో అంచున ఆర్థిక ప్రగతి (ఈ ప్రగతికి గత శతాబ్దాలలో చైనా కనిపెట్టిన సాంకేతిక పద్ధతులు, పరిజ్ఞానం ఎంతో దోహదం చేశాయి) ప్రపంచం ఎన్నడూ ఎరుగని విధంగా ఒక బలమైన దేశాన్ని తెరపైకి తెచ్చిన విషయాన్ని చైనా పాలకులు గ్రహించలేకపోయారు.

ఒక ఉన్నతాధికారి చక్రవర్తికి పంపిన నివేదికలో సునాయసమైన విజయం తథ్యమని జోస్యం చెప్పాడు :

> "ఆంగ్లేయుల ఆటవికులు ఒక ప్రాధాన్యత లేని, ద్వేషించబడే జాతి. వారు తమ బలమైన ఓడలు, భారీ ఫిరంగులనే ఎక్కువగా నమ్ముతారు. ఎంతో దూరం ప్రయాణించి ఇక్కడికి చేరుకునే వారికి నిరంతర సరఫరాలను సమకూర్చుకోవడం అసాధ్యమవుతుంది. ఒక్క ఓటమి తర్వాత వారి సైనికులు మనో స్థైర్యం కోల్పోయి తెరమరుగవుతారు."

అయితే మూడేళ్లపాటు అడపాదడపా పోరాటం సాగిన తర్వాత జరిగిన చర్చలలో చివరకు చైనాయే బ్రిటీషు పాలకులు విధించిన షరతులను ఆమోదించింది. నల్లమందు వ్యాపారం కోసం అనేక ఓడరేవులను తెరిచింది. వార్షిక కప్పం చెల్లిస్తూ హాంగ్‌కాంగ్ దీవిని బ్రిటీషు వారికి అప్పగించింది. బ్రిటీషు పౌరులకు సీమాంతర హక్కులను ప్రసాదించింది. ఈ రాయితీలు సరిపోవని చెప్పడానికి బ్రిటీషు వారికి ఎంతో కాలం పట్టలేదు. 1857లో రెండవసారి యుద్ధాన్ని ప్రారంభించారు. అప్పుడు 5,000 మంది సైనికులు కాంటన్‌ను ముట్టడించి వ్యాపారం కోసం మరిన్ని మార్గాలు, ఓడరేవులు తెరిచేలా చైనాను బలవంతం చేశారు. అప్పటికీ సంతృప్తి చెందని బ్రిటీషు వారు ఫ్రెంచి సైన్యాలతో చేతులు కలిపి 20,000 మంది సైనికులతో బీజింగ్‌పై దాడి చేశారు. చక్రవర్తి వేసవి విడిది అయిన రాజభవనాన్ని తగులపెట్టారు.

బ్రిటీషు సైన్యాలు సాధించిన సునాయస విజయాలకు చూపిన కారణాలతో చైనా విద్వాంసులు ఏకీభవించరు. కొందరు విజయానికి అధునాతనమైన ఆయుధాలు, యుద్ధ నౌకలను (పారిశ్రామిక ప్రగతి ఫలాలు) కారణంగా చూపారు. మరికొందరు మంచూరాజ్యంలోని అంతర్గత బలహీనతలను తప్పుపట్టారు. ఇరు దేశాల పారిశ్రామిక స్థాయిల మధ్య ఉన్న తేడా విజయాన్ని వివరించడానికి సరిపోదని వాదించారు. బ్రిటీషు వ్యాపారులు సాధించిన రాయితీలు చైనా రాజ్యానికి ఉన్న వ్యాపార నియంత్రణ సామర్థ్యాన్ని బలహీనపరిచాయి. తాను మారకద్రవ్యంగా వినియోగించే వెండిని దేశం దాటిపోకుండా రాజ్యం అడ్డుకోలేకపోయింది. పారిశ్రామిక, వ్యవసాయ రంగాలు రెండింటిలోనూ స్తబ్దత నెలకొని సంక్షోభం తీవ్రమైంది.

ఓటముల తర్వాత మిగతా ఐరోపా శక్తులు కూడా తమకు బ్రిటన్‌తో సమానంగా వ్యాపార రాయితీలు కావాలని పట్టుబట్టాయి. చైనా చట్టాలకు అతీతంగా వ్యాపార కేంద్రాలను స్థాపించేవరకు లేదా చైనా తీరం వెంబడి చిన్నస్థాయి వలసవాద కేంద్రాలను ఏర్పాటు చేసుకునే వరకు ఐరోపా దేశాలు రాయితీలను పొందాయి.

మంచూ సామ్రాజ్యం బలహీనం కావడంతో మొదలైన రైతులు కష్టాలు విదేశీయుల రాకతో మరింత తీవ్రమయ్యాయి. పరిస్థితులు సహించరాని విధంగా తయారయ్యాయి. ముఖ్యంగా తక్కువ సారంగల కొండ ప్రాంతాలలో (ఇవి ఆయా రాష్ట్రాల మధ్య సరిహద్దులుగా ఉండేవి) రైతులు దుర్భరమైన జీవితాన్ని గడపాల్సి వచ్చింది. గతంలో ఇలాంటి పరిస్థితులకు స్పందించిన విధంగానే ఈసారి కూడా రైతులు తిరుగుబాటు బావుటాను ఎగురవేశారు.రాజ్య విరోధులైన మత వర్గాలలో చేరి తమ పాలకులకు వ్యతిరేకంగా ఉద్యమించారు. తర్వాత సంభవించిన పరిణామాలను 'తాయిపింగ్ తిరుగుబాటు' అని సాధారణంగా పరిగణిస్తారు. వాస్తవానికి అది రాజ్య అధికారంపై జరిగిన పూర్తిస్థాయి విప్లవదాడి. తిరుగుబాటు రక్తసిక్తంగా సాగింది.

రైతులు, కార్మికులు, పేద మేధావులు దక్షిణ చైనాలో 1840 దశకం మధ్య భాగంలో ఉద్యమాన్ని లేవదీశారు. రైతుకుటుంబానికి చెందిన హంగ్ సియు-చువాన్ అనే పాఠశాల ఉపాధ్యాయుడు ఉద్యమానికి నాయకత్వం వహించాడు. అతడు దివ్యదర్శనంలో తనను తాను జీసస్ సోదరునిగా, దేవుడి ఆదేశంతో భూమిపై ఉన్న దుష్టశక్తులను నాశనం చేసి సంపూర్ణ శాంతి కలిగిన 'దేవుని రాజ్యాన్ని' స్థాపించేవాడిగా (చైనా భాషలో 'తాయిపింగ్') చూసుకున్నాడు. ప్రజల మధ్య సమానత్వం అనే సిద్ధాంతాన్ని అతడు గట్టిగా బోధించాడు. రైతులకు భూమిని సమానంగా పంచడం, ఉత్పత్తులపై సముదాయ యాజమాన్యం, పాత సామాజిక భేదాల నిర్మూలన (పురుషాధిక్యతతోసహా) తదితర అంశాలను ప్రచారం చేశాడు. అతడి అనుచరులకు ఓ లక్ష్యంతోపాటు క్రమశిక్షణా భావం ఉండేది. ఫలితంగా వారు విశాలమైన ప్రజానీకం

మద్దతును కూడగట్టి తమపైకి పంపిన సైన్యాలను ఓడించగలిగారు. 1853 నాటికి ఉద్యమంలో పాల్గొనే వారి సంఖ్య 20 లక్షలకు చేరుకుంది. మాజీ సామ్రాజ్య రాజధాని అయిన నాంకింగ్‌ను ఉద్యమకారులు స్వాధీనం చేసుకోగలిగారు. దేశంలోని 40 శాతం భూభాగాన్ని తమ స్వంత రాజ్యంగా పాలించారు.

చైనాలో గత రైతాంగ తిరుగుబాట్ల పంథానే తాయిపింగ్ నాయకత్వం కూడా అనుసరించింది. ఎంతో ఉద్వేగంగా ప్రచారం చేసిన సిద్ధాంతాలకు అది తిలోదకాలిచ్చింది. వ్యవసాయం చేసే నిరక్షరాస్యులైన రైతులు గ్రామీణ ప్రాంతంలో చెల్లాచెదురుగా ఉండడం వల్ల సైన్యం, దాని నాయకులపై నియంత్రణ సాధించే శక్తిగా ఎదగలేకపోయారు. భౌతిక వనరులు తమ ఆకాంక్షలకు అనుగుణంగా లేవన్న విషయాన్ని నాయకులు స్వల్పకాలంలోనే గ్రహించారు. సాంప్రదాయ పద్ధతిలో పాలన సాగించడం, ఆ వ్యవస్థతో ముడిపడి ఉండే ప్రత్యేక ప్రయోజనాలను పరిరక్షించడమే వారికి ఏకైక మార్గంగా మిగిలింది.

కాని తిరుగుబాటు తుది దశలో కొన్ని పరిణామాలు వెలుగులోకి వచ్చాయి. హంగ్‌కు సోదర వరుస అయిన వ్యక్తి చేతికి నాయకత్వ పగ్గాలు దక్కాయి. అతడు ఒక పటిష్టమైన కార్యాచరణ పథకాన్ని రూపొందించడం మొదలుపెట్టాడు. అది సాంప్రదాయ పాలనా విధానానికి భిన్నంగా సమసమాజ స్థాపనే లక్ష్యంగా పెట్టుకుంది. చైనా ఆర్థిక వ్యవస్థను ఆధునీకరించే చర్యలను అతడు ప్రవేశపెట్టాడు. అందుకు పాశ్చాత్య పద్ధతులను అనుసరించాలని సూచించాడు. ముఖ్యంగా బ్యాంకులను ప్రారంభించడం, రైల్వేలు, ఆవిరి నౌకలను నిర్మించడం, గనుల తవ్వకాన్ని ప్రోత్సహించడం, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి పరచడంపై దృష్టి సారించాడు. తాయిపింగ్ తిరుగుబాటులో నూతన ఆలోచనలు కలిగిన శక్తులుకూడా ఉన్నాయని, అవి గత రైతాంగ తిరుగుబాట్లకు భిన్నంగా వ్యవహరించాయని పై పరిణామాలను బట్టి అవగతమవుతోంది. దేశంలో పేదరికానికి కారణమైన సామాజిక అడ్డుగోడలపై ఆ శక్తులు కూల్చివేశాయి. కాని ఈ శక్తులు బలపడడానికి సమయం సరిపోలేదు. చైనా వ్యాపారులు సమకూర్చిన నిధులతో మళ్లీ సమీకృతమైన సామ్రాజ్యవాద సైన్యం బ్రిటన్, ఫ్రాన్స్‌లు అందజేసిన అధునాతన ఆయుధాలు, మేజర్ గార్డన్ నేతృత్వంలోని విదేశీ సైన్యాలతో కలిసి యాంగ్సీ నదిని దాటుకొని తిరుగుబాటు ఉద్యమంపై దాడి చేసింది. చివరికి 1864లో నాంకింగ్ సామ్రాజ్య సైన్యాల వశమైంది. ఈ పోరాటంలో సుమారు 1,00,000 మంది తిరుగుబాటుదారులు, సైనికులు, పౌరులు మరణించారు. పాశ్చాత్య క్యాపిటలిస్టు రాజ్యాలు చైనాలో పాత, క్యాపిటలిస్టు పూర్వ వ్యవస్థను స్థిరీకరించడంలో సహాయపడ్డాయి. ఆ వ్యవస్థ 50 ఏళ్లపాటు కొనసాగడానికి అనుమతించాయి. అలా చేయడం ద్వారా ఆ రాజ్యాలు పశ్చిమ ఐరోపా, ఉత్తర అమెరికాను ఆర్థికంగా ఎదిగేలా, చైనా వెనుకబడిపోయేలా చేశాయి.

## తూర్పు సమస్య

తూర్పులో మూడవ అతిపెద్ద సామ్రాజ్యమైన ఒట్టోమన్‌లో అదే చరిత్ర పునరావృతమైంది. బహుళజాతిగల ఈ విశాలమైన సామ్రాజ్యం 400 సంవత్సరాలపాటు విశాలమైన భూభాగాన్ని పాలించింది. ఉత్తర ఆఫ్రికా, ఈజిప్టు, నేటి సూడాన్, అరేబియన్ ద్వీపకల్పం, పాలస్తీనా, సిరియా, ఇరాక్, ఆసియా మైనర్, బాల్కాన్స్, కొన్నిసార్లు హంగేరి, స్లొవాకియాలతోసహా విశాలమైన ఐరోపా భూభాగం ఒట్టోమన్ సామ్రాజ్య పరిధిలో ఉండేవి. ఇస్తాంబుల్ కేంద్రంగా ఈ సామ్రాజ్యాన్ని తుర్కు చక్రవర్తులు పాలించారు. ఆసియా మైనర్, బాల్కన్స్‌లోని కొన్ని ప్రాంతాల్లో తుర్కు భూస్వామ్య వర్గం ఉండేది. కాని సామ్రాజ్యాన్ని చాలా వరకు జయించబడిన తుర్కేతర ఉన్నత వర్గాలే పాలించేవి. బాల్కన్స్‌లో దాదాపు గ్రీకులు, పశ్చిమాసియాలో అరబ్బులు, ఈజిప్టులో పూర్వ మామ్లూక్ పాలకవంశ వారసులు పాలన సాగించారు. సనాతనవాద క్రైస్తవులు, సిరియన్ క్రైస్తవులు, యూదులు తదితర మత వర్గాలు ఇస్తాంబుల్‌లో స్వయంపాలనా వ్యవస్థలను కలిగి ఉండేవి. అయితే ఇవి సుల్తాన్ పాలనకు కట్టుబడి పని చేసేవి. చివరికి సైన్యం కూడా ప్రత్యేక తుర్కు లక్షణాన్ని కలిగి ఉండేది కాదు. పదాతి దళాలు ఎక్కువగా జానిస్సారీలతో నిండి ఉండేవి. (జానిస్సారీలు పూర్వాశ్రమంలో బాల్కన్ క్రైస్తవ కుటుంబాలకు చెందిన వారు. చిన్న వయస్సులో వీరిని బానిసలుగా ఇస్లాంబుల్‌కు తీసుకువచ్చి కరుడుగట్టిన పోరాట వీరులుగా శిక్షణ ఇచ్చారు)

అప్పటి అన్ని సమాజాల వలె ఈ సామ్రాజ్య సంపద కూడా ప్రధానంగా రైతు వ్యవసాయం నుండి వచ్చేది. కాని ఒట్టోమన్లు శతాబ్దాలపాటు పశ్చిమ ఐరోపా, భారత్, చైనాలతో వాణిజ్య కార్యకలాపాలను నిర్వహించారు. రష్యా, స్కాండినేవియాలలోని నదుల గుండా నల్ల సముద్రం, కాస్పియన్ సముద్రం ద్వారా (పశ్చిమ ఐరోపాతోనూ) అలాగే వెనీస్, జెనోవా ద్వారా దక్షిణ ఐరోపాతోనూ వాణిజ్య కార్యకలాపాలు నిర్వహించేవారు. సిల్క్ రూట్ ద్వారా (ఉత్తర ఆఫ్ఘనిస్తాన్, ఎర్ర సముద్రం, పర్షియన్ ఎడారి ఓడరేవుల ద్వారా) భారత్, చైనాలతో వాణిజ్య సంబంధాలను కలిగి ఉండేవారు. 18వ శతాబ్ది మధ్యభాగం వరకు వ్యవసాయం, చేనేత పరిశ్రమల రంగాల్లో కనీసం కొంత ప్రగతి అయినా ఉండేది. కాఫీ, పత్తి లాంటి కొత్త పంటల రాకతో వ్యవసాయం విస్తరించింది.

అయితే 19వ శతాబ్దం ప్రారంభమయ్యే నాటికి ఒట్టోమన్ సామ్రాజ్యంపై బయటి నుండి ఒత్తిడి ఎక్కువైంది. నెపోలియన్ ఈజిప్టును ఆక్రమించి ఉన్నాడు. బ్రిటీషు బలగాలు తరిమివేసే వరకు అతడు అక్కడే స్థావరం ఏర్పరచుకొని ముందుకు సాగాలని ప్రయత్నించాడు. 1830లో ఫ్రెంచి రాచరికం స్థానికుల నుండి తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొంటూనే అల్జీరియాను

స్వాధీనం చేసుకుంది. కాకసస్‌లోని చాలా భాగాన్ని రష్యన్ సైన్యాలు ఆక్రమించాయి. నల్ల సముద్రం తీరానికి చేరుకొని ఏకంగా ఇస్తాంబుల్‌పైనే దృష్టి సారించాయి. తుర్కు పాలనకు వ్యతిరేకంగా సెర్బులు తిరుగుబాటు చేసి 1815లో స్వయం ప్రతిపత్తిగల రాజ్యాన్ని స్థాపించుకున్నారు. అలాగే 1820 దశకంలో బ్రిటీషు, రష్యన్ దళాల సహాయంతో గ్రీకులు కొత్త రాజ్యాన్ని ఏర్పాటు చేసుకున్నారు. మిగతా చోట్ల కూడా అలాంటి ఉద్యమాలను రష్యన్ జార్‌లు ప్రోత్సహించారు. తమ స్వంత భాషను మాట్లాడే సముదాయాలు, తమ స్వంత క్రైస్తవ మత సనాతన వర్గానికి చెందిన వ్యక్తుల పరిరక్షకులుగా జార్‌లు ప్రవర్తించారు.

రష్యన్ దళాల చొరబాటు పశ్చిమ ఐరోపా పాలకులను భయభ్రాంతులకు గురి చేసింది. ఆస్ట్రియా, ప్రష్యాలతో సహా ఈ దేశాలు తమ స్వంత భూభాగాల్లో విప్లవాన్ని అణచివేయడానికి రష్యన్ విస్తరణకు ఒట్టోమన్ సామ్రాజ్యాన్ని అడ్డుగోడగా నిలపాలన్న పశ్చిమ ఐరోపా పాలకుల "ఆకాంక్ష" ఐరోపా దౌత్యనీతిని 1914లో తొలి ప్రపంచ యుద్ధం మొదలయ్యే వరకు శాసించింది. ఈ దౌత్యనీతి "తూర్పు సమస్య"గా ప్రసిద్ధిగాంచింది.

బ్రిటీషు ప్రభుత్వాలు ఈ ప్రయత్నాల్లో అగ్రభాగాన ఉండేవి. ఒట్టోమన్ పాలకులను నిలబెట్టడం వల్ల వారు రష్యా ప్రాబల్యానికి అడ్డుకట్ట వేయగలిగారు. రష్యా సైనికంగా విస్తరిస్తే ఉత్తర భారతంలోని తమ స్వంత పాలనకే ముప్పు వాటిల్లగలదని బ్రిటీషు పాలకులు భయపడ్డారు. అలాగే బ్రిటీషు ఉత్పత్తులకు పశ్చిమాసియా, బాల్కన్స్ మార్కెట్లను ఒట్టోమన్లు స్వేచ్ఛగా వాడుకునేందుకు అనుమతించారు.

ఈజిప్టులో ఈ విషయానికి ఉన్న ప్రాధాన్యత నిరూపించబడింది. ఆ దేశంలో (సిరియా, లెబనన్, పాలస్తీనా ప్రాంతాలతోసహా) అధికారం చేతులు మారి అల్బేనియా 'పాషా' వంశానికి చెందిన మహమ్మద్ అలీకి 1805లో దక్కింది. ఒట్టోమన్ సుల్తాన్ పేరు మీద అతడుపాలించినా 1840 వరకు క్రియాశీలంగా వ్యవహరించాడు. అధికారానికి పరిశ్రమలు కీలకమని గుర్తించిన అలీ ఈజిప్టులో పారిశ్రామిక విప్లవం ప్రారంభించడానికి రాజ్యాన్ని వినియోగించుకోవాలని నిర్ణయించాడు. అతడు రాజ్య గుత్తాధిపత్యాలను ఏర్పాటు చేశాడు. ఆధునిక జౌళి యంత్రాలను ఐరోపా నుండి తెప్పించాడు. ఐరోపా నిపుణులను రప్పించి స్థానిక కార్మికులకు శిక్షణ ఇప్పించాడు. ఇనుము, స్టీలు కర్మాగారాలను కూడా స్థాపించాడు. మామ్లూక్ భూస్వాముల నుండి భూములను స్వాధీనం చేసుకొని వాటిలో ఎగుమతులకు ఉద్దేశించిన వాణిజ్య పంటలను సాగు చేయించాడు. ఫలితంగా 1830 దశకం నాటికి ఆదేశం ప్రపంచంలో ఐదవ పెద్ద పత్తి ఎగుమతిదారుగా ఎదిగింది. అదే సమయానికి సుమారు 70,000 మంది ప్రజలు ఆధునిక పరిశ్రమల్లో పని చేసేవారు.

అయితే మహమ్మద్ అలీ ప్రయోగాన్ని 1840లో ఉన్నట్లుండి నిలిపివేశారు. ఈజిప్టుపై మళ్లీ నియంత్రణ సాధించేందుకు బ్రిటన్ ఒట్టోమన్ సామ్రాజ్యానికి నావికాదళ సహాయాన్ని పంపింది. లెబనాన్ తీరం వెంబడి ఉన్న ఈజిప్టు-నియంత్రిత ఓడరేవులను ధ్వంసం చేసింది. సిరియాలో తన సైనిక బలగాలను దింపింది. తన సైనిక బలగాలను తగ్గించేలా అలీపై ఒత్తిడి తెచ్చింది (జౌళి పరిశ్రమలకు సైన్యం సురక్షిత మార్కెట్‌ను అందించింది). అలాగే రాజ్య గుత్తాధిపత్యాలను నిర్మూలించేలా చేసింది. బ్రిటీషు వారు నిర్ధారించిన స్వేచ్ఛా వాణిజ్య విధానాలను అతడు ఆమోదించాల్సి వచ్చింది. అసహనానికి గురైన లార్డ్ పామెర్‌స్టన్ ఈ విధంగా అంగీకరించాడు: "గ్రేట్ బ్రిటన్‌కు మహమ్మద్ అలీని దాసోహం చేయడం చాలా తప్పు. ఈ చర్య వివక్షాపూరితమైనది. కాని మనం స్వార్థపరులం. ఐరోపా కీలక ప్రయోజనాలను కాపాడడానికి మనం అలా చేయకతప్పదు." ఇతర దేశాలలో పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం ప్రబలకుండా ఆదేశాలపై విధానాలను రుద్దడానికి ఐరోపాలోనే అత్యంత పారిశ్రామిక అభ్యున్నతిని సాధించిన బ్రిటన్ పాలకులు ఎంతో సంతోషించేవారు. ఈజిప్టు పారిశ్రామిక విధ్వంసాన్ని తర్వాతి దశకాల్లో చవి చూసింది. అంతకుముందు భారతదేశం, చైనా కూడా ఇలాంటి పరిస్థితిని ఎదుర్కొన్నాయి. మహమ్మద్ అలీ వారసులు తమ బకాయిలను చెల్లించలేక పోవడంతో ఈజిప్టు బ్రిటీషు సైన్యాల అక్రమణను ఎదుర్కొంది.

పారిశ్రామికీకరణ చెందడానికి ఈజిప్టు కనీసం ప్రయత్నమైనా చేయగలిగింది. ఒట్టోమన్ సామ్రాజ్యంలోని మరికొన్ని ప్రాంతాల్లో అలాంటి ప్రయత్నాలు జరిగాయి. అయితే చవకైన విదేశీ ఉత్పత్తులు స్థానిక మార్కెట్లను ముంచెత్తడంతో ఆ ప్రయత్నాలు ఘోరంగా విఫలమయ్యాయి. ఒట్టోమన్లు, బ్రిటీషు భారతదేశాల, జారిస్టు రష్యాల మధ్య నలిగిపోయిన ఇరాన్ సామ్రాజ్యంలో కూడా ఇలాంటి పరిణామాలే సంభవించాయి. విదేశీ ఉత్పత్తుల వెల్లువలో ఆ దేశ పారిశ్రామికీకరణ ప్రయత్నాలు బెడిసికొట్టాయి.

## పదవ అధ్యాయం

# జపాన్ మినహాయింపు

ఐరోపాయేతర ప్రాంతాలలో ఒకే ఒక్క ప్రాంతం విచ్ఛిన్నాన్ని, పతనాన్ని తప్పించుకో గలిగింది. ఆసియాలోని మిగతా భాగం, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలన్నీ పెట్టుబడిదారీ సమాజ నియంత్రణలో ఆర్థికంగా పతనమయ్యాయి. అలాగే తూర్పు ఐరోపాలోని చాలా భాగం అదే దారిలో పయనించింది. ఇదంతా 19వ శతాబ్దంలో జరిగిన పరిణామం. అయితే జపాన్ ఒక్కటే స్థిరంగా నిలబడగలిగింది.

గత వెయ్యేళ్లలో అత్యంత ప్రాచీనమైన చైనా నాగరికత ఆ దేశపు పరిణామాలను ప్రభావితం చేసింది. చైనా సాంకేతిక పరిజ్ఞానం, అక్షర లిపి, సాహిత్యం, అక్కడి ఒక మతం అన్నీ జపాన్ సమాజాన్ని ప్రభావితం చేశాయి. అయితే ఒక ముఖ్యమైన అంశంలో జపాన్ చైనాతో భిన్నంగా ఉండేది. చైనాలో వలె ఆ దేశంలో గొప్ప కాలువలు కాని, నీటి పారుదల వ్యవస్థలు కాని, ప్రబలమైన కేంద్రీకృత రాజ్యంకాని లేవు. 1600 సంవత్సరం వరకు జపాన్‌లో మధ్యయుగాల ఐరోపాతో పోలిన ఆర్థిక, రాజకీయ వ్యవస్థ ఉండేది. అక్కడ ఒక బలహీనమైన చక్రవర్తి ఉండేవాడు. కాని అధికారమంతా బడా భూస్వామ్య దొరల చేతుల్లో ఉండేది. వీరిలో ప్రతి ఒక్కరికి పెద్ద సైనిక బలగం ఉండేది. ఈ సాయుధ మూకలు రైతులను దోపిడీ చేసేవి. అవసరమైనపుడు తమ భూస్వామి పక్షాన శత్రుసైన్యంతో పోరాడేవి.

17వ శతాబ్దం తొలినాళ్లలో తోకుగవ అనే ఒక గొప్ప భూస్వామ్య కుటుంబం ఇతరదొరలను ఓడించడంలో, వారిని లొంగదీసుకోవడంలో సఫలమైంది. ఈ కుటుంబ పెద్ద 'షోగున్'గా అవతారమెత్తాడు. అంటే దేశానికి నిజమైన పాలకునిగా ఆవిర్భవించాడు. అయినప్పటికీ చక్రవర్తి నామమాత్రపు పెద్దగా కొనసాగాడు. షోగున్‌ల రాజధాని ఈడో (ప్రస్తుత టోక్యో)లో మిగతా భూస్వాములంతా చాలా కాలం గడపాల్సి వచ్చింది. గ్రామీణ ప్రాంతాల్లో తమ కుటుంబాలను బందీలుగా వదలి తమ ప్రవర్తనను మార్చుకోవడానికి వారు రాజధానిలో షోగున్ పాలకుల నియంత్రణలో ఉండాల్సి వచ్చింది.

షోగున్‌లు తుపాకులను నిషేధించారు. గత కాలపు మహా పోరాటాల్లో తుపాకులు వినాశకరమైన పాత్రను పోషించి వున్నాయి. (భూస్వామ్య సైన్యాలు తుపాకులను ధరించడం కొనసాగించినా రైతులు, వృత్తిదారులు, వ్యాపారులకు ఆ హక్కును నిరాకరించారు). తమ

పాలనకు ముప్పు తేగల విదేశీ ప్రభావాలను నివారించడానికి కూడా ప్రయత్నించారు. డచ్, చైనా ఓడలు మినహా మిగతా విదేశీ వాణిజ్య వ్యవహారాలన్నింటినీ నిషేధించారు. ప్రత్యేక రాయితీ కలిగిన డచ్, చైనా రవాణా ఓడలు కూడా కఠినమైన పర్యవేక్షణలో కేవలం ఒకే ఒక్క ఓడరేవులోనే అనుమతించబడేవి. విదేశీ గ్రంథాలను పూర్తిగా నిషేధించడమే కాకుండా కాథలిక క్రైస్తవ మతం పుచ్చుకున్న వేలాది మంది ప్రజలపై తీవ్రమైన అణచివేత చర్యలకు కూడా పాల్పడ్డారు.

ఈ చర్యలు గత కాలపు యుద్ధాలను అంతమొందించడంలో సఫలమయ్యాయి. కాని తమ కింది సమాజంలో చోటు చేసుకుంటున్న మార్పును షోగున్‌లు నివారించలేకపోయారు. భూస్వాములు, వారి కుటుంబాలు ఈడోలో కేంద్రీకృతం కావడంతో వారి పోషణ నిమిత్తం ఆహార సరఫరాలను పెంచాల్సి వచ్చింది. ఫలితంగా రాజధాని నగరం బియ్యం వ్యాపారానికి ప్రముఖ కేంద్రంగా మారింది. అలాగే వారి అవసరాలను తీర్చడానికి వృత్తిదారులు ఇతర వ్యాపారులు కూడా పెద్ద సంఖ్యలో రాజధానిలో స్థిరపడ్డారు. జపాన్ నగరాలు ప్రపంచంలోనే అత్యంత విశాలమైన నగరాలుగా ఆవిర్భవించాయి. సమాజంలో తక్కువ హోదా ఉన్నప్పటికీ వ్యాపార వర్గం ముఖ్యమైన వర్గంగా ఎదిగింది. ప్రజారంజక కవిత్వం, నాటకాలు, నవలలతో కూడిన ఒక కొత్త నగర సంస్కృతి అభివృద్ధి చెందింది. రాజ్య అధికార సంస్కృతికి ఇది చాలా భిన్నంగా ఉండేది. 1720 తర్వాత విదేశీ పుస్తకాలపై నిషేధాన్ని కొంత వరకు సడలించడంతో కొందరు మేధావులు పాశ్చాత్య సిద్ధాంతాలపట్ల ఆసక్తిని చూపడం మొదలుపెట్టారు. డచ్ శాస్త్రీయ విద్య పరిశోధనాకేంద్రం సామాన్య శాస్త్రాలు, వ్యవసాయ శాస్త్రం, కోపర్‌నికస్ ఖగోళశాస్త్రంలో అధ్యయనాలను ప్రారంభించింది. డబ్బు కీలకంగా మారడంతో అనేక మంది కిరాయి సైనికులు (సమురాయ్‌లు) పేదరికం పాలయ్యారు. తమ బకాయిలను చెల్లించడానికి ఆయుధాలను అమ్ముకున్నారు, వ్యవసాయాన్ని లేదా హస్తకళలను చేపట్టారు.

ఈలోపు వరుసగా సంభవించిన కరువులు రైతాంగాన్ని తీవ్రంగా దెబ్బతీశాయి. 1732లో సుమారు పది లక్షల మంది ఆకలి చావులకు గురయ్యారు. (అప్పుడు జనాభా 2.6 కోట్ల వరకు ఉండేది). అలాగే 1775లో 2,00,000 మంది, 1780 దశకంలో లక్షలాది మంది ప్రాణాలు కోల్పోయారు. అదే సమయంలో స్థానికంగా రైతాంగ తిరుగుబాట్లు వరుసగా సంభవించాయి. తోకుగువ రాజకీయ ఉపరితల నిర్మాణం చెక్కుచెదరకున్నా సమాజంలోని ఆయా శక్తులు తమ అస్థిత్వాన్ని చాటుకోవడం మొదలుపెట్టాయి. పశ్చిమ ఐరోపాలో పునర్వికాస కాలంలో చోటు చేసుకున్న పరిణామాలతో జపాన్ సామాజిక మార్పులను పోల్చవచ్చు.

1853లో అమెరికా సంయుక్త రాష్ట్రాల నావికా దళ కమాండర్ పెర్రీ జపాన్ తీరానికి నాలుగు యుద్ధ నౌకలతో చేరుకొని విదేశీ వాణిజ్యానికి ద్వారాలు తెరవాలని జపాన్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేసినపుడు పైన పేర్కొన్న నేపథ్యం ఉండేది. సమాజంలోని పాలకవర్గం మొత్తం గందరగోళంలో పడిపోయింది. సైనిక సమతుల్యానికి ప్రాధాన్యతనిచ్చిన తోకుగవ ప్రభుత్వం పాత పద్ధతుల్లో ఇక వ్యవహారాలను ఏ మాత్రం నిర్వహించలేమన్న నిర్ధారణకు వచ్చింది. నల్లమందు యుద్ధాలలో అప్పుడు చైనాకు పట్టిన గతిని నివారించడానికి విదేశీ

వాణిజ్యానికి రాయితీలివ్వడమే ఏకైక మార్గంగా మిగిలింది. కాని పాలకవర్గాలలోని మిగతా కుటుంబాలకు పాత పద్ధతులే పవిత్రంగా ఉండేవి. విదేశీయులకు ఎలాంటి రాయితీలిచ్చినా అది ఉన్నత విలువలకు తిలోదకాలివ్వడమే అవుతుందని భావించాయి. పాలకవర్గాల మధ్య చిక్కుకుపోయిన దిగువ శ్రేణి కిరాయి సైనికులు (సమురాయ్‌లు) ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. "చక్రవర్తి ఆరాధించడం, అనాగరికులను సైనిక (అవసరమైతే విప్లవ) పద్ధతుల్లో తరిమికొట్టడమే" ఆ సంఘం లక్ష్యంగా ఉండేది. ఒక స్థాయిలో వారి డిమాండ్లు పూర్తిగా సాంప్రదాయబద్ధమైనవి. వందల సంవత్సరాలపాటు అధికారానికి దూరంగా ఉన్న "చక్రవర్తికి పాత వైభవాన్ని కల్పించడానికి వారు సన్నద్ధమయ్యారు. "అనాగరికుల" ఆర్థిక, సైనిక ప్రాబల్యాన్ని ఎదురొడ్డి నిలవాలంటే జపాన్ సమాజంలో సమూల మార్పులు రావాల్సిన అవసరముందని కొందరు సమురాయ్‌లు గ్రహించారు. 1860 దశకం చివరలో చెలరేగిన 'మేజీ' విప్లవంతో సమురాయ్‌లకు తమ లక్ష్యాలను సాధించే అవకాశం లభించింది. అప్పుడు ఇద్దరు బడా భూస్వాములు తమ సైనిక బలగాలతో తోకుగువ షోగున్‌పై దాడి చేసి చక్రవర్తి పేరున ఒక కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

ఇది ఉన్నత స్థాయి నుండి బయల్దేరిన విప్లవం. దాని నినాదాలు సాంప్రదాయబద్ధమైనవి. అధికార మార్పిడివల్ల విశాలమైన ప్రజానీకానికి ఏ మాత్రం ప్రయోజనం కలగలేదు. గత విజయాలను పరిరక్షించుకోవాలంటే క్యాపిటలిజం వైపు అడుగులు వేయక తప్పదని ప్రభుత్వ పెద్దలు గ్రహించారు. పరస్పర విరోధులైన భూస్వామ్య దొరల అధికారాన్ని రద్దు చేశారు. భూస్వాములు తమ ప్రత్యేక ప్రయోజనాలను కాపాడుకోవడానికి రాజ్యంపై ఆధారపడేలా చేశారు. సమురాయ్, రైతులు, వ్యాపారులు, వృత్తిదారుల మధ్య ఉన్న సామాజిక విభజనలను నిర్మూలించారు. గతంలో రైతాంగాన్ని దోపిడీ చేయడం ద్వారా సమురాయ్‌లు కూడగట్టే ధనం ఇప్పుడు నేరుగా రాజ్య ఖజానాలోకి వెళ్లింది. కనీస ఉపాధి కంటే ఎక్కువగా ఆశించే సమురాయ్ రాజ్యం లేదా ప్రైవేటు కొలువులలో ఉద్యోగం చేయాల్సి వచ్చేది. అన్నిటికంటే ముఖ్యంగా, ప్రభుత్వం కొత్త పరిశ్రమలను స్థాపించింది. వాటికి నిధులను రాజ్య పన్నుల రాబడి నుండి కేటాయించాయి. రాజ్య సంపూర్ణ నియంత్రణలో పరిశ్రమలను నిర్వహించారు. పరిశ్రమలు తమ స్వంత కాళ్లపై నిలబడగలిగే శక్తిని సంపాదించుకున్నప్పుడు రాజ్యం వాటిని వ్యాపార లేదా బ్యాంకింగ్ రంగంలో ఉన్న కుటుంబాలకు అప్పగించింది. ఈ కుటుంబాలకు రాజ్యంతో సన్నిహిత సంబంధాలు ఉండేవి.

కేవలం జపాన్‌లోనే కాకుండా అంతర్జాతీయంగా కూడా క్యాపిటలిజం భవిష్యత్ అభివృద్ధికి 'మేజీ' విప్లవం రెండు విధాలా కీలకమైనది. సమాజాన్ని పూర్తిస్థాయి క్యాపిటలిస్టు సంబంధాలుగల ఉత్పత్తి వైపు నెట్టడానికి బూర్జువా వర్గమే చొరవ తీసుకోవలసిన అవసరం లేదని అది నిరూపించింది.

ఇంగ్లాండ్ విప్లవంలో మధ్యతరగతి వర్గం సాధించిన విజయాలు లేదా ఫ్రెంచి విప్లవంలో బూర్జువా వర్గానికి చెందిన జాకోబిన్లు సాధించిన మార్పులను జపాన్‌లో పాత దోపిడీ వర్గాలు తీసుకువచ్చాయి.

పరిశ్రమల స్థాపన, శ్రమలో కొత్త క్యాపిటలిస్టు పద్ధతులను అమలు చేయడానికి రాజ్యం ఒక సాధనంగా ఉపయోగపడగలదని మేజీ విప్లవం నిరూపించింది. క్యాపిటలిస్టు వర్గం లేకపోయినప్పటికీ రాజ్యం పారిశ్రామికీకరణ ప్రక్రియను విజయవంతంగా పూర్తి చేసింది. ఆ తర్వాతే జపాన్‌లో పారిశ్రామిక క్యాపిటలిస్టుల వర్గం ఉద్భవించింది. ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే రాజ్యం ఆధునిక పరిశ్రమల్లో వేతన కార్మికులను పూర్తిగా సద్వినియోగం చేసుకొని భారీ పరిశ్రమలను స్థాపించగలిగింది. క్యాపిటలిజం వైపు జపాన్ పయనం తర్వాతి శతాబ్దంలో ప్రపంచ దేశాలకు ఆదర్శప్రాయమైంది. బ్రిటీషు లేదా ఫ్రెంచి పారిశ్రామికీకరణ నమూనాల కంటే జపాన్ మార్గమే శిరోధార్యమైంది.

ఈ లోగా కొత్తగా ఆవిర్భవించిన జపాన్ క్యాపిటలిజం మేజీ విప్లవం తర్వాత 27 ఏళ్లకు తన శక్తిని చాటగలిగింది. ముఖ్యంగా చైనాకు వ్యతిరేకంగా తన స్వంత యుద్ధాన్ని ప్రారంభించడం ద్వారా తన ప్రాబల్యమేమిటో నిరూపించింది. విదేశీ జోక్యాలతో తీవ్రంగా దెబ్బతిన్న ఒక దేశం నేడు దోపిడీదారి రాజ్యాలలో ఒకటిగా అవతరించింది.

## పదకొండవ అధ్యాయం

# స్వర్గం ముట్టడి : పారిస్ కమ్యూన్

**1870** దశకం ప్రారంభమయ్యే నాటికి కొత్త క్యాపిటలిస్టు వ్యవస్థ ప్రపంచాన్ని జయించే దిశగా పయనిస్తోంది. అమెరికా, పశ్చిమ ఐరోపాలలో బలంగా పాతుకుపోయింది. ఈ ప్రాంతాలు మిగతా ప్రపంచాన్ని శాసించడం మొదలుపెట్టాయి. చివరికి రష్యన్ జార్ కూడా 1861లో కౌలుదారీ వ్యవస్థను రద్దు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. అయితే అతడు సగానికిపైగా భూమిని పాత భూస్వామ్య వర్గానికే కేటాయించి రైతాంగాన్ని భూస్వాముల దయా దాక్షిణ్యాలకు వదలి పెట్టాడు. ప్రతిచోటా ప్రపంచం తలకిందులు కావడం మొదలుపెట్టింది.

కాని పారిస్‌లో జరిగిన పరిణామాలు క్యాపిటలిజం ఒక్కసారి అత్యున్నత స్థానాన్ని చేరుకోగానే మార్పులు ఆగిపోవని నిరూపించాయి. బూర్జువా వర్గం తన స్వంత గోతిని తవ్వే పరికరాలను ఉత్పత్తి చేస్తుందని మార్క్స్, ఏంగెల్స్‌లు కమ్యూనిస్టు మేనిఫెస్టోలో పేర్కొని ఉన్నారు. 1871 మార్చి 18న ఈ విషయం ఎంత వాస్తవికమైనదో ఫ్రెంచి బూర్జువా వర్గం ప్రత్యక్షంగా తెలుసుకుంది.

నాలుగేళ్ల ముందు లూయీ నెపోలియన్ ఐరోపాలోని ఇతర పాలకులకు తన సామ్రాజ్య వైభవాన్ని ఒక "గొప్ప ప్రదర్శన"లో సాక్షాత్కరించాడు. సుమారు 482 మీటర్లు ఎత్తు కలిగిన ఒక దీర్ఘవృత్తాకారం గల అద్దాల భవంతిలో ఆ ప్రదర్శనను ఏర్పాటు చేశాడు. దాని గోపురం ఎంత ఎత్తులో ఉండేదంటే దానిని చేరుకోవడానికి యంత్రాన్ని ఉపయోగించాల్సి వచ్చేది.

వేడుక జరుపుకోవడానికి అతడికి ఏదో ఒక కారణం ఉండి ఉండాలి. అతడు 1851లో గణరాజ్యాన్ని నిర్మూలించినప్పటి నుండి ఫ్రాన్స్ గణనీయమైన క్యాపిటలిస్టు ప్రగతిని చవి చూసింది. ఆధునిక పరిశ్రమలు పెరిగే కొద్దీ పారిశ్రామిక ఉత్పత్తి ద్విగుణీకృతమైంది. పాత హస్తకళల ఉత్పత్తి క్యాపిటలిస్టుల నియంత్రణలోకి వచ్చి. వారు వృత్తిదారులను ఫ్యాక్టరీ కార్మికులుగానే పరిగణించారు.

కాని అందరూ భావించినట్లుగా మాత్రం చక్రవర్తి ప్రాబల్యం ఉండేది కాదు. అది సమతుల్య చర్యపై ఆధారపడి ఉండేది. పాలకవర్గంలోని ప్రత్యర్థులను రెచ్చగొట్టి తన స్థానాన్ని పదిలం చేసుకునేవాడు. తొలి నెపోలియన్‌లాగా ఇటలీ, మెక్సికోలలో (మెక్సికోలో ఫ్రెంచి అభ్యర్థి మాక్సిమిలియన్‌ను చక్రవర్తిగా ప్రతిష్టింపచేయడానికి అతడు ప్రయత్నించాడు) చేపట్టిన

సైనిక సాహసాలను అనుకరించి తన ప్రాబల్యాన్ని మరింత విస్తరింపచేసుకునేందుకు ప్రయత్నించాడు. అయితే ఈ ఎత్తుగడలేవీ అతడి పాలనకు వ్యతిరేకత పెరగకుండా నివారించలేకపోయాయి. బూర్జువాలోని కొన్ని వర్గాలు వ్యాపారంలో ఊహాగానాలతో తీవ్రంగా నష్టపోవడంతో చక్రవర్తిపట్ల విద్వేషాన్ని పెంచుకున్నాయి. మరోవైపు చక్రవర్తికి అత్యంత సన్నిహితులైన పెట్టుబడిదారులు మరింత సంపన్నులయ్యారు. మెక్సికోలో చేపట్టిన సైనిక చర్య ఘోరంగా విఫలమైంది. మాక్సిమిలియన్‌ను ఒక సాయుధ బలగం కాల్చి చంపింది. 1848 ఊచకోతలను మరిచిపోని పారిస్ కార్మికులు తమ వేతనాల కంటే జీవన మనుగడ ఖర్చులు ఎక్కువ కావడంతో ప్రభుత్వాన్ని తీవ్రంగా ద్వేషించారు. లూయీ బొనాపార్ట్‌కు అత్యంత విధేయుడైన ఉన్నతాధికారి హౌస్‌మన్ ఇలా నివేదించాడు : “పారిస్‌లోని సగానికి పైగా ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారు. అనేక మంది ఆకలి మంటల అంచులకు చేరుకున్నారు. వారు రోజుకు 11 గంటలు తీవ్రంగా శ్రమిస్తున్నా ఈ పరిస్థితి నెలకొని ఉంది.” 1869 నాటికి రిపబ్లికన్ విపక్షం పారిస్, తదితర పెద్దనగరాల్లో పురపాలక మండలి ఎన్నికల్లో ఘన విజయాన్ని సాధించగలిగింది. తర్వాత 1870 జులైలో లూయీ బోనాపార్ట్ తనను యుద్ధానికి రెచ్చగొట్టేలా ప్రష్యన్ నాయకుడు బిస్మార్క్‌కు అవకాశం కల్పించాడు.

సెడాన్ యుద్ధంలో ఫ్రెంచి సైన్యాలు దారుణంగా ఓడిపోయాయి. లూయీ బొనాపార్ట్ తన విశ్వసనీయతను పూర్తిగా కోల్పోయాడు. పాలకవర్గాలు అతడిని పదవీచ్యుతుడిని చేశాయి. అధికారం బూర్జువా రిపబ్లికన్ విపక్షానికి దక్కింది. కాని అంతలోనే ప్రష్యన్ సైన్యం పారిస్ నగరాన్ని ముట్టడించడం మొదలుపెట్టింది. బిస్మార్క్ కఠినమైన షరతులు విధించాడు. భారీ నగదును చెల్లించడంతోపాటు ఫ్రెంచి అల్సేస్ - లొర్రెయిన్‌ను ప్రష్యాకు అప్పగించాలని డిమాండ్ చేశాడు.

పారిస్ నగరం ఐదు నెలలపాటు సైనిక ముట్టడికి గురైంది. ప్రజలు దుర్భర పరిస్థితులను ఎదుర్కొన్నారు. మనుగడ కోసం కుక్కలు, ఎలుకలను చంపి తినేవారు. శీతాకాలంలో వెచ్చదనం కోసం కలపను కూడా సేకరించలేకపోయారు. ధరలు ఆకాశాన్ని అంటడంతో కార్మికులు, వృత్తిదారులు, వారి కుటుంబాలు అనేక అగచాట్లు పడ్డాయి. అలాగే నగరాన్ని కాపాడుకునే భారం కూడా వారిపైనే పడింది. జాతీయ భద్రతా దళంలో ప్రజలు పెద్ద సంఖ్యలో చేరడంతో దాని బలం 3,50,000కు చేరుకుంది. తమ స్వంత ప్రతినిధులను సైనికాధికారులుగా ఎన్నుకోవడం ద్వారా వారు సైన్యానికి ఉన్న మధ్యతరగతి స్వరూపాన్ని మార్చివేశారు. వారి ప్రతిఘటన అనతికాలంలోనే రిపబ్లికన్ ప్రభుత్వంతోపాటు ప్రష్యన్లను కూడా కలవరానికి గురి చేసింది. 1792 చిన్న వ్యాపారుల వారసులు, 1848 పోరాట వీరుల సంతానం మరోసారి ఆయుధాన్ని ధరించారు. 'ఎర్ర' మండళ్లు, విప్లవ దినపత్రికలు అన్ని చోట్లా ఆవిర్భవించాయి. 1848లో బూర్జువా రిపబ్లికన్లు తమ పట్ల ఎలా వ్యవహరించారో అవి కార్మికులు, వృత్తిదారులకు గుర్తు చేశాయి. కార్ల్ మార్క్స్ పేర్కొన్నట్లు “సాయుధ పారిస్ సాయుధ విప్లవానికి చిహ్నమైంది.”

అక్టోబరు 31న ఒక వామపక్ష వర్గం తమ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి చేసిన ప్రయత్నాన్ని రిపబ్లికన్లు తిప్పికొట్టగలిగారు. అలాగే జనవరి 22న జరిగిన మరో ప్రయత్నాన్ని

విఫలం చేశారు. బ్రిట్టానీ నుండి క్రమబద్ధ సైన్యాలను రప్పించి బెర్‌విల్లే అనే కార్మికవర్గ నివాస ప్రాంతంలో గుమికూడిన సమూహంపై కాల్పులు జరిపించారు. అయితే మరో తిరుగుబాటు వస్తే దానిని అణచివేయలేమన్న భయం ప్రభుత్వానికి పట్టుకుంది.

"అంతర్యుద్ధం కేవలం కొన్ని అడుగుల దూరంలో ఉంది. కరువు కొన్ని గంటల వ్యవధిలో సంభవించే అవకాశం ఉంది," అని ఉపాధ్యక్షుడు ఫావ్ర్ పేర్కొన్నాడు. ప్రభుత్వాన్ని దక్కించుకోవాలంటే ఒకే ఒక్క మార్గం ఉందని నిర్ధారించాడు. జనవరి 23వ రాత్రి అతడు రహస్యంగా ప్రష్యన్ సరిహద్దులను దాటుకొని వెళ్ళి ఫ్రెంచి లొంగుబాటు విధివిధానాలను చర్చించాడు.

రహస్య చర్చల విషయం బయటికి పొక్కడంతో పారిస్ పేదలు ఆగ్రహం వ్యక్తం చేశారు. వారు అనవసరంగా ఐదు నెలలపాటు తీవ్ర ఇక్కట్లను ఎదుర్కోవలసి వచ్చింది. ఆ తర్వాత కేవలం ఎనిమిది రోజుల గడువులోనే రిపబ్లికన్ ప్రభుత్వం ఎన్నికలు నిర్వహించింది. లొంగుబాటు నిర్ణయానికి ప్రజల ఆమోదం కోసమే అత్యవసరంగా ఎన్నికలు చేపట్టారు. 1848లో వలె పారిస్ వామపక్షానికి గ్రామీణ ప్రాంతాలలో ప్రచారం నిర్వహించడానికి సమయం లభించలేదు. గ్రామీణ ప్రాంతాలలోనే మెజారిటీ ఓటర్లు నివసించేవారు. వారిపై ధనిక భూస్వాములు, పురోహితుల ప్రభావం తీవ్రంగా ఉండేది. ఈ కారణంగా ప్రజల నిర్ణయాన్ని వారు తమకు అనుకూలంగా మలచుకున్నారు. ఎన్నికైన 675 పార్లమెంటు సభ్యులలో 400 మంది రాచరికవాదులు ఉన్నారు. పారిస్ ప్రజల్లో ద్వేషభావం మరింత పెరిగింది. ముట్టడి సమయంలో జరిగిన నయవంచన ఇప్పుడు గణరాజ్యాన్ని నయవంచనకు గురి చేసింది. మూడో నయవంచన కొత్త ప్రభుత్వం రూపంలో వచ్చింది. 71 సంవత్సరాల ఆగస్ట్ థియర్స్ ప్రభుత్వాధిపతిగా నియమితుడయ్యాడు. తాను 'ఉదారవాద రిపబ్లికన్'నని అతడు ఇప్పుడు పేర్కొన్నాడు. కాని 1834లో బయల్దేరిన రిపబ్లికన్ ఉద్యమాన్ని అణచివేయడం ద్వారా తన పేరును, వాదనను సార్థకం చేసుకున్నాడు.

ఆ సమయానికి మాత్రం పారిస్ ప్రజలు ఆయుధాలను తమ వద్దే ఉంచుకున్నారు. మరోవైపు ప్రష్యాతో ఒప్పందంలో భాగంగా క్రమబద్ధ సైన్యాన్ని రద్దు చేశారు. అన్నింటికంటే మించి, అనేక మంది ధనిక మధ్యతరగతి ప్రజలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని పారిస్ నగరాన్ని వీడి వెళ్లారు. ఫలితంగా జాతీయ భద్రతా దళానికి శ్రామిక వర్గ స్వరూపం సంతరించుకుంది.

పారిస్ ప్రజలతో సంఘర్షణ అనివార్యమని థియర్స్‌కు బాగా తెలుసు. జాతీయ భద్రతా దళ ఆయుధాలు వారి చేతిలోనే ఉన్నాయని గ్రహించాడు. ఆయుధాలతోపాటు 200 ఫిరంగులు కూడా ప్రజల నియంత్రణలో ఉండేవి. అందుకే వీటిని మాంట్‌మార్త్రె ఎగువ ప్రాంతాల నుండి స్వాధీనం చేసుకొని కేంద్ర ఆయుధాగారానికి తీసుకురావడానికి థియర్స్ క్రమబద్ధ సైనికులను పంపాడు. ఆయుధాలను లాక్కెళ్లడానికి సైనికులు గుర్రాల కోసం ఎదురు చూస్తుండగా స్థానిక ప్రజలు వారితో వాదించడం మొదలుపెట్టారు. లిస్సాగరే గుర్తు చేసినట్లు : "మహిళలు పురుషుల రాక కోసం వేచి చూడలేదు. మర తుపాకులను సైనికులకు అప్పగిస్తూ వారు ఇలా అన్నారు : "ఇది సిగ్గుమాలిన చర్య. మీరేమి చేస్తున్నారో మీకు తెలుసా?" ఎలా స్పందించాలో అర్థం కాక సైనికులు అలాగే నిలబడిగాపోగా 300 మందితో కూడిన జాతీయ

భద్రతా దళం బలగమొకటి కవాతు నిర్వహించింది. వారు వాయించిన మృదంగాలు ప్రజలను ప్రతిఘటనకు సిద్ధం చేశాయి. జాతీయ భద్రతా సిబ్బంది, మహిళలు, పిల్లలు సైనికులను చుట్టుముడుతుండగా లేకామ్త్ అనే సైనికాధికారి ప్రజలపై కాల్పులు జరపాలని మూడుసార్లు ఆదేశించాడు. "అతడి సైనికులు కదలకుండా అలాగే నిలబడిపోయారు. ప్రజలు ముందుకు దూసుకువచ్చారు. సైనికులతో పరిచయం పెంచుకున్నారు. లేకామ్త్, తదితర సైనికాధికారులను నిర్బంధించారు."

ఆ రోజు (మార్చి 18) మధ్యాహ్నం మూడింటికల్లా థయర్స్, అతడి ప్రభుత్వం రాజధానిని వదలి పారిపోయింది. ప్రపంచంలో మహానగరాల్లో ఒకటైన పారిస్ సాయుధ కార్మికుల చేతుల్లోకి వచ్చింది. ఈసారి వారు అధికారాన్ని మధ్యతరగతి రాజకీయ నాయకులకు అప్పగించడానికి సిద్ధంగా లేరు.

## కొత్త తరహా అధికారం

సాయుధ ప్రజలు తొలుత జాతీయ భద్రతా దళం నుండి ఎన్నికైన నాయకుల ద్వారా అధికారాన్ని చెలాయించారు. భద్రతా దళ 'కేంద్ర కమిటీ' ప్రభుత్వంగా ఉండేది. అయితే తమది నియంతృత్వ పాలన అనే భావన ప్రజల్లో కలిగించేలా ఏ ఒక్క పని కూడా చేయరాదని ఈ నాయకులు తీర్మానించుకున్నారు.

'కమ్యూన్' అనే పాలక మండలికి ప్రతి ప్రాంతంలోనూ సార్వజనిక ఓటు హక్కు (పురుషులకు) ఆధారంగా ఎన్నికలు నిర్వహించారు. పార్లమెంటు సభ్యులకు భిన్నంగా కమ్యూన్‌కు ఎన్నికైన వారిని ప్రజలు వెనక్కి పిలిపించే ఏర్పాటును ప్రవేశపెట్టారు. ప్రజల మద్దతును కోల్పోయే వారికి వృత్తి నిపుణునికి లభించే సగటు వేతనం తప్ప మరో రాయితీ ఇచ్చే వారు కాదు. ఇంకా చెప్పాలంటే ఎన్నికైన ప్రతినిధులు కేవలం చట్టాలను ఆమోదించి వాటి అమలు బాధ్యతను అధికారులకు అప్పగించకూడదు. తాము స్వయంగా తీసుకున్న నిర్ణయాలను ఆచరణలో పెట్టే బాధ్యత కూడా వారిపైనే ఉండేది.

కమ్యూన్‌ను సమర్థిస్తూ తాను రచించిన "ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం" అనే గ్రంథంలో మార్క్స్ ఇలా పేర్కొన్నారు :

> "పాత రాజ్యాన్ని వారు నిర్మూలించి తమదైన ఒక కొత్త నిర్మాణాన్ని దాని స్థానంలో ప్రవేశపెట్టారు. వర్గ సమాజం ఆవిర్భవించినప్పటి నుండి ఇంతటి ప్రజాస్వామ్యయుతమైన పాలనా వ్యవస్థ మరొకటి ఏర్పడలేదు. పాలకవర్గానికి చెందిన ఏ సభ్యుడు ప్రజలకు పార్లమెంటులో ప్రాతినిధ్యం వహించాలి అని మూడేళ్లకో, ఆరేళ్లకోసారి నిర్ణయించే బదులు కమ్యూన్‌గా ఏర్పడిన ప్రజల అవసరాలను సార్వజనిక ఓటు హక్కు తీరుస్తుంది. గతంలో రాజ్యం సమకూర్చుకున్న అధికారాలన్నింటినీ కమ్యూన్ రాజ్యాంగం సామాజిక మండలికి ధారాదత్తం చేస్తుంది. పాత రాజ్య వ్యవస్థ సమాజంపై జలగలా బ్రతుకుతూ సమాజంలో స్వేచ్ఛను హరించివేసింది.

"కమ్యూన్ అసలు రహస్యం ఇదే. అది మౌలికంగా శ్రామికవర్గ ప్రభుత్వం ఉత్పత్తిదారులు, వినియోగవర్గం మధ్య జరిగిన సంఘర్షణ నుండి అది పుట్టుకు వచ్చింది. ఎట్టకేలకు శ్రామిక వర్గానికి రాజకీయ సాధికారిత కల్పించగల రాజకీయ స్వరూపాన్ని ప్రజలు కనిపెట్టగలిగారు."

నగర శ్రామిక వర్గప్రతినిధిగా కమ్యూన్ వారి ప్రయోజనాలకు అనుగుణంగా చర్యలను తీసుకుందని మార్క్స్ గుర్తు చేశారు. బేకరీలలో రాత్రిపూట శ్రమను, కార్మికులపై యజమానులు విధించే జరిమానాలను నిషేధించింది. యజమానులు దుకాణాలు లేదా ఫ్యాక్టరీలను మూసివేస్తే ప్రభుత్వం వాటి నిర్వహణను కార్మిక సంఘాలకు అప్పగించింది. విధవలకు పెన్షన్‌ను అందించడంతోపాటు ప్రతి చిన్నారికి ఉచిత విద్య సౌకర్యాన్ని కల్పించింది. పారిస్ ముట్టడి సమయంలో ప్రజలు తీసుకున్న రుణాలను వసూలు చేయకుండా వడ్డీ వ్యాపారులను నిరోధించింది. అద్దె చెల్లించకపోతే ప్రజలను ఇళ్ల నుండి ఖాళీ చేసే యజమానుల అధికారాన్ని రద్దు చేసింది. సైనికవాద చిహ్నాలను కూల్చివేయడం, ఒక జర్మన్ కార్మికుడిని కార్మిక మంత్రిగా నియమించడం ద్వారా కమ్యూన్ తన అంతర్జాతీయ వాదాన్ని కూడా చాటుకుంది.

శ్రామిక ప్రభుత్వం భవిష్యత్‌లో చేపట్టబోయే కార్యక్రమాల గురించి వివరించడానికి కమ్యూన్‌కు అవకాశం లభించలేదు. ఎందుకంటే రిపబ్లికన్ ప్రభుత్వం ఉన్నట్లుండి దానిని అణచివేయడానికి సాయుధ బలగాలను సమీకరించడం మొదలుపెట్టింది. గత సంవత్సరం ఫ్రెంచి సైనికులను యుద్ధ బందీలుగా తీసుకున్న ప్రష్యా వారిని వెంటనే విడుదల చేయాలని ప్రభుత్వం బిస్మార్క్‌ను ప్రాధేయపడింది. వీరు (యుద్ధ బందీలు) పారిస్ విప్లవ ఆలోచనలు, సిద్ధాంతాల ప్రభావానికి దూరంగా ఉండేవారు. ప్రభుత్వం వారిని వర్సెయిల్స్‌లో సమీకరించింది. వారితోపాటు గ్రామీణ ప్రాంతాల నుండి యువకులను (సైన్యంలో కొత్తగా నియమితులైన వారు) కూడా సమావేశపరిచింది. రాచరిక సమర్ధకులైన సైనికాధికారులు ఈ బలగాలకు నాయకత్వం వహించారు. ఏప్రిల్ చివరికల్లా పారిస్ నగరాన్ని థయర్స్ కొత్త సైన్యాంతో ముట్టడించాడు. కమ్యూన్‌ను అణచివేయడమే ఈ ముట్టడి ప్రధాన లక్ష్యం. ప్రష్యన్ సరిహద్దుల గుండా తమ సైన్యాన్ని తీసుకెళ్లడానికి అతడు బిస్మార్క్‌తో ఒప్పందం కుదుర్చుకున్నాడు. కమ్యూన్ భారీ సవాళ్లను ఎదుర్కొంది. దానికి మరో సమస్య కూడా ఎదురైంది. దానికి ఎన్నికైన ప్రతినిధులు తమ లక్ష్యానికి పూర్తిగా కట్టుబడి ఉన్నా తమకు వ్యతిరేకంగా పోగవుతున్న శక్తులకు ఏ విధంగా ఎదుర్కోవాలనే విషయాన్ని అర్థం చేసుకొనే రాజకీయ పరిజ్ఞానం వారికి ఉండేది కాదు.

1830 దశకం నుండి ఫ్రాన్స్ కార్మికవర్గంలోనే రెండు ప్రధాన రాజకీయ పంథాలు అభివృద్ధి చెందాయి. మొదటిది అగస్త్ బ్లాంకితో ముడిపడి ఉన్న రాజకీయ పంథా 1793 జాకోబిన్‌వాదం కంటే అతివాద, మరింత సామాజిక స్పృహ ఉన్న కార్మికోద్యమాన్ని ఈ పంథా ప్రబోధించింది. శ్రామిక వర్గసక్షాన పోరాడే అత్యంత చాణక్యంగల మైనారిటీ వర్గ నాయకత్వ పాత్రకు అది చాలా ప్రాధాన్యతను ఇచ్చింది. ఈ కారణంగానే కార్మిక వర్గం సిద్ధంగా లేకపోయినప్పటికీ వేర్పాటువాద ఉద్యమాలను వరుసగా తీసుకురావడంలోనే బ్లాంకీ జీవితం గడచిపోయింది.

ఉద్యమం విఫలమైన ప్రతిసారి అతడు సుదీర్ఘకాలం నిర్బంధంలో గడపాల్సి వచ్చింది. మరోవైపు కార్మికులు అతడి నాయకత్వం లేకుండానే చర్యకు ఉపక్రమించారు. (కమ్యూన్ అంతటా వారు రిపబ్లికన్ ప్రభుత్వం చేతిలో నిర్బంధానికి గురయ్యారు)

రెండవ రాజకీయ పంథా ప్రోధన్ సామాజిక బోధనల నుండి ఆవిర్భవించింది. జాకోబిన్‌వాద అనుభవానికి వ్యతిరేకంగా అతడి అనుచరుల్లో తీవ్రమైన విద్వేషం పెరిగిపోయింది. రాజకీయ కార్యాచరణకు వారు స్వస్తి పలికారు. ఉమ్మడితనంతోనే కార్మికులు తమ సమస్యలను పరిష్కరించుకోగలరని వాదించారు. రాజ్యం గురించి ఆందోళన చెందకుండా కార్మిక సంఘాలు సహకార వ్యాపార సంస్థలను ఏర్పాటు చేయాలని పిలుపునిచ్చారు.

రెండు పంథాలు భయంకరమైన రీతిలో అసంపూర్ణంగా ఉన్నాయని మార్క్స్ గ్రహించాడు. ఫ్రెంచి విప్లవం నుండి కార్మికులు నేర్చుకోవలసింది ఎంతో ఉందనడంలో అతడికి ఎలాంటి సందేహం లేదు. కాని ఫ్రెంచి అనుభవం కంటే కార్మికులు మరో అడుగు ముందు వేయాల్సి ఉంటుందని నమ్మాడు. బ్లాంకిస్టులు వాదించినట్లు నిర్ణయాత్మకమైన రాజకీయ కార్యాచరణ తప్పకుండా ఉండాలి. కాని అది సమీకృత ప్రజాకార్యకలాపాలపై ఆధారపడి ఉండాలి, అంతే కాని చిన్న సంఘాల వీరోచిత చర్యలపై కాదు. ప్రోధన్ అనుచరులు వాదించినట్లు ఉత్పత్తిని ఆర్థికపరంగా ప్రక్షాళన చేయాలి. కాని అది రాజకీయ విప్లవం లేకుండా సాధ్యపడదు. అయితే పారిస్‌లో పరిణామాలను ప్రభావితం చేయగల స్థితిలో మార్క్స్ లేడు. కమ్యూన్‌లో బ్లాంకిస్టు వెయిల్లెంత్ లాంటి వ్యక్తులు మార్క్స్‌తో చేతులు కలపడానికి సిద్ధంగా ఉండేవారు కాని మార్క్స్ సిద్ధాంతాలను పూర్తిగా ఆమోదించేవారు ఒక్కరు కూడా లేరు. జాతీయ భద్రతా దళ కేంద్ర కమిటీతోపాటు కమ్యూన్‌లో కూడా మార్క్సిస్టులు ఉండేవారు కాదు. రెండు సంఘాలలోనూ బ్లాంకిస్టులు లేదా ప్రోధనిస్టులు ఉండేవారు. రెండు పంథాల లోపాలవల్ల వారి నిర్ణయ నిర్ధారణ సామర్థ్యం దెబ్బతింది.

మార్చి 18న పారిస్ నుండి పలాయనం చిత్తగించినపుడు రిపబ్లికన్ ప్రభుత్వానికి ఒక్క సాయుధ బలగం కూడా ఉండేది కాదు. ఆ సమయంలో జాతీయ భద్రతా దళం వర్సెయిల్స్‌పై దండెత్తి రిపబ్లికన్ సమర్థకులను ఎలాంటి కాల్పులు జరపకుండానే ఛిన్నాభిన్నం చేసే అవకాశం ఉండేది. కాని ప్రోధన్ సాంప్రదాయమైన రాజకీయేతర కార్యాచరణ కారణంగా కమ్యూన్ ఉత్తమ తీర్మానాలను ఆమోదించడంలోనే కాలం గడిపింది. మరోవైపు థయర్స్ స్వేచ్ఛగా తన బలగాలను సమీకరించాడు.

ఏప్రిల్ 2న పారిస్‌పై బాంబులు కురిపించడం ద్వారా థయర్స్ తన దురాక్రమణ లక్ష్యాన్ని చాటినప్పుడు కమ్యూన్ పెద్దలు వర్సెయిల్స్‌పై దండెత్తాలని నిజంగానే పిలుపునిచ్చారు. కాని అందుకు తగిన ఏర్పాట్లను సంపూర్ణంగా చేయలేకపోయారు. సరైన నిర్వహణ లేకుండానే జాతీయ భద్రతా దళాన్ని సాగనంపారు. శత్రువర్గం నుండి ఫిరంగి దాడులను తిప్పికొట్టడానికి భద్రతాదళం వద్ద ఎలాంటి ఫిరంగులు లేవు. వర్సెయిల్స్‌లో బలహీనంగా ఉన్న సైనిక బలగాలను వారు అనవసరంగా విజయాన్ని అప్పగించారు. వారిని సునాయసంగా చెదరగొట్టే అవకాశాన్ని పూర్తిగా కోల్పోయారు.

పారిస్‌లోనే మరో తప్పిదాన్ని సమాంతరంగా చేశారు. దేశానికి చెందిన బంగారు నిల్వలన్నీ బ్యాంక్ ఆఫ్ ఫ్రాన్స్ పెట్టెల్లో భద్రపరచబడి ఉండేవి. కమ్యూన్ వాటిని స్వాధీనం చేసుకొని థియర్స్‌కు నిధులు లేకుండా చేసి ఉండవచ్చు. అలాగే దేశ ఆర్థిక వ్యవస్థపై తన యాజమాన్యాన్ని స్థాపించి ఉండవచ్చు. కాని బ్లాంకిస్టు, ప్రోథనిస్టులిద్దరూ తమ సిద్ధాంతాల కారణంగా 'ఆస్తిహక్కులపై' అలాంటి దాడిని నిర్వహించలేకపోయారు. ఫలితంగా థియర్స్ సమర్థకులకు పరిస్థితులు బాగా కలిసివచ్చాయి. కమ్యూన్ కొంత క్రియాశీలంగా వ్యవహరించి ఉంటే అలాంటి పరిస్థితులు ఉత్పన్నమయ్యేవి కావు.

## బూర్జువా వర్గ ప్రతీకారం

థియర్స్ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని భారీ సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. నగర శివార్లలోని కోటల నుండి ఆ సైన్యం పారిస్‌ను పద్ధతి ప్రకారం బాంబులతో నాశనం చేసింది. వరుస పోరాటాల్లో కమ్యూన్ బలగాలను ఓడించింది. తర్వాత మే 21న నగరంలోనే చొచ్చుకుపోయింది. సునాయసమైన ఆక్రమణను థియర్స్ ఆశించి ఉంటే అతడు నిరాశకు గురికావడం తథ్యం. పారిస్ కార్మికులు వీధి, నివాస సముదాయం, నివాసం స్థాయిలో పోరాడారు. పారిస్‌లోని సంపన్నమైన పశ్చిమ ప్రాంతం నుండి నడిబొడ్డుకు, అక్కడి నుండి కమ్యూన్ కంచుకోట అయిన తూర్పు ప్రాంతానికి కార్మికులను తరమడానికి రిపబ్లికన్ సైన్యానికి వారం రోజులు పట్టింది. విట్‌సండే ఉదయాన్నే చెలరేగిన చివరి ప్రతిఘటనను అణచివేసింది.

కమ్యూన్ ఓటమి అనంతరం ఆధునిక కాలంలో ఎన్నడూ ఎరుగని విధంగా హింసాకాండ చెలరేగింది. "పారిస్ నైతిక రుగ్మతను పారదోలడానికి ఇంతకంటే మించిన అవకాశం లేదు. ఈ రుగ్మత నగరాన్ని 25 ఏళ్లపాటు పట్టి పీడించింది", అని బూర్జువా పత్రిక అయిన లే ఫిగారో గొప్పగా పేర్కొంది. ఈ అవకాశాన్ని వర్సెయిల్స్‌లో విజయవంతమైన కమాండర్లు అంది పుచ్చుకున్నారు.

కమ్యూన్ కోసం పోరాడిన ప్రతి వ్యక్తిని ఎక్కడ దొరికితే అక్కడే కాల్చి చంపారు. విట్‌సండే ఉదయం నుండే పిట్ మండే ఉదయం వరకు 1,900 వ్యక్తులు కాల్చి వేయబడ్డారు. (1793-94 మధ్య జరిగిన అణచివేతలో హతులైన ప్రజల సంఖ్య కంటే ఈ ఒక్కరోజు వ్యవధిలో కాల్చి వేయబడిన వ్యక్తుల సంఖ్య చాలా ఎక్కువ) సైనికులు వీధుల్లో గస్తీ తిరుగుతూ పేద ప్రజలను ఇష్టమొచ్చినట్లు, ఎప్పుడు పడితే అప్పుడు ఇళ్ల నుండి బయటికి లాగి చంపేవారు. ఎందుకంటే వారు కమ్యూన్స్ సమర్థకులుగా దర్శనమిచ్చేవారు. సైనికులపై సలసల కాగే నీటిని కుమ్మరించారన్న ఆరోపణపై 25 మంది మహిళలను కాల్చి చంపారని ఒక పురోహితుడు సాక్ష్యమందించాడు. లండన్‌కు చెందిన 'టైమ్స్' దినపత్రిక ఇలా వ్యాఖ్యానించింది :

> "ప్రతీకారానికి ఉన్న అమానవీయ చట్టాల కిందే వర్సెయిల్స్ సైనిక బలగాలు ప్రజలను కాల్చుతూ, నిర్బంధిస్తూ, ఖైదీలను చీల్చి చెండాడుతూ, మహిళలు, పిల్లలను కిరాతకంగా హింసిస్తూ కరాళనృత్యం చేశాయి. మాకు తెలిసినంత వరకు చరిత్రలో

ఇంతటి రాక్షస పర్వం ఎప్పుడూ సంభవించలేదు. వర్సెయిల్స్ సైన్యం సాగించిన ఊచకోతలు మన హృదయాలను కంపించివేస్తాయి."

ప్రస్తుత ఫ్రెంచి చరిత్రకారుల గణాంకాల ప్రకారం కమ్యూన్ పతనం అనంతరం జరిగిన హత్యల సంఖ్య 20,000 నుండి 30,000 వరకు ఉండగలదు. విచారణకు హాజరు పరిచే ముందు మరో 40,000 కమ్యూన్ సమర్ధకులను కారాగారాల్లో బంధించారు. వీరిలో 5,000 మందిని ఇతర దేశాలకు తరలించారు. మరో 5,000 మంది సాధారణ శిక్షలను అనుభవించారు. దేశ బహిష్కరణకు గురైన వారిలో మహిళాపోరాట వీరుల్లో ప్రముఖ నాయకురాలైన లూయిూ మిషెల్ కూడా ఉన్నారు. 'నన్ను నేను సమర్థించుకోను. నా పక్షాన ఎవరూ వాదించరు. నేను పూర్తిగా సామాజిక విప్లవానికి చెందుతాను. నన్ను సజీవంగా వదిలేస్తే ప్రతీకారం తీర్చుకోకుండా ఉండలేను," అని ఆమె న్యాయస్థానానికి చెప్పింది. అప్పటి సామాజిక దురభిప్రాయాల కారణంగా కమ్యూన్ మహిళలకు ఓటు హక్కును కల్పించలేకపోయింది. కాని శ్రామిక మహిళలు కమ్యూన్ అణచివేత తమ స్వంత అణచివేతగా భావించారు.

అణచివేత పారిస్ కార్మిక వర్గంపై ఘోరమైన ప్రభావం చూపింది. అలిస్టెయిర్ హోర్న్ పేర్కొన్నట్లు, "కొన్నేళ్లపాటు ఒక విచిత్రమైన పద్ధతిలో పారిస్ స్వరూపమే మారిపోయింది. సగానికిపైగా రంగులద్దే వారు, మేస్త్రీలు, పెంకులు పరిచేవారు, పాదరక్షలు తయారు చేసేవారు, లోహ కార్మికులు మాయమైపోయారు." ఫ్రెంచి కార్మికవర్గంలో కొత్తతరం ఆవిర్భవించడానికి సుమారు రెండు దశకాలు పట్టింది. రిపబ్లికన్ ప్రభుత్వం కమ్యూన్‌ను దారుణంగా అణచివేయడం వారికి బాగా గుర్తున్నా మరో ప్రపంచం కోసం పోరాడాలన్న గట్టి పట్టుదలను ప్రదర్శించారు.

అయినప్పటికీ కమ్యూన్‌పై మార్క్స్ తుది వ్యాఖ్య చేశాడు. క్యాపిటలిస్టు కొత్త ప్రపంచం అప్పటి వరకు ఎదుర్కోని పెద్ద సవాలుకు కమ్యూన్ ప్రాతినిధ్యం వహించిందని మార్క్స్ పరిగణించాడు. పెట్టుబడి సృష్టించిన కొత్త వర్గానికి (ఇది క్యాపిటలిస్టు వ్యవస్థకు వ్యతిరేకమైనది) కమ్యూన్ గొప్ప స్ఫూర్తిని అందించింది. "కమ్యూన్‌వాదులు స్వర్గాన్ని ముట్టడిస్తున్నారు" అని మార్క్స్ తన మిత్రుడు కుగెల్మన్‌కు లేఖ రాశాడు. "వారు ప్రపంచ వ్యాప్త ప్రాముఖ్యత కలిగిన కొత్త శకాన్ని (పథాన్ని) ఆవిష్కరించారు."

*****

ఇది రాజులు, రాజ్యాల చరిత్రకాదు. తేదీల కూర్పు అంతకన్నా కాదు. ఇది ప్రజల చరిత్ర. చారిత్రక క్రమంలో కీలకమైన సంఘటనలు, పరిణామాలు, వాటికి కారణాలు, వాటివెనక ఉన్న శక్తులు, వాటిలో పాలు పంచుకున్న ప్రజల పాత్ర గురించి స్థూలంగా వివరిస్తుంది ఈ పుస్తకం.

మానవ జాతి చరిత్రలో ఆదిమ సమాజం నుండి రోమన్ మహా సామ్రాజ్యం వరకు, మధ్య యుగాల నుండి పునర్వికాసం, పారిశ్రామిక విప్లవం, దాని తర్వాత బూర్జువా విప్లవాల వరకు, కార్మిక వర్గ పోరాల నుండి చరిత్రలో తొలి కార్మిక వర్గ విప్లవమైన పారిస్ కమ్యూన్ వరకు పరిణామ క్రమాన్ని ఈ పుస్తకం విశ్లేషిస్తుంది.

**క్రిస్ హార్మన్**

'సోషలిస్టు వర్కర్' పత్రిక సంపాదకులు,
తూర్పు ఐరోపాలో వర్గపోరాటాలు, మార్క్సిజం ఎలా పని చేస్తుంది?, కోల్పోయిన విప్లవం: జర్మనీ 1918-1923 తదితర గ్రంథాలు రచించారు.

రు. 175/-

ప్రజాశక్తి బుక్‌హౌస్



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA109B186 |
| పుస్తకం పేరు | ప్రపంచ ప్రజల చరిత్ర |
| తారీఖు | 11 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 439 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | cl, Bcl |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | S/c. Sharmila |
| పేజీలు విడదీసినది | sireesha |
| స్కాన్ చేసినది | Naveenda |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |